శ్రీరస్తు

# శ్రీకృష్ణధర్మవిజయము

(రైతులకు ఉపాధ్యాయులకు దేశాభిమానులకు వేదము)


గ్రంథకర్త

కర్షకమహర్షి శ్రీ ద్వారపు... అప్పలనాయుడు...

(శాంతికుటీరము ... తూరు.)






ప్రకాశకుడు

శ్రీ పెంట రామునాయుడు, పా...

(కవిరిపల్లి—సాలూరు ...)





ఇయ్యది

పాత్రుని రంగారావునాయుడుగారి

శ్రీ సత్యానంద ప్రెస్ నందు

ముద్రింపించి ప్రచురింపబడినది.

రాజమహేంద్రవరము.

౧౯౨౦.






శ్రీ పెంట రామునాయుడుగారు,

(చిన్నమిరాజువలస ప్రొప్రయిటరు).



శ్రీ పెంట పారన్ననాయుడుగారు,

(చిన్నమరాజువలస ప్రొప్రయిటరువారి సోదరులు.)

శ్రీ గురు బ్రహ్మణే నమః.

# ఏతద్గ్రంథ విమర్శ విషయ సూచిక.



ఉ. శ్రీరమణీ నివాసమయి, సేవ్య మహర్షి గణావతారయో
గ్యోరు పవిత్ర ధామమయి, యున్నత తత్త్వకళా విశిష్టమై,
సారతరాఽభిరూప విలసత్కృతి సంజన నాఽభిరామమై,
భారతవర్ష మెంతయును భాసిలు నీ భువి నగ్రగణ్యమై.

(శ్రీ కర్షక మహర్షి — శ్రీకృష్ణ ధర్మవిజయము - ప్రథమఖండము - ప్రథమభాగము.)

(సకల సస్యములకు, ఓషధులకు, వృక్షములకు, నవరత్నములకు జన్మభూమియనా పేరు బడసి, ప్రకృతిసంపదల నింపు కొల్పునది భారతవర్షము; భారతవర్షేతర సకలదేశము లజ్ఞానాంధకార దూషితంబులై యున్నకాలమున. నిర్మల జ్ఞాన విజ్ఞాన సూర్యప్రభాపుంజము భిక్షవెట్టి, యలరించిన మహర్షి పుంగవుల యవతార యోగ్యమైన పవిత్రధామము భారతవర్షము; పరమజ్ఞాని మొదలుకొని, పరమాజ్ఞాని వఱకుఁగల సమస్తప్రజలందును, కొంచెముగనో, గొప్పదిగనో జన్మధనమై, వ్యాప్తిఁ గాంచిన తత్త్వకళావిశిష్టమైనది భారతవర్షము; పరమాఽస్తికతాబంధురములు, నద్భుత నాగరికతాలక్షణవిశిష్టములు, నపారమేధాబలసూచకములు నగు నుద్గ్రంథములకు జన్మభూమి భారతవర్షము —)

భారతవర్షము మహర్షుల జన్మభూమియనియు, ఆస్తికత్వము, నాగరికత్వము సమస్తలోకమునకు భిక్షవెట్టిన మహిమారాశి యనియు, ప్రాచ్యపండితులే గాక, పలువురు పాశ్చాత్యపండితులు గూడ కొనియాడి యున్నారు; భారతీయమహర్షులు నిరాడంబర జీవులు,

స్వార్థము నెఱుగని పరమపుణ్యాత్ములు; అద్భుత తపఃపరిపూర్ణులు; వారి యాచారములు, సంప్రదాయములు శాశ్వతములు; భారతవర్ష మందుపుట్టిన ప్రతిమానిసిపురుషుని యీపవిత్రాదర్శమును జన్మధనముగా బడయనైనవాడే.

పాశ్చాత్య జ్ఞానులు, మతాచార్యులు, పండితులు, కవులు వలె, భారతీయ జ్ఞానులు, నాచార్యులు, పండితులు, కవులు స్వార్థపరులు, వంచకులు, నాడంబర జీవులు, ప్రకృతివ్యామోహబద్ధులు గారు; భారతీయ పరివ్రాజకస్వాము లెట్టి యాడంబరమును లేక, స్వార్థమును లెక్కింపక, తమ కడుపుమంటనుగూడ బాటింపక, గురుపరంపరాలబ్ధ మైన జ్ఞాన విజ్ఞానధనమును "ఉదారభావయుక్తానాం జగదేవ కుటుంబకమ్" అను నార్యోక్తి ప్రకారము ఉదార భావముతో వెద జల్లు నాచారము నేడునుగూడ బాటింప నగుట లోకవిదితము; పరివ్రాజక స్వాములను బరమదైవములుగా భావించు నాచారము గూడ, భారతదేశమున బరంపరాగత పరమ ధర్మము.

ఈ ధర్మము ననుసరించి, దీర్ఘకాలము సంతాన ప్రాప్తి లేక, సంసారమందు విరక్తి బొంది, నా తల్లిదండ్రులు సమస్తతీర్థములను సేవించుచు, శ్రీ జగన్నాథస్వామి సందర్శన సందర్భమున "శ్రీచిద్ఘనానందస్వాములవా" రను ఔత్తరేయ పరివ్రాజకస్వాములను సందర్శించి, శ్రీవారి యనుగ్రహమునకై, శ్రీవారి శుశ్రూషయందే మూడు దినము లుపవసించి, తమ కష్టసుఖములను నివేదించికొనిరి; శ్రీ స్వాముల వారు వాత్సల్యం దమోఘ వాత్సల్యమును జూపి, వారి సంసార విరక్తిని బాపి, నియమ సహితముగ మంత్రోపదేశము జేసి, సంతాన సిద్ధి యగు ననియు, బురుషసంతతియందు నాపేరు బాటింపవలయు ననియు, నాదే శించి వీడ్కొలిపిరి; శ్రీవారి యాజ్ఞను శిరసావహించికొని నాతల్లి

దండ్రు లత్యుత్సాహముతో దీర్ఘయాత్రను జాలించికొని, యిల్లుబట్టి, శ్రీవారి యానతిప్రకారము నడచుకొనుచుండిరి; కొలది కాలములో నా యక్కయు నేనును జన్మించితిమి; మా జన్మములకు శ్రీస్వాముల వారి ఉపదేశాదేశములు కారణములు కాకపోయినను, మాధ్వసంప్ర దాయములం దవి విశ్వాస పాత్రములై, యాస్తిక్యమును వారియందు బెంపొందించు ననుట యందు దప్పులేదు; ఆస్తిక్య మల్పమతులందు మాధ్వసంప్రదాయముల వలనను, మహామతులందు నిర్మల వివేకము వలనను గలిగి, యుభయ తారకమంత్ర మగుచున్నది; ఇది భారతీ యుల జన్మ ధనము.

శ్రీస్వాములవారి యాదేశము ననుసరించి నాతల్లిదండ్రులు నాకు "చిద్ఘనానందస్వామి" అను పేరును, నా యక్కకు "స్వామి దేవమ్మ" అను పేరును బెట్టి మిక్కిలి ప్రేమతో బెంచుచుండిరి; కాని నా అక్క తన మూడవయేటనే మృతిబొందినది; పిమ్మట నా నైదవ యేట బ్రదుకుచాలక గౌరిపురము (విశాఖపట్టణముజిల్లా) ను విడిచి, నా తల్లిదండ్రు లేదైన గుమస్తాగిరి చేసికొని జీవించుటకై, నన్ను దోడ్కొని సుమారు నలుబది యేండ్లక్రిందట రంగూను జేరికొనిరి; అచ్చట మమ్ము నొక ఆంధ్రగృహస్థు డాదరించెను; వారి ఆదరమున వారముదినములు మాకు సుఖముగ గడచినవి; ఎనిమిదవనాడు కలరా సోకి నాతల్లి మరణించెను; మా తండ్రి మతిచెడి, నన్ను జెంకబెట్టు కొని వెఱ్ఱివానివలె వీధులదిరుగ నారంభించెను; మా యవస్థను జూచి, బర్మా (బ్రాహ్మ) దేశమును జూడవచ్చిన పరమదయామయుండును, జ్ఞానవిజ్ఞాననిధియు, నాంధ్రగీర్వాణహూణభాషాపండితుండును, వివిధ శాస్త్రవిచారణాదక్షుండును అగు "శ్రీ వేంకటరంగస్వాము" లను ఆంధ్రపరివ్రాజకశ్రేష్ఠులు జాలిగొని, వచ్చి, మాతండ్రి నూరడించి,

ధైర్యముజెప్పి, మాకు భోజనముపెట్టించి, తోడ్కొని, ఓడఁజేరి, మాఘోడకూలికూడ తానే భరించి, స్వదేశమునకు ప్రయాణమా యెను; మార్గమధ్యమున ఓడలో గలరాసోకి మాతండ్రి కూడ మర ణించెను; దాని కాస్వాములవారు మిక్కిలి చింతించి, దిక్కుమాలిన నన్ను దనయొడిలో బెట్టికొని, యూరడించుచుఁ, గలకత్తారేవున నోడ దిగి, ఆ మహాపట్టణమున నా పోషణభారమంతయు వహించికొని, ఆరు నెలలుండి, అచ్చటనుండి నన్నుదోడ్కొని ప్రయాణముచేసి, యిరు వదిమూడేండ్లు భారతదేశమెల్లెడలను బర్యటనముచేసిరి; ఈ దీర్ఘపర్య టనములో నాకు తెలుగు సంస్కృతము ఇంగ్లీషువిద్యలు గఱపుచుండు టయు, వేళకు భోజనము పెట్టించుటయు, బలకలు పుస్తకములు, బట్టలు నిప్పించుటయు, దోడి పరివ్రాజకస్వాములకును, ప్రాతక్రొత్త శిష్యులకును బోధించుచుండుటయు నా మహాత్ములకు గార్యములగు చుండెను; నా బాల్యచాపల్యమును మన్నించియు, బోధించియు, ప్రేమజూపియు, దిట్టియు, గట్టడిచేసియు నీ దీర్ఘపర్యటనమున నాకు పారాంధ్రగీర్వాణాంగ్లములందు నించుకంత ప్రవేశము గలిగించిరి; తత్వశాస్త్ర ప్రకృతిశాస్త్ర విషయములనుగూర్చి సంగ్రహముగా నాకు బోధించుచుండిరి; కాని అల్పమతినగు నాకవి దుర్గ్రాహ్యములై యుండెను. మతగ్రంథధర్మములను గూడ నుపదేశించుచుండిరి: కాని అవియు నాకు తలవట్టినవికావు; శ్రీ స్వాములవారు బహుభాషాపండి తులైనను "క॥ పోల శరీరోత్పత్తికి । మూలము జనయిత్రి లోకమునఁ బ్రజలకు ౯ను । ద్వేలజ్ఞానోత్పత్తికి । మూలము భాషాస్వరూపము బహువిధములన్" (శ్రీ కోర్షకమహర్షి) అను పద్యమునందలి పర మార్థమును దన విశాలబుద్ధికిన్ బట్టించికొని ఆంధ్రభాషయందే యెక్కువ అభిమానము జూపుచు, నన్నును మాతృభాషయగు నాంధ్ర మందే మిక్కిలి గౌరవమునూపఁ బ్రోత్సహించుచుండిరి; వారి యాంధ్రభాషాపాండిత్య మపారము; ఆ మహానుభావులు చదువని,

సారము గ్రహింపని ఆంధ్ర గ్రంథము లేదనుట యతిశయోక్తి కాదు; శ్రీవారి పోషణ, బోధన పాలనములకు నోఁచికొన్న నా, కామహాపండితుల కాలిజాడబట్టి పోవుట సుకరమే కాని ఆ భాగ్యమబ్బుటలేదు.

ఇట్లా మహాత్ములు నాకంతకు దానైై పర్యటనము సేయుచుఁదన ఎబ్బది రెండవయేట బదరీనారాయణమునకు బోవు మార్గమధ్యమున, నిరాయాసముగాఁ దనువు విడిచి, పరమపద మలంకరింప బోయెను; శ్రీ స్వాములవారు పరమపద మలంకరించిన పిదప, శ్రీవారు నాకు జూపించిన మార్గమున్ బట్టి, కొందఱు సాధుపుంగవుల మైత్రి సంపాదించికొని, బదరీనారాయణమునకుఁ బోవుట మాని, మిత్రులగు నా సాధు పుంగవుల జట్టున్ గూడి, సింధు సౌవీర కాశ్మీర, కామరూప (అస్సాముపరగణాలు) బ్రహ్మ (బర్మా) దేశములందు బర్యటనము జేయుచుఁ గొంతకాలంబును, బంగాళ దేశమందు గొంత కాలంబును బుచ్చితిని; పిమ్మట "జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అను నట్లు నా జన్మభూమి యగు నాంధ్రమండలమును, నా పరమ సోదరులగు నాంధ్రమహాశయులను, దర్శింపను, నా సోదరులలో సుప్రసిద్ధు లగు మహాపురుషుల చరిత్రముల వ్రాసికొని ఆంధ్రులనిన "మొఱకు మానిసు" లనియు, నాంధ్ర భాష యన్న "పనికి మాలిన మోటుబాస" యనియు భావించు నౌత్తరేయ సోదరులకు (ముఖ్యముగా బంగాళ ప్రజలకు) నివేదించుకొనను వాంఛపుట్టి, అది యనిర్వార్య మగుడు, బయలు దేరి, ఆముదాలవలస రైలుస్టేషనులో దిగి, శ్రీకాకుళము, పాలకొండ, పార్వతీపురము, బొబ్బిలి తాలూకాల సోదరుల దర్శించుచు, సాలూరు జేరికొంటిని; ఆ పౌరుల వలన జయపురము, నవరంగపురము, మొదలగు ఏజన్సీ ప్రాంతములు ప్రకృతిమనోహరంబులని చెప్ప విని, ఆ ప్రదేశముల జూడన్ గోరి, బస్సు దొద్దకు, వచ్చితిని; ఆ బస్సులగూడెమునకు జేరువ నొక యువకుఁడు చుట్టును

బ్బలువురు ప్రజలు జేరియుండ “ సీ॥ అతులవిభూతి “ యోగాచార్య ” డన నార్యగణ్యుడై మనిన—జగద్గురుండు, । పలువురురాజుల బరిమార్చియును వారి రాజ్యముల్ గొనని—పరమ విరాగి, । వ్యాస భట్టారకునంతవాఁ “డిత డాదిముని” యని చెప్పనొప్పిన—ఘనుండు, । ధర్మసంస్థాపనార్థము జీవితంబెల్ల ధార వోసిన—యవతారమూర్తి, । శాంతుఁడు, దయామయుండు, విశాలబుద్ధి । శాలి, సర్వార్థవేది కృష్ణ భగవానుఁ, । డెట్లు వర్ణింపఁ బడియెనో యెవ్వ రెఱుఁగ ? । రెన్ని నేమిఁట్టి కా గాథఁ గొన్ని కృతుల ? ”—అను లోకోత్తరపద్య రత్నమును దన మృదుమధురగంభీరస్వరంబుతో జదివి వినిపించు చుండెను ; ఆపద్యమును నోరారఁ జదివి వినిపించుచున్న ఆ యువకుని యొక్కయు, విను చున్న యా ప్రజల యొక్కయు, నానందమును, ఏదో యొక ఆకర్షణ శక్తికి లోనైన చిత్తవృత్తులును, గమనించునంత యవకాశము నాకప్పుడు లేదాయెను ; పౌత్త్రేయులు (ముఖ్యముగా బంగాళప్రజలు) నా తెలుంగుదల్లిన్ గూర్చియు, నా తెలుంగు సోదరులన్ గూర్చియు కలిగియున్న నిర్లక్ష్యభావమును మనసార గ్రహింపగలిగి, వాదమునకు జాలక గోడెత్తి, సంతాపించుచు, బహువిధంబుల జలించుచు, నిరాశ కగుచున్న నా శుష్కహృదయంబున కా యువకుని మృదుమధురకంఠ స్వరంబుతో మేళవించి, కర్ణనాళంబుల ద్వారంబున లోనికిఁ బ్రవేశించిన యా పద్యరాజము యొక్క సూక్ష్మాకార మమృతంబు జిల్కి, సంతాపాగ్నిని జల్లార్చి, దాని స్థానంబున నానందరసము నించి, పాదు గట్టి, యందుఁ బ్రశాంతి జీవౌషధీ లతను బుట్టించి, పెంపుఁ జేసి, యుత్తేజంబు గల్పించినది ; తత్ప్రభావంబున స ద్యోహృష్టపుష్టంబులగు నా శరీరంబునందలి సకలావయంబులు నూతనప్రభాపటలభాసమానంబు లైనవి ; అట్లు భాసమానంబులైన యంగకంబుల సౌష్ఠవంబున కుబ్బుచు, నా యుబ్బున నుచితానుచితంబులను విస్మరించి, యా యువకుని ప్రఁ బడి కౌగలించికొంటిని ; నా కౌఁగిలికి రోయక, గంభీరహృదయుం డగు

నా యువకుఁడు, మెల్లన వీపుఁ దట్టి, ప్రబోధంబు గల్పించి, యిది యేమని ప్రశ్నించెను; దాని కాక్షణమందే సదుత్తరం బీయ జాలక? వెడవెడ నేమో పల్కి, ఆ పద్యరాజమునే మరల మరల జదువ బ్రార్థించితిని; దాని కా బుద్ధిమంతుఁడు విసివి కొనక, మూఁడు మారులు చదివి, యింతకన్నను మేటి పద్యములు కలవు, వినియెదేని వినుమని " సీ॥ అఖిలజగద్విస్మయావహ దివ్యప్రభావ గంభీరుఁడై పరగు—వేల్పు, । సకలరాజన్యదౌర్జన్య నివారణో పాయజ్ఞుఁడై పొల్చు—ప్రభువరేణ్యుఁ, । డురు ధర్మసంస్థాపనోద్యమోజ్జృంభితశక్తిసాగరుఁడై, యెసంగు-ఘనుఁడు, । నిఖిల మహర్షి మానిత పరతత్త్వవిద్యాసారసర్వవేత్తయగు—ప్రాజ్ఞుఁ, । డట్టు లయ్యార్వారలయందుఁ దాను । నొక్కఁడై, యెల్ల ధర్మంబు లొకఁడు, నొకఁడు । నేర్చి, చర్చించి, బోధించి, యింపు పుట్టఁ । బలికి, పదపడి సెజ్జపైఁ బవ్వళించె "......అను పద్యమును జదివెను; ఆ పద్యరాజంబును నాకుఁ దొంటి స్థితినే కల్పించెను; పిమ్మట యిట్టి వింకను బెక్కు పద్యములు కలవని, ఈ నడుమనే రాజమహేంద్రవరములోని శ్రీసత్యానందప్రెస్సులో ముద్రింపఁబడినట్టియు, నచ్చుతప్పులు సరిజూడ నా ప్రెస్సు వారిచేఁ దమకంప బడినట్టియు, "శ్రీకృష్ణ ధర్మవిజయము, ప్రథమఖండము—ద్వితీయభాగము " అను సుమారైదువందలపుటలను మించిన యుద్గ్రంథము నా చేతికందిచ్చెను; దాని నందుకొని బిరబిర రెండుమూఁడు పుటలవఱకుఁ జదివి, సంతోషపారవశ్యంబున నుచితానుచితంబు లరయక, సంచిలోని పదిరూకల నోటు దీసి, ఆ యువకుని చేతిలోఁ బెట్టి, యీ గ్రంథము నా కిప్పింపుడని వేడికొంటిని; దాని కా బుద్ధిశాలి, తద్గ్రంథ ముద్రణాదులను దేట పఱచి, అవకాశమగుచో నాతోఁ మాయింటికి వచ్చి, పది దినంబు లుండి, యీ గ్రంథంబును, దీనికి సంబంధించిన ప్రథమభాగ గ్రంథము (అముద్రితప్రతి) ను జదివికొనుఁ, డని చెప్పుటయు, బేదకుఁ బెన్నిధి దొరకిన ట్లుబ్బి, యాతనితోఁ బ్రయాణంబు జేసి, ఆ సాలూరునకు బది

మైళ్ల దూరమున గల "కవిరిపల్లి" యను శ్రీ వారి గ్రామమును వారితోఁగూడ జేరికొంటిని; వారును, వారి కుటుంబము వారందఱును, నన్నత్యాదరంబుతోఁ బల్కరించుచు, నా కొక్కపూటకు వలయు శాకాహారమును బ్రతిదినము వేళకు నిప్పించుచు, దమ పరిచయభాగ్యమును గలిగించుచు, బ్రశాంతిమై నీ గ్రంథరాజమును, దీనికి సంబంధించిన ప్రథమభాగ గ్రంథము (అముద్రిత ప్రతి) ను జదువనిచ్చి, యానందంబున నోలలాడఁ జేసిరి.

నన్నట్లు పరమానందంబునఁ దేల్చిన యా పరమకుటుంబమువారి యెడలఁ గృతజ్ఞుఁడను; ఆ కుటుంబమునందలి యొకవ్యక్తియే "ఉ॥ నా యెద కింపువుట్ట మును నన్నయభట్టునకున్ ఘనుండు నా। రాయణ భట్టునున్ బలె నిరంతర మీకృతికెల్లభంగులన్। సాయముసేయుచుండెఁ దనశక్తికిఁ బోలినభంగిఁ బెంట నా। రాయణమూర్తినాయుఁ డఖిలార్థవిదుండు నయం బెలర్పఁగన్" అని శ్రీ కర్షకమహర్షి గారిచేఁ బ్రశంసింపఁబడిన ధన్యుఁడు; ఈతఁడే పైన వ్రాసినట్లు సాలూరులోఁ బద్యములుజదివి, యలరించి, నన్నుఁ దనయింటికి దోడ్కొనివచ్చి, తన కుటుంబమువారి పరిచయంబు గల్గించి, పదిదినంబు లాదరించిన విద్యాప్రియుఁడు; ఈ గ్రంథమందుఁ జేర్పబడిన ఫొటోలు (పటములు) గల పుణ్యాత్ములే వీరి పితృదేవులు; "శ్లో॥ కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః। సుకృతే దుష్కృతే చైవ చత్వార స్సమభాగినః" అను నాప్తోక్తి ప్రకారము సకలమానవకోటి శ్రేయోఽన్వేషణతత్పరులగు శ్రీ కర్షకమహర్షిగారి దివ్యగ్రంథములఁ బ్రకటింపను, వారింక నేయఁదలంపుజేసిన సత్కార్యములకు దోడ్పడను, గృతనిశ్చయులై యున్న వీరి పరిచయము పాఠకమహాశయులకు గలిగించు టత్యావశ్యకము; కావున నట్లు చేసెదను.

ఈ గ్రంథ ప్రకటనకర్తలగు శ్రీ రామునాయుడుగారును శ్రీ పారన్ననాయుడుగారును సోదరులు; ఈ యిరువుర్లిలో పెద్దవారగు శ్రీ రామునాయుడుగారు మహోదారభావపూరితులు, ప్రేమార్ద్రహృదయులు, స్వాతంత్ర్యప్రియులు; వీరు బాల్యమునుండియు పెక్కు సత్కార్యము లొనరించియు, సత్కార్యము లొనరించువారికి, దోడ్పడియు ప్రసిద్ధిగన్న మేటినాయుడుగారు; గ్రామమున్నసబీహోదాకు (గ్రామాధ్యక్షపదవికి) సంబంధించిన యీనాంభూములు గ్రామమున్నసబులకే చెందవలయునను మొదలగు వివరణములతో మద్రాసు ప్రభుత్వముహారు సుమారు ముప్పది సంవత్సరముల క్రిందట ప్రకటించిన చట్టము ప్రకారము తన గ్రామ మున్నసబీహోదాకు (గ్రామాధ్యక్షపదవికి) సంబంధించినట్టియు, నేటేట సుమారు మూడు నాలుగువందలాదాయము నీయజాలినట్టియు, మంచి యీనాంభూఖండము నాశింపకయు, బంధుమిత్రవర్గముల సలహాను పాటింపకయు, నీతి జూపిన మహోదారశీలి, సుమా రిరువది యైదేండ్ల క్రిందట తన గ్రామమునకు జేరువనున్న మక్కువ గ్రామమందొక బ్రాహ్మణోత్తముడు గావించిన యజ్ఞమునకు సుమారు వేయిరూపాయిల వెలసేయు బియ్యమును, సాలూరులో సుమారు ముప్పదియేండ్ల క్రిందట జరుపబడిన యజ్ఞమునకు నూటయేబదిరూకల విలువసేయు బియ్యమును, వీరు సమర్పించిరి; మరియు నాలుగైదు బ్రాహ్మణవివాహకార్యములకును, పదిపండ్రెండు స్వకులమువారి వివాహకార్యములకును పెక్కుపుట్ల బియ్యమును, రూకలను కోకలను, కలపను విరాళము చేసిరి; మక్కువగ్రామములో డిస్ట్రిక్టుబోర్డువారు గట్టించిన ఆసుపత్రికి నూరురూపాయలను, సాలూరులోని సంగీతసభానిర్మాణమున కేబదిరూకలును, దేశసేవికయగు శ్రీమతి వేదాంతం కమలాదేవిగారి కాంగ్రెస్సుప్రచారమునకు రూ ౫౦-౦-౦ లును, శ్రీ గాంధీమహాత్మునికి విజయనగరములో రూ ౧౧౬-౦-౦ లును శ్రీ జవహరిలాల్‌గారికి సాలూరులో

రూ ౫౮-౦-౦ లును సమర్పించిరి ; గత దుర్ముఖి హేవళంబి కఱవుసంవత్సరములలో సుమారు పదియేనువందల రూపాయల విలువగల బియ్యము జొన్నలు మొదలగు సరుకులను బీదలకు దానముచేసిరి ; ఇంక నిట్టి సత్కార్యము లెన్నని జేసియున్నారు ; పైతృకములగు స్వల్పపు బొలములు పశువులు మొదలగు ఆస్తులనుండియే సోదరులగు జగ్గునాయుడు, లచ్చన్ననాయుడు (వీరిద్దరు చనిపోయిరి) పారన్ననాయుడుగార్ల అపారకృషి పరిశ్రమమువలనను, వీరి స్వకీయవ్యవహారదక్షతవల్లనను, వృద్ధికివచ్చి, వీ రిప్పుడు సుమారు నాలుగువేల ఆదాయమునకువచ్చు భూస్వాములైరి ; వెంకిసియు శ్రీ ఆకుండి కామశాస్త్రిగారను నొక విద్వద్వర్యుని దమ గ్రామమునకు రప్పించికొని, వారి కాశ్రయము గల్పించి, వీరి కుటుంబముయొక్కయు, బంధుమిత్రుల కుటుంబములయొక్కయు, ప్రాంతీయ గ్రామీణ కర్షకమహాజనులయొక్కయు బిడ్డలకు నాంధ్రగీర్వాణవిద్య లలవడునట్లు చేసిరి ; వీరి గ్రామమగు కవిరిపల్లియు, ప్రాంతపు గ్రామములును పూర్వము ఏజెన్సీ గ్రామములై అనాకరితలో నుండెడివి ; ఇప్పు డవియన్నియు నాగరికతకు వచ్చినవి ; ఏ తద్గ్రంథకర్తలగు శ్రీ కర్షకమహర్షిగారిమొదల వీరి హితవిశ్వాసము లపారములు ; శ్రీవారు స్థాపింపనున్న కృషికళాశ్రమమునకు, రెండువందలకుమించిన ఆదాయమువచ్చు భూములను సమర్పింపను, శ్రీవారి దివ్యగ్రంథములను బ్రకటింపను, ఇంకను బెక్కువిధముల శ్రీవారి లోకసేవామహోద్యమమునకు దోడ్పడను గృతనిశ్చయులై, వీరు తన జన్మమును సార్థకముజేసికొనన జూచుచున్నారు.

## —♦ శ్రీ పారన్ననాయుడుగారు ♦—

వీరు తన అన్నగారగు శ్రీరామునాయుడుగారిమొదల నిరంతరము భక్తిప్రేమలు జూపుచుండు బుద్ధిమంతులు ; శ్రీరామునకు లక్ష్మణస్వామియునేబోలె వీరు శ్రీరామునాయుడుగారికి నెల్లకార్యము

లందును దీక్షతో దోడ్పడుచుండు కార్యశూరులు ; ఈ సోదరుల సమిష్టికుటుంబమున కిప్పుడు జెందియున్నట్టియు, సుమారు నాలుగువేల రూకల ఆదాయము రాదగినంత వృద్ధికివచ్చినట్టియు, భూధనమున కీతని యపారకృషిపరిశ్రమమే కారణమనుట 'అసత్యముకాదు ; వీరి కృషి కళాపాండిత్యము శ్రీ కర్షకమహర్షి వంటి పరమప్రాజ్ఞులుగూడ మెచ్చ దగినది ; "కర్షక సవ్యసాచి" యనియు, "మేటికా" పనియు జేర్కొనుటకు వీరెంతయేని దగియున్నారు ; సుమారిరువదియేండ్ల క్రిం దట నాలుగు గజముల చుట్టుకొలతకువచ్చు పెద్ద వేపవృక్షమును, మూడు నాలుగు గంటల స్వల్పకాలములోనను, సుమారు ముప్పది యేండ్ల క్రిందట నైదుగజముల చుట్టుకొలతకువచ్చు గొప్ప యిప్ప వృక్షము నొక్క పూటలోనను, వీరొక్కరే గొడ్డలితో నఱికివైచిరఁట; ఇది వీరి దేహదార్ఢ్యమునకును, కృషికళాచాతుర్యమునకును, బొరా ణము ; శ్రీ కర్షకమహర్షిగారి గ్రంథమందు జేర్కొన్న నారాయణుఁ డను కాపురాజునకు వీ రెల్లవిధముల సరిబోల్పఁ దగియున్నవారు ; ఆ నారాయణునివలెనే వీరును గచ్చితముగా మాటలాడు స్వభావము గలవారు ; స్వాతంత్ర్యప్రియులు ; నిరాడంబరజీవులు ; వీరి నిరాడంబ రత్వమున కీ గ్రంథమందుఁ జేర్పఁబడిన వీరి ఫోటో (పటము) తార్కా ణము ; వీరును శ్రీ కర్షకమహర్షిగారియెడల నిర్వ్యాజభక్తివిశ్వాసముల నెఱపుచుండువారు ; విద్యాప్రియులును.

## — శ్రీ నారాయణమూర్తినాయుడుగారు —

వీరు శ్రీ కర్షక మహర్షిగారిచే " ఉ॥ నాయెద కింపుపుట్టమును నన్నయభట్టునకున్ ఘనుండు నా । రాయణభట్టునున్ బలె నిరంతర మీకృతి కెల్లభఁగులన్ । సాయముఁ జేయుచుండెఁ దన శక్తికిఁ బోలిన భంగిఁ జెంట నా । రాయణమూర్తినాయుఁ డఖిలార్థవిదుండు నయం

బెలర్వఁగర్” అని ప్రశంసింపబడిన ధన్యులని పైని వ్రాసియున్నాఁడను; ఆంధ్రగీర్వాణములందును సంగీతమందును మంచి ప్రవేశము గల బుద్ధిమంతులు; వివిధవ్యవహారదక్షులు; కవిత్వముగూడ జెప్పగలరు; నిగర్వులు; సత్సాంగత్యమందు వీరికి అమోఘమగునభిలాష కలదు; శ్రీకర్షకమహర్షిగారి మహోద్యమమందుఁ బాల్గొని, తన సర్వశక్తులను లోకసేవకై సమర్పింప సంకల్పించికొన్న కార్యశూరులు; వీరు శ్రీ రామునాయుడుగారికిని, శ్రీ పారన్ననాయుడుగారికిని సోదరులగు లచ్చన్ననాయుడుగారికి పుత్రులు; జగ్గునాయుడుగారికి దత్త పుత్రులు; లచ్చన్ననాయుడుగారును జగ్గునాయుడుగారును వీరి బాల్యమందే కీర్తిశేషులగుట శ్రీ రామునాయుడుగారును శ్రీ పారన్ననాయుడుగారును వీరిని పుత్ర నిర్విశేషముగ బెంచి, పెద్ద జేయుటవలన వీ రా యిర్వురు సోదరులను పితృదేవులుగ భావించి భక్తి సేయుచుందురు; వీరీ గ్రంథరాజము నాంధ్రదేశ మెల్లెడలను బ్రవ్యాప్తికి దెచ్చు ప్రయత్నములో నున్నారు; కావున "గ్రంథప్రచారకుని విన్నపము" అను నొక విషయ మీ గ్రంథమందుఁ జేర్చి ముద్రింపించిరి; ఇట్లు సకల మానవకోటిశ్రేయః ప్రాప్తికినై, తన అపార జ్ఞాన విజ్ఞాన మండిత సాహిత్య సంపద నర్పింప, నిరాడంబరముగ దపంబు సేయుచున్న శ్రీకర్షకమహర్షిగారి లోకసేవా మహోద్యమ మందుఁ బాల్గొను పవిత్రభావముతో నున్న శ్రీ రామునాయుడు శ్రీ పారన్ననాయుడు శ్రీ నారాయణమూర్తినాయుడు గార్లు అను మూడు మూర్తులే గాక వీరి కుటుంబమందలి తక్కినవారును బ్రశంసింప దగియున్నారు; అందు శ్రీ పారన్ననాయుడుగారి పుత్రులు సంజీవినాయుడుగారును, శ్రీనారాయణమూర్తినాయుడుగారి సోదరులు శ్రీ అప్పలనాయుడు, సీతన్ననాయుడు, జగన్నాథనాయుడు, బలరామునాయుడు, కృష్ణమూర్తినాయుడు గార్లును, శ్రీ రామునాయుడుగారి మనుమలు శ్రీ రాములునాయుడుగారును విద్యావినయసంపన్నులు, తక్కినవారు బాలకులు; ఈ గ్రంథమందలి

నారాయణుఁడను కాపుచరిత్రములోని "క॥ తెలివియును, దానికిఁ దగు । బలగంబును, దానికి బహుళభంగులఁ దగు "మే । ల్పొలమును, దానికిఁ దగు గో । కులము, నితని కిట్లగుట మేలు ! బళే !" పద్యమును ఈ కుటుంబమునకు బెద్ద యగు శ్రీరామునాయుడుగారిని తన స్మృతిపథమం దుంచికొనియే శ్రీకర్షక మహర్షిగారు రచించి రేమో యనునట్లు తోఁచుచున్నది ; ఈ కుటుంబము వారింకను శ్రీ కర్షక మహర్షిగారి మహోపదేశమునకు నోఁచికొనుచు, లోకమం దెల్లెడలకుఁ బోలె దమ కుటుంబమందును సోకిన నవనాగరికతాపిశాచావేశము వలన నించుకించుక పుట్టి, రేకెత్తుచున్న లోపములను బాపికొని, "ధన్యులగుదురుగాక" యని యాశించుచు నీ విషయ మిమ్మాత్రన విరమించి, ప్రస్తుతాంశమునకు వచ్చెదను.

నా యాంధ్రదేశ యాత్ర యందు బది దినంబు లీకుటుంబము వారి ఆతిథ్యభాగ్యమున సుఖముగ బుచ్చితినని పైని వ్రాసికొని యున్నాఁడను ; నే నచ్చట నున్నకాలమందే "ఉపోద్ఘాతము" ను వ్రాయించి, పంపించుడని శ్రీకర్షకమహర్షిగారికి వ్రాసి వ్రాసి, ప్రత్యుత్తరమును బడయక శ్రీసత్యానంద ప్రెస్సువారు గ్రంథ ప్రకటన కర్తలగు వీరికా విషయమును వ్రాసి లేఖ నంపించిరి ; ప్రెస్సువారి లేఖను గమనించి శ్రీనారాయణమూర్తి నాయుడుగారును, దర్శించియు, విన నోఁచికొనియు ధన్యతనొంద నేనును శ్రీకర్షక మహర్షిగారి సన్నిధికై కొత్తూరు పోయితిమి.

మేము పోవు నప్పటికి శ్రీవారు రోగగ్రస్తులై, శాంతి కుటీరమందు పడకకుర్చీపై బరుండి యుండియు, మమ్మెల్లంత దూరంబున జూచి, యత్యాదరంబుతో బల్కరించి, కూర్చుండ బలికి, తమ వ్యాధి పీడను విస్మరించినట్లు సంభాషించి, సహజప్రేమామృతమును మాపై వెదజల్లిరి ; ఆ పయిని నమయము వేచి ప్రెస్సువారి పని యాగిపోవుట

నివేదించితిమి ; దానికి మంచిదని మ మ్మిరువురను వ్రాయ నియమించి, అప్పుడే తన యుపోద్ఘాతమును సంగ్రహముగ నొక గంట సేపు చెప్పి, ముగించిరి ; శ్రీవారి యుపోద్ఘాత మెల్లవారును గమనింప దగినది ; ఆ మీాద శ్రీవారి ఆతిధ్యమున నాలుగు దినములు బుచ్చితిమి ; ఆ నాల్గు దినములందును శ్రీవారి వలన పెక్కు విషయములు విన నోచికొనియు, శ్రీవారి పవిత్రచరిత్రము గొంత వఱ కెఱుంగ గల్గియు నేను ధన్యుడ నైతిని ; ప్రెస్సువారికి పని నందించు వేగపాటున శ్రీవారి సన్నిధి పెక్కు దినంబులుండ వలను పడక, ఐదవదినమున సెలవు గొను నప్పుడు నేను మీా యెడలను, మీా దివ్యగ్రంథము నెడలను నా స్వల్పబుద్ధికి దోచిన కొన్ని విషయములను వ్రాసి గ్రంథమందుఁ జేర్ప ననుజ్ఞయిండని వేడి కొంటిని ; దానికిఁ శ్రీవారు మీారు వ్రాయన్ దగు విశేషము నాయందును, నా గ్రంథమందును లేదనియు, నాయందు మీా కయిన ప్రేమ వలన నేమేని వ్రాయ సంకల్పించితి రనియు, మీా ప్రేమకు నేను కృతజ్ఞుఁడ నననియు, బల్కి, మాటల కన్న వ్రాతలం దెక్కువ బాధ్యత కలదనియు, నా బాధ్యతకు సత్యమును నిష్పాక్షిక దృష్టియు నత్యావశ్యకము లనియు, వానిని పాటింపని వ్రాతల వలన నేమియు బ్రయోజనము గల్గ దనియుఁ, బ్రేమావేశము కొన్ని సమయములందు గ్రుడ్డితనమునకు నీడ్చికొని పోవుననియు, దానికిఁ బాలయినవాడును వాని వ్రాతలును నెందులకు బనికి రావనియు, బోధించి, మఱి మీా కిష్టం బగునేని యేమేని వ్రాయుం డని యానతిచ్చి వీడ్కొలిపిరి ; శ్రీవారి గ్రంథమున నేమేని వ్రాయ ననుజ్ఞ బడసితినే యని నేనును, శ్రీవారి యుపోద్ఘాతమును ప్రెస్సువారికి నంపించనాయెనే యని శ్రీనారాయణమూర్తి నాయుడు గారును బరమోత్సాహముతో శ్రీవారి యాజ్ఞ గొని, ప్రయాణము చేసి, రాజమహేంద్రవరమున్ బ్రవేశించి, ఉదారభావ సంపన్నులగు శ్రీ సత్యానంద ప్రెస్సు ప్రొప్రయిటరు గారిని గానన్ జని,

వారి యాదరంబు బడసి, శ్రీకర్షకమహర్షిగారి యుపోద్ఘాతమును వారి కందించి, వారి యాతిథ్యమున గొన్ని దినములు బుచ్చితిమి; ఈ దినములలోనే శ్రీ నారాయణమూర్తి నాయుడుగారు "గ్రంథ ప్రచారకుని విన్నపము" అను విషయమును నేనీ "ఏతద్గ్రంథ విమర్శ విషయసూచిక" యను విషయమును వ్రాసి ఈ గ్రంథ మందుఁ జేర్చితిమి.

ఏ నెన్ని దేశములు దిరుగుచున్నను, నా జీవిత మేక్షేత్రమందేని, లేక, నే యాశ్రమ మందేని గడప బడుచున్నను నే నొక యాంధ్ర కీటకము నగుటను, నా శరీరమం దాంధ్రరక్తమే ప్రవహించుచున్న కారణముననను, ఆంధ్ర వాఙ్మయ ప్రపంచమం దున్నతస్థానము బడయ దగినట్టియు, నాంధ్ర భారతి కమూల్యాలంకార మైనట్టియు, సకలమా నవకోటి యుజ్జీవనావలంబన యోగ్య మైనట్టియు, సకలభాషాసారస్వత మున కాదర్శప్రాయ మైనట్టియు నీ గ్రంథరాజమందును, ఏతద్గ్రంథకర్త లగు శ్రీకర్షక మహర్షిగారి యెడలను నాకు గల భక్తివిశ్వాసములను బ్రకటించికొని కృతజ్ఞత నెఱపికొనుటకును, శ్రీ కర్షక మహర్షిగారు తమ సహజ వినయోక్తులతో "నీ కృతి లోకమున కేమేని నుపకరించు నేని సారస్వత ప్రపంచమున దీనికి జోటిండనియు, నుపకరింపదేని యాక్షణ మందే తొలగింపు" డనియు బ్రత్యాంధ్ర వ్యక్తికిని దీని యందు సంపూర్ణాధికార మిచ్చుటన్ జేసి, పండితులు దీనిన్ విమర్శించి తమ తమ సదభిప్రాయము లీయ నుందురు గావున వారి సద్విమర్శన మ్మున కించుక సౌకర్యము గల్పించి, నా యుదుతభక్తి జూపించికొన్నుట కును నీ "ఏతద్గ్రంథ విమర్శవిషయ సూచిక" ను వ్రాసితిని; కాని నా స్వోత్కర్షతను బ్రకటించి కొనుటకు గాదు; మఱియు శ్రీకర్షక మహర్షిగారిని, శ్రీవారి మహోద్యమమందు బాల్గొను గ్రంథప్రకటన కర్తలను విస్మృతించి వారివలన నే మేని మేలు బడయుటకు గాదు; సర్వజ్ఞు

లగు పండితవర్యులకుఁ ద్రోవలు జూపను గాదు ; నా కట్టి శక్తియును లేదు ; కావున నీ మహోద్గ్రంథ విమర్శనమందు నా యీ " ఏతద్గ్రంథ విమర్శనసూచిక " వలన నేమేని మేలగునేని దీనిని బాటించియు, మేలు గాదేని విడిచియు బండితు లీగ్రంథమును విమర్శించి, తమ సద్భావమును లోకమునకుఁ బ్రకటింప బ్రార్థితులు.

శ్రీ కృష్ణమూర్తిశాస్త్రులుగారీ గ్రంథమును, దీనికి సంబంధించిన ప్రథమభాగ గ్రంథమును, మిక్కిలి పరిశ్రమను జేసి విమర్శించి, సుమా రరువది డెబ్బది పుటలకు మించు పెద్ద పీఠికను వ్రాసి యున్నారు. ఆ పీఠిక యీ గ్రంథమందు జేర్పబడినయెడల బాఠకులకును, విమర్శకులకును నీ మహాగ్రంథ పఠన విమర్శనములం దెంతయేని సహాకారి యయ్యెడిది ; కాని తన్ను గూర్చి యతిశయోక్తు లా పీఠికయందు వ్రాయబడి యున్నవనియు, గ్రంథము లోకవ్యాప్తి నందకపూర్వమే పీఠికను వ్రాయించి, యా పీఠికను జేర్చి, గ్రంథము ముద్రింపించుట సాహసము, ననుచితమగు కర్మమనియు, గ్రంథము లోకవ్యాప్తినందిన పిమ్మట బండితు లిచ్చిన యమూల్యాభిప్రాయములు, విమర్శనములు సరి జూచి, వాని తోడన్ గూర్చి యవసరమగునేని దీనిని బ్రకటింప వచ్చుననియు, శ్రీకర్షకమహర్షిగారు చెప్పుట వలన నది యిందు జేర్పబడలేదు ; కావున నే నీ " ఏతద్గ్రంథ విమర్శ విషయ సూచిక " ను వ్రాసి, యాంధ్రలోకమునకు సమర్పించికొన సాహసించితిని ; అపారోపజ్ఞా శోభితులగు శ్రీకర్షకమహర్షిగారు నా యీ వ్రాతలందు యథార్థము ననుసంధించి యెంతయేని వ్రాయనై యున్నారు ; కాని శ్రీవారి పరోక్షమం దిది వ్రాయబడుట వలనను, శ్రీవారు తమ్మున్ గూర్చి మిక్కిలి వ్రాయ నిష్టపడువారు కాకుండుట వలనను, శ్రీవారిని గూర్చియు శ్రీవారి గ్రంథముల మహత్త్వమును గూర్చియు నా తెలిసికొన్న యంశము లతిస్వల్పము లగుటవలనను నా యీ " ఏతద్గ్రంథ

విమర్శసూచిక ” సర్వలక్షణ సంపన్నము కాజాలదు ; సాధారణముగా, గవులు మహాకవులు వ్రాసిన, వ్రాయుచున్న గ్రంథములన్ బ్లోలె నేవేని కొన్ని శాస్త్రీయచర్చలన్ మనస్సున బెట్టికొని, యీ గ్రంథమును విమర్శింప సాధ్యము కాదు ; ఏలవనగా నిది, యనువాద గ్రంథమయ్యు నూత్న సంస్కరణములను, సిద్ధాంతములను, జరిత్రములను, స్వకల్పనలను, విమర్శనములను, సాంఘికార్థిక శారీరక మానసిక భౌతిక శాస్త్రముల మహావిషయములను, దత్వశాస్త్ర సిద్ధాంతములను అతి మృదుమధురగంభీర ధోరణితో నుద్ఘాటించు మహాశాస్త్రమై యల రారుచున్నది కావున ; మఱియు అనువాద పద్ధతి యందును, గథాంశముల మార్పునందును, రచన యందును, విపులీకరణమందును, పద ప్రయోగ వైదగ్ధ్యమందును నిది తేజోమయమగు నూతనమార్గముల్ బట్టి, సిద్ధి బడసినది ; ప్రాపంచిక దృష్టియందు నొక కాలమునకు, నొక దేశమునకు, నొక భాషకు జెందిన యొక మహావ్యక్తిని గథానాయకుడుగా, గాని సర్వకాలములందు, సర్వ దేశములకు సంబంధించిన సర్వభాషలకు జెందిన సర్వమానవకోటికి నుభయ తారకముగ, నత్యద్భుత విమర్శ దృష్టితో, నిమ్మహోద్గ్రంథమును సృష్టించిన యయ్యద్భుత కవితాకళా స్రష్ట విశాలభావము గ్రహించుట మూలముననే యీ గ్రంథమందలి పరమ విషయములను గ్రహింపనై యుండును కాని వేఱు విధములన్ గాదని మఱందే విన్నవించికొనియెదను.

ఈ మహాగ్రంథము మూలగ్రంథములోని ప్రథమఖండమందలి ద్వితీయభాగమై యున్నది ; దీనికి సంబంధించిన ప్రథమభాగ గ్రంథము గూడ దీనివలెనే శ్రీకర్షకమహర్షి గారిచే నత్యద్భుత గ్రంథ సృష్టి కళా ప్రావీణ్యము మెఱయ ననువదింప బడినది ; అదియు నిదియుఁ గూడ జేర్చి యుభయ గ్రంథసృష్టియందు నమ్మహాత్ముడు చూపిన యత్యద్భుత గ్రంథసృష్టికళానూతన మార్గములు, వాని వలననగు ప్రయోజ,

నమును, సిద్ధాంతములును విమర్శింపనై యుండును; కాని చాలినంత ధనము లేమిన్ జేసియు, 1939 వ సంవత్సరము జనవరి 16 తేదీని కొత్తూరులో గూడిన రైతు మహాసభా తీర్మానము ననుసరించియు గ్రంథప్రకటనకర్తలు దీనినే మున్ను ముద్రింపించి ప్రకటించుట వలన నిదియే లభ్యమగుచున్నది; అయినను ప్రకటనకర్తల పరిచయము వలన నా ప్రథమభాగగ్రంథము వ్రాత ప్రతిని గొంతవఱకు జూచినవాడ నగుట వలన దానిలోని కొన్ని విషయములను నీ గ్రంథము లోని కొన్ని విషయములను సేకరించి, పండితోత్తములకు సమర్పించి కొనియెదను.

—♦ మూలగ్రంథము—ప్రథమఖండము—ప్రథమభాగమున ♦—

ద్వారకాపట్టణమందు శ్రీకృష్ణుడు సకల యాదవులను, పౌర ప్రముఖులను గూర్చికొని, సభజేసి యాదవ కుటుంబముల కెల్ల ప్రాణ శత్రువగు జరాసంధుడు తన మిత్రుడగు నరకాసురునితో యాదవుల రాజ్యస్థాపన ప్రయత్నమును, తాను వారిని జయించుట సాధ్యము గాక పోవుటయు, తనకు దోడ్పడ ప్రార్థించుటయు, దానికి వాడుపాయము నారసి తాను ప్రతిసంవత్సరము జేయుచున్న అసురాంబ మహోత్సవము పేరున తన వశీకృతులైనట్టియు, హితులు, మిత్రులు బాంధవులు నగునట్టియు, రాజలోకము నాహ్వానించుటయు, పారసీక, చీనా, బ్రాహ్మ (బర్మా) దేశముల మహారాజులును భారతదేశమందలి పలువురు రాజులును ఆ నరకాసురుని పిలుపున వచ్చుటయు, ఆ రాజ లోకమును గూర్చికొని యున్న ఆ నరకాసురుని యొద్దకు జరాసంధుడు దూతను బంప నుంకించుటయు, నుపన్యసించి, సభవారి యనుజ్ఞ బడసి అక్రూరుని తన సందేశహారునిగా నేరికొని, తన ధర్మసంస్థాపన ప్రయత్నముతోడ పెక్కు రాజనీతులతని కెఱింగించి, నరకాసురుని రాజ సభలో నుపన్యసింపను, నరకాసురుని చెఱసాలలో నవయుచున్న రాజ

కన్యల న్నారడింపను జెప్పి, మార్గమధ్యమున నొక్కెడ జరాసంధుని సందేశహారుడు కానవచ్చుననియు, నతడు తన బాల్యమిత్రు డనియు, నతని బుద్ధిబలము వలననే కార్యము సాధించికొన గల్గుదువనియు సూచించి, పంపించుటయు, నతండు పోవుచు మార్గమధ్యమున శ్రీకృష్ణ భగవానుడు చెప్పినట్లే జరాసంధుని సందేశహారుని కనుగొన గల్గి, అతని యాలోచన చొప్పున మారువేషము గైకొని, అతని గలిసిపోయి, ఒకనాటి సాయంకాలమున ఆ నరకాసురుని రాజధానియగు ప్రాగ్జ్యోతిష పట్టణము ప్రవేశించి, ఆ జరాసంధుని సందేశహారుని మిత్రుని యింట బస చేయుటయు, బిమ్మట నొకనాడు నరకాసురుడు సభ జేయుటయు, ఆ సభలో బైని వ్రాసిన రాజలోకము పాల్గొనుటయు, ఆ సభలో నా జరాసంధుని సందేశహారుడు జరాసంధుని సందేశము విన్పించి, యాదవులను బరిమార్ప జరాసంధునికి దోడ్పడ సకలరాజలోకమును బ్రార్థించుటయు, నా పిదప మారువేషము విడిచి, తన తొంటి వేషముతో నక్రూరుడు సభలో బ్రవేశించి, శ్రీకృష్ణుని ధర్మసంస్థాపన ప్రయత్నమును, రాజలోకముయొక్క దౌర్జన్యము నుపన్యసించి, శ్రీకృష్ణుని ధర్మసంస్థాపన ప్రయత్నము నాదరించి, తోడ్పడ సకల రాజలోకము బ్రార్థించి, ఆ నరకాసురుం డసురాంబామహోత్సవము పేరున రాజలోకము నాహ్వానించిన కుతంత్రమును వెల్లడించుటయు, అది వినిన యా రాజలోకమంతయు బిమ్మట సభ జాలించి, విడిదలకున్ బోయి, అందఱు నొక్కెడ గూడి, శ్రీకృష్ణుని ధర్మసంస్థాపన ప్రయత్నమును గూర్చియు, నరకాసురుని కుతంత్రమును గూర్చియు జర్చించి, అప్పట్టున యాదవులపైకి నెత్తిచనుట కిష్టపడక లేచి, పోయి యా రాత్రి బుచ్చి, మఱునాడు నరకాసురుని యొద్దకు బోయి, యుద్ధ మవసరమగు నేని సర్వసన్నాహములతో వత్తుమని చెప్పి, ఆజ్ఞ గొని తమ తమ దేశములకు బోవుటయు, శ్రీకృష్ణుని సందేశహారుని వలన యాదవుల ప్రయా

త్న్నము విని, అనుమానించి, నరకాసురుండును వాని మంత్రులును ఆలోచించికొని, ఆ మిత్రశర్మను ఉచితవిధుల సత్కరించి, 'మీ ప్రభు విచ్చటికి వచ్చిన పైని సర్వము నాలోచించికొందు' మని చెప్పి పంపించుటయు, ననంతరం బతండా నరకాసురుని కారాగారమున నవయుచున్న రాజకన్యలకు శ్రీకృష్ణస్వామిసందేశమును వినిపించి, యూరడించి, వారల విన్నపంబు గైకొని మరలి ద్వారకాపురంబు బ్రవేశించి, సభలో శ్రీకృష్ణునికిని దక్కిన యాదవవీరులకును దనపోయివచ్చిన యెల్లవార్తలు నెఱింగించుటయు, నది విని యా సభవారు మండిపడుటయు, వారిని వారించి ఆ కృష్ణస్వామి తానొక్కడే పోయి, కార్యము సాధించి వత్తు నని చెప్పి, ఆ మఱునాటి ప్రయాణ నిశ్చయం బెఱింగించుటయును మొదలగు పెక్కు విషయములును, హిమాలయ వర్ణనము, నరకాసురుని పూర్వుల చరిత్రమును, కామరూపదేశవర్ణనము మొదలగునవి కలవు.

—♦ మూలగ్రంథము—ప్రథమఖండము—ద్వితీయభాగమున ♦—

శ్రీకృష్ణుడు నరకాసురవధార్థము ప్రయాణమగుటయు, మార్గ మధ్యమున నొక యూరిలో నొకనాటి సాయంకాలమున విడియుటయు, ఆతని బూజించి ఆ గ్రామములోని ఆర్యవర్గము (గ్రామపంచాయితీ బోర్డువారు) ఒక నిధివిషయమై తమ గ్రామమున నొక బ్రాహ్మణున కును, ఆతని రైతునకును జరిగిన వివాదము విన్నవించి, పరిష్కరింప వేడికొనుటయు, అది యంతయు విని, రేపు చెప్పెద నని ఆ భగవంతుడు చెప్పుటయు, మిత్రశర్మయను ఆ బ్రాహ్మణుని యొక్కయు, ఆ బ్రాహ్మణుని రైతుయొక్కయు, సంగ్రహచరిత్రము లును, నిధి దొరకుటయు, దానిన్ గూర్చి వారిరువురకును నైన వాదోప వాదములును, బిమ్మట దన గ్రామమందు విడిసిన ఆశ్రీకృష్ణభగవానుని కా గ్రామ పురోహితుడు రాత్రి ఫలాహార మర్పించుటయు, నా రాత్రి గ్రామీణులందరు నా మహాత్మునియొద్ద జాగరము సేయుటయు, నుదయ

మున నా గోపాలదేవుఁడు స్నానము నిమిత్తము గ్రామీణులతో మాలపల్లెచేరువ మార్గము పట్టి పోవుటయు, నా మాలపల్లె ప్రజ లా ప్రభువున్ దర్శించి, తొలంగి దూరము పారి పోవుటయు, వారిన్ జూచి ఆ దయాసాగరుండు మిక్కిలి జాలి వహించి, వారివార్త గ్రామీణుల నడిగి తెలిసికొని, వారిన్ గూర్చికొని చెఱువునకు బోయి స్నానంబు చేసి, మరలి వచ్చుచుండుటయు, నప్పరమాత్ముని బూజించు నుద్దేశముతో గ్రామములోని స్త్రీలందఱు శౌచం బలవరించికొని పూజా ద్రవ్యంబులు సంగ్రహించికొని నిరీక్షించుచుండుటయు, వారిచందంబు నెఱింగి, మాలపల్లె ఆడువాండ్రు తమలోఁ దాము గూడపల్కికొని, ఆ భగవానుని బూజింప సాహసించి, పూజాద్రవ్యంబులు గొని అతని మార్గమున కడ్డునిల్చి, నిరీక్షించుచుండుటయు, ఆ యాదవేంద్రుఁడా మార్గమునవచ్చి, ఆ మాలెతలు తన్నున్ జూచి, భయపడి తొలంగుట గమనించి, పురోహితుండగు మిత్రశర్మకు వార్తనంపి, అతండు వచ్చిన పిమ్మట నతనితో సంభాషించి, అస్పృశ్యతన్ గూర్చి యుపన్యసించి, ఆ మాలెతల పూజలు గైకొని, అనంతరం బామిత్రశర్మయు నూరి పెద్దలును రా మాలపల్లెన్ బ్రవేశించి, తిరిగి వచ్చి, కనికరించి, అమ్మాలలకు గొంతధన మిచ్చుటయు, నా యౌదార్యమున్ జూచి, ఆ పురోహితుండును, ఆర్యవర్గము వారును గ్రామాధ్యక్షకరణములును తక్కిన ప్రజలును తమ తమ శక్తుల కొలది ఔదార్యము జూపి యిచ్చుటయు, పిమ్మట నా దేవుండు గ్రామంబున్ బ్రవేశించి, ఆ యూరి దేవునిన్ బూజించి, గ్రామీణులకు దైవభక్తిన్ గూర్చి ఉపన్యసించుటయు, నా పిమ్మట గ్రామములోని స్త్రీలందఱు నతని బూజించుటయు, పిదప నా సర్వజ్ఞుండు పాఠశాలకుబోయి ఉపాధ్యాయులతో సంభాషించి, వారికి కొంత ధనమును వస్త్రములును విరాళము జేసి, హితోపదేశమును గటాక్షించి, గ్రామీణులకు వారియెడల నాదరంబు గలుగ బలికి, పదంపడి ఆ యుపాధ్యాయులకు బోధపడునట్లు కొందఱు ఉపా

ధ్యాయుల చరిత్రములు నిదర్శనములుగ బలికి, ఆర్యవర్గము మొదలగు వారితో సరళ యింటికి మధ్యాహ్నభోజనంబునకు వచ్చి, అచ్చట సరళా సర్వటుంగళ ప్రభృతి వనితాలోకమున్ గారవించి పలికి, భోజనంబు చేసి, మరల నార్యకార్యాలయము (ఊరి రచ్చపట్టు) నకు వచ్చి, ప్రజలతో సంభాషించి, నిధి వివాదంబు బరిష్కరించి, గ్రామ ధర్మంబులను, శ్రీరామచంద్రుని రాజ్యపాలనగౌరవమును వ్యక్తము జేసి, యా రాత్రి పరుండి, వేగుటయు రథమెక్కి నరకాసురవధార్థము ప్రయాణమగుటయు మొదలగు విషయములు గలవు.

ఇట్లు సర్వసాధారణముగను, నిరాడంబరముగను, నాఽతివిస్తరముగను గూర్చబడిన మూలగ్రంథభాగములు రెండు ననువదింప సాధారణపుఁగవియేని, లేక మహాకవియేని బూనికొనుట యగునేని, అతడు సర్వసాధారణముగ నేవేని గొన్ని విషయములను బెంచియో లేక గుదియించియో గ్రంథము బూరించును ; ఇది సర్వత్ర వాడుకయై యున్నది ; ఈ వాడుక ననుసరించియు ననుసరింపకయు వేయిపాళ్లు యింపుసొంపు గూర్చుచు సరసముగను నిరాఘాటముగను, నిరాడంబరముగను, నిరుపమాన విమర్శశోభితముగను, నిర్దుష్టముగను బురుషార్థ చతుష్టయోపయుక్తముగను, మృదుమధురగంభీరార్థ గంభీరంబుగను, లోకోత్తరనియమబద్ధమగు నాంధ్రభాషయందు సకలమానవకోటి శ్రేయోఽభివృద్ధిన్గోరి గ్రంథసృష్టి గావించిన కర్షకమహర్షి యత్యద్భుతావహగ్రంథసృష్టినైపుణ్యమును సమగ్రముగ దెలిసికొన నా బోటి అల్పజ్ఞులకుశక్యము గాదు ; అయినను ఏతద్గ్రంథవిమర్శవిషయసూచికను నివేదించికొను భారము నా తల బెట్టికొంటిని ; గాన అప్పనికి సాహసించెదను ; నా సాహసమును బండితులు దయతో మన్నింతురనియు, నా యీ విమర్శవిషయసూచిక సవిమర్శమనికాని, సంపూర్ణమనికాని, సలక్షణమనికాని భావింపక, తమ యనన్యసామాన్యమేధా

శక్తి నుపయోగించి, చర్చించి, యీ మహోద్గ్రంథమునుండి, అనే కాముల్యా విషయములను సంగ్రహించి, వెలువరించి, అస్మాదృశుల కృతజ్ఞతను గైకొందు రనియు విశ్వసించెదను.

సకలమానవకోటి శ్రేయోఽన్వేషణ తత్పరులగు శ్రీకర్షకమహర్షి గారు మూల గ్రంథమందలి కథాంశమును మాత్రము గైకొని, తన యపార గ్రంథసృష్టి శక్తి నత్యద్భుతావహముగ నుపయోగించి, మానవ కోటి యుజ్జీవనమునకు బరమ ప్రయోజనకారులగు ధర్మార్థకామమోక్ష ములను పురుషార్థచతుష్టయము నీ గ్రంథమందును, దీని మొదటిభాగ మందును, సవిమర్శముగ జేర్చి కృతకృత్యులైరి ; మఱియు నప్పురుషార్థ చతుష్టయ ప్రాప్తికి సంబంధించిన యెల్లవృత్తులలో, నాలుగు వృత్తులు ప్రధానము లనియు, నా వృత్తులు గలవారలననే తక్కినవృత్తులు గల ప్రజలు పైనబేర్కొనబడిన పురుషార్థచతుష్టయ ప్రాప్తికి నగుదురనియు, నిరూపించుచు ఆ నాలుగు వృత్తుల నుండువారల ప్రాశస్త్యము నీ గ్రంథ మం దెల్లెడల నుద్ఘాటించిరి ; కథాంశమును జెప్పుచ, సందర్భోచితముగ పెక్కు సిద్ధాంతములు, సంస్కరణములు సవిమర్శముగ జేర్చుచు, నింత విపులముగను విస్పష్టముగను గ్రంథసృష్టి గావించిన మహనీయులు మన యాంధ్రదేశమందేగాక సకలప్రపంచమందును అరుదుగా నుందురని చెప్పవచ్చును ; ఈ గ్రంథమందును, దీని ప్రథమభాగ గ్రంథమందును ఏ ఘట్టమునైన సూక్ష్మ దృష్టితో విచారింతుమేని "ఉదారభావ యుక్తానామ్ జగదేవకుటుంబకమ్" అను నార్యోక్తి చొప్పున వీ రీ గ్రంథము నింత విమర్శపూతముగ రచించిరని తోపక మానదు ; ఎంతచిన్న పద్యమైన, లేక గద్యమైన లేక పద్యభాగమైనను ఏదే నొక మహాశయమునే వ్యక్తీకరించుట జూతుము ; నాస్తిక్యము, తృష్ణయు, ద్రోహ చింతయు, భేదబుద్ధియు, ఆడంబరమును ఈర్ష్యయును, దవిలి కొని, శాంతి గానక తపించు మానవకోటి పురోఽభివృద్ధి కే యే విష

ంయము లుద్బోధింపనై యుండునో కథాసందర్భము ననుసరించి సాధ్య మగు నంతవఱ కవియన్నియు గూర్ప ప్రయత్నించిన వీరి శ్రమ యెంతయని చెప్పఁదగును? మానవకోటిపురోఽభివృద్ధి "ధర్మార్థ కామమోక్షము" లను పురుషార్థచతుష్టయము వలననే కావలయు ననియు, నా పురుషార్థచతుష్టయమునకు కర్షకుడు, రాజు, గురుడు, కవీశ్వరుడు, అను నాలుగువృత్తులవారే మూలములనియు, విచారించి, ఈ గ్రంథమును దీని ప్రథమభాగగ్రంథమును ఆ నల్వురకే చాల భాగము సంబంధించునట్లు కూర్చి, చేర్చి, మూలగ్రంథమునందలి కథాంశమును జెఱుపక, పెంచి వ్రాసి, కర్షకమహర్షి తనమహర్షిత్వ మును సార్థకము జేసికొను చున్నారు; "తే॥ రాజు గురుడును గవియు గర్షకుడు నాఁగ । లోకమున కగువారు నల్వురు మహాత్మ" లని యొక చోట వ్రాసి, అంతటితో దృప్తినందక, అంటరాని తనమున్ గూర్చి ఈ గ్రంథమం దొకచోట వచ్చిన కథాసందర్భమున (296 వ పుటలో) "సీ॥ ప్రజల యర్థములను బ్రాణంబులను గొంట పరిపాటియై పొల్చు ప్రభువు మాలఁ, । దూరున్ మఱిగి, పాల మొల్లక యెడ్డప్పులకె చేయి సాచు కర్షకుఁడు మాలఁ, । దనయంబు శిష్యుల కాత్మబలంబు నేర్పనఁ గూర్ప లేని గురుండు మాలఁ, । దజ్ఞాన దుర్దశాహతమై కలంగు లోకంబునకున్‌గాని కవియు మాలఁ" దని పైన వ్రాసిన నల్వురనే ముఖ్యముగ భావించి, ఆ పద్యమట్లు వ్రాసిరని తోచును; ఇంతేగాక కర్షకునకును ఉపాధ్యాయునకును సంబంధించిన పెక్కువిషయములను, విమర్శనములను జేర్చి, పెంచి వ్రాసిన ఈ గ్రంథము తుదను గూడ ఆశయఘ్నను శీర్షిక క్రింద (507 పుటలో) వ్రాసిన "సీ॥ కృషియ యెల్లర కును వృత్తికా భూదేవి పరమసంపన్నయై పరగుభంగ్గి, । కర్షకుం డఖిల లోకమున నెల్లరచేత గౌరవింపనగుచుఁ గ్రాలుచొప్పుఁ, । ప్రజల కెల్ల లకు నుపాధ్యాయవర్గంబు నెడఁ బూజ్యభావంబ యెసఁగు తెఱఁగు, ।

జ్ఞానంబు విద్యయు జన్మధనంబులై యెల్లరయందు రహించు వడువు”
పద్యమందు కర్షకుని యొక్కయు, యుపాధ్యాయుని యొక్కయు గౌర
వము సూచించియు—గవికిని రాజునకును సంబంధించిన పెక్కు విషయ
ములను విమర్శనలను జేర్చి వ్రాసిన ప్రథమభాగ గ్రంథముతుదను
గూడ “ఆశయ” మను శీర్షిక క్రింద “సీ॥ రాజులు తమ బహిః
ప్రాణంబులని యెప్డుఁ బ్రజలబాగునకె యారయు తెఱంగుఁ, । బ్రభు
భక్తిగౌరవపరమమర్యాదా విశిష్టతమైఁ బ్రజల్ చెలఁగు వడువుఁ, । గవి
ఋషిత్వము పేర్మిఁ గ్రాలుటయును, దద్వచనము శాసనమయి చను
విధంబుఁ, । యుద్ధ దుర్వ్యసన నిరుద్యోగ వైరాదు లెన్నఁడుఁ బుట్టక
యెసఁగు వడువు” అనుపద్యమందు రాజునకును గవికిని బ్రజలకును
అభ్యుదయ పరంపరాభివృద్ధిన్ గూర్చి వ్రాసియు నిజభావమును సూచించు
చున్నారు; మఱియు నీగ్రంథమందలి ఋషిపత్న్యుపన్యాసము (221 వ
పుటలో) కర్షకుని గూర్చి యొక దండకమును, ప్రథమభాగగ్రంథము
లోని శ్రీలలితాంధ్ర వాణీప్రార్థనాఘట్టమందు విలాస్‌చంద్ కథాఘట్ట
మున కవిని గూర్చి యొక దండకమును, ఆ ఘట్టమందే రామచంద్ర
శాస్త్రి కథాఘట్టమున ఉపాధ్యాయునిన్ గూర్చి యొక దండకమును,
మూలగ్రంథము ప్రథమభాగమందలి హేమవర్మ కథాసందర్భమున
రాజున్ గూర్చి యొక దండకమును సంఘటించి శ్రీకర్షకమహర్షి మానవ
కోటిలో ఆ నల్వురయందు దనకు గల యాదరాతిశయమును వ్యక్తీక
రించిరి; ఆ నాలుగు దండకములకు సంబంధించిన ఆ యా కథాఘట్టము
లందు శ్రీవారు జూపిన ఉదారభావమును, చమత్కారమును అద్భు
తావహములు; ఇట్లు సకలమానవకోటి యుజ్జీవనమునకు హేతుభూత
మైన పురుషార్థచతుష్టయప్రాప్తికి మూలకందములనదగు కర్షక కవి గురు
రాజుల వృత్తి ధర్మంబులను తత్ప్రాశస్త్యమును నిరూపించుటయే లేన
ధర్మములలో నొకటిగా భావించి, అతిపై పుణ్యముతో నుద్గ్రంథసృష్టి

గావించిన ఆ మహానుభావుని సదుద్దేశమును జక్కఁగా గ్రహింప గలిగి, తత్తత్కథాఘట్టములను బఠించుట పాఠకమహాశయుల ధర్మము; కావున నాకు దోచిన ట్లాయా కథాఘట్టములలోని కొన్ని విషయములను సంగ్రహముగ నివేదించికొనియెదను.

## —♦ క వి ♦—

సకలశక్తిసంపన్నంబగు మానవకోటి ప్రాశస్త్యము సుప్రసిద్ధము; అత్యద్భుతావహానంతకోటి బ్రహ్మాండ నిర్మాణచాతురీ ధురీణయగు ప్రకృతిమహాదేవి తనవలన సృష్టింపబడి, తన యధీనమందుంచికొని యున్న అనంతకోటిజీవరాశులందెల్ల మానవకోటియందే మిక్కిలి శ్రద్ధ జేయుచు, తదుజ్జీవనమున్ గోరి నిరీక్షించుచుండును; ఆహారనిద్రాసంతానప్రభృతికర్మములు మానవాదిసకలప్రాణికోటులకును బ్రకృతి సిద్ధంబులు; కాని జ్ఞానమువలనను, దానికనురూపమగు భాషవలనను మనుష్యుడు స్వేతరప్రాణికోటికన్న విలక్షణుడనియు, నధికుడనియు జెప్పఁదగియున్నాడు; సంకల్పవికల్పాత్మక మనశ్శక్తివిశిష్టుడగు మనుష్యు, డనుక్షణమును నానాభావములను జేయుచుండును; ఆ భావములను వ్యక్తీకరించుటకు వానికి భాష పరమసాధనము "ఆ॥ మానుషంబు పరమమానసిక ప్రపం। చమునబోలె, మానసంబు భావ। నాప్రపంచమం దనారతంబును బ్రకా। శింపుచుండుఁ, బేర్మి పెంపుఁగాంచు" "క॥ భావోజ్జృంభణచాలిత। మై వాగింద్రియము వృత్తి కడరుట యును నం। దావిర్భవించుశబ్దము; । కేవల మర్థంబు దానికిన్ గుణ మెపుడున్-" "ఆ॥ అర్థశూన్యశబ్ద మగ్రాహ్యమది మాను। షంబునందెకాక సర్వజంతు। కోటులందును వినఁగూడని యదియగు; । స్థానమనగలేదు దానికెందు" "సీ॥ సరవి మానుషమానసములకు, మానసభావంబులకు, మఱి భావశబ్ద। ములకెట్లు? శబ్దార్థములకు

నట్లువిభజ్యసంబంధము గలదు శాశ్వతముగ" (శ్రీకర్షకమహర్షి) భాష నానావిధశబ్దసంకలితము; శబ్దము లర్థసంశోభితములు; శబ్దార్థశోభితమైన భాషయందే మానుష ముత్తేజము గాంచుచుండును; మానుషోత్తేజఃకరమగు భాషాప్రపంచమున గవీశ్వరునికిమాత్రము శాశ్వతస్థానమ్ము కలదు; ఆతని శాసనము భాషాప్రపంచమున చిరస్థేయము, నిరంకుశము; కోటీశ్వరుడు మొదలుకొని కూటిపేదవఱకు గల మనుష్యకోటియంతయు ఆ శాసనమును శిరసావహించును; మఱియు ప్రతి మానుషవ్యక్తి రక్తకణమందును, కవీశ్వరుని శాసనము మేళవించి ప్రవాహరూపమున బారుచుండును; "తే॥ మానుషంబు వెలయు మానసమం; దది। భావమందు; నదియు భాషయందు;। భాష పరమబుద్ధిబలశాలియగు కవి। యందవెలయు; దాని కతఁడ ప్రాపు; తే॥ తన కడుపు సల్లగాఁబుట్టి, దానియంద। పెరిగి, యెల్లరచేఁ గీర్తి పెంపుగన్న। కొడుకుఁ గవిఁగని మురియుచుఁ గూర్మిసూపు। నెపుడు వాగ్దేవి "గతి నాకు నీతఁడ" యని. తే॥ కవికి లోకంబుతోడ, లోకమునకుఁ గవి। తోడ సంబంధము కలదు నాఁడు, నేఁడు;..... తే॥ కవి కఖిలలోకములతోన గాదు, ప్రకృతి। తోడ, నావయి నీశ్వరుతోడ సంత। తమును గలదు దృఢానుబంధంబు; గాన। నంతవాఁడని పేర్కొననయ్యె నతఁడు" (శ్రీకర్షకమహర్షి) ఇట్లు మహామహిమాభిరాముండగు కవిన్గూర్చి శ్రీకర్షకమహర్షిగారు ప్రథమభాగమున సుమారు నాలుగైదువందల పద్యగద్యములతో సవిమర్శముగను, సవిస్తరముగను "కవిప్రభావప్రశంస" "కవివిశేషప్రశంస" గ్రంథరచనానర్హతాది విషయవివరణము; కవినియమపద్ధతివివరణము, ప్రకృతివిచారము, కవిస్వాతంత్ర్యవిషయము, కవికి బ్రహ్మచర్యమావశ్యకమనుట, కవ్యాహారవిహారవిశేషవిధులు, కవిత్వావిర్భావ వివరణము, విమర్శక ప్రశంస అను శీర్షికలతో వ్రాసిరి; ఇందుదహరింప

బడిన శీర్షిక కలుగఁగల మహావిషయములన్నియు బ్రతికవికున్నాగుడును గమనించి యనుసరింపఁదగినవి ; ఏ భాషయందును, ఇంతవిపులముగను ఇంత విమర్శపూతముగను, ఇంతే గంభీరముగను కవిని గూర్చియు, కవిత్వమహత్త్వమును గూర్చియు వ్రాయబడియుండలేదు ; మహాప్రజ్ఞా శోభితులగు శ్రీ కర్షకమహర్షిగారిందు తమ అపారామృతకవితాకళా సృష్ట్యనుభవమును జక్కనిభాషలో విశదీకరించిరి ; అందు గొన్ని పద్యములు ఏరి వ్రాసి యువ్విషయమును ముగించెదను.

సీ. సకలలోకస్తుత్యసదమలజ్ఞాన విజ్ఞానకళామూర్తి యైనవాఁడు,
సారవిశాల భాషా ప్రపంచవిహారగౌరవస్ఫూర్తిమైఁ గ్రాలు వాఁడు,
సుతఫలాపేక్షారహిత లోకసేవా మహా వ్రతదీక్ష నొప్పారు వాఁడు,
వాగ్దేవతా ప్రభావ విధూత జన్మజన్మార్జితకల్మషుండైనవాఁడు,
స్ఫురదమానుష తేజో విభూతిరేఖ । నమరువాఁడు, మహామతియైనవాఁడుఁ,
బరమగౌరవపాత్రమై పరగువాఁడుఁ । గవివరేణ్యుఁడపార విఖ్యాతిఘనుఁడు,

తే. ప్రకృతిసృష్టి మనోహరారామవాటి । కా విహారవిలోలచేష్టా విశిష్ట
భావగాంభీర్యమృదుగానభాసురంబు, । లోకశంద్యము సత్కవికోకిలంబు. 2

క. సకల జగజ్జనసమ్మో । దకరుండు, విమర్శగగనతలవర్తియు, శా
స్త్రకుముదవనరాశివి । కాసకారియుఁ, గళానిధి, కవిచంద్రుం డరయన్. 3

క. కవిమేఘుంబు జగత్స । స్యవితానము తనియ సారశబ్దసముద్య
త్కవితామృతంబు సుమనః । పవనప్రేరేపణగతి బాగుగ గురియున్. 4

క. సకలజ్ఞుఁడు, యోగఘనుం, । డకలంక మహామనస్వి, యనఘుతముఁడు, శాం
తికి నెలవైనవాఁడు ? "ఋషి" నాఁ । బ్రకటింపఁగ నగు నతండ భవ్యుఁడు జగతిన్.

క. ఆరయ ఋషిత్వమునకున్ । దూరముననె నిలిచి, సత్కృతులఁ గూర్చుట యెవ్వారికి నేనియుఁ గూడదు । పేరునకున్ బ్రదుకు తెరువు పెంపునకు నిలన్. 6

తే. ఇచ్ఛపుట్టిన బ్రహ్మాండమెల్ల నొక్క । చూపునన జూడఁగల్గియు చొప్పి తనకు
సహజమైయొప్పు, నుజ్జ్వలశక్తిఁబోలచు । టదియ నూ పరమర్షిత్వ మంద్రు బుధులు.

తే. శాంతికిన్ దప్పఁ, డమల విజ్ఞానశక్తిఁ । గ్రాలు, మానావమానముల్ గణన సేయఁ,
డెప్డు నంతర్ముఖస్థితి నెసఁగు, విశ్వ । మెల్లఁ గనుచుండుఁ ; గవి సాల నుల్లసిల్లు.

తే. సర్వశాస్త్రపరిజ్ఞానశక్తి కలదు ; కాని వాదంబునకు నది కా దతనికిఁ ;
గదల దాతనిచిత్తంబు ; గాలిలేని । దీపకళిక చందంబునఁ దేజరిల్లు. 9

తే. సర్వసముఁడు, మహాయోగశక్తిఘనుఁడు, । గోరఁ డేమియుఁ; బూర్ణుఁడై కోమరు
మిగులు; । లోకసంసేవ యొకఁడె తదేకదీక్ష । యంద్దలి గుణంబు; కవి సకలార్థవేది.

తే. వేడుకకుఁ బోలెఁ గృతులు గావించుచుండ । నాతనికిఁగాదు లోకసేవార్థము తన
శక్తినంతయు వెదజల్లి సారదీక్ష । గ్రంథము రచింప దొరకొనుఁ గరము బేర్చి.

సీ. కూజద్విహంగసంకులవృక్షరేఖాభిరామంబులైన యారామములును ;
నానావిధగుహావితాన శిలాధాతు భాసమానములగు పర్వతములుఁ,
బరమప్రశాంతిసౌభాగ్యమహోదయాకరములై, సొంపారు కాననములుఁ,
బ్రవిమలాంబుకణార్ద్రభావబంధురశీతవాతవిస్తారనదీతటములు,
సంజకెంజాయలును, ఝరీసంతతులును, । నూతనాఖిలసస్యమనోజ్ఞములగు
క్షేత్రములు నెప్డు గవికి నిస్సీమశాంతి । సుఖమనోల్లాసవిభవవిస్ఫూర్తిఁ గూర్చు.

క. ప్రీతికి, శాంతికిఁ దొలఁగక, । భాతిగ నంతర్బహిఃప్రపంచములందుఁ
స్వాతంత్ర్యముఁ గాచి కొనుట । నీతి కవికి లోకవర్ణనీయనుమతికిన్. 13

ఆ. ఒరుల నాశ్రయించు టొప్పదు కూటికి । గుడ్డకు ధృతిపెంపు గోలువడి, జ
గద్ధితార్థియైన కవి కాత్మగౌరవ । హాని యెట్టులేని దానఁ బుట్టు. 14

ఆ. ఒనరు లోక మెల్లఁ దనకుటుంబముగ భా । వించి,కవి యనేకవిధుల దాని
కొఱక శక్తులెల్లఁ గూర్చి పాటుపడి కృ । తార్థుఁ డగుట మేలు తనకుఁ దాన. 15

తే. ఈనుమైనఁ గాని, మామోడియేనిఁ, బతు । పాతమున నేనియును సత్యభంగముఁ దన
కృతి నొనర్చిన కవికగుఁ గిల్బిష ; మది । యతుల ; మిల దానికెట్టి నిష్కృతులు లేవు.

సీ. ఒకమాటు నిష్ఠ పెంపొనర యోగానందమగ్నుఁడై విశ్వంబు మఱచియుండు,
నొకపరి సర్వవిశ్వోదంత జాగరణానుకూలస్థితి నలరి యుండు,
నొకతడ వఖిలలోకోపకారాగ్రహము క్రమకోర్చి గ్రంథరచనకుఁ గడఁగు,
నొకసారి శాంతిమైనుండు నొక్కఁడై విజనప్రదేశమున మౌనంబుఁ దాల్చి,
కూరిచి యొకప్డు సజ్జనగోష్ఠి నేయు, । సారవిజ్ఞానశాస్త్రచర్చానిర్ఘోష
నెలమి వహియించు నొకతటియేకతంబ, । సర్వతంత్రస్వతంత్రుఁడై జనిన సుకవి.

తే. ఎట్టి నీచపువస్తువు నేని కవి య । మోఘుకవితామృతఝరీసముజ్జ్వలాత్మ
శక్తి దివ్యతరంగిణిన్ జలకమాడి, పరమపావనతాదశఁ బరిఢవిల్లు. 18

ఉ. చక్కనిభావమున్, సరసశబ్దవిలాసము, మార్దవంబునున్,
మిక్కిలి యింపుసొంపుమెయి మించినశైలియు, సద్విమర్శముల్,
జెక్కు వినీతులిల్ శిరము పెంపెసలారు కవిత్వవైభవం
బక్కజమై యొసంగి యనయంబును నాతని సామ్యనాఁ దగెన్. 19

సీ. అణుమేనిపురువు నిత్యుఁడు పరిణామవశంబునఁ దుది నొక్క స్రష్ట యగుట,
యత్యగోచరము, సూక్ష్మము నై పొలుచు పరమాణువు తతికి బ్రహ్మాండమగుట,
వివిధరూపసమాఖ్య విశ్రుతాసంఖ్యాక విశ్వంబు లేకతావిధి నెసఁగుట,
పరిపాటిమై "నహమ్ బ్రహ్మాఽస్మి" యని దృఢభావంబున నరుండు పల్కనగుట,
యేమహాదేవి లీలలై యొసఁగు? నా జ । గజ్జనని ప్రకృతిమాత శృంగారముగ్ధఁ,
డాతఁ డని చెప్పనగుట కావంతయేని । సంశయములే; దతండు విజ్ఞానఘనుఁడు.

సీ. ఒకసారి యెంతయు నొయ్యార మెసఁగంగ వనదేవతాకృతివైభవంబు,
నొకమాఱు శాంతిసముజ్జ్వలసాగరలక్ష్మీస్వరూపవిలాసగరిమ,
మొకమాటు సకలలోకోన్నతగిరిమాలికాసర్వమంగళాకారమహిమ,
యొకపరి సర్వజీవోత్కర జీవనాధారభాషాదేవి చారురూప
సంపదయుఁ, బెంపెలర్ప నశ్రాంతమమ్మ । హాకవికి సారవాత్సల్య మతిశయముగఁ
బ్రకృతిదేవి ప్రత్యక్షమై పలుకుఁ, దప్ప । దిద్దుఁ, దన్మయాత్మ నతండు దేలఁగ్రాలు.

తే. తన్మయసుఖానుభూతిఁ దద్దయు నతండు । గ్రాలుకతమున నాతని కవిత రసము
లుట్టిపడు, నమృతపుజవులూరు, బాత । కొత్తములదన్మయులజేయు నొయ్యనొయ్య.

## —♦ 2. విమర్శకుడు ♦—

సీ. కవి పూతచ్ఛారిత్ర గగనతల భ్రాజమాననిర్మలబాలభానుమూర్తి,
కవి పరమవిశాల వివిధసద్భావనా దివ్యమందిరమణిదీపకళిక,
కవి నితాంతపరిశ్రమవినూత్న సస్యవితానవర్షద్వారిదప్రవరముఁ,
గవి బంధుమిత్రసభాజ్ఞాతిజనవర్గమున ముఖ్యుఁడనఁ బేర్మిఁ దనరు మేటి,
జ్ఞానవిజ్ఞానఘనుఁడు, విశాలబుద్ధి । శాలి, సకలమహాశాస్త్రసారవేది,
శాంతుఁడు, నిరంకుశవిమర్శచక్షువు, నస । మానదీక్షాధికుండు, విమర్శకుండు. 1

తే. పక్షపాతంబులేదు, పాసమునకుఁగుతి । కాఁడు; విసివికొనండు; లోకంబుతెలుఁగు
సర్వము నెఱుంగుఁ, దనమేలె సక్కఁజూచి । కొనఁడు పేరుగల విమర్శకుం డొకప్డు.

తే. మాన్య హితని సారవిమర్శశాణ । ఘర్షణోజ్వలధాటీప్రకార మది యు
నూన ; మృచందమున కెప్డు నోపఁజాలు । కావ్యమణిఁ గూర్పనేర్చినకవియె సుకవి.

సద్విమర్శకుని లక్షణము, నాతనికార్యమ్ము, నింతచక్కఁగ గూర్చి వ్రాయుట సామాన్యులకు తరముగాదు.*

## —♦ 3. ఉపాధ్యాయుఁడు (ప్రథమభాగము) ♦—

## (శ్రీ లలితాంధ్రవాణీ ప్రార్థనాఘట్టము)

"సీ. సకల మానవకోటి సదమల జ్ఞానవిజ్ఞానప్రకాశకుండైనవాఁడుఁ,
దనవర్తనంబు నిత్యము శిష్యకోటి కెంతయుఁ బ్రమాణంబుగఁ దనరువాఁడు ;
నంచితభాషాప్రపంచసేవామహనీయ గౌరవమున నెగడువాఁడు,
సత్కవికోటి యశ్రాంతపరిశ్రమకుఁ జేర్పుమై సొంపుఁ గూర్చువాఁడు,
మాననీయప్రబోధనమహితబుద్ధి । యైనవాఁడుఁ, బ్రశాంతిమై నలరువాఁ, డు
దారభావఘనుం డుపాధ్యాయుఁ, డనఘ । మూర్తి, సకలజగన్నుతామోఘకీర్తి."

అని ప్రశంసించుచు దానన్ తృప్తిబొందక ఈ గ్రంథమందు ౩౧౪ పుట మొదలుకొని ౪౪౯ పుటవఱకు, ప్రథమభాగగ్రంథ మచ్చటచ్చటను సందర్భోచితముగ నుపాధ్యాయుల గౌరవాదివిధులను తల్లక్షణములను, విద్యాఽమూల్యతను శ్రీ కర్షకమహర్షిగారు మృదు మధురశైలిన్ గూర్చి వ్రాసిరి ; ఉపాధ్యాయుల గౌరవప్రవృత్తిధర్మా దులనుగూర్చి యింత విపులముగను, విస్పష్టముగను, సవిమర్శముగను, సలక్షణముగను వ్రాయఁబడినగ్రంథ మింకొక్కటిలేదు ; ఉపాధ్యాయులును, దదితరులును ఈ గ్రంథమందలి (౩౧౪ పుట మొ॥ ౩౪౯ పుట వఱకు) అద్వితీయమహోపదేశములను, చరిత్రములును బఠించి, సారము గ్రహించి ధన్యులగుదురుగాకయని కోరెదను ; ఈ గ్రంథము సుమారైదువేలేండ్లనాటి మూలగ్రంథమున కనువాదగ్రంథమగుటవలన, ఇందు నేఁటి యుపాధ్యాయుల కగుచున్న కష్టములను, ప్రభుత్వము వారి అబాధ్యతను, జెప్పుటకు శ్రీ కర్షకమహర్షిగారికి వలనుపడక

శ్రీవారు ప్రథమభాగ గ్రంథములోని శ్రీ లలితాంధ్రవాణీ ప్రార్థనా ఘట్టమందు సవిస్తరముగను నిరాఘాటముగను జర్చించియున్నారు.

## 4. కర్షకుడు

ఈ గ్రంథమందు ౫౧ వ పుట మొదలుకొని ౨౨౯ వ పుట వఱకును, సందర్భోచితముగ అచ్చటచ్చటను, ప్రథమభాగగ్రంథమం దచ్చటచ్చటను, కృషి, కర్షకులనుగూర్చియు, తద్ధర్మములనుగూర్చియు కృషీవలనను గర్షకులవలనను లోకమునకగు మేలునుగూర్చియు శ్రీ కర్షకమహర్షిగారపారపరిశ్రమముజేసి, విపులముగ వ్రాసిరి; కృషి, కర్షక, తద్ధర్మ, తత్ప్రయోజనములగూర్చి యింతవిపులముగను, సవిమర్శముగను, నిర్దుష్టముగను వ్రాయబడిన గ్రంథ మేభాషయందును గానరాదు; హిందీభాషయందును, ఇంగ్లీషునందును తక్కిన భాషలం దును కొన్ని గ్రంథములు గలవు; కాని అవి దీనికి సరిపోవు; ఈ గ్రంథము సుమా రైదువేలేండ్ల గ్రంథమున కనువాదగ్రంథమగుట వలన, నేటి కర్షకుల కష్టసుఖములను, ప్రభుత్వమువారి హ్రస్వదృష్టిని గూర్చి, చర్చించుటకు వలనుపడక, శ్రీవారు నాగావళీనదీ ప్రార్థన మను ప్రథమభాగములోనిఘట్టమందు విపులముగ జర్చించియున్నారు; పాఠకులా ఘట్టములను శ్రద్ధతో బఠించి, సారమును గ్రహింతురు గాక! యని కోరెదను; శ్రీ కర్షకమహర్షిగారు కర్షకకులమునకు జెం దినవారగుటన్ జేసి, కృషినిగూర్చియుం, గర్షకునిగూర్చియు ఈ గ్రంథ మం దతిశయోక్తులుగూర్చి వ్రాసిరని శ్రీవారియెడల శంకించుట అప చారదోషమగుననియు విన్నవించెదను.

## 5. రాజు

బహురూపంబుల భాసిల్లుచుండు రాజనీతిన్ గూర్చియు రాజ ధర్మంబులన్ గూర్చియు నీ గ్రంథమునకు సంబంధించిన ప్రథమభాగ

గ్రంథమందు శ్రీ కర్షకమహర్షి గారు తమ యపారరాజనీతిజ్ఞతయు, ధర్మజ్ఞతయు, నిరుపమాన విమర్శశక్తియుఁ దేటపడ గొప్పఘట్టమునను గూర్చిరి; ప్రజలు, రాజులను నుభయపక్షములవారికి బురుషార్థచతుష్టయప్రాప్తియగు నున్నతమార్గమును జూపించి, దాని యుత్కృష్టతను బ్రకటించుటద్వారా మహోపదేశమునిచ్చి, యీ ఘట్టమును లోకోత్తరముగ సృష్టించి శ్రీవారు లోకమున కర్పించుచున్నారు; మూలగ్రంథమందలి కథాలేశములను ఏర్చి కూర్చికొనియే శ్రీవారు దాని నట్లు చేసిరి; ఏ భాషయందును అట్టిఘట్టము లేదు. ఆ ఘట్టము సుమారు పది పదునైదువందల గద్యపద్యములు కలిగియున్నది; అందలి కొన్ని పద్యములను మాత్రము వ్రాసి యీ విషయమును ముగించికొనియెదను.

తే. మానవమునందు వెలయు ధర్మంబు; ధర్మ । మంద సర్వోన్నతస్థితి నందవలసి
యుండు మానవ; మిట్లు లాెండు నొకటి । యందు నింకొక్కటి రహించు నతినిరూఢి 1

తే. మానుగన భేద్యమైన గాఢానుబంధ । మెపుడు నీరెంటియందుఁ బెంపెసఁగుచుండుఁ
బ్రకృతిపూరుషులకుఁ బోలె; సకలజీవ । కోటి కీరెండ తేజంబు గూర్పనోపు. 2

క. మానుషము పురుషుఁ; డమల । జ్ఞానము చైతన్య; మది ప్రశస్తిన్ గాంచుఁ
మానితధర్మంబను నస । మాన ప్రకృతిన్ విశాలమహిమాఢ్యంబై. 3

తే. మనుజకోటికి గాక ధర్మంబు సకల । జీవకోటులకును మేలు సేయ నోపు;
మానవుడుధర్మనుదొలఁగి, తాను చెడుట । కాక చెఱచునమస్తలోకంబు; నిజము.

తే. ప్రజలనందఱు ధర్మమార్గంబు నంద । నడుపుఁ, దానును బేర్మిమై నడచు, నుత్తమప్రభు; వతండ నిజముగ మార్గవేది; । ప్రజలతనివారె; యాతండుఁ బ్రజలవాఁడె.

తే. తానసర్వాధికుడననితలఁచుఁ, బ్రజలు । తనకు "బానిసలని వారిఁదెఱుము, నణచు;
వారి యర్థంబులను, గానిపోరపెట్టి । ప్రాణములను, గొనున్; గానిప్రభు వతండు

క. పుడమిఁగల యంతయును "దన । పడసినదియ" యని తలంచుఁ; బాడిఁదొలఁగి తా
నడుచుఁ, బ్రజలెట్లు నడచిన, । నుడుకు, నకారణము మండుచుండు నతఁ డెపన్.

తే. రాజ్యమనఁగఁ గుటుంబంబు ; ప్రభువనంగ । దానికిన్ యజమానుండు ; దానియందు
శాశ్వతమైన వ్యక్తులు ప్రజలనంగ ; । "రాజ్యతత్త్వార్థపరమసార" మన నిదియ.

క. ఒండొరులుఁ గానిపోరులఁ । జెండికొను తలంపు కాదు ; చెల్మినలయు ; నె ।
న్నం డీను సనదు ; నెమ్మది । నుండఁ గనుటకన్న భాగ్య మొక్కటికలదే ? 9

క. "దేవాంశమున జనింతురు । భూపులు" లను పల్కు నిజము ; భూనుతమగు స
ద్భావము వలయున్ దానికి ; । గావున మీ రవ్విధంబ గైకొనుఁ ! డెలమిన్.

తే. ప్రజలుమావారయనియును, ప్రజలవార । మేమనియును మీర లెప్డునూహించు తెఱఁగు
మీక కాకసతంబు నీలోకమునకు । సాల మేలొడఁగూర్చు ; నాసరణిఁగొనుఁడు !

క. ఒండొరులుఁ గలిసిమెలిసి, య । ఖండావ్యాజప్రియత్వ గౌరవములచే
నిండుమనము, లొప్పెడు ముఖ । మండలములునై మనుఁడు ! సమస్తక్రియలన్.

ఉ. ఒక్కనిఁ జూచి, సాల బ్రియమొప్పఁ గరమ్ముఁ గరమ్ముఁ జేర్చు నా
చక్కటి కింక నొక్కరుఁ డెసంగెడిచొప్పది మేలు ; పోల మీ
కెక్కుడి కాని పోరు ? లివి యేఁటికిఁ ? జావఁ దలంపు వెట్టిరే ?
చక్కని దేహముల్ నిశితశస్త్రపరంపరపాలు సేఁతురే ? 13

క. మీ రాజ్యములు కుటుంబము ; । లారయ మీ రెప్డు వాని యజమానుల ; రొ
ప్పారగ మీ చరితము లి । ద్ధారుణిఁ జేర్కొనఁగనగు విధము మేలు కడున్. 14

ఇట్టి పద్యములు పెక్కు లా ఘట్టమందు గలవు ; ఈ గ్రంథమందును ౨౦౮–౨౧౪ పుటలలోను, మఱికొన్నిచోట్లను గలవు ; ఇట్లు సకలమానవకోటి పురుషార్థప్రాప్తి ప్రయోజనకారులగు రాజు, కవి, గురుఁడు, కా, పను నలువుర ధర్మములను, వాని యావశ్యకతయు, దానివలన్న లోకమునకగు మేలును విస్తరించి, రచించుటయేగాక సకల లోకశ్రేయోఽభిలాషులగు శ్రీ కర్షకమహర్షిగారు ఇంక నీ గ్రంథమందును, ప్రథమభాగగ్రంథమందును పెక్కు ధర్మసిద్ధాంతములను, సన్మార్గములను, సంస్కరణములను గూర్చివ్రాసి, తమ మహానుభావతను స్థాపించికొనిరి ; వానినెల్లను పేర్కొనుటయు, విమర్శించుటయు నాకు వశముగాని పనులు ; కొన్నింటినిమాత్రము వ్రాయుటద్వారా

శ్రీవారి యుదారభావములలోఁ గొన్నింటిని నివేదించికొన గలిగెదను; నా నీరసపు వ్రాతలవలన శ్రీవారి ఉత్తమభావ వైభవమునకుఁ బ్రకాశము తగ్గుట నిజము.

## 6. గ్రంథాది

ఉ. శ్రీమదపార వైభవ విచిత్రతరాఖిల విశ్వసర్జనో
ద్దామ గుణాత్మక ప్రకృతిదర్పణ భాస్వదఖండ బింబమై,
భూమధవిష్ణు సర్వమత బోధకళాశ్రయమై, యొసంగు నా
నామహితావతార కిరణద్యుమణిన్ భజియింతు బ్రహ్మమున్. 1

ఉ. కాలును గేలు ముక్కు చెవి కన్నును నెమ్మను లేక యెట్టులేన్
నేలఁ జరించుచున్ బ్రదుకు నీచపుఁబుర్వుఁ గ్రమక్రమంబుగన్
గాలము సాల వో బహుయుగంబుల కావల నొక్క స్రష్టయై
క్రాలఁగఁ జేయు ప్రోడను జగజ్జననిన్ బ్రకృతిన్ నుతించెదన్. 2

ఉ. మూడుగుణంబులన్ దవిలి, మూర్తులు మూడుధరించి, లోకముల్
బోఁడిమి సృష్టిసేయుటయుఁ, బ్రోచుట, ద్రుంచుట యొప్ప నిప్పనుల్ -
వేడుకకున్ బలెన్ బరిఢవిల్ల జగజ్జననిన్ బ్రధానమున్
గూడి, రహించు నీశ్వరునిఁ గొల్తు ననంతు నమేయు నద్వయున్. 3

ఈ మూడుపద్యములను సకలమతముల వారును గమనింపఁదగినవి ; ఇందు మతభేదమునకుఁ దావులేదు ; ఈ మూడుపద్యములందలి గంభీరార్థ మాధునిక ప్రకృతిశాస్త్రములకు గ్రాహ్యమై, యింకను వానికి మిగిలిన ఉన్నత తత్త్వమును నిరూపించుచున్నవి ; ప్రాచ్య పాశ్చాత్యజ్ఞానవిజ్ఞాన నిధులగు శ్రీ కర్షకమహర్షిగారి అపారతత్త్వజ్ఞత పై పద్యములవలన విశదమగుచున్నది. గ్రంథాదిని నిట్లు సర్వమత సామరస్యము గల్గించు నుత్తమ సంస్కరణరూపకమైన రచన ప్రాచ్య పాశ్చాత్యగ్రంథకోటియందెల్ల మిక్కిలి యరుదని చెప్పవచ్చును.

## — 7. క వి స్తు తి (ప్రథమభాగము) —

చ. నియమముఁ దప్పఁ, కింద్రియవినిగ్రహశాంతిసుఖానుభూతిఁ ద
ద్దయు బుధులట్లు పాల్చి, యుచితంబుగఁ బావనలోకసేవన
క్రియలు ఫలంబుఁగోర కొనరించుట నైజము కాఁ, గృతుల్ జగ
త్ప్రియములయి నేయు సత్కవుల దేవసమానుల నాదరింపుదున్. 1

చ. తెలుఁగు మదీయ భాష ; పరదేవత సంస్కృతవాణి ; సోదరీ
తిలకము లన్యభాషలను దేవులు మా లలితాంధ్రవాణి ; కీ
ర్తిలఁదుల కేమి ? వారలను గొల్చియుఁ, గొల్చుచు, ధన్యులై సను
జ్వల చిరకీర్తిఁ గన్న బుధవర్యులు మా గురువుల్, బ్రపూజ్యులున్. 2

గ్రంథాది నీ రెండుపద్యములమూలమున శ్రీకర్షకమహర్షిగారు సకలమానవకోటిన్ బ్రసిద్ధిఁగన్న ప్రాచీనాధునిక కవీశ్వరమండలి పరిచయమున్ గలిగించికొని, కృతార్థులగుచున్నారు ; ఈ యాచారము ప్రాచ్యులందును బాశ్చాత్యులందును మిక్కిలి అరుదు ; కావున నిదియుఁగూడ నూత్నసంస్కరణరూపకమగుచున్నది.

## — 8. భా షా శా స్త్ర ము (ప్రథమభాగము) —

మహాబుద్ధిశాలులగు పాశ్చాత్యపండితులు చిరపరిశ్రమనుజేసి, తమకు దోచిన యంశములవలననే తృప్తిఁబొంది భాషాశాస్త్రమును సృష్టించిరి; సృష్టించుచున్నారు; కాని పర్యవసానమునకు రాలేకున్నారు ; వారి వ్రాతలకు ఖండనమండనములు చేయకనే శ్రీకర్షకమహర్షిగారు ప్రాచీనభారతీయభాషాశాస్త్రప్రవీణులైన యాస్కాచార్యప్రభృతుల మతము ననుసరించి, సంగ్రహముగ భాషాశాస్త్రవిషయము నెత్తికొని పర్యవసానమును దేల్చిరి.

## — 9. మా తృ భా ష (ప్రథమభాగము) —

మాతృభాషాభిమానప్రశంస, తత్ప్రయోజనము మొదలగు పెక్కువిషయములందు సవిమర్శముగను విపులముగను జర్చించఁబడి

నవి ; సకలమానవకోటికిని మాతృభాషాభిమానము "విధి" యని శ్రీ కర్షకమహర్షిగా రుద్ఘోషించుచు నందుఁ బెక్కు విషయముల నెత్తి చూపిరి ; మాతృభాషా ప్రయోజన మరయువా రా ఘట్టము బఠించి పెక్కువిషయములను దెలిసికొనఁగలరు.

## —• 10. మానవకోటి సంఘప్రేమావిష్కరణము •—

### (ప్రథమభాగము)

క. మానుషసర్వస్వమ్మనఁ । గా నెసఁగున్ బ్రేమ ; మఱి సకలలోకము సం
స్థానము దానికి ; నెత్తఱి । నేనియుఁ గా దందు సీమ లిడుట సుదృష్టిన్. 1

క. మానుషహృదయస్థలిస్థిత । నానాగుణమణిగణ కిరణపటలలక్ష్మీ
స్థానముఁ, బరమాకర్షణ । తానిరుపమశక్తిశోభితముఁ, బ్రేమ కడున్. 2

తే. సకలసృష్టికి నమ్మహాశక్తి యొకఁడ । మూలమని చెప్పుచురుమహాత్ములగు ఋషులు;
దానివలన సమస్తభూతంబులన్ వ । శంబు గావించుకొను చొప్పు సాల కలదు.

తే. ఒకకుటుంబము నాఁదగి యున్నయదియ । సకలమానవకోటియుఁ ; జర్చ కాదు;
దానికిన్ గీడు మూడినతఱి నుపేక్ష । సేయఁ జాతురె దానికి జెందువారు ? 3

తే. జాతిమత దేశవేషభాషా విభేద । సరణి కేవల మజ్ఞానసంకలితము ;
యొకకుటుంబమునకు చెందియున్నవారి । కెన్న మేలనఁగూడ దా చిన్నచూపు.

తే. సంతతాత్మబలైక విశ్వాససహన । శక్తులకుఁ బేరుఁగొన్నది సకలజగతి
భరతమాత, యశేషసంపత్సమేత ; । యాయమ కుమారకులు సండు లగుదు రెట్లు ?

ఈ ఘట్టము శ్రీకర్షకమహర్షి గారి సకలమానవకోటి శ్రేయోన్వేషణతత్పరత్వమును వేనోళ్ళ నుద్ఘోషించుచున్నది. ఇంకను ఆ ఘట్టమందే యొకచోట " తే॥ హింస సంఘమునకె కాక యెల్లజగతి । కెట్టులేనియు మేల్గామి యెఱిఁగి, కేవ । లము నహింసాత్మకమగు ప్రేమమునఁ జేసి, । లోకము జయింపనై యుండ్రు లోకులెల్ల. తే॥ మానవేతరజంతుసమాజములకె । " పశుబలం " బన నది యొకభంగి చెన్న ; । మనుజకోటికినెల్లఁ బ్రేమామయాత్మ । బలమ యేడుగడయు, నిర

హాయకరము. తే॥ తలఁపగా నుత్తరధ్రువ దక్షిణాధ్రు । వంబుల నడుమఁ గల యంతరంబుఁ బోల్పఁ । గాదు సూవె హింసాప్రేమ గౌరవముల । యంతరముతోడ; నవి యొకరి డంట దొకటి. తే॥ మానుషక్షేత్రమందు నాత్మబలము ఖని; । దానఁ జెలువారుఁ బ్రేమరత్నంబు; దాని । కిరణపటలమాకర్షశక్తి ప్రపంచ; । మమ్మ! దానికి వశ్యంబ యఖిలజగము;” అని వ్రాయఁబడియున్నది. ఇంకను నిట్టి వెన్నియో నియుఁ గలవు.

## 11. సకల దేశైక్యతా విష్కారణము (ప్రథమఖండము)

తే. అవిరళప్రేమయనున మోఘాస్త్ర, మైక। మత్యమనువింటఁగూర్చి, యాత్మబలయుక్తిఁ,
దివిచ్చి, విడిచి, జగము భారతీయు లోర్వ। మైజయింపఁగలరు కడునోజ మెఱసి.

తే. సకలమానవకోటియు “జగము” నాగృ। హంబునన్ “దేశము”లను కోణంబులన్ బ్ర
శాంతినివసించుచున్నది “జాతి” “మతము”। నను గుణంబులఁదవిలి, మర్యాద మెఱసి.

తే. ఆ కుటుంబము వారెల్ల రర్థిమైఁ బ। రస్పర ప్రేమసఖ్యగౌరవవిశిష్ట
భావమున మనుచందంబు ప్రకృతిమాత। శాశ్వతాదేశనూత్రంబు సారతరము.

క. పోరను జిచ్చిడి, శాంతి । శ్రీరంజితతన్మహా విచిత్రగృహము నె
వ్వారు కలంపన్ జూతురు? । వారలె “మాల” లనవైన వారలు; బాపుల్.

ఇట్టి వెన్నియేని బద్యరత్నంబులు కలవు.

## 12. దేశాభిమానము (ప్రథమభాగము)

సీ. తనయిల్లు దేవతాస్థానమై వెలయ మహాప్రభావముఁ గాంచినట్టి సాధ్వి,
తనభాష లోకమంతటఁగల యెల్లభాషలకుఁ బూజ్యముగ నెసఁగిన ప్రాజ్ఞ,
తన మహావిజ్ఞానధనమున సకలప్రపంచంబుఁ దనిపిన పరమపుణ్య,
లక్ష్మీసరస్వతులకుఁ దన జీవనం బాశ్రయంబుగ మనినట్టి ధన్య,
సర్వతంత్రస్వతంత్రయై జగమునందు । వాసికెక్కిన సన్మాన్యవతి, సుశీల,
భవ్యశాంతికళోపేత, భరతమాత, । దైవవశమునఁ గటా! కటా! దాసియయ్యె.

తే. కూటికిని గుడ్డకును లేమిఁ గుందు టొండె | కాదు పో! జ్ఞానవిజ్ఞానగరిమ కెల్లఁ
జెడిరి వీరని తనకూర్చు కొడుకులఁ గని, పరితపించెడి నెంతయు భరతమాత. 2

సీ. అభినవహోమధూమాయతసౌరభమహనీయతర వాయుమండలంబు,
స్వాతంత్ర్యగౌరవోత్సాహక్రియాశక్తి పరిణామగంభీరపౌరుషములు,
నాత్మవిశ్వాససమగ్రప్రశాంతిప్రశస్త నిస్తులమనశ్శక్తి పటిమ,
సకలమణిద్రుమసస్యౌషధీనుప్రభావప్రసన్నసౌభాగ్యమహిమ,
బహుళయంత్రధూమపటలంబువలనను, | దాస్యమునను, భూరిదైన్యమునను,
దలపఁ బోల్పరాని యలసతవలనను | బససెడియెఁ, గలంగె భరతభూమి. 3

చ. కళలు నశించె, విద్యకు మొగంబులు సాలవు, బుద్ధి చాతురీ
కలనము డీలు వోయె, బహుకష్టపరంపరలన్ గలంగువా
రలయిరి దిక్కు లేని పసరంబులచాడ్పున సందులై ప్రజల్
జెలువముఁ దక్కి, దుర్దశకుఁ జెందిన భారతభూమి నెల్లెడన్. 4

క. పీనుఁగులకన్న మిక్కిలి | హీనులుఁగా నూతు ; రంట రెన్నండును నె
ల్లైని విదేశముల ప్రజలు | దీనతమైఁ గలఁగు భారతీయుల నకటా ! 5

సీ. కలదు లోకోత్తరగంభీర వివిధశాస్త్రప్రపంచంబు పురాతనంబు ;
కలదు సారతరం బఖిలరత్నసస్యద్రుమవ్యాప్తఘనమహీమండలంబు ;
కలదు సదాచారకలితప్రవిమలధర్మారూఢ పూర్వసంస్కారగరిమ,
కలదు సమస్తజగద్గురుపదగౌరవమునకుఁ దగు బుద్ధివైభవంబు,
లేదు విద్య ; బ్రదుకులేదు ; స్వాతంత్ర్యంబు | లేదు ; గౌరవంబు లేదు లేద,
అకట ! భారతీయులకు ; వీరి దుర్దశ | నేమనంగ ? వచ్చె నెంతకీడు ? 6

తే. గుండెపైఁజక్కసేయిడికొని, ప్రశాంతి | నిద్రఁ జొక్కనుకృతి లేఁడునేఁడు కోటి
కొక్కఁడును భారతీయులం; దక్కట ! కట ! | వీరలిట్లుగ్గమై రెంతగోరమునకు ?

క. సకలప్రపంచమునఁ గూ | టికి, గుడ్డకుఁ, గొంపకున్ జెడిన యనదలు కో
ట్లకొలందిగ లేరెందు న | ధికసంఖ్యకునైన భారతీయులు దక్కన్. 8

ఉ. ఎక్కడి పాలనంబు తెఱఁ? గెవ్వరు బాధ్యులు? ధర్మవార్త నా
నెక్కడి? దేఁటిశాంతి? బ్రదు కెక్కడి? దెవ్వరికేమి సెప్ప? నేఁ

డక్కుటా! భారతీయులకు నాప్తులు నాఁ దగు వారు లేర; పే
రెక్కడి దీయనాథులకు? నెందును మోక్షము లేద యింతకున్. 9

తే. బుద్ధిమంతు లాంగ్లేయ ప్రభువులు, రాజ । నీతి విద్యావిశారదుల్, నీతిఁ దలఁచి
యేని, యించుక జాలిపహించియేని; । వీరిము క్తికిఁ దోడ్పడరేర; యెట్లు?

తే. ఆయు రారోగ్య విద్యామహాత్వములకు, । భరతమాత సంతానంబు దనిశిఁగాని
దాయెనే నేఁడు? భోగభాగ్యముల మాట । కేమిలే! దీనికత్యుది హేతువోక్కొ?

సీ. సకలవేదములు శాస్త్రములు జిహ్వాగ్రస్థములై రహించు ధీ బలము పెంపు,
నూరు, నిన్నూరు, మున్నూరు నాలుగు నూర్లు నాయుః ప్రమాణమై యలరువడువు,
నేనుంగుఁ గున్న బిట్టైదిరి, యాపి, కలంచి ద్రెళ్ల నేయన్ జాలు దేహబలము,
నొకపూట తలనొప్పియు నొకప్పు డేని యెఱుంగక బడని సదారోగ్యగరిమ,
భారతీయులకెల్లను బరమ జన్మ । ధనము, లంచిత సౌఖ్యప్రదములుఁ, గార్య
సిద్ధికరము, లుత్సాహవిజృంభణాది । కారణములు, పౌరుషరత్నఖనులుఁ దొల్లి.

క. ఆ యఖిలశక్తు లేమై । పోయిన వోకో? యెఱుఁగఁ బడవిపుడు మచ్చునకేన్;
నాయెఱుఁగుట యట్లుండెన్; । ధీయుతు లేనియును లెస్స తెలియర దీనిన్.

తే. భారతీయులు నిర్మలాచారమునకుఁ । దప్పి ? రాహేతువున జన్మధనము లయ్యు
వీరి సౌశక్తులన్నియు విడిచి, యెచటి । కేనియున్ రిత్త సనియెనం ద్రిద్ధమతులు.

సీ. ఒక్కపద్యం బేనియును బాదమేనియు, స్మృతిపథంబునకు రా కునఁగు చొప్పు,
నరువదియేండ్ల పర్యంతమేనియు ధీతిఁ గొనక బ్రదుక నోచికొనని తెఱఁగుఁ,
గ్రోళ్లు ఱుకుచువచ్చు క్రేపునేనియు నాఁగి, పట్టనేరమి సిగ్గు పడెడి పడువు,
జీవితంబెల్ల నజీర్ణాది వివిధరోగాళిఁజేసి నిరాశ కగువిధంబు,
నేఁటి భారతవర్షమం దేఁటిపాప । మో? యెఱుంగము, కననగు చున్న దెల్ల
ప్రజలయందు; వీనికిఁదప్పు పరమపుణ్యుఁ । లేడఁగలరొక్కొ? తెలియ రాదించుకేని.

సీ. పదునొకండేండ్ల లేఁ బ్రాయంపు బాలిక సంతానవతియై యెసంగు చొప్పుఁ,
బాలబుగ్గల చిన్ని ప్రాయంపు గూతురు వైధవ్యమునకునై వగచు తెఱఁగు,
సవతిపోరున కోర్వఁ జాలక, యాత్మహత్యకునై తెగించు నిల్లాలు పడుపుఁ,
బతి తిట్టి, కొట్టి, యాపై నిల్లు వెడలింప, దిక్కుమాలి తపించు తెఱవ విధము,

స్త్రీ జనాదరభావవిశిష్టమైన। భరతఖండంబునన్ నేఁడు బహుభార్యాత్వకాలయుగ్మ
గాంతు, మిదియేఁటిపాపమో ? కాక మోహ। మో ? య్యొఱుంగము కలయో ? 
మాయయొక్కో ?

ఇట్టి పద్యరత్నంబులు వందలకొలఁది కలవు.

## —♦ 13. ఆ చా ర ము (ప్రథమభాగము) ♦—

తే. ధర్మమందురు నీతిన ; దానికెల్లఁ। బాదు నిర్మలాచారంబు ; ప్రాణి మఖిల
మనుజకోటికి నది ; దానిమహిమ నిజ ము। వాచ్య ; మంచె సిద్ధింపఁ గైవల్యపదవి.

క. పురుషార్థచతుష్టయమును। బరగఁగ నతిసులభరీతిఁ బడయనగు నిరం
తర మెద్దానిన్ దవులుటఁ ?। బరమాచారమని బుధులు పల్కిరి దానిన్. 2

తే. మనుజకోటికి నెల్ల భూమండలమున। నొకఁడ యాచార ; మెల్లనియున్ విభేద
సరణి కాదందు వేషభాషామతాది। వివిధవికృతులవట్టి, వివేక మెడలి. 3

తే. ఈతఁడు తురుష్కుఁ, డాంగ్లేయుఁ డితఁడు, భార। తీయుఁ డీతం, డితఁడు
జపానీయుఁ డనెడు। భేద మాచారమున నెప్డు లేదు, కాదు ;। మనుజకోటికి నెల్ల
ధర్మం బొకండ. 4

ఇఁక నిట్టిపద్యము లెన్నేని గలవు.

## —♦ 14. బ్ర హ్మ చ ర్య ము ♦—

తే. శాస్త్రసిద్ధాంతకవిత మాచార, మతివి। శాలతరముఁ, బవిత్రమున్ ; సక్కదానిఁ
దవిలి వర్తించువాఁ డెల్లధర్మములకు। నైనవాఁ ; డాతనికె యబ్బు నమృతపదము.

ఆ. నాలుగాశ్రమములు నాఁడొంటిబుధులు క। ల్పించి ; రొకఁటినొకఁడుఁ బేర్మిదవిలి
యుండు నవి ; జగమున కుత్తేజకరము లా। నాల్గు నెల్లవారు నడుప నొప్పి. 2

వ. బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్న్యాసములను నా నాల్గును దేశకాలపరిస్థితుల
ననుసరించి తొంటివారికి నవశ్యంబు నడుపనై యుండెడివి ; కాని నేఁడందుఁ
గడపటిరెండు సుదుష్కరంబులు, నేఁటి పరిస్థితులకు మొదటిరెండు మాత్రము
తగి యున్నయవియై యుండియు. 3

క. ఆ రెండు నడుపఁ గల్గిన। వా రానాలుగు నడిపినవారి ఫలము నే
ర్పారంగఁ బడయ నోపుదు ;। రారయ గార్హస్థ్యమ యిపుడంతకు సాలున్. 4

తే. బ్రహ్మచర్యంబు బీజంబు పావనమగు । మానుష క్షేత్రమం ; దతి మహిమ నెసఁగు
తరువు గార్హస్థ్యము ; వివిధ ధర్మము లవి । దానిశాఖలు ; మోక్షంబు తత్ఫలంబు.

తే. వివిధదేశ సంచారంబు, వివిధవిద్య, । లార్యసేవామనోనిగ్రహాదిశక్తు,
లాత్మగౌరవ దేహదార్ఢ్యాదు లెల్ల । బ్రహ్మచర్యంబు వలనన బడయవచ్చు. 6

తే. బ్రహ్మచర్యవ్రతము నడుపక గృహస్థ । ధర్మమునకు గడంగుట తగదు ; దాన
మేలుగా ; దది సాలదు మేటి ధర్మ । ములకు ; ధర్మలోపంబున మూడుఁ గీడు.

ఇంకను చాలవరకుఁ గలవు.

## 15. గార్హస్థ్యము (ప్రథమభాగము)

తే. తనమతంబున కెంతయుఁ దగి సుశీల । వతియు, విద్యావతియు, దృఢవ్రతయునైన
యాలి మొదటఁ బడయునది యార్యజనస । మక్షమునఁ బరిణయ విధి మంచివేళ.

క. ఆ యమయుఁ దాను నొక మన । మై యొనరించునది తగ గృహస్థాశ్రమ ధ
ర్మాయతకర్మము లన్నియు ; । సేయఁ జనదు లోకమునకుఁ జేటగు చేతల్. 2

క. సతి యోడ, కర్ణధారుఁడు । పతి, సంసృతి జలధి ; దాని పారంబు సము
న్నత దేవపదము ; ధర్మము । తత నౌకాదండ ; మవ్విధము మేలు కదుఁజా. 3

తే. వివిధ ధర్మ పరికరాళి వెలయుచుండు । జగము యంత్రము ; దానికి శక్తులొసఁగు
కీలు మానుష మఖిలశక్తినిలయంబు ; । యంత్రనిర్మాత స్రష్ట, సర్వాధికుండు. 4

మానవకోటియందు నేఁడగుచున్న తండ్రికొడుకులపోరు, దంపతులపోర్లు, అత్తమామలకుఁ గోడండ్రకగుచున్న పోరు, ఈ పోరులవలననే సంసారమునకు హానియగుటయు, దానివలన నశాంతియగుటయు, దానివలన్న నైహికాముష్మికసుఖంబులకు మానవుడు కాకపోవుచుండుటయ్యు బాగుగా జర్చించి, మహానుభావులగు శ్రీ కర్షకమహర్షిగార్లు తమ గురుస్వాములవారు తెలిపిరని, మీరాబాయి చరిత్రమను నొక కథ నెత్తికొని, అందుఁ బైని వ్రాసిన ఆచార, బ్రహ్మచర్య, గార్హస్థ్య ధర్మములను శ్రుతిస్మృత్యుక్తులతో సోదాహరణముగ సంఘటించి, దానిని తొల్లింటివారు సక్రమముగ నడుపుటవలన దీర్ఘాయురారోగ్య

శాంతిసుఖంబుల బడయుగల్గిరనియు, నేఁడవి పూర్తిగా విడువబడుట వలన క్రమముగా మానవజాతి కరిష్టంబులగుచున్నవనియు సవిమర్శముగ నాలుగైదువందల గద్యపద్యములను వ్రాసిరి; అందలి ధర్మసిద్ధాంతములు సంస్కరణములు, అద్భుతావహారచనాపద్ధతులు, విమర్శనము, ఉదారభావములు ననన్యసామాన్యములు, శ్లాఘనీయములు.

## 16. భారతవాణీదుర్దశ (ప్రథమభాగము)

సీ. అఖిలలోకంబున నాదిమగ్రంథముల్ దనయందకాఁ జేర్చిఁ దనరు ప్రాజ్ఞ,
సకలమతముల కాశ్రయము సంస్థానంబుఁ, దన దివ్యమతముగా మనినధన్య,
సర్వలోకోత్తర సారనాగరిక తా మహిమఁ గాంచిన జగన్మాన్యచరిత,
నరవి ననేకభాషాదేవులకు రూపుఁ, బ్రాపును గూర్చిన పరమపుణ్య,
జ్ఞానవిజ్ఞాన బహుకళాదానగరిమ । నెల్లలోకంబుఁ దనిపిన యిద్ధశీల,
పాలిత మహాబుధశ్రేణి, భరతవాణి, । కటకటా! నేఁడు గతిమాలి కందనాయె.

తే. ఆంగ్లభాషామహాదేవి యాధిపత్య । మందుఁ దనకెందుఁ దావు లేకణఁగి, మాన
సంబు గలఁగఁ, గన్నీరొల్కఁ, జాలి కగుచుఁ । బరితపించెడి నేడ్చుచు భరతవాణి.

చ. ఉరిసిన పుండుమీఁద మొగ మోడక కారముసల్లినట్లు మే
లెఱుఁగని కొందఱడ్డ "లిది యేరికి నచ్చిన బాస నచ్చు" నం
దు; రనుట తోన గాక మఱి దూషణకున్ వడిఁ జొత్తు; రేఁటి నా
గరికత కయ్యొ నాకనిన కాన్పని యాయమ వంత బ్రుంగఁగన్. 3

తే. ఎలమిఁ బాశ్చాత్యపండితు లేమి వ్రాసి । వీరికి ననుగ్రహించిన, వీరు దానిఁ
దమకునైన మహాప్రసాదమని సంత । సింతు; రంతియ; మఱియొండు చింత లేదు.

క. తమదేశపూర్వచరితము । తను కెఱుఁగఁగరాని హీనదశకగు దురదృ
ష్టము వీరిఁ బట్టె; నిది దై । వము చెయిదముకాక యొండు వల్కఁగ నగునే?

చ. తమ ధనరాశులెల్ల సతతంబు ననేకవిధంబులన్ విదే
శములకుఁ బ్రాలుగా బ్రదుకు సాలదు వీరికి దుస్సహోరు దా
స్యము కతనన్; మనోబలము, సర్వబలంబు నశించిపోవు దా
స్యమునకు నోచికొన్న ప్రజ కందురు ప్రాజ్ఞులు లోకవిద్వరుల్. 6.

క. అది వీరియెడల నిజమై । నది నేఁటికి ; సర్వశక్తు లణఁగిన యవి, సం
పదలెల్ల మాయమైనవి ; । తుదకేమియులేని ఘోరదుర్దశ మిగిలెన్. 7

తే. కలదుబుద్ధి, వితర్కింపఁగాదు, నోరుఁ । గలదు, పల్కనుగాదు; భాగ్యనిధియగుచు
గలదు దేశంబు ; మతి తినఁ, గట్టఁ గాదు, । వీరి ; కిట్టి దుర్దశకైనవారు లేరు. 8

ఇట్టి వెన్నియేనియు గలవు.

## —♦ 17. ఋగ్వేదము (ప్రథమభాగము) ♦—

సీ. సంగీతశాస్త్ర భాషాశాస్త్ర శబ్దశాస్త్ర ప్రపంచమునకు జన్మభూమి,
యధ్యాత్మవిద్యారహస్యసంభృతమతసం ప్రదాయైక్యసంస్థాన సీమ,
జ్ఞానవిజ్ఞానవిశాల బహ్వంశ్యభిరామతాగంభీరధామనిధియు,
మానుషోజ్జీవన మార్గప్రదర్శక నానేతిహాస రత్ననిచయఖని,
యతిపురాతన భవ్యభారత మహోచ । రిత్రనిర్మాణ సాధనోర్మి ప్రకరవి
రాజమానగాథాసాగరంబు, సర్వ । వేదసారోజ్వలంబు ఋగ్వేద మొకఁడ. 1

## —♦ 18. ఆంగ్లప్రభువులు (ప్రథమభాగము) ♦—

సీ. సకలమానవకోటిసౌదర్యసార విశాలభావంబు ప్రశస్తిఁ దలఁచి,
బాధ్యతాయుత భవ్యపరిపాలనాంచిత రాజధర్మ ప్రకారంబు దలఁచి,
ప్రతినిమిషంబును బరిణామమున కగు కాలప్రవాహవేగంబు దలఁచి,
యతులితాపారమహామహిమావహ ప్రకృతిచమత్కారపటిమఁ దలఁచి,
బుద్ధిమన్మలైన యాంగ్లప్రభువులు, నాంగ్ల । పండితులు, నాంగ్లసోదరప్రజలు మంచి
బుద్ధి నేయమి కేమనఁ బోలు భార । తీయులందు ? వీరల కొండు దిక్కులేదు.

సీ. ఇంతగంజియుఁ బూటకేనియుఁ జిక్కమి బక్కలై వగఁగుందు ప్రజల యాలిఖ్య ;
గోచిమాత్రము గట్టికొనఁ గల్గి శీతాదిబాధల-దురటిల్లు ప్రజల కూయుఁ,
దలదాచికొనఁగఁ గొంపలు లేమిఁ దరువుల పట్టుల నివసించు ప్రజల గోడు,
నక్షరాస్యులు-గామి నట్టై పశుత్వము పాలై తిరుగుచుండు ప్రజలగోడబఁ,
గనరొకో వినరొక్కొ లోకంబువార్త । లెప్డు నరయు.నాంగ్లప్రభు ? లేఁటిబుద్ధి ?
యకట! భారతపుత్రుఁ లనిన వారి । కింత యేచపుట్టుటకెద్ది హేతువొక్కొ ?

ఇట్టి పద్యరాజము లెన్నియేనిఁగలవు.

## —♦ 19. భారతప్రజలకు ధైర్యోపదేశము (ప్రథమభాగము) ♦—

సీ. దశరథ రామచంద్ర ప్రభు రాజర్షి దైవంబు నిస్తులౌదార్యగరిమ,
లోకైకగురుమూర్తి శ్రీకృష్ణభగవాను జగదుద్ధరణమహాశక్తిపటిమ,
ప్రేమామృతమయాత్మ శ్రీబుద్ధభగవాను తత జగద్వందితత్యాగమహిమ,
చిరయశోమహనీయు శ్రీజగద్గురుశంకరాచార్య మేధాబలాతిశయము,
నెందుఁగల? వవి సనుటలే దచటికేని। సమయుటయు లేదు; భారతిజనని హృదయ
కమలమందుర సౌరభాకారమున నె। సంగుచున్నవి; మఱితోఁచు సమయమగుడు.

## —♦ 20. సా రా శ య ము ♦—

సీ. ప్రభువులందఱుఁ దమ ప్రజలభుక్తికిని ముక్తికిని దార యగుచుఁ గీర్తిఁ గనుట,
ప్రజలందఱున్ దమ బ్రదుకు చంద మెఱుంగు వారలై ధర్మంబు గోరి మనుట,
బ్రహ్మచర్య వ్రతపరిపాలనం బెల్లవారికిఁ గార్యమై వాసిఁ గనుట—
లోకసంక్షయకర భీకరాయోధనోద్యోగంబు మాయమై పోఁగనుటయు,
శాంతిలక్ష్మి సమస్తదేశముల నొక్క। భంగి నభిరామ రూపసంపదయొసంగఁ
గ్రాలుటయు నెన్నఁడోకదా! కాలమహిమ। యెట్లొకో? ప్రస్తు-యుద్దేశ మెట్లొ?
యేమొ? 1

సీ. సకలమానవకోటి సదమలప్రేమామృతము చవి నెప్పుడుఁ దనియుటయును,
"రత్నగర్భ" యను సార్థకనామమునకయి భూదేవి యుచ్చులఁ బొలచుటయును,
సవిమర్శదృష్టిమైఁ గవులు లోకహితార్థ మంచితకృతులు గావించుటయును,
త్యాగంబె మోక్షపదవికిఁ బరమ సాధన మని యెల్లప్రజలు నమ్మనగుట,
సకల భూతగణంబులు సారశాంతి। భాగ్యగౌరవ మెసఁగంగ బ్రదుక నగుట
యెప్పుడోకద! దేవి! యనేకయుగము। లట్ల చన్నవి కావ మున్నాంధ్రమాత!

## —♦ 21. ప్రకృతి విచార సంగ్రహము ♦—

క. సకలవ్యక్తులకున్ మా। టికి మేళ్లన్ గీళ్లు సంఘటింపుచు నుండున్
బ్రకృతిమహాదేవి యువా। చ్యకళాకౌశలము మెఱయ నంతకుఁ దానై. 1

క. ప్రాకటశక్తిమయాఽసం। ఖ్యాకబ్రహ్మాండగోళకము లాయమ కే
ళీకందుకములు; వెండియు। లోకంబులు, జీవకోటులుఁ, దదంశంబుల్. 2

తే. వ్యక్తి యొకపరి నున్నతి కగ్గుట, నైచ్య । మునకు నొకతఱి నగుట, యమోఘము లగు
నమ్మహాదేవి లీలలె ; యవి యచింత్య । ములు, నవాచ్యంబు లస్మాదృశులకు నెల్ల.

క. ఒకపరమాణువె నిజముగఁ । బ్రకృతిమహాసృష్టియందు బహుధంగుల నీ
సకల జగముఁ ; దల్లీ ! యందొకభాగము భరతఖండ మూహింపంగన్. 4

ఇంక ఇట్టి వెన్నియేనియు గలవు.

## —♦ 22. ఆధునికాంధ్రకవికోటికర్తవ్యము (ప్రథమభాగము) ♦—

తే. కలరు నీపుత్రులందు నఖండ బుద్ధి । బల తపోబల విద్యావిభవ సమగ్రు
లెందఱేనియు సత్కవు ; లెందఱేని । జ్ఞానవిజ్ఞానఘనులుఁ, బ్రశాంతి ధనులు.

తే. భుక్తిముక్తులకున్ జెడిపోయి కలఁగు । సోదరప్రజ నెల్లఁ దేర్చుటయు వీర
కార్య మీసమయంబునఁ ; గాదు శక్తి । వంచనయును, నిరుత్సాహవైఖరియును.

సీ. బ్రదుకునకున్ జెడి, పరితపించెడి మాకు సేయఁ బోలునె కృతిసృష్టియనియు,
మస్మొప్ప రొల్లరు, మాకృతులన్ గొనియాడు పుణ్యాత్మకు లరుదయనియు,
నెల్లేనియున్ రచియింతము కృతులన్న నేమియు దొరక వింకెట్టులనియుఁ,
బ్రభువుల తీవ్రవాగ్బంధశాసనముల వేడిమి కెంతయు వెఱతుమనియు,
గవులుపల్కుట ధర్మంబు గాదు ; విడువఁ । జనదు వారి కుత్సాహంబు, శాంతికిఁ జెడి
పోవుటయుఁగాదు, భీతికిఁదావొసంగు । టయును, దైన్యంబుపాలగుటయునువలదు.

తే. కలిమి కుబ్బరు, లేమికిఁ గలఁగ, రెన్నఁ । డేని నార్యులు ; కలఁగిన నేమివచ్చు ?
గ్రంథసృష్టి యసాధ్యంబు కాదు పేద । తనమునందును సడలని ధైర్యగరిమ. 4

తే. జగము తనకైనఁ, గాకున్న, సక్కదాని । కొఱకె యర్పింతు రఖిలశక్తులుమహాత్మ ;
లందుఁ బ్రతిఫలమున్ గోర ; రలుగ ; రోర్పఁ । దక్క ; రెన్నండువిడువరు త్యాగనిష్ఠ.

తే. సంస్కృతమునందు పాణాదిసకలభాష । లందు సద్గ్రంథములుకల ; వనువదింప
వచ్చువానిని ; గాదేని వ్రాయవచ్చు । నూతనగ్రంథముల నూత్నరీతు లెసఁగ.

క. సకలజగముఁ బరిణామము । నకు నయ్యెన్ ; గ్రంథసృష్టి నానదియును దా
నికిఁ దగ మార్పఁగనుట మే । లొకటి నొకఁడు బాయక యవియొనరన్ వలయున్.

తే. దేశభక్తులకోరికఁ దీర్ప నేని, । బుద్ధికిన్ వచ్చియేనిఁ ; బ్రభువులు ప్రజల
మనసునకుఁగాని తీవ్రశాసనములన్ గ్ర । మంబునన్ ద్రోసిపుత్తురు మంచికగుచు.

ఇట్టి వెన్నియేనియు గలవు.

## 23. గ్రంథప్రాశస్త్యము (ప్రథమభాగము)

తే. శశ్వదంతర్బహిః ప్రపంచమయ నిఖిల । వస్తుకోటి రహస్యవివరణ భవ్య
దర్పణము, నక్షరము గ్రంథంబు, మనుజ । కోటికరుజీవరసము, నక్షోభ్యతరము.

వ. మఱియును—

తే. జ్ఞానవిజ్ఞానతీర ప్రశస్త, వాతుల । రసనుధాపూర భావతరంగమున్, గ
థా ప్రవాహోజ్జ్వలంబు సద్గ్రంథనది, య । మోఘమున్ బరమపదసముద్రగామి.

తే. ఆరయ మనః ప్రపంచంబునందు నరుఁడు । తేజమున్ గాంచుమన్నాఁడిది నిజమెఱుఁగ
రెల్లవారు నిక్కీ ; లెట్టులేని దీని । నెఱుఁగక విమోచనముఁ గాంచ రెవ్వరేని. 3

తే. ప్రవిమలజ్ఞానవిజ్ఞానరత్నకిరణ । మండితంబు, లనూనప్రమాణములు, న
మూల్యతరము, లఖండసమ్మోదకరము ; । లంచితజ్ఞానఖనులు నానార్థదములు.

క. ప్రాకటతరమానసనూ । చ్యాకర్షణతా నిలసదయస్కాంతంబుల్,
లోకశ్రేయస్కరము, ల । నేకవిషయ సద్విభవమహితములగు కృతుల్, 5

క. జ్ఞానంబు పరమునకు, విజ్ఞానం బిహమునకుఁ బరమసాధనము లనం
గా నెగడున్ ; సద్గ్రంథము । వానికి మూలంబు ననుభవఫలప్రదమున్. 6

క. శ్రీమహితోద్గ్రంథకుమా । రీమణుల మహామహిమ నెఱిఁగి కొనియాడం
గా కోలఁదుల కగునే ? । యోహో ? ప్రాజ్ఞులకె యెఱుఁగ నెల్లేనియగున్. 7

సశేషము.

## 24. గ్రంథకర్తలు (ప్రథమభాగము)

క. ప్రాకట యశోఘనులు న । శ్లోకులు తొల్లింటిపెద్దలు జగన్నుత వి
ద్యాకరులు "నానృషిః కురు । తే కావ్య" మనిరి విశాలధీనిధు లెలమిన్. 1

క. సకలజగద్గురువులు నాఁ । బ్రకటింపఁగనైన ఘనులు పరమర్షులు మా
టికిఁ బూజ్యులు నిఖిలగ్రం । థకర్తృకోటికిని భక్తి తాత్పర్యములన్. 2

తే. నేఁటి శాస్త్రనిర్మాతలనేకభంగు । లన్ గనుంగొన నెట్టుఁ జాలని యశేష —
పరమ విషయంబులన్ వారు బాగుగా నె । ఱింగి సిద్ధాంతములు జేసి రిద్ధమతులు.

తే. అమ్మహాత్ముల సారతేజమ్ము సనుట । లేదెచటికేని, సమయుట లేదు, భరత
మాత దివ్యతేజమ్మున మహిమ మెఱయఁ । గలిసియున్న ; దనఁగు నెల్లకాలములను.

చ. కలరిపు, డింక నీవయిని గల్గుదు రజ్వల తత్వవిద్వరుల్
పలువురు గ్రంథకర్తలు, తపస్వులు భారతవర్షమందుఁ, జె
క్కులు కృతులన్ జగద్ధితము గోరి సృజింపఁగనై యనేక భం
గుల సకలప్రపంచమునకున్ గురుమూర్తులునా వెలుంగుచున్. 5

తే. ఆరయ రవీంద్రనాథఠాగోరు కవిశి । రోమణి వెలుంగుదుము కాదె? యామహాను
భావుఁ డిల నెంతవాఁడని పలుకవచ్చు? । సకలజగతి నాతనికీర్తి సాలఁబర్వె.

ఉ. సారమహామతుల్ సుకవిచంద్రులు నేఁడు రవీంద్రనాథఠా
గోరు మహాకవీశ్వరునకున్ సరివచ్చెడువారు పల్వు రు
న్నారు భవత్కుమారకులు ; నా తల సాలదు వారి పెంపునున్
బేరు, నుతింప ; నీ మనను పేర్మికిఁ గూర్మికి నాదు రాఘనుల్. 7

సీ. వివిధావధానప్రవీణు లఖండమేధానిధుల్ పల్వురనూన యశులు
నాశుకవిత్వవిద్యాపారగుల్ బహుగ్రంథనిర్మాణ ధాఘనులు పల్వు
రఖిలశాస్త్రప్రపంచానుభవానందమూర్తులు నిర్మలాత్ములు పలువురు
సారసాహిత్యవైశారద్య వైభవప్రకట మహామహోపాధికులు పలువు
రమ్మ ! నీకుఁ గలరు పుత్రు ; లైన నేమి । కార్య? మీవును వారును గాంచఁజాల
కున్నవారు జగద్విదితోజ్వల ప్ర । కాశ మెవ్వరు నొల్లని కారణమున. 8

లోకోత్తరగ్రంథనిర్మాతలలో నొక్కఁడుగ నెన్నదగిన శ్రీకర్షక మహర్షిగారి కాంధ్రకవులయెడలఁగల గౌరవభావము పైనవ్రాసిన—చ—సీ—పద్యములవలన గ్రహింప వలసియున్నది ; ఇంక నిట్టి వెన్నియేనియు గలవు—గ్రంథవిస్తరభీతిచే వానిని విడిచితిని ; పైని వ్రాయఁబడిన విషయములేగాక ఇంకను లోకశ్రేయస్కరములగు పెక్కు విషయములు దీని ప్రథమభాగగ్రంథమందుఁ గలవు ; సకలమానవశ్రేయోఽభిలాషులగు శ్రీకర్షకమహర్షిగారి మహోదారభావములను బండితులకు నివేదించికొనుటకే అందుఁ గొన్నింటిని పైని వ్రాసితిని ; కాని విమర్శించుటకుఁ గాదు ; మఱియు ప్రథమభాగగ్రంథములోని

విషయములవలెనే ఈ గ్రంథమందలి విషయముల నేరి, కూర్చి సమ న్వయించికొనుట నా కంతగా నవసరముకాదని తలంచెదను; ఏలననగా నేను నివేదించికొనగల్గు విషయములకన్నను సర్వజ్ఞులగు పండితోత్త ములే పెక్కువిషయములను స్వయముగా నేరికొని, విమర్శించి లోకము నకు మహోపకారము సేయగల్గుదురు; అయినను నా విధి ననుసరించి కొన్నింటినిమాత్రము నివేదించికొనియెదను.

## —• 25. స్త్రీ వర్ణనము •—

సర్వజ్ఞులగు కర్షకమహర్షిగారు స్త్రీవర్ణనము నిఁద్యమని మొదటి భాగమున నొక్కెడ "స్త్రీ వర్ణన ప్రశంస" అను ఘట్టమున వ్రాసి యున్నారు; మానవకోటిలో నించుమించుగా సగముసంఖ్యను జెంది "క॥ సతియోడ; కర్ణధారుఁడు । పతి; సంసృతి జలధి; దాని పారంబు సము । న్నత దేవపదము, ధర్మము । తతనౌకాదండ; మవ్విధము మేలు కడున్" అను పద్యముప్రకారము ధర్మమను గడబట్టికొని సంసార సాగరము నుత్తరించి, దేవత్వమను తీరము నొందుటకు పతియను నావి కునికి నావపగిది నమరి, సమస్తప్రయోజనములకును, జ్ఞానవిజ్ఞానాది శక్తి వికాసమునకును దీసిపోని నారీలోకమున కవమానకరముగను, అసహ్యముగను వ్రాయుట వారియెడల నపచారమని శ్రీవారి భావము; అవ్విషయము గ్రహింప దగియుండును; ఈ గ్రంథమందు (18 పుటలో) "వనితాలోక గౌరవంబున్ గూర్చి శ్రీకృష్ణస్వామి ముచ్చ టించుట" అనుశీర్షిక క్రింద నారీలోకము నెడలఁ దమకుగల ఔత్కృ దళ్యభావమును సూచించు పద్యములను వ్రాసియున్నారు; ఇంకను 469, 484 పుటలలోఁగూడ బెక్కు గద్యపద్యములను వ్రాసియున్నారు; అవియేకాక ఈ గ్రంథమందును ప్రథమభాగమందును అచ్చటచ్చట సమయోచితముగ బెక్కు గద్యపద్యములను వ్రాసిరి; సకలమానవ జాతి తత్వజ్ఞులగు శ్రీవారు స్త్రీలోక ప్రస్తావన వచ్చినప్పుడు సగౌరవ

దృష్టితోనే వ్రాయుదురు కాని, వారిని భోగ్యవస్తువులుగను, మోహాధి దేవతలగను గూర్చి వ్రాయరు ; అట్లు వ్రాసినవారి వ్రాతల నాదరింపరు ; ఇవ్విషయము నెంతేని చర్చించి, వ్రాయవలసి యున్నది ; కాని సర్వజ్ఞులగు పండితులే స్వయముగ విచారించి, లోకమునకు బ్రకటింతురను విశ్వాసముతోడను, నా యశక్తతవలనను విడిచితిని ; "స్త్రీవర్ణన" మను నొకఘట్టమును బ్రత్యేకము కల్పించికొని, తమకుఁ దోచినట్లు వచ్చి శృంగారరసమును గురిపించుట తొంటినుండియు మన ఆంధ్రకవులలో బల్వుర కభ్యాసమై పోయినది ; వారీ యభ్యాసము నుండి విడువడులే శ్రీకర్షకమహర్షి గారి కిష్టము ; వారట్లు మానుకొనజాలరేని భావములను జక్కగా సవరించుకొనుటకై శ్రీవారొక పద్యమును స్త్రీవర్ణనపరముగ వ్రాసిరి ; ఆ పద్యము నీ క్రింద వ్రాసి ఈ విషయమును విరమించికొనియెదను.

సీ. దరహాసచంద్రికాధవళరుచిశ్రీకిఁ గర్ణకుండలములు కాన్కవెట్ట,
రమణీయరత్నహారము మంజులోష్ఠప్రవాళద్యుతిన్ బ్రుంగి కేలుమోడ్ప,
బ్రకటనాసాగ్రమౌక్తికము కపోలదర్పణతళ్తళలకు భక్తిసేయఁ
గస్తూరికాతిలకము లోచనేందీవరప్రభఁ దోఁగి గౌరవము నూప,
సహజసౌందర్యరేఖా ప్రశస్తి నిట్లు । కల్పితపరిష్కృతియా తిరస్కారగరిమఁ
బొలచి, యొప్పారు నవ్వీరపుత్రి గార । వించి, యాలోకవేది దీవించె, నంత.

ఈ పద్యమందలి సౌష్ఠవమును బండితులే గ్రహించి యానందింపదగుదురు.

## —• 26. వృక్షచిత్రీకరణము (౧౦౬ పుట) •—

ఈ ఘట్టమును శ్రీకర్షకమహర్షిగారు ప్రాచ్యపాశ్చాత్యవృక్షశాస్త్రరహస్యమును గ్రహించి, స్వానుభవముతో మేళవించి వ్రాసిరి ; ఇది మూలగ్రంథమందు లేదు ; ఇది శ్రీవారి అత్యద్భుతవృక్షశాస్త్రపరిశోధనకు నిదర్శనము.

౨౫ మూషకపిపీలికామండూకశశకర్షి పక్ష్యుపన్యాసములు (౧౯౮ పుట మొదలు ౨౨౨ పుట వఱకు) ఇవియు మూలగ్రంథమందు లేవు; సకలశాస్త్రజ్ఞులగు శ్రీ కర్షకమహర్షిగారి స్వకపోలకల్పితములే యివి; ఈ యుపన్యాసములు శ్రీవారి జంతుశాస్త్రకృషిశాస్త్ర పరిశోధనకును, ఉచితజ్ఞతకును, సందర్భసౌష్ఠవవేదిత్వమునకును, లోకజ్ఞతకును, మానవకోటి పురోభివృద్ధిన్ గూర్చిన శ్రీవారి అభిలాషకును, తత్వజ్ఞతకును నిదర్శనములు- అత్యద్భుతావహములు.

## —• 27. శ్రీ కృష్ణ భ గ వా ను డు •—

ఈ జగద్గురుమూర్తి వేదములు మొదలుకొని లాలిపాటలవఱకు గల భారతీయవాఙ్మయ ప్రపంచ మెల్లెడలను బేర్కొనబడుచున్నాడు; పాశ్చాత్యవాఙ్మయ ప్రపంచమందును ఈతని పవిత్రచరిత్రము విమర్శింపబడుచున్నది ; పాశ్చాత్యులకు నీ మహానుభావునెడల గల సదభిప్రాయ దురభిప్రాయములను గూర్చి యిచ్చట విమర్శించుట అనవసరము ; కాని ఆ లోకోత్తరపురుషుని అవతారమువలన పవిత్రమైన మన దేశమందే, తదవతార రహస్యమును సరిగా గ్రహించి వ్రాయబడిన గ్రంథము లరుదని వ్రాయనగుటకు జింతించెదను ; భాగవత విష్ణుపురాణ హారివంశములందును, మఱికొన్ని గొప్ప గ్రంథములందును భారతమందును ఆ పురుషోత్తముని పవిత్రచరిత్రము వేయివిధముల వ్రాయబడియున్నది ; ఇంతేగాక భాగవత, విష్ణుపురాణ హారివంశాది గ్రంథములు ప్రత్యేక మా మహాత్ముని చరిత్రమునకే విశేషభాగము సంబంధించినవి ; కాని ప్రక్షిప్తములు, మహిమలు, గాథలు, అద్భుత ఘట్టములును వానియందు జేర్చబడుటవలన నవి అంతగా ప్రమాణ గ్రంథములు కాకపోవుచున్నవి ; ఆ యుద్గ్రంథములకన్నను భారతమందే ఆ పరమపురుషుని దివ్యచరిత్రము గ్రహింపనైనదిగా దోచు

చున్నది ; కాని ఆ భారతమందు విశేషభాగ మా భగవంతుని చరిత్ర విషయమునకు సంబంధించినది కాకపోవుటవలనను, దానియందును ప్రక్షిప్తములు దోచుచుండుటవలనను, జైన వ్రాసిన భాగవత విష్ణు పురాణ హరివంశములనుండియు, భారతమునుండియు మఱికొన్ని గ్రంథ ములనుండియు, సప్రమాణములగు నంశముల నేరికొని, ఆ పరమా త్ముని అవతారచరిత్రము గ్రహింపనై యున్నది ; శ్రీ బాలగంగాధర తిలక, బంకించంద్రఛటోపాధ్యాయ లాలాలజపతిరాయ ప్రభృతి మహామేధానిధు లప్పనికిఁ బూనికొని కొంతవఱకు కృతకృత్యులైరి ; మహారాష్ట్రపండితులలో గొందఱును, ఔత్తరేయపండితులలోఁ గొంద ఱును గొంత జాగ్రత్తదీసికొని సందర్భోచితముగ ఆ కృష్ణభగవానుని ప్రస్తావన వచ్చినప్పుడు ఉచితజ్ఞతతో నిప్పుడిప్పుడు వ్రాయుచున్నారు; కాని మన ఆంధ్ర గ్రంథకర్తలలో నింకను ఆ విషయమున సంచలనము కలుగకున్నది ; శ్రీ దేవరాజు వేంకటకృష్ణారావు పంతులుగారు మొద లగు నేకొందఱు మేధానిధులు మాత్రమే సవిమర్శముగ వ్రాయు చున్నారు ; కాని వారును అదేపనిగా బూనికొని వ్రాయుచున్నట్లు లేదు ; ఇంతేగాక మన ఆంధ్రపండితమండలిలో శ్రీకృష్ణభగవతార రహస్యమునుగూర్చి యేదోకొంచెము సంచలనము గలిగినను, లోకో త్తరనియమబద్ధమగు పద్యగ్రంథరచనయందది సులభసాధ్యము గాక పోవుటవలనఁ గొంద ఱుపేక్షవహించుచున్నారు.

వ్యాసమహర్షికిఁ బిమ్మట సుమారు నూరుసంవత్సరములకాల మున శ్రీశశాంకమహర్షి చే నిరాడంబరముగను, నిష్కపటముగను రచిం పబడినట్టియు, బండితాకర్షణీయము కాకపోవుటవలన ఉత్తరదేశమం ద్లోకమ్మాలబడియున్నట్టియు, ఈ గ్రంథసృష్టికి మూలమైనట్టియు సం స్కృతగ్రంథమునుండియు, భాగవత విష్ణుపురాణహరివంశభారతాది సంస్కృతాంధ్రోద్గ్రంథములనుండియు, సప్రమాణములగు పెక్కువిష

యములను గైకొని ఈ సందర్భమున అద్భుతోపజ్ఞాశోభితులు, ప్రాచ్య పాశ్చాత్యజ్ఞానవిజ్ఞాన నిధులు, నగు శ్రీకర్షకమహర్షిగారీవిషయమై అపారపరిశ్రమముచేసి గ్రంథరచనకు దొరకొనుట యెంతయు సంతోషావహము; శ్రీకృష్ణభగవానుని దివ్యావతార రహస్యమును సంపూర్ణముగ గ్రహించి, లోకోత్తరనియమబద్ధమగు మన ఆంధ్రపద్యగ్రంథ రచనలో నించుకంతయు వదుపుదప్పక, నిరాఘాటముగను, నూత్నసంస్కరణ భూయిష్ఠముగను, విశేషాంశములను జేర్చి, మూలగ్రంథ కథాంశము నతిక్రమింపక, ఆ లోకోద్ధారకుని నానామత సంకులమైన మానవకోటికెల్ల నేక గురుదేవునిగ బ్రతిష్ఠింప నుద్యమించి, గ్రంథ రచనగావించుచున్న శ్రీవారి పరిశ్రమ కాంధ్రులెల్లరు కృతజ్ఞత జూపవలసి యుందురు; మన ఆంధ్రమందేగాక యే భాషయందును ఇంత సవిమర్శముగను, సత్యసిద్ధాంతసహితముగను, సరళముగను, లలితముగను, నిరాడంబరముగను, సంస్కరణపూతముగను వ్రాయబడినగ్రంథము లేదనుట సాహసోక్తి కాదు.—

అవతారతత్వమును సంపూర్ణముగ గ్రహింపగలుగుట తత్వవేత్తలకేకాని, తదన్యులకు శక్యముకాదు; అట్టి తత్వవేత్తలు మనదేశమందేకాక లోకములోని అన్ని దేశములందును మిక్కిలి అరుదుగ నున్నారు; కవులందరును, పండితులందఱును తత్వవేత్తలుకారు; ఏ కొంచెముమందియో కలరు; కావున దత్వవేత్తలుకాని కవుల రచనలయం దవతారాది ప్రకృతి రహస్యములు గాథలుగను, మూఢవిశ్వాసములుగను, ఉండును; ఆలోపము మన ఆంధ్రవాఙ్మయగ్రంథకోటిలో జాలవఱకు గలదు.

తాత్వికశిఖామణులగు శ్రీకర్షకమహర్షిగారీ గ్రంథమందు శ్రీకృష్ణభగవానుని అవతారపురుషునిగను, అతిమానుషునిగను జూపు

చున్నారు; శ్రీవారేసందర్భమందు ఆ జగద్గురుదేవుని కేనామమిడి, రచ్చనగావింపవలయునో, అది బాగుగ విమర్శించి, అట్లే నిరాఘాటముగ గ్రంథరచన గావించియున్నారు; శ్రీకృష్ణభగవానుని అవతారప్రయోజనమును, తత్కాలచరిత్రమును దెలిసికొనగోరువారవశ్యము నీ గ్రంథమును, దీని ప్రథమభాగగ్రంథమును జదువవలసియుందురు; మఱియు సకలప్రపంచమందును నేడు పూజింపబడుచున్న గీతాశాస్త్రమున కాచార్యుడైన ఆ పరమాత్ముని పవిత్రచరిత్రము, లోకమెల్లెడల వ్యాప్తి బొందగోరువారెల్లరు నీ గ్రంథమును, దీని ప్రథమభాగగ్రంథమును, బహుభాషలయం దనువదించియు, ననువదింప జేసియు, ఆమహానుభావునియెడఁ దమకుఁగల నిర్మలభక్తివిశ్వాసములను బ్రకటించికొనవలసి యున్నారు.

## 28. (42 వ పుట)

సీ. బహురాజకన్యకాప్రాణమానాదిరక్షానుదీక్షాబద్ధకంకణుండు,
సకలభూపాలరాజ్యప్రాణమానభయోన్మూలనోద్యదుద్యోగశీలి।
యఖిలజగత్కంటకాసురలోకసంహారకార్యైకపరాయణుండు, ।
సర్వశక్తిప్రపంచవిరాజితాఖానుష ప్రభావస్ఫురత్సారమూర్తి—
యమ్మహామహుఁ డయ్యూర నాప్రజలకు। నతిథియై, వారు తనచుట్టు నట్లుసేరి
యుండఁగ ననన్యసామాన్యయోగనిద్రఁ। గ్రాలుచుండె మహాయోగఘనుఁ, డనఘుడు.

నరకాసురవధార్థము రథారూఢుడై పోవుచు, మార్గమధ్యమున నొకనాటి సాయంకాలమున శ్రీకృష్ణభగవాను డొకపల్లెటూరు బ్రవేశించి, యా గ్రామవాసులచే బూజింపబడి, వారితో సంభాషించి, నిద్రపోవుటన్ గూర్చి వ్రాయబడిన దీ పద్యరాజము; ఈ పద్య మాపరమాత్ముని భావికార్యక్రమమును, ప్రభావమును, సౌజన్యము, శక్తియు నెంతగంభీరముగ సూచించుచున్నదో గమనింపుడు.

## 29. (282 వ పుట)

సీ. కృతవర్మ గదసాత్యకి ప్రభృతి మహారథులకు వెరవుఁగూర్చ నలఘు వీర్యుఁ,
డక్రూర శూరసేనాదిమహారాజ నీతిజ్ఞులకు బుద్ధి నేర్పు ఘనుఁడు,
నుద్ధవకంకాదియోగ వేదులు తన్ను భక్తి సేయఁగఁ బొల్చు పరమయోగి,
వసుదేవదేవశ్రవః ప్రముఖార్యవర్గమునకు ధర్మమార్గంబు సూపు
చతురుఁ, డప్పరమాత్ముఁ, డాసర్వవేది, । యాప్రజలు తన్ను సనవుమై నట్లు వలుక,
నంట, నుట్టను జేర, నొండనక, వారి । లోనఁ దానొక్కఁడై పొల్చె భూనుతుండు.

ఈ పద్యము మఱునాటి ఉదయమున ఆ మహాపూరుషుం డా యూర్గి ప్రజలతో జెఱువునకుబోయి స్నానముచేసినవిధమునుగూర్చి వ్రాయబడిన ఘట్టములోనిది; ఇదియు పై పద్యమువలె విశాలార్థ గాంభీర్యము కలదే.

## 30. (301 వ పుట)

సీ. రుక్మిణీదేవీ నిరుపమయోగాభ్యాసమునకు నెంతయుఁ గూర్చ ఘనుఁడు యోగి,
సత్యభామాకార్యచాతుర్యము నధిక గౌరవంబున మెచ్చు కార్యవేది,
జాంబవతీబంధుసత్కారమునకు గారవ మెలర్పఁ దనియు రసికవరుఁడు,
లక్షణ సమ్మార్గ్యలక్షణంబునకు మర్యాదఘటించు పరమవిలాసి,
తలలు నొడళులు, నొంటిచీరలును మాసి, । యేవపుట్టింప, నొకభంగి నేసఁగివచ్చి,
యయ్యనాథ, లమ్మలెత లంటి, పూజ । సేయఁగైకొనెఁ జాలమచ్చిక యెలర్ప.

ఇది శ్రీకృష్ణస్వామిని ఆయూగి, చేరువమాలపల్లెలోని యాంధ్రు వారు పూజించిన ఘట్టములోని పద్యరాజము; ఇదియు పై పద్యము వలెనే విశాలార్థగాంభీర్యము కలది.

## 31. (309 వ పుట)

సీ. పరమర్షివర్యసంభావ్య భవ్యప్రభావస్ఫూర్తిఁ బెంపారు వరతపస్వి,
మహనీయయోగషమగ్రతారూఢి యోగాచార్యుఁ డనుపేర నలరు ఘనుడు,
శశ్వదమానుష శక్తిసంపూర్ణవతారలక్షణయుక్తిఁ దనరుదేవుఁ,
డాయతలోకకల్యాణసంఘటనప్రశస్తి నేపారు దీక్షావిశిష్టుఁ,

దఖిలశాస్త్రపారంగతుఁడైన ప్రాజ్ఞుఁ, | డమలనిష్ఠ నెసఁగు పరమాత్ముఁ, డవ్వి
ధమున నాయూరిప్రజల చిత్తములు నచ్చఁ | బలికెఁ, బూజించె నీశ్వర ప్రతిమభక్తి.

ఇది యప్పరమాత్ముం డాయూరి ప్రజలతో నాయూరి దేవాలయమునందలి దేవతాప్రతిమను బూజించి, గ్రామీణులకు దైవభక్తి నుపదేశించిన ఘట్టములోనిది ; ఈ పద్యమును బైపద్యమువంటిదే.

౩౨. (449 వ పుట)

సీ. సకలశాస్త్రప్రపంచము నిజబుద్ధిసాగరమున నణువుఁ గాఁగ్రోలు ఘనుఁడు,
పరమర్షిలోకసంభావ్యయోగాచార్యపదమున నలరారు పరమయోగి,
ధర్మసంస్థాపనతామహిమాసారఖనియై యొసంగు జగద్గురుండు,
మహనీయయశశ్శ్వేదమానుషవిమల ప్రభానిధియై పొల్చు భద్రమూర్తి,
సక్కనయ్యూరిప్రజలఁ దానొక్కఁడై, య | ఖండకరుణాకటాక్షవీక్షణము లొప్ప
నాప్రజల, కా గురువులకు నట్లు బుద్ధిఁ | బట్టి, క్రమకోర్చి, పేర్చి, యుపన్యసించె.

ఇది ఆ యోగాచార్యుం డాయూరి యుపాధ్యాయులకును, విద్యార్థులకును బెక్కుచరిత్రముల ద్వారమున మహోపదేశోపన్యాస మిచ్చిన ఘట్టములోనిది ; ఇదియుఁ బై పద్యములవంటిదే.

ఇట్లు కథాఘట్టములం దాఘట్టమునకును రాబోవుఘట్టముల కును సంబంధించు కార్యకలాపమును సూచించుపద్యము లాయాకార్య సమయంబులకు దగ వ్రాయునాచార మేభాషయందును ఇంత సరస ముగ లేదు. శ్రీ కర్షకమహర్షిగారే దీనికి నూతనసంస్కర్తలు.

ఈ గ్రంథమందలి ౧—౨౬౯—౫౦౫ పుటలలో కోడికూతను గూర్చి మూడుపద్యములు వ్రాయబడియున్నవి ; ఆ పద్యములుగూడ ఆయా కథాఘట్టముల కనుబంధములో యనునట్లు తోచును ; ఒక్క గ్రంథములోనే మూడుచోట్ల గోడికూత వర్ణింపబడుటయు, నాకూఁత యందే రాఁబోవు కథాఘట్టము సూచింపబడుటయు, మిక్కిలి సారస్య మును జమత్కారబంధురంబును నై యున్నది.

## 33. సూర్యోదయవర్ణనము

సీ. అణ్వాది నానావిధానంతకోటి చేతన సముదాయచైతన్యదాయి,
ప్రకటభూగోళక ప్రముఖ భ్రమద్గ్రహస్తోమసమాకర్ష సూత్రధారి,
సకలపదార్థపుంజ విచిత్ర బహువిధాంచద్విశంకటవర్ణసాగరుండు,
సత్పుణ్యవాసనాసంయుత దేవతాగణభువనభవదఖండమూర్తి,
సర్వలోకతమోవినిస్సరణపటుస । హస్రకరుఁడు, పవిత్రాత్ముఁ, డప్రమేయ
దీప్తిరాశి, యినుఁడు పూర్వదిక్కునందు । సూర్యనారాయణుఁడు పొడసూపెనంత.

ఈ పద్యము ప్రాచ్యపాశ్చాత్యశాస్త్రీయ సిద్ధాంతవిషయబోధకము ; మన ఆంధ్రసారస్వతమునందు సూర్యోదయవర్ణనములో నిట్లు సవిమర్శముగ వ్రాయబడినపద్యము లరుదు.

ఇట్టి వెన్నియేనియు సత్యద్భుతకర రచనాఘట్టములు కలవు ; గ్రంథవిస్తరభీతిచే విడిచితిని ; నాకుఁ బండితోత్తములయెడల గల యుదాత్తభక్తిని జూపికొనుటకే యిట్లు కొన్ని విషయముల నివేదించికొన సాహసించితినని ముందే విన్నవించికొంటిని ; మఱియు విషయముల నివేదించికొనుటయందును, తదర్థాదులు సూచించుటయందును బెక్కుదోషము లుండవచ్చును ; వానిని బండితప్రవరులు మన్నించి "నా యర్పించికొన్న యీ గ్రంథమునుగూర్చి మీమీ సదభిప్రాయములు దయచేయుం" డని సోదరాంధ్రప్రజలకు వినతిపత్రమును సమర్పించిన శ్రీ శర్షకమహర్షి గారి ప్రార్థన నంగీకరించి, యీ గ్రంథమును విమర్శించి, సదభిప్రాయములను బ్రకటింప వారికి జాలశ్లాఘ్యత కలుదనియు, బ్రార్థింప సాహసించెదను ; సకలమానవశ్రేయోఽన్వేషణ నిష్ఠాతత్పరులై, అపారపరిశ్రమము జేయుచు, నింకను మూల గ్రంథములోని ద్వితీయ తృతీయ ఖండములను దమ నిరుపమానకవితా వైభవంబున వెలయించి, ప్రకటింపను, వానికిఁ బిదప, మానవకోటిన్ గూర్చి ప్రత్యేకము సవిమర్శముగ నొక్క గొప్పగ్రంథము రచింపను,

దీక్షతోనున్న శ్రీవారియెడల బ్రాహ్మణ బ్రాహ్మణేతర పక్షదృష్టియు, నీర్ష్యయును గూడదనియు, సాహిత్యమందు ప్రవేశము చాలనికారణమున నేనువిడిచినపెక్కువిషయములను విడువరాదనియు, ఆమహాత్మునికాధునికాంధ్రకవికోటియెడలగల ఆదరాతిశయము నేను పైనవ్రాసిన "ఆంధ్రకవులు" "ఆధునికాంధ్రకవికోటికర్తవ్యము" అను విషయములగల పద్యములనుండియేకాక ప్రథమభాగమం దెల్లెడలను గల మఱికొన్ని పద్యములనుండిగూడ గమనింపనై యుండుననియు, మహాశయులగు విద్వద్వరుల బ్రార్థించుచు, శ్రీకర్షకమహర్షిగారి కాధునికాంధ్రకవికోటియెడలగల గౌరవాతిశయము నుడువులయందేగాక నడువడియందును గలదనుటన్ గూర్చి యొక చిన్న నిదర్శనము నివేదించికొని నాయీగ్రంథవిమర్శవిషయసూచికను విరమించికొనియెదను.

ఈ గ్రంథరాజముయొక్క ఉత్కృష్టతను, గ్రంథకర్తయొక్క అపారపరిశ్రమమును విమర్శించుచు 25-6-1937 తేదీ మొదలుకొని ప్రతివారమును వరుసగా మూడునాలుగు నెలలపర్యంతము జమీన్ రైతుపత్రికలో బ్రకటించిన శ్రీ పేరి రామకవిగారివలన విని ఆనందించుచు, ఉద్వేలపండితులగు శ్రీ చెరుకుపల్లి కృష్ణమూర్తిశాస్త్రులుగారు గతసంవత్సరము శ్రీ కర్షకమహర్షిగారిని దర్శింపవచ్చి, శ్రీవారివలన ఆదరింపబడి, యిష్టగోష్ఠిసేయుచు గొన్నిదినములుండి, శ్రీవారి కవితాశక్తిని బరీక్షింపగోరి, ఒకనాడు కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి భారతము ఉద్యోగపర్వమునుండి, రహస్యముగా మూడు పద్యములేరి, వ్రాసికొని, ఈ పద్యములు తానే రచించినయవియనియు, వీన్ని గుణదోషములు విమర్శించుచు, ఈ మూడుపద్యముల యర్థమును విడువక, అవకాశమగుచో విశేషాంశములుచేర్చి, మూడు పద్యములు వ్రాసి యిప్పింపుడనియు గోరిరట; శ్రీ కర్షకమహర్షిగారదివిని ఈ శాస్త్రిగారు నన్ను బరీక్షింపనెంచిరేయని తలంచి శాస్త్రి

గారూ! మీరు నా కవిత్వమును బరీక్షింపనెంచి పద్యములు రచింపఁ గోరుచున్నారు; కాని మా గురుదేవుల యాజ్ఞ ననుసరించి, పరీక్షింపను, వాదింపను వచ్చినవారికోరికె దీర్చుట నాకు కానిపనియగుచున్నది; కావున క్షమింపుడనియు, నా యల్పశక్తి నిన్నిదినములుండి నా గ్రంథమును బరిశీలించుచున్న మీ రెఱింగినదికాదేయనియు చెప్పి అప్పటికి బద్యములు వ్రాయుటను దప్పించికొనిరట; పిమ్మట శ్రీ శాస్త్రిగారి మంచితనమును గ్రహించి, విశ్వసించి మఱియొకనాఁడు శాస్త్రిగారూ! ఆ దినమ్మున మీరు వ్రాయుఁడని నన్ను గోరిన పద్యములు సాధ్యమగునేని వ్రాసి మీ కోరికెను దీర్చెదనని శ్రీ కర్షకమహర్షిగారు పల్కిరట; దాని కత్యానందముతో శ్రీ శాస్త్రిగారు పైన పేర్కొన్న మూఁడు పద్యములను జదివి కాగితముపై వ్రాసి యిచ్చిరట; ఆ కాగితమును దీసికొని శ్రీవారు చేరువ విజనప్రదేశమున కొంటిజని, అత్యల్పకాలములో శ్రీ శాస్త్రిగారిచ్చిన పద్యములకు మించిపోవు మూఁడుపద్యములను వ్రాసితెచ్చి, శాస్త్రిగారికిచ్చి, నా యల్పజ్ఞతను మన్నింపుడని పల్కిరట; శ్రీ శాస్త్రిగారా పద్యములను బఠించి, విస్మయానందపరవశత్వంబున్ బొంది శ్రీవారికి నమస్కరించి సంస్తుతించి, ఆపద్యములు నా రచించినవి కావనియు, మీ కవితాశక్తిన్ బరీక్షింపగోరి శ్రీకృష్ణభారతమునుండి యేరి వ్రాయబడినవనియు, నా మోసమును క్షమింపుడనియు సవినయముగ వేడికొనిరట; దానికి శ్రీవారు ఘోరాపరాధమును జేసినవానివలె వెల్లనై, జ్ఞానవయోవృద్ధులును, భారతమంతటి ఉద్గ్రంథము నరువది డెబ్బదివేల గద్యపద్యములతో నాంధ్రలోకమునకు సమర్పించిన ధన్యులును అగు కవిసార్వభౌములెడలా నాంధ్రులందఱును శాశ్వతముగ గృతజ్ఞులై యుండవలయుననియు, నట్టిచో శ్రీవారి పద్యములపైఁ బద్యములల్లిన అపచారమునకు దాను బాలైతిననియు,

శ్రీ గురుస్వాములయొక్కయు, పరమమాతయగు శ్రీ లలితాంధ్రవాణి యొక్కయు ఆజ్ఞ నతిక్రమించినపాపము సంభవించెననియు, నెంతేని సంతాపమును బొందిరట.

(ఈ విషయము శ్రీ చెఱుకుపల్లి కృష్ణమూర్తి శాస్త్రిలుగా రీ గ్రంథమును విమర్శించుచు వ్రాసిన గొప్పపీఠికనుండి సంగ్రహింపఁ బడినది ; ఇవ్విషయమున శ్రీ శాస్త్రిగారు శ్రీ కవిసార్వభౌముల భార తములోని మూఁడు పద్యములను, వానిపైని శ్రీ కర్షకమహర్షిగారు వ్రాసిన మూఁడుపద్యములను విమర్శించుచుఁ జాలవఱకు వ్రాసిరి ; ఆ పద్యములు తన వ్రతహానిని ; కవిసార్వభౌములయెడలఁ దన యప చారమును, సూచించునవియని శ్రీకర్షకమహర్షిగారు ప్రచురింప నీయరు ; కావున వాని నిట వ్రాయుటలేదు ; ఈ గ్రంథమును విమర్శిం చిన శ్రీ చెఱుకుపల్లి కృష్ణమూర్తిశాస్త్రిగారి పీఠికలో నవికలవు.)

ఇట్టి వెన్నియేని ఉదాహరణములు శ్రీ కర్షకమహర్షిగారి నిరా డంబర శాంతిగంభీరపవిత్రచరిత్రమునుండి గ్రహింపనగును ; కాని అవి యిచ్చట నప్రస్తుతాంశములు ; ఇట్లు సకలలోకశ్రేయమునుగోరి నిరా డంబరముగను, నిగూఢముగను లోకోత్తరోద్గ్రంథరచనకు బూనికొన్న శ్రీకర్షకమహర్షిగారి కన్నివిధములఁ దోడ్పడుచు, నుత్సాహము గల్పిం చుట ఆంధ్రమహాజనుల ధర్మమైయున్నది ; ఆంధ్ర విశ్వవిద్యాలయ మువా రీగ్రంథమును సకలాంధ్రోపాధ్యాయకోటికి శాశ్వతపఠనీయ గ్రంథముగ నేర్పాటు చేయించుటయు, నాంధ్ర రైతాంగసభవారు ప్రతి రైతుసోదరుడు నీ గ్రంథమును బఠింప బ్రోత్సహించుచు, జెన్న పురి వ్యవసాయ శాఖమంత్రిగారివలన వ్యవసాయ కళాశాలలందెల్ల నీ గ్రంథము బఠనీయ గ్రంథముగ నేర్పాటు చేయించుటయు, గ్రామ సంఘోద్ధరణమునకు బూనికొన్న మహనీయులును, జిల్లాబోర్డు అధ్య

ఘులును, ఈ గ్రంథమును గ్రామపంచాయితీ బోర్డులందును, బోర్డు స్కూళ్లయందును బఠనీయగ్రంథముగా నేర్పాటు చేయుటయు నత్యావశ్యక కార్యములు ; గ్రామధర్మములనూ గ్రామపంచాయితీస్థానకలాపమును ఈ గ్రంథమందు (472 వ పుట మొదలుకొని 478 వ పుట వఱకు) విపులముగ జెప్పబడియున్నవి ; అవి సుమారైదువేలసంవత్సరముల నాటివని తెలియువలయును.

ఈ గ్రంథరాజము రైతులకును, ఉపాధ్యాయులకును, దేశభక్తులకును, శ్రీకృష్ణావతారజిజ్ఞాసువులగు భక్తులకును, గవికుమారులకును, గ్రామసంఘోద్ధారకులకును వేదము ; ప్రత్యాంధ్రపుత్రుడును ఈగ్రంథసాహాయ్యమున విశేషాంశములను దెలిసికొన గలడు ; అల్పజ్ఞుండనగు నే నీ గ్రంథరాజమును గూర్చి ఏమి వ్రాసిన నేమి ? కాని సర్వజ్ఞులగు పండితవర్యుల దివ్యవిమర్శలతో నలరారుచు, నింక నెన్నియేని ముద్రణములను బడసి, ఆంధ్రలోకమెల్లెడల వ్యాప్తిగాంచు నప్పుడు దీని మహాత్వము లోక మెల్లెడల ప్రకాశించును ; అట్టి యున్నతభాగ్యమచిరకాలమందే ఆంధ్రుల కబ్బునను విశ్వాసముతో నా యీ గ్రంథ విమర్శ విషయసూచికను ముగించికొనుచున్నాడను ; నా యీ వ్రాత యందలి దోషములు క్షంతవ్యములు.

సర్వేషాం సన్మంగళాని భవంతు.

ఇట్లు,

స్వామి చిద్ఘనానంద.

శ్రీ గురుభ్యో నమః.

# గ్రంథప్రచారకుని విన్నపము.



శ్లో॥ జాడ్యం ధియో హరతి సించతి వాచి సత్యం
మానోన్నతిమ్ దిశతి పాపమపాకరోతి
చేతః ప్రసాదయతి దిక్షుతనోతి కీర్తిమ్
సత్సంగతిః కథయ కిమ్ నకరోతిపుంసామ్॥

(శ్రీ భర్తృహరి)

శ్రీపరమేశ్వరసృష్టి మహామహిమను వేనోళ్లను జాటుచుండు నీ ప్రపంచమునగల చరాచర ప్రాణి కోటులలో మానవుడు త్తముడు; మానవకోటి ఉత్తమత్వమును గూర్చి వ్రాయబడిన గ్రంథములు భారతీయ వాఙ్మయమందును, పాశ్చాత్య వాఙ్మయ ప్రపంచమందును పెక్కులు గలవు; ఇంకను పెక్కులు వ్రాయదగి యున్నవి; ఇట్టి యుత్కృష్టతకల మానవకోటియందును లోపములు లేకపోలేదు; ఆ లోపముల ననుసరించియే మానవులందరు ఉత్తములు, మధ్యములు, అధములు అను మూడు తెగలుగా విభజింపబడుచున్నారు; ఉత్త ముల సహవాసమువలననే మధ్యములును, అధములును ఉత్తమత గాంచ వలసియున్నారు; ఉత్తమపురుషులనే సజ్జనులని శాస్త్రము ప్రకటించు చున్నది.

అనుకరణము మనుష్యునకు బాల్యమందేగాక అజ్ఞానదశయందును ఆవశ్యకమగుచున్నది; కావుననే సజ్జనసాంగత్యము అవసరమని పెద్దల

నుడులవలన దెల్పికొనుచున్నారము; సజ్జనసాంగత్యమువలననే ఇహపరములు మనుష్యునకు సిద్ధింపనైయున్నవి.

నా పూర్వపుణ్యపరిపాకము వలన బాల్యమునుండియు నాకు సజ్జనసాంగత్యమందు విశేషశ్రద్ధయు, అభిలాషయును కలిగినవి; నా అభిలాష కనుకూలముగా నా పితృదేవులగు శ్రీ రామునాయుడు శ్రీ పారన్ననాయుడు గార్లు బ్రహ్మశ్రీ శ్రీ ఆకొండి కామశాస్త్రి గారను ఒక పండితవర్యుని మా గ్రామమునకు రప్పించికొనిరి; వారి శుశ్రూషయందు నాకును నా సోదరులలో కొందరకును, మా సహపాఠులకును ఆంధ్రగీర్వాణములందు ఇంచుక ప్రవేశము కలిగినది; ఇట్లు నా బాల్యము గడచినది.

ఆ పిమ్మటగూడ పేరుగల పెద్దలయొక్కయు, మా కులపెద్దలయొక్కయు, పండితులయొక్కయు, కవులయొక్కయు, సంగీతకోవిదులయొక్కయు, సందర్శనమునకు బోవుచు, వారిసాంగత్యము జేయుటయు, ఆనందించుటయు నాకు కృత్యములుగా నుండెను; నాకు సర్వసౌకర్యములను గూర్చుచు, నన్ను ఏ పనియుండే నుండక స్వేచ్ఛ నొసంగిన నా పితృదేవులకును, సోదరులకును శాశ్వతముగా కృతజ్ఞుండను.

నా యీ సజ్జనసాంగత్యాభిలాషావేశము గల ఆనాడు మాకులమును, దేశమును పవిత్రము సేయ నవతరించెనో యన దగినవారును, అత్యద్భుతోపజ్ఞాన (Untaught knowledge) శోభితులును, శాంతిశమదమాదిగుణగణసంపన్నులును, మహామహిమాన్వితులును, లోకసేవా దీక్షాపూర్ణులును, సమస్తశాస్త్రసిద్ధాంతరహస్యవేదులును, నిరాడంబరజీవులును, లోకోత్తరకవితానిధులును, విమర్శకాగ్రేసరులును, మా గ్రామమునకు సుమారు పది క్రోసుల దూరములోగల కొత్తూరు గ్రామవాసులును, మహర్షిప్రాయులును అగు శ్రీకర్షకమహర్షి ద్వారపు

రెడ్డి అప్పలనాయుడు మహాశయులవారి సందర్శనభాగ్యమును, శ్రీవారి దివ్యోపదేశ శ్రవణమును అప్పు డప్పుడు నాకు లభించుచుండెను; శ్రీవారియందు నాకు అంతకంతకు పుట్టి, పరిణామము పొంది గాఢముగ నాటుకొన్న భక్తిప్రేమాతిరేకములవలన శ్రీవారి సన్నిధియందే నా జీవితములో చాలభాగము గడుప, నాకప్పు డుత్సాహమగుచుండెను; కాని శ్రీవా రాకాలమున విద్యార్థివలెను, విరాగివలెను, తఱుచుగా దేశాటనము సేయుచు, స్వయముగా బెక్కువిషయములను గనుగొని విమర్శించుచుండువారగుట వలనను, ఇంటనుండు కొలదికాలము కూడ కవితాయోగసమాధియందును నానాశాస్త్ర విచారణయందును బుచ్చుచుండు వారగుటను నా యుత్సాహమున కంతరాయము వాటిల్లుచుండెను; అయినను శ్రీవారి సాంగత్య మప్పు డప్పుడు నాకు లభించుచుండుటయుఁ దన్మూలమున గొన్నివిషయములు తెలిసికొనుచుండుటయు నగుచుండెను.

పిమ్మట పదిపండ్రేండ్లనుండియు, గతమూడేండ్లవరకు శ్రీవారు పూర్తిగా ననారోగ్యమునకు పాలైరి; ఆ దినములలో మాత్రము నాకు శ్రీవారి దివ్యోపదేశము లభించుచుండుట దుష్కరమైనది; సందర్శనము సేయుటయు, గొన్నిదినములుండి ఉపచారము సేయుచుండుటయు నగుచుండెను; భారతీయ వైద్యులును, ఆంగ్లేయవైద్యులును పలుమార్లు శ్రీవారికి చికిత్సలు చేసిరి; కాని లాభము లేకపోయెను; పిమ్మట శ్రీవారే శ్రీగాంధీమహాత్ముని ఆరోగ్యదర్పణము మొదలగు కొన్ని ప్రకృతి చికిత్సా గ్రంథములను బఠించియు, సొంతబుద్ధి నుపయోగించియు ప్రకృతిచికిత్స జేసికొన నారంభించిరి; కొంచెము కొంచెము గుణము గన్పడుచుండెను; అయినను సంపూర్ణారోగ్యము లేకపోవుచుండెను; అయినను ఈ మాత్రమునకు ప్రాంతీయులందరకు సంతోష మగుచుండెను; ఇట్లుండగా శ్రీవారికి గత ధాతృసంవత్సర శ్రావణ

మాసమున మరల నాకస్మికముగా రోగము గ్రమ్మికొని చావు బ్రదుకులను సందిగ్ధావస్థకు దెచ్చినది ; ఆకస్మికముగా విజృంభించిన ఆ రోగమునకు ప్రతిక్రియలు లాభకారులు కాలేకపోయెను ; ప్రాంతీయుల మందఱము నిరాశజెందితిమి ; కాని శ్రీవారు మాత్రము ధైర్యము దప్పక చలింపవలదని మాకు సంజ్ఞామూలమున దెలియజేయుచుండిరి ; కాని మందులు కూడ గొంతుదిగి గర్భములోనికి పోజాలని దుర్భరస్థితి అంతకంత కగుచుండెను ; ఇట్లు పౌర్ణమివఱకు గడచెను ; ఆ నాటి సాయంతమునకు శ్రీవారి జీవితమున సందిగ్ధావస్థ యేర్పడెను ; పిమ్మట స్పృహదప్పెను ; కన్నులు మూసికొని పోయెను ; ఊర్పుకూడ మందమాయెను ; ఏ నిమిషమందో శ్రీవారికి నిర్యాణము ప్రాపించునను భయమగుచుండెను ; ఇట్లు సగము రాత్రివఱకు ఆయెను ; పిమ్మట శ్రీవారు కన్నులు దెఱచి, తెలివి దెచ్చికొనిరి ; ఒక విధమయిన దివ్య తేజము శ్రీవారి ముఖమండలమున వెల్లివిరియుచున్నట్లుండెను ; మా కందరకు అత్యాశ్చర్యము ఆనందము ప్రబ్బికొనుచుండెను ; శ్రీవారు లేచి మాటలాడ నుంకించి సంజ్ఞ జేసిరి ; మే మందరము బొదవికొని పడకకుర్చిపై జేర్చి ఉపచారముల కారంభించితిమి ; కొంతసేపటికి సేద దేఱి శ్రీవారు నన్నును శ్రీవారి అంతరంగికులైన మిత్రులను మాత్రము ఉండనిచ్చి, తక్కినవారిని ఆవలకు బంచి తన కప్పుడైన అద్భుత సంఘటనమును, శ్రీవారి గురుస్వాములవారి అనతియును జెప్పి, అచిర కాలమున గ్రంథరచన కుపక్రమింపక తప్పనిసరి యయ్యెనని చెప్పిరి ; శ్రీవారు జీవింపనగుటకును, గ్రంథరచన కారంభింతు రని విన గల్గుటకును మా సంతోష పారవశ్యమును, వెల్లడించికొని, శ్రీవారికి సంపూర్ణారోగ్యము లభించు వఱకును ఉపచరింపగోరి, ఆజ్ఞ బడసి కొన్నిదినములు శ్రీవారిసేవయందే బుచ్చితిమి ; కొలది దినములలో శ్రీవా రించుక నారోగ్యమును బడసి, భాద్రపద శుక్ల ద్వితీయయందు గ్రంథరచన కారంభించి, అనతికాలముననే ముగించిరి ; ఇవ్విషయ

మును శ్రీవారు విస్తరించి ఈ గ్రంథమునకు సంబంధించిన మొదటి భాగము గ్రంథము మొదటనే వ్రాసి యుంచిరి.

శ్రీవారి లోకోత్తర గ్రంథరచనా మహిమ తన గురుస్వాములవారి యొక్కయు, ఉపాస్యదేవతామూర్తియు, పరమమహాత్మ్యస్వరూపిణియు నగు శ్రీ లలితాంధ్రవాణీదేవి యొక్కయు ప్రభావముననే విలసిల్లె ననియు, దానందు నిమిత్తమాత్రుడననియు గ్రంథాది యందును (అనగా మొదటిభాగమందును) ఈ ప్రక్కను బొందుపఱచిన శ్రీవారి ఉపోద్ఘాత మందును, శ్రీవారు వ్రాసికొని యున్నారు; కాన నా విష యముగూర్చి నే నిచ్చట విస్తరించి ప్రత్యేకముగా వ్రాయుట అనవస రమును, అనుచితమును అగును.

మూలగ్రంథములోని మొదటిఖండముమాత్రము శ్రీవారు రెండుభాగములుగ రచించి, తక్కిన రెండవ మూడవఖండములు లట్టె యుంచి రచన నాపిరి; ఆ రెండుఖండములును గూడ రచించి లోకము నకు సమర్పించవలయునని మేము కోరితిమి; కాని ఈ రచింపబడిన గ్రంథములు లోకమున కుపకరించుటయు, నుపకరింపకపోవుటయుఁ గని పెట్టికాని తక్కిన గ్రంథము వ్రాయ వలనుగాదనియు, గ్రంథరచన కొందఱు తలంచినట్లు కేవలము వినోదమునకు గాదనియు, గ్రంథము వలన చిరకాలము లోకమునకు కీడుగాని మేలుగాని అగుట నిజమనియు, త్వరపడి గ్రంథరచనసేయుట మేలుగాదనియు జెప్పి, గ్రంథముద్ర ణము నిమిత్తమై ధనముకొఱకు బ్రయత్నించుచుండిరి; తామా విష యమై శ్రమదీసికొన నవసరములేదనియు, ఆ భారము మ్మాపై నిడి, ఆమాత్రము లోకసేవాభాగ్యము మాకు కలిగింపుడనియు, నేనును నా పితృదేవులగు శ్రీరామునాయుడు, శ్రీ పారన్ననాయుడుగార్లును పెక్కుమారులు శ్రీవారినిగోరి ప్రార్థించికొంటిమి; కాని పరకష్టమున్న

స్వకష్టమునకన్న వేయిరెట్లధికముగాదలంచు పరమదయార్ద్రహృదయు లగు శ్రీవారందుల కియ్యకొనకుండిరి; ఇట్లు రెండేండ్లు గతించినవి; ఎప్పుడీ మహోద్గ్రంథము ప్రచురింపబడునోయను కుతూహలముతో ప్రాంతీయులు వేచికొనియుండిరి.

ఈ నడుమను శ్రీ పేరి రామకవిగారును శ్రీ చెరుకుపిల్లి కృష్ణమూర్తిశాస్త్రిలుగారును శ్రీవారి దివ్యగ్రంథమును బరిశీలించి తమ అద్భుతానందములను బ్రకటించిరి; శ్రీ పేరి రామకవిగారు జమీన్ రైతుపత్రికలో ఈ గ్రంథములోని కొన్నిభాగములను వరుసగా రెండు మూడుమాసములు ప్రకటించిరి; శ్రీ చెరుకుపిల్లి కృష్ణమూర్తిశాస్త్రి గారు శ్రీవారి గ్రంథము నత్యద్భుతదృష్టితో విమర్శించి, సుమారేబదిపుటల పీఠికను వ్రాసి తన కృతజ్ఞతను బ్రకటించిరి; కాని ఆ పీఠికయందు దన్నుగూర్చి "ఆంధ్రజ్ఞానజ్యోతి—ఆంధ్రజ్ఞానభాస్కరుడు—సకలలోకోత్తర కవితాకళాస్రష్ట" అను మొదలగు అతిశయోక్తులు వ్రాయఁబడియుండుటవలనను, శ్రీ శాస్త్రిగారుత్తరహిందూదేశమున వజ్రధర్మవిజయగ్రంథసంపాదనార్థమై ప్రస్తుతము పర్యటనము సేయుచుండుటవలనను, ఆపీఠికనిందుఁ జేర్చుట కర్షకమహర్షి (ఈ గ్రంథకర్త) గారి కిష్టముగాకపోయినది; మొదటిభాగమందైనను, లేక యీ గ్రంథము రెండవకూర్పునందైనను జేర్పడమగును.

శ్రీ కర్షకమహర్షిగారీ గ్రంథమును దశ్రద్ధవహించి, కాలము గడుపుచుండుట గమనించి, ఎట్లైనను బ్రచురణకు దేవలయు నుద్దేశముతో ఈ నడుమ ననగా గతసంవత్సరము జనవరినెల మొదటివారమున ప్రాంతీయప్రముఖులాలోచించి, శ్రీవారినే సభాధ్యక్షులుగాఁ నుండఁ బ్రార్థించి; అనుమతిబడసి పదియారవతేదీని శ్రీవారి గ్రామమగు కొత్తూరు చేరువతోటలో రైతుమహాజనసభఁ జరుపఁ బ్రకటించిరి; పెక్కుగ్రామములనుండి వేలకొలది రైతుమహాజనులును, తదితరులును

ఆ సభ కత్యుత్సాహముతో విచ్చేసిరి ; తన వాగ్దానము ననుసరించి, శ్రీ కర్షకమహర్షి గారే ఆ మహాసభాధ్యక్షతవహించి, అప్పటి రాజకీయ ముల కనుకూలముగా నుపన్యసించి సభాసదుల కుత్సాహమును ప్రబోధమును కలిగించిరి; ఆ మహాసభలో పెక్కువిషయము లుపపాదింపబడి ఆమోదింపబడినవి ; అందు నీ మహాగ్రంథము ముద్రింపించి, ఆంధ్ర మండలములోని పంద్రెండుజిల్లాలయందలి ప్రతిరైతు సోదరునకును, ప్రతి యుపాధ్యాయమహాశయునకును తక్కిన మహాజనులకును ఒక్కొక్క ప్రతిచొప్పున సమర్పించునంశముగల మహావిషయము నాచే నుపపాదింపబడి, పదివేలకు మించినసంఖ్యగల సభాసదులందఱిచే నేకకంఠముగా నామోదింపబడెను ; ఆ తీర్మానము ననుసరించి నేనును నాతోడి భాషాసేవకులును వెంటనే కార్యక్రమమున కుపక్రమించి తిమి ; కాని యేకారణమువలననో శ్రీ కర్షకమహర్షి గారు త్వరపడవల దని మమ్మును వారించుచుండిరి ; ఈ కారణమువలన కొన్ని నెలలు గతించినవి ; ఈ మహోద్గ్రంథమందు ప్రజలకుగల నూతనోత్సాహ మును గుర్తించి, ఆ పిమ్మట మా పితృదేవులిద్దరును ఆలోచించికొని ప్రయాణముచేసి శ్రీవారిని దర్శించి, ఆదరింపబడి, భోజనసమయమున మాటమాత్రము పట్టుబట్టియు, ప్రార్థించియు, గ్రంథముద్రణ ప్రచు రణములకు శ్రీవారి యనుజ్ఞబడసి, కృతకృత్యులై సంతోషముతో భుజించి, శ్రీవారివలన ఈ గ్రంథరాజమునుబడసి సెలవుగొని, యింటికి వచ్చి, మాకీ మహోద్గ్రంథమును ఇచ్చి, అతిశీఘ్రకాలములో కార్య క్రమము నుపక్రమింప నానతిచ్చిరి ; ఆ పిమ్మట నేనును, తోడి భాషాసేవకులును శ్రీకర్షకమహర్షి వారి ఈ గ్రంథము చిత్తుప్రతి ననుస రించి, శుద్ధప్రతి నచిరకాలమున వ్రాసి, రాజమహేంద్రవరమునకు బోయి శ్రీకర్షకమహర్షి గారియెడల నత్యంత హితవిశ్వాసములు గలవా రును, శ్రీసత్యానంద ప్రెస్సు ప్రొప్రయిటరును, ఉదారభావపూరితు

ఃలును అగు శ్రీ ప్రాత్రుని రంగారావునాయుడుగారిని దర్శించి, వారి యొక్కయు; వారి ముద్రణాలయము పనివారియొక్కయు వాగ్దానమునుబడసి, నిర్ణీతధనముతోగూడ నీ మహాగ్రంథమును ముద్రణము నిమిత్తము గత నవంబరు యిరువదవతేదీని యిచ్చి, ముద్రణస్ఖాలిత్య దోషములనుగూడ పరిశీలించి పనిచేయుభారము వారియందేయుంచి మా పనులకై మాయిండ్లు చేరికొంటిమి; శ్రీ రంగారావునాయుడుగారును కూడ ఔదార్యముజూపి ముద్రణవేతనము (అచ్చుకూలి) లో సగము మాత్రమే తీసికొనుటకును గ్రంథముద్రణము, బైండుపనియు నలు బదియైదు దినములలో చేసియిచ్చుటకును వాగ్దానముచేసి, అట్లే నెల దినములకు బూర్వమే గ్రంథముద్రణము పూర్తిచేయించి, శ్రీకర్షక మహర్షిగారి ఉపోద్ఘాతమునకు వేచి, వేచి, యుత్తరములు వ్రాయుచుండిరి; శ్రీవారు ఆరోగ్యమునకు దప్పియున్నకారణమున, సమయమునకు దన ఉపోద్ఘాతమును వ్రాసి పంపలేకపోయిరి; శ్రీవారి యుపోద్ఘాతము లేనిది గ్రంథముద్రణము పూర్తిచేయుటకు మేమును ముద్రణాలయమువారును ఇష్టపడక, నేను స్వయముగా మాయింటికి విచ్చేసి యున్న శ్రీ చిద్ఘనానందస్వాములవారిని దోడికొని, శ్రీ కర్షకమహర్షిగారి దర్శనమునకుబోయి, వారితో నివ్విషయమును విన్నవించితిమి; మా ప్రార్థన సంగీకరించి శ్రీవారు అనారోగ్యమువలన కూర్చొని వ్రాయ వలనుగాక, నన్నును పైని వ్రాసిన స్వాములవారిని వ్రాయ నియమించి, ఒకగంటకాలములో నాశువుగా దన సంగ్రహోపొద్ఘాతమును జెప్పి ముగించిరి; శ్రీవారి ఆ యమూల్యోపోద్ఘాతమును ఈ గ్రంథమందు మూలగ్రంథమునకు ముందటిభాగమున ముద్రింపించడమైనది; పైన వ్రాసిన ఆలస్యకారణమువలన మేమనుకొన్నంత శీఘ్రకాలములో నిమ్మహోద్గ్రంథమును ఆంధ్రలోకమున కర్పించలేకపోయితిమి.

యుద్ధము కారణముగ కాగితములకును, బైండు ప్రింటింగుసామా నులకును, ధరలు మిక్కిలి పెరిగిపోయినను, శ్రీ కర్షకమహర్షి గారి లోకోత్తరాద్భుతసృష్టివిలాసభాసురమైన యీ మహాగ్రంథరాజము నెట్లో ముద్రింపించి, ఆంధ్రలోకమునకు సమర్పించి, ధన్యులమగుటయే మా యాశయమగుటవలన నట్లేచేయ మొదలిడి, ఎట్లేని చేయగలిగితిమి.

మాయీ మహోద్యమసిద్ధికిగాను శ్రీ శంబర గ్రామము రైతు సోదరులు ఏబదిరూకలును, చెముడు గ్రామనివాసులును, తీనుసామంతు వలన భూస్వాములును అగు శ్రీ బొంగు చిన్నన్నానాయుడు, నర్సన్న నాయుడుగార్లు అను సోదరులు ఏబదిఎనిమిది రూకలును విరాళముచేసిరి; శ్రీసత్యానంద ప్రెస్సు ప్రొప్రయిటరుగారగు శ్రీ రంగారావునాయుడు గారు అచ్చుకూలి (Printing charge) లో సగముమాత్రము దీసికొని ఔదార్యమును జూపిరి ; వీరికందఱికి మా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు ; మఱియు నీ గ్రంథము రచింపఁబడిన కొలదిదినములలోఁ దనకు దానెవచ్చి, గ్రంథముద్రణమునకుగాను శ్రీ జయపుర వాసులు శ్రీ కెల్లా పేరయ్యగారు శ్రీ కర్షకమహర్షి గారికి నూటఁబదారు విరాళముచేసిరి ; వారికిని మా కృతజ్ఞతాపూర్వకనమస్కారములు ; వారర్పించిన నూటఁబదారువిరాళమును వజ్రధర్మవిజయగ్రంథసంపాదనార్థ ముత్తరహిందూదేశమునకు బోయి పర్యటనముసేయుచున్న శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారికి ప్రయాణపు వెచ్చములకుగాను శ్రీ కర్షక మహర్షిగా రొసంగిరి.

చక్కని కాలికోబైండును, సుమా రారువందల పుటలును గలిగి, ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున శాశ్వతోన్నతస్థాన మలంకరింపనున్న ఈ గ్రంథరాజమునకు అందఱకు అందుబాటగు నిమిత్తము రెండున్నర రూకలు మాత్రము వెలబెట్టి, ఆంధ్రమహాశయులందఱకు

సమర్పించు నుత్సాహముతో నున్నారము; ఈ గ్రంథవిక్రయము వలన లభించిన ధనమును దేశభాషాభిమానులు సేయు విరాళముల వలన లభించిన ధనమును గూర్చి, ఈ గ్రంథముయొక్క మొదటిభాగమును, శ్రీ కర్షకమహర్షిగారు రచించినట్టియు, రచింపనున్నట్టియు తక్కిన గ్రంథరాజములను ముద్రింపించి ప్రచురించుటకును, తన సర్వస్వమును సమర్పించి శ్రీ కర్షకమహర్షిగారు స్థాపింప నున్నట్టియు, సాలునకు రెండువందలాదాయము వచ్చు భూములు సమర్పించి, మా పితృదేవు లిద్దరు తమశక్తికొలది తదభివృద్ధికై పాటుపడనున్నట్టియు, కృషికళాశ్రమ నిర్వహణమునకును ఉపయోగింపఁ బడును.

"లోకోత్తరకవితాకళాస్రష్ట, ఆంధ్రజ్ఞానజ్యోతి, ఆంధ్రజ్ఞాన భాస్కరుడు" అని మహాపండితవరేణ్యులగు శ్రీ కృష్ణమూర్తిశాస్త్రి ప్రభృతులచేతను, "వీరి యీ గ్రంథరాజమును దిలకించిన మహాత్ములు వీరి అద్భుతశక్తికి బరమాశ్చర్యభరితులు కాకపోరు; భారత సాహిత్య సరస్వతికి ఈ గ్రంథరాజ మొక నవీనాలంకార మనుట అతిశయోక్తి కాదు; కేవల మస్థిపంజరమై యున్న యీ మహావ్యక్తి హృదయ కుహరమునుండి, యీ గ్రంథరత్న మెట్లు ద్రవ్రుతమాయెనో యనియు, నొక్క మనుజమాత్రుని బుద్ధి యింతకున్ బరిణతిన్ గాంచెనా యనియు సందేహ మగుచున్నది".......అని మహాకవిసత్తములగు శ్రీ రామకవి మొదలగు వారలచేతను బ్రశంసింప బడుచున్న శ్రీ కర్షకమహర్షిగారి అద్భుతకల్పనాభరితంబైన యీ గ్రంథరాజమును విమర్శించి వ్రాయుట నా బోటులకు శక్యముగాదు; కావున ఆ విషయమునకు బూనికొనుట మానితిని; ఈ గ్రంథరాజప్రాశస్త్యమును గూర్చి సంగ్రహముగా విమర్శించిన శ్రీ చిద్ఘనానంద స్వాములవారి "విమర్శసూచిక" ను మాత్ర మొందు జేర్పడమైనది; శ్రీ కర్షకమహర్షిగారి ఆజ్ఞ ననుసరించి, మా పితృదేవులగు శ్రీ రామునాయుడు శ్రీ పారన్ననాయుడుగార్ల చిత్రపటములు

లను, ఈ గ్రంథమునకు సంబంధించిన మూలగ్రంథభాగమును గూడ నిందు జేర్పడమైనది; మఱియు నీ గ్రంథప్రాశస్త్యమును గూర్చి, చక్కని దృష్టితో విమర్శించిన పండితోత్తముల సదభిప్రాయములను, విమర్శలను ఈ గ్రంథము రెండవ ముద్రణ జేర్పడమగును.

## —♦ సంప్రార్థనము ♦—

లేఖకప్రమాదజనిత దోషంబులతో బాటు, గ్రంథ మతిశీఘ్రకాలమున ముద్రింపనైనకారణమున అచ్చుటచ్చుట అచ్చుతప్పులు కూడ దొరలినవి; వాని నన్నింటిని జేర్చి, గ్రంథము చివరభాగమున జేర్పడమైనది; పాఠకమహాశయు లవ్విషయమును గమనించి, మఱి చదివికొనఁ బ్రార్థితులు.

ఇట్లు బుధజనవిధేయుడు,
పెంట నారాయణమూర్తినాయుడు,
కవిరిపల్లి—సాలూరు తాలూక,
విశాఖపట్టణము జిల్లా.

శ్రీ ర స్తు.

శ్రీ గోపాలస్వామినే నమః.

# గ్రంథకర్తృ విజ్ఞప్తి.



శ్లో॥ పృథ్వీ రేణు రణుః, పయాంసి కణికా, ఫల్గుస్ఫులింగో లఘు
స్తేజో, నిశ్వసనం మరుత్, తనుతరం రంధ్రమ్ సు సూక్ష్మం నభః,
క్షుద్రా రుద్రపితామహ ప్రభృతయః, కీటా స్సమస్తా స్సురాః
దృష్టే యత్ర స తావకో విజయతే భూమావధూతావధిః ॥

(ముకుంద స్తోత్రమాలా)

(ఓ ప్రభో! నీయవాఙ్మానసగోచరానంతమహామహిమావిశిష్టావధియం, దసంఖ్యేయచరాచరాత్మక ప్రాణికులసంకులమైన, యీ భూగోళ మొక రేణుప్రాయము; మహాసముద్రములు స్వల్ప బిందుమాత్రములు; అపారమైన తేజోమండల మొక చిన్నమిణుఁగురు; అమేయశక్తిసంభృతమైన వాయుమండలము నిశ్వాసనహ స్రాంశము; అనంతకోటి గ్రహనక్షత్ర తారామండలావృతమైన గగనమండల మొక సూక్ష్మరంధ్రము; సృష్టిక్షయకర్త్రాదులు క్షుద్రతములు; దేవగణములు కీటకోపమములు).

అఖండ వైచిత్ర్యబంధురం బగు మహావిశ్వసృష్టి యపారము, ననంతము, నవాఙ్మానసగోచరము, నిరంతరపరిణామ శక్తి సంభృతము; విశాల విశ్వావధి యందు భూగోళ మొక పరమాణుప్రాయము; భూగోళమున కతిసన్నిహితస్థము లగు నవగ్రహగోళంబులే కాక, యింకను ౨౮౦౦ సంఖ్యను మించిన మహాగ్రహోల్పగ్రహములు సౌర కుటుంబమునఁ గలవు; సౌరకుటుంబమునకు సరి యగునవియుఁ, బెద్దవి

యగుచవియు గ్రమహాగోళములు పెక్కువేలకోట్ల సంఖ్యకు మించి యున్నవి; వీని కన్నను మహత్తరములగు ననంతకోటిగోళము లతి దూరమందుఁ గలవు; క్షణమునకు ౧౮౬౦౦౦ మైళ్ల వేగమునఁ బ్రయాణము సేయు కాంతికిరణ మతిదూరస్థములగు మహాగోళములనుండి మన భూగోళమును జేరుటకుఁ బదియేను బదియారువందలకోట్ల సంవత్సరములు పట్టు నఁట; ఇంతకన్నను మిక్కిలి దూరస్థములై, యెంతయేని సున్నితమగు దూరదర్శిని సాయమునఁ గూడఁ గానరాని మహాగోళము, లింకను మూడు పాళ్లు కలవని సుప్రసిద్ధ జ్యోతిశాస్త్రజ్ఞు లూహించుచున్నారు; ఇవ్విషయమును "పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదూర్ధ్వమ్ ఉదైత్పురుషః" అని భారతీయశ్రుతికూడ వాకొనుచున్నది; ఇట్లపారము, నఖండము, నతర్క్యము నగు మహావిశ్వ ప్రవృత్తియం దొక్కెడఁ గొన్నిలోకము లుద్భవించుచుండుటయు, మఱియొక్కెడఁ గొన్నిలోకములు నశించుచుండుటయు, నింకొక్కెడఁ గొన్నిలోకములు యథాపూర్వము ప్రసరించుచుండుటయు నగుచున్నది; ఇట్లు విశ్వప్రవృత్తి యందు లోకములు, మహాలోకములు పుట్టుచు, వృద్ధిఁ గాంచుచు, నశించుచుఁ బరమసృష్టికి మూలములయిన ప్రకృతిపురుషుల మహాలీలలను వ్యక్తము సేయుచున్నవి; "ప్రకృతిమ్ పురుషం చైవ విద్ధ్యనాదీ హ్యుభా వపి" (గీతాశాస్త్రము) అనాదులగు ప్రకృతిపురుషుల లీలాలసితంబును, ననంతకోటి దృశ్యాదృశ్య మహాగోళములలో నణుప్రాయంబును, నఖండమహాకాల ప్రమాణంబున క్షణికంబును, నై మన భూగోళంబును వెలయుచున్నది; దీని యందుఁ బెక్కు జాతులుగను, తెగలుఁగను విభజింప నగుచున్న అనంతకోటి చరాచర ప్రాణివర్గములు స్వస్వ వ్యాపార నిమగ్నంబులై, సృష్టి లీలా ప్రవృత్తి ధర్మమును, బ్రకటింపుచున్నవి; అతిసూక్ష్మతరమగు జీవాణు మొదలుకొని, అత్యుత్తమ ప్రాణి కోటినాఁ బరిగణింప నగుచున్న, మానవ జాతివఱకున్ గల, చరాచర చేతన వర్గము లన్నిఁటి

యందును, ఆహారము, నిద్ర, సంతానప్రాప్తి మొదలగు కర్మంబులు ప్రవృత్తి ధర్మంబులై యున్నయవి; మానవేతర ప్రాణికోటు లన్నియుఁ బ్రకృతి ననుసరించికొని, స్వ స్వ ప్రవృత్తి సూత్రంబుల కనువుగ మెలంగుచు, వివిధపరిణామ దశలఁ బ్రాపించుచుఁ, బురోగమనంబునై మానుషంబుఁ బడసి, సిద్ధిఁబొందుచున్నవి; మానుషంబును క్రమపరిణామంబునై, నింకను ననేక సిద్ధులన్ బడయుచుఁ, బరమగతిన్ (ముక్తి) బ్రాపింప నై యుండును; "అనేక జన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్" అని శాస్త్ర ముద్ఘోషించుచున్నది; జీవాణువు మొదలుకొని, మానవకోటి పర్యంతముఁగల యనంతకోటి ప్రాణివర్గముల క్రమ పరిణామసిద్ధాంతము, నంగీకరించు నాధునిక పాశ్చాత్య తత్వవేత్తలుఁలోఁ గొంద ఱీ శాస్త్రవాదము నంగీకరింపక, యుక్తివాదంబు నాశ్రయించికొని, సందేహగ్రస్తు లగుచున్నారు. కాని యిట్టి ఉధిక ప్రకృతి శాస్త్ర సిద్ధాంత రహస్య చర్చా పరిశ్రమమూలమున నేని, యథార్థము గ్రహింపఁ గలిగి, వారు మీఁదఁ బేర్కొన్న భారతీయ శాస్త్రవాదము నచిరకాలమున నామోదించి, లోకమునకు మహోపకారము సేయుదురను విశ్వాసము కలదు; ఇవ్విషయమును విపులముగఁ జర్చించుచు, నెంతయేని వ్రాయనున్నది, కాని నాబోటులకది సాధ్యముకాదు.

సీ॥ మహితమహోఽవ్యక్తమహదహంకారతన్మాత్రభూతపరిణామ దశ
నుండి, । "స్త్రీ జాతి" "పురుషజాతి" యను లింగవిభేదసరణి
నొప్పెడి లోహజాతినుండి, । యాహారనిద్రాభయసుఖదుఃఖాద్యవ
స్థల నెసంగెడి వృక్షజాతినుండి, । బహువిధేంద్రియమనః పరిజ్ఞాన
శక్తివశస్థికిన్ దగు మృగజాతినుండి,
కరముఁ బెంపెసంగి, క్రమపరిణామయోగ
గమున సకలశక్తికలితమై, స
మస్తవిశ్వవస్తునిస్తులసారప్ర
శస్తమునయి, మానుషంబు బొలచు.

ఈ మానుషంబు మృగత్వంబునకును దేవత్వమునకును నడుమ దిద్దె యలరారుచున్నది; దీనికిఁజెందిన ప్రతివ్యక్తియు, సర్వతంత్ర స్వతంత్రనామమహిమా ప్రవాహంబునకుఁ గాల్వయై, ప్రకాశింప నవకాశంబు కలదు; అపారవిశ్వసృష్టి లీలాభిరామయగు ప్రకృతిదేవియు, మానుషంబునకుఁ జెందినవ్యక్తికి విధేయయై, దాసివలెఁ బనుపులుసేయ, నిరీక్షించుచుండును; ఇట్లనంతకోటి మానవేతర సకలప్రాణివర్గంబులను దన యాజ్ఞయందిడికొని, పాలించుచుండు ప్రకృతిదేవికి నాజ్ఞ వెట్టన్‌జాలు మహిమగల మానవుండు స్వేచ్ఛమైఁ బ్రవర్తించుచుఁ, దదనురూపఫలంబులఁ బడయుచుండును.

ఆహారము, నిద్ర, సంతానాభివృద్ధి జేసికొనుట మొదలగు వ్యాపారంబులు ప్రకృతిచేతఁ బాలింపనగుచున్న ప్రాణికోటులందుఁ బ్రవృత్తిధర్మంబులు; వ్యక్తిగతంబులు; అవియే మానవకోటియందు సంఘగతంబులై వెలయుచుండును; మానవుండు సంఘజీవి; కావుననే "శ్లో॥ నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః। శరీర యాత్రాఽపి చ తే న ప్రసిధ్యే దకర్మణః" అని కర్మయోగమును శాస్త్రము విధించుచున్నది; మానవేతరప్రాణికోటులలో నేకారణముననైన, నెన్నఁడేని, నేవ్యక్తియేనిఁ, దన ప్రవృత్తివ్యాపారముల నుడుగుట కానము; అరుదుగా నెన్నఁడేని నట్టిది సంభవించెనేని, నా వ్యక్తియే తత్ఫల మనుభవించును; కాని మానవకోటియందది యంత మాత్రనఁ బోవక, సంఘమునకంతకును గీడేనిఁ, గాక మేలేని, సేయుచుండును; అది యట్లగుటన్‌జేసి శాస్త్ర మట్లు విధించుచున్నది; అయినవేమి? స్వపురోఽభివృద్ధికిని, సంఘమునకును హానికరమగు ప్రవృత్తివ్యాపారత్యాగరోగము (సోమరితనము) దురదృష్టంబున మానవకోటియందుఁ బెరుగుచునేయున్నది; అశక్తులగు వృద్ధులందును, రోగులందును గొంచెముగను, సోమరులందు సాలుగను, దానికిఁ దావు

లభించుచున్నది ; వృద్ధులును, రోగులును నివ్విషయంబున నిందింపఁబడరు : కాని సోమరులు నిందింపఁబడక తప్పించుకొనజాలరు; పరాన్నపుష్టంబులగు బదెనికలవంటి హీనప్రాణులు తేనికేని నుపకరించుట కలదు ; కాని మానవకోటి కంతకును జేటుఁదెచ్చునీ సోమరు లెందులకును గాక పోవుచున్నారు ; ఇట్టి నీచవ్యక్తులనుగూడ భరింపనగుట, మానవకోటి దురదృష్టమె ; కాక మఱి యేమననగును ?

సుమారు మూడు నాలుగేండ్లకుఁబూర్వు, మేడెనిమిదేండ్లకాలము నేను గ్రహణీరోగమునకును, గక్కువ్యాధికినిఁ, దీవ్రజ్వరమునకును బాలై, యన్నింటికిన్ దప్పి, మంచమునట్టి తపించుచుంటిని ; పెక్కు గండములతోడనే దినమేగుచుండెను ; నాఁడార్థికంబులగు పెక్కు చిక్కులును, వాని ననుసరించి మానసికంబులగు పీడలును, వేధించుచుండెడివి ; కేవలము భూమిదేవికి బరువుపొంటెఁ, గటికిమొండి ప్రాణము మోసికొనుచు, నిట్లేలనుండనయ్యెనే ? యను సంతాపమును, దానికి మించిన నిరాశయును, నా కష్టాదు దుస్సహాంబులగుచుండెను ; పలువురు ప్రాచ్యపాశ్చాత్యవైద్యుల చికిత్సలును ప్రయోజనకారులు కాక పోయెను ; ఇట్లు కొంతకాలము గడచెను, పిమ్మట గాంధీమహాత్ముని దివ్యోపదేశము ననుసరించి, గురుదేవుని తొంటి దివ్యవాక్కును స్మృతిపథంబునకుఁ దెచ్చికొని, నాకు నేన ప్రకృతిచికిత్సఁ జేసికొన నారంభించితిని ; దానివలన నొకించుక గుణము గన్పట్టుచుండెను ; కాని “ రోగమువలని నిశ్శక్తి ” యని కాని, “ సోమరితన ” మన్నికాని, చెప్పనైన మాంద్యమును, దానివలన నిరుత్సాహమును, నన్నప్పుడలమికొనుచుండెను ; ఆ “ నిశ్శక్తి ” లేక “ సోమరితనము ” ననఁబడు ఆ మాంద్యమును బోఁగొట్టికొన, నెంతయేనిఁ బ్రయత్నించుచుంటిని ; కాని యేపనియు దోఁపకుండెను ; కులవృత్తియగు కృషికిఁ

చెప్ప, నే నెందులకును గొఱగాకపోవుట నిక్కువము ; కాని దానికిఁ దగునంతటి దార్ఢ్యములేదు ; కావున యేదేనిఁ జిన్నపొత్తము నల్లికొనుచు సోమరితనమునుండి తప్పికొనఁ బ్రయత్నించితిని ; కాని గ్రంథరచన నాతలకుఁదగిన పనియేనా ? కాదు ; కావున నిరుత్సాహమున కగు చుంటిని ; అయినను నా పరమమాతయగు లలితాంధ్రవాణీమాత మప్పు డప్పుడు నా యాత్మన్ దట్టుచుఁ, గ్రంథరచనకుఁ బ్రేరేపించు చుండెను ; కాని నా యశక్తతయందలి సంపూర్ణవిశ్వాసముపై, నొక్క పద్యమేనియుఁ గూర్ప వెఱచుచు, మెల్లమెల్లన సోమరితనమున కల వడిన నే నప్పని కియ్యకొనకుంటిని ; ఆ పిమ్మటఁ గొంత కాలమట్లుసన, గత ధాతృసంవత్సర శ్రావణమాసమునఁ, 'దొంటికన్నను వేయిపాళ్లు పెఱిగి, మరల రోగ మలమికొని, కంఠగతప్రాణునిఁ జేసివైచినది ; బ్రదుకు చావుల నుయ్యాలలూఁగుచున్న యాకష్టకాలమందే, అనఁగాఁ పౌర్ణమినాఁటిరాత్రి, హిమాలయమందుఁ దపంబుసేయుచున్న మద్గురు స్వామి నా యాత్మన్‌దట్టి "భయమువలదు ! కృతిరచనఁ గావింపుము! శ్రీ లలితాంధ్రవాణి నీకున్‌దోడ్పడి తాన సర్వమును నిర్వహించి కొను" నని యాదేశించి విడచిపుచ్చె ; పిమ్మట యించుకించుక నారోగ్య మొడగూడుచుండెను ; కాని తలకుఁబోలని గ్రంథరచనా భారము వెట్టిన గురుదేవుని యాదేశమునకు వెఱచుచు——

ఉ. ఎక్కడివాఁడ ? నేఁ జెడితి నెల్లవిధంబుల ; గ్రంథసృష్టి నా
నెక్కడ ? నా కొలందులకు నింతటికార్యము సేయఁ బోలునే ?
నెక్కొన నేలనిల్పెనను నీచుని నిప్పని కేమి సూచి తా
నక్కరుణామయుండు గురుఁ డంతయుఁ దాను నెఱింగి యుండియున్ ?

అనియును.

చ. కలరు మహాకవీంద్రులు, జగన్నుతకావ్యకళానిధుల్, సము
జ్జ్వల ధనదేహబుద్ధి బలశాలులు ; వారికె సెల్లుఁగాక ! నా

తలకిది వోలునే సముచితంబయి యార్షకృతి ప్రకల్పనా
కలనము ? కుక్కపిల్లమెడఁ గట్టుదురే మణిమాలి నెవ్వరున్ ?

అనియుఁ బెక్కువిధంబుల వితర్కించికొనుచు, గురుదేవుని ప్రభానం బనిర్వాచ్యంబనియు, నమ్మహాత్ముం డేమితలంచియో ? తలకుఁబోలని పనిసేయ నన్ను నియమించెననియుఁ, దదాజ్ఞోల్లంఘనం బకార్యంబనియు, నెట్లైన నీయక తప్పదనియు, నేమైన నైన నది యగున్‌గాక ! యనియుఁ దుదకు లేనియుత్సాహంబుఁ గల్పించికొనియు మరలఁ గళవళపాటునకై ——

తే. లోకమున కించుకంతయుఁ గాకపోయి
తింత ; కిప్పుడు శక్తిలే ; దిట్లు తెవుళు
లణఁప, దైన్యంబు గలఁప, హైన్యంబున కయి
బ్రదుకుచున్నాడ భూమికి భారమగుచు.

తే. హైన్యదైన్యంబులకు సాల నగ్గమయ్యు
నొకతెఱంగున ధృతినూఁది, యుందుఁ ; గాని
కృతిరచన నాకగునె ? యేఁటికిన్‌గురుండు
నిప్పనికి నన్ను నియమించె ? నేమిసూచి ?

అనియు మనంబు నొవ్వఁబలికికొని, నాపరమమాతయగు లలితాంధ్రవాణి మహామహిమన్‌గూర్చి విచారించి, మరల నుత్సాహంబు గల్పించికొని——

తే. అమ్మ ! లలితాంధ్రవాణి ! నా యాత్మయున్ శ
రీరమును నీకు మున్న యర్పించికొంటిఁ ;
జేసికొంటిని నీపాదసేవ బాల్య
మాదిగా నేఁటిదనుక ననన్యభక్తి——

తే. అన్నిఁటికిఁదప్పి ; తిప్పు డిప్పైతి ; దీని
కించుకంతయు నేనిఁ జలింపఁ ; గాని
గురుఁడు నా కాజ్ఞనిడెఁ గృతిఁగూర్ప నేమి
తలఁపుఁ బట్టిరొ నీకు సాధ్యంబ యనుచు.

క. అన్నిఁటికి నమ్మహాత్ముఁడు
నిన్ను ప్రశంసించి, పేర్కొనియె "గతి" యనఁ, "జే"
రన్నను నా కీవయనుచు ;
నెన్నికొనియె నీ ప్రభావమెంతయు మఱియున్.

క. నాతల కృతిరచనకు నగు
నే ? తల్లీ ! నీ వెఱుంగవే ? గురువరుఁ డే
మ్మోతలఁచి యాజ్ఞ వెట్టెన్
గౌతుకమున నన్నెఱిఁగియును గాదన కిమ్మై.

తే. అమ్మహాత్ముని కప్పు మా జాడ నోడి,
"యన్నిఁటికి నీవ కల" వను నాస వచ్చి,
తిమ్మెయిన్ నీకునై విన్నవించికొందుఁ,
బిల్లనికి నంతకున్ దిక్కు తల్లి కాదె ?

తే. నాకు నీ కల మొకసాధనంబు ; నేను
నీకు నొక సాధనమ ; యిది నిజము ; నీవ
కూర్చికొనుము మహాకృతి ; గురుని కోప
మునకు నన్పాలుసేయ కమోఘ దీక్ష.

తే. చక్కఁ జే వ్రాలు నిడనేని సాలని నను
సాధనము మాత్రముగఁ గొని జగము పొంగఁ,
గృతిఁ బ్రసాదింపు మమ్మ ! "నన్నింత శ్రమకుఁ
బాలుసేయుదె" యని కోపపడకు మమ్మ !

తే. ఏమిసేయుదు? గురు నాజ్ఞ కెదిరి వల్క-
నగునె? నా తప్పు సైరింపు! మఖిలలోక
మునకు నీ దివ్యమాహాత్మ్యమున్ బ్రకటన,
మగుట కిది యొక మిష కాదె? యరయ వమ్మ!

అని వేడికొని—

తే. తొంటి కవిరాజులకుఁ గూర్చు దొడ్డప్రభువు
లెందఱేనియు సత్కీర్తికెక్కి, ధన్యు
లైరి; నీ వా కవీంద్రుల, కా ప్రభువుల
కెల్లఁ, బరమప్రమాణమై యొసఁగి తప్పు.

సీ. కవులు, మహాకవుల్, గవిసార్వభౌములుఁ, గవిరాజులుఁ, గవిశేఖ
రులు నేఁడు। కవికోకిలలు, మఱిఁ గవిసింహులును, గవిభూషణుల్,
గవితాప్రభువులు, వివిధ। పత్రికాధిపతులుఁ, బండితోత్తములు,
విమర్శకాగ్రేసరుల్, మహితబుద్ధు। లగు మహోపాధ్యాయు, లఖిల
తత్వజ్ఞులు, దేశభక్తులు, జగద్ధితపరాయ
ణులు, మహోదారులును, గృషీవలశిరోమ
ణులు సదాచారఘనులు, నార్యులు మతాధి
పతులు, నవధూతలుఁ, బరమభాగవతులుఁ,
దల్లి! నీ పుత్రు లెందఱేన్ ధన్యతములు.

తే॥ తొంటి నీ పుత్రులకుఁ సముల్, దొడ్డవారు,
ఘనులు, వీరంద; ఱల్పులు కారు; నిజము;
కడుపు సల్లగ వీరలఁ గాంచి; తెంత
మంచితల్లివి? ని న్నెన్న మాకు వశమె?—

అని లెన్నఁ బలికి, మనంబున స్థైర్యం బలవరించికొని, అంత
కంతకు నాయం దలమికొనుచున్న సోమరితనంబు వాపికొనుటకును,.

పేరుమాత్రన గుర్వాజ్ఞ నెఱపికొనుటకును, నా పరమ పరిసరములై, వాఙ్మయప్రపంచమున శాశ్వత యశస్సంస్థానమున్ బడసి, తేజరిల్లు నాధునికకవిపుంగవులయు, విమర్శక శిరోమణులయుఁ, బండితాగ్ర గణ్యులయు, మహనీయప్రభావంబు నూఁతకోలఁగఁ గొని, గత ధాతృసంవత్సరము నధికభాద్రపదశుక్ల ద్వితీయా గురువాసరంబునఁ, గ్రంథరచన కారంభించి, కొలదిమాసములలో నెల్లని మూలగ్రంథ మందలి ప్రథమఖండము రెండుభాగములను, రెండు కృతులుగఁ గూర్పఁ గలిగితిని; నన్నొక సాధన మాత్రముగఁ గైకొని నా పరమమాత యగు శ్రీలలితాంధ్రవాణియ యిక్కార్యము నిర్వహించె ననుటయం దావంతయు నసత్యదోషములేదు; అధమాధమ కోటికిఁ జెందిన యేన, యీ గ్రంథము రచించితినని, గొప్ప జెప్పికొనుచు, నెంతయేనిఁ బ్రకటించి కొన్నను, నన్నెఱింగినవా రెవ్వరును దానిని నమ్మరని నే నెఱుంగుదును; అయినను మాలిన్య దూషితంబగు కాచగోళంబునం దిడిన దీపకళికా కాంతిపుంజముమాసి, ప్రభావంబునకుఁ దప్పిన చందంబున, మందమతినగు నన్నొక సాధనమాత్రముగఁ గైకొని, యిమ్మహోద్యమమును నిర్విఘ్నముగ నిర్వహించికొనఁ బూనిన, నా పరమ మాత ప్రభావముఁ గూడ మాసి, యీ గ్రంథమందు పెక్కు దోషంబులు దొరలినవి; ఆ దోషంబుల నెల్ల నేర్చి, తొలఁగించి, తగుభంగి సవరించి, నా పరమ మాన్యులగు నాంధ్రవిద్వత్కవి పుంగవు, లా మహాదేవియెడల భక్తి సూపియుఁ నా స్పర్శదోషంబునఁ బ్రభావంబునకుఁ జెడిన యీ గ్రంథమునకుఁ దమహస్తస్పర్శంబునఁ బవిత్రతఁ గల్పించి, తమ మహాగ్రంథములతోఁ బాటు వెలయించియుఁ, బుణ్యముఁగట్టికొనఁ బ్రార్థితులు; పరమ మాతయగు లలితాంధ్రవాణిపేరుఁ జెప్పి, తప్పులఁ దప్పించికొను నుపాయంబుమై; యిట్లు ప్రకటించికొంటి, నను కొను వారి కొండనక,

ప్రణామము లర్పించికొని, దూరంబునకు తొలంగి సనుటయ నాకర్తవ్య మనియు విన్నవించికొనియెదను.

మఱియుఁ బైన పేర్కొనినట్లు స్వలోకసాధనముగఁ గైకొని, నా పరమ మాతయ యీ కృతి గల్పించినను, పేరునకు మాత్రము లోకంబు కట్టెదుట నిలిచి, నాలోపంబులను, దోషంబులను నివేదించి కొనుట నాకు విధి; కాన దానిన్ బాటించెదను.

ఈ గ్రంథమం దెల్లెడలను సరళ శకట రేఫలకు యతిప్రాసస్థానములందు మైత్రి పాటించుటయు, నఖండయతి వాడుటయు నైనది; వీనినిఁ గూర్చి పండితప్రవరులు తీవ్రముగ వాదోపవాదములు సేయు చున్నారు; ఆ యుభయపక్షము లం దేపక్షమునకును జెందినవాఁడను గాననియు, నట్లవి గైకొనుటకు నా యశక్తతయే కారణమనియు నివే దించికొను చున్నాఁడను; మఱియు నెన్నియేని ఛందోవ్యాకరణశబ్ద శాస్త్రాది నానాశాస్త్ర దూష్య దోషంబులును దొరలినవి; నా యెఱుంగమియు, నశక్తతయు వానికిఁ గారణములు; వాదముతోఁ బనిలేదు.

## —♦ మూలగ్రంథ ప్రశంస ♦—

మూలగ్రంథకర్త శ్రీ శశాంకమహర్షి; ఇతఁడు వేదాంకుఁ డను మహర్షికిని, అతఁడు పింగళాంకుఁ డను మహర్షికిని, అతఁడు జైమిని మహర్షికిని శిష్యులని గ్రంథాన్త శ్లోకమువలనఁ దెలియవచ్చు చున్నది; గ్రంథమంతయు సూత్రములతోడను, అచ్చటచ్చటఁ గొన్ని శ్లోకములతోడను గూర్పఁబడినది; సూత్రములు కేవలము సూత్రరూపమునకును, గద్యరూపమునకును దప్పి, మిశ్రరూపమునఁ గానవచ్చుచున్నవి; భాషయును, పాండిత్యమును, రచనాపద్ధతియు, విషయ వివరణమును, జరిత్ర కల్పనయు మొదలగునవి శ్లాఘ్య ములు కావు; కాని నిష్కపటముగను, నిరాడంబరముగను గ్రంథ

మంతయుఁ గూర్పఁబడె ననుటలో నావంతయు దోషము లేదు ; దాని భాషను బట్టియు రచనాక్రమమును బట్టియు, దాని చరిత్రమును నిర్ణయించుటకు నా కొలందులకు వలను కాదు ; మహాపండితులకే సాధ్యము ; దీనిని గూర్చి మద్గురుదేవులు కొంతవఱకు విమర్శించిరి ; ఆ విమర్శనము మొదటి భాగమునఁ జేర్పఁ బడినది ; ఆ గ్రంథ మచిర కాలమునఁ బ్రకటింపఁ బడు నన్న యాస యగుచున్నది ; కావున అవ్విషయమును గూర్చి విస్తరించి వ్రాయక విడిచితిని.

మఱియు మూలగ్రంథము మూఁడు ఖండములుగ గూర్పఁ బడినది ; మొదటి ఖండమును, మూఁడవ ఖండమును రెండేసి భాగము లుగ విభజింపఁ బడినవి ; మొదటి ఖండములోని రెండు భాగములు మాత్రము నే నాంధ్రీకరించితిని ; తక్కిన రెండవ మూఁడవ ఖండము లాంధ్రీకరింప నున్నవి ; నే నాంధ్రీకరించిన మొదటి ఖండములోని రెండు భాగము లొక్కసారి ముద్రింపించుటకు ధనము చాలక, ప్రక టనకర్తలు వీలరసి, మొదటి భాగమును విడిచి, రెండవభాగమునే ప్రస్తుతము ముద్రింపించి, ప్రకటింపఁ బూనికొనిరి ; ఆంధ్రమహా జనుల అనుగ్రహమునకు నోచికొని, మొదటి భాగమునుకూడ, అచిర కాలమున ముద్రింపించు ప్రయత్నము లోనే ప్రకటనకర్త లున్నా రని నివేదించికొనుటకు సంతోషమగు చున్నది ; ఈ కృతికి సంబంధించిన మూలగ్రంథమందలి మొదటి ఖండములోని రెండవభాగము పాఠక మహాశయుల పాఠసౌకర్యార్థ మీగ్రంథము ముందటి భాగమునఁ జేర్పఁబడినది.

## — ఆంధ్రీకరణము —

" తే. పెద్దలముగ విస్తరింపుము ! విస్తరింప

వలయు చోటుల జగతి కవసరములగు

విషయములఁ జేర్చి యీ కృతి; విస్తరణమ్ము
సముచితంబుగ నొప్పారు చందముఁ దగు.

తే. ఈ కృతి యవశ్యమున్ రచియింప నెంత
యేనిఁ దగి యున్నయది సుమీ! దీని యందుఁ
గల మహావిషయంబులు కావు గాథ;
లన్నియుఁ బరిగ్రహింప యోగ్యములె సాల".

తే. ఇంతసామర్థ్యము కలదే? యేఁటిగాథ?
"యెట్లునున్ దీనికిన్ జాల నే" నని వెను
కంజ వేయకు! కలరు మహర్షులు; మఱి
కలదు వాగ్దేవి; నీకునై కలరు కవులు.

క॥ నా యొాపినంతవట్టును
సేయుదు సాహాయ్య మే నుచితభంగి జగ
చ్ఛ్రీయంబుఁ గోరి నీకున్;
సేయుము! కృతి ధృతి మెఱయ నచిరకాలమునన్."

అను గురుదేవుల యానతి ననుసరించియు, నా యభిరుచిని బట్టియు, నా యశక్తతవలనఁ బలుగాథలన్‌బడియు మూలగ్రంథమం దలి విషయంబులను గొన్నిచోట్ల విస్తరింపనైనది; కొన్నిచోట్ల కుది యింపనైనది; "కుదియించుట యరుదె" యని చెప్పనచ్చును; మఱియు మూలగ్రంథములోని కథాంశమును దప్పిపోవుటయు, విడచు టయు లేదనుకొనియెదను; వృషభయుగళభూదేవీవనస్పతి స్తోత్రము లును, మూషక పిపీలికావనదేవతామండూకశశకర్షిపత్న్యుపన్యాసము లును, సూర్యోదయాస్తమయ వర్ణనాదులును, స్వతంత్రించి కల్పింపఁ బడినవి; మొదటిభాగమున రాజకవ్యుపాధ్యాయులన్ గూర్చి మూఁడు

దండకములును, ఈ గ్రంథమునఁ గర్గ్షకునిగూర్చి యొకదండకమును వ్రాయఁబడినవి; కృషివిషయము చాలవఱకు విస్తరింపఁబడినది; అందుఁ బ్రాచ్యపాశ్చాత్యవృక్షశాస్త్రములలోని కొన్నివిషయము లద నముగఁ జేర్పఁబడినవి; ఇదియు నదియు ననేల? మొత్తముమీఁద గ్రంథమంతయుఁ జాలవఱకు విస్తరింపఁబడినది; కొన్ని విషయనములు కల్పింపఁబడినవి; కాని మూలగ్రంథకథాంశములకు మించి, పోవుట లేదని మఱియొకసారి విన్నవించికొనుచున్నాఁడను; మూలగ్రంథమం దొక యక్షరమేనిఁ జేర్పకయు, గుదియింపకయు, విషయనములను గప్పి పుచ్చకయు, నా యోపినట్లాంధ్రీకరణము నడిపికొనుటయే, మూల గ్రంథకారునియెడ, నా చూపికొన్న కృతజ్ఞతయని, ప్రకటించికొన సాహసించెదను.

## ——♦ మిత భాష ణము ♦——

ఏ మహానుభావుఁ డించుమించుగ నైదువేలేండ్లకుఁ బూర్వము, రాజ్యపాలన ధర్మంబునకుఁ దప్పి నొకళ్లొకళ్ల మెచ్చక, యీసునకును, మత్సరంబునకును, గలహంబులకును, దుర్వ్యసనంబులకును, దురాశకును జొచ్చి, యొంపను, జంపను దలంపులువెట్టికొని, ధర్మచ్యుతికిఁబోయక, న్యాయమును బాటింపక, హింసాపాతకమునకు వెఱువక, శాంతికిఁదప్పి, చెలరేఁగి, ప్రజలను గలంచిపుచ్చు రాజలోకమువలనను, రాజశాస నంబులకు మాఱొడ్డి హైన్యదైన్యాశాంతి నిరాశలకుఁ బాలైన ప్రజ లను, ననువగుచోట్లఁ బ్రభువులను, బాధించుచు నిరంకుశముగ సొమ్ములుగొను దస్యులవలనను, బీడింపనగుచు, ధర్మంబునకుఁ దావు లేక సంక్షోభించు నీలోకమందు, ధర్మసంస్థాపనార్థ మవతరించి, జన్మ మాదిగాఁ గ్రూరులగు రాజులకును, దస్యులకును గర్భశత్రువై, పెక్కు డుములకుఁ బాలయ్యుఁ, జలింపక, పలువురు రాజులను, దస్యులను బరి

మార్చియు, బరిమార్పించియుఁ, బ్రజలకు భుక్తిముక్తు లలవడు మార్గము జూపి, స్వయముగను, బ్రతినిధులబంచియు, 'లోకమందెల్లెడల ధర్మసంస్థాపనముజేసి, తన సమకాలికులగు ,పరమర్షులచేత "జగద్గురు—యోగాచార్య—పరమపురుష—భగవాన్—పరమా—త్మావతార పూరుషాది" సార్థకనామంబులఁ బడసి, సకలమానవకోటి నుద్ధరించెనో? ఆ పరమప్రభువు—ఆ యాదిమమతప్రవక్త — ఆ పరమగోపాలస్వామి—ఆ కర్షకకులేష్టదైవము శ్రీకృష్ణభగవానుఁ, డీకృతికిఁ గథానాయకుఁడు; "పరిత్రాణాయ సాధూనామ్ వినాశాయ చ దుష్కృతామ్ । ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" యను తన ప్రతిజ్ఞను సక్రమముగ నెఱపికొన్న, యా లోకోద్ధారకుని, దివ్యచరిత్రము వేలకొలఁదిపుటలుగల సంపుటము లెన్నియేనిఁగూర్చి వ్రాసినను చాలదు; శ్రీ వివేకానందస్వామి నుడివినట్లు, కాంతాకనకప్రతిష్ఠాపేక్షగల మానవమాత్రులకది దుస్సాధ్యము కూడను; ఇది ఇట్టిదియైయుండ నాబోఁటి మానవకీటకము రచనంగూర్చి వేఱ వ్రాయనేల? ప్రాచ్యపాశ్చాత్య పండితప్రవరులలోఁ బలువు, రాజగద్గురుని గంభీర చరిత్రార్థగ్రహణమందు భ్రమప్రమాదంబులకు లోనై, యానాఁడాతని ప్రభావ "మొక్క భారతవర్షమందే వెలసె" నను సంకుచితాభిప్రాయములను వెలిబుచ్చుచున్నారు; ప్రాచీనభారతీయ గ్రంథకోటి నతి సూక్ష్మదృష్టితోఁ బరిశీలింతురేని వారట్టి సంకుచితాభిప్రాయములకు రాక, ఆ నాఁ డఖిలప్రపంచమందెల్లెడలను నా మహనీయుని ధర్మసంస్థాపన, మతివైభవముగ వ్యాప్తిఁగాంచెనని తెలిసికొనా నగుదురని వ్రాయ సాహసించుచున్నాఁడను; మూలగ్రంథమందలి మూఁడవ ఖండములోని రెండవభాగమందుఁగూడ, నివ్విషయచర్చకుఁ గొంత వఱకు సాక్ష్యము లభించుచున్నది; ఈసువట్టియో? కాక అజ్ఞానము వలననో? కాక మతేమికారణముననో? కొందఱు పాశ్చాత్యమతాచార్యులును, గ్రంథకర్తలును, వారి కాలిజాడ ననుసరించిన కొందఱు

భారతీయాంగ్ల విద్యాధికులును, ఆ శ్రీకృష్ణపరమాత్ముని పావనచరిత్ర మ్మును గూర్చి, సమచితాభిప్రాయములకు వచ్చుటయేగాక, తమకుఁ దోచినట్లు బలుకను, వ్రాయను సాహసించిరి; సాహసించుచున్నారు; వీరి వ్రాఁతలను స్వర్గీయ శ్రీబాలగంగాధర తిలక ప్రభృతి మహాపండితులు సవిమర్శముగ ఖండించిరి; కొందఱు మహామేధానిధు లప్పనికిఁ బూనికొనియున్నారని వినఁగల్గుటకును సంతసమగుచున్నది; కాని మహాపండితైకవేద్యమగు నప్పరమపూరుషుని గంభీరపావనచరిత్ర, మత్యల్పమతినగు నా పాలఁబడి, నా నీరసరచనాపంకంబున బ్రుంగి, తేజంబును, మహిమను గోల్పోయెనను భీతి యగుచున్నది.

ఇంతియగాక భారతహరివంశ విష్ణుపురాణ భాగవతములందును, మఱికొన్ని గ్రంథంబులందును, విష్ణు, నారాయణ, వైకుంఠ, లక్ష్మీనాథ, దేవదే, వాదిదే, వోపేంద్ర, మందరధ, రానంత, గరుడవాహ, నాఽప్రమేయ, బలిధ్వంసి, కైటభారాతి, మధుసూదనాది నామంబుల నవధరించు నగ్గీతాచార్యుఁడు "యాదవచక్రవర్తి, యాదవేశ్వర, యదువర్య, పురుషోత్తమ, యోగాచార్య, పరమయోగి, శ్రీకృష్ణభగవాన్, గోపాలదేవ, వాసుదేవాది" మితార్థసూచక మితనామంబుల నవధరింపఁ నగుచున్నాఁడు. మఱియు నాయల్పజ్ఞతవలన నాసకలలోకోద్ధారకుని దివ్యచరిత్రము విస్తరింపఁజాలకయు నాయభిరుచినిబట్టి ప్రాచీన భారతీయవాఙ్మయప్రపంచమున నతిశయార్థ బంధురంబులగు పెక్కుపదముల వాడకయుఁ, గథాసందర్భోచితంబులగు కొన్నిపదంబులవాడియు, నమ్మహాత్మునియెడల, నపచారదోషంబున కైతినేమోయని వెఱచుచున్నాఁడను; ఇదియే యప్పరమాత్ముని యెడల నా మితభాషణము.

## —♦ ప్రత్యేకసాంత్వనోక్తి ♦—

మానవకోటి పరమప్రయోజనమును, పరమార్థమును, భుక్తియు, ముక్తియు నను రెంటికిఁ జెంది, గాపులవలనను, ఉపాధ్యాయుల

వలనను సిద్ధింప నై యున్నవి; ఇట్లు సకల మానవకోటి భుక్తిముక్తుల కగుచుండు వీరిప్పుడు ప్రభువులయుఁ, బ్రజలయు నాదరంబునకున్ను, గృతజ్ఞతకును గాక, పెక్కిడుములకుఁ బాత్రై, దిక్కుమాలియు, నుక్కియు, నున్నవారనుచున్నారు; వీరినిఁ దేర్పఁ బాటుపడు పుణ్యాత్ము లరుదుగ నున్నారు; అట్లరుదుగనున్న యీ పుణ్యాత్ములును వీరి విష యమై పట్టుబట్టి, పాటుపడుట లేదు; పసరంబు లట్లును, శవంబుల పోలికను అతిహీనముగఁ జూడఁ బడు నీ కర్షకోపాధ్యాయవర్గముల గోల, నిన్నఁటి మొన్నఁటి దనుక నెవ్వరి చెవికేనియు నెక్కుటలేదు; ఈ గ్రంథమందు వీరి వలన నగు ప్రయోజనంబున్ గూర్చియుఁ, బర మార్థంబున్ గూర్చియు, నెక్కువగ వ్రాయఁ బడినది; కాని వీరి యెడల నగుచున్న ప్రభువుల పరిపాలనాఽన్యాయంబును, బ్రజల ప్రవర్తనాఽన్యాయములను విమర్శించుచు, వ్రాయ వలను పడినది కాదు; ఈ గ్రంథము స్వతంత్ర రచనా పూరితము గాక, అనువాద గ్రంథ మగుటయే దీనికిఁ గారణము; మొదటి భాగమున శ్రీ నాగా వళీనదీస్తోత్రము, శ్రీ లలితాంధ్ర వాణీస్తోత్రము అను ఘట్టముల్లలోఁ గొంతవఱకు మాత్రము చర్చింపఁ బడినది; ఆ గ్రంథము నచిరకాల మందే ప్రకటించు ప్రయత్నమందుఁ, బ్రకటనకర్త లున్నా రని మరల నిచ్చటఁ దెలిపికొనుచున్నాఁడను.

## —♦ గ్రంథప్రకటనాలస్యకారణము ♦—

ఆంధ్రమహాజనుల యనుగ్రహము వలనను, శ్రీ లలితాంధ్ర వాణీప్రసాదము వలనను, మొదటి భాగముతోఁ గూడ నీ గ్రంథ మచిరకాలమందే కూర్పవడినది; ధనాభావము వలన ముద్రణకార్య మసాధ్య మాయెను; గ్రంథ ముద్రణ కార్యము విషయమై, యొరుల సాయముఁ బడయను నా కష్టి దసాధ్యమాయెను; ఈ విశాల ప్రపంచ మందొకమూల నే పేరున్ బెంపును లేకయు, నిరంతరానారోగ్యము .

వలన నే ప్రచారమునకును గాకయు, నొకమూలఁ బడియున్న నాపేరుఁ దడవికొని, తమకుఁ దారె వచ్చి, గ్రంథముద్రణమునకు భూరి విరాళము సేయు వారెవ్వరు ? కావున గ్రంథము సరిజేసికొని, శుద్ధప్రతి వ్రాయునేని, నా కా నాఁడు మనసు కాకుండెను ; పిమ్మటఁ గొంత కాలము సనఁ, గొండొక కార్యవశమున చెన్నపురి ప్రాంతమునుండి మహావిద్వత్ప్రవరులును, బరమ జ్ఞానధనులు నగు శ్రీ పేరి రామకవి గారు మా ప్రాంతము విచ్చేసి, పేరు విని నన్నున్ బల్కరింప వచ్చి, నా గ్రంథమంతయుఁ బఠించి, తన సంతసమును వెలిబుచ్చి, గ్రంథ ప్రకటన కార్య మాలోచించి, యీ గ్రంథమందలి కొన్నిఘట్టము లేర్చి, కూర్చి, వ్రాసి ఆంధ్ర కృష్ణా వాహినీ జమీన్ రైతు పత్రికల కంపిరి ; కాని ఆంధ్ర కృష్ణా వాహినీపత్రికలు ప్రకటన కియ్యకొనక, మూకీభావము వహించెను ; ఔదార్యముఁ జూపి, జమీన్ రైతుపత్రిక మాత్రము ప్రతివారమును గొంతవఱకుఁ బ్రకటింప నియ్యకొని, తన యామోదమును సూచించుచుఁ బ్రత్యుత్తరము వ్రాసినది ; దానికి సంతసించి, యమ్మహా విద్వాంసుఁ, డాంధ్రాంగ్లము లం దించుక పరిశ్రమము చేసిన శ్రీ కలుపూరి వేంకటనారాయణగా రను యువకుని, గ్రంథప్రకటనకు నియమించి, తద్విధానము నెఱింగించి, ౨౫ ౬-౧౯౩౭ తేదీగల్ల జమీన్ రైతు పత్రికలో నన్నుఁ గూర్చి, యతిశయోక్తులతో నొక వ్యాసమును వ్రాసి, వెడలి పోయిరి ; శ్రీవారి యాజ్ఞ ననుసరించి పైన వ్రాసిన శ్రీవేంకటనారాయణ గారు వారమున కొకటి చొప్పున రెండుమూడు నెలలవరకు జమీన్ రైతు పత్రికలలో నీ గ్రంథమందలి కొన్నికొన్ని కథాంశములను బ్రకటించిరి ; పిమ్మట వారి సొంతపనుల తొందఱల వలన నీ పనిని విరమించిరి ; శ్రీ జమీన్ రైతు పత్రికాధిపతిగారు వ్యాసములను బంపుఁడని మరల మరల వ్రాయుచుండిరి ; కాని మఱి యీపని కెవ్వరును బూనికొన రైరి ; ఇట్లు రెండు మూడేండ్లు గడచినవి ; ఆ రెండేడ్లకాలము నడుమను మా గ్రామ

మునకుఁ బది క్రోసుల దూరమునఁ గల కవిటిపల్లి గ్రామనివాసులును, మాతుల బంధువులును, ఉదారభావపూరితులునగు శ్రీ పెంట రాము నాయుడు శ్రీ పారన్ననాయుడు గార్లు తమ పుత్రులును, ఆంధ్రగీర్వాణ విద్యాప్రియులును, సంగీతకళాభిజ్ఞులును, యువకులును, కార్యదక్షులును అగు నారాయణమూర్తినాయుఁడు గారిని, నా యొద్దకుఁ దఱచుగ నంపించుచు, గ్రంథముద్రణకార్యమునఁ దుది వఱకు సాయము స్సేయుదుమనియు, గ్రంథముద్రణమున కారంభింపుఁడనియుఁ జెప్పించుచుండిరి ; కాని విశేషధనసాధ్యమగు నిక్కార్యభారమంతయు ననేక సత్కార్యములకుఁ ద్యాగము సేయుచుండు నొక్కకుటుంబమందు వెట్ట నోడి, యే నప్పని కియ్యకొనకుంటిని ; భారమంతయు దైవమందిడి, మెల్లని నా సొంతధనమువలనన యిక్కార్యము నెరవేర్చికొనఁ జూచుచుంటిని ; కాని వలనుగాకపోవుచుండెను ; ఇట్లు కాలము జనుచుండ, నొకనాఁడు, పైనఁబేర్కొన్న శ్రీ రామునాయుఁడుగారును, శ్రీ పారన్ననాయుఁడుగారును ఎల్లెని నన్నొడన్ బఱచి, కార్యము సాధించునుద్దేశముతోఁ బల్కరింపవచ్చి, నా యాతిథ్యముఁ దారు గైకొను ప్రశంసలో, మాటమెలకువమై నన్ను వంచించి, యొడన్ బఱచి, యీ గ్రంథముఁగైకొని, ముద్రణకార్యమునకుఁ గడంగిరి.

## —♦ కృతజ్ఞత ♦—

గ్రంథరచనాకాలమునను, దత్పూర్వమునను నాకుఁ బెక్కు విధంబులఁ దోడుసూపినట్టియు, నిప్పుడును, బిమ్మటను దోడుసూపఁ గృతనిశ్చయుఁడైనట్టియు, పైన బేర్కొనఁబడినట్టియు శ్రీ పెంట నారాయణమూర్తినాయుఁడు గారికిని, గ్రంథరచనానంతరమ్ముకొలఁది దినములలోఁ, దనకుఁదానై వచ్చి, గ్రంథముద్రణమునకుఁగాను రూ ౧౧౬-౦-౦ విరాళము చేసినట్టియు, స్వకాయకష్టమువలన జయపురమున విశేషధనమార్జించి, పెక్కు సత్కార్యము లాచరించినట్టియు

శ్రీ కెళ్లా వీరయ్యగారికిని, నా గ్రంథ ప్రకటనాదులన్ గూర్చి మిక్కిలి పాటుపడిన శ్రీ పేరి రామకవిగారికిని, శ్రీ వీరివలనవిని, తనకుఁ దాన వచ్చి, నా గ్రంథమును సాంతముగఁ బఠించి, పెక్కుపుటలకుఁ జాలిన పీఠిక వ్రాసియిచ్చియు, నా సంప్రార్థనము నంగీకరించి, వజ్రధర్మ విజయ గ్రంథసంపాదనార్థ, ముత్తరభారతదేశమునకుఁజని, ప్రచారము సేయుచు, వ్యయప్రయాసలకు లోనగుచున్నట్టియు, మహావిద్వద్వర్యు లగునట్టియు శ్రీ చెరుకుపల్లి కృష్ణమూర్తిశాస్త్రిగారికిని, నా గ్రంథ ముద్రణకార్యభారమంతయు నిప్పుడు వహించికొన్నట్టియు, నింకను వహింపనున్నట్టియుఁ, బైన బేర్కొనఁబడినట్టియు శ్రీ పెంట రాము నాయుఁడు పారన్ననాయుఁడు గారలకును, శ్రీ వారికి నా గ్రంథ ముద్రణకార్యమున రూ ౫౮-౦-౦ విరాళము జేసినట్టియు, నుదారా శయపూరితులైనట్టియు, చెముడు గ్రామ నివాసులైనట్టియు, తీను సామంతువలస, భూస్వాములైనట్టియు శ్రీ బొంగు చిన్నన్ననాయుఁడు గారికిని, శ్రీ వారిసోదరులు శ్రీ నరసన్ననాయుఁడుగారికిని, వీరివలెనే పైన బేర్కొన్న శ్రీ పెంట రామునాయుఁడు శ్రీ పారన్ననాయుఁడు గారలపైన వ్రాయఁబడిన మహోద్యమనిర్వహణమందు రు ౫౦-౦-౦ విరాళము జేసినట్టియు, శంబర గ్రామనివాసులైనట్టియుఁ, బరమకర్షక మహాశయులకును, ఈ గ్రంథముద్రణమందు మిక్కిలి శ్రద్ధవహిం చియుఁ, దక్కినపనులెల్ల విడిచిపెట్టియు, ముద్రణవేతనము (అచ్చు కూలి) సగముమాత్రము గైకొని ఔదార్యము సూపియుఁ, జక్కని బైండుతోఁగూడ వేయిప్రతులు నలుబది దినములలో సిద్ధముచేసి, పని ముగించికొన్నట్టియు, నుదారభావసంపన్నులైనట్టియు, నా పరమ మిత్రులైనట్టియు, శ్రీ సత్యానంద ముద్రణాలయస్వాములైనట్టియు, శ్రీ రాజమహేంద్ర పురవాసులగు శ్రీ పాత్రుని రంగారావు నాయుఁడుగారికిని, శ్రీవారి ముద్రణాలయమందు బహువిధ ముద్రణ ప్రవీణులై, పేరుఁగొన్నట్టియు, నాయెడల హితవిశ్వాసగౌరవముల

నెఱపుచున్నట్టియు పనివారలకును, ఈ గ్రంథముద్రణము పూర్తియగు నంతవఱకుఁ దనపనుల మానికొని, ముద్రణాలయమందేయుండి, పని వారలను హెచ్చరింపుచు, సమయమునకు ముద్రణకార్యమునిమిత్త మప్పుడప్పుడు కొంతసొమ్ము వెచ్చించినట్టియు, నా ప్రియమిత్రులైన ట్టియు, రాజమహేంద్రవర పురపాలక సంఘసభ్యులైనట్టియుఁ, త్యాగ ధైర్యకార్యనిర్వహణ శక్తిసంపన్నులై పేరుఁగొన్నట్టియు శ్రీ సప్పా అప్పలస్వామి నాయుఁడుగారికిని "శ్లో॥ సన్త స్తృణోత్సారణ ముత్త మాంగా । త్సువర్ణకోట్యర్పణ మామనంతి" అను నార్యోక్తిని బాటించి, నా కృతజ్ఞత నెఱింగించికొనియెదను.

## —♦ వే డి కో లు ♦—

లోకోత్తరనియమ సుందర సుక్షేత్ర భాసమానంబును, నిరర్గళ కవితామృత ప్రవాహబంధురంబును, జ్ఞానవిజ్ఞాన సారసౌరభసమాకృ ష్టాంధ్రేతరలోక విద్వత్పుంగవ భృంగస్తోత్రపాఠమంజులఝుంకార విస్తారంబును, గంభీరవిషయవిశేషమండిత పత్రికావల్లరీ మనోహారం బును నగు నాంధ్రసారస్వతమహారామం బాంధ్రజాతికి జన్మధనంబు ; తన పురోఽభివృద్ధికిని, శాశ్వతకీర్తికిని, జ్ఞానవిజ్ఞానములకును, భుక్తిముక్తు లకును, శాంతికిని, యిది యది యననేల ? నన్నింటికిని నగు నా జన్మ ధనంబును రక్షించికొనుటయుఁ, దదభివృద్ధికై పాటుపడుటయుఁ, ప్రత్యాంధ్రవ్యక్తిని బరమధర్మము ; కాని యా పరమధర్మమును బాటింప, జాతిలోని ప్రతివ్యక్తిని శక్యముకాదు ; జాతియందలి పెద్ద వారే యాధర్మనిర్వహణభారము వహించుటయుఁ, దక్కిన పిన్నవా రంద ఱా పెద్దవారియానతి శిరసావహించికొని ప్రవర్తించుటయు

మిక్కిలిమంచిది ; అట్లది నిర్వహింపఁబడుచుండునేని, దాని కెన్నఁడును జేటుపుట్టదు ; అంతియకాని జాతికంతకును జెందిన జన్మధనంబుకదా ! యని ప్రతివ్యక్తియు దానియం దధికారము జెల్లింపఁజూచుట మిక్కిలి హానికరము ; బహువ్యక్తులవలన బహుముఖంబుల వ్యవహరింపఁబడు నే వ్యవహారమును సిద్ధిఁ బొందకపోవుటయేగాక, సమూలము నాశన మగుట లోకంబునఁ జూచుచున్నారము ; కావునఁ బెద్దవారు జాతీయ జన్మధనరక్షణమందును, దదభివృద్ధియందును, దీక్షమైఁ బాటుపడు టయుఁ, బిన్నవారు వారియానతి నెఱపుచు మెలంగుటయు, ధర్మమగు చున్నది ; ఈ ధర్మమును మన తొంటి పెద్దలును, బిన్నలును, బాగుగఁ బాలించికొని, యభివృద్ధికివచ్చిరి ; కాని యిప్పుడా ధర్మము పాటింపఁ బడుచున్నట్లు లేదు ; పెద్దవారిలో నైకమత్యములేక, యుదాసీనతఁ బాటింపనగుటయుఁ, బిన్నవారు విధేయతకున్ దప్పి, మెలంగుటయుఁ గాననగుచున్నది.

కావుననే సారస్వతమహారామము తొంటిశోభను, మహిమను గోల్పోవుచున్నది ; కొందఱు తమ యిచ్ఛకువచ్చినట్లు కృత్రిమవిష వల్లరులను, మఱికొందఱు కొఱగాని మహాగ్రంథ పాదపాంకురములను, ఇంకొక కొందఱు నానావిధ వికృతికల్పనామయకృతులను వేరుపురువుల నీను గడ్డిగాదరలను, ఆ మహారామమందు నాటి, బాగుగఁ బెంచిరి ; మఱికొంద ఱింకను ఆపనుల సేయుచున్నారు; కొందఱు సేయునున్నారు; మఱికొంద ఱాంధ్రజాతికేగాక, సకలప్రపంచమునకు, బ్రయోజన కారులగు నమ్మహారామమందలి లోకోత్తరకృతి మహావృక్షరాజంబులఁ దెగనఱుకుచున్నారు ; కొందఱు వారికప్పనియందుఁ దోడుసూప నుం కింపుచున్నారు ; ఇంకొకకొంద ఱమ్మహారామమునందుఁ దమకుఁగల

జన్మస్వాధికారమును విడిచికొనఁ జూచుచున్నారు; వారి యప్పనికి నలరి కొందఱు ప్రశంసాపత్రములను వ్రాయుచున్నారు; కొంద ఱమ్మహారామమున కకాలప్రళయము సంభవింప శాపము లిడు చున్నారు.

ఇట్లు బహుముఖంబుల నాంధ్రజాతిజన్మధనంబగు సారస్వత మహారామమునకుఁ గీళులు వాటిల్లెను; వాటిల్లనున్నవి; ఇదియంతయుఁ గన్నారన్ జూచుచున్న జాతిపెద్దలలో సంచలనము కల్గినది; తమ యుదాసీనతవలన, నింతలేసికీళులు పుట్టెనని తెలిసికొని, యోపిన ట్లమ్మహారామమును గాపాడికొనఁదలంచి, వారు తీవ్రప్రయత్నము సేయసాగిరి; కాని వారా ప్రయత్నమందు మరల నైకమత్యంబునకు సెడి, కర్తవ్యమును విస్మరించి, తీవ్రవాదోపవాదంబులందుఁబడి, తమ యమూల్యప్రజ్ఞాబలమును, గాలమును వమ్మొనరించుచున్నారు.

ఈ సమయమందే యల్పజ్ఞుఁడనగు నా యీ కృతిపాదపాంకుర మమ్మహారామమందు నాట నగుచున్నది; దీనివలన నమ్మహారామము నకు మేలగునో? కాక కీడగునో? యది నా కెఱుంగఁబోలకున్నది; దీనివలన నేమేని మేలగునేని, దీని నందుండనిచ్చి, పెంపుఁగావించుటయుఁ, గీడగునేని వేగమ తొలఁగించుటయుఁ, దీని మేలుగీళ్లన్ గూర్చి తమ యమూల్యాభిప్రాయములను నాకు దయచేయుటయుఁ, బెద్దవారికి ధర్మమని విన్నవించికొనుచున్నాఁడను; అపారప్రజ్ఞానిధులగు వారు శుష్కవాదోపవాదమును విరమించి, తమ కర్తవ్యమును నిర్వహిం చుచు, తొంటిశోభను గోల్పడిన యాంధ్రజాతి కుత్తేజముఁ గల్పింతురు గాక యనియుఁ బ్రార్థించెదను.

## సాహసము

ప్రాచీన సంప్రదాయసిద్ధ సకలవిషయగ్రథనబంధురంబగు కృత్యాదిభాగము మూలువెట్టికొనియు, నా యజ్ఞానమువలనను, లేఖకుల ప్రమాదమువలనను, ముద్రణాలయమువారి పనియందలి వేగపాటు వలనను, దొరలిన పెక్కుదోషంబులతోఁగూడిన యీ కృతి రెండవ భాగమును సమర్పించికొనియు, మీ యమూల్యాభిప్రాయంబులను దయచేయుఁడని పండితమండలిని వేడికొను నా సాహసము క్షంతవ్యము.

లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.

ఇట్లు,
గ్రంథకర్త,
(శాంతికుటీరము) కొత్తూరు,
పార్వతీపురము తాలూకా,
విశాఖపట్టణముజిల్లా.

శ్రీరస్తు.

# శ్రీకృష్ణధర్మవిజయే-ప్రథమఖండే

## ద్వితీయభాగే-ప్రథమోఽధ్యాయః.

అథ భగవాన్ ప్రాతఃకర్మాణి కృత్వా సింహద్వార బహిః ప్రదేశ మగమత్॥ ౧

తత్పూర్వమేవ సర్వే యాదవాః పౌరాశ్చ శరణం గతా రాజానశ్చ తద్దర్శనకాంక్షిణ స్తత్ర సమేత్యాతిష్ఠ న్త॥ ౨

భగవా నథ దివ్యరథ మారుహ్య గన్తు మారభత్ తే సర్వే తస్మై ప్రణమ్య దశలక్షాధికా జనా స్స్వాయుధా స్స్వవాహనాశ్చ త మను యయుః॥ ౩

సర్వే పౌరా మంగళవాద్యై స్సహాభ్యుపేత్య పుష్పై రక్షతై స్తమ వాఽకిరన్ ధేనవః పూర్ణకుంభాని చ దృష్టిగతానిచ॥ ౪

ఏవమ్ స భగవాన్ నారాయణోఽనంతః పురా న్నిర్గమ్య యోజనమాత్రం గత్వా రథమ్ స్థాపయిత్వా తాన్ జనాన్ ప్రియ ముక్త్వా స్థాతు మాదిదేశ॥ ౫

తే తమ్ నత్వా బహూ న్యభాష న్త; అథ సాత్యకి ప్రముఖా వీరా స్తస్యాఽనుగమనా యాఽప్రార్థయన్॥ ౬

స తాన్ ప్రియ ముక్త్వా నివారయామాస॥ ౭

ఏవం స మహాత్మా పురా న్నిర్గమ్య రథేన మహతా మార్గం గృహీత్వా ప్రయాతి స్మ॥ ౮

మార్గమధ్యే తత్ర తత్ర తం ప్రజాః ఫలపుష్పాక్షతైరవాఽకిరన్ ప్రణేము శ్చ॥ ౯

వనదేవతా అపర్ణే దేవగణా శ్చ అదృశ్యా స్త మనుయయుః ఏవం గత్వా గత్వా స కస్యచి ద్దినస్య సాయంకాలే కంచన గ్రామ మప్రాపత్ ; తస్మిన్ గ్రామే జనా ఆర్యాలయపాన్థశాలాయో స్సన్నిధౌ వటవృక్ష స్యాఽధస్థలే స్థిత్వాకంచి ద్వివాదం పరిష్కుర్వన్ తదాతిష్ఠ న్త॥ ౧౦

తే సర్వే తమవ్యయం ప్రభుం దృష్ట్వా విస్మితా ఉత్థాయతమపూజయన్ సాస్తరణ మాసనం తస్మై ప్రభవే ఆర్యాలయేఽ కల్పయన్ సమర్పయామాసు శ్చ॥ ౧౧

స తస్మి న్నిషీద్య పరిచర్యాం కర్తు మిచ్ఛన్ తా న్నివార్యసారథే స్స్వాగతం కర్తు మాజ్ఞాం దదౌ ; తే మహాప్రసాద మిత్యుక్త్వా తథా చక్రుః॥ ౧౨

తేన సారథినా తస్య భగవతో వార్తాం శ్రుత్వా తే తతః పరమానంద మాశ్చర్యం చ ప్రాపుః॥ ౧౩

అథతే సర్వే సమాలోచ్య మిత్రశర్మాణం పురోహితం తేన ప్రభునా లోకనాథేన సహ సంభాషయితు మపి వివాదం నివేదయితు మప్రేరయన్॥ ౧౪

తతో మిత్రశర్మా తస్మై ప్రణమ్య స్వవివాదం విజ్ఞప్తు మారభ్య దేవ! మమచ కస్యాశ్చి త్కుటుంబి న్యాశ్చ నిధౌ వివాద స్సమభవత్, తత్త్వమేవ పరిష్కర్తు మర్హా సీ త్యప్రార్థయత్॥ ౧౫

అథ భగవాన్ తాం కర్షకకుటుంబినీం తై రార్యై రాకారయామాస - సా సమాగమ్య తస్మై నత్వా తత్సవిధే సమ్రా తస్థౌ॥ ౧౬

తత స్తాం స్సాదర ము ద్వీక్ష్య సకిమపి వక్తు మారభత్॥ ౧౭

అథ మిత్రశర్మా తస్మై ప్రణమ్య స్వవివాదం నివేదయితు ముప చక్రామ - ప్రభో! కులపాలికేయం సరళా మ ద్దుహితృసదృశీ బహు కుటుంబినీ ప్రాజ్ఞా చ॥ ౧౮

యథాశక్తి సదై వాఽహం మత్కుటుంబినీ చేమాం సత్కరిష్యావః క్షేత్ర మస్మాక మేషా పాలయతి - కృషిం కరోతి - పాదమాత్రం ఫల మస్మాకం దాస్యతి - అస్యాః పతి స్సాధుః పరమకర్షకో దక్షశ్చ॥

తస్మిన్ కృషిం కుర్వతి సతి సేతుభేదనే కశ్చి న్మహానిధి ర్దృష్ట - స్తమ్ నిధి మియం న గృహ్ణాతి, బలా దివ మయి నిధాతు మిచ్ఛతి, తత్ర కో ధర్మః - నాఽలమ త్రాఽహం - వివాద ఏషః - త్వమేవ పరి ష్కర్తు మర్హసీతి॥ ౨౦

తచ్ఛ్రుత్వా భగవాన్ తాం సతీ ము దైక్షత్॥ ౨౧

సాఽథ నమస్కృత్వా లజ్జయాఽధః పశ్యన్ తీ తేదం వ్యజిజ్ఞపత్ - ప్రభో! కిం వక్ష్యా మ్యహ మ ప్రాజ్ఞా కర్షకకుటుంబినీ చ - అయం మహాత్మాఽస్మాకం ప్రభు రీశ్వరశ్చ - వయ మనేన జీవామ - స్సర్వ మేష దాస్యతి - దాపయతి చ లోకేఽస్మిన్ మహాప్రాజ్ఞోఽయమేవ - నాఽన్యః - నాఽస్య కించి దప్యాశాది దుర్లక్షణం - నైవ దురు ద్యమః - అస్యైవ క్షేత్రే కృషిం కృత్వా జీవామః॥ ౨౨

అస్య క్షేత్రే సేతుభేదనే మమ భర్త్రా కశ్చి న్మహానిధి ర్దృష్ట - స్త మయం నగృహ్ణాతి - అస్మా స్వేవ కృషికేషు నిధాపయితు మిచ్ఛసి - తత్ర కోధర్మః - వయం స్వప్నేఽపి బ్రాహ్మణద్రవ్యం న స్పృశామః - అయమే వాఽవయో ర్వివాద - స్తత్పరిష్కారే త్వ మేవ ప్రమాణ మితి॥ ౨౩

అ థైవం నివేద్య సా తూష్ణీ మతిష్ఠత్॥ ౨౪

తత స్స పూరుషోత్తమ స్తా వృథా స్తుత్వా ప్రశశంస - భూయ ఉవాచ హ - అహం విచార్య శ్వో భోజనానన్తరే వివాదపరిష్కారం కరోమి - అద్య బాఢం గమనాయాసః॥ ౨౫

తచ్ఛ్రుత్వా తాః ప్రజాః పరమానందం జగ్ముః॥ ౨౬

అథ తస్మై విష్ణవే పరమాతిథ్యం కర్తుం తేషు జనేషు వివాదోఽభవత్ - త న్నివార్య షట్కర్మరత స్స బ్రాహ్మణః ప్రణమ్య తం ప్రభు మాతిథ్యస్వీకరణాయ బహుధాఽప్రార్థయత్॥ ౨౭

తచ్ఛ్రుత్వా భగవాన్తము ద్వీక్ష్య తాన్ జనా నిద మువాచ వయం సర్వే యాదవా యయాతిశాపకారణా త్కర్షకా గోపాలకా అభవామః - గోపాలదేవ ఇతి పరమగోపాల ఇతి గోప ప్రభు రితి మమ త్రీణి నామాని- మదగ్రజో బలదేవో హాలీ చ ముసలీచ - సర్వేఽస్మదీయా గోపకాః కర్షకాశ్చ - తత్కర్షకకుటుంబినీ సాధ్వీ సరళేయమేవ మహ్యా మాతిథ్యం కరోతు - త న్మమేష్ట తర మితి॥ ౨౮

కిం చేయం పరమసతీ - అస్యా అన్నం సుదుర్లభతరం - స్త్రియః లోకే పూజనీయాః - లోకోఽయం స్త్రీభిరేవ పూతః - తాస్వేవ స్థాస్యతి - పున రంతే తాస్వేవ లీయతే - అత్ర పురుషో నిమిత్తమాత్రం - పుంభి రేవ కేవలం స్త్రియో దూష్యంతే॥ ౨౯

శ్లో॥ స్త్రీషు ప్రతిష్ఠితో ధర్మ స్తాభిరే వాఽభిరక్ష్యతే
కేవలం మైథునా కాంక్షా తాసు కార్యం నకస్యచిత్॥ 30
కేవలం పురుషో బీజం క్షేత్రం స్త్రీ రితి శాసనం
కథమ్ ఫలం వినా క్షేత్రం కుతో భాగ్యం వినా స్త్రియా॥ 3౧

త దార్యై స్సాక మహ మస్యా గృహే శ్వో భోక్తు మిచ్ఛామి సర్వాః ప్రజా స్త్వ మిష్టై రన్నై స్తర్పయ॥ ౩౨

తచ్ఛ్రుత్వా మిత్రశర్మా యథాజ్ఞా తథాకరోమి - అద్య రాత్రౌ లఘు మాహారం తుభ్య మర్పయితు మిచ్ఛామి, త దనుగృహ్యతా మిత్యబ్రవీత్॥ ౩౩

శ్రీభగవాన్ - బ్రహ్మన్ యథేష్టం తథాకురు - ఫలం శర్కరా క్షీరంచ మను లఘుభోజనం - తదలం - సర్వైర్జనై స్సార్ధమహం శ్వః ప్రభాతే తటాకే స్నానం కరోమి - తతో దేవపూజాం తథాకరిష్యే - తతో విద్యాశాలాం ప్రతి గమిష్యే, వక్ష్యామిచ - తతో భుంజామి - తతో నిర్ధివ్యవహార పరిష్కారాదీన్ విధాస్యామీ త్యవదత్॥ ౩౪

ఇత్యుక్త్వా తతో భగవా నుత్థాయ వటచ్ఛాయా మగమత్ - తత్రాసనే నిషసాద॥

ఇతి ప్రథమోఽధ్యాయ సమాప్తః.

---

## —♦ ద్వితీయోఽధ్యాయః ♦—

అథ దినాంత మభవత్ - తతో రాత్రి రవర్తత॥ ౧

తస్మై మిత్రశర్మా లఘుభోజనమ్ సమర్పయత్ - ససారథిస్స భుక్త్వా ప్రీతోఽభవత్॥ ౨

తత స్సర్వే గ్రామీణా స్సమేత్య తం సంప్రార్థ్య తద్వచనా త్తత్రి జాగర్యా ముపతస్థిరే॥ ౩

## —♦ అథ మిత్రశర్మాసరళాయా ర్వృత్తాంతః. ♦—

మిత్రశర్మా మహాన్ బ్రాహ్మణ ష్షట్కర్మరతో విద్వాన్ శాంతో దాంతశ్చ శుచి ర్ధీమాన్ త్యాగీ యోగీ చ ధనవాన్ చ॥ ౪

తస్యపత్నీ సర్వమంగళేతి నామ్నా ప్రాజ్ఞా సువ్రతా సాధ్వీచ॥ ౫

తయో ‌ర్రేకైవకన్యా సురూపిణీ బభూవ॥ ౬

స బ్రాహ్మణః పౌరోహిత్యే ప్రజా రంజయతి॥ ౭

గ్రామీణా స్సర్వే తమ్ సర్వకర్మసు ప్రమాణం కుర్వన్తి॥ ౮

సరళాం స పుత్రీ మి వాద్రియతే - తస్యసేవాం సరళాచ తద్భర్తా -
చ సదైవ కుర్వ న్నాస్తామ్ - తౌ సస్నేహం స పశ్యతి॥ ౯

ఏకదా సరళయా ప్రేరిత స్తద్భర్తా తస్య మహాత్మన స్సన్నిధిం
గత్వా ప్రాంజలి రిదం వ్యజిజ్ఞపత్॥ ౧౦

స్వామిన్ వయం త్వయి జీవామ - స్త్వయ్యేవ వృద్ధిమ్ గమిష్యామ-
స్త్వమేవ గతి రస్మాకం॥ ౧౧

వయం కేవలం కృషీవలాః - కృషి రేవాఽస్మాకం పరమావృత్తి-
స్తస్యామేవ నో జీవనవిషయః - తస్మా త్కించనక్షేత్రందీయతామితి॥
త చ్ఛ్రుత్వా ప్రహృష్ట స్సవిద్వాన్ సాదర మిదమువాచ॥ ౧౩

య దిష్టం తవ తన్మ మాఽపీష్టం - పరం కించన వక్తు మిచ్ఛామి-
సర్వథా వః కల్యాణం మమసౌభాగ్య మివాపేక్ష్యతే - శ్రద్ధయా శ్రుణు
అహం కేవలం షట్కర్మరతోఽపి కృషివిద్యాం కించనవేద్మి ; పూర్వ-
ర్వే సర్వే కృషివిద్యావేదినః - కృషిమే వాఽనుత్తమాం మత్వా గ్రం
థాన్ చక్రుః॥ ౧౪

శ్లో॥ ఆద్యవృత్తిః కృషి ర్జ్ఞానం సాఽపి దేవైః ప్రకీర్తితా
ఋషయో బహు మన్యన్తే తా మేవ నియతవ్రతాః॥ ౧౫
యథా రాజ్యే ప్రభు స్స్వామ్య స్తథాక్షేత్రే కృషీవలః
ఆనంద ఉభయో స్తుల్య స్తయో రత్ర న సంశయః॥ ౧౬

సర్వేజనాః కర్షకా భవంతు - ఇతి భగవచ్ఛాసనం - కృష్యా బహవో జీవా జీవంతే - యజ్ఞాదపి తస్యాఃఫల మతిమాత్రం॥ ౧౭

యః కృషిం నాద్రియతే సోఽధమః బహవో రాజర్షయో దేవర్షయో బ్రహ్మర్షయోఽపి కృషిమ్ బాఢ్మ శంసంతిస్మ ౧౮

అన్నం వస్త్రం చ రసాశ్చ కృష్యైవ భవంతి - సైవ తేషాం జన్మభూమిః॥ ౧౯

మత్పితామహో విద్వాన్ కృష్యై భూగీతా మకరోత్ - తచ్ఛృణు॥

ఏక దైకాంతే భూదేవీ హిమవత్యతిష్ఠత - తామ్ ద్రష్టుం నారదస్తత్ర జగామ - సా తం దృష్ట్వాదృత్య కి మర్థ మాగతో సీ త్యబ్రవీత్ - స ప్రణమ్య త్వామ్ ద్రష్టు మాగత ఇ త్యువాచ - భూయ ఇత్థం సాఽకథయత్॥ ౨౧

బ్రహ్మన్ లోకోఽయ మద్య నష్టః - పార్థివా యుద్ధాది వ్యసనాసక్తాః కర్షకా మన్దా అశక్తా శ్చ - త ల్లోకే మహాన్ హాని రాసీత్ - తదహాం బాఢం శోచామి - అన్నవస్త్ర క్షామాది బాధా కథంమయి రసమయ్యాం - తస్మా త్త్వం గత్వా పర్యటన్ లోక హితాయ కృషివిద్యాం ప్రబోధయ - తత్కర్మణ్యహం మహత్ఫలం దాస్యామి - ఇదం భగవచ్ఛాసనం - యే మాం కర్షంతి త ఏవ మ త్పుత్రాః- నాఽన్యే - ఇతి స్పష్టం వాచ్యం, త ద్గచ్ఛేతి॥ ౨౨

త చ్ఛ్రుత్వా తథేతి స మహాత్మా జగామ - సాఽపి తత స్తిరోధాన మభజత్॥ ౨౩

తత స్స మహర్షిః కృషిం బోధయన్ సర్వలోక మప్యర్యటత్॥ ౨౪

శ్రుణు ! కృషా వాయురారోగ్యబహు సుఖ ద్రవ్యానందాదిలాభః॥.

కాలజ్ఞ తా చ బాధ ముత్సాహ శ్రద్ధాతితిక్షాద్యాః కృషౌ కార్యాః॥

సారో గోధనం చ భృతింకర రాజానః కృషే స్పహాయాః॥ ౨౮

తటాకసేతు స్రోతో బీజ సకలోపకరణసౌకర్య కారకో రాజా కృషిం వర్ధయతి - కాలే యథోచితకరాన్ దత్వా కర్షకః కోశం వర్ధయతి చ॥

ఏవ మన్యోఽన్యాదాన ప్రదానాభ్యాం రాజా చ కర్షక స్తు పరం తుష్టిం లభేతే॥ ౨౯

శ్లో॥ ద్వా వేవ పురుషౌ లోకం రక్షితో లభత స్సుఖం
రాజా తు కర్షక శ్చైవ తాభ్యాం సర్వాగతి ర్ధ్రువా॥ ౩౦

శ్లో॥ అదక్షః కృషికో రాజా దుష్టో వ్యసన లంపటః
భవత స్తౌ పదభ్రష్టౌ - తాభ్యాం లోకో న రాజతే॥ ౩౧

శ్లో॥ ఏకస్మిన్నేవ కృషికే పీడ్యమానే మహీభృతా
న దుర్భిక్షో భవే ల్లోక - స్స రాజాఽథః పతిష్యతి॥ ౩౨

శ్లో॥ కర్షకా స్సుఖిన స్సర్వే నరకేఽపద్య దుర్మతౌ
యథా పితామహే తస్య పురా కృషి విశారదే॥ ౩౩

శ్లో॥ రాజ్యగాత్రే మహాసారే కేవలం కృషిక శ్శిరః
అత్ర జాగర్తి భూపాలః ప్రజ్ఞాచక్షు ర్దినే దినే॥ ౩౪

శ్లో॥ సారాసార విచార శ్చ నై పుణ్యం కృషికర్మ సు
గుణాః కాలజ్ఞ తా చైవ కర్షకస్యతు ధీమతః॥ ౩౫

నానాకర్మవిధాన నానాసస్యసృష్టిక్రమ నానా సారోపకరణసంగ్రహాదయః కర్షకస్య నిత్యకృత్యాః॥ ౩౬

ప్రాయశో గోధనమేవ మహాధన ముత్తమస్య కృషీవలస్య - యస్యై తస్మిన్ న శ్రద్ధా సోఽధమః॥ ౩౭

ఉత్తమః కృషిక ఏవ లోకస్య రాజ్ఞ శ్చ సమ్మానం లభతే-నాఽన్యే॥

పురా కస్మిన్శ్చి ద్గ్రామే కశ్చి త్కులీనో కుటుంబీ చ కర్షక ఆసీత్॥

తస్య హైమ నారాయణ ఇతి - తత్పత్న్యా స్సీతేతి నామ॥ ౪౦

తయో ర్దంపత్యో స్సంతానసౌభాగ్యం చారుతరం॥ ౪౧

గోధనం తస్య సముజ్వలం - క్షేత్రం సుదూఢస్థం చ॥ ౪౨

తస్య కర్షకస్య పుత్రా స్తద్గోధనం శ్రద్ధయా రక్షన్తి - తేషాం
కేచి త్కృషిం కుర్వంతి చ॥ ౪౩

పుత్రైః పుత్రీభి శ్చ భార్యయాఽపి స కర్షకః కృషికర్మసు ప్రవ
ర్తతి స్మ - కృషి రేవ తస్య నిధి - ర్నాఽన్య త్కించిత్ - స కృషి
మేవ వేత్తి - కిమపి నాఽన్య త్కించిత్॥ ౪౪

విద్యాశ్రుతిగోష్ఠీ హీనోఽపి సతు సత్యం బ్రూతే - సత్యేవ ర్తతిస్మ॥
సదైవనానాసస్యాభిరామంతస్యక్షేత్రం-లక్ష్మీస్థానంచగోధనంమహత్॥

తస్య కృషిచాతుర్యం జగద్విదిత మాసీత్ - న తత్సమ స్తదా కర్ష
కః కోఽపి లోకేఽస్మిన్ విశ్రుతః॥ ౪౭

తత్కాలే కశ్చి ద్రాజా ధీమాన్ కృషిప్రియ ఉదార ఆసీత్॥ ౪౮

తస్యమంత్రిణోఽపి కృషిప్రియా - స్స తైస్సహ రాజ్యే పర్యటన్
కృషీవలా నుత్తమాన్ సత్కరిష్యతి - ప్రియం భాషతే - స్వయం కృ
షిం పరీక్షతేఽపిచ॥ ౪౯

అథ కస్మించి ద్దినే స ప్రభు ర్మంత్రిభ్యామ్ సహ తస్య నారా
యణస్యకృషిం చ తద్వర్తనం చ పరీక్షితు ముద్దిశ్యవ్యాజ మ మన్యత-
తతో రాజా కర్షకవేషం మంత్రీ అఽన్యేకో బ్రాహ్మణవేష మపరో
భిక్షుకవేషం దధ్రుః॥ ౫౦

అథ బ్రాహ్మణవేషధారీ మంత్రీ సమాగమ్య తమ్ - నారాయణం
దృష్ట్వా, ప్రియ ముక్త్వా ధేను మయాచత॥ ౫౧

స తు తస్య వేషధారిణో వార్తాం పప్రచ్ఛ॥ ౫౨

బ్రాహ్మణో౽కథయత్ - అహం కళింగవాసీ మహాన్ బ్రాహ్మణః మమదేశే దుర్భిక్ష మభవత్ - కుటుంబీ పండితో౽ప్యహం గతి మప్రాప్య పరిభ్రమ న్నిత ఆయాత - స్త న్మహ్యం ధేను దానం కురుష్వేత్యుక్త్వా బ్రాహ్మణప్రభావం వక్తు మారభత్॥ ౫౩

సతు తం నివార్య - యాచనాం వినింద్య - బహూ నుక్త్వా గోరక్షణే బ్రాహ్మణానా మశ్రద్ధామ్ నిరూపయిత్వా తత స్తస్మై ధేను మేకాం దదౌ॥ ౫౪

శ్వ ఏవ ధేనుం గృహ్ణామీతి స బ్రాహ్మణో౽వదత్॥ ౫౫

తస్మిన్నేవ సమయే కర్షకవేషధారీ రాజా తత్రాగమ్య తమ్ కృషీవలం దృష్ట్వా క్షేమం పృష్ట్వా స్వాం వార్తాం కథయిత్వా బంధుత్వం నిరూప్య మమ కుటుంబపోషణం కురుష్వేతి యయాచే॥ ౫౬

త చ్ఛ్రుత్వా స కర్షక స్తస్య చారురూపం గంభీరం భాషణం విమృశ్య కృష్యై నా౽యమర్హతీతి మత్వాతమ్ చ తస్య రాజానం దూషయన్ భూయో మైత్రీ మవలంబ్య సఖే భుంక్ష్వేతి ప్రియ మసూచయత్॥ ౫౭

తతః కర్షక వేషధారీ రాజా తస్మై ప్రణమ్యాహర్షం ప్రకటీకృత్వా కుటుంబమానీయ శ్వోసమాగచ్ఛామీత్యువాచ॥ ౫౮

అథ తస్మిన్ సమయే౽పరో మన్త్రీ భిక్షుకవేషం దృత్వా తం కృషికశ్రేష్ఠమ్ దృష్ట్వా జయ ముచ్చైర్వదన్ ప్రియం వక్తుమారభ్యేద మవోచత్॥ ౫౯

అహం కళింగదేశవాసీ భిక్షుకః - సర్వే దాతారో౽స్మాకం దత్త్వా దాపయిత్వా సుకృత మాప్నువంతి స్మ - స్వయ మస్మాన్ బ్రహ్మా లోకానాం సుకృతాయ ససర్జ - యో నోద దాతి తస్యోర్ధ్వం లోకం- యో న దదాతి త స్యా౽ధోలోకం - ప్రాపయితు మస్మదీయా స్సమర్థాః - నా౽న్యే॥ ౬౦

త్వం పరమకృషీవల ఇతి శ్రుణోమి - కృషిరేవ లోకస్య సర్వథా గతిః - తస్మా న్మమ దత్వా దాపయిత్వా చ సుకృతం లభస్వ - శుభ మేవ తే భవ త్వితి॥ ౬౧

తచ్ఛ్రుత్వా స కర్షకః క్రుద్ధో భూత్వా యాచ్ఞాం బాఢం వినిం దన్ తమ్ బహుధా దూషయన్ గచ్ఛ గ చ్ఛే త్య తర్జయత్॥ ౬౨

సోఽపి తతోఽల మల మిత్యుచ్చై ర్వదన్ క్వాఽపి జగామ॥ ౬౩

తతఃకర్షకవేషధారీ రాజా చ బ్రాహ్మణవేషధారీ మంత్రీ చ తస్మిన్ ప్రియం సూచయిత్వాశ్వ ఆగమిష్యావ ఇ త్యుక్త్వా జగ్మతుః॥ ౬౪

తత స్స రాజా మన్త్రిభ్యామ్ తాభ్యామ్ సహ రాజధానీం ప్రాప్య సభాం కర్తు ముద్దిశ్య భటైః కర్షకాన్ విశ్రుతా నాకారయా మాస॥

తతో రాజశాసనా త్సర్వేపి విశ్రుతాః కృషీవలా స్సభాం సమా జగ్మః రాజాఽపి తాన్ సర్వా నా దృత్య తేషా మేకైకస్య వార్తాం పప్రచ్ఛ॥ ౬౬

ప్రభో స్త వాఽనుగ్రహా ద్గోకులానా మస్మాక మపి సర్వేషాం క్షేమ మితి తే సర్వే వ్యజిజ్ఞ పన్॥ ౬౭

తతో నారాయణో రాజ్ఞ స్తుతిమ్ నిరాకృత్య వయ మపి మ ద్గోకులం సర్వ మస్మ త్పరిశ్రమా దేవ సుఖమ్ తిష్ఠామ ఇతి వ్యజిజ్ఞ పత్॥ ౬౮

తచ్ఛ్రుత్వా సర్వేఽపి సభాసద స్తమ్ బహు ధాఽప్యదూషయన్॥

రాజాఽపి వ్యాజ మవలంబ్య ప్రహృష్టోఽపి క్రుద్ధ ఇవ తమ్ నారా యణమ్ భర్త్సయన్ తస్య సర్వాణి ధనా న్యాహర్తుం భటానా మాది దేశ - భూమయ స్తస్మై బృహచ్ఛిలాం దాపయిత్వా తస్మిన్ కృషిం కృత్వా జీవ స్వే త్యుచ్చై రవ దత్ - జగర్జ చ॥ ౭౦

అథ రాజ్ఞ శ్చ సభ్యానా మహైతుకా మీర్ష్యామ్ విశంక్య గంభీర ముక్త్వా స నారాయణ స్తతో నిష్క్రమ్య స్వగృహం గత్వా స్వజనస్య త ద్వార్తాం శ్రావయిత్వా సర్వాణి ధనాని రాజ్ఞే సమర్ప్య బృహచ్ఛిలా నికటే కుటీరం నిర్మాయ తస్మిన్ వసన్ తాం శిలాం మృణ్మయీం కృత్వా తత్సమీపే కూపాన్ ప్రతిష్ఠాప్య తజ్జలేన సర్వాణి సస్యాని తస్మిన్ శిలాక్షేత్ర ఉత్పాదయన్ సకుటుంబ స్సుఖ మతిష్ఠత్॥ ౨౧

త ద్వార్తాం శ్రుత్వా రాజా ప్రహృష్టో మన్త్రిభి స్సార్థం తత్రా గమ్యతం నారాయణ మాకారయి త్వా, ప్రియ ముక్త్వాతత్ర సభాం కర్తు ముద్దిశ్య యథా పూర్వం భక్తైః కర్షకాన్ విశ్రుతా నాకార యా మాస॥ ౨౨

తతో రాజశాసనా త్సర్వేకర్షకా యథాపూర్వ మాజగ్ముః॥ ౨౩

తాన్ సర్వాన్ సంభావ్య శిలాక్షేత్రం కథం భవతి - తస్మిన్ కథం సస్యా నీ త్యపృచ్ఛత్॥ ౨౪

తే సర్వే వివర్ణతాం గత్వా వయం న విద్మహా ఇతి వ్యజిజ్ఞపన్. ౨౫

త చ్ఛ్రుత్వా రాజా క్రుద్ధో భూత్వా తాన్ సర్వాన్ భర్త్సయ న్నాసనా దుత్థాయ తద్బృహచ్ఛిలాక్షేత్ర మగమత్॥ ౨౬

తత స్సర్వేఽపి త మనుజగ్ముః॥ ౨౭

తాన్ సర్వాన్ దూషయన్ తత స్తేషాం సర్వేషాం తచ్ఛిలాక్షేత్రం దర్శయిత్వా తమ్ నారాయణమ్ మృదుభి ర్వచనై స్స్తుత్వా తస్య సర్వాణి ధనాని తస్మై ప్రతిప్రదాప యిత్వా భూయో భూషణాంబర యానాదిభి స్సత్కృత్య ప్రహృష్టో రాజధానీం ప్రాప॥ ౨౮

ఏవం కథయిత్వా భూయో మిత్రశ శ్శేద ముద్వాచ॥ ౨౯

రాజాన శ్చ కర్షకా శ్చ తాదృశా నాఽద్య సం తీతి వక్తు ముచితం భవతి శ్రుణు ష్వేతి భూయ ఉవాచ॥ ౩౦

శ్లో॥ ప్రమత్తా అద్య రాజానో యుద్ధవ్యసన భీకర్షాః
న దయా తేషు నో ధర్మో న ప్రజా పరిపాలనం॥ ౪౧

శ్లో॥ మన్వాది రామపర్యంతం లోకేఽస్మిన్ పార్థివాః పురా
ద్వాదశం దశమం భాగ మష్టమం సప్తమం తథా॥ ౮౨

శ్లో॥ అగృహ్ణ న్త కృషే ష్షష్ఠం చతుర్థం చాఽద్య పంచమం
అతికష్టతరో నూనం కృషే రేష కర స్థిసరః॥ ౮౩

శ్లో॥ న దేవమాతృకక్షేత్రే కర స్థిసరతర స్స్మృతః
న నదీమాతృకక్షేత్రే పరిహార్యః కథంచన॥ ౮౪

క్షేత్ర మస్మాకం దేవమాతృకోఽపి తటాక కూప పర్వత ఝరీ నానాతరుకులసంపన్నం దాస్యామి - తస్మా చ్చతుర్థో భాగో మమ దేయః॥ ౮౫

ఏవం స తస్మై బహూ నుక్త్వా ధాన్యబీజ సర్వోపకర్ణసహితవృషభ యుగ వస్త్రా దీని బహూని దదౌ - తస్య గృహిణీ చ స్వయం కానిచి దపి తతోఽదిశత్॥ ౮౬

స తాన్ సర్వాన్ పరిగ్రాహ్య కర్షకః ప్రహృష్టో గృహం గత్వా సరళాయై సర్వం కథయిత్వా తయా సహ సుఖ మవాప॥ ౮౭

అథ సుముహూర్తే తౌ కర్షక దంపతీ పుత్రై స్సార్థం క్షేత్రం గత్వా తత్ర వృషభయుగ్మంచ భూదేవీం చ వనస్పతిం చ వనదేవతాం చ సంపూజ్య స్తుత్వా పరమానంద మాపతుః॥ ౮౮

తత స్తౌ కృషి మారభ్య ఫలం పాదమాత్రం మిత్రశర్మణే ప్రయ చ్ఛన్ సుఖం జీవతః॥ ౮౯

అథ కదాచన క్షేత్రే సేతుం భిత్వా స కర్షకః కంచన నిధిం దదర్శ॥
ఏవం దృష్ట్వా స సరళా మాహూయ తం నిధి మదర్శయత్॥ ౯౧
తం దృష్ట్వా సాఽపి ప్రహృష్టా భర్తార మిద మువాచ॥ ౯౨

ఏష నిధి ర్దైవవశా దస్మాభి ర్దృష్టః, మహాత్మన స్తస్య మిత్రశర్మణో భాగ్యం స్తుత్యం - త స్యై వాఽయం నిధిః - క్షేత్రేఽస్మిన్ కృషి ఫలమే వాఽస్మాకం భాగ్య మితి॥ ౯౩

సాధు ! సాధు ! త వాఽభిప్రాయః - మ మాఽపి తదేవ మతం తచ్ఛీఘ్రం గత్వా తస్మై సర్వం నివేద్య తం మహాబ్రాహ్మణ మానయ - మాచిర మితి స ప్రాహ॥ ౯౪

సా తథే త్యుక్త్వా శిశూ నాదాయ గత్వా తం మహావిప్రం దృష్ట్వా నమస్కృత్య తస్మై సర్వ మకథయత్॥ ౯౫

అథ స తాం సమ్మానయన్ పురాణపఠనం విసృజ్య శ్రోతౄ నార్యవర్గం చ స్వజనా నానీయ త న్నిధిం ద్రష్టుం కౌతూహలా జ్జగామ॥

ఏవం స మహాత్మా గత్వా నిధిం దృష్ట్వా ప్రహృష్ట స్తం కృషీవలం సాదరం ప్రాహ॥ ౯౬

శ్లో॥ ఆర్యవర్గోఽప్యహం చైవ ఏతే సర్వే జనా మమ
వృత్తే స్తవ ప్రహృష్టా స్స్మః కృతార్థ స్సర్వథా భవాన్॥

శ్లో॥ కిం శంకసే నిధిం సర్వం గృహీత్వా గచ్ఛ మందిరం
దైవా త్తుభ్య మయం లబ్ధో మాన్యార్హోఽసి స దైవహి॥ ౯౯

శ్లో॥ సకుండలోఽశీతి తమ శ్శ్వేతవర్ణ స్సుధీవరః
దక్షిణే శ్రీమత స్తస్య కరే వై దానకంకణః॥ ౧౦౦

తం పరమర్షి రివ తేజస్వినం నత్వా స కర్షక ఇదం వ్యజిజ్ఞపత్॥

దేవ ! నాఽస్మాక మయం నిధి - స్త వైవ - త త్త్వమేవ గృహాణ॥

తచ్ఛ్రుత్వా స బ్రాహ్మణ ఆర్యా నిద మువాచ॥ ౧౦౩

పశ్య తాఽసంఖ్యేయా రత్నమణికనకకణికా స్సాక్షరాః ప్రాచీనాశ్చ నిష్కా నిధా వస్మిన్ - వృత్తి రస్య కర్షకస్య లోకోత్తర తరా - య దయం నిధి మపి లబ్ధం న కాంక్షతి॥ ౧౦౪

మ య్య స్యాఽతి తరా భ క్తి - రస్య సహధర్మిణ్యాశ్చ - త న్మహ్య మేవ నిధి మర్పయతి - త న్న కార్యం - కథం మ మైవ బ్రాహ్మణస్య భవిష్యతి॥ ౧౦౫

శ్లో॥ అ స్యాఽహం శ్రేయ ఇచ్ఛామి స దై వాఽతికుటుంబినః
దై వా దస్మై నిధి ర్ల బ్ధః భూయో మమ కథం భ వేత్॥ ౧౦౬

ఏవ ముక్త్వా స సాదరం తం కర్షక ముద్దిశ్యేద మువాచ॥ ౧౦౭

సౌమ్య ! నిధిం గృహీత్వా సుఖం జీవస్వ - ఇష్టాన్ భోగాన్ భుంక్ష్వ సత్కర్మాణి కృత్వా యశో లభస్వ - దీనా ననా థాన్ చ స్వ జనాన్ చ ప్రీణయ - మందిరారామసకలవస్తు సంపన్నో భవ నాయం మమ నిధి ర్భవతి - న మే ప్రతివాక్యం వాచ్యం॥ ౧౦౮

అథ తచ్ఛ్రుత్వా ప్రణమ్య సరళోవాచ॥ ౧౦౯

దేవ ! నాఽస్మాక మయం నిధి - ర్యత స్తవక్షేత్రే లబ్ధోఽయం - కృషి రే వాఽస్మాకం మహా నిధి - స్తస్యా మేవ వృత్తిః - వయం కర్షకా - బ్రాహ్మణస్వం విష మివ న స్పృశామః - కిం పున స్తవ ధనే నాఽనేన॥ ౧౧౦

న భోగా న్న మందిరారామాదీ న్న మహాంతి కర్మాణి న యశ శ్చ కాం క్షామః ప్రతివచనం క్షమ్యతామ్ - యది కృపా తవ దేహీదం క్షేత్రం చిర మితి॥ ౧౧౧

అథ స మహాత్మా తూష్ణీ మతిష్ఠత్ - సాఽపి తథావిధా బభూవ॥

తత ఆర్యా స్తం నిధిం శకటే ష్వారోప్య - గ్రామం గత్వార్యాలయే తం నిక్షిప్య తత్పరిష్కారార్థ మతిష్ఠ న్॥ ౧౧౨

త దైవ భగవాన్ శ్రీకృష్ణ స్త త్రాఽగమత్. ౧౧౩

అయం పూర్వకథాభాగః

ఇతి ద్వితీయోఽధ్యాయ స్సమాప్తః.

## తృ తీ యో ధ్యా యః.

అథాఽత్ర భగవతి యోగనిద్రాం గతే శ్రీకృష్ణే ప్రాత రభవత్॥ ౧

తతః ప్రభు రీశ్వర స్సహదారుకేణ సారథి నార్త్యై గ్గ్రామ పరిసరం గత్వా బహిఃకర్మాణి సత్వరం కృత్వా పున రాగమ్య తల్పేన్యషీదత్॥ ౨

తత స్సర్వే జనా జాగర్యాం విరమ్య తం ప్రభుం న త్వాఽతిష్ఠన్॥

తస్యాం నిశాయామేవ తత్ర సరళామందిరే గ్రామస్త్రియ స్సర్వ మంగళ ప్రముఖా స్తాం ద్రష్టుం గత్వా - తయా పూజితా శ్రీకృష్ణస్య ప్రభోః కరుణాం ప్రశంసన్ తస్యా భాగ్య మస్తువన్॥ ౪

సాఽపి తా శ్చ బహుధాఽప్రార్థయత్॥ ౫

తాస్తు శ్వః పాకకర్మసు తస్యా స్సాహ్యం కర్తు ముక్త్వా తోషయిత్వైవ స్వం స్వం గృహం యయుః॥ ౬

అథ భగవా నార్యా నుద్దిశ్య మిత్రశర్మణ స్సరళాయా శ్చ గృహేషు నానాపాకకర్మణామ్సాహాయ్యం కర్తుం యుక్తాన్ ప్రేషయధ్వమిత్యాజ్ఞాం దదౌ॥ ౭

శ్లో॥ అథాఽత్ర సరళాగేహే హృష్టా గ్రామస్త్రియ స్సదా
పాకకర్మసు వర్తన్తి కృష్ణా యామితతేజసే॥ ౮

శ్లో॥ తాసాం స్త్రియాం మహా ప్రాజ్ఞా బ్రాహ్మణీ సర్వమంగళా
సర్వకర్మాణి యుక్తాని వక్ష్య త్యథ పరీక్షతి॥ ౯

శ్లో॥ సరళాం చ సుశీలాం చ మహా ప్రాజ్ఞాం మనస్వినీమ్
అ ప్రీణయన్ స్త్రియ స్తా స్తామ్ కృత్వా కర్మాణి సత్వరం॥ ౧౦

శ్లో॥ ప్రభో ర్గోపాలదేవస్య పూజాం కర్తుం ముదా తదా
కాశ్చిత్ స్త్రియో గతాః కాశ్చి దత్రాఽతిష్ఠ న్త భక్తితః॥ ౧౧

అథ భగవాన్ తై ర్గ్రామీణై స్సహ స్నానాయ గ్రామా ద్బహి ర్గంతు మారేభే - దేవపూజోచితం దుకూలద్వయం గృహీత్వా దారుక స్త మనుయయౌ॥ ౧౨

తత స్త మాదిపురుష మీశ్వరం దృష్ట్వా చండాలవాటీ ప్రజా భీతా హరిణా ఇవ చ చేలుః - తాన్ దృష్ట్వా స ప్రభు రార్యాన్ గ్రామాధికారిణం చేత్థ మపృచ్ఛత్॥ ౧౩

క ఏతే భీతా దూరం చలం తీతి॥ ౧౪

తే చండాలవాటీ ప్రజా - స్తా న్నస్పృశామ ఇ త్యార్యా ఊచుః॥

కి మేతే జనా అస్పృశ్యనీయా - స్త త్కస్మా దితి భగవాన్ తతః పప్రచ్ఛ॥ ౧౬

ఆర్యా ఊచుః వయం న విద్మః - పురోహితో మిత్రశర్మా వేత్తీతి. ౧౭

శ్రీ భగవాన్ ప్రాహ - భవతు - తై స్సహ స్నాతు మిచ్ఛామి - తా నాకారయధ్వం. ౧౮

అథ తే త థాఽకుర్వన్. ౧౯

తతః పరంధామా సతు సర్వై స్తై స్సహ తటాకం గత్వాస్నాతు మారభత్ - త మార్యా గ్రామాధికారీ గణకశ్చ భక్త్యాస్నాప యామాసుః. ౨౦

తాన్ దృష్ట్వా సకలాః ప్రజా స్తస్య భగవత స్తథా పరిచర్యా మకుర్వన్. ౨౧

ఏవం స్నాత్వా స మహాత్మా తీరం ప్రాప్య దుకూలద్వయం ధృత్వా మార్గం జగ్రాహ - ప్రజా స్త మనుమయుః. ౨౨

అథాఽత్ర గ్రామే సర్వా యోషిత స్తం భగవంత మర్చయితు ముద్దిశ్య స్నాత్వా ఫల పత్ర పుష్పాణి ధృత్వా వటవృక్ష మాజగ్ముః.

తాసాం వార్తాం జ్ఞాత్వా చండాలయోషితోఽపి జగన్నాథం త మర్చయితు ముద్దిశ్య స్నాత్వా పత్ర పుష్పాణి సంగృహ్య చండాలవాటీ సమీపవట ప్రాన్తే నిరీక్షన్ సమతిష్ఠ న్॥ ౨౪

తతో భగవాన్ మత్తగజ ఇవ శనై స్త త్రాఽగమత్॥ ౨౫

తమ్ దృష్ట్వా తా భీతా శ్చ చేలుః॥ ౨౬

ఆర్య గ్రామాధికారి ప్రముఖా స్సోత్తరీయై స్త స్యాఽసన మకల్ప యన్. ౨౭

తస్మిన్ నిషీద్య భగవాన్ మిత్ర శర్మణే వార్తా మప్రైషత్. ౨౮

స ససంభ్రమ మాగమ్య ప్రణమ్య తతోఽతిష్ఠత్ - తం భగవా నపృచ్ఛత్. ౨౯

బ్రహ్మన్ చండాలతా కథమ్ - కస్మాత్ స్పర్శదోషః - ఏతాసు యోషిత్సు మమ కృపా జాయతే - త్వమేవ వక్ష్యసీత్యార్యా ఊచుః త ద్బ్రూహీతి ప్రభు రవదత్. 30

మిత్ర శర్మాఽహ దేవ! నాఽహం జానామి - మమాఽపి చండాలత్వే మహాన్ సంశయః - ఆచారా త్తచ్చర్యాం న కరోమి - కించ తదశ్రద్ధాయా మపి పాప మితి మన్యే - భవాన్ సర్వజ్ఞ స్సర్వాత్మా సర్వసాక్షీ చ - తస్మా త్త్వమేవ వక్తు మర్హసి; కే వయం భగవతి త్వయి మహాత్మ నీతి. 3౧

తచ్ఛ్రుత్వా భగవాన్ హసన్ నువాచ - న మానుష్యే స్పర్శదోషః శాస్త్రేష్వపి న పంచమో వర్ణః - ఆదౌ బ్రాహ్మణ త్రైణో వర్ణః కాలే చత్వారో వర్ణాః అభవన్ - తేష్వపి న స్పర్శదోషః - వర్ణా పరిణామవశా ఇతి జ్ఞేయా స్త చ్ఛాస్త్రేషు పృథగ్విధా వాదాః కించ.

శ్లో॥ న బుద్ధిభేదః కార్యోఽత్ర - వర్ణేషు వివిధే ష్వపి
సమం పశ్యంతి విద్వాంసో; ముహ్యంతేఽత్రాల్ప చేతసః. 33
ఆచారస్య సమాదృష్టి ర్మూలమాత్మవిదాం సతాం
య త్రాఽభేద స్సఆచార - ఆచారా వివిధా స్స్మృతాః. 3౪

శ్లో॥ బ్రహ్మఘ్నశ్చ గురుఘ్న శ్చ గోఘ్నః క్షేత్రఘ్న ఏవచ
సత్వఘ్న శ్చ కృతఘ్నశ్చ చండాలా ఏవ ఖ ల్వమీ॥ 3౫

శ్లో॥ ఏతేషాం పాపినాం పాపీ గోఘ్న ఏవ న సంశయః
గోఘ్న ఏ వాఽస్పర్శనీయో ఇతి శాస్త్రవిదోఽబ్రువన్॥ 3౬

శ్లో॥ పురా బహిష్కృతా ఏతే యేనకేనాఽపి హేతునా
బహిష్కారోద్యనో కార్య ఏతేష్వపి దురాత్మసు. 3౭

శ్లో॥ స్థానం గ్రామే పునర్దేయ మేతేషా మల్పచేతసామ్
మానుషీ జాతి రేకైవే త్యూచురాత్మవిదో బుధాః॥ 3౮

శ్లో॥ యే నీతిబాహ్యా శ్చండాలా స్త ఏవేతి విదు ర్బుధాః
ధర్మస్య తపస శ్చాపి కారణం నీతిరేవహి॥ 3౯

శ్లో॥ ఇమా యథాఽత్ర దృశ్యంతే యోషితో హీనచేతనాః
దృష్ట్వైతా హి మనోమేఽస్య ద్రవతేఽపి చలత్యపి॥ ౪౦

ఇత్యుక్త్వా స మహాపురుష స్తాన్ మిత్రశర్మాదిమహాజనాన్ కాంచన గృహీ త్వోత్థాయ చండాలవాటీమ్ ప్రవిశ్య ఖట్వాగతాన్ స్థవిరాన్ రోగగ్రస్తాన్ రిక్తగృహాన్ చ తత్ర దృష్ట్వా హన్త హన్తే త్యుక్త్వా పున రాగ మ్యాసనే న్యషీదత్ - తం తత్ర తేజనాఽస్తువన్.

తత శ్చండాలయోషిత స్సర్వా అభీతా హృష్టా స్తం ప్రభు మపూజయన్. ౪౧

తతో మహాత్మా మిత్రశర్మాదీన్ సాదర మిద మువాచ. ౪౨.

అమీషా మనాథానాం దీయతామ్ యత్కించి దపి యుష్మాభిరితి యయాచే॥ ౪౪

అథ వస్త్రాణాం త్రయం త్రయం సర్వేషాం దాస్యామీతి మిత్ర శర్మా ప్రాగువాచ - తతో మాసత్రయస్యాఽలం ధాన్యం దాపయామ ఇత్యార్యాఊచుః - తతో గ్రామే స్థానాని సర్వోపకరణాని చ దాస్యామ ఇతి గ్రామనాయకగణకా వబ్రూతామ్ - సర్వేజనా యథాశక్తి ద్దాతు మవదన్ - అథ భగవాన్ స్వయం తేషా మనాథానాం సోఽప్యలమ యచ్ఛత్. ౪౫

ఏవం చండాలానాం సద్గతిం ప్రకల్ప్య సతైస్సహ గ్రామ మగమత్.

ఇతి తృతీయోఽధ్యాయ స్సమాప్తః॥

---

## చతుర్థో ధ్యాయః.

అథ స విశ్వాత్మా భగవాన్ తస్మిన్గ్రామే దేవాలయ ము ద్వీక్ష్య తస్మిన్ ప్రవిశ్య తదర్చకగణైర్మిత్రశర్మణాఽపి సహ విష్ణుదేవమూర్తిం యథావిధి సమ్పూజ్య నమస్కృత్య స్తుత్వా బహిర్జగామ. ౧

తత స్తదాజ్ఞయా సర్వే తే తద్దేవమూర్తిం భక్త్యా సంపూజ్యత త్రాఽగమన్. ౨

తాన్ దృష్ట్వా స మహాత్మా దృత్య భగవద్భక్తియోగం తేషా మబోధయత్ - తే సిద్ధార్థ బభూవుః॥ ౩

అత స్స భగవా నార్యాలయ మగమత్ - తమ్గ్రామయోషితసర్వా బాలికా యువతీ గృహిణీవృద్ధాః క్రమా దపూజయన్॥ ౪

సోఽపి తా అనుజగ్రాహ ౫

అథ స తు సర్వై స్తై ర్జనై స్సహ గ్రామా న్నిష్క్ర మ్యారామే
విద్యా శాలాం ప్ర త్యగమత్॥ ౬

తం మహాత్మానం తే గురవః ప్రహృష్టాః పూజయామాసుః తత
స్స పరమపురుషో విద్యాస్వరూప విశేషాదీన్ బోధయితు ముపక్ర
మ్యేద ముువాచ॥ ౭

నృణాం విద్యా - పరమస్వరూపం - యేషాం న సావిద్యా తేప శవః-
విద్యాప్రపంచే నరో నానా పుణ్యరూపాణి నానాచిత్రాణి నానాతీర్థ
విశిష్టవస్తూని పశ్యతి - తేషు లీనో భవతి॥ ౮

జ్ఞానం మానుష్యే పరమప్రాప్యం - తద్విద్యయా లభ్యం -బహవో
గ్రన్థా విద్యాస్వరూపాంగాని॥ ౯

మస్తిష్క మితి సహస్రారం నృణాం పరమం యన్త్రం - మన స్త
స్యాంగం - మన ఏవ మధుకరో మధు యథా జ్ఞాన మాకృష్య తస్మిన్
నిక్షిపతి - యస్య న మస్తిష్కప్రభావ స్స కేవలం పశుః॥ ౧౦

సహస్రారచక్రగతం జ్ఞానరూపేణ చిత్తే స్థిత్వాత్మాన మావృత్య
సర్వేషు లోకే ష్వాభాతి - త దసాధారణ మగోచరం భవతి॥ ౧౧

విద్యావాన్ తస్మై సహస్రారాయ జ్ఞాన మార్జయతి - తస్మిన్నేవ
తన్మహిమా॥ ౧౨

విద్యావత ఏవ పరం శాంతి - ర్నాఽన్యేషామ్ - తత్రోదాహరి
ష్యామి॥ ౧౩

కశ్చి న్మహాధనీ కస్మింశ్చి త్పట్టణే పురాసీత్ - స బహుభి ర్మార్గై
రపారు ధన మార్జయత్ - బంధుమిత్ర దాసదాసీశ్చ తై స్సహ స నిత్యం
సుఖ మధివసతి స్మ - పరం న తస్య శాంతిః - మహానిర్వేదో బాధతేస్మ॥

ఏకదా స ఏకాంతే శాంతిం చింతయన్నాసీత్। ౧౫

తదా కశ్చిత్కుటీరవాసీ విద్యావాన్ తత్సమీపే మనోహరం గాతి - తచ్ఛ్రుత్వా స కింకరై స్తమాకారయామాస - స తు సమాగతః॥ ౧౬

తమాదృత్య సౌమ్య! నాఽహం శాంతి ముపైమి - అస్తి మహాన్ ధనసంచయః - బంధుమిత్రదాసదాసీశతవిన్యాంసోఽపి సంతి - స్వాపుత్రాఽపి పరాభవః - వివిధవ్యవహారై ర్ధన మపార మార్జయిష్యామి - త్వా మహాం న వేద్మి - కుటీరవాస స్తవ నోచిత ఇతి మన్యే॥ ౧౭

భవతు! కేనోపాయేన శాంతిపూర్ణో భవా నసి - త త్సమ్యగ్ బ్రూహీతి ధనవాన్ పప్రచ్ఛ॥ ౧౮

తచ్ఛ్రుత్వా సోఽప్యువాచ - భద్ర! శాంతి స్సంతృప్త్యైవ లభతే - తృష్ణాగ్రస్తస్య పుంసో న కథంచి దపి తృప్తిః - తస్మా త్తృష్ణాం విజిత్య వివిధవ్యవహారేషు వృత్తిం కురుష్వ॥ ౧౯

ఇంద్రియసుఖే పశుపక్ష్యాదయః - మనస్సుఖే మనుష్యాః - ఆత్మసుఖే దేవా రమంతి - త త్త్వం ధనై ర్గ్రామ్యసుఖే వర్తసి - కథమ్ తే శాంతిః॥ ౨౦

మానుష్యే మనస్సుఖం - తత్ప్రభావో విద్యాప్రపంచఏవ॥ ౨౧

విద్యాప్రపంచ ఏవ గ్రన్థాః॥ ౨౨

తస్మిన్ లోకే నానాచరిత్ర విచిత్రదృశ్యాః ప్రసిద్ధాః బహూని చిత్రాణ్యపి చ - అభ్యాసేన యోగసేవయాఽపి మనో నిగృహ్య - తన్మయత్వ ముపేత్య విద్యాలోకే విహరస్వ - తదా శాంతి ముపైషి - విద్యాహీనస్య న తద్దుర్లభతరం॥ ౨౩

ఇత స్సమీపే మమ కుటీరః - న త్వమ్ వేత్సి - త్వా మహం వేద్మి - భృతిం కృత్వాఽహమ్ సభార్య స్సుఖేన కాలం గమయిష్యామి,

కించన కించన భృతే ర్విత్తం సంగృహ్య గృహే స్థాపయామి - సంచితం ధనం సమయే ప్రయోజనాయ భవ తీతి విద్మహే॥ ౨౪

తృప్తి రేకా మమ సర్వేషు కర్మసు ఫలం - విద్యాలోకే మదీయం మనో విహరిష్యతి - కర్మసు దేహో వర్తతి - తస్మాచ్ఛాంతిమ్ లభామి - యది త్వం శాంతి మిచ్ఛసి విద్యాయాం మన ఆధత్స్వ - అపరోక్ష జ్ఞానేన శాంతి రితి శాస్త్రం॥ ౨౫

ఇ త్యుక్త్వా స విద్యావా న్స్వగృహ మగమత్॥ ౨౬

ఇతి చతుర్థోఽధ్యాయ స్సమాప్తః.

---

## పంచమోఽధ్యాయః.

అథ భగవాన్ తా న్గ్రామీణా నిదమువాచ॥ ౧

మానుష్యే విద్యా పరమం రూపం - సుకృతై ర్దుష్కృతై రపి సార్థం సా తమనుయాతిస్మ॥ ౨

అ స్యోదాహరణం ప్రవక్ష్యే - శ్రూయతాం॥ ౩

పురా కాశీపుర్యాం మహం సాందీపగురు ముపాస్య విద్యా మలభం॥

కదాచన సహాధ్యాయై స్స హాఽహం వినోదార్థం గంగాతీరమగమమ్ - తతో రాత్రి రభూత్ - అంధకారో జగ త్సర్వ మావృత్య భయ ముత్పాదయామాస - తదా మార్గమధ్యే పితృవనే భ్రమన్ కంచన వటవృక్షం వయ మగచ్ఛామః - తస్మిన్ తదా కశ్చి ద్బ్రహ్మ రాక్షసో వేదం పఠన్ నతిష్ఠత్॥ ౫

తచ్ఛ్రుత్వా వయం సర్వే భీతా అభవామ॥ ౬

అ థాహం త మభీషయమ్॥ ౭

తత స్స బ్రహ్మరాక్షస స్తరో రవతీర్య సామ్యాకారే ణాస్మా
న్నిదం సాదర మువాచ॥ ౮

అహ మేతత్పురవాసీ బ్రాహ్మణో మహావిద్వాన్ ప్రభుభి ర్వివిధ
సత్కార - సమ్మానితః పురా కిలాఽభవమ్॥ ౯

ధన విద్యామదాది దుర్గుణా మయి బాఢం ప్రవర్తంతే స్మ
బహవ శ్శిష్యా మా ముపాశ్రయ న్నరాజంత - తేభ్యో విద్యాశుశ్రూ
ష్మయా న దత్తా - బహవో విద్వాంసో నిర్దయం మయా విజితాః -
బహవోఽర్థినో మయా నిరాకృతా భర్త్సితా శ్చ - త్యాగే మమ
మనో నాఽవర్తత॥ ౧౦

ఏవం దుర్మతి రహం కాలే పంచత్వం ప్రాప్య బ్రహ్మరక్ష స్త్వ
మగమమ్ - క్షుత్పిపాసాఽశాంతి నిర్వేదసంభ్రమ భీతివ్యథాదిభి రేవం
దైన్య ముపేత్య బహు ఖేత స్తతో భూతగణై స్సహ పరిభ్రమామి -
కర్మపాకం చింతయన్ సంతపిష్యామి - కిం ప్రయోజనమ్ - విద్యయా
కించిత్కదాచి త్కుత్రచి చ్ఛాంతి ముపేష్యే - తదర్థ మేనం వేదం
పఠ న్నిత స్తిష్ఠే - విద్యాప్రభావాదస్యాం దురవస్థాయా మపి శాం
తిం కథంచన లభే - న సర్వేషాం భూతానా మేనం శాన్తిః - యది
వో విద్యాయా మిచ్ఛా తదవశ్యం శ్వో రాత్రి మారభ్యేత ఆగచ్ఛ
ధ్వం - మత్తో న కస్యచి దపిహాని ర్భవిష్యతీ త్యుక్త్వా న భూతోఽ
న్తర్దధే॥ ౧౦

తతో వయం కథమపి గురుమందిరం ప్రాప్య తస్మై సర్వం నివేద్య
తదాజ్ఞయా తేన బ్రహ్మరక్షసా కాంచి న్మహార్థాన్ సమ్య గలభామ॥

ఇతి పంచమోఽధ్యాయ స్సమాప్తః.

ష ష్ఠో౽ ధ్యా యః.

తతో భగవాన్ తాన్ జనా నుద్దిశ్య విద్యా ప్రభావ ముపన్యస్య
భూయ ఉవాచ॥ ౧

మానుష్యే విద్యామహిమా ప్రాణః - తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం -
యో౽విద్య స్స పశుః - త ద్యూయం బహూని సమ ర్జ్యై తాః
గురూ నారాధ్య భవతాం సంతానేషు విద్యాం స్థాప యధ్వం - విద్యా
యాం న జాతిలింగాది భేదః కార్యః - యో విద్యావాన్ సఏవ కృతార్థః-
నా౽ న్యః॥ ౨

అద్య రాజానో యుద్ధ ప్రియా వ్యసనిన శ్చ - త త్తే గురుభ్యో న
దాస్యంతి - న దాపయిష్యంతే చ - కించి త్కదాచి ద్దాపయంతి - తస్మా
ద్విద్యా ప్రజాసు న రాజత్యేవ॥ ౩

త ద్యూయం గురూభ్య ఏతేభ్య స్సర్వం సమర్ప్య విద్యాం లభధ్వం॥

శ్లో॥ ఈశ్వరస్తు గురూ రాజా పూజ్యా ఏతే త్రయో భువి
యో౽తివ ర్తతి దుష్టాత్మా హ్యేతాన్ స తు నరాధమః॥ ౫

శ్లో॥ అసమర్ప్య గురుభ్యో యో ధనాదీని సుదుర్మతిః
కృపణః కాంక్షతే విద్యాం భ్రష్ట స్సో౽ధః పతిష్యతి॥ ౬

పురా కాచి ద్దీనా యోషి దాసీత్ - తస్యా ఏకఏవ బాలకః - స
గురూ నాశ్రిత్య పఠతి స్మ॥ ౭

అథ కదాచన కశ్చి ద్దాతా తస్యై తండులశాక గుడక్షీరఫలాదీ
న్యదాపయత్॥ ౮

తాని గృహీత్వా గృహే స్థాప్య సాతు క్వా౽పి య యా॥ ౯

అథ తస్యా బాలక స్తాని సర్వాణి గురుభ్య స్సమర్పయత్॥ ౧౦

తత స్సాతు గృహం ప్రాప్య తాని వస్తూ న్యదృష్ట్వా శోచన్

క్రీడంతం బాలక మపృచ్ఛత్ - సతు హృష్ట స్స్వచేష్టిత మకథయత్॥
సాఽపి ప్రహృష్టా భూత్వా తం బాలకం స్తుత్వాఽ భాషత॥ ౧౨

అథ తస్మిన్నేవ సమయే సగురు స్తాని వస్త్రా ణ్యాదాయ తత్రాగమ్య తస్యై దీనాయై ప్రత్య దాత్ - భూయః కానిచి ద వ్యయచ్ఛత్॥ ౧౩

ఏవం విధాని బహూని నిదర్శనాని సంతీతి ప్రోక్త్వా సమహాత్మా భూయో గురూన్ దృష్ట్వా నిష్యా నేతవ్యా ఇత్యభాషత॥ ౧౪

తే తథే త్యుక్త్వా సర్వాన్ శిష్యా నానీయ తస్య భగవత స్సన్నిధా వ స్థాపయన్ - తాన్ బాలకాన్ దృష్ట్వా సోల్లాసం స ఇద మువాచ॥

విద్యాప్రభావో భవద్భిరపి శ్రుత ఇతి మన్యే - గురుషు విధేయా భూత్వా సర్వవిద్యాః ప్రాప్యకృతార్థా భవత - గురుషు భక్తిః ప్రేమా వార్జవం మార్దవం చ కార్యాణి. ౧౫

యే గురుషు విధేయాస్తే విద్యాపారం తరన్తే - నాఽన్యే॥ ౧౬

గురు ష్వతివర్తనం న కార్యమ్. ౧౭

గురు భ్యః ప్రాణాదిసర్వం దేయం. ౧౮

విద్యా చ వృత్తయోఽపి గురుభిరేవ ప్రాప్యాః, కులం, గ్రామశ్చ దేశశ్చ మానుష్యం చ భవద్భి రేవ మహతీం దశాం ప్రాప్య విరాజ్యం తామ్. ౨౦

ఏవ ముక్త్వా స ఆదిపూరుష స్తేభ్యో హేమనిష్క-శతానాం పంచ దత్వా శీ రవదత్ - తత స్తన్మహాకార్యం దృష్ట్వా సర్వేఽస్తువన్ ప్రణేము శ్చ. ౨౧

ఇతి షష్ఠోఽధ్యాయ స్సమాప్తః.

# సప్తమోఽధ్యాయః.

అథ భగవాన్ పంచశతహేమనిష్కామూల్యవస్త్రయుగళాని పాత్రే నిధాయ తద్గురుభ్యో దత్వాఽస్త్రవీత్. ౧

తద్గృహీత్వా తే ప్రహృష్టా లజ్జయే వానతా అభవన్. ౨

తత స్తా నుద్వీక్ష్య సోఽపి సాదర మిద ముచాచ. ౩

శ్లో॥ అస్య సర్వస్య లోకస్య గురవో జ్ఞానహేతవః।
ధన్యో భవతి నో కోఽపి గురూణామ్ కృపయా వినా॥ ౪

శ్లో॥ సువృత్త్యా సహ శిష్యేభ్యో విద్యాదేయా నిరంతరం
అసూయాపంచనాదీని మా కస్యాఽపి చ కుత్రచిత్॥ ౫

శ్లో॥ అశ్రద్ధాం వంచనం చాఽపి చేర్ష్యాం కుర్వన్తి యే సదా.
శిష్యేషు గురవః క్రూరా నరకం యాన్తి తేఽధమాః॥ ౬

శ్లో॥ సువృత్త్యాహి వినా విద్యా న కుత్రాఽపి విరాజతే
విద్యా చైవ సువృత్తిశ్చ ద్వే పూజ్యేతే నిరంతరం॥ ౭
ప్రాణో విద్యా సువృత్తేశ్చ తస్యా స్సా ప్రాణ ఏవచ
మనుష్యో జయతే తాభ్యా మిద మీశ్వర శాసనమ్॥ ౮
భూదేవా గురవో నూనం దేవత్వ మఖిలాః ప్రజాః
యై ర్యతః ప్రాప్నువ న్తీహ మృత్యుం జిత్వా రమన్తి చ
ప్రమాణం భవతాం వృత్తి శ్శిష్యాణా మస్తు సర్వథా
మాభేదవాదనిర్వేదఖేదాః కుత్రాఽపి కర్హిచిత్॥ ౧౦

శ్లో॥ కవిః కృషీవలో రాజా గురుశ్చ పరమార్థవిత్
ఏతే లోకస్య చత్వారో గురు స్తేషా మనుత్తమః॥ ౧౧
లోకస్య వయ మేవేతి గురవః ప్రేమ బంధురాః
దత్వా విద్యా స్సువృత్తిం చ ప్రాప్నువం త్యుత్తమాం గతిమ్॥

పురా శంఖ లిఖితా వితి మహర్షీ ద్వా వాస్తామ్ - తయో రాశ్రమా
వర్ణీ తటే ప్రసిద్ధౌ॥ ౧౩

అథ కదాచన తయో శ్శంఖ స్స శిష్యైః క్వాఽపి యయౌ॥ ౧౪

తత స్స శిష్యైః కేచన మునయో లిఖితం ద్రష్టు మాగతాః - స
తాన్ సాదర మపూజయత్॥ ౧౫

అథ శంఖ శిష్యా నుక్త్వా తదాశ్రమే కానిచి త్ఫలమూలాదీని గృహీ
త్వా లిఖిత స్తాన్ మునీ నతర్పయత్ తే హృష్టా స్తతో జగ్ముః॥ ౧౬

తదా శంఖ స్సమాగతః - తస్మై లిఖిత స్సర్వ మకథయత్ - త
చ్ఛ్రుత్వా స ప్రాహ॥ ౧౭

భ్రాత ! రనుచితం కర్మ త్వయా కృతం - గతే మయి యత స్త్వయా
మదాశ్రమే ఫలాదీని బలా దివ గృహీతాని - నాఽయం ధర్మశాస్త్ర
న్యాయః - ధర్మశాస్త్ర కర్తౄణా మస్మాక మిదం న కార్యం, వయం
శిష్యాణాం లోకస్యాఽపి ప్రమాణమ్॥ ౧౮

త ద్రాజ్ఞ స్సన్నిధిం గత్వా యథోచితం దండ మాప్నుహి -
మా చిరం॥ ౧౯

తచ్ఛ్రుత్వా లిఖిత ఆహ - త్వం మదగ్రజః పితృసమో గురు శ్చ
మహా తపస్వీ చ - త త్త్వమేవ మయి దండం విధాతు మర్హసి - కి
మత్ర రాజ్ఞా కార్యం॥ ౨౦

శంఖః - శిక్షా రక్షా దీనాం రాజ్ఞ ఏ వాఽధికారః, నాఽస్మాకం,
త ద్రాజ సన్నిధిం గ చ్ఛేతి॥ ౨౧

తతో లిఖిత స్సశిష్య శ్శంఖశిష్యై స్సహ గత్వా రాజానం దదర్శ॥

రాజా తమ్ సంపూజ్య కార్య మపృచ్ఛత్॥ ౨౩

స సర్వం తస్మై వ్యాకథయత్॥ ౨౪

రాజా - త్వ మపి ధర్మశాస్త్ర ప్రణేతాఽసి - కథం త్వయి దోషః - రాజ్ఞః కథం త్వ య్యధికారః - పరీక్షార్థ మేవ మాగత ఇతి మన్యే ఇద మనుచితం కర్మ - ఇత్యబ్రవీత్. ౨౫

లిఖితః - మా మైవం వద - కేవలం మయి దోషః తదహం దండ్యః దండం కురుష్వ. ౨౬

రాజా - యద్యేవం తర్హి నూన మహం త్వ య్యనుగ్రహం కరోమి - త చ్ఛుభం గచ్ఛ - నిగ్రహానుగ్రహే రాజ్ఞా ముభా వాధికారౌ. ౨౭

లిఖితః మా మైవం - అవశ్యం మయి దండో విధీయతాం యథా చోరే - ఏష ధర్మశాస్త్ర క్రమః - శంకాఽత్ర న కార్యా. ౨౮

తచ్ఛ్రుత్వా స రాజా విషణ్ణో భూత్వా తస్య మహర్షే ర్బాహు యుగం ఛేదయామాస. ౨౯

అథ స మునివర శ్ఛిన్నబాహు ర్గత్వా శంఖాయ సర్వం న్యవేద యత్ - స తపోమహిమ్నా తస్య బాహూ యథాపూర్వ మకల్ప యత్. ౩౦

ఏషా శంఖలిఖితయో స్సువృత్తిః ప్రథితా.

ఇతి సప్తమోఽధ్యాయ స్సమాప్తః.



## అష్టమోఽధ్యాయః.

భగవాన్ - గురవః కేవలం ధర్మనిష్ఠాయాం ప్రవర్తంతు ఆపత్స్వపి ధర్మనిష్ఠా న త్యాజ్యా. ౧

ఆసీత్పురా ధర్మనిష్ఠాపరః కశ్చిద్గురుః - తస్మై కశ్చిన్నృప స్సర్వం దాపయిష్యతి. ౨

కదాచిద్రాజా తమాకారయిత్వా సంపూజ్యేత్థం ప్రాహ. ౩

త్వం పరముపకారే చరసీతి శృణ్మః .. తద్భావ్యం - రాజధర్మా స్త్వయా శిష్యాణాం బోద్ధవ్యాః. ౪

సర్వేషాం ధర్మాణాం రాజ్ఞాం సంగ్రామ ఏవ మహాన్ ధర్మః, యో యుద్ధే మ్రియతే తస్యైవ స్వర్గః - నాఽన్యేషామ్. ౫

మనుష్యాణాం కృపా న కార్యా - కృపైవ భీతిరితి వాచ్యా - రాజ్ఞాం కేవలం కరుణా హానికరీ - తయా నకీర్తి - ర్న ప్రతాపః. ౬

బ్రాహ్మణా గురవో యుద్ధమర్యాదామ్ నవిందన్తి - తే భోజన ప్రియా ఇతి జనశ్రుతిః - త్వం రాజవంశ్యః, ధీరపురుషశ్చ - త త్త్వయా సర్వేషామ్ యుద్ధ మహిమా బోధనీయః. ౭

యుద్ధం మహాకార్య మితి స్మర - యుద్ధహతానా మేవ స్వర్గో, ధర్మశ్చ కీర్తిశ్చ, సర్వే జనా అనేన మార్గేణ స్వర్గం యాన్తు - త్వ మపి తత్ఫల మాప్నోషి. ౮

తచ్ఛ్రుత్వా గురు రువాచ - రాజన్ యుద్ధ మకార్యం - అసంపూర్ణాయుషో యుద్ధ నిహతా నూనం పిశాచా భవంతి - కృపయైవ స్వర్గం ధీమాన్ లభతే - యుద్ధేషు కృపాం కథమ్. ౯

లోకక్షయకరం యుద్ధం - బుద్ధిమన్తో యుద్ధ వార్తా మపి న శ్రు ణ్వన్తి - యుద్ధేన ధర్మః క్షీయతే - తస్మా ద్యుద్ధరతిం త్యజ - స్నేహా

త్విజా రంజయ - ధర్మే జీవస్వ - కృపా మవలంబస్వ - న దారుణం కర్మ సమాచర - చిరా దహ మిదం తే వక్తుం కాంక్షే - న సమయః.

తచ్ఛ్రుత్వా క్రుద్ధో రాజా ధి జ్మూర్ఖ! మా మైవం బోధయేతి జగర్జ. 11

గురు రువాచ - అహం ధర్మ ముద్దిశ్యైవం బోధయామి - యుద్ధ మకార్య మితి భూయో వక్ష్యే - ధర్మా న్న చలిష్యే. 12

అథ స రాజా క్రుద్ధ స్తం కింకరైః కారాగృహేఽపాతయత్. 13

భూయ స్త త్పుత్ర మాకారయిత్వా యథాపూర్వ మవదత్.

బాలోఽపి స ధీరః పితృపక్షేఽవదత్ - మాన్యో మమ గురు స్త్వయా దుర్గతిం ప్రాప - త త్పాపేన మ్రియ సీతి భూయోఽప్యు దాహరత్. 14

తచ్ఛ్రుత్వా రాజా స తీవ్రేణ ఖడ్గేన తస్య శిర శ్చిచ్ఛేద. 15

భూయో గురుపత్నీం గృహా ద్బలా న్నిస్సారయామాస - తద్ధనా న్యాహరత్. 16

ఏవ మకార్యం కృత్వా సోఽన్తఃపురం ప్రవివేశ. 17

అథాఽమాత్యమహామాత్రకర్మసచివాద యో రాత్రౌ తం గురుం కారాగృహే దృష్ట్వా విమనస స్సర్వం తస్మై జ్ఞాపయిత్వా రాజ్ఞో మతం గృహాణేతి ప్రార్థయామా సుః. 18

తచ్ఛ్రుత్వా స నిర్విణ్ణో రీ హసన్ తా నువాచ - యూయం రాజ్ఞి భీతా ఏవం వక్ష్యథ - ధర్మో నాఽవలంబితః - సర్వభ్రష్టోఽప్యహం ధర్మేణైవ శాంతి ముపైమి - రాజ్ఞో మన ఆరాధ్య ధర్మే తం స్థాపయ ధ్వం యుద్ధ మకార్యం. 20

యదా బుద్ధిం ధర్మే నిధాయ రాజా మాం ద్రష్టు మాయాతి త దాఽహం తేన సహా ముదా గమిష్యామి - యూయ మద్య గచ్ఛధ్వం మా సంతాపః. ౨౧

తత స్తే నిరాకృతా ఇవ స్వం స్వం గృహం జగ్ముః. ౨౨

అథ చిత్రాశ్వో నామ మహారాజా మహాసేనాసమేత స్త ద్రాజ్ఞః పుర మావృత్య తత్పుత్రం సైన్య స్యాఽర్థం హత్వా తం దుష్టం రాజానం బధ్వా తం కారాగృహే స్థాపయితుం ప్రేషయిత్వాఽమాత్యాదీనాహూయ సాదర మిద మాహ. ౨౩

దురాత్మా భవతాం రా జాఽస్మాభి ర్బద్ధః - తత్పుత్రో హతః - సైన్యస్యాఽర్థ మపిచ హతం - యూయంచ రాజ్యం సర్వం మద్వశ మభూత్. ౨౪

యుద్ధం యుద్ధమితి స దురాత్మా సదై వాఽస్మాన్ భీషయతి - దూషయతి చ - తత్ఫల మద్యై వాఽప - న మే యుష్మాకం రాజ్యే నాఽన్యేన ప్రయోజనం - త ద్యూయమేవ రాజ్యం కురుధ్వం - అథవా రాజ్ఞ స్సంబంధినం కంచన రాజానం కురుధ్వం - ఇ త్యుక్త్వా స రాజా స్వదేశం జగామ. ౨౫

తతో మన్త్రిప్రముఖా స్సర్వే సమాలోచ్య కారాగృహబద్ధం గురుం మోచయిత్వానీయ సాదర మిత మూచుః. ౨౬

వైరిరాజ్ఞ శ్చిత్రాశ్వస్య హస్తగతోఽభూ ద్రాజా - రాజకుమారోఽపి హతః సైన్య స్యాఽర్థ మపి హతం చ - వయ ముపాయే నాపద మతీరామ - త్వ య్యకార్యం సోఽకార్షీత్ - యుద్ధవ్యసనే తస్య మనోలగ్నం - వృథాఽభి మానిన స్త స్యాఽనురూపం ఫల మభూత్ - త వోపదేశ స్తస్మిన్ నిరర్థకోఽభవత్ - తత్కారణే నేయం దుర్దశా

ప్రాప్తా - క్షితిమితఃపరం కార్యమితి చింతయామః - తవ ప్రజ్ఞయా కార్యం సాధ్యమితి నిశ్చిత మితి. ౨౭

తచ్ఛ్రుత్వా స క్రుద్ధ ఇ వేద ముద్వాచ - అః వంచనపరాయణై ర్యుష్మా భీ రాజా శత్రువశం గతః - రంధ్రాన్వేషిణాం వః కుతో ధర్మో విశ్వాసశ్చ - శత్రువశం గతే రాజ్ఞి సర్వం రాజ్యం విభ జ్యోపభోక్తు మిచ్ఛా వ స్సుదృఢతరా - తేనైవ కల్మషేన రాజ్యం సమూలం నష్ట మభూత్. ౨౮

తచ్ఛ్రుత్వా తేఽబ్రువన్ - మా మైవం వద - వయం న తద్విధా రంధ్రాన్వేషిణః - రాజ్ఞి నోఽస్మాక మవిశ్వాసః - ప్రాణభియా వయం తదా మన్దా అభవామ - సమయే వీర్యం దర్శయిష్యామః - భవతః ప్రజ్ఞా బలేన దుర్గతిం తరిష్యామః. ౨౯

తచ్ఛ్రుత్వా స దీర్ఘ మాలోచ్య తా నాదాయ చిత్రాశ్వమహా రాజానం దదర్శ - స తా నపూజయత్. 30

తత స్స గురు స్తం భూపతిం బహుధాఽ స్తవీత్. 3౧

స రాజా తేన తుష్ట స్తం గురు ముద్దిశ్య వాంఛాం వః పూరయిష్యా మీ త్యవదత్. 3౨

గురు రువాచ - విభాగోఽస్మాకం రాజ్యస్య నోచితః - మంత్రి ప్రముఖా స్త దర్థే కలహం కుర్వంతి - త న్నివార్యతామ్. 33

రాజా - రాజ్యవిభాగో నోచితః - తదర్థే విరోధో న కార్యః- కేనాఽ ప్యుపాయేన సమాధానం కృత్వా యూ యం రాజ్యం కురుధ్వమితి.

గురు రువాచ - నాఽస్మాసు సమాధాన క్రియా - త దస్మాకం రాజానం విముచ్య దేహి - సోఽద్య బాధ మను తాపేన నూనం శుష్యతి- తదల మితి. 3౫

తచ్ఛ్రుత్వా రాజా హసన్ బహుధా ప్రతివాక్యా న్యుక్త్వాఽన్తే ప్రసన్నో భూత్వా రాజాసం వ స్సమాదాయ గచ్ఛ తే త్యబ్రవీత్.

తచ్ఛ్రుత్వా స గురుః ప్రహృష్టః కారాగృహం గత్వా తం పూర్వాపకారిణం రాజానం స్వయ మమోచయత్. ౩౭

తత స్స రాజా లజ్జ యాఽధోముఖ స్తస్మిన్ గురౌ శ్రుణ్వ త్యాత్మనతి చాత్మానం బాధ మ దూషయత్. ౩౮

అథ స తం సాన్త్వయిత్వా దాయ చిత్రాశ్వ సన్నిధి మగమత్.

స హసన్ తం క్రూరం రాజానం బహుభిః కఠినై ర్వాక్యై ర్దూష యిత్వా తతో యథేష్టం గచ్ఛగచ్ఛే త్యుచ్చై రవదత్. ౪౦

తత స్స మహాగురు స్తం దుష్టం రాజాన మాదాయ మంత్రి ప్రముఖై స్సహ స్వదేశ మగమత్ - త మేవ పునా రాజాన మకరోత్.

స తస్మిన్ గురౌ విధేయః ప్రజా రంజయన్ రాజ్యం చిరంకాలం శశాస యశ శ్చ పరమం ప్రాప. ౪౧

ఇత్యష్టమోఽధ్యాయ స్సమాప్తః.

---

అథ భగవాన్ తాః ప్రజా ఇద ముహాచ. ౧

ప్రాజ్ఞో గురు శ్శిష్యాన్ స్వప్రజా ఇవ పాలయతి - న తస్య పక్షపాతః నత్యాధారో విద్యాం సత్యే ప్రాపయతి - స ఏవ లోకస్య ప్రమాణం శృణుధ్వం. ౨

ఆసీత్కస్మిం చిద్ గ్రామే దరిద్రో మహా ప్రాజ్ఞః కుటుంబీ చ కశ్చిద్గురుః స శిష్యాన్ స్వప్రజా ఇవ సమం పశ్యన్ విద్యాం దాస్యతి. ౩

తస్య పుత్త్రేణ సమ మపరః కశ్చి ద్బాలకః పఠతిస్మ. ౪

తయో రేకమేవ శాస్త్రం - పాఠశ్చ - సఖ్యం చ తయో స్సుదృఢతరం. ౫

అథైకదా తయోః కఠినతరః పాఠః కశ్చి చ్ఛాస్త్రేఽభవత్. ౬

తదా గురుపుత్త్ర స్తం సభాయం కౌతూహలా దిద ముహాచ - సఖే ! స్మిన్ పాఠే ఆవయోః ప్రజ్ఞా ప్రకటీక్రియతా మితి. ౭

తథాఽస్త్వితి స ఉత్తర మదాత్. ౮

వృథా వికత్థనా దలం - పణం కరిష్యావ ఇతి గురుపుత్త్రోఽవదత్ తథాఽస్త్వితి స బాలక ఉత్తర మదాత్. ౯

పణం కరోమి - శృణు ! పాఠేఽస్మిన్ కః ప్రథమః తస్యైవ జయః తస్య ద్వితీయో ద్వాదశవర్షపరిమితాం సేవాం కరో త్వితి గురుపుత్త్ర ఉవాచ - స తు తథాఽస్త్వితి పున రుత్తర మదాత్. ౧౦

తచ్ఛ్రుత్వా సర్వే శిష్యా స్సాధు సాధ్వితి తా వపూజయన్-తత స్సర్వే స్వం స్వం గృహ మగమన్. ౧౧

గురుపుత్త్రో గృహం గత్వా ఖట్వ మాశ్రిత్య న జల్పతి, న భుంక్తే చ. తం గురుః పరామృశ్య వత్స ! కి మేత దిత్యపృచ్ఛత్. ౧౩

స బాలకో౽వక్రోక్తిభి ర్వక్తు మారభత్. ౧౪

తమ్ నివార్య స్పష్టీకురు ష్వేతి గురు రుచ్చై రవదత్. ౧౫

తత స్స వినయ మవలంబ్య సర్వ మకథయత్. ౧౬

తచ్ఛ్రుత్వా స మహాత్మా పర ముపేక్షా మవహత్ - భూయో నినిందచ. ౧౭

తతః పాఠపరీక్షాయాం గురుపుత్రః పరాజయ మవాప. ౧౮

త త్సహాపాఠీ పర మజయత్ - తం సర్వేజనా హృష్టా అస్తువన్.

అథ గురు రనేన మత్పుత్రేణ బాఢం సేవాం గృహీష్వేతి తం జేతారం బాలకం నిర్బబంధ. ౨౦

స బాలక ఇదం మ మాకార్య మిత్యుక్త్వా తం గురుపుత్రం పణా ద్వ్యమోచయామాస. ౨౧

అథ గురు ర్బహూ నుక్త్వా తౌ వుభౌ బాలకౌ విద్యాశాలాయా నిస్సారయామాస - పణం మా కురుధ్వ మితి శిష్యా నబోధ యత్ - శశాస చ. ౨౨

ఇతి నవమో౽ధ్యాయ స్సమాప్తః.



# ద శ మో౽ ధ్యా యః.

అథ భగవా నువాచ.

శ్లో॥ న ప దా చ్ఛలతే ప్రాజ్ఞో గురుః, కేనా౽పి, హేతునా
. విద్యాశాలా శ్రమే నిత్యం స తపిష్యతి శాంతధీః. ౧

ఆసీ త్పురా కస్మిన్చి ద్గ్రామే విద్యావాన్ దీక్షాపరః కశ్చి ద్గురు ర్యువా బుద్ధిమాన్ - త స్యా౽నురూపా మహాసతీ తస్యపత్నీ. ౨

స గురు రతిదీక్షయా విద్యాశాలాయా మేవ మహర్షి రివ కాలం నయ తిస్మ - అథ కస్మిన్చి ద్దినే తస్య సతీ హృ ద్బాధయా లుఠ ల్లుఠన్ గృహే మమార. ౩

తత స్సగురు ర్గృహం గత్వా మృతాం పతితాం చ సతీ మాలోక్య కాంచన గృహిణీ మాహూయ వార్తా మపృ చ్ఛత్. ౪

సాతు తాం దృష్ట్వా బాధ ముచ్చై రుదన్ నా౽హం జానా మీ త్యవో చత్ - త ద్వార్తాం శ్రుత్వా సర్వేజనా స్తత్ర గత్వా రురుదుః- తాన్ నివార్య ధీర స్స గురు స్తస్యాః ప్రేతకర్మాణి కృత్వా శిశుం కస్యైచి ద్గృహిణ్యై పోషణాయ సమర్ప్య నిర్వికారో య థా పూర్వం విద్యాశాలాయాం కాలం నయ తి స్మ. ౫

తచ్ఛ్రుత్వా కశ్చి ద్రాజా ససైన్యో మంత్రి ప్రముఖై స్సార్థ మత్ర గత్వా త మాకారయి త్వా సాదర మిద మువాచ. ౬

మహాత్మన్ ! త వేదృశీ విద్యాశాలావృత్తి ర్నో చితా - త్వా మహం మహా త్వధికారపదే స్థాపయితు మాలోచ్య శీఘ్ర మిత ఆయాతః, ప్రాజ్ఞ స్య తవ గ్రామవాసః కథమ్ ? కి మర్థమ్ ? త దస్మాభి స్స హా యాహీతి.

గురు రువాచ - రాజన్ మమ న మహా తా౽ధికార పదేన కార్యం- గ్రామవాసో గురుత్వం చ మమ రో చేతే - గురుభి రేవ జ్ఞాన విజ్ఞాన

స్థితి రితి కథమ్ తవ న విదితమ్ ? గు ర్వాశ్రమాన్ బహూన్ స్థాపయిత్వా రాజా ప్రజా ఉద్ధరతి - తత్కథం భవాన్ విస్మృత్య వక్ష్య సీతి.

గురు పదే స్థిత్వా ప్రజాశ్రేయ ఇచ్ఛామి - న హీంద్రపద మపి కాంక్షే - త న్మాం క్షన్తు మర్హసి - న రాజ్యతంత్రేషు మమ ప్రజ్ఞా స్ఫుర తీతి స భూయ ఉవాచ. ౯

తచ్ఛ్రుత్వా స రాజా తస్మై బలాదివ బహూని దాపయిత్వా స్వం రాజ్యం తతో యయౌ. ౧౦

ఇ త్యుక్త్వా భగవాన్ భూయ ఉవాచ - సం త్యే తాదృశాని బహూని నిదర్శనాని ; కిం బహుభి ర్గాథాభిః. ౧౧

గురుభి రేవ లోకవార్తా - మానుష్యే గురు పదం మహత్తరం - తస్మా దిమాః ప్రజా జ్ఞాన విజ్ఞాన దానే నై తే గురవ ఉద్ధరన్తు. ౧౨

యది ధర్మే మనః యది భూయో మన స్యుత్సాహో గురవో మ ద్వచనా లోక స్యార్థే జీవన్ సుకృతం లభన్తు. ౧౩

ఏవ ముక్త్వా తతో భగవాన్ క్షణం తూష్ణీ మతిష్ఠత్. ౧౪

అథ సర్వా స్తే ప్రజా స్తస్మై ప్రణ మ్యాఽతిష్ఠ న్త. ౧౫

ఇతి దశమోఽధ్యాయ స్సమాప్తః.

---

ఏకాదశోఽధ్యాయః.

అథ మిత్రశర్మా తు సరళా భర్తా చ తత్ర గత్వా తస్మై ప్రణేమతుః - తతో భగవాన్ మిత్రశర్మణా సహ సల్లాపసుఖ మను భూయ తాః ప్రజాః రంజయ న్నార్యాదిభి స్సార్థం సరళా గృహ మగమత్.

తం దృష్ట్వా సర్వమంగళాసరళాప్రముఖా యోషిత స్సర్వా స్స సంభ్రమం చ చేలుః. ౨

తాః దృష్ట్వా భగవాన్ తా నార్యా నిద మువాచ - కృషీవలస్య మందిరం సర్వథాఽనుత్తమమ్ - వయ మపి కృషిం కుర్మః - కర్షకామమ ప్రాణాః యేషాం శాలాసు లోకమాతరో ధేనవః - బాల్యేఽహం గోపాలః—అద్యాఽపి గోభి స్తుష్టి ముపైష్యామి. ౩

మదగ్రజో బలోఽపి గోపాలః కర్షకశ్చ యస్యాఽఽయుధం హాలం సర్వేఽస్మదీయా గోపాలాః కర్షకాశ్చ. ౪

అథ భగవన్తం తమ్ వాసుదేవ మనంతశక్తి మార్యప్రముఖాభక్త్యా స్నాపయామాసుః - తతో దివ్యాంబరభాసీ స తైర్భోక్తు మారభత్.

తత స్సర్వమంగళా తస్మై కి మపి వ్యజిజ్ఞపత్. ౬

తత స్తస్యై స బహూక్తిభి స్త్రీధర్మ మబోధయత్ - బోధయితు మాజ్ఞాం దదౌ. ౭

ఏవ మాజ్ఞాం దత్వా సశాకపాకాదికం స్తుత్వా ముదా బుభోజ - తత ఆర్యాదయోఽప్యాకంఠం భుక్త్వా తృప్తి మగమన్. ౮

తత స్స వేదికాయాం కిలింజకే న్యషీదత్. ౯

అథ సర్వమంగళా ప్రేరితా తత్పుత్రీ కన్యకా తస్మై తాంబూల పాత్రం సమర్ప్య ప్రణనామ - స త ద్గృహీత్వా తా మాశీ రవదత్.

తతో భగవాన్ సర్వమంగళా సరళాది యోషిజ్జనాయ శుభ ముక్త్వాతై రార్యై స్సహాగత్వార్యాలయప్రాన్తే వట స్యాథస్థలే మృదుస్తరే శుభ్రే చాసనే న్యషీదత్. ౧౦

మిత్రశర్మాఽపి సర్వాః ప్రజాః మృష్టాన్నై స్సంతర్ప్య భుక్త్వా తత్రాఽఽయయౌ - సర్వేఽపి జనా ఆయయుశ్చ. ౧౧.

తాన్ జనా నుద్దిశ్య స గ్రామధర్మా నుపన్యస్య తతో రాజధర్మా
నకథయత్. ౧౨

శ్రీరామ ప్రభు ర్ధర్మేణ ప్రేమ్ణా చ దానేన చ త్యాగే నాఽపి
ప్రజా రంజయన్ చిరకాలం రాజ్య మపాలయత్. ౧౩

దుర్భిక్షక్షామాకాలమరణాఽన్యాయాలస్యప్రమాదభయక్లేశ ద్వే
షా స్తదా న కుత్రాఽప్యాసన్. ౧౪

ప్రజా స్త మీశ్వర మి వాఽమన్యన్త. ౧౫

అజ్ఞాః కేచి త్తద్దేవ్యాం మహాసత్యాం రావణ గృహావాస దోష
మారోప్య విశంకన్ తదా క్వచి త్క్వచి ద్భాషితు మారభన్. ౧౬

తచ్ఛ్రుత్వా రామదేవో విషణ్ణో భ్రాతౄన్ గురుం చాహూయ
తదైకాన్తే జనశ్రుతి ముక్త్వా సదుపాయం పప్రచ్ఛ. ౧౭

తచ్ఛ్రుత్వా వశిష్ఠా దయ స్తే క్రమా దుత్థ మూచుః. ౧౮

వశిష్ఠః - పరమ పవిత్రే దేవ్యా శ్శీలే కా జనశ్రుతి రి త్యుత్తర
మదాత్. ౧౯

లక్ష్మణః - ఆర్యై స్తాన్ మూఢాన్ ప్రతి బోధయి ష్యామ ఇతి.

భరతశత్రుఘ్నౌ - తాన్ మూఢాన్ తాడయి త్వా కారాగృహేషు
స్థాప యామ ఇ త్యుత్తర మయచ్ఛ తామ్. ౨౧

తచ్ఛ్రుత్వా తదనుచిత మిత్యుక్త్వా స ప్రభు స్తా నిద మువాచ.

ప్రజాసు న తత్కార్యం - ద్వేషో మా భూ త్ప్రజానామ్ -
సోఽప్యనహ్యః త్యాగప వాఽద్య కార్యః - సుశీలయా దేవ్యా త త్సా
ధ్యం - హ న్త పావన ధర్మిణ్యాం తస్యా మిత్థమ్ క్రూరోక్తిః. ౨౩

సాఽద్య త్యాగం వహన్తీ ఋష్యాశ్రమాన్ వ్రజతు - త చ్చర్య
యా ప్రజాస్వను తాపో నూనం భవతి - తేన జనశ్రుతిః క్షీయతే -
అయమేవ మహా నుపాయః - హ న్త రాజధర్మే కియ త్తీక్ష్ణం విషమా
దశేతి. ౨౪

ఇత్యుక్త్వా స తతో ధర్మపత్నీం బోధయితుం గురు మప్రైషీత్.
తత స్సగత్వా తయా పూజిత స్సర్వ మకథయత్. ౨౬

సాఽపి లోకాపవాదం శ్రుత్వా క్షణం విషణ్ణా భూత్వా తతో ధైర్య మవలంబ్య వికసితముఖీ ప్రణమ్య పున ర్వనవాసం విచిన్త్య స్వాంగీకార మసూచయత్. ౨౭

తత స్స గత్వా తస్మై శ్రీరామాయ ప్రభవే సర్వ మకథయత్.
స తచ్ఛ్రుత్వా హృష్టో భ్రాత్రా సహలక్ష్మణేనతత్కార్యమసాధయత్.

ఏవం శ్రీరామదేవ చరిత్రం విచిత్రం పవిత్రం చ జగద్విదితం చ తేనైవ రాజధర్మా శ్చిరాయ స్థాపితాః - కాలోఽతి దీర్ఘో గతః అద్య రాజానో వ్యసని నః క్రూరా శ్చ - అతోఽచిరా త్తే నశ్యంతి ధర్మః పున స్సంస్థాప్యత ఇతి. ౨౮

ఇత్యేకాదశోఽధ్యాయ స్సమాప్తః.

---

## ద్వాదశోఽధ్యాయః.

తతో భగవా న్నిధి వివాదపరిష్కారే మిత్రశర్మాణం సరళాం చ సాదర ముద్దిశ్యేద మువాచ. ౧

ఏకాదశ సహస్రపరిమితే పూర్వకాలే కశ్చిద్రాజాసీత్. ౨

తస్య న సంతతిః - సం త్యపి ధనరాశయః. ౩

స శత్రుభయా దేతం నిధిం గృహారామే భూగర్భే న్యక్షిపత్ - స్మ చిరః కాలో గతః. ౪

ఏషనిధి ర్యువయో ర్యువయో స్స్వ మభవత్ - తదేతం సమం విభజ్య సంగృహ్యా సుఖం జీవన్త్వేథామ్ - పాత్రం విమృశ్య దీనానాథ జనేభ్య స్సాదరం దేయం. ౫

ధర్మో బహువిధః ధనినాం దానం ధర్మః - బలినాం రక్షణం ధర్మః శక్తిమతాం మహత్కర్మ ధర్మః ఏవం ధర్మస్య బహూని రూపాణి. ౬

స ఏవ ముపన్యస్య తాన్ జనా నరంజయత్. ౭

తే హృష్టాః పునః పునః ప్రణేముః ధన్యవాదం చక్రుః. ౮

భూయ స్స తా నిద మబ్రవీత్ - అహం శ్వః ప్రాతరేవ గమిష్యే. ఇతో ద్విరాత్రికాలో నీతః - యుష్మాభిః సంపూజిత ఆనంద మలభమ్ - పరం కౌతూహల మభూ దితి. ౯

అథ రాత్రి రభూత్ - తే జనా స్సర్వే గృహాన్ గత్వా భుక్త్వా శీఘ్ర మాయయుః. ౧౦

స మహాత్మా తతః ఫలాహారే ణార్యసమర్పితేన సంతృప్తో నిద్రా మగమత్. ౧౧

తత్రైవ తే సర్వే జనా జాగర్యాం చక్రుః. ౧౨

తతః ప్రభాతే ప్రాతః కర్మాణి కృత్వా భగవాన్ రథ మారుహ్య జగామ. ౧౩

తాః ప్రజా స్తం సుదూర మను గత్వా నమస్కృత్వా తేన భగవతా నివృత్తా స్వం స్వం గృహం తత స్సమాయయుః. ౧౪

ఏవం తే గ్రామీణా భగవత స్తస్య శ్రీకృష్ణస్య పరిచర్యయా సుకృతినో௨ భవన్.

ఇ త్యార్షే శశాంకకృతే శ్రీకృష్ణ ధర్మవిజయే గ్రన్థే
ప్రథమఖండే ద్వితీయభాగ స్సంపూర్ణః.
శ్రీకృష్ణార్పణమస్తు.

# విషయసూచిక.



| విషయము | | పుటసంఖ్య |
|---|---|---|
| శ్రీకృష్ణస్వామి నరకాసురవధార్థమై ప్రయాణంబు సేయుట | ... | ౨ |
| శ్రీకృష్ణస్వామి మార్గమధ్యంబున నొక గ్రామంబు సేరుట | ... | ౭ |
| శ్రీకృష్ణస్వామి గ్రామీణులతో సంభాషించుట | ... | ౧౫ |
| శ్రీకృష్ణస్వామి వనితాలోకగౌరవంబుఁ గూర్చి ముచ్చటించుట | ... | ౧౭ |
| సూర్యాస్తమయవర్ణనము | ... ... | ౨౫ |
| శ్రీకృష్ణస్వామి కర్షక కార్మికాదుల నాదరించి పలుకుట | ... | ౨౭ |
| మిత్రశర్మ శ్రీకృష్ణస్వామికి ఫలాహారంబు సమర్పించుట | ... | ౩౩ |
| సరళా సర్వమంగళా సంభాషణము | ... ... | ౩౬ |
| సరళా చరిత్ర సంగ్రహము | ... ... | ౪౫ |
| ప్రేమప్రశంస | ... .... | ౪౮ |
| కృషిమహత్వ ప్రశంస | ... ... | ౫౧ |
| భూదేవీగీతలు | ... ... | ౫౮ |
| కృషికి నుత్సాహాదు లావశ్యకములని మిత్రశర్మ చెప్పుట | ... | ౬౧ |
| మిత్రశర్మ మందుండగు కాపున్ గూర్చి పలుకుట | ... | ౬౫ |
| ఉత్తమ కృషీవలుని లక్షణము | ... ... | ౬౯ |
| హాలకర్మ ప్రశంస | ... ... | ౭౩ |
| బీజక్రమ బీజావాపన ప్రశంస | ... ... | ౭౬ |
| ఎరువుల ప్రశంస | .... .... | ౭౮ |
| వృక్షమహిమా విశేష వివరణము | ... ... | ౯౩ |
| నానావృక్ష పరమ దోహద విశేష వివరణము | ... | ౧౦౨ |
| వృక్ష చిత్రీకరణము | ... ... | ౧౦౬ |
| ఆరామూపవ్యాకతాది వివరణము | ... ... | ౧౧౨ |
| కదళీవన ప్రశంస | ... ... | ౧౧౮ |
| కుళుత్థ మాషముద్గాది శమీధాన్యజాతి విశేషవివరణసంగ్రహము | .... | ౧౧౯ |
| ఏలాజాజి జీరకాదుల ప్రశంస | ... ... | ౧౨౭ |
| కార్పాసాది సస్యప్రశంస | ... ... | ౧౩౦ |
| గోకుల ప్రశంస | ... ... | ౧౩౪ |
| నారాయణుఁడను నొక కాపు కృషిప్రశంస | .... | ౧౪౧ |

| విషయము | పుటసంఖ్య |
|---|---|

శ్రీ ర స్తు.

శ్రీగోపాలస్వామినే నమః.

# శ్రీకృష్ణ ధర్మవిజయము.

## ప్రథమఖండము—ద్వితీయభాగము.

శ్రీమహితోదంచితతే ।
జోమయసకలప్రపంచసూత్రవిలసనో
ద్దామ! ప్రసన్నశక్తి ।
స్తోమ! వరంధామ! నిఖిలదోషవిరామా !! ౧

॥ అవధరింపు మన్నిశాసమయంబున. ౨

తే॥ సాగరోత్తుంగభంగఘోషంబుతోడి
వాయుచలనంబు, విద్యుత్ప్రవాహభరిత
దీపకాంతులుఁ దగఁ గడుఁ దేజరిల్లు
ద్వారకాపట్టణము ప్రసుప్తజన మయ్యె. ౩

॥ శ్రీకృష్ణపరమాత్ముండును యోగనిద్రామహనీయప్రశాంతిసుఖంబున గ్రాలుచుండె, ననంతరంబ. ౪

ఉ॥ పాపమునిండె, నయ్యసురభర్తకుఁ గాలము మూడెఁ, ద్రుంపఁ బో
వే! పరమాత్మ! మేలుకనవే! కరుణన్ జగముద్ధరింపవే!
యో పురుషోత్తమా! దెలుప నోదుదుమన్ గతిఁ గూసెఁ బేర్మిమై
నాపురి నెల్లచోట్లఁ జరణాయుధముల్ ప్రజలెల్ల మేల్కనన్.

॥ అంతకుమున్న మేల్కని, ప్రాతఃక్రియావిధానంబునన్ బ్రవర్తించి, సత్వరంబుగ భోజాంధకకుకురాదియదుకులంబులవారందఱును, సకలపౌరప్రముఖులును, మాగధనరకాసురులభయంబున వాసుదేవుని

మఱువుసొచ్చియున్న రాజకుమారులును, నాజగద్గురుదేవుని ప్రయా
ణసన్నాహంబెఱింగినవారు కావున ననుపుసేయువారై సముచిత
వేషాయుధయానంబులొప్ప నొక్కఁడొకండువచ్చి సింహద్వార
బహిఃప్రదేశంబున నిలిచియుండిరి; దారుకుండును సర్వాస్త్రశస్త్ర
సర్వవస్తుసంభృతంబైన యమ్మహాత్ముని దివ్యరథంబునకు సైన్య
సుగ్రీవమేఘపుష్పవలాహకంబులను భవ్యవాహనంబులనుఁగట్టి,
యత్తేరున్ దోలికొని సింహద్వారంబు నిర్గమించి, యచ్చట వేచి
యున్న యమ్మహాజనసమూహంబున్ గలిసె, నంత. ౬

తే॥ అనఘుఁ డంతకుమున్న మేల్కాని యథోచి
తముగఁ బ్రాతఃక్రియలు సత్వరము ఘటించి,
యాదవేంద్రుఁ డుచితవేష మవధరించి,
వచ్చి, వారికిదర్శనమిచ్చె నెలమి. ౭

శ్రీకృష్ణస్వామి నరకాసురవధార్థమై ప్రయాణంబు సేయుట.

క॥ వినయమెసఁగు మ్రొక్కులు, దీ
వనలున్, వెలయంగ నంత వారందఱు నా
తనిచిత్తము వడసి; రతం
డు నుచితగౌరవమునగు వడువుఁ దగఁజూపెన్. ౮

క॥ తదనంతర మయ్యనఘుఁ డ
రదమెక్కెన్; వారును గడురయమున మోదం
బొదవన్ దమతమయానము
లుదారగతినెక్కి రొక్కఁడొకఁడుఁ బలువుర్షన్. ౯

వ॥ ఇట్లెల్లవారు నతివైభవంబుగ యానారోహణంబు సేసిన యనంత
రంబ. ౧౦

సీ॥ పరిధానతాస్ఫురద్భాగ్యగౌరవపదశ్రీయుతపీతకౌశేయపటము,
రత్నప్రభాభాస్వరకనత్కనకబిందుకలితమహామూల్యకంచుకంబు,
హేమరత్నద్యుతిశ్రీమహితోష్ణీషభాసురనవబర్హిబర్హదామ,
మఖిలలోకశుభావహగురురేఖాఢ్యవక్షస్థలరాజితకౌస్తుభంబుఁ,
గ్రాలుచుండ నమానుషకాంతిపటల
జటిలుఁడగు నమ్మహాపూరుషప్రవరుని
దివ్యరథ మెల్లరకుమి న్నుదీర్ణభంగి
నడచె; నా వెన్క సకలయానములుఁ గదలె. ౧౧

వ॥ ఇట్లమ్మహాపూరుషుం డతివైభవంబుగఁ బయనంబై చనుచుండ.

క॥ ఫలపుష్పదామమంగళ
కలశధరులు కొంద ఱింపుగదురఁగ నెదురై,
తొలఁగి చనుచుండి; రమ్మెయి
వెలిమొదవులు నెదిరివచ్చి, వెసఁ దొలఁగి చనున్. ౧౩

క॥ మంగళవాద్యధ్వనులు సె
లంగ నెదురువచ్చి, మఱి తొలంగి, సనుదు రు
ప్పొంగుచుఁ గొందఱు; గొంద ఱ
భంగవిజయగానరీతిఁ బరగింతు రొగిన్. ౧౪

వ॥ మఱియును.

తే॥ అప్పు డాబాలగోపాల మఖిలపౌర
జనులు నిచ్చలు జయజయధ్వనులు సెలఁగ
నమ్మహాత్మునిరథముపై నక్షతలను
బుష్పములు సల్లి రింపు సొంపును దలిర్ప. ౧౫

ఉ. ఒక్కట లోకమెల్లఁ దన యుద్ధతిమైఁ గలఁగించి, రొయొంచు నా
ముక్కడి రక్కసున్ నరకు మూర్ఖు వధించి, జగంబు గాచి, పెం

పెక్కినకీర్తిత్రోడ మము నేలుదుగా కని పౌరులందఱుఁ
మ్రొక్కిరి, మేలుఁబల్కి, రతిమోగముఁ, గౌతుకమున్ రహింపఁగన్.

వ॥ ఇట్లు సెలంగు నప్పౌరజనసముద్రమధ్యంబున నించుక తెఱపిఁ జేసి కొనుచు, మెల్లమెల్లన నాలోకోద్ధారకు దివ్యస్యందనమహాతరణి సనుచు నమ్మహా పట్టణప్రాకారంబునకు ఖేయంబైన సముద్ర రేఖమీఁద ననువొప్ప నిర్మింపఁబడ్డ నానాయంత్రసంకలిత నౌకా సంక్రమమార్గంబును గడచి, భూమార్గంబునట్టె, దాని వెన్నంటి సకలయాదవపౌరప్రముఖుల యానంబులును జనుచుండె; నట్లు సను నయ్యానంబులందు. ౧౭

క॥ యదువరులుఁ, బౌరముఖ్యులుఁ
బదిలక్షల కధికసంఖ్యఁ బరగుదురని సె
ప్పఁ దగున్; వారందఱు న
య్యదూద్వహునియందు భక్తి నలరుదు రెప్డున్ ౧౮

క॥ వారందఱు రా నిమ్మెయి
గౌరవమునఁ బోవు నా జగత్కల్యాణ
శ్రీరంజను నరిభంజను
తేరిరుచులు బర్వె నెల్లదిక్కులఁ దఱుచై ౧౯

తే॥ ఇట్లు గ్రాలుచు నా జగద్ధితునిరథము
మెల్లమెల్లన జనుచుండె మింటఁ దిరుగు
వ్యోమయానంబులెల్ల నిజోరుకాంతి
సాగరంబున నౌకలై సక్క నెసఁగ. ౨౦

వ॥ ఇట్లమ్మహారథంబు యోజనమాత్రదూరంబు సని, యొక్క విశాల ప్రదేశంబున సక్క నెగడి నిలిచె, దాని వెన్నంటివచ్చు యానంబు లన్నియు నొక్కఁ డొక్కఁ డంటికొనునట్లు క్రిక్కిరిసి, దాని యిరు

ప్రక్కలను, వెన్కను నిలిచి పొలిచె; నాసమయంబున నప్పురు
షోత్తముం డా సకలయాదవపౌరప్రముఖుల సాదరంబుగ నాలోకిం
పుచు నిట్లనియె. ౨౧

తే॥ చాలదూరంబు వచ్చితి; రేల నింక
రాఁ దలంచుట? మిక్కిలి శ్రమము బొంద
నయ్యె మీకెల్ల; నిచ్చోట నాఁగి నిల్వుఁ!
డాజ్ఞ యిం! డేనుబోయి, మేలంది వత్తు. ౨౨

వ॥ అన్నటయు వారంద ఱిట్లనిరి; ౨౩

తే॥ మాకు శ్రమ యంటె? యదికాదు; మాక గాక
జగతికంతకు నగు మహాశ్రమము వాప
నవతరించిన లోకకల్యాణమూర్తి
వీవు; నీ కగుశ్రమకు నే మేమనంగ? ౨౪

క॥ నీయాజ్ఞ కెదిరివల్కన్
వాయోడుదు; మిట్లు లొంటివాఁడవగుచు వే
బోయెద వరుల వధింపన్;
బోయెద మే మింద్లకడకుఁ బోరిఁ, దినఁ, గూరన్ ౨౫

ఆ॥ సకలలోకములకు జయము గూర్చెడి నీకు
జయము వల్క నేము సాల; మింత
వట్టు గాన నీకు వందనంబులు తోడ
మజలి పోదు మిపుడ మన నగరికి. ౨౬

చ॥ అనుటయు వారి కిట్లనియె నమ్మహనీయుఁడు నిట్లు లొంటిఁ బో
దను టది పోల్ప; దేమన బలాఢ్యులరై తగు మీ బలంబు నె
ల్లను గొని కాదె యేగెదఁ జలంబున నా ఖలు నుక్కడంప; నా
కు నెపుడు నెల్లదేవతలుఁ గూర్తురు తోడను టిన్గ రెఱుంగరే? ౨౭

తే॥ కాన నొండుతలంపు, శంకయును మాని,
సమఁడు పురి! క ప్రమత్తత సక్క నుండుఁ!
డే నచిరకాలమంద పెంపెసఁగ మఱలి
వత్తు; మనకు జయంబు నవశ్యము నగు ౨౮

వ॥ అనుటయు వార లింక నొండాడ వెఱచి,
సక్క నచ్చోటన నిలిచి జయంబు వల్క ;
రంత దారుకుండు మహాజవంబున రథంబుఁ బోనిచ్చుచుండె;
నప్పుడు ౨౯

తే॥ లోకకల్యాణకార్యార్థమై కడంక
నేగు నా లోకగురునకు నింపుపుట్టు
భంగి ననుకూలగతి జగత్ప్రాణదేవుఁ
డమ్మహాత్ముని యరదంబు ననువు వెట్టె. 30

ఉ॥ భూనుతసర్వశక్తిపరిపూర్ణుఁ, డమానుషభవ్యసారతే
జోనిధి, నాకు మేలొదవు చొప్పుఁ దలంచియ పోవుచున్నవాఁ
డీ నిఖిలప్రపంచహితుఁ డెంతకు సాలఁడు? సాలు నం; చెదన్
మానుషలక్ష్మి కౌతుకసమగ్రతఁ గ్రాలఁగఁ జొచ్చె నత్తఱిన్ 3౧

చ॥ కడుపునఁ జిచ్చువెట్టి నను గాసిలఁజేయు కురాజకోటి యు
క్కడఁపఁగ బుట్టినట్టి మహితాత్మకుఁ డన్నరకున్ వధింపఁ బో
యెడి; నితఁ డెంతవాఁడని గణింపుదునే నని సాలఁబొంగె న
ప్పు డెలమి భూమిదేవి తన పూర్వవిలాసముచొప్పెలర్పఁగన్ 3౨

చ॥ ఎలమిదలిర్పఁగా నవతరించె మహాత్ముఁడు నాదు దుర్దశన్
దొలఁగఁగఁజేయ, నాకు మఱి తొంటివిలాసము గూర్ప, నీ ఘనుం
డిల; నరకాసురున్ జిదుమ నేగెడి నిప్పుడు; మేల యంచు మో
మలరగ ధర్మదేవత మహాముదమార సెలంగె నత్తఱిన్ 33

క॥ వనదేవతాగణము, దే
వనికాయము, మాకు నితనివలనన్ మే లౌ
నని యమ్మహాత్ము వెంటన్
జనియె నదృశ్యాకృతుల విజయము పలుకుచున్ ౩౪

తే॥ ఇవ్విధంబునఁ దన్ను ననేకదేవ
తలు ప్రశంసింపుచుండ, నుద్దామదివ్య
తేజ మడరంగ, నా కృష్ణదేవుఁ డెలమి
మార్గమున్ బట్టి సనియె నమందలీల. ౩౫

తే॥ అయ్యనఘుమీఁద మార్గమధ్యమున వేచి,
ప్రజలు గుంపులు గుంపులై, ఫలకుసుమవి
తానములు సల్లియును, సమ్మదమున జయజ
యధ్వనులు సేసియును, ధన్యులైరి సాల. ౩౬

క॥ ఎడనెడ నా లోకగురుఁడు
విడియు ప్రదేశములు వేనవేలు జనులతోఁ
గడు నొప్పెన్ దీర్థంబుల
వడువున ; ధన్యులయి రెల్లవా రా ప్రజలున్. ౩౭

తే॥ ఇట్లు మార్గంబునం దెడనెడ విడియుచు,
నదనదీహ్రదశైలకాననపురములఁ,
గ్రామములఁ, బల్లెలన్ సాల గడచి, లోక
పూజ్యుఁ డమ్మహనీయుఁడు పోయి, పోయి. ౩౮

వ॥ ఒక్కనాఁటి యపరాహ్ణంబున మార్గంబున కనతిదూరస్థంబగు
నొక్కగ్రామంబు సూచి, యందుఁ బరమధర్మసూక్ష్మనిర్ణయవిష
యంబున వివాదం బగుచుండుటఁ దన దివ్యచిత్తంబున నవధరించి,
యా సర్వజ్ఞశిఖామణి సారథిన్ బిలిచి, చేయెత్తి సూపి, యల్లదె

యా గ్రామంబునకు మనరథంబుఁ బో నిమ్మనుటయు, సతండు మహా
ప్రసాదంబని, తద్గ్రామపథంబునకు నరదంబుఁ ద్రిప్పి, పోనిచ్చు
టయు. ౩౯

శ్రీకృష్ణస్వామి మార్గమధ్యంబున నొక గ్రామంబు సేరుట.

తే॥ ఊరుఁగని, యందు విడియు నుద్యోగ మెఱఁగి
సవియువోలెఁ గడున్ బ్రియంబడర, నమ్మ
హారథాశ్వంబు లొక్కట నరిగి, యరిగి,
సొచ్చె నా గ్రామ మురుజవస్ఫురణ మెసఁగ. ౪౦

వ. ఆ సమయంబున.

సీ॥ అంబరంబునకుసొంపారంగఁదఱుచయిసనుమహాగరుడధ్వజంబురుచియు
నిరుగెలంకుల మురువెసఁగ సమ్మేళన క్రమమునఁ బర్వురథ్యముల కాంతు,
లొక్కట బుజురేఖ నొరసికొంచున్ గడుదట్టమై పొలచు రథంబుదీప్తి,
యన్నిదిక్కులకుఁ దానై నిరంతరమునై దీపించు నాత్మీయదివ్యతేజ,
మొకటఁ గ్రాలంగ, సర్వలోకోత్తరుఁ డగు
నమ్మహాత్ముండు లోకమోహనమనోహ
రాకృతి వెలయ నమ్మహాస్యందనంబు
నడుమ వైభవము దగఁ గన్పట్టుచుండె. ౪౧

వ॥ ఇట్లతులతేజః ప్రవాహ భాసురంబగు నమ్మహాస్యందనం బతిసత్వర
గతిఁ చేరన్ వచ్చుచుండుట నవలోకించి, యంతకుమున్న పాంథ
శాలకును, నార్యకార్యాలయంబునకును గట్టైయుటనొప్పు వటవృక్ష
చ్ఛాయ వెలయు ప్రతోళి నొకవివాదంబుఁ బరిష్కరింపఁ గూడి
యున్న గ్రామీణ ప్రముఖులందఱు నత్యాశ్చర్యసంభ్రమంబులు
మనంబుల రేచిపెట్ట, నతిశీఘ్రంబున లేచి, యెదురేఁగి. ౪౨

తే॥ అమ్మహాస్యందనమునకు, నందమాను
షప్రభారాశినాఁ గ్రాలు చారుమూర్తి,
కా జగద్గురునకు, వినయమున మ్రొక్కి,
బలసి చుట్టు నిలిచి, సూపి రలఘుభక్తి. ౪౩

వ॥ వెండియు.

తే॥ ఇందు విచ్చేయుఁ డనుచు వారెల్లఁ జుట్టు
బలసి నడచుచు, నోలి నప్పరమరథము
నార్యకార్యాలయమునొద్ద కర్థిఁ దోడి
కొనుచువచ్చిరి పలువురుగూడ మఱియు. ౪౪

వ॥ అంత.

క॥ సారథివరుఁ డచ్చోటన్
దేరునిలిపి, డిగ్గ నెమ్మిఁ దీపించుచు; న
ప్పూరుషసత్తముఁ డా లో
కారాధ్యుఁడు డిగియెఁ బిదప నతివిభవముగన్. ౪౫

వ॥ ఆ సమయంబున.

సీ॥ సారప్రశాంతిగంభీరతేజోరాశినా స్ఫురల్లీలఁ గన్పట్టువాని,
మహితావతారసామాన్యకళానుపమానముద్రాఘనుండైనవాని,
శాశ్వతౌదార్యవిజ్ఞానవిశిష్టరేఖావిశేషస్ఫూర్తిఁ గలుగువాని,
మానితానన్యసామాన్యమహాయోగసిద్ధి నమేయుఁడై చెలఁగువాని,
రత్నకుండలరుచిరంజితమృదుకపో
లములవానిఁ, బంకజములఁ బోలు
లోచనములవానిఁ, జూచి రా గ్రామని
వాసులు నయనోత్సవము రహింప. ౪౬

ఆ॥ అతఁ డపూర్వదృష్టు, డతులతేజోఘనుం,
డగుటఁ బల్కరింపనైన సాల
రైరివార ; లమ్మహాపూరుషుఁ డ వారి
సేమ మడిగి, ప్రియముఁ జేసె మిగుల. ౪౭

క॥ పరిచయభాగ్యం బించుక
దొరకొనె నా లోకగురునితో వారల క
వ్వరసున, దానికి వారలుఁ
బరమానందమున సిద్ధిఁ బడసిరి పేర్మిన్. ౪౮

తే॥ ఎల్ల నరపాలకోటియు నేమహాను
భావు మహనీయపరిచయభాగ్యమునకు
నోచికొనఁ బోల ? దిల నాఘనుండు పరిచ
యంబు నయ్యూరి ప్రజలతో నట్లు నెఱపె. ౪౯

వ॥ ఇట్లు కించిల్లబ్ధపరిచయమహాభాగ్యపాత్రతావిశిష్టులగు నా ప్రజ లమ్మహాత్మునికి వినయంబున మఱల మఱల నమస్కరింపుచుఁ భాషింప ననువుపడుట నిందు విచ్చేయుదురుగాక యని మెల్లన, బలుకుచు, నయ్యార్యశాఖాలయంబునకుఁ దోడితెచ్చి, యంతకు మున్న యా ఘనుని కొఱకమర్చిపెట్టిన సాస్తరణతాళపత్రకిలింజ కంబు సమర్పించి ; రనంతరంబ. ౫౦

క॥ పరమాదర మెసఁగ జగ
ద్గురుఁ డాసర్వజ్ఞుఁ డందుఁ గూర్చుండె, గృపా
భరితావలోకనపరం
పర నా ప్రజలపయి సాలఁ బర్వుచునుండన్. ౫౧

వ॥ అంత.

ఆ॥ గీ॥ వెరవుదోఁపఁ దాళవృంతకంబులు గొని
యేమ యేమ యనుచు నెల్లవారు

వీవఁ దోడగుటయును, నెడనెడవల్కి, య
ప్పసికి వారి మాన్చెఁ బరగ నతడు. ౫౨

వ॥ ఇట్లు వారించి, పిమ్మట నా లోకజ్ఞశిఖామణి వారు తనవార్తఁ దెలిసికొనఁ గుతూహలంబుమై నున్నవారనియు, వారికి నచ్చఁజెప్పించుట భావ్యంబనియుఁ, దన సారథియగు దారుకునిచేతఁ జెప్పించుటయ లెస్సయనియుఁ దలంచి, వారలన్ జూచి యేను గమనాయాసంబున బడలితిఁ, గాన యించుకసేపు దొలంగి, మీరంటఱు నని, మత్సారథికిఁ దోడ్పడి, సకలశస్త్రాస్త్రసర్వవస్తుసంభృతంబగు నరదంబు భద్రపఱచియు, వాహనంబులఁ దడివి సేదదేర్చి, యిమ్మగుచోటఁ గట్టించి, నీరును మేఁతయు పెట్టించియు, నాపయి నెల్లరును నా యొద్దకువచ్చి సంభాషించునది యని మృదువుసెడనిభంగిఁ బల్కుటయు, విని. ౫౩

ఆ॥ గీ॥ ఇంతలెస్స వల్కునే యిమ్మహాత్ముండు
మనలగూర్చి యేవమాని? యనుచు
వార లుబ్బుదోఁప వడి నని, సారథిఁ
గలిసికొనిరి మిగులగౌరవమున. ౫౪

తే॥ ఇట్లు సారథిఁ గలిసి, వారెల్ల నతనిఁ
బ్రియముమై వల్కి, చనవుసూపించి, సాల
బడలితివి, నేము సక్క నీ పనికినగుదు
మీవు విశ్రాంతిఁ గొనుమని యెలమి ననిరి. ౫౫

వ॥ దానికలరి యా సూతవర్యుం డంతకుమున్న రథగుప్తిఁ గావింపుచున్నవాఁ డగుటన్ జేసి, వారలుఁ దోడుసూప నొక్కమెఁగి నెమ్మోహాస్యందనంబు సూత్రబద్ధవ్యాఘ్రచర్మసంచయచ్ఛన్నంబు గావించి, నీరు ద్రావించి, యిమ్మగుచోట వాహనంబులగట్టి, తృణముషివిశేషంబుల వాని యొడళ్ళు దడివి, నిమిరి, మంచిమేఁతవెట్టి,

వారును దాన్నును రచ్చపట్టున గూర్చుండి సంభాషింపఁ దొడంగి
రనంతరంబ వార లాతనినుద్దేశించి యాదరంబుమై నిట్లనిరి ; ౫౬

ఆ॥ గీ॥ ఇమ్మహానుభావు లెవ్వరో? రెచ్చటినుండి
యెచటి కేగఁదలఁచి? రేమిపనికిఁ
బోవువారు? వీరు దేవాంశజాతులో
ప్రభువులనుచుఁ దలపుఁ బట్టనయ్యె. ౫౭

క॥ ఏ మెవ్వర? మీ ప్రభువరు
లీ మెయి మమ్మాదరించి; రిట్లు వలికి; రీ
ప్రేమ యొరులందుఁ గలదే?
సామాన్యులె వీరు? పురుషసత్తము లరయన్. ౫౮

క॥ మాయూరు పరమపావన
తాయుక్తంబయ్యెఁ దత్పదరజఃప్రాప్తిన్;
ధీయుత! యేమనిబొగడుట
మా యందఱ సుకృతమహిమ, మా భాగ్యంబున్? ౫౯

తే॥ ఇమ్మహాప్రభువర్యుల కేమిచేసి
మెప్పు వడయంగనేర్తు మే మిప్పు? డరయఁ
బల్లెటూరిప్రజలము; మా బ్రదుకుచంద
మెవ్వరెఱుఁగరు? మా వెర వేమిసెప్ప? ౬౦

ఆ॥ గీ॥ ఎదుట సక్క నిలిచి యేమేని భాషించు
వదువుగలదె మాకు? బడుగుప్రజల;
మిమ్మహానుభావు లేమనుకొందురో
మమ్ముఁగూర్చి, మా విధమ్ము నెఱిఁగి? ౬౧

క॥ వినవలతు మిమ్మహాత్ముల
యనఘచరిత్రంబు; సెప్పనైనద యేనిన్

వినిపింపుము ! నీ యెడ మా
చన విమ్మోయిఁ జెల్లె ; సంతసం బొనఁగూడెన్ ; ౬౨

క॥ అనుడు నతఁడు వారలకున్
జనవుఁ జూపించి, ప్రియము సాలనెఱపి, య
య్యనఘు చరిత్రము సర్వము
వినిపించెన్ వారలు విని వెఱగుపడంగన్ ౬౩

తే॥ ఇట్లు వా రజ్జగద్గురు నెఱుఁగఁ జాలి,
పరమ విస్మయసంతోషభరితచిత్తు
లై, యపారమహిమ నొప్పు నతనిఁ జూడఁ,
బలుక, నగుటకు నుబ్బిరి బహువిధముల. ౬౪

వ॥ మహానిధివిషయంబునఁ దగవుపుట్టి, యది పరిష్కరించువారును, వినువారును నై, యప్పటి కచ్చట నందఱున్ గూడియున్నవారు కావున వారందఱు ననంతరంబ యొకట యోచించి, యపారప్రభావఘనుండైన యప్పరమపురుషునితో భాషింపను, మఱియు నవ్వివాదంబు బరిష్కరింపఁ బ్రార్థింపను, దమయూరి పురోహితుండును, ప్రాజ్ఞుండును, మాన్యుండును, నవ్వివాదక్రమంబుతనకును, నొక పరమకర్షకకుటుంబినీరత్నంబునకును నై యున్నవాఁడును నగు మిత్రశర్మయను బ్రాహ్మణప్రవరుని నియమించి, యతనిఁ గూడి, యందఱును మెల్లనఁ జేమోడ్పులతో నా సర్వజ్ఞుని చేరఁ బోయి, వినయంబుదోఁప నిలుచుటయు, నతం డత్యాదరంబున వారినందఱఁ గూర్చుండ నియమించి, చనవుసూపువాఁడై, మృదుమధురవచోరచన మెఱయ నిట్లనియె. ౬౫

ఆ॥ చాల బడలి, మిమ్ము సక్కఁ బొండనిపంచి
తెంతకోపమగునొ ? యేవయగునొ ?

యింతసేపు మసలు టిట్లయ్యె మీకు; నా
వలని తప్పు సైపవలయుఁ జుండు. ౬౬

తే॥ అతిథియున్, జుట్టమున్ను, వృద్ధుఁ, డలుకఁగొనుట
కేరికిన్ గానివారని యెఱిఁగినట్టి
వార కావున మీరు నా వలని తప్పు
సైతురనియ తలంతు నిస్సంశయముగ. ౬౭

తే॥ ఎలమి నాతోడ నేమేనిఁ బలుకవలసి
యున్నచోఁ దప్పకపలుకుఁ! డొండుతలపుఁ
గొనకుఁ! డీరును, నేను, నెక్కువకుఁ, దక్కు
వకును గాము; చనవ సాలవలయు మనకు. ౬౮

క॥ మిమ్మున్, మీ యూరున్, డెం
దమ్మలరన్ జూడ మిగులఁ దలఁపుఁగొని, ప్రయ
త్నమ్మున వచ్చితి; మీ చం
దమ్మునకున్ బరమసమ్మదమ నాకయ్యెన్. ౬౯

చ॥ అనవుడు మిత్రశర్మ వినయంబున నిట్లను మీర లిప్పు డి
ట్లనుటకు నేము నోచికొననైతిమి; మాతల లింతకాయెనే
యని యెదలార సమ్మదము నందగఁ గంటిమి; మేము తొల్లి చే
సినతప మెట్టిదో తెలిసి చెప్పగనేరముగాక యింతకున్. ౭౦

క॥ దేవర దివ్యపదరజ
శ్శ్రీవిస్ఫూర్తిన్ బడసి, సుచిరభాగ్యదశో
జ్జీవనగరిమకు నయ్యెన్
దేవా! మాయూరు; మఱియుఁ దీపించుఁ గడున్. ౭౧

ఆ॥ పల్లెటూరివాండ్ర బ్రదుకు చందబు దే
వరకు విశదము యని వలుక వెఱతు;

మేమి తెలిసితిమని యేను ప్రభువరుల
తోడ ముచ్చటింపఁ దొడరు టరయ ? ౨౨

క॥ దేవర దివ్యపదకమల
సేవాభాగ్యంబు సర్వసిద్ధికరంబున్,
మా వాంఛితార్థ ; మది మా
కీవలయున్ గరుణఁజేసి యా రియ్యార్యరన్. 23

వ॥ అదియెట్లనిన.

క॥ ఏమందటిమున్ గొలువన్
సేమంబుగఁ బదిదినములు సెల్లింతురు గా
కేమేనియుఁ జెప్పఁచు నీ
గ్రామంబునఁ జుట్టునుగల గ్రామము లలరన్ ౨౪

క॥ నాకు, నొకకాపుసతికి, న
లౌకికమై పుట్టెఁ దగ వలఘుగతిఁ ; దీర్పన్
రాకున్నది పెద్దల ; కది
యేకీడునకగునొ తుదకు ? నేమనవచ్చున్ ? ౨౫

క॥ మాతగ వీర పరిష్కృతి
సేఁతకుఁ దగువారు ; కరుణఁజేసిఁ శ్రమకుఁ బా
ల్పై, తగ నంతయు విని, ప్ర
స్ఫీతపరమధర్మసిద్ధి సేకూర్పు ప్రభూ ! ! ౨౬

శ్రీకృష్ణస్వామి గ్రామీణులతో సంభాషించుట.

క॥ అనవుడు నాలోకగురుఁడు
విని, యాతనికిట్లులనియె వినిపింపుఁడు మీ
రును, గాపుసతియు, మీతగ
వు నాకుఁ దెలియంగ ; ఏ రవున్, మేల, యనన్. ౨౭

వ॥ అనుటయు నవ్విప్రోత్తముండును, సరళయును కర్షకసతియుఁ దమ
వివాదంబు తెఱంగు సక్క వినిపించుటయు, నాసర్వజ్ఞుం డంతయు
విని, తన్నిధివృత్తాంతంబుఁ దన దివ్యచిత్తంబున నవధరించి,

క॥ మీ యిరువురు బలె ధర్మప
థాయతవర్తనముసేయునట్టి సుకృతు లిం
కేయెడలన్ లే రనుటకు
నీయొక్క నిదర్శనంబ యింతకు సాలున్. ౭౮

తే॥ ఎల్లి నీయూరిపెద్దలు, నేను నొక్క
పంక్తి నింపారఁ గుడిచి, యాపయి సుముఖత
నెల్లవారలసన్నిధి నీ తగవు ప
రిష్కృతిన్ వినిపింతుఁ, బేర్మి యొనఁ గూడ. ౭౯

క॥ అనుటయుఁ బరమానందం
బున నచ్చటివారలెల్లఁ బొంగి, పరమపా
వనదళ మనయూరిప్రజల
కనుగ్రహాముసేసి రిమ్మహాప్రభు లనుచున్. ౮౦

వ॥ అందఱు నొక్కమొగిన్ లేచి, యేమ యేను యిమ్మహాత్ములకు
మా యొప్పుకొలఁది బరమాతిథ్యంబు సేయు భాగ్యంబునకు నోచి
కొందు, మని తగవు లాడుచుండ, నందఱన్ వారించి, పురో
హితోత్తముం డగు నమ్మిత్రశర్మ యప్పరమపురుషునకు నమస్క
రించి, యి ట్లని విన్నవించె. ౮౧

ఆ॥ ఏను బ్రాహ్మణుండ ; నీ గ్రామమునకుఁ బు
రోహితుండ ; నెల్లరును హితులుగ
మెలఁగుచుందు ; నొప్పుకొలఁది షట్కర్మముల్
సేయుచుందు ; బుధుల సేవ కగుదు ; ౮౨

వ॥ దేవరవారి పరమాతిథ్యభాగ్యంబునకు నేన నోచికొందునేని, నన్ను
నింతకు నాదరించు నీ ప్రజలయం దివ్విషయంబున 'వివాదంబు
పుట్టదు, కావున నట్లనుగ్రహించి, నన్ను ధన్యున్ జేయుదురు గాక,
యనుచు లోకవేదియగు నగ్గోపాలదేవుండు, నశిళయం దనుగ్ర
హముసేయువాఁడై, వినయంబు రూపొందిన చాడ్పునఁ గ్రాలు
చున్న, యప్పరమసతిన్ జూపుచు, నెల్లరువిన, నత్యాదరంబున
నతనితో నిట్లనియె. ౮౩

తే॥ ఎవ్వరి పరిశ్రమంబున నెల్లప్రజలుఁ
గట్టఁ, దిన నోచికొందు? రా కాపువారి
పరమసతి యిమ్మనస్విని సరళయింటఁ
గుడువఁ బెద్దలతోఁ గోరికొంటి నేను; ౮౪

తే॥ కూతు రెట్లట్ల యీ యమకూర్చు నాకుఁ
జాల ప్రియ మంటి; రింతకు సాలు నదియ;
మీకు నిష్టమకాదె పేర్మిమెయి నేను
గోరి మీ పుత్రి వెట్టంగ గుడుచు టరయ. ౮౫

వ॥ ఇంతియకాక యయాతిశాపంబున మాయన్వయంబువారు నేఁటి
దనుక కృషిపాశుపాల్యంబులె పరమవృత్తులుగ మర్యాదఁ గాచి
కొనుచు జీవింపుచున్నవారు, వెండియు, ౮౬

క॥ మాయన్న పరమకర్షకుఁ;
డాయత మేధాఘనుఁడు "హలాయుధుఁ" డను పే
రాయె నతనికి; నతండ య
జేయుఁడు; మఱి "ముసలి" నాఁ బ్రసిద్ధుం డుర్విన్. ౮౭

తే॥ బాల్యమంతయు నేను మున్ బాశుపాల్య
మంద సెల్లించితిని; గోవు లనిన నాకు

ప్రాణము లు ; వానిఁ గాపాడుభంగిఁ గొంత
యెఱుఁగుదు ; నెఱుంగువారల కెఱుఁగనగుదు. ౮౮

తే॥ "పరమగోపాలుఁ" డనియు, "గోపాలదేవుఁ"
డనియు నాకాయెఁ బేళ్లు రెం ; డవియసాలు ;
నాఁడు కర్షకు లనిన నానందమునకు
నోచికొంటి ; నిప్పుడు నట్ల నోచికొందు ; ౮౯

వ॥ కావునఁ గాపులమగు మేము, కాపులయిండ్లకడన తినుట యుక్తంబు; వేండియు. ౯౦

తే॥ సరళ పరిశుద్ధమగు మానసంబుతోడ
నెవ్వరికి నేమి బెట్టిన నెప్డుమేల ;
కీడుపుట్ట ; దీయమ పేర్మికిన్ దగంగ
నీరు, నేను నగుదు ; మగు నెల్లజగము ; ౯౧

తే॥ ఇట్టి నతిచేతియన్నంబ యెప్డు నాకుఁ
బ్రియముఁ గూర్చుఁ ; బుణ్యాద మది ; పెద్ద దెల్ల
వస్తువుల ; కెల్లచోట్ల నెవ్వరికి నెప్డు
దొరకునదికాదు ; పతికిఁ, బుత్రులకుఁ దక్క ౯౨

క॥ పతిపుత్రబంధుమాతా
పితృస్వజనసంఘములకుఁ బ్రియము, సుకృత, ము
న్నతగౌరవసుఖసంప
ద్గతులున్, బరమసతి కూర్పఁగల దనయంబున్. ౯౩

—శ్రీకృష్ణస్వామి వనితాలోకగౌరవంబున్ గూర్చి ముచ్చటించుట.—

తే॥ ఈ జగంబునకున్, మఱి యెల్లలోక
ములకుఁ బురుషులకన్నను మూలము సతి ;
యాండ్రులేనిజగము జగం బనుటకన్నఁ
దెలివిమాలినపల్కుండు కలదె యెందు ? ౯౪

క॥ మానవకుటుంబవృద్ధికి
మానుమలక్ష్మియనన్నైన మగువయె మూలం;
బేనును, మిగా, రెల్ల ప్రజలు,
భూనుత నారీజగమునఁ బుట్టితిమికదా! ౯౫

క॥ నెలతలు పొలములు; బీజం
బులు పురుషులు; పొలములేక పొల్పుగ వెలయున్
గలదే విత్తు తనంతన?
పొలము మఱియు విత్తులేక పొలుపున్ గనునే? ౯౬

తే॥ పొలము మంచిదికాదేనిఁ బుట్ట; దెట్టు
లేనిఁ బుట్టియుఁ బెరుగ; దొకింత యెట్టు
లేనిఁ బెరిగియు నుతికిఁ గా, దెందు నేని
విత్తు; కడు మేలిమిది నాఁగ వెలయునైన. ౯౭

తే॥ పుట్టఁగలశక్తి యించుక పొలమియున్నఁ
జాలు విత్తున; కుజ్వలసారవంత
మగు పొలంబున నది విత్తనైన, లెస్స
బుట్టుఁ, బెరుగు, జనస్తుతిస్ఫూర్తిఁ గాంచు. ౯౮

తే॥ మానుగా మంచి విత్తును మంచిపొలముఁ
గూడెనేనియు, వర్ణింపఁ గొలదిగాని
సారగుణగౌరవస్ఫూర్తిఁ జాల పెంపుఁ
జెందు నారెండు, నని వేఱ సెప్పనేల? ౯౯

క॥ కావునను విత్తుకన్నను
వావిరి ఘనమండ్రు పొలము; వసుధ నఖిల జీ
వావళి వనితాజాతియ
కేవలమున్ బురుషజాతికిన్ మే లెట్లున్; ౧౦౦

ఆ॥ గీ॥ ఎట్టులేని విత్తువెట్టి సక్రమన్ బోవుc
బురుషుc; డది ప్రవృద్ధిc బొరసి, పుట్టc,
బెరుగ, నుతికినెక్క, నెరవుమై సాల బా
ధ్యతవహించు నింతి తనకుc దాన. ౧౦౧

క॥ అదిగాన నెల్లభcగుల
ముదితయమూలంబు లోకమున కని రార్యుల్
విధితాఖిలతత్త్వులు స
ర్వదేశముల ప్రజలగౌరవం బరసి, తగన్. ౧౦౨

తే॥ తనకుటుంబిని భోగ్యపదార్థమనియు,
రతి మహాభోగమనియు, నిరంతరంబుc
గామరోగా ర్తిc బురుషుండు కాంతను, మఱి
సారసంతానగరిమనున్, సాల జెఱచు ౧౦౩

క॥ తన యర్థాంగినిc బనులకుc
దనకగు నొకసాధనముగ దాసిcగ, నిత్యం
బును భావించుపురుషు నే
మనసగు నా స్వార్థపరు, నరాధముc, గుమతిన్ ? ౧౦౪

క॥ తన పుట్టువునకు మూలమ
యిన తల్లి తెఱంగుc దలcచియేనియు, నర్థాం
గిని నెల్లు సూడc జనునొకో
యనయముc బురుషుండు ? తెలియcడcటె యది యాత్మన్ ? ౧౦౫

తే॥ మానితజ్ఞానఘనమైన మర్త్యజాతి
యను పరమసస్యమునకు, నిండారు సార
వంతమగు మేటిమడికాదె యింతి ? దాని
మహిమ నెఱుcగండు సామాన్యమానవుండు ; ౧౦౬

తే॥ అంగనయుఁ, గోమలియు, నిర్మలాత్మయుఁ, గల
కంఠియుఙ్, మితరోమయుఁ, గాంతయు, నగు
నింతి కాయము మనసును నెపుడుఁ జెఱచు
చుండుఁ గామార్తుఁడగు పురుషుండు సాల ౧౦౭

తే॥ కామమను తీవ్రనేత్రరోగమున సూచు
వస్తుతతి యొండుగతిఁ దోఁప, వనిత లసద
పారసౌందర్యరాశిమున్ భ్రాంతిఁ, బురుషుఁ
డాయమఁ జెఱచుఁ, దాఁజెడు, నాత్మకలఁగ ౧౦౮

తే॥ ఇంతి కచకుచగండోష్ఠకాంతులకు మ
గ్నంబు గలఁగంగ సూచుఁ దన్మయత, నెప్పు
డేని యాయమ కననైన ; నింక నొండు
పనులకుఙ్ గాఁడు దుర్భ్రాంతిఁబడి పురుషుఁడు ; ౧౦౯

తే॥ కానఁ బరకాంతయును, తనకాంతయును, వి
చార మించుకయును లేక సాహసించు,
నెన్నియేనియుఁ బన్న, నేమేనినేయు,
నల్పమతియై కలఁగు పురుషాధముండు ; ౧౧౦

తే॥ ఇంతవట్టిట్లు గావున నింతి మునుఁగు
వెట్టికొన, మూలఁబడియుండ, నింతరీతి
సిగ్గువడ నయ్యె ; నేమని సెప్పవచ్చుఁ
జెలఁగు పురుషాధముల కానిచేష్టలెన్ని ౧౧౧

క॥ పావనవనితాలోకముఁ
గావరమున సెఱచుఁ బెక్కుగతుల నెసఁగుచున్
కేవలమున్ బురుషుం ; డది
గావున ఘనమహిమకుఙ్ జగము కాదాయెఙ్ ; ౧౧౨

క॥ వనిత నిజమానరక్షణ
మునన ప్రవర్తింపనయ్యె మూలయు, మునుఁగున్
దనకున్ గతులుగ; నది గా
వున లోపము పనులకెల్లఁ బుట్టెన్ జాలన్. ౧౧౩

క॥ ఈ పరమసతీమణి బలె
రూపించెడి ధన్య, లెందఱో కలరన రా
దీపాపపుయుగమున, స
ద్వ్యాపారపరాయణలు, సధర్మచరిత్రల్. ౧౧౪

వ॥ అట్లు గావున. ౧౧౫

ఉ॥ ఈయమనేతియన్నమున కిష్టముసేయుదుఁ జాల; ధర్మమం
దాయతనిష్ఠ, వెండి కృషియందుఁ బరిశ్రమయుక్తి, నీతివి
ద్యాయుతవర్ణనీయవినయంబును, నేర్పు, నెసంగుచుండు నె
ప్డీయమచంద మేమనిగణింప? నెఱుంగుదు రీరలందఱున్ ౧౧౬

ఆ॥ పేర్మివెలయ నూరిపెద్దలతో నేను
నొక్కపంక్తిఁ గూరుచుండి, కుడుచు
భంగిసేయుఁడు; మఱి పల్వురు ప్రజలకు
నీరుఁ గుడువఁబెట్టుఁ, డింపెసంగ. ౧౧౭

తే॥ ఎలమి నాబాలగోపాల మెల్లప్రజలఁ
దన్పుఁ డీ రిష్టమృష్టాన్నదానగరిమఁ;
గుక్కలును, కాకులును దినఁగూడునవి క
డున్ బ్రియంబలరారఁ గడుపులు నిండ. ౧౧౮

క॥ కుక్కలు తమ కెష్టుఁ బ్రజల
దిక్కుగఁ గడుభక్తిమై బ్రదికెడిన్, ధృతి పెం
పెక్కఁ, బరమసాధువులై;
యుక్కెసెడపు జంబుకమృగయూథోద్ధతికిన్. ౧౧౯

తే॥ కుక్కలకు సాలుకోలఁదిగఁ గూడుపెట్ట,
కవి కడుపులెండఁ, బడియుండ, నన్నదాన
మునకుఁ బాల్పడు టొప్పు; దెట్లును సమస్త
భూతసంతృప్తిసేత యెప్పుడును లెస్స ౧౨౦

చ॥ అనుటయు నమ్మహాద్విజుఁ డుదంచితగౌరవమొప్ప నమ్మహా
త్మునికి నమస్కరించి, నయమున్, వినయంబు, నెసంగఁ బేర్మి ని
ట్లను జగతీధురంధరులరైతగు దేవరయాజ్ఞ కట్లు గా
దనఁ, దల సాలునే కర మనాత్ముఁ డనాఁదగు నాకు నెమ్మెయిన్ ?

క॥ దేవర యానతిచొప్పునఁ
గావించుటకన్న మాకుఁ గలదే జగతీ
పావనకర్మం బొక్కఁడు ?
కావున నత్తెఱఁగ మాకుఁ గార్యం బెట్లున్ ౧౨౨

క॥ ఈ రాత్రి కించుక ఫలా
హారము నర్పింపఁ గోర్కియైనది నా; క
ట్లీ రియ్యకొనరె ? దాసుని
కోరిక సెల్లింపరే మిగులకరుణ తగన్ ? ౧౨3

క॥ అనుటయు నప్పరమాత్ముఁ డ
తని కిట్లను నెంతయు నుచితము మీ పల్కి-
ష్టనఘా ! మీ కోర్కికిఁ దగ
నొనరింపుఁడు ; మాఱువల్కు టుచితమె నాకున్ ? ౧౨౪

ఆ॥ పండ్లు, శర్కరయును, బాలు, నింతింతలు
నాకు రాత్రిభోజనమునకైన
నత్పదార్థములు ; ప్రశస్తములయ్యు న
న్యములు కావు ; కూర్పఁ డంతవట్టు ; ౧౨౫

వ॥ మీ యూరివా రందఱు రా నెల్లి మీ యూరిచెఱువున స్నానంబు
సేతయుఁ, దదనంతరంబ మీ యూరివారి దేవదర్శనపూజనాదులు

సేయుటయు, నా పిమ్మట మీ యూరి పాఠశాలకుఁ బోయి యచ్చ
ట విద్యావిషయంబై ప్రసంగించుటయు, నాపై భోజనంబు సేయు
టయుఁ, బదంపడి నిధివివాదపరిష్కారంబుతోన మీ యూరిపెద్ద
లతో సంభాషించుటయు, నెల్లుండి పెందలకడన తరలిపోవుటయు
నాకుఁ గార్యంబులు ? మీ రట్లు సంఘటింతురుగాక యని వెండియు
నిట్లనియె ; నా కిచ్చట గాలి సాలకున్నయది, మఱ్ఱిక్రింద నాసనం
బమర్ప నంపుఁ డనుటయుఁ గొందఱువోయి, యాసనం బమర్చి
వచ్చి, వినయంబున విన్నవించుటయు, లేచి యజ్జగద్గురుండు. ౧౨౬

తే॥ వార లెడనెడఁ దొలఁగంగ వారణేంద్ర
గమనచారు విలాసవిభ్రమము మెఱయ,
నత్యుదారవిభూతి పెంపలర, వచ్చి
మఱ్ఱిక్రింద నిలిచి, గరిమం బెలర్ప. ౧౨౭

వ॥ అయ్యూరివారందఱు నతివినయంబుమైఁ యించుక దూరంబుననిలువఁ,
దనకై యమర్పబడిన యాసనంబుపైఁ గూర్చుండి, వారలఁ
గూర్చుండ నాజ్ఞ సేయుటయు. ౧౨౮

క॥ గారవమున నాతఁడు తన
చేరువఁ గూర్చుండ నాజ్ఞ సేయుటకు ముదం
బారన్, గూర్చుండి రొకట
వారందఱు నతనిచుట్టు వరుసవరుసగన్. ౧౨౯

ఆ॥ అట్టు లమ్మహాత్ముఁ డాయూరిలోని జ
నంబువలన గౌరవంబు వడసి,
యిష్టగోష్ఠి నుండు నెడ నయ్యె సూర్యాస్త
మయసమయము లోకమంజులంబు. ౧౩౦

## సూర్యాస్తమయసమయ వర్ణనము.

వ॥ ఆ సమయంబున.

సీ॥ అందందనవఘర్మబిందుసందోహంబు నెమ్మోములందుఁ గరమ్ము మెఱయఁ,
బొలముపాటున శ్రమంబునకు నగ్గంబులై కందిన మేనులకాంతి తరుగ,
జుట్టులఁ దప్పి, జుంజురు వెండ్రుకలు మృదులాంసభాగంబుల నావరింపఁ,
దలలపై దొంతులై, తొలఁగ కరిక్తాన్నభాండము లొండొరుఁ బలుకరింప
జేతులం దాకుఁ గట్టెలు చెలువెసంగ,
సకలమానవకోటిపోషణ ధురీణ
లైన కర్షక కార్మికమానవతులు
వరుసవరుసలునై సేరవచ్చి రూరు; ౧౩౧

సీ. గొడ్డళ్లుఁ బారలుఁ గొడవళ్లుఁ బాణితలంబులందున్ జెలువంబు సూపఁ,
దలలపై నెండుకట్టెలమోపులును బచ్చగడ్డిమోపులు జాలఁ గ్రాచులుండ
నెడనెడఁ దొట్రువోయిన పావుకోళ్లు పాదములకు మేలొకింత యొడగూర్పఁ
దైలసంస్కారణవిధానంబునకుఁ దప్పి, కొప్పులు మీఁదికిఁ గుంపుఁగట్టఁ
జెమట మేనులు దడియంగ, శ్రమము దోఁప,
నూరు సేరంగవచ్చి రొండొరులు నెవ్వి
యేనియున్ జెల్మిమై ముచ్చటించికొనుచుఁ
గర్షకులుఁ, గార్మికులును సక్కనిమనముల. ౧౩౨

సీ॥ గోచి ప్రాతలుఁ దలగుడ్డలుఁ బిల్లనగ్రోవులు, నందంబుఁ గూర్పఁ జాలఁ,
జేతులన్ గట్టెలఁ జేసిన మునికోల లేనియు, వేత్రంబు లేనిఁ గ్రాల,
నెనుము లేనియుఁ గాక యెద్దులు నేనియుఁ దమకు వాహనములై తనరుచుండ
నొండొరు మీరు నుద్యోగంబు తమతమ పాటలనాటల బాగుసూప
గోరజంబునఁ బ్రుంగుచు, సారె సారె,
కొక్కఁ డింకొక్కని నణంచి, యోరఁ జనుచు,

నూరు సేరంగవచ్చి రొప్పారుకొాతు
కమున గోపాలబాలకుల్ గ్రందుకొనుచు. ౧౩౩

సీ॥ కడుపార లేఁబచ్చగడ్డిమేసి, జలంబు ద్రావి, సంతృప్తినెంతయును గ్రాలి,
మందయానంబు రోమంథవిలాసంబుఁ దమకునెంతేనియందంబు గూర్ప
సర్వాంగపుష్టిసౌష్ఠవలక్ష్మికిన్ శరల్లక్ష్మి యీసుగొనక లలిఘటింప,
నొండొరునాకుచునొక్కింతయెడమలే, కొక్కఁడిఁకొక్కడునొరసికొనుచు
సకలమానవకోటి రక్షావిశేష
సారసాధుస్వభావ ప్రశస్తములగు
గోకులంబులు పరమపుణ్యాకరంబు
లూరుసేరంగఁ జనుదెంచె నొక్కఁడొకఁడు. ౧౩౪

చ॥ పొరిపొరి నొండొరున్ గలిసి, బొంపిరి వోవని చెల్మినో యనన్
దఱచుగ మేను మేనొరయ, దండడిఁ బైకొని, ద్రోసికొంచు వే
మఱుఁ దృణపల్లవాళి పసి మానక, పెన్నడ దూళి రేఁగఁగా,
నురణగణాజకంబులు సమున్నతి సేరఁగవచ్చెఁ గ్రామమున్. ౧౩౫

మ॥ కటికున్ మేనులుఁ, చేతికఱ్ఱలును, బెన్గావళ్లుఁ, బైఁ బ్రాకు జుం
జురుకొప్పుల్, దలగుడ్డలున్, వలుదగోచుల్, దాళవృంతంబులన్
సరి సక్కన్ గయిచేసినట్టి గొడుగుల్, సాలన్ రహింపంగ, వ
చ్చిరి జాబాలకు లూరిచేరువ కతిస్నేహంబుమై బల్కుచున్. ౧౩౬

తే॥ ఇట్లు పొలముల నడవులనెల్లఁ బాటు
వడు జనశ్రేణు లందందవచ్చి, యూరు
సొచ్చి, నిస్తులసారతేజోఘనుఁ డగు
నా జగద్గురు దర్శించి యట్టె నిలిచె. ౧౩౭

వ॥ మఱియు నా సాయంకాలంబున. ౧౩౮

తే॥ "కొక్కొరోకో" యనెడు సంజకూఁతతోడ
నెఱకలున్ దోఁకయున్ గదలించికొనుచుఁ,

బొంటియును, బిల్లగమియు వెన్నంటి రాఁగఁ
గోడి "గుటగుట" లాడుచు గూడు సొచ్చె. ౧౩౯

ఉ॥ ఇట్టటు సంచరింపుచు, నొకించుక గంఠము పైకి నెత్తి, య
ప్పట్టునఁ దాను మున్ను బహుభంగుల నేర్చినపల్కు లన్నియున్
గట్టిగ నొత్తిపల్కుచుఁ, దగన్ దను నింటి జనంబు మెచ్చగా
నట్టె రహించెఁ బంజరమునందలి చిల్క మనోహరాకృతిన్. ౧౪౦

తే॥ పంచఁ గట్టిన దూడయుఁ, బైఁ జరించు
మేకపిల్లయు నఱచుచుఁ, దోఁకయుఁ జెవు,
లిట్టు నట్టు గదల్చుచు, నెదురు నూచు
చుండెఁ దల్లులరాకకై నిండు ప్రేమ. ౧౪౧

తే॥ అపరసంధ్యాక్రియానిష్ఠ నపుడ యూరి
చెరువుగట్టునఁ గూర్చుండి, చెచ్చెర ఘటి
యించి, వైదిక లొండొరు లెవ్వియేని
సెప్పికొనుచును మెల్లన సేరి రూరు. ౧౪౨

తే॥ రజకసోదరి ధౌతవస్త్రములకట్ట
లెలమిమై విప్పి, యింటింటి కేఁగుచు, నొకఁ
డొకఁడు దప్పక యందించుచుండె, లెక్క
వెట్టి, వా రిచ్చునవి యొడి వెట్టికొనుచు. ౧౪౩

చ॥ తెలకలివారియెద్దుపని తీరెఁ; గువిందుఁడుఁ, గుంభకారుఁ, డి
మ్ములఁ బనినుండి లేచి, యొకమూలకుఁ జేర్చిరి సాధనంబు; లే
ఘలును, గదుల్లు బుట్టనిడి, గోడకు మేన్ ముసలమ్మ దార్చె; బు
ట్టల గుదిగూర్చె మేదరి; బిడాలము మిద్దెకుఁ బ్రాకె మెల్లనన్.

చ॥ పలకలఁ, బుస్తకంబులను, బాటిమెయిన్ గొని, పాఠశాలనుం
డి లసితకౌతుకంబు ప్రకటింపఁగనై, పలుపల్కు లొండొరున్

బలుకుచుఁ, బాడుచున్, సదువుబాలురు, బాలిక, లేపుమీర గం
తు లిడుచు, వ్రాలుచున్, బడుచు, దూలుచు మెల్లనసేరి రిండ్లకున్.

తే॥ ఎల్లగుడిసెల నుండియు, నిండ్లనుండి,
పాక ధూమంబులేచి, యంబరము ద్రోవఁ
బట్టె; నూనెల వత్తులఁ బ్రమిదలు చెలు
వంబు గైకొనెఁ దగ నెల్లవారి యిండ్ల. ౧౭౫

వ॥ ఇట్లు మఱియు ననేకవిధంబుల నయ్యూరనొప్పు నా సాయంసమ
యంబున. ౧౭౬

చ॥ ఒనరు నితాంతదీక్ష జగదుద్ధరణార్థము గొన్న యమ్మహా
త్ముని మహనీయదర్శన సముత్సుకతన్ గడుఁ గ్రాలి రెల్ల; ర
య్యనఘుఁడు వారియందుఁ బరమాదరభావము సూపె, వారు చే
సిన సుకృతంబుపండె; యదుశేఖరు నాతని చర్య లేమనన్? ౧౭౭

ఉ॥ కాదనఁ డేరినేనిఁ, బయిఁ గ్రమ్మినయాప్రజఁ బొమ్మనండు, మ
ర్యాదకుఁ దప్ప డించుకయు, నచ్చటఁ జేరినవారినెల్ల న
త్యాదరబుద్ధి సూచుఁ, దను నంటిననైన సహించు, సాల పెం
పూదు, మహానుభావుఁ డతఁ; డొడ్లకు నట్టితెఱంగు పోలునే?౧౭౮

శ్రీకృష్ణస్వామి కర్షకకార్మికాదుల నాదరించి పల్కుట.

క॥ సకలజగదుద్ధరణ ది
వ్యకర్మనిష్ఠఁ దగు నెల్లవారలకుఁ బ్రజా
నికరం బాదరణీయం
బకదా! యన నయ్యె నతనిభంగి యరయనై. ౧౭౯

క॥ తా నెక్కడ? యయ్యూరి ప్ర
జానికరం బేడ? వా రశంకఁ దన్నే

మేని నడుగఁ జెప్పుట యనఁ
గా నేడ? యతనివిధం బగణ్యము నూడన్ ; ౧౪౯

తే॥ ఒనర నాబాలగోపాల మూరివార
లెల్ల చుట్టునుజేరి, వీక్షింపుచుండి
రమ్మహాత్ముని నతివిస్మయమ్ము, భయము,
వేడుకయును నొప్పఁ, గనమైన వేల్పునట్లు. ౧౫౦

వ॥ ఇట్లెల్లవారును బనులుమాని, తనచుట్టున్ జేరి, బొమ్మలట్ల చేష్టలు దక్కియుంట కిష్టపడక యప్పరమప్రేమాఖని వారితో గౌరవంబుమై నిట్లనియె. ౧౫౨

ఆ॥ పనులుమాని యుంట పాడిగా ; దిండ్లకుఁ
బోయి, పనులతోన ప్రొద్దుపుచ్చి
యెల్లి కూడివచ్చి, యెల్లరుఁ బ్రియము సే
యుదురుగాక నాకు నుచితభంగి. ౧౫౩

తే॥ ఏను మీయట్టివాఁడన ; యెన్నఁడు నను
నెఱుఁగ రీ ; రట్లుగావున నిట్లు సుట్టుఁ
జేరి విభ్రాంతి నూచుచున్నారు, నేఁడు
పొందు ! రం డెల్లి నందఱు నిండువేడ్క. ౧౫౪

క॥ అనుడు మహనీయు నతని వ
చనమున గ్రామాధికారి సక్క బలికి పొం
డని పంచెఁ బొలములందున్
బనిపాటులు సేసి, శ్రమకుఁ బాలైన ప్రజన్. ౧౫౫

ఆ॥ గీ॥ వారు తృప్తిసనక మూరాడ వెఱచి, రే
పిమ్మహానుభావుఁ డిష్టు సెప్పి
నట్ల వర్తమనుచు, నతిభక్తి మ్రొక్కుచుఁ
జనిరి మనసుకాని మనసుతోడ. ౧౫౬

ఆ॥ అట్లు వారు పోవ నాపయి నమ్మిత్ర
శర్మ యమ్మహాత్ము సర్వవేది
నధికవినయ మొప్ప నంజలిజేసి, ప్రా
ర్థించి, చనవుమెఱయ నిట్టులనియె. ౧౫౭

క॥ పని సాలగలదు, దేవర
యనుజ్ఞఁ గొని, పోయి, వత్తు ననవుడు నౌఁ గా
కనియె జగద్గురుఁ; డాతఁడు
సనియె ముదంబార నాత్మసదనంబునకున్. ౧౫౮

వ॥ ఇట్లు సని యతం డాసకలలోకారాధ్యునకు ఫలాహారంబు సమకూ
ర్చువాఁడై యచ్చోట మసలువాఁడయ్యె, ననంతరం బాలోకవేది
యార్యవర్గంబువారితో నిట్లనియె. ౧౫౯

ఆ॥ గీ॥ సరళఁబోలు పరమసాధ్వి యెందును లేమి
నిజముసుండు ; మీరు నేను నూరి
లోని పెద్దవారు మానుగ నీయమ
యింట రేపు గుడుత మిచ్చలార. ౧౬౦

వ॥ కావున నీయమయంద యెల్ల భారంబు వెట్టక, సకలపదార్థంబులు
గూర్చను, వంటలుసేయను, దగువారిన్ సహాయులుగా నియమించి
రే పెల్లపనులకు సాలియుండుఁడు ! మఱియుఁ బురోహితుండు
తక్కున్‌గల యెల్ల ప్రజలఁ దనయింటఁ గుడువన్ బిలువనై యు
న్నవాఁ ; డాతనికి నయ్యైపనుల సాయంబుసేయ మఱికొందఱన్
గూర్చుఁడు ; రే పెల్లవారుఁ బనులుమాని, యిండ్లనేనిఁ గాక మన
యొద్దనేని నుండ సాటింపుఁడు ; మీ రందఱుఁ బనులుమాని నాతోన
యున్నవారు ; పనులకు సెడుట మేలుకాదు, మీమీ యిండ్లకు
సని, పనిపాటలు సూచికొని, యెల్లిననుఁ గలిసికొందురుగాక యను
టయు వా రతివినయంబుమై నిట్లనిరి ; ౧౬౧

తే॥ ఏము మొదలుగ నెల్లవా రింద జాగ
రంబు సేయఁదలంచి రీ రాత్రిఁ; బరమ
దైవమగు దేవరవిడచి తగునె మాకు
నిండ్ల నిద్రింప? దొరకునే యిట్టియదను? ౧౬౨

వ॥ మా కిమ్మాడ్కి నుండ దేవరవా రనుగ్రహించునది యనుటయు, నమ్మహాత్ముండు మీ కిష్టంబగునేనియు నట్ల సేయుండన, వారు మహాప్రసాదంబని పరమానందంబున యాక్షణంబ తగువారి నియోగించి, "రే పెల్లవారుఁ బనులకు బోవక యిజ్జగద్గురువుల సేవయంద యుండునది" యనియుఁ "బురోహితునియింట నెల్లవారు నారగింతురుగాక" యనియు నూర నెల్లెడల సాటించి, యనంతరంబ మెల్లమెల్లన రాత్రియగుటయు, నయ్యాదుప్రభుని కయ్యార్య కార్యాలయంబునంద తల్పంబు సంఘటించి, దీపంబులువెట్టి విన్నవించి; రమ్మహానీయుండు మేలయని, తన చుట్టునున్నవారివెనుక నొక్కచో నొదిగి, నిల్చియున్న యక్కర్షకకుటుంబినీమణిఁ జూచి, యత్యాదరంబుమై యిట్లనియె. ౧౬౩

తే॥ చాలసేసావొఁ, బొమ్మమ్మ! సక్క వంట
కములు సేయించి రేపు వేడ్కమెయి మాకుఁ
గుడువఁ బెట్టింపుమమ్మ! మా కొఱకు నీవు
శ్రమపడఁగ నయ్యెనమ్మ యీ చందమునను. ౧౬౪

తే॥ ఎవ్వరేనియు ఘనులు వీ రింతసెప్పి
రిట్టులని పొంగి, తివిరి, యనేకవస్తు
వులను గూర్ప శ్రమంపడ వలవదమ్మ!
నిన్ను శ్రమవెట్ట మఱి మాకు నన్నె యెట్లు? ౧౬౫

వ॥ అనుటయు నమ్మహాసతి మహాప్రసాదంబని మెల్లన వినయంబుమై పలికి, కరంబులు మోడ్చి, యనుజ్ఞఁగొని, ననుచుండ, నిమ్మహా

త్ముల యనుగ్రహంబున కిట్లీయమ పరమపాత్రం బాయెనే యను నాశ్చర్యంబును, సంతోషంబును, బరమాదరంబును దోఁపఁ, గొందఱుపెద్ద లాయమ ననుపువారై సని, యప్పురంధ్రీమణి కిట్లనిరి ; ౧౬౬

ఉ॥ ఎంతతపంబు సేసితొకొ ? యేమన నీమహనీయభాగ్య ? మే
మింతకు నిన్నెఱుంగ ; మిది యిట్టిద ; యిప్పు డెఱుంగనయ్యె ను
మ్మంతటి లోకపూజ్యుఁడు మహాత్ముఁడు భవ్యుఁడు నీగృహంబునం
దెంతయు వేడ్కఁబుట్టి భుజియించునఁటే మనపెద్దవారితోన్ ? ౧౬౭

క॥ అనుటయు వారికి నాయమ
వినయంబున నిట్టులనియె వేల్పులకున్ వే
ల్పనఁగు నమ్మహనీయుని
యనుగ్రహము కాక యంతకగుదునె యేనున్ ? ౧౬౮

క॥ మా కులమువేల్పుల కృపయ
నా కీభాగ్యంబుఁ గూర్చె ; నన్నెఱుఁగరె మీ
రే కార్యమునకుఁ గాని వి
వేకరహిత నగుట ? యెంత వింతకు నైతిన్ ? ౧౬౯

తే॥ అమ్మహాత్ముల దయకు నే నగుట మీర
లెల్ల మన్నించుటయు హేతు ; వింతదనుక
నే నెఱుఁగఁజాల నాభాగ్య మిట్టులగుట ;
మీకు మ్రొక్కుదు, మ్రొక్కుదు లోకమునకు. ౧౭౦

క॥ ఎక్కడ మన ? మా ప్రభువరు
లెక్కడ ? నాయింటఁ గుడుచు టెక్కడ ? మతికిన్
దక్కితి నానందమునన్
జొక్కుచు ; నా కార్యభరము చూపెట్లో కదా ! ౧౭౧

క॥ మీరందఱుం దోడ్పడి, నా
పేరున నిక్కార్యము నడిపింపరె ? మిమ్మున్
జేరితిఁగాదే ? మా బ్రదు
కీ రెఱుఁగరె ? మీక కాక యిది నా కగునే ? ౧౭౨

తే॥ అమ్మహాత్ములకున్ బ్రియంబైన భంగిఁ
గూర్ప నే సాలుదునె మీరుఁ గూడరేని ?
నెలమి నిప్పేదరాలికి నెట్లు గూర్తు
రోక్షదా యెల్లి మీరందఱున్ బ్రియమున ? ౧౭౩

తే॥ అమ్మహాత్ములు విచ్చేతు రనుచుఁ బట్ట
రాని సంతోషమును, వారి మానసమున
కైనభంగిఁ బ్రశస్తపదార్థములను
బెట్ట లే ననుభయము, నా కిట్టులయ్యె. ౧౭౪

వ॥ అనవుడు వార లమ్మా ! నీ కెట్టిభయంబును వలవదు, నేమ యెల్ల
పదార్థంబులను గూర్చిపెట్టి, యెల్లపనులకు సాలువారి నియమించి
నీకుఁ దోడు సూపుదుము, సర్వజ్ఞులైన యా ప్రభువులె నీస్థితి నరసి,
మా కివ్విషయంబున నానతిచ్చు టెఱుంగుదుగాదే ? మా యోపి
నట్లు పాటువడి, నీ నెపంబున యీ లోకపూజ్యుల కైంకర్యంబునకై
పావనతఁ బడయ నోచికొందు ; మీ వింత సెప్ప నేల ? నీ రాత్రిఁ
బరమానందంబున సుఖనిద్రన్ బుచ్చి, రేపకడన మేల్కాని, యెల్ల
పనులును సూచికొందువుగాక యని చెప్పి, యాయమ నిల్లుసేర్చి,
మఱలివచ్చి, యప్పరమాత్మునిచుట్టున్ గూడి యున్నవారలన్
గలిసికొనిరి, తదనంతరంబ. ౧౭౫

మిత్రశర్మ శ్రీకృష్ణస్వామికి ఫలాహారంబు సమర్పించుట.

ఆ॥ అచట మిత్రశర్మ యతిశీఘ్రముగఁ బండ్లుఁ
బాలు, శర్కరయును, సాలు కొలఁది

గూర్చి, కులమువారుఁ గూడిరా, నవి కొని
వచ్చె నయ్యదుకుల వరుని కొఱకు ; ౧౭౬

క॥ అతఁ డిట్లునచ్చి, భక్తియు,
నతివినయముఁ, దోఁప నమ్మహాత్మునకు సమం
చితమతి మ్రొక్కి, తనవిధ ము
చితరీతిన్ విన్నవంబు సేసెన్ గరిమన్. ౧౭౭

వ॥ పదంపడి.

ఆ॥గీ॥ అమ్మహానుభావుఁ డత్యాదరంబున
నతనిఁ దనియపల్కి, యతఁడు, నచటి
వారు, వెంటరాఁగఁ జేరె నయ్యార్యకా
ర్యాలయమునఁ దనకునైన సెజ్జ. ౧౭౮

తే॥ ఆముదపు దీపములు లసదమలకాంతి
కిరణపూరంబు లమ్మహాపురుషవరు జ
సద్గురునిశయ్య కొకప్రకటఁ గ్రాలుచుండె
నప్పు డయ్యార్యకార్యాలయంబునందు ౧౭౯

వ॥ అనంతరం బగ్గోపాలదేవుండు తనచుట్టున్ జేరి, వినయంబు సూపు
చున్న నయ్యార్యివారితో మార్దవం బుట్టిపడ నిట్లనియె. ౧౮౦

తే॥ చాలు నింతకు రాత్రి భోజనము సమయ
మయ్యె ; మీ రిండ్లకున్ జనుఁ, డారగించి,
యిష్టమగునేని మరలరం ; డెల్లవారు
నాదరించితి రిట్లు న ; న్నదియ సాలు. ౧౮౧

క॥ అనుటయు మహాప్రసాదం
బని, వార లనుజ్ఞఁ గొని, గృహంబులకు షడిన్
జని, తిని, యెల్లరు నొక్కెడ
మనంబు లలరంగ గూడి, మంచి మెఱయఁగన్. ౧౮౨

వ॥ ఆ రాత్రియంతయు నార్యకార్యాలయంబు నొద్ద నిష్టగోష్ఠి జాగరంబు సేయను, వలయునెడ నమ్మహాత్ముని సేవకుఁ జొరను, భాండశాలన్ జేర్చిన పురోహితకర్షకకుటుంబినీ వివాదగ్రస్త మహానిధి రక్షింపను, నిశ్చయించికొని, తక్కిన యూరివారందఱకుఁ దమనిశ్చయం బెఱింగించి, వారును మహాహ్లాదంబునఁ గూడిరా, నమ్మహాపూరుషోత్తము విశ్రాంతికి నై, పరమపావనత్వసౌభాగ్యలక్ష్మి సదనంబైన యయ్యార్యకార్యాలయంబు నొద్దఁ జేరికొని; రంతకుమున్న యాకృష్ణభగవానుండు శుచియై, మిత్రశర్మ సమర్పించిన ఫలపయశ్శర్కరలు సారథిసహితుండై యారగించి, మరలఁ దల్పంబు సేరి, యా బ్రాహ్మణోత్తమునితో సంభాషించుచున్నవాఁడు కావున స్త్రీబాలవృద్ధులు దక్క, తక్కిన యూరిలోని ప్రజలందఱు నచ్చటన్ జేరి యున్కికి నలరి, పెద్దలన్ రావించి, సముచితగౌరవంబు మెఱయ నిట్లనియె. ౧౮౩

తే॥ పరమసంతోషమయ్యె మీ భక్తికిట్లు;
కలదు మీ కెల్లఁ బని సాల; గాన మీకు
నిష్టమగుభంగి వర్తింపుఁ డీనిశ; మఱి
కడఁగుఁ డీరందఱును రేపకడఁ బనులకు. ౧౮౪

తే॥ ఏ నొకించుకవిశ్రాంతి నిప్డుగొందు;
నాకు మీతోడ నెల్లి గొనంగనైన
పనులు సాల కలవు; మీ యపారమైన
ప్రేమకున్ బద్ధుడన యెట్లుఁ బెక్కుగతుల; ౧౮౫

వ॥ మీయూరి చెఱువునందు మీ యందఱితో స్నానంబును, తదనంతరంబ దేవపూజయు, నాపైఁ బౌరశాల సంభాషణంబును, బదంపడి భోజనంబును, బిమ్మట మీతో నిష్టగోష్ఠియు, నిధివివాదపరిష్కారంబును నాకు రేపటిపనులై యున్నయవి, మీ రందఱేని,..

కాక కొందఱేని సరళకును, మిత్రశర్మకును రేపకడ నెల్లపనులకుఁ దోడుసూపుఁడు, మీ కిష్టంబగున ట్లీరాత్రిఁ బుచ్చుఁడు, మీ కిం తకుమున్న యివ్విషయంబు నెఱింగించితిఁగాదే యనుటయు, వారం దఱు నతివినయంబునఁ జేమోడ్పులతో నప్పరమాత్మని కిట్లనిరి;

క॥ దేవరసన్నిధి నుత్సా
హావేశముపేర్మి రాత్రి యంతయుఁ బుచ్చం
గావలతుము జాగరమునఁ;
గావున మా కాజ్ఞ నీయఁగాఁదగుఁ బ్రభువుల్. ౧౮౭

వ॥ అనుడు నమ్మహాత్ముండు మీ కిష్టంబగుభంగిఁ బ్రవర్తించునది యని మున్న సెప్పితిఁగాదె, మఱల నేల యడిగెద రనవుడు వార లత్యానందంబునఁ దేలిరి, పదంపడి యచ్చట. ౧౮౮

సరళా సర్వమంగళా సంభాషణము.

తే॥ సరళ యానందసాగర తరళతర వి
శాలభావలస ద్వీచి మాలికావి
హారణచతురమనోరాజహంసి యగుచుఁ
జనియె నిజమందిరమునకు సక్క నడిచి. ౧౮౯

తే॥ ఇట్లు సని భర్తకున్, దన కిష్టులైన
పొరుగువారికి, నమ్మహాపురుషవరు, న
నుగ్రహమునకుఁ దా నప్పు నోచికొన్న
విధము వినిపించె, సంప్రీతి వినిరి వారు. ౧౯౦

వ॥ తదనంతరం బప్పరమసాధ్వి తన బాలబాలికలకును భర్తకును గూడు వెట్టి, తానును దిని, యింటిపను లతిసత్వరంబుగ ముగించికొని శేషటికార్యవిధానం బాలోచింపను, దనకుఁ దోడ్పడను దగునతులఁ గలిసికొనఁ దలంచియుండ, నొక్కరొక్కరుగ నా యూరి యాం

డ్రందఱును బరమానందంబును విస్మయంబును గదుర, నాయమఁ గలిసి మాటలాడవచ్చుటయు, వారలకుఁ బీటలును 'జాపలును బరమాసనంబులుగ సమర్పించి, వారు కూర్చున్నపిదపఁ, దానును గూర్చుండి, యతివినయంబు దొలుకు పల్కులు బల్కుచుండె, నా సమయంబున నా వచ్చిన యిల్లాండ్రందఱకుఁ బూజ్యరాలును, ప్రాజ్ఞయు, నక్షత్రకకుటుంబినీరత్నంబునకుఁ జిరపరిచితయు, నగు మిత్రశర్మ సతి సర్వమంగళయను పరమబ్రాహ్మణి యా సరళ కిట్లనియె.

తే॥ ఎంతవారమ్మ! యీ ప్రభు? లేమిసెప్ప
నమ్మహాత్ముల తేజంబు? నతని చెలువ?
మెవ్వరోకో వార? లాతని నింత కెఱుఁగ;
మాతఁ డన్నింటికిన్ సాలునట్లు తోఁచె. ౧౯-౨

ఉ॥ ఎట్టి తపంబు జేసితొకో యింతకుఁ బూర్వపు జన్మమందు నీ
వట్టి మహానుభావుని దయామృతపాత్రమ వైతివమ్మ? మా
యట్టి యపుణ్యశీలలకు నాతని శశ్వదనుగ్రహంబు నె
ప్పట్టున నేనియుఁ బడయుభంగి లభించునె యెంతనోఁచినన్? ౧౯-౩

తే॥ అతఁ డొకగొప్పవేలుప; యట్లు కాద
యేని నొకదైవశక్తి రహించు పూరు
షోత్తముఁడ; కాఁడయేని యత్యుజ్జ్వలమగు
నతని మాహాత్మ్య మంతకు నగుట యెట్లు? ౧౯-౪

తే॥ ఎందుఁ బోవఁ దలంచి వారిటకు వచ్చి
రొకదా! మనవ్వారిలో నొక్కఁడేని
యెఱుఁగఁజాలఁడఁట? యతండ యెఱుఁగఁజెప్పఁ
కున్న నవ్వార్త నెఱుఁగుట కొడ్లకగునె? ౧౯-౫

క॥ అతఁ డెంతటి ఘనుఁ డౌనో?
యతఁడ యెఱుంగు నది; యతని యౌదార్యం, బం
చితమర్యాదయుఁ, దాల్మియు,
నతనికె తగుఁ గాక యొరుల కవి లభ్యములే?

క॥ మన యూ రెక్కడ? యా ప్రభు
లన నెక్కడ? వారికి హితులట్లు చనవుమై
మనవారు పలుకు టెక్కడ?
వినము! కనము! నతనిఁ బోలు వేలుపు నెందున్.

క॥ నీ చేతి యన్నమునకున్
నోచితి నని పల్కె నఁట ఘనుం డా ప్రభు? న
వ్వాచాలుత్వము నేమన?
నోచికొనఁగనైతివె తదనుగ్రహమునకున్?

క॥ అమ్మా! నీ శీలము మా
కిమ్మెయి నెఱుఁగంగనాయె నిన్నాళ్లకుఁ; బు
ణ్యమ్మయ్యె మాకు నిన్ను న
యమ్మెయిన్ గలిసి మాటలాడఁగ నగుటన్.

క॥ మేమందఱమును దోడ్పడ
నేమంబున వంటకములు సేయుదు గా కీ
వామహానీయునకున్ రే;
పేమాడ్కిన్ మాకు బుణ్య మిప్పింపు తగన్.

క॥ ఘననేర్పు మెఱయ సేయుద
మనేకవిధములగు కూర, లన్నంబులు, నా
ఘనునకుఁ జిత్తం బగున;
ట్లనంతఘనమునకు నగుదు మట్లందఱమున్.

క॥ మా కిమ్మోయి ఫలమగు టది
నీ కొప్పదె ? మాకుఁ గావె నీ ? వురుపుణ్య
శ్లోక ; వసూయఁ గొనవు కా
దే ? కలిసిమెలిసి తిరుగుదు మింతకు మనమున్. ౨౦౨

క॥ నీకున్ మావారికిఁ, దగ
వేకారణమునను నైన నేమి ? యది యసూ
యాకలహమునకు మూలము
కాక త్రోలఁగిపోయె నేఁడు గాదే పుత్రీ ! ౨౦౩

క॥ కూతురువని నిన్నింతకుఁ
బ్రీతిన్ గూర్చితిని కాదె ? ప్రేమ నెఱపుచున్
మాతృపదంబున మిక్కిలి
నీతివెలయ నన్ను నీవు నిల్పితికాదే ? ౨౦౪

క॥ అనుటయు నా సాధ్వీమణి
వినయంబున నిట్టులనియె వినవమ్మా ! నీ
వనఘాత్మురాల ; వింతకు
ననునే న న్నిట్లు పొగడ ? సక్క సరయవే ? ౨౦౫

క॥ మీయందఱకృప కాదే
నాయుఃజీవనమునకు, ఘనతకున్ మూలం ?
బేమెడ నేమేని గలదె
మీ యిష్టంబునకుఁ దప్పి మెలఁగితి నేనివ్ ? ౨౦౬

ఆ॥ విధియకారణముగ నేఁ డమ్మహాత్ము న
నుగ్రహమున కట్లు నోఁచనైతిఁ ;
గాక యోగ్యత యనఁ గలదె నాయందు ? మీ
కెఱుఁగరానిచంద మేడ నాకు ? ౨౦౭

క॥ మీ యందఱిలో నొక్కతె
నై యుంటయ నాకు నభిమతార్థము ; మీకున్
నాయెడఁ గల ప్రేమకుఁ గల
దే యెన్నఁగ మేర యనఁగ ? నింతియ పలుక్. ౨౦౮

తే॥ అమ్మహాత్మునికే నెట్టు ? లట్లు మీర
లఁగుదు ; రాతని యౌదార్య, మతని మంచి
తనము నింకెందుఁ గలవే ! యతండు లోక
ముద్ధరింపంగఁ బుట్టిన యిద్ధమూర్తి. ౨౦౯

తే॥ ఆ ప్రభువు రేపు నాచేతి యన్నమునకు
నోచుకొనె నఁట ? యీ సదనుగ్రహంబు,
నాపరమసౌమ్యభావంబు, నామహత్త్వ
మేమిసెప్పంగ ? నతఁడేడ ? నేడ నేను ? ౨౧౦

క॥ రే పెల్లొకొక్క యయ్యవు
రూపవు వేల్పుఁగడునేర్పు రూపింపఁగ మీ
రోపుకొలఁదిఁ దనియించుట ?
నా పే రందేల ? మీరు నావారకదా ! ౨౧౧

క॥ నాకున్ మారుగ మీ రా
లోకోత్తరపురుషు నెట్టిలోపము మనకున్
రాకుండఁ బూజసేయుట
నా కిష్టము ; మిమ్ముఁ గాదనఁగ నా కగునే ? ౨౧౨

వ॥ నేఁటి రాత్రి మన యూరివారందఱు నమ్మహాప్రభువునొద్ద జాగ
రంబుసేయువారై కూడిరి ; మఱియు రేపవ్వేల్పు దొరతో
నిష్టగోష్ఠి సేయుదు రఁట ! మగవారగుట వా రట్టిభాగ్యంబునకు
నోచికొనిరి ; మన మాండ్ర మగుట దానికిఁ గాకపోయితి ;

మైనను రేపు పెందలకడన యన్నిపనులున్ జేసికొని, స్నానాదుల శౌచం బలవరించికొని, మన మందఱమును గులవేల్పున్ బోలె న్నా జగమువేల్పున్ బూజింతము కాక! యమ్మహానీయుం డాంధ్ర యందును, బేదలయందును సాలదయసూపువాఁ డని విందుము; కాన మగవారికన్న మనల నవశ్యంబు నతండు మున్న గారవించు, నిది నా కన్న తెఱంగు; దీనికి మీ రేమందు? రనుం డనుటయు నప్పరమ బ్రాహ్మణి మొదలుగాఁగల యయ్యాంధ్రందఱు నదియ మేలనియుఁ, దమ నిశ్చయం బదియ యనియు నెఱింగించిరి; పదంపడి యప్పరమసతి సంతసంబున వారిఁ జూచి. ౨౧౩

తే॥ ఎల్లి మీ రందఱున్, గొందఱేని నాకు
నెల్లపనులందుఁ దోడ్పడరే యనుట[illegible]
వార లింతకు నే మదికోరి కాదె
వచ్చితిమి నిన్నుఁ గన నని పలి[illegible]రెలమి.

క॥ దానికి నాయమ మిక్కిలి
యానందముఁ బొందె; వార లొ[illegible] స[illegible] రే[illegible]
తేనియుఁ బ్రియమున నా సతి
మానుగఁ దమ్మన్ను వెట్ట, మంచి నెఱపు[illegible] ౨౧౫

వ॥ అనంతరం బవ్వివేకవతి తన రేపటి కార్యవిధానక్రమం బాలోచింపుచుఁ బ్రక్కవాల్చి, నిద్రకున్ జొచ్చె; నా సమయంబునంద యిక్కడ. ౨౧౬

తే॥ ఆ జగద్గురుఁ డూరివా రంద ఱట్లు
జాగరముసేయ గాఢ నిశ్చయము వట్టి
యుండ, మృదువు సెజ్జక వల్కి, యోగనిద్రఁ
గైకొనియెఁ దల్పమునఁ దల్పు గడియవెట్టి. ౨౧౭

వ॥ ఇట్లు.

సీ॥ బహురాజకన్యకా ప్రాణమానాది రక్షానుదీక్షాబద్ధకంకణుండు
సకలభూపాలరాజ్య ప్రాణమానభయోన్మూలనోద్యదుద్యోగ శీలి,
యఖిల జగత్కంటకాసురలోకసంహార కార్యైకపరాయణుండు,
సర్వేశ శక్తి ప్రపంచ విరాజితామానుష ప్రభావస్ఫురత్సారమూర్తి,
యమ్మహామహుఁ డయ్యార నా ప్రజలకు
నతిథియై, వారు తనసుట్టు నట్లుసేరి
యుండగ, ననన్యసామాన్య యోగనిద్రఁ
గ్రాలుచుండె మహాయోగఘనుఁ, డనఘుఁడు. ౨౧౮

తే॥ అపుడు జాగర మొనరింప నట్లు కూడి
యున్న యయ్యారివారిలో నొక్క కొంద
ఱమ్మహాత్ముఁడు తమకు నట్లయ్యె ననుచు,
వెడవెడఁ బ్రియంబుమైఁ బల్కఁ దొడఁగి రెలమి. ౨౧౯

క॥ వచ్చియు రాకుండియుఁ గడు
నెచ్చకు నగు పాటలకు రహిన్ గొంద ఱొగిన్
జొచ్చిరి; కొందఱు తమ నే
ర్పుచొప్పటన నూపనాడి ర ట్టిట్టు లుకన్. ౨౨౦

క॥ తమ గాథ లెన్నికొనుటకు
సమయము తమ కదియ యనుచు నక్క నగము నే
ర్పమరంగఁ బల్కఁ దొడఁగిరి
కొమరు నెఱపి, మిత్రులు వినఁ గొందఱు మఱియున్. ౨౨౧

ఆ॥ ఈ మహాత్ము లిచటి కేమికార్యమున వ
చ్చిరొకో ? యనియు, నతివిచిత్రపురుషుఁ
డీతఁ డనియు, నింక నేమేనియున్ గొంద
ఱాడఁ జొచ్చిరి తమ యాప్తులు విన. ౨౨౨

తే॥ రేపు మనమందఱమును బేర్మిమెయి నిమ్మ
హాప్రభువువారితో గోష్ఠి నలర నోచి
కొంటి; మింతకు, మన మనుకొనని భాగ్య
మబ్బెనే యని మఱికొంద ఱనఁదొడఁగిరి. ౨౨౩

క॥ సడి గాని భంగి మెల్లన
నుడివికొనుఁడు! నిద్రమాని నోరి కొలఁదిఁ బ
ల్కెడుచొప్పె యిది? యనుచున్
గడ్డ నురువునఁ గొంద ఱాడఁ గడఁగిరి పెద్దల్. ౨౨౪

తే॥ అమ్మహాత్ములు నిద్రవో నలిగి రేని
యేమి పుట్టునొకో? యది యెఱిఁగికొనియు
పల్కుఁ, డాడుఁడు, పాడుఁ, డిప్పటికి నైన
రీతి నని కొంద ఱనఁ జొచ్చిరి తగువారు. ౨౨౫

తే॥ కునుకుఁబాటునకయ్యును గొందఱు తమ
బలువు నూపుచుఁ గండ్లఱెప్పలకు బుద్ధి
సెప్పఁ గడగిరి; కొందఱు తప్పు పల్కు
లాడఁ జొచ్చిరి నిద్రకు నట్టివాచి. ౨౨౬

తే॥ ఆర్యవర్గంబువారు, గ్రామాధిపతియు,
మిత్రశర్మయు, నొక్కచో మిగులఁ బ్రీతిఁ
గూడికొని, యా జగద్గురుఁ గూర్చి సాలఁ
జెప్పికొనఁజొచ్చి రెంతయు నొప్పు మెఱయ. ౨౨౭

వ॥ ఇట్లయ్యూరివారందఱు నప్పరమపూరుషు దివ్యపాదారవిందపరాగ
స్పర్శభాగ్యప్రభావసద్యోజాత విమలభక్తికళాలేశమాత్రవిలసిత
మనఃప్రవృత్తినిరస్తనిద్రామోహులై యచ్చో జాగరంబుసేయు
చున్నవా; రిచ్చట నమ్మహామహుని జగత్కల్యాణ దివ్యావతా
రంబునఁ బవిత్రమైన భారతమాతకుఁ బుత్రులమై; యపారతత్త్వజ్ఞ

లగు మహర్షిచిత్రకరు లక్కాలంబునఁ జిత్రించిన మహాగ్రంథ పటంబుల నయ్యమానుషతేజోరాశిపావనస్వరూప ప్రవర్తనాదుల సందర్శింపుచు, బుద్ధిన్ బట్టించి కొనుచు, నానందింపుచుండు యేమును, మా పాతకమహాశయులును, జాగరంబు సేయుట యుచితం, బిజ్జాగరంబు. ౨౨౮

ఆ॥ ఎద్దియేని నొక మహీతకథాకథనంబు
నంద బుచ్చు టుచిత, మట్లుఁ గాన
యింతకుమును తగ నొకించుక సూచించి
విడిచిన నిధికథయ విస్తరించి. ౨౨౯

వ॥ చెప్పన్ దగి యుండు, నది యెట్లనిన సకలజగత్పావనుం డగు నగ్గోపాలదేవుం డట్లా సాయంకాలంబున నయ్యూరు సేరుటయు, నయ్యూరివా రమ్మహాత్ముని దేవోపచారంబులఁ దమ యోపు కొలఁది నారాధించుటయు, వారి యందలి పెద్దవా రొకమహానిధి విషయంబునఁ దగవుపడిన బ్రాహ్మణోత్తమ కృషీవలకుటుంబినీమణులతగవుఁ బరిష్కరింప నేర్పసాలక, యయ్యాదవేశ్వరుసన్నిధి నవ్వివాదక్రమంబు విన్నవించి, తత్పరమ విప్ర వరమకృషికసతులఁ దమతమవాదంబు లెఱింగించికొనఁ బ్రేరేపించుటయు, వా రట్లు సేయుటయు, నది యంతయు నెఱింగి, కార్యవాది గావున నతండు రేపటిమధ్యాహ్న భోజనానంతరంబున సుముఖంబుమై బరిష్కరింతునని యానతిచ్చుటయు, నస్మ త్పాఠక ప్రవరు లెఱుంగుదురు; కావున నతిసంగ్రహంబుగ నొక్కవాక్యంబునన యప్పుడు తెలిపిన యమ్మహానిధి వివాదక్రమంబు నున్నరూపున మా రోపినట్లు విస్తరించి చెప్పుదుము, తత్ప్రకారం బెట్లనిన. ౨౩౦

## సరళా చరిత్ర సంగ్రహము.

క॥ శ్రీకృష్ణదేవు నతిథిఁగ । నాకర్షింపంగనాయె నా గ్రామం, బా
లోకోత్తరపురుషుండు మ । హాకృప నొకరెండురాత్రుళచోఁ నిలిచెన్.

క॥ కలఁ డా గ్రామమునం దొక
కులీనుఁడు కుటుంబియును, సుగుణశాలి, కృషీ
వలుఁడు నిరుపేద ; యతఁడ స
రళకున్ వల్లభుఁడు ; మఱి సరళమతి యొప్పున్. ౨౩౨

క॥ సముచితమర్యాద యొకం
డ మహాధన మాతనికిఁ ; గడంగ డధర్మ
క్రమమునకున్ ; మర్యాదా
ర్థమ యాతఁడు బ్రదుకుననుట తగు నిజమునకున్. ౨౩౩

ఆ॥ గీ॥ క్షేత్ర మొక్క యడుగుమాత్రమేనియు లేదు
వాని ; కమలసుగుణవతియుఁ, బరమ
సౌమ్యభావయు నగు సరళయ సర్వఫ
లాస్పదమగు పొలము, నాలయంబు ; ౨౩౪

క॥ పలువురు బిడ్డలు ముత్యం
బులు బలె నీశ్వరునికరుణఁ బుట్టి రతని ; కు
జ్వలసమ్మోదం బా బి
డ్డల వలనన పేర్మిమైఁ బడయు నతఁ డెప్డున్. ౨౩౫

తే॥ కడుపు సల్లగ బుట్టి, సక్కగ నెసంగు
బాలకుల సస్మితాక్షరాస్పష్ట మధుర
భాషణంబులు కర్ణవిభూషణములు,
దంపతులకు ; సదానందదములు, మఱియు. ౨౩౬

తే॥ అనుఁగు బిడ్డల ముగ్ధచేష్టాది లీల
లల్లనల్లన సూచుచు, నుల్లముల నె
సంగు సంతోషపారవశ్యమున సాలఁ
గ్రాలుదురు తల్లిదండ్రులు కరముఁ బేర్చి. ౨౩౭

తే॥ దైవయోగంబువలన దుర్దశఁ గలంగి
నట్టి సంసారి, కత్యుత్తమాన్వయమున
నుద్భవించినవానికి, నొక్కఁడనిధి
కడుపు నల్లఁగఁబుట్టిన బుడుత శిశువు. ౨౩౮

ఆ॥ శిశువు లాలనంబు సేయునప్పుడును, ద
న్ముగ్ధభాషణములు మురియు నపుడు,
నతుల దుర్దశాజనిత కష్టముల్ విస్మ
రించి, దంపతుల్ రహించువారు. ౨౩౯

ఆ॥ అమ్మ! యయ్య! యక్క! యన్న! యంచున్, ముద్దు
గులుకఁ జిన్ని పలుకుఁ బలుకు శిశువు
నట్టె కనుచు, నాత్మ నలరని దంపతు
లెవ్వరు కల? రుర్వి నెందు లేరు; ౨౪౦

తే॥ చేయినేని, దోసిలి యేనిఁ జేర్చి, పండుఁ
బప్పు, బువ్వయుఁ బెట్టవే యప్ప! యనుచుఁ
బలుకు బాలునివలన దంపతులు మఱువఁ
గల్గరే యెంతకట్టడి కష్టమైన? ౨౪౧

క॥ ఆడుచు, గంతు లిడుచు, నలిఁ
బాడుచు ముందంజవెట్టు బాలునివలనన్
వేడుకఁ బొందని పురుషుఁడు
లేఁడు, జగతి, లేఁడు, లేఁడు, లేఁ డూహింపన్. ౨౪౨

వ॥ మన కథాసందర్భంబున. ౨౮౩

క॥ వెలయఁగ నప్పురమున కృషీ
వలుఁడు నిజగ్రామవాసి, వరశుద్ధయశః
కలితు, ఘను, మిత్రశర్మన్
గొలుచున్ భూస్వామి భక్తి కొమరొప్పంగన్. ౨౮౪

ఆ॥ ఆ కృషీవలునకు నవ్విప్రునందు న
త్యంత భక్తి కలదు దైవమందు
వోలెఁ; నా కృషికుని బుత్రునిన్ బలెఁ బ్రేమ
నరయుచుండు నెప్డు నా ద్విజుండు. ౨౮౫

ఆ॥ ఎట్లుకోరు నమ్మహాసురోత్తముని శు
భాగమనము నిత్య మా కృషీవ
లుండు? పేర్మి నా ద్విజుం డట్లుకోరు నా
హాలికోత్తముని శుభాగమంబు. ౨౮౬

తే॥ విత్తమువలన, వెండియు విద్యవలన
నధికుఁ డాకర్షకునికన్న నా ద్విజుండు;
కాని యయ్యుర్వ్వరకును సమానమ తుల
నిడినకైవడిఁ బ్రేముడి యెల్లగతుల. ౨౮౭

—

ప్రేమప్రశంస.

తే॥ రూపభేదంబు సహజ మిరువురకుఁ బ్రకృతి
యందుఁ; గాని విశుద్ధమై యలరు ప్రేమ
కైక్యసంస్థాన మాయమయందుఁ గలదు;
దాని నెఱుఁగుట బహుకష్టతరము; నిజము; ౨౮౮

ఆ॥ సృష్టియందుఁ బ్రేమ కీనయ్యె నగ్రసం
స్థాన; మట్టులగుట సకలసృష్టి

ననువుపడ జయించు మనుజుఁ డా ప్రేమ త
త్వంబునూఁది ; సంశయంబు లేదు. ౨౪౯

తే॥ ఎంతకాలంబు తగ నితరేతర మణు
కోటి కాకర్షశక్తి బాగుగ నెసంగు ?
నంతకాలంబుఁ దనరు నిరంకుశముగ
శ్రీమహితభూతి నింపారు ప్రేమయునికి. ౨౫౦

ఆ॥ శక్తి యెయ్య ? తదియ సర్వసంస్థంబగు
ప్రేమ ; శక్తియదియ ప్రేమ యెద్ది ?
యవిరళమగు ప్రేమయ మహాకర్షణ
శక్తి రూపమునఁ బ్రశస్తిఁ గాంచు. ౨౫౧

ఆ॥ సర్వసృష్టియందు సహజసిద్ధముగ నే
ధర్మ మణుచలన విదగ్ధగరిమ
నలరు ? నదియ యొప్పు నఖిలజీవులయందుఁ
బ్రేమరూపముఁనను బెంపువెలయ ; ౨౫౨

తే॥ ప్రేమసూత్రంబు లేదేని పృథులసృష్టి
యెన్నఁడున్ గల్గదని ప్రవచింపవచ్చు ;
నెందునేనియుఁ బ్రేమావిహీనజంతు
వొక్కఁడును లేద యనుటయు నిక్కమగుట. ౨౫౩

మ॥ కల దేవస్తువునందుఁ బ్రాణము ? సమగ్రస్ఫూర్తిమై సృష్టిలోఁ
గల దత్స్ఫూర్జితమైన ప్రేమ వెలయంగా దానియం దెప్డు గే
వల ; మా ప్రేమయ పెక్కురూపముల సర్వవ్యాపకంబై, సము
జ్జ్వలమై యొప్పి, జయించు లోకము నుదంచచ్ఛాంతి సంస్థానమై.

తే॥ ప్రేమవలనన సృష్టి వర్తించు ననుచు
మఱియు, మఱియు, వచింతు ; మిమ్మాట నిజము,

ప్రేమ విరహితవస్తువు పృథులసృష్టిఁ
గానరాదు, వినన్ రా, దొకండు నేని. ౨౫౫

తే॥ ఆదిసూత్రంబునై సృష్టియందు వెలయు
ప్రేమలేకయ యొకట వర్తింపఁగాదు
మానసమునకు భావనామయత ; నెల్ల
శక్తులకుఁ బ్రేమ యొక్కండ జన్మభూమి ; ౨౫౬

తే॥ సర్వసాధారణంబుగ సర్వులకును
గ్రాహ్యమగునట్టివస్తువు కాదు ప్రేమ
తత్వ ; మొకకోటిప్రజలలో దానినెఱుఁగు
వాఁ డొక్కండున్ గలఁడొ ? లేఁడొ ? చూడ నరిది. ౨౫౭

క॥ ఏ యిరువురు నరులన్ దృఢ
మై, యా ప్రేముడి సెలంగు ననుబంధంబై
యా యిరువుర సదృశులగుదు
రాయతగతి నీయుఁ గొనఁగ నన్యోఽన్యంబున్. ౨౫౮

క॥ కావున మున్ బ్రవచించిన
యా విప్రకృషీకవరేణ్యులం దెప్డు సమం
బై వెలయుఁ బ్రేమతత్వము
వావిరిఁ దులఁదూఁచినట్టి వస్తువు వోలెన్. ౨౫౯

ఆ॥ ఆ కృషీవలునకు నవ్విప్రుఁ డొసఁగుఁ బా
థేయ ముచితముగఁ బ్రతిదిన ; మాతఁ
డమ్మహీసురుని పొలమ్మునఁ బాటువ
డున్ దొలంగ కెప్పుడుఁ గడు దీక్ష. ౨౬౦

తే॥ ఇవ్విధంబున నొకకొన్నియేండ్లు సన, ను
దారదీక్షాఘనుఁడగు నతండు తాన

కృషియొనర్ప మనసు రేపఁ, గేలుమోడ్చు
తోడ నప్పరమపురోహితున్ మహాత్ము. ౨౬౧

వ॥ సమీపించి, నమస్కరించి, యతండు ప్రియంబుమై విన, విన
యంబు తెలం గుట్టిపడ నొక్కనాఁ డిట్లనియె. ౨౬౨

క॥ సకల జగద్వంద్యంబయి । న కృషియొనర్పంగ నా మనసు రేచెడి; నేఁ
టికి నది నీమేలునకయ । నక, యట్లయనుగ్రహింపు నయసారనిధీ!

ఆ॥ నాకునేన కృషి యొనర్చికొనన్ గొంత
పాల మొసంగి, కరుణఁ బ్రోదిసేయు;
మెప్డు మీకచెంది యింతకు బ్రదికితి;
మిప్డు నట్ల నడుపు మిద్ధచరిత! ౨౬౩

తే॥ నీ వొసంగినపాలము దున్నికొని, మంచి
పంట బండించిగొనుచు నాభార్యతోడ
భక్తిమెయిఁ దొంటియట్ల నీ పాదసేవ
యంద జీవింతు; మిదియ నా యభిమతంబు. ౨౬౪

ఆ॥ అరయనా శరీరమందలి ప్రతిరక్త
కణమునందు సాలగరిమఁ బొలచి,
నీయెడన్ గృతజ్ఞతాయుతసారభా
వప్రవాహ మెప్డుఁ బారుచుండు. ౨౬౫

క॥ నీ వలనన పెరిగినయది
కేవల మీ నాతనువు ప్రకృతిజాతము; మ
జ్జీవనము నెల్లభంగుల
నీ వేర్పడ నిల్పినదియ; నిజము; మహాత్మా! ౨౬౬

॥ అనఘచరిత్ర! నీకుఁదగ నామరణంబు కృతజ్ఞుఁడన్; జగ
ద్వినుతుఁ డవైన నీ పలుక వేదము మాకు; భటుండు వోలె నీ

పను పొనరింతు నెప్పుడును ; బాయుదు నీపదసేవయందు నా
మనసు; గురుండునాఁ, బరమమాన్యుఁడునా, భువి నీవ వేల్పునాఁ

క॥ అనవిని యప్పరమద్విజుఁ
డనఘుఁ డతని కిట్టులనియె నట్ల తలఁతు నే
నును నిన్నుఁగూర్చి ; మఱి నీ
యనుభయు సరి యయ్యె దాని ; కది మేలు సుమీ. ౨౬౮

## కృషిమహాత్మ్యప్రశంస.

క॥ మీ యభ్యుదయము యెప్పుడు
నా యరసెదు కార్య ; మీవు నా పను పెపుడున్
సేయుదువనుట యెఱుంగుదు ;
నీ యభిమత మిట్టులగుట నెగడుదు వింకన్. ౨౬౯

తే॥ ఏను వైదికకర్మనిష్ఠాపరతఁ బ్ర
వర్తనము సేతుఁ గృషిగౌరవంబు సెడక ;
యెఱుఁగు డొకకొంతకృషికళ ; నెల్లకళల
యందు దానిక పేరియనయ్యె మున్ను. ౨౭౦

తే॥ ఇప్పు డాకళయందుఁ బే రెన్ననైన
వారు పల్వురు లేరనవచ్చు ; నెవ్వ
రేనియున్ గొందఱుందు రెందేనిఁ ; గాని
ప్రజల కాకళయెడఁ దగు శ్రద్ధలేదు. ౨౭౧

వ॥ మఱియు నేమును గర్షకులమగుట నీ వెఱుంగుదు ; కృషిశళాభ్యా
సంబు మా వంశపారంపర్యధర్మంబు ; దానిన్ గూర్చి మాపూర్వు
లెన్నేని గ్రంథంబులు వ్రాసిపెట్టి ; రది దొక్క గ్రంథంబునందుఁ
బొందు పఱిచిన కొన్ని విషయంబులు సూచనార్థమ్ములుగ మున్నెఱిం

గించి, యనంతరంబ విస్తరించి కృషిప్రకారంబు వివరింతు, విను
మని యమ్మహాద్విజుం డిట్లనియె. ౧౭౨

ఆ॥ సకలవృత్తులందు సారస్వతంత్ర తా
యుక్తవృత్తి కృషి ; సముజ్జ్వలమగు
శ్రద్ధ మూలమా ప్రశస్తవృత్తికి ; సమ
యజ్ఞతయును దాని కవసరంబ. ౧౭౩

తే॥ స్వార్జితమ యేని, మఱియుఁ బిత్రార్జితంబ
యేని గోష్పదమాత్ర మెవ్వానికిఁ గల
దిమ్మగాక్షేత్ర ? మాతండ యెక్కువకగు
వాఁడు గౌరవమునఁ జక్రవర్తికన్న. ౧౭౪

చ॥ పొలమును సక్కఁ జేరుదువు పోవఁగ దున్ని, యనేకసస్యజా
తులఁ దగనాఁటి, వాని నతిదోహదమొప్పఁగఁ బెంపుఁజేసి, త
త్ఫలము సమస్తలోకుల కుదారత నీగుచుఁ, బేర్మిమై కృషీ
వలుఁడు భరించులోక మభివంద్యుఁడు తా నొక సృష్టికర్తయై.

తే॥ కూడు, గుడ్డయు మానవకోటికెల్లఁ
గూర్చుచున్, సుఖ మెన్నఁడుఁ గోరికొనక,
శాంతి జీవించు కాపు విశ్వంభరుండు ;
జన్మధన మాతనికి సారసత్వగుణము. ౧౭౫

తే॥ సకలచేతనకోట్ల స్వశక్తి కల్మి
నెట్లు భూమి భరించు ? ననేకభూత
కోట్టులన్ బేరుగల కృషికుండు రక్ష
సేయు నట్లు జగన్నుతశీలఘనుఁడు. ౧౭౭

ఆ॥ ఒక్కనిమిషమేనియున్ గృషికిన్ దప్పి
జగము నిజము బ్రదుకఁ జాల ; దేమి

సెప్పఁ గృషిమహత్త్వ? మెప్పుడు నది పని
యెవ్వనికి? నతండ యెన్న ఘనుఁడు. ౨౭౮

తే॥ ఎవ్వఁడు పరోపకారమం దిచ్ఛసేయు?
నతఁ డవశ్యముఁ దన యోపి నట్లు సేయ
వలయు నొక్కింతయేని సర్వజనవంద్య
మైన కృషి ; శాంతికిఁ బరమస్థాన మదియ. ౨౭౯

తే॥ బుద్ధిపూర్వంబుగానేని, బుద్ధి పూర్వ
కంబుగా కేనిఁ గావించుఁ గర్షకుండు
లోకసంసేవనము ; సర్వలోకులకు న
నేకవిధధాన్యములను బండించి, యోగి. ౨౮౦

తే॥ ప్రతిఫలం బించుకయును గోరకయ, పాత్ర
మెఱిఁగి, బహువిధధాన్యంబు లీగి, సోమ
యాజినేని జయించు ఫలాధికత్వ
సిద్ధి సుజ్ఞానియైన కృషీవలుండు. ౨౮౧

చ. ఒకచెయి మేడిమీఁద, మఱియొక్కకరం బది దానమందుఁ, బా
యక యిడి, ధాన్యరాశు లనయంబును గూర్చుచు నీగుచుండు క
ర్షకునకు సాటియెవ్వఁడు ధరాతలమందు? ఘనుం డతండ ; యో
పికయుఁ, బ్రజాహితోద్యమము పేర్మియు, నాతనిసొమ్ములెప్పుడున్,

చ॥ తనపొలమందు గేవల ముదారతఁ గీడ్పడ, కెంతయేనిఁ బెం
పొనరినపంటచేలఁగని యుబ్బు కృషీవలుకన్న నే ఘనుం
డనుభవశాలి హర్షవిషయంబున? సస్యరమా కృపాకటా-
క్ష నిరుపమాంశుతేజుఁ, డతిశాంతుఁడు గాప యనేకభంగులన్. ౨౮౩

చ॥ సకలపదార్థమండిత విశాలజగద్రచనాప్రవీణ యా
ప్రకృతి నలంకరించు బహుభంగుల నింపగుభంగి నెప్డుఁ గ

ర్షకుఁడు నిరంతరోజ్జ్వల లసద్బహుజాతివిశేషసస్యసృ
ష్టికలన సీశ్వరున్ బ్రతిఘటించెడువాఁడునుబోలె నేర్పుమై. ౨౮౪

క॥ హరి సృష్టికర్తవడువుఁ । బరిపక్వమనోజ్ఞ సస్యపంక్తిఁ దిరుగుచున్
బరిపాటి నూత్న సస్యో।త్కరసృష్టిక్రమమునరయుఁ గర్షకుఁడెపుడున్.

ఆ॥ వివిధనూత్న సస్య విసరంబు సృష్టించు
చుండు కాపుఁజూచి, యోర్వని యది
పోలెఁ బ్రకృతిదేవి సాలసిగ్గువడి "య
మ్మక్క యీతఁ డెట్టిమానిసి" యను. ౨౮౬

క॥ ఒకచోట శాలిసస్యము,
లొక ప్రక్కన్ జెఱుకుతోఁట లొప్పుమిగిలి, క
ర్షకహృదయాకర్షణతా
ప్రకటవిలాసంబు మెఱయుఁ బరగుఁ బొలములన్. ౨౮౭

తే॥ రాజు తన కిష్టమైవోల్చు రాజ్యమందు
పోలెఁ జెలికాండ్రు, బిడ్డలు, నాలు రా స
మధికహర్షంబుతోడ సాయాహ్న వేళఁ
బొలమునఁ విహరించుఁ గాపు దినదినము. ౨౮౮

తే॥ పెక్కుసాయల మిసమిసల్ బిక్కటిల్లు
పూవుగుత్తుల మిక్కిలిపొల్పెసంగు
నగిసె చేలు, ననఁటితోఁట లతిముదంబుఁ
గూర్చుఁ గర్షకునకు బహుగుణఘనములు. ౨౮౯

తే॥ ప్రకృతిసౌందర్యరేఖాపరంపరావ
లోకనము సేయుచుండుఁ దదేకదీక్షఁ
బూనినట్లు కుటీరమందేనిఁ, జెట్ల
నీడ యందేని యందందు నిలిచి, కాపు. ౨౯౦

సీ॥ ఒకచోటc బండి, నేలకు వ్రాలినట్టి యోజమెయింగన్పట్టెడిసస్యపంక్తి,
యొకనంకబీరువారకకాఱుకొని, యెన్నుచాలువారుమనోజ్ఞసస్యపంక్తి
యొకప్రక్క నించుకించుకవృద్ధిcగాంచిపసరుసాయమింపారుసస్యపంక్తి,
యొక్కయెడన్ నేలవ్రక్కలించికొని, పైయాకీనుచున్న క్రొమ్మొలకగుంపు,
లిందురమ్మ; సనకు మం! దనుభంగి, నోం
డొరులమించి, దర్శనోత్సుకుc డగు
కర్షకుని మనంబు కరము నాకర్షించు
సస్యలక్ష్మి సంతసమునc బొదల. ౭౯౧

ఉ॥ ఇచ్చట నేటికిన్ దడయ? నేcగు! పొలంబున కంచు బిట్టు వా
క్రుచ్చెడు భంగిc గోడి వడిc గూయcగ మేల్కను కాపు నిచ్చలున్
మచ్చికనేయు మిత్రుc బలె మార్గమునూపి రహింపc జేయుc బెం
పచ్చుపడంగ నాలుగవ యామము సందున వేcగుc జుక్కయున్.

చ॥ పొలమున సంతతంబుc బొలివోవనిదీక్షమెయిన్ స్వకర్మల
గ్నలసితమానసుండయినకాపుc బ్రహృష్టునిసేయు నుల్లస
త్కలరవమండితప్రకృతి గాయకవర్గములైనపుల్గు లి
మ్ములc దమపిల్లమొత్తముల ముక్కులనుక్కులుసేర్చి, యెంతయున్.

తే॥ స్వీయసంతానమం దతిశ్రేష్ఠతముcడు
కర్షకుం డొక్కcడయని తగంగc బ్రకృతి
మాత తలపోయు; నది సరి; యాతcడ కద
క్రొత్తసాం పాయమకు నోడc గూర్చువాcడు. ౭౯౨

సీ॥ జీవనార్థముc బరసేవాదికర్మముల్ జేసి నిర్వేదంబు జెందువాcడుc
దన్నొరుల్ రోయసంతత్తమనారోగ్యదశాస్ఫూర్తిధైర్యంబునడలువాడు
మావసీయక్షీరపానసంతృప్తిశరీరపుష్టిరహింపc గోరువాcడుc,
బండ్లనుగూరలు, బచ్చగడ్డియు, ధాన్యములుసాలుకొలదిగవలయువాడు

నించుకంతయేని, యెక్కువేనియుఁ గృషి
సేయవలయు, నిచ్చఁ జేసియేనికి
సేయకేనిఁ, బెంపుసెలఁగి, విలాసార్థ
మేనిఁ, బేరుఁగోరియేనిఁ, దివిరి. ౨౯౫

ఆ॥ గీ॥ మేను చెమటఁ దడియ మిక్కిలిదీక్షపైఁ
గాపునేయుఁ గృషి జగద్ధితార్థి
యగు మహర్షి నిష్ఠ యలవడఁ బరమత
పం బొనర్చుభంగి భవ్యతముఁడు. ౨౯౬

ఆ॥ గీ॥ ఒరుల కించుకంతయును గీడుబొరయ దె
వ్వాఁడు సేయుపనులవలన నట్టి
కృషికు "ధర్మమూర్తి కేవల మితఁ" డని
వల్క నెదిరివల్కు వాఁడు గలఁడె? ౨౯౭

తే॥ ఎవ్వని పరిశ్రమంబున నెల్లవారి
కన్నవస్త్రాదులు లభించు? నా కృషికున
కర్థసంవేదియగునాతఁ డగ్రపీఠ
మెవ్వఁ డీక కృతఘ్నుఁడౌ నిద్ధరిత్రి? ౨౯౮

తే॥ నిష్కళంక ప్రవర్తన నిష్ఠఁ దవులు
నే నరుం? డాతఁ డొక్కింతయేనిఁ బొలముఁ
గైకొని, యొనర్చునది కృషిన్ గాఢదీక్ష;
నేఁటి కీపని నాకను సెప్పులేక. ౨౯౯

క॥ వినుమింతదనుక నా చె
ప్పినయది కర్షకవరేణ్యు పెంపునకుఁ దగన్
వినుతించు తెలుఁగు మాత్రమ
యనుకొను; మాతండు సాలు నంతకు నెట్లున్. 300

క॥ సకలమనుజకోటి సతి
ప్రకట నిజపరిశ్రమప్రభావంబునఁ గూ
టికి, గుడ్డకు, లోపము రా
ని కరణి రక్షించు నాతనికి లేరు సముల్. ౩౦౧

క॥ కావున మాన్యుండైన కృ
షీవలుని నీ గూర్చి యెంతసెప్పిన నిది సా,
లీ వెరవ యింత కగు, నని
యేవాఁడును బలుక సాహసింపం డెట్లున్. ౩౦౨

వ॥ అది యట్టులుండ ని; మ్మట్లు కర్షకశ్రేష్ఠ స్తుతిరూపమాత్రంబుగాఁ జెప్పవడిన యప్పరమవిషయంబున కనుబంధంబైన కృషిప్రకారంబు బిదప విస్తరించి సెప్పెదు; నా బాల్యంబున మత్పితామహుండు తా రచించిన "భూదేవిగీత" లను నొక చిన్నగ్రంథంబు నా కనుగ్రహించి బోధించె; నది యిప్పుడు నీకు బోధించు టత్యావశ్యకంబు; కావున నతిశ్రద్ధమై వినుమని యవ్విప్రపుంగవుం డిట్లనియెఁ:

తే॥ తొల్లి సామాన్యమానవదుర్గమమగు
హిమగిరి కుటుంబమున సాల నెన్నసైన
యొకమహాపర్వతాగ్రమం దున్నత స్థ
లమున భూదేవి యుచితరూపము దగంగ. ౩౦౪

భూ దే వీ గీ త లు.

తే॥ ఒక్కనాఁ డెద్దియేనియు నొంటిఁ గూరు
చుండి, తలపోయుచుండ, నత్యుత్సుకత యె
సంగ నార్షదుఁ డనుముని సక్క నచటి
కేగి, పాదనూప, నాయమ మొలమిమీాఱ ౩౦౫

వ॥ అమ్మహర్షి నతిగౌరవమ్మున పలికి, సేమంబడిగి, తనచేరువఁగూ
ర్చుండఁబెట్టికొని, యేలవచ్చి? తేమివార్త? లని యడఁగుటయు
నతం డిట్లనియె.                                                                                    ౩౦౬

తే॥ లోకకల్యాణకాంక్ష ననేకలోక
ములఁ జరింతునెపుడుఁ బెక్కుమూర్తులన్ ధ
రింపఁ జాలి; యుచితమైన రీతి నెల్ల
వార్త లరయుదు; నవి నాకు వలసియుండు;                                                 ౩౦౭

క॥ నీయందపుట్టి, పెంపున
కై, యుత్తమశక్తి నీవ యలవడ జేయం
గా యోగసిద్ధిఁ గాంచితి
మో యవ్వ! యేము తాపసోత్తములము నాన్.                                              ౩౦౮

తే॥ దేవి నన్నివెఱుంగుదు; నీవకాదె
మాకు, మా కననేల నీ లోకమునకు,
నెల్లవిధములఁ దల్లివి; యీశ్వరివి; స
మస్తసాధన దాత్రివి, మాన్యవు మఱి.                                                      ౩౦౯

తే॥ సర్వతంత్ర స్వతంత్రతాశక్తి మాకు
నీ వలనగాదె యలవడె? నీకుఁ దప్పి
యెవ్వ రెందునకున్ గామి యే మెఱుఁగుదు;
మెల్లలోకంబులకు నీవ యింత కగుదు.                                                      ౩౧౦

తే॥ ప్రకృతికిన్ గూర్చుబిడ్డ; వప్పరమమాత
మించి, పోఁ జాలువారలఁ గాంచనోవు;
దెంతకని నీ మహిమ గణియింపవచ్చు?
నమ్మ! నిన్నిట్లు సూడంగనయ్యె నిచట.                                                    ౩౧౧

గీ॥ సకలలోకప్రచారప్రశస్తశక్తి
బీజములు నీ కడుపునంద పెంపువెలసి

యున్నయవి ; నీవు బ్రహ్మము నొక్కఁడ యను
చొప్పు గానంగనగుచున్న దొప్పు మెఱసి. ౩౧౨

క॥ నీ పరమాణువుఁ దఱితో
నోపున్ బ్రహ్మాండమై సముజ్జ్వలశక్తిన్
దీపింప ; మఱియు నెందున్
రూపింపక బ్రహ్మమం దిరువుగ నెలకొనన్. ౩౧౩

తే॥ ఎల్లలోకంబులందు నీ మెఱుక సెడదు
మాకు నీ యందవుట్టి, నీ మహిమ నలరు
కారణంబునఁ ; దల్లి ! యేకతమ యిచట
నేల నిమ్మెయి రూపించె ? దేమి తలఁతు ? ౩౧౪

క॥ నాకు వినిపింపు మేర్పడ ;
నా కెఱిఁగింపంగరాదనన్ గాదుకదా
నీ కార్యం ? బదియేమన
నీకుఁ గొడుక ; నట్లుగాన నిన్నిట్లంటిన్. ౩౧౫

వ॥ అనుటయు నమ్మహర్షి నుద్దేశించి, యద్దేవి ప్రియంబుమై యిట్ల
నియె. ౩౧౬

క॥ నీ కెఱిఁగింపగ రానిది
నా కొక్కటి కలదె ? నా మనము నీ యెడ న
స్తోకప్రియపూరం బని
నీ కెప్పుడు నెఱుఁగనగుట నిక్కము కాదే ? ౩౧౭

క॥ ఏ నిప్పు డొక్కఁడు దలఁచి
యీ నగమున యిట్లు బొలచి ; తీవును దఱికిన్
గానన్ వచ్చితి ; విది మే
లైన తెఱఁగ నా విచారమం దరయంగన్. ౩౧౮

క॥ నీ కెఱిఁగింపక తక్కు_నె
నా కార్యము ? నీవు నా మనమున కగుదు గా
దే కార్యవిచారంబున
లోకశ్రేయోఽర్థివై పలుగతుల నెపుడున్ ? ౩౧౯

వ॥ కావున సమయోచితంబుగ నాకర్ణింపుము. ౩౨౦

క॥ నా కడుపునఁ బిచ్చిడువా
రై, కానిపనులకుఁ దొడఁగి రనఘా యిప్డీ
లోకులు నీ తమ్ములు ; చీ
కాకునకై రాపనులఁ దగవు సెడి, మఱియున్. ౩౨౧

వ॥ రాజులనువారు దురహంకారమమకారంబులన్ దవిలి, దురాశా పిశాచావేశసమ్మూఢచేతస్కులై, యొండొరుల నణంపను, ద్రుంపను దొడరి, లోకక్షయకర యుద్ధవ్యసంబులఁ బ్రజల యర్థప్రాణంబులకును, దమ యర్థప్రాణంబులకును హానిపుట్టఁ బ్రవర్తింపుచున్న వారు ; రాజావలంబనమునకుఁ దక్కి_యుఁ, దమ యలసత్వంబునను, గర్షకులు కృషియం దశ్రద్ధ వహించుచున్నవారు ; దానిన్ గూటికిని, గుడ్డకును నోచికొన కెల్లవారును తల్లడిల్లుచున్నవా ; రిట్లు మానుషోజ్జీవనంబునకు హానివుట్టె. నది నాకు దున్సహంబై, యొండుఁ దలంపనేర, కి క్కొ_ండకొనఁజేరి, యోఁటి నరయు దాన నైతి ; నీవును సమయంబునకు వచ్చితివి ; కావున వినుమని యమ్మహాదేవి మఱియు నాతనితో నిట్లనియె. ౩౨౨

క॥ నన్ను నేన సెప్పికొనరా
దు ; నీవు తగ నంత యెఱుఁగుదువు ; నన్నున్ మే
లని మెచ్చు నింతకున్ మ
న్ననమెయి మత్సోదరీగణము బహు గతులన్ ౩౨౩

క॥ ఇప్పుడు దప్పెన్ నా కా
మెప్పునకగుచొప్పు ; మఱియు మిడుకన సావన్
దప్పద యను తెంపున కై ;
తెప్పా డెచట నేమి పుట్టు నెప్పం డెఱుఁగున్ ? ౩౨౮

వ॥ మా తల్లియగు ప్రకృతిదేవి యనంతకోటిబ్రహ్మాండములన్ గాంచి, వాని కన్నింటికిఁ బరస్పరాధారసూత్రంబులన్ గల్పించి, యంతకుఁ దానయ్యె, యొక్కొక్క బ్రహ్మాండంబునం దసంఖ్యాకలోకంబుల విభజించి, హెచ్చుఁ దక్కువలుగా వానివాని కనువగునట్లు కొన్ని మేర లేర్పఱచె ; ని ట్లేర్పరుపఁబడిన తత్సీమాసహస్రంబులలో నే నొక్క సీమకున్ జెందితి ; మా సీమ యందు స్వర్లోకమహర్లోక జనలోక తపోలోక సత్యలోకదేవులను యేవురును, నతలవితలసుతల రసాతల తలాతల పాతాళదేవులను యేడ్వురును, భూలోకదేవియను నేనును భువర్లోకదేవియను నొక్కతెయు మొత్తమ్మునఁ బదు నలువురము మామాస్థానంబులఁ బరిభ్రమించుచుందుము, మావదు నలువురలో భువర్లోక స్వర్లోక మహర్లోక జనలోక తపోలోక సత్యలోక దేవులారువ్వురు నాకక్కలు, వీర యూర్ధ్వలోకదేవులు నాఁబడు వారు, వెండియు నతల వితలాదిలోకసప్తకదేవులు నాచెల్లెం ; డ్రీ యేడ్వురు చెల్లెండ్రు నధోలోకదేవులు నాఁ బడుదురు మఱియును ;

క॥ నా యక్క లార్వురును దమ
కేమెడ నా సంతతియు యనేకవిధములన్
బాయని గతి యని యెప్పుడు
నాయందతిగౌరవంబున మెలఁగువారల్. ౩౨౯

క॥ విను నా యేడ్వురు సెల్లెం
డ్రును నన్నుఁ దమకు నెక్కుడుగ నూతురు ; నా

తనయులు, మఱి వారల నం
దనులును దలపోయ నొక విధము వార సుమీ! 3౨౭

క॥ నీ పినతల్లులె వా; రీ
వోపిక వారిఁ గనఁ బోవు మంటు కలదు కా
దే పలుమా ర్లింతకు? నీ
వోపుదుకద వారిచంద మూహించికొనన్? 3౨౮

క॥ మా యక్కలార్వురును, మఱి
నీ యెఱిఁగినవార; వారినిన్ గూరిచి యే
లాయెక్కువ సెప్పికొన? మ
హాయోగివి; యెఱుఁగనేర్తు వంతయు వత్సా! 3౨౯

క॥ నను నేన సెప్పికొనవల
సె నీ వడిగి తిట్లు గాన; సెప్పెదు విను! మ
జ్జననికి నాసంతానం
బనూనగౌరవమునకుఁ, బ్రియంబునకు నగున్. 330

వ॥ నా సంతానంబన మానవకోటి యనియ సర్వసామాన్యంబుగ నర్థం
బగు; నదియసరి; యైనను మానవేతరంబులగు ననంతకోటి జీవ
రాశులును నాయంద మానవునట్ల యుద్భవింపుచుఁ బరిణామంబు
గాంచుచుండున్; గావున నవియు నాసంతానంబ యనకతప్ప;
దిట్లవియుఁగూడ నా సంతానంబు నాల్గుజాతులుగ విభజింపనయ్యె;
లోహజాతులన్నియుఁ నా ప్రథమసంతానం; బవియ నా శరీరంబు
కూర్పునకైన పరమాణురాశులనినను దప్పుగా; దాలోహంబుల
నుండి, యవియ తమ కాధారంబులుగ నానావిధ తృణగుల్మలతా
వృక్ష జాతులు పుట్టి వెలయుచుండు; నవి నా ద్వితీయ సంతా
నంబు; వానిని నా రోమకోటిగా నెఱుంగుము; వానినుండియు,
లోహాదులనుండియు, జలంబునుండియుఁ బుట్టిన క్రిమికీటకపశు

పశ్వాది నానాప్రాణికోటులు నా తృతీయసంతానం; బవి నా సర్వాంగనాడీసహస్రంబులు నాఁ బడు; మఱియు నవి నా ప్రథమ ద్వితీయసంతానంబు లాధారంబుగ వానిని, వెండియుఁ దమలో ననువుపడిన చిన్న ప్రాణులను దినుచు వర్తింపుచుండు; నా తృతీయ సంతానంబునందలి తుదివాని నుండియ సర్వలోకమాన్యమహితబుద్ధి విశిష్టంబగు మానవజాతి యుదయించె; నదియ నాహృదయంబును, చతుర్థసంతానంబును నాఁ బడు; వెండియు నది తన జీవయాత్ర కెల్లభంగుల నా ద్వితీయసంతానం బాధారంబుగ వర్తింపుచుండు; నీవున్న దానికిఁజెందిన మహావ్యక్తివ; యింకను— ౩౩౧

క॥ నానాల్పవసంతానము
మానుగ నా మనము యగుట మహితాపార
జ్ఞాన విశిష్టంబై; యది
మానవకోటి యన నయ్యె మానివరేణ్యా. ౩౩౨

ఆ॥గీ॥ కర్మభూమినా సకలసాధనసమగ్ర
భూతి నొప్పు న న్నెపుడును దవిలి,
యుజ్వలాత్మనిష్ఠ నుజ్జీవనముసేయు
వాఁడు మనుజుఁ; డిదియ వానికి విధి. ౩౩౩

తే॥ వాఁడు నాయందు నున్నతి వడయ వలయు;
వానివలనన యేనును వానికెక్క-
వలసి యుండు; నా కారయ వాఁడ హృదయ;
మెప్డు వానికి నాధార మేన నిజము. ౩౩౪

తే॥ ఎన్నియేనియు యుగములు సన్నగాక
మానుషంబు లభింపదు మచ్ఛరీర
మందలి యణువునకు; దాని యంద కలదు
సూవె మానుషమునకగు సూక్ష్మశక్తి. ౩౩౫

క॥ మానుషపరమోజ్జీవన । నానావిధసారసాధనంబులకెల్లన్
స్థానంబు నేన ; యది కను । మానితసంసిద్ధి పెంపమర నాఁనుందున్.

ఆ. పెక్కు లోకములను బెక్కు విధంబుల
సారలీలఁ గ్రాలు శక్తి మాను
షంబు నంద గలదు ; సంసిద్ధికిని నది
సాలు, మఱియు నాత్మసంయమమున. ౩౩౭

తే॥ మానుషం బొండసాలదు ; మఱియు నది య
నేకపరిణామదశల ననేకసిద్ధు
లొందనై యుండు ; నా యంద యొప్పుఁ వానిఁ
బడయు చందంబు దానికిఁ బరమనిష్ఠ ; ౩౩౮

వ॥ మానుషప్రయోజనంబున్ గూర్చి యెంతయేనియు సెప్పవలసి యుండు ; నైన నిప్పటి కది యింతమాత్రన సాలించి, ప్రస్తుతాంశంబునకు నత్తమని చెప్పి, యమ్మహాదేవి యమ్మహర్షితో నిట్లనియె. ౩౩౯

తే॥ నాకు, నాతల్లికిని, సర్వలోకదేవు
లకును బరమప్రియంబై, యలఘు మహిమ నె
సంగు మానవకోటికుశలమ నాదు
కుశల ; మది గూల, నేనును గూలనగుదు. ౩౪౦

తే॥ ఇపుడు మానవకోటియం దెన్నరాని
దుర్దశలు పుట్టుచున్నవి దుఃఖదురిత
వర్ధనంబులు ; కడువంత వానివలన
దాని కగుచున్న ; దది పెంపుఁ దఱిగె నిజము. ౩౪౧

వ॥ రాజుల దౌర్జన్యంబును, ప్రజల యశక్తతయుఁ, గర్షకుల యలసత్వంబును నా దుర్దశలకు మూలంబు లని మున్న సెప్పితి ; మఱియున్ జెప్పవలయునది సాలదనుక గలదు, వినుము. ౩౪౨

తే॥ సకల జీవుల జీవయాత్రకు వలయు న
నేక భంగుల నాహార; మింత నిక్క;
మంతమాత్రన సాల; దాహారవస్త్ర
ములు మనుష్యుని కెప్పుడు వలసి యుండు. ౩౪౩

క॥ తినుటయుఁ, గట్టుట, యను నీ
పనులపిదప మఱియు నెల్లపనులు వలయు నె
ప్డును వానికి; నా రెంటికి
విన్న మెవ్వఁడు కాఁడు, వాఁడు వెంగలి యెట్లున్. ౩౪౪

తే॥ కూడు, గుడ్డయు మానవకోటి కెప్డు
నేను మాటికి నీ నున్నదాన; నన్నుఁ
జెండియేనియు నర్థి నా రెండు వాఁడు
పడయువాఁ; డది నాకును పరమహితము. ౩౪౫

క॥ జనని నగు నాయెడల నా
చనవునకున్ గాఁడె వాఁడు? సర్వవిధములన్
నను వాఁడ కాఁడె యలరిం
పను బెంపను సాలువాఁడు భవ్యచరితుఁడై. ౩౪౬.

తే॥ సర్వరసములు నాయందు సంభవించుఁ
గాన "రస" యండ్రు నన్ను విజ్ఞానధనులు;
సకలధనములు నాయంద నక్క గూర్ప
నగుట "వసుమతి" యనుపేర నలరనైతి. ౩౪౭

తే॥ నాకడుపునంద యెల్లరత్నములు నుంట
"రత్నగర్భ" యనెడుపేర రహివహింతు;
సర్వమ్ము భరింతుఁగాన విశ్వంభరాఖ్యఁ
గ్రాలు; ది ట్లింకఁ బేరులు గలవు సాల. ౩౪౮

క॥ ఇవి యవి యననేమింటి? కే
యవి నరునకు వలయు నిత్తు నవి యన్నియుఁ గూ
ర్మి వెలయ వానికి ; నెప్పుడు
నవి గొనుయత్నమున నుండునది వాఁ డెలమిన్. ౩౪౯

క॥ సకల మొనగూర్చు నన్నొ
ల్లక రిత్తన్ బ్రదుకఁగాఁ దలంపనగునె వా
నికి? నా తలంపు పాపము
నకు మూలముకాదె? యేమనక జను వానిన్? ౩౫౦

క॥ నా రెండవసంతతి నా
హారాచ్ఛాదనగృహశాలమధాదుల కగున
ట్లేరుపఱచి, వాని కెప్పుడుఁ
గూరుతుఁ గాదే? యెఱుంగఁగూడదె నన్నున్? ౩౫౧

ఆ॥ నన్నుమాని యాత్మనాశనవర్తనం
బునకుఁ బాలువడు విపులకుటిలమ
నస్కు నింకనేమనన్ గల? దేను వాఁ
డట్లుసెడుట కెంతయైన వగతు. ౩౫౨

తే॥ సకలలోకప్రశస్తమై సాలఁ గ్రాలు
నాదుసంతానమునకుఁ బెంపేది యిప్పు?
డిట్టి దుర్దశయగుటకు నెంతయేని
వగతుఁ ; గన్నకడుపుదాన నగుటఁజేసి. ౩౫౩

వ॥ రాజుల దుర్వ్యసన మమకారాహంకారంబులవలనఁ బల్వురు ప్రజ
లర్థంబులు గోలువడుటయకాక యకాలమరణంబునకుఁ బాలగు
టయు, రాజానలంబునకుఁ దక్కియు, దుర్భరకరాతికరభారంబులఁ
గ్రుంగియుఁ, గర్షకులు కృషికర్మంబునందు మందులగు కతంబున

నన్నవస్త్రంబులకు నోచికొనక యనేకులు సుడియుటయు, నాకు నోర్వరానివై యున్నయవి ; నా సంతానం బిట్లరిష్టంబున కగుటఁ గూర్చి నేనకాదు నా భగినీగణంబును దల్లియును గుందుచున్నవారల ; యింతకును నా పరమసంతానంబగు మానవకోటి మాధ్యంబకారణం ; బది యెట్లనిన. ౩౫౪

తే॥ యెల్లవారికిఁ దల్లినయేను ; నన్ను
నందఱున్ జెండి, తినఁ, గట్టనైనవార ;
యిట్టు లీ ధర్మముండ, ననేకు లన్య
వృత్తులకు సొచ్చు టేలకో యెఱుఁగవడదు ? ౩౫౫

ఆ॥ కృషిన యాశ్రయించి యెల్లవృత్తులును జీ
వించుఁ ; దమకుఁ దామ యెసఁగువడువు
వాని కెందులేదు ; గాన స్వతంత్రంబు
లనుట కెప్డుఁగావ యవినిజముగ. ౩౫౬

వ॥ వెండియు.

ఆ॥ కృషి యొకండ దక్క యెల్లవృత్తులయందు
వంచనకును గలదు వడువు సాల ;
యేల నిట్టి కానివృత్తులఁ బొల్వడ
నాకుమారకులకు నన్నుమాని ? ౩౫౭

తే॥ నన్నుఁ జెండుట యన, మఱి నాకుఁ బ్రియము
సేఁతయన వేఱుకావు ; కృషి యను నర్థ
మంద యారెండు వర్తించు ; నత్తెఱంగు
నెల్లవారును గైకొను టెంత లెస్స ? ౩౫౮

తే॥ కర్షకులె కొందఱ యగుటఁ గట్ట దినఁగ
సాలుకొలఁది లభింపమి నగము నచ్చు

వారయిరి లోకు ; లది యేఁటి వర్తనంబు ?
వారి చరదంబునకు నెంతవగతు నిట్లు ? ౩౫౯

క॥ మానవు నుజ్జీవనమున
కేనగుచందంబు దెలిపి తింతకు ; నెట్లన్
దానికిఁ గృషి మూలం ; బది
నానావిధ శాంతిసుఖఘనపదముఁ గూర్చున్. ౩౬౦

తే॥ అరయ నెవ్వనివృత్తి నాయంద సెల్లు
చుండుఁ ? గొడుకన వాఁడ యొక్కండ నాకు ;
కారు వినుము తదన్యులు ; వారు నన్నుఁ
జెండి, తినఁ, గట్ట, నేరని నందు లరయ ; ౩౬౧

తే॥ అందఱుఁ గృషీవలులయైన నరయఁ జోటు
కలదె నీయం దనుట పాడిగాదు ; కన్న
కొన్నునకు వెట్టఁజాలని కానికడుపు
దాన నేఁ గాను ; సాలు దెందఱకునైన ; ౩౬౨

తే॥ ఆశ్రమములనుపేర మహర్షివరులు
కృషిస నేఁతురు, నాఁగలి కెద్దులజత
గట్ట, కంతకుఁ దారయై ; కష్టములకుఁ
గాక శాంతిసుఖస్ఫూర్తిఁ గంద్రు దాన ; ౩౬౩

క॥ వెలయంగ ఋషికులము వా
రల సూచియునేనిఁ గృషిపరాయణతా ని
ర్మల సారవృత్తిఁ బూనన్
వలదే ? యుజ్జీవనంబు వారికి సనదే ? ౩౬౪

క॥ పలువస్తువులన్ దినుటకుఁ,
బలుగుడ్డలు గట్టుటకును భ్రాంతిన్ బడువా
రల కేనియుఁ జోటీయన్
గలదు సుమీ కృషి యనేకగతుల నెసఁగుచున్ ; ౩౬౫

ఆ॥ గీ॥ అట్టులయ్యుఁ, గూడ దత్తైజంగు ; మితంబ
వలయు నరుని కెల్ల వర్తనముల ;
నమిత మెట్టులేని హానికరంబ ప్ర
శస్తమైన శాంతిసౌఖ్యమునకు ; ౩౬౬

క॥ ఆరయ యుక్తాహారవి। హారంబులు రెండు నిర్మలాచారఘన
శ్రీరమ్యమానుషంబున। సారతరంబు; లవికూర్పఁజాలున్ శాంతిన్;

వ॥ మఱియును.

క॥ ఆ రెంటి నలవఱచికొని,
యే రీతులుఁ గానక, కృషిక యెవ్వరగుదు ? రో
ప్పారంగ నీశ్వరాజ్ఞకు
వారల యగువార లెల్లవారలలోనన్ ; ౩౬౭

క॥ సకలావయంబులకు, బు
ద్ధికిఁ, బనిపెట్టుఁ గృషి ; నెమ్మదియు, నారోగ్యం,
బకుటిలభావముఁ, గృషియం
ద కడుఁ బ్రకాశించుఁ ; బెంపొదవు మఱి కృషిమిషచేన్. ౩౬౮

తే॥ మానవులకెల్లఁ బరమకర్మంబు కృషియ ;
యీశ్వరాజ్ఞయు నదియ యం డ్రిద్ధమతులు ;
దాని నొల్లమిఁగాదె సంతాపమునకు
నయ్యె మానవకోటి యి ష్టాత్మఁ గలిఁగి ? ౩౭౦

తే॥ పండ్లు, నాకులుఁ, దినియేని బ్రదుకవచ్చు
మానవుం డంద్రుకొంద్ర ; రమ్మాట నిజమ ;
కాని యవి తోఁటపనిలేక కల్గవు ; మఱి
యదియుఁ గృషికర్మముల నొక్కఁడంద్రు కాదె ? ౩౭౧

వ. కావున.

చ॥ సకల జగద్ధితార్థ మనిశంబు జరించెడి నీవు మర్త్యకో
టికి హితమైనభంగిఁ బ్రకటింపుము నా పలుకూఁది ; వెండి దా
నికి ననువైనపల్కు లోకనేర్పునఁ గూర్పు, కృషిప్రకార మిం
తకు మును నీ వెఱింగిన విధంబున, నొండన కాదరంబునన్ ; ౩౭౨

క॥ నీ సోదరు లిష్టిమ్మెయిఁ
గాసిలుచుండుటకు మనసు కందెడినిఁగదా
ధీసారఘనుఁ డవగు నీ ?
కీ సనునది లేదుకాదె యెవ్వరియందున్ ? ౩౭౩

చ॥ అనుటయు నమ్మహర్షి వినయంబున నిట్లను నమ్మ ! యిష్ట నీ
పను పొనరింపఁబోదు, నొకభంగి మరల్తు జగంబు నీవు పే
ర్కొనిన తెఱంగుసేఁత ; కది కూడదు నాఁ జన ; దెల్లవారి క
ప్పని సుఖమూలమై, పరమభాగ్యసుఖాస్పదమై, యెసంగెడిన్. ౩౭౪

క॥ అన విని యట్లేనియు నేఁ
జనియెద నెమ్మదికి నై, విషాదము దిగఁద్రా
వి, నిరుపమానందంబున
నని, యెచటికినేని సనియె నద్దేవి తగన్ ; ౩౭౫

క॥ అప్పరమర్షియుఁ బిమ్మట
నప్పని వాటించువాఁడయై తిరిగెన్ సే
ర్పొప్పఁగఁ గృషి బోధింపుచు
నప్పుడు జగమెల్ల, నెల్ల రానందింపన్ ; ౩౭౬

క॥ ఇది మత్పితామహుఁడు నా
సదువుసమయమందు బోధ సలిపినచందం ;
బిదియుఁ గృషిప్రాశస్త్యము
మృదురీతుల నుగ్గడించి, మేకొనఁ జేయున్ ; ౩౭౭

క॥ ఇంతకుఁ గృషికీర్తన మొ
క్కింత విపులసరణిఁజేసి ; తీవును విననై ;
తింతియ యనఁగూడదు ; విని
పింతు మఱియు వినుము నేర్పు పెంపెసలారన్. ౩౭౮

ఆ॥గీ॥ కృషి కనేకగతులఁ గీర్తింతు రార్యులు
మనుజకోటి కది సమస్తమునకు
నగుట ; మఱియు దానియందుఁ బ్రవర్తించు
వాఁడు శాంతివైభవంబు గనుట. ౩౭౯

ఉ॥ ఒల్లరు కష్టసాధ్యమనియున్, దగుమాత్రము మేలకాక లే
దెల్లరుఁ గోరినట్ల ఫలమెంతయు నెప్పుడు దానియందు నం,
చుల్లము లన్యవృత్తులకు నొక్కట వోఁ, గృషిఁ గొంద ; అట్టివా
రొల్లిన, నొల్లకున్న, నది యున్నది లోకముఁ బ్రోవఁ జాలుచున్.

కృషికి నుత్సాహాదు లావశ్యకములని మిత్రశర్మ చెప్పుట.

ఆ॥ కష్టసాధ్యమని తెగన్ బల్కవచ్చునే
కృషి నెఱింగి యెఱిఁగి, కేవలంబు ?
కష్టమునకుఁ గాక కడుపారఁ దినఁ గట్ట
వచ్చునెట్లు జగతివారికెల్ల ? ౩౮౧

క॥ సోమరులపల్కు పల్కే ?
యేమింటికది ? వంచనయు వహించి తిరుగువా
రేమన్న నేమి ? కృషియొక
దా మహిఁ దినఁ గట్టవెట్టుఁ దగ నెల్లరకున్ ? ౩౮౨

క॥ వాదమునేకుఁ గృషి యెన్నఁడుఁ
గా ; దది పరమర్షులకు, జగద్ధితులై పెం

పూఁదినఘనులకు, మాన్యం
బై, దివి, భువి వినుతిఁ గొన్న యది నిజమహిమన్ ; ౩౮౩

తే॥ సహనశక్తియు, సంతతోత్సాహపటిమ,
సారసమయజ్ఞతయు, ధృతిసంపదయును,
నంగకంబులు కృషి ; కివి యన్నియును ద
గంగ నది వొల్చు సత్ఫలగౌరవమున ; ౩౮౪

తే॥ గోధనంబును, మఱి కార్మికుండు, రాజు,
సార మీఁజాలు లోహవృక్షప్రతతియు,
మేఘుఁడును దత్సహాయు ; లమితఫలం బొ
సంగు నివియెల్లఁ గూడి, యొసంగిన నది ; ౩౮౫

తే॥ గాఢసంబంధము గలదు కర్షకునకు
రాజునకు నెల్లవిధముల ; రాజ్యమనఁగ
నేడ కృషికుండ లేఁడేని ? యెక్కుడి కృషి
రాజు తోడ్పడ నెపుడు నారయఁడ యేని ? ౩౮౬

వ॥ సముచితభాగధేయంబు లొసంగియు, రాజ్యంబునందలి ప్రజల యన్నవస్త్రంబులకు లోపంబుపుట్టకుండఁ బాటునడియుఁ, గర్షకుండు రాజునకుఁ దోడ్పడుచుండుఁ ; గృషి కనువగు జలాశయంబు లేర్పఱచియుఁ, గృషిపరికర సంపాదన కార్మిక భరణాదివ్యయంబులందు, నవశ్యయవసరంబుల కగునంతధనంబు కర్షకుని కిప్పించి, వడ్డికిఁ దప్పించి, యతండు కందకుండ మరల నాధనంబు గొనియు, నతని పొలంబునందలి పంటలకుఁ దగుభంగిఁ గరంబులు గొనియు, రాజు కృషికిన్ సాహాయ్యంబు సేయుచుండు ; నివ్విధంబున హాలికభూపాలకుల సంబంధంబు గాఢతరంబై సెల్లుచుండు, ౩౮౭

తే॥ రాజున కుచితభంగిఁ గరంబు లీక,
తప్పఁ దిరుగఁ దలంచు నతండు కాఁడు

కర్షకుం; డట్లు తిరిగెడు కతన వాని
కృషియు మంచిఫలము నీక, కీడ సేయు. ౩౮౭

తే॥ కృషికి నివ్విధమున సాల కీడువుట్టఁ,
దాఁ జెడుటకాక, ప్రజలనందఱను జెఱచు
వాఁడగుఁ గృషీవలుఁడు; వాని వలనరాజ్య
మునకు హానియగుఁ; గష్టములును వచ్చు. ౩౮౯

చ॥ ఉఱుకఁ గరంబులన్ గొనుట యొండ కడున్ దనకెప్డుఁ గార్యమై
మొఱకుఁ దనంబు, దుర్వ్యసనముల్ దనుముంచి, కలంచి, యొంపఁగా
గరువము దక్కి, హాలికు సుఖంబున కెన్నఁడుఁగాని రాజు, దు
శ్చరితుని యెంత తిట్టినను సాలదు; రాజననౌనె యీ ఖలుల్?

తే॥ రాజువలనను కీడు కర్షకుని కగుట
కోర్తురే పేరుగలపెద్ద? లోపుకోలఁది
వాని మేలునకున్ బాటుపడక, రాజు
నెపల మోమోడ? కది వారి కెప్డు నీతి. ౩౯౧

తే॥ కర్షకునితోన ప్రజలెల్ల కంది, కుంది,
బ్రువ్వ దిట్టంగ, నఱుక ప్రభుత్వమునకు
గడఁగు రా జెట్లు నిలువంగ గలుగు నప్ప
దంబున? నచిరకాలమందపడుఁగాక? ౩౯౨

తే॥ రాజు ప్రజలకుఁ, బ్రజలెల్ల రాజునకు, ని
రంతరంబు నగుదురేని, రాజ్యమెప్డుఁ
బూజ్యమై యుండు; నొక్క కాపునకుఁ జేటౌ
దవుట యగునేని, రాజ్యమంతయును గలఁగు. ౩౯౩

చ॥ నరకుఁడు లోకకంటకుఁడు నాఁ జను ; నైనను వాని రాజ్యమం
దరయఁగఁ బుట్ట దించుకయు హాని కృషీవలకోటి ; కి త్తెఱం
గరుద ; ప్రజల్ సుఖింపనయి రమ్మొయిఁ గర్షకు లెల్ల శాంతివి
స్ఫురణ మెసంగనుంట ; నిది పోలు నిదర్శన మింత కిమ్మొయిన్.

చ॥ నరకు పితామహుండు సుజనస్తవనీయు ; డతండ కాఁడె యె
ల్లరు నృపులందుఁ గర్షకకులంబున కెక్కువ మేలుఁ జేసి ; య
ప్పరు సున వారితోఁ బ్రజల బాగునకయ్యెఁ ; దదీయబుద్ధి వి
స్ఫురణము నిత్యమున్ గృషి కపూర్వవిలాసము గూర్చె న్నత్తఱిన్.

క॥ ఆ రాజ్యపుఁ బ్రజలెల్ల, య
పారపరమ శాంతిసుఖ విభవగరిమా ప్ర
స్ఫార దశఁ గ్రాలి ; రయ్యు
ర్వీరమణుని కాలమంద వెలసె నయంబుల్. ౩౯౬

తే॥ అట్టి ప్రభువు లభించుట యా ప్రజల త
పః ఫలంబన గాదె ? యప్పరమ నృపతి
సంగరం బను ప ల్కెని సక్కనెఱుఁగఁ,
డెప్డు శాంతిన్ దవిలియుండె ; నీసు లేదు. ౩౯౭

తే॥ అఖిలమానవకోటి దేహమును, గర్ష
కుండు తల యని యప్పార్థివుండు పలుకు ;
నెప్డు నట్ల జరించు ; నెందేనిఁ గృషియ
యఖిలజనులకుఁ గార్యమా టతనిమతము. ౩౯౮

క॥ ఆతని మత మెంతయు సరి ;
యాతండు తలంచినగతి ననిశముఁ గృషిక
వ్రాతము పనిఁగొనుటయుఁ దగు ;
నీతి యనఁ గృషీవలునకు నెరి నదియసుమీ ! ౩౯౯

మిత్రశర్మ మందుండగు కాపున్‌గూర్చి పలుకుట.

క॥ ఏ సస్యం, బేపొలమున
కేసారము గూర్చిపెట్టి, యేసమయమునన్
వాసిగ నిడవలయునో ? యది
తా సక్క యెఱింగి, సేఁత తగు కాపు కృషిన్. ౪౦౦

క॥ ఒకతఱిఁ గృషి తఱిగిన, నిం
కొకతఱి నది పూర్తిసేఁత కుత్సాహము గొం
ట కృషికు ధర్మం ; బది త
త్పక యెవ్వఁడు నడచు నతఁడ భవ్యుం డరయన్. ౪౦౧

తే॥ ఈతి బాధలనేని, నెట్లేని యింకఁ
గీ డొకప్పు డవార్యమై కృషి కగుటయుఁ
గలదు ; దానికి నుత్సాహగరిమ సెడుట
కాదు ; ధృతిపెంప యొప్పు నక్కాలమందు. ౪౦౨

తే॥ పాలెకాపులుఁ, గార్మికప్రజలుఁ, గృషికి
నెప్పు డగుచుండఁ, బేరున కెట్టులేనిఁ,
గర్షకత్వంబును వహింపఁ గాదు ; సెడుదు
రట్టివారల యెందునకైనఁ గాక. ౪౦౩

క॥ తానుఁ, దన యింటివారును,
మానుగఁ బనిఁగొనుటమేలు ; మాన్యమతమునం
గా నది కృషినగుఁ గృషికున ;
కే నొకఁడన తప్పు దనుట యెట్లున్ జనమిన్. ౪౦౪

తే॥ ఇంటి వారెల్ల తోడ్పడ, నెప్డుఁ గృషియ
తనకు నాధారమని నమ్మి, తగ నెనంగు
హాలికునిఁ జూచి, తన కతఁ డనుగుబిడ్డఁ
డనుచు నుప్పొంగు భూదేవి యనుదినంబు. ౪౦౫

క॥ భూదేవి కవ్విధమున
మోదమును బుట్టించు కృషికముఖ్యుఁడు కడుఁ బెం
పూది, తగ భుక్తిముక్తి ప్ర
సాదక నిత్యమును గ్రాలు టరుదే తలఁపన్ ? ౪౦౬

తే॥ పాలెగాండ్రకుఁ, గార్మిక ప్రజకు, రాజు
భాగధేయంబునకు, భూతబలికిఁ, బంట
లెల్ల నీగుచుఁ, దన కించుకేని లేని
కాపుఁ, గాపనవచ్చునే ? కాఁడు ; కాఁడు. ౪౦౭

క॥ కావన నెట్లును నెల్లని
యాపోకిరి గానికృషి సమంచితగతి లో
కోపకృతికిఁ గాదు ; మఱి య
పాపకృతిక మూలమగు బుణాక్రాంతంబై. ౪౦౮

ఉ॥ ఎప్పుడు నూరిలోఁ దిరుగు ; నెండకు, గాలికి, వాన కోర్వ లేఁ ;
డెప్పనికేనిఁ గాఁడు ; కృషి నెన్నఁడునేనియుఁ జూడనైనఁ బోఁ ;
డప్పులె సేయఁ జూచుఁ, గృషికాధముఁ ; డింటికి, భూమిదేవికిన్,
ముప్పునకై జనించెనని, ముట్టరు, నూడరు, పెద్ద లాజడున్.

తే॥ తాను లోకోపకృతికిని, దనకులంబు
వారిఁ బ్రోవను, గృషిసేయువాఁడనైతి
నని తలంచి, కృషికి సొచ్చు నాతఁ డిల్లు
సేరునే ? పాల మిల్లుగాఁ జెలఁగుఁ గాక. ౪౧౦

తే॥ ఎన్నియేనిఁ బనులుగల వెప్డుఁ గర్ష
కోత్తమున ; కాతఁ డమ్మోయి నుండునేనిఁ
దనకులమువారలను, సమస్త ప్రజలను,
బ్రోవఁ బుణ్యాత్ముఁ డుర్విపైఁ బుట్టినండ్రు. ౪౧౧

సీ॥ కృషికళాభ్యాస ప్రవృద్ధసంస్కార విస్ఫురితమై పొల్చారుబుద్ధి బుద్ధి,
నవనవసస్యజాతివిశేషసృష్టిక్రమవికాసగతిఁబోల్చు మనము మనము;
ననయంబునుకృషికర్మాయతవ్యాయామదార్ఢ్యసుందరమైనతనువతనువు
సస్యప్రవర్ధనసారప్రదహలాంగళకిణాంకితంబైన కరమ కరము.
"కురు సదా కృషిమేవ"యన్ గురుఁడ గురుఁడు;
ప్రకృతిదేవీ మహాదేశఫల నిరూఢ
కృషి రహస్యప్రపంచంబు నెఱుఁగు మాను
షంబ మానుషము సమస్త జగతియందు. ౪౧౨

క॥ మానవునకుఁ గర్తవ్యము
భూనుతమగు కృషియొకండ; భూదేవికి న
త్యానందకరం బది; ప్ర
జ్ఞానాస్పదమున్, బ్రశాంతి సంస్థానంబున్. ౪౧౩

క॥ పరవంచనకున్ గా; దె
వ్వరుఁ గాదనరు కృషిఁ; బాటువడఁ గల్గిన స
త్పురుషుల కది కల్పకమం
దురు పెద్దలు భుక్తిముక్తితుష్టిద మగుటన్. ౪౧౪

తే॥ అన్నవస్త్రంబులకుఁ గృషియగుట వలయుఁ
బ్రతిపని యింటఁ, బొలమునఁ, బరమదీక్షఁ
గర్షకోత్తమునకు నవకాశమునకుఁ
దగ; నొకప్డేని మాంద్య మాతనికిఁ దగదు. ౪౧౫

తే॥ నాఁగలియుఁ, గవ్వము, మఱి రాట్నమును నంగ
కములు గుద్దలియును గర్షకప్రభువున;
కతఁడు కృషిరాజ్యమునఁ దాన యఖిల జగతి
కగుచు నీ నాలుగింటఁ బెంపమరఁ గ్రాలు. ౪౧౬

తే॥ హలము లేఖని, పొలము మహాకృతి, కృషి
కర్మమే విలేఖనముఁ, గర్షకకవి; కతఁడు
వినుతసస్యఫలప్రబోధనకళా వి
శేషమున సర్వజగము రంజిల్లఁజేయు. ౪౧౭

తే॥ పొలము శాంతాశ్రమంబు, నెప్పుడును గృషియ
తపము, సస్యఫలోత్కరంబ పరమోల్ల
సద్ధృఢజ్ఞాన విభవవిస్తారగరిమ,
కర్షకమహర్షికిఁ, బరోపకారమతికి. ౪౧౮

తే॥ రాజుచందంబునన్, గవిరాజు బలె, మ
హర్షి చాడ్పునఁ, గర్షకుం డఖిలజగముఁ
దన పరిశ్రమమునఁ జేసి దనుపువాఁడు
కావలయు; దాన నాతండు గాంచు ఘనత. ౪౧౯

తే॥ స్వార్థపరుఁడైన రా, జశాస్త్రజ్ఞుఁడైన
కవియుఁ, గోపనుఁడగు ఋషి, గ్రామకాముఁ
డైన కృషికుండు, నీ నల్వురరయఁ దారు
చెడుదు, రఖిలజగంబును జెఱతురు మఱి. ౪౨౦

ఆ॥ ఇంట నాఁడువార లెల్ల రాట్నము బట్టు
వారు, పురుషులెల్ల సారదీక్షఁ
బొలమునందు దగ నెవుడు నాఁగలిఁ బట్టు
వారు, నగుట కాపువారికి విధి. ౪౨౧

క॥ అని కొందఱు వల్కుదు; రది
యును మంచిద; యాంధ్రుఁ, బురుషు లొండొరులకుం న
ప్పనులన్ దోడ్పడు చందం
బున కది కాదు సరి యెట్లుఁ బోల నరసినన్. ౪౨౨

ఆ॥ ఆఁడువారుఁ బురుషు లందఱు నప్పను
లందుఁ బాలుగొనుట నవి యెసంగు
చుండు నొక్కఁ డొకఁడు; రెండుపనుళు నొక్క
తఱిన కాని క్రొన్ని తఱులు కలవు. ౮-౧౩

ఉ॥ ఎంతటివానికేనిఁ గృషి యెప్పుడు గౌరవ మిచ్చుఁ; గాని యొ
క్కింతయుఁ గీడు సేయు నని యెవ్వరుఁ జెప్పరు; దానియందు న
శ్రాంతము దీక్షవట్టు పురుషప్రవరుల్ బుష్కలట్లు యెంతయున్,
శాంతి, కనామయంబునకు, సక్కఁగ నౌదురు, వెండి కీర్తికిన్.

క॥ దైవవశంబునఁ గృషికిన్
గేవలము నొకప్డు డొక్కఁ కీడైనను, దీ
ర్ఘావేశముఁ దప్పమియు, కృ
షీవలునకు వలయు; మేలు సేకురుఁ బిదపన్.

క॥ ఏ వృత్తులేనియున్ సరి
గావు తనదు వృత్తికి నను గాఢసుదృఢ దీ
ర్ఘావేశమునన్ గ్రాలు కృ
షీవలునకు జయమకాక చేటేలయగున్? ౮-౧౬

ఉత్తమ కృషీవలుని లక్షణము.

క॥ చే సాపడు ఋణమునకున్;
మోసమునకుం దిగఁడు కృషికముఖ్యుఁడు; పరమో
ల్లాసమునకుఁ జెడఁ; డన్యుల
వేసములకు బాసలకును వెట్టఁ డెద ధృతిన్. ౮-౧౭

క॥ పరమ స్వాతంత్ర్యవర్తన। గరిమ నెసఁగుచుండు కర్షకశిఖామణి దు
ర్భరపారతంత్ర్యభారా। తురతాస్పదదాస్యవృత్తి దూషితుఁడగునే?

క॥ గాసిపడి యెన్నఁడేనియు । దాసుండగునే ఋణప్రదాతలకు దురా
శాసత్యదూష్యమతులకు । వాసిగల కృషీవలప్రవరుఁ డెందేనిన్ ?

తే॥ కాపు ఋణదాతచేఁ జిక్కి, గాసిపడెడు
వాఁడగుట యేలనగు సారవర్తనముం బ్ర
జాభిరంజనముగ సేయు నట్టి ప్రభువు
కలుగ ? నల్లెన్నఁడేనియుఁ గాదు, కాదు. ౪౩౦

తే॥ కర్షకుం డెప్పు డగు ఋణగ్రస్తుఁ ? డప్డ
జగతికంతయుఁ గడుహాని సంభవించుఁ ;
గాపువారలపెంప లోకమునకెల్లఁ
బెంపనిరి కాదె తొల్లింటి పెద్దలెల్ల. ౪౩౧

క॥ ఆరయ నృపావలంబన । గౌరవమునఁ గ్రాలువాఁడు కా ; పాతనిచే
నారోజ్వలసౌభాగ్య । శ్రీరంజనతా సమృద్ధిఁ జెలఁగు జగంబున్.

ఆ॥ శ్రమకు నోర్చి, పెక్కు చందంబులన్ గృషి
యంద దీక్షవట్టు నట్టి పరమ
కర్షకోత్తములను గని భూమిదేవి పా
వనతఁ గాంచు ననిరి ఘనులు తొల్లి. ౪౩౩

తే॥ కాప లేఁడేని లేదు జగమని పెద్ద
లెందఱేనియు మున్ బ్రకటించి ; రవ్వి
ధంబ గైకొని రెల్లభూధవులు తొల్లి
కాప లోకంబు, లోకంబ కాపుఁగాఁగ. ౪౩౪

తే॥ కర్మకరుల భృతికిఁ, బశుగ్రాసమునకుఁ,
బొలము సారంబునకుఁ, దన భుక్తికి, మఱి
విత్తులకు, నింక తక్కిన వెచ్చములకుఁ
వెదకికొను కర్షకుని కేఁటి బ్రదుకు తెరువు ? ౪౩౫

తే॥ సాలెపురు వీఁగఁబలె దురాశాపరుఁ డగు
నుత్తమర్ణుఁడు కర్షకు నొడువ సూచు
చుండుఁ దన చిక్కులను నురి యొడ్డి; యందుఁ
జిక్కెనేనిఁ గృషికుని కింకెక్కడి గతి? ౪౩౬

క॥ ఒక యుత్తమర్ణునకుఁ గ
ర్షకుఁ డొక్కఁడు సిక్కెనైనఁ జాలు; నతని వృ
త్తికి లోపము పుట్టదు; వే
లకొల్లఁది సంపాదనము కలదు మఱి బిదపన్. ౪౩౭

తే॥ కూటికిని, గుడ్డకును, నోచికొన్న యెల్ల
ప్రజలు కర్షకునకుఁ దోడుపడుట యట్టు
లుండె, నిమ్మొయి నప్పను నురికిఁ బాలు
సేతురే కాపు జగమెల్లఁ జెఱుప నగుచు? ౪౩౮

తే॥ రాజ్యమను పేరఁ దగు శరీరమున కెల్ల
నుత్తమాంగంబు కాపని యొక్కకీడుఁ
బుట్టకుండంగ, నొకకన్ను వెట్టి, రాజు
సూచునది కర్షకుని; వేడి చూపు కాదు. ౪౩౯

క॥ అప్పుఁ గొను టెల్లభంగుల
ముప్పని, తన యోపుకొలఁది మునుకొని, కృషియం
దెప్పుడు మనసై యుండెడు
చొప్పవలయుఁ గర్షకునకు; సుఖమగుఁ బిదపన్ ౪౪౦

ఆ॥ తా స్వతంత్రవృత్తిఁ దవిలియు, ఋణబంధ
నమున జిక్కికొని, యనద తనమున
బ్రదుక నగునె సర్వఫల దాత్రి భూదేవి
తనకుఁ గలుగఁ గాపు దానిఁ గొనక? ౪౪౧

తే॥ రాతినేలలుఁ, జవిటి పఱ్ఱలును, నక్క-
జొరియలున్, బుట్టలును, మంచి పొలముల యగు
నేర్పుగల కర్షకుని; కాతనికి ఋణంబు
గొనుట యేలకు? నతఁడ యీగుటకు సాలు. ౪౪౨

తే॥ డంబ దంభంబు లెప్డు కూడవు; మితవ్య
యంబు వలయు; నుదారత యవసరంబు
కాదు మాంద్యంబు పనులందు; గాఢదీక్ష
యన్నిఁటికి మేలు కృషికుని కనఘమతికి. ౪౪౩

క॥ ఒకయేఁట మూడుపంటలు
నొకమడి నొక్కఁటికిఁ బిదప నొక్కఁడు గొను క
ర్షకుఁ డుత్తముండు; మధ్యము
నకు రెం; డొక్కండ యధమునకు నబ్బంగిన్. ౪౪౪

ఆ॥ ఒక్కపంటకేనియును గానివాఁడెవ్వఁ
డొకో యెఱుంగ మవ్వఁడెవ్వన? వానిఁ
గాంచి, భూమిదేవి కంట నీరూరఁ జే
డ్వఁడకయున్నె? కాపువాఁడె వాఁడు? ౪౪౫

ఆ॥ అపరసృష్టికర్త యనన్నైన కర్షకో
త్తముఁడు నేర్పు పెంపొదవ, ననేక
నూత్నసస్యసృష్టి రత్నగర్భ నలంక
రించు, జగము నుద్ధరించు, మఱియు. ౪౪౬

క॥ గోవును, భూమియుఁ, గృషికుని
దేవు లిరువు; రెప్డు వారి తృప్తికి నతఁడై
కావించు సర్వజగతీ
సేవన్ గృషిరూపమున విశృంఖలవృత్తిన్. ౪౪౭

తే॥ కవి తెలుంగున బుద్ధివికాసము, ఋషి
యట్ల పరమప్రశాంతిని, యధిపుఁబోలె
నుజ్జ్వలౌదార్యమును సూపుచుండువాఁడు
కర్షకోత్తముఁడు కృషిప్రకారవేది. ౪౪౮

తే॥ పసుల బీళుల, సూతుల, బావులయుఁ, దఁ
టాకములయు, జలంబుల డంబెసంగి,
యిమ్మగు పొలమ్ము వలయు ననేకసస్య
జాతివర్ధకతాసార సదన మగుచు. ౪౪౯

క॥ సంజకు ననురూపంబై
పుంజవెలయు చొప్పవలయు ; భూసారం బె
ప్డుం జనని మంచిపొల మతి
మంజుల సస్యావళీరమావాస మిలన్. ౪౫౦

## హాలకర్మప్రశంస.

క॥ పొలమున్ సక్కఁగ దున్నుట
తెలియవలయు మున్ను ; దానిఁ దెలియఁడ యేనిన్
గలుగదు మంచిఫలము కృషి
వలనన్ గర్షకుని కెంతవాఁ డతఁడైనన్. ౪౫౧

క॥ "దుక్కి పస పంట" కను ప
లొక్కొక్కటి పూర్వంబునుండియున్ గల ; దెపుడున్
నిక్కమ యది ; దున్నక ఫల
మొక్కరణిని బడయఁ బోల దేరికి నేనిన్. ౪౫౨

క॥ ఒకఁ డొకఁటి నొరసికొని, చా
ళ్లొకఁడై కన్పట్టు చందమొప్పు, బిరుసువా

క॥ గాసిపడి యెన్నఁడేనియు । దాసుండగునే ఋణప్రదాతలకు దురా
శాసక్తదూష్యమతులకు । వాసిగల కృషీవలప్రవరుఁ డెందేనిన్ ?

తే॥ కాపు ఋణదాతచేఁ జిక్కి, గాసివడెడు
వాఁడగుట యేలనగు సారవర్తనముం బ్ర
జ్ఞాభిరంజనముగ సేయు నట్టి ప్రభువు
కలుగ ? న ట్లెన్నఁడేనియుఁ గాదు, కాదు. ౪౩౦

తే॥ కర్షకుం డెప్పు డగు ఋణగ్రస్తుఁ ? డప్డ
జగతికంతయుఁ గడుహాని సంభవించుఁ ;
గాపువాగల పెంప లోకమున కెల్లఁ
బెంపనిరి కాదె తొల్లింటి పెద్దలెల్ల. ౪౩౧

క॥ ఆరయ నృపావలంబన । గౌరవమునఁ గ్రాలువాఁడు కా ; పాతనిచే
నారోజ్వలసౌభాగ్య । శ్రీరంజనతా సమృద్ధిఁ జెలఁగు జగంబున్.

ఆ॥ శ్రమకు నోర్చి, పెక్కు చందంబులన్ గృషి
యంద దీక్షవట్టు నట్టి పరమ
కర్షకోత్తములను గని భూమిదేవి పా
వనతఁ గాంచు ననిరి ఘనులు తొల్లి. ౪౩౨

తే॥ కాప లేఁడేని లేదు జగమని పెద్ద
లెందఱేనియు మున్ బ్రకటించి ; రవ్వి
ధంబ గైకొని రెల్లభూధవులు తొల్లి
కాప లోకంబు, లోకంబ కాపుఁగాఁగ. ౪౩౪

తే॥ కర్మకరుల భృతికిఁ, బశుగ్రాసమునకుఁ,
బొలము సారంబునకుఁ, దన భుక్తికి, మఱి
విత్తులకు, నింక తక్కిన వెచ్చములకుఁ
వెదకికొను కర్షకుని కేఁటి బ్రదుకు తెరువు ? ౪౩౫

తే॥ సాలెపురువీఁగఁబలె దురాశాపరుఁ డగు
నుత్తమర్ణుఁడు కర్షకు నొడువ సూచు
చుండుఁ దన చిక్కులను నురి యొడ్డి; యందుఁ
జిక్కెనేనిఁ గృషికుని కింకెక్కడి గతి? ౪౩౬

క॥ ఒక యుత్తమర్ణునకుఁ గ
ర్షకుఁ డొక్కఁడు సిక్కునైనఁ జాలు; నతని వృ
త్తికి లోపము పుట్టదు; వే
లకొలఁది సంపాదనము కలదు మఱి బిదపన్. ౪౩౭

తే॥ కూటికిని, గుడ్డకును, నోచికొన్న యెల్ల
ప్రజలు కర్షకునకుఁ దోడుపడుట యట్టు
లుండె, నిమ్మోయి నప్పను నురికిఁ బాలు
సేతురే కాపు జగమెల్లఁ జెఱుప నగుచు? ౪౩౮

తే॥ రాజ్యమను పేరఁ దగు శరీరమున కెల్ల
నుత్తమాంగంబు కాపని యొక్కకీడుఁ
బుట్టకుండంగ, నొకకన్ను వెట్టి, రాజు
సూచునది కర్షకుని; వేడి చూపు కాదు. ౪౩౯

క॥ అప్పుఁ గొను టెల్లభంగుల
ముప్పని, తన యోపుకొలఁది మునుకొని, కృషియం
దెప్పుడు మనస్సై యుండెడు
చొప్పవలయుఁ గర్షకునకు; సుఖమగుఁ బిదపన్. ౪౪౦

ఆ॥ తా స్వతంత్రవృత్తిఁ దవిలియు, ఋణబంధ
నమున జిక్కికొని, యనద తనమున
బ్రదుక నగునె సర్వఫల దాత్రి భూదేవి
తనకుఁ గలుగఁ గాపు దానిఁ గొనక? ౪౪౧

తే॥ రాతినేలలుఁ, జవిటి పట్లులును, నక్క-
బొరియలున్, బుట్టలును, మంచి పొలముల యగు
నేర్పుగల కర్షకుని; కాతనికి ఋణంబు
గొనుట యేలఁగు? నతఁడ యీగుటకు సాలు. ౪౪౨

తే॥ డంబ దంభంబు లెప్డు కూడవు; మితవ్య
యంబు వలయు; నుదారత యవసరంబు
కాదు మాంద్యంబు పనులందు; గాఢదీక్ష
యన్నిఁటికి మేలు కృషికుని కనఘమతికి. ౪౪౩

క॥ ఒకయేఁట మూడుపంటలు
నొకమడి నొక్కఁటికిఁ బిదప నొక్కఁడు గొను క
ర్షకుఁ డుత్తముండు; మధ్యము
నకు రెం; డొక్కండ యధమునకు నబ్బంగిన్. ౪౪౪

ఆ॥ ఒక్కపంటకేనియును గానివాఁడెవ్వఁ
డౌనొ యెఱుంగ మవ్విధువున? వానిఁ
గాంచి, భూమిదేవి కంట నీరూరఁ జే
ద్వాడకయున్నె? కాపువాఁడె వాఁడు? ౪౪౫

ఆ॥ అపరసృష్టికర్త యనదగిన కర్షకో
త్తముఁడు నేర్పుపెంపొదవ, ననేక
నూత్న సస్యసృష్టి రత్నగర్భ నలంక
రించు, జగము నుద్ధరించు, మఱియు. ౪౪౬

క॥ గోవును, భూమియుఁ, గృషికుని
దేవు లిరువు; రెప్డు వారి తృప్తికి నతఁడై
కాఱించు సర్వజగతీ
సేవన్ గృషిరూపమున విశృంఖలవృత్తిన్. ౪౪౭

తే॥ కవి తెలుంగున బుద్ధివికాసము, ఋషి
యట్ల పరమప్రశాంతిని, యధిపుఁబోలె
నుజ్జ్వలౌదార్యమును సూపుచుండువాఁడు
కర్షకోత్తముఁడు కృషిప్రకారవేది. ౪౪౮

తే॥ పసుల బీళుల, నూతుల, బావులయుఁ, దఁ
టాకములయు, జలంబుల డంబెసంగి,
యిమ్మగు పొలమ్ము వలయు ననేకసస్య
జాతివర్ధకతాసార సదన మగుచు. ౪౪౯

క॥ నంజకు ననురూపంబై
పుంజవెలయు చొప్పవలయు; భూసారం బె
ప్డుం జనని మంచిపొల మతి
మంజుల సస్యావళీరమావాస మిలన్. ౪౫౦

హాలకర్మ ప్రశంస.

క॥ పొలమున్ సక్కఁగ దున్నుట
తెలియవలయు మున్ను; దానిఁ దెలియఁడ యేనిన్
గలుగదు మంచిఫలము కృషి
వలనన్ గర్షకుని కెంతవాఁ డతఁడైనన్. ౪౫౧

క॥ "దుక్కి పస పంట" కను ప
లొక్కటి పూర్వంబునుండియున్ గల; దెపుడున్
నిక్కమ యది; దున్నక ఫల
మెక్కరణిని బడయఁ బోల దేరికి నేనిన్. ౪౫౨

క॥ ఒకఁ డొకఁటి నొరసికొని, చా
ళ్లొకఁడై కన్పట్టు చందమొప్ప, బిరుసువా

రక, నేల మెత్తపడి మొ
ల్కకు వేఱుబలంబుఁ గూర్పఁగలదై గ్రాలన్. ౪౫౩

క॥ తడి తఱుఁగకుండ దినములు
గిడుపంగా సాలుఁ బెక్కుగతులన్ బెక్కున్
మడి బాగుగ దున్ననయిన ;
వడి లోఁగొను నీటిపస ధ్రువంబుగ మఱియున్. ౪౫౪

క॥ మంచువలన, గాలిన్, గడు
మంచిపదార్థంబులు గొను ; మఱి మొండకు రా
ణించున్, దున్ననపొలము, స
మంచితఫల మిచ్చుఁ జేలు మ్రాకులె కాఁగన్. ౪౫౫

క॥ ఒక యడుగులోతునకు మా
నక నాఁగలి సొచ్చుతెఱఁగునన్ దున్నిన దు
క్కికి సరియె మీఁద నాఁగలి
ముకు గుంటయు సారనిదుక్కి ? మొలచునె మొలకల్. ౪౫౬

క॥ "చక్కగ క్రాఁగిన పులుసును,
ముక్కిన దుక్కియును, సారమున కగు" నను ప
ల్కెక్కాలమందుఁ బుట్టెనొ ?
నిక్కం బది యిప్పటికి ననేకవిధములన్. ౪౫౭

క॥ వడి నొక్కతూఁటునన్ ప్రే
ల్మిడి దున్నుటకాదు ; బెల్లులేఁచి నలుసులై
కడు సెదర దున్నుటయు మె
ప్పుడు మే, లెద్దులకు నొక్క పూన్కయ చెల్లన్. ౪౫౮

క॥ దున్నుటకుఁ గాని నేలల
మన్ను సెదిరి, బెల్లు విఱుగుమాడ్కిఁ గలఁచు టొ

వ్వా న్నేర్పుమెఱయఁ ద్రవ్వి; స
మున్నతగతిఁ బెరుగు నందు మొలచిన మొక్కల్. ౪౫౯

తే॥ దున్నుటను, ద్రవ్వటను బెక్కుతూంట్లువడిన
పొలము సరిజేయుచందంబు వలయు; మిట్టఁ
బల్లములుఁ గావు; సారంబు పట్టుబట్ట
కుండు నిమ్నోన్నతస్థితి నొరయు పొలము. ౪౬౦

క॥ మడి దున్ని నక్కజేసెడి
వడు పెది కృషివిద్యయం దవశ్యము నెన్నన్
బడు; నదియనుమీ కృషికె
వ్వాడు సహాకారి యని సాలఁబొగడుదు రార్యుల్. ౪౬౧

తే॥ కొన్ని చేలకుఁ బెక్కుదుక్కు లవసరము;
లట్లు కా వొకకొన్ని సస్యముల; కెల్ల
సస్యముల కొక్కఁటికి మించి, నక్క రెండు
మూడు నేని వలసియుండు నేడుదనుక. ౪౬౨

క॥ మొలకున్ ద్రాడె? ట్లట్లి
ముమ్మల వలయున్ మడికి గట్టు; ముక్కడులై గ
ట్టులు సెదర దున్నువారలుఁ
గలరఁట యొకకొంద? రేఁటి కాపుల్ వారల్? ౪౬౩

తే॥ పొలము సరినేఁతకును, నీరు పొరలిపోవ
కాగినిల్పుటకును, దటి యగుడు గండి
వెట్టి యా జలమంతయు విడచుటకును
వలయు గట్టులు? క్కాదనవచ్చు నెట్లు? ౪౬౪

తే॥ గడ్డిగాదరలను నొక్కకడకుసేర్పఁ,
బొలము సరిజేయు, బెల్లులఁ గలఁచి పుచ్చు,

పాపటము మేటిపనిముట్టు కాపువారి ;
కేల నదియుంట కా ; దది మేలసేయు. ౪౬౫

తే॥ "విత్తు లేదేని లేదపో వృక్ష" మండ్రు
నిక్క మిప్పల్కు ; "విత్తు లేనిద కనంగ
రాని" ద ద్రప్పలుకునుసార్థంబ ; యెట్లు
సూచినను విత్తు మూలంబు సూ జగతికి. ౪౬౬

## బీజక్రమ, బీజావాపన ప్రశంస.

తే॥ ప్రకృతి వస్తువు ; సూక్ష్మరూపమున నందుఁ
గ్రాలు పురుషుండ విత్తు ; విశాలశక్తి
పుంజమంతయు దాన నెప్పుడు నెసంగి
యుండుఁ ; దతి యగుచో రూపు బొంది తోఁచు. ౪౬౭

తే॥ విత్తు నందలి శక్తు లుద్వేలభంగి
నడరుటకు మేలిమికిఁ దగి, యది యెసంగి
యుంట సను ; నట్లు గాదేని గంటువడి కృ
శించు ; దానికి నిం కొండు చెల్వు కలదె ? ౪౬౮

తే॥ మంచివిత్తులనేరిచి యుంచికొనుట
కర్షకుని కొక్కపని ; యవి కందకుండ
సూచికొనుటయు వలయు ; నీ చొప్పు కాద
యేని సెడు ; నేపువుట్టదు దానికెందు. ౪౬౯

తే॥ ఎంత శ్రమ కగ్గమైనఁ బెక్కేల ? మంచి
ఫల మొసఁగ లేదు కృషి యేపు వట్టి పెరుగు
శక్తి విత్తున లేదేని ; సచ్చు, సావ
కుండు ; నైనను నది లెక్క కొప్ప దెందు. ౪౭౦

తే॥ సారము నెఱింగి విత్తులు సల్లు టొప్పు;
సల్లితిను కాను యుపల్కు సాల ; దొక్కఁ
డొకఁడు నంటక యువి పడుచుండు గత్తి నె
సంగు నది పేర్చి విత్తులు సల్లు నతఁడు. ౪౭౧

తే॥ నెసయ నేసస్యముల కెంత లెంత లెడము
లుండవలయునో ? యది తెలియుటయు, విత్తు
నప్పుడు సాళ్లు గొనుటయు, మేలైన తెరువు
లెలమి విత్తెడు వానికిఁ బొలమునందు. ౪౭౨

క॥ వెరవరి సల్లెడు విత్తులు
పొరలు సెడవు, సాళ్లఁ దప్పి పోవవు ; మఱియున్
వరుసలకున్ దగఁ బడుఁ ; జె
చ్చెఱ నేలన్ బాదుకొనెడి చెల్వనకు నగున్. ౪౭౩

తే॥ అడవులందు, విదేశములందు, నెన్ని
యేని నూతనసస్యమహీజకోటు
లున్నయవి మానవుల కుపయుక్తముల య
నంగనై ; వానిఁ దెచ్చు యత్నంబు వలయు. ౪౭౪

తే॥ బుద్ధి విస్ఫురణంబునఁ బొల్చు కృషికుఁ
డెన్ని జాతులనేని సృష్టింపఁ గలఁడు
తోఁటలందును, బొలములందు, నతని కది
కార్యమై సెల్లఁ బెక్కువృక్షములఁ, జేల. ౪౭౫

ఎరువుల ప్రశంస.

క॥ "పెంట పస పంట" యనియును
"దంటు పస యెు యెన్ను" ననియుఁ, దగ లోకులు వా
కొంటకుఁ గారణములు పె
క్కుంట నిజము ; తెలియవలసి యుండున్ వానిన్. ౪౭౬

క॥ విను తరు జాతులు ప్రాణులఁ
దినుఁ, గూరున్, గొంత తెలివిఁ దెచ్చికొనుఁ, గ్రమం
బునఁ బెరుఁగుఁ, బండు, లోకం
బునకుం మేలు నొడఁ గూర్చుఁ, బొలు పెసలారున్. ౪౭౭

క॥ కానన్ దిన వెట్టుట యె
ట్లేని వలయు సస్యములకు నెప్పటి క ; ప్తై
వ్వాని బ్రదు కెప్డు సస్యా
ధీనం ? బక్కాపు దీనిఁ దెలియన్ వలయుఙ్. ౪౭౮

తే॥ వృక్షముల కెవ్వఁడును దినవెట్టఁ, డడవి
బ్రదుకు, వృద్ధికి నెనఁగుఁ బెంపొందననెప్డు ;
నట్టులై యుండ నేల సస్యము లకుఁ దిన
వెట్టు ? టవి వృక్షజాతికి నట్టి కావె ? ౪౭౯

తే॥ అన్నిఁటికి వెట్టఁ గలఁడు దయాసముద్రుఁ ;
డేమి సేయఁ గలఁడు నరుఁ ? డేల నెరవు
లిడుట సస్యములకు ? బెట్ట మేనిఁ గావె
యవి యను కువాద మిచట నెక్కైనఁ గాదు. ౪౮౦

క॥ ప్రకృతి తన యొావు కొలఁదిఁ ద
రు కోటి కెప్పుడును నేర్పు రూపింపఁగ నా
టికి నంతయుఁ గూర్చుట కల ;
దొకప్పుడును దప్పదనుటయు, నిజమ యెట్లున్. ౪౮౧

తే॥ కాని పరమస్వతంత్రుఁడై గాలు నరుఁడు
పెంపుసే యంగ నైకొని పేర్మిఁ నూపు
ప్రాణులం దాయమ య పేక్షఁ బట్టినట్టు
లుండుఁ, దన యధికార మింకొకట సెల్లం. ౪౮౨

తే॥ ఆత్మబలశాలి మానవుం; డతని కెదిరి
సేయ దేమియుఁ బ్రకృతి; దాసిఁ బలె నతని
పన్పునకు సూఁచుచుండు, న ట్లంగి తనకు
బరమ ధర్మం బగుట; నిందు బ్రాతిలేదు. ౪౮౩

తే॥ కానఁ బ్రకృతికిఁ దప్పించి, తాన పెంపు
సేయ నెప్డును దలకొను జీవకోటి
మనుచుట కృషీవలునకు ధర్మంబకాదె?
కాఁడె యాతం డపరసృష్టికర్త యనఁగ? ౪౮౪

క॥ తినవెట్టక, మచ్చికఁ గై
కొన, కాపుగ విడిచి, ఫలము గొనవచ్చునె కో
రిన యంతవట్టు దానన్?
విను! మట్టిది కాదె సస్యవిధ మరయంగన్. ౪౮౫

క॥ వెలవెలనై, యేపుఁ దఱిగి
వెలయవు, పుష్టిమెయి దంటువెట్టవు, కడుఁ బెం
పలరగ నెవ్వని సస్యము?
లిల నాతఁడు కాపె? యతనికేలఁ గృషియనన్? ౪౮౬

క॥ ఒక మొక్క పెక్కులై చూ
డ్కికి నింపుగ నేపుమై నిగిడి, యెంతయుఁ గా
రు కొనన్ వలదే మంచి కృ
షికు సస్యము? జగము వినుతి సేయన్ జనదే? ౪౮౭

ఆ॥గీ॥ కాఁడె యపరసృష్టికర్త కృషీవలుఁ?
డతని సృష్టి తర్గుగు నట్టిదైన
నేఁటి నేపె రతనికి? నేఁటి గౌరవము లో
కమున? నేఁటి బుద్ధి కౌశలంబు? ౪౮౮

తే॥ చక్కఁగా దున్ని విత్తులు చల్లు చేర్పు
తోన సాలదు ; కల వెన్ని యేనియుఁ బను
లింక నతనికిఁ గృషియందు ; నెరువుఁబెట్టు
టెల్లపనులందుఁ గడు ముఖ్య మిరు వెలర్ప. ౪౮౯

క॥ ఒక యేఁటఁ బెక్కు పంటలు
నొక పొలమునఁ గొనఁ దలంచు నుత్తముఁ డగు క
ర్షకుఁడు తిన వెట్టఁ డే సే
లకు నోపుకొలంది నుజ్వలం బగు దీక్షన్ ౪౯౦

క॥ భూదేవిన్ సేవించుట
కాదే యాయమకడుపునఁ గన్న నిసువులన్
బ్రోదియొనర్చుట ? యప్పని
కేదియు సరిగాదనిరి మహితమతు లార్యుల్. ౪౯౧

క॥ కాపునకు నోనెఱుంగని
పాపలు సస్యములు ; వాని బాగున కాతం
డోపికఁ దినవెట్టి ఫలముఁ
బ్రాపించు నొకం డొకండుఁ బంటలు నాఁగన్. ౪౯౨

ఆ॥ గీ॥ ఎలమి గడ్డిగాదరలు, నాకలంబులుఁ,
బేడపెంటలుఁ, దినఁబెట్టుఁ గాపు,
నోరులేని తన యనుఁగు బిడ్డలగుచేల ;
కవ్విధమున యెరువులండ్రు ప్రజలు. ౪౯౩

క॥ భూసారంబన, నెరువులు,
నా నక్కఁగ నొక్క భావనకు పేరులు రెం
డై సెల్లు ; నింక నవి పలు
బాసలఁ, బలుపేళ్ల నుడువఁ బడుచుండుఁ దగన్. ౪౯౪

క॥ ఏసస్యమునకు, నే యెరు
వేసమయమునందు, నెట్లు లిడనగు ? నది యు
భ్యాసమునఁ గాని తెలియఁడు
ధీసహితుండయ్యుఁ గాపు దీక్షనెఱపియున్. ౪౯౫

ఆ॥ ఏ తెఱంగు నేల కే యెరువ్వుదగు ? న
దియును దెలియవలయు దీక్షవట్టి,
యెరువు వెట్టకున్న, నెక్కుడయినఁ, గీడ
సమకూరు మునకుఁగాని చందమైన. ౪౯౬

తే॥ ప్రకృతి భూదేవి కెప్డు సారంబుఁ గూర్చు
చుండుఁ దనయోపుకొలఁది రేయెండ, యెండ,
గాలి, నీళుల, మంచునఁ ; గాని సాలు
నంతమాత్రనఁ జేలకు ననుట కాదు. ౪౯౭

క॥ తన నోరులేని నిసువుల
కనుగ్రహముపేర్మి నెవ్వరైన నిడుదు ; ర
ప్పని నాకేఁటికి ? ననఁ బో
లునె కాచికొనిన కృషీవలుని కెందేనిన్. ౪౯౮

క॥ కావునఁ దినవెట్టులె, కా
కేవిధమగు కీడువుట్ట, కెప్డు నరయుచున్,
బ్రోవవలయుఁ దనచేలఁ గృ
షీవలుఁ ; డట్లైన ఫలముఁ జెందున్ సాలన్. ౪౯౯

క॥ ఎరువులు పెక్కుతెఱఁగులై
వరగున్ ; జంతువులఁ, బాదపంబుల, లోహా
త్కరముల, నవి లభ్యంబులు
వెరవరియగు కాపునకు వివేకము పేర్మిన్. ౫౦౦

తే॥ జంతు మూత్ర పురీషాస్థిచర్మ రాశు,
లగసులటు పత్ర బీజ చూర్ణాదులు, మఱి
కొన్ని లోహపదార్థంబు లెన్న సస్య
భోజ్యవస్తువు; లివి యెరువులని యెఱుఁగు. ౫౦౧

వ॥ అజోరణ గోమహిషరాసభగజాశ్వోష్ట్ర సూకరాదుల మలమూత్రాస్థిచూర్ణ రోమమాంస చర్మాదులును, జతుకాకుక్కుటాది విహంగకుల పురీషాస్థిరోమాదులును, మీనకులమాంసాస్థి చర్మాదులును, రక్తమును, జంతుసంబంధములగు నెరువులనియు, నీలియు, వెంపలియు, నులవయు, జనుము, నూవులు మొదలగు సస్యములయు, వేప, కానుఁగు, కొడిసె మొదలగు వృక్షముల యాకులును, దిలైరండపిచు మందాదుల పిణ్యాకంబులును, గాక చూర్ణాదులును, వృక్షసంబంధములగు నెరువులనియు, భస్మాంగార నానావిధ మృత్తికా సుధాచూర్ణ వివిధలవణ హరితాళాది వికృతిజాతులు లోహసంబంధములగు నెరువులనియు నెఱుంగునది, వెండియు—

తే॥ క్రుల్లి కంపునకగు వస్తుకోటియు, మఱి
జంతువుల యూర్పు గాలియు, సస్యములకు
మంచి యెరువులు; ప్రకృతి కావించియున్న
యెరువులన్ మున్ను కొంత సూచించితి కద. ౫౦౩

క॥ తినవెట్టక, పుట్టింపన్
జన దెప్పుడు నేనిఁ గాపు సస్యం; బది పా
ల్పునె సూడ నగుచు, నేమియుఁ
దినుటకు లే కుజ్వలఫలదీపిత మగు చున్. ౫౦౪

తే॥ పెక్కు తడవులు నొకమడిఁ బెట్టఁగూడ
దెలమి నొకజాతిసస్యము; యేఁడు లైదు,

నారు నేనియు సనకుండ నమ్మఁడి నొక
యేఁడు విడచుట కడులెస్స బీడుఁగాఁగ. ౫౦౫

తే॥ ఎండకున్ గాలికిన్ జెడు నెరువుల పస;
యత్తెఱఁగు పుట్టకుండ నెప్డరసికొనుట
మే; లెరువుసెడ్డఁ గల్గను మేల్మిఫలము;
"పెంటపస పంట" యని చెప్ప వింటికాదె. ౫౦౬

క॥ అనుభవముపేర్మి నెరువుల
వినియోగక్రమము, వాని వెట్టుసమయమున్,
విను మింక నెన్నియేనియు,
ఘనుఁడగు కృషికుం డెఱుంగఁ గలఁడు తనంతన్. ౫౦౭

తే॥ ఎరువుల ప్రభావముఁ దెలియు దింక నేర్పు
చొప్పడన్ దోఁటలన్గూర్చి సెప్పు నప్పు;
డింత కిది సాలు; నీపయి నెంతదీక్ష
వట్టి కృషిసేఁతు? వంతియ పట్టనగుదు. ౫౦౮

వృక్ష మహిమా విశేష వివరణము.

చ॥ సకల విశాలశక్తి విలసద్గరిమా ఘనమైన యీ జగం
బకుటిలమై, యెఱుంగవడ నట్టిదయై, బహు సూక్ష్మమై, మహా
ప్రకృతికిమూలమై, తనరు బ్రహ్మము నందునఁ దోఁచు నట్లు మొ
లక కరము విత్తునుండి యెసఁగన్బడి కానఁగవచ్చుఁ గంటికిన్.

ఆ॥ కన్నువిచ్చి, యెంతగాఢదీక్షన్ సూడ
నైనఁ, గానరాని యణువయై, యె
నంగి పొల్చు జీవశక్తి బీజమునుండి
పరిణమించు నొక్క పాదపముగ. ౫౧౦

క॥ ఫలకుసుమపల్లవోత్కర
ములు, మూలస్కంధభాగముల, నానాశా
ఖల నొప్పు మహావృక్షము
తొలివిత్తున నణువ యగుచుఁ దోఁపకయుండెన్. ౫౧౧

తే॥ బీజకాండమూలంబులఁ బెంపుగాంచు
నెల్ల తరుజాతులును ; వాని కెల్ల విత్తు
భూమిదేవియ ; సృష్ట్యాదిఁ బుట్టఁజేసె
వీని నెల్ల నాయమకాదె వెరవుమెఱయ ? ౫౧౨

తే॥ సర్వసామాన్యముగ మహీజములు విత్తు
కడుపునుండియ పుట్టి, సక్రమ నెసఁగుఁ ;
కాని సృష్టివై చిత్ర్యంబు గానవచ్చు
వానియందు సహజమై, యవార్యము నయిం ౫౧౩

తే॥ బీజములఁ, గాండములఁ గొన్ని పెంపుఁ గాంచు ;
మూలముల, విత్తులన్ బుట్టి ప్రాలుఁ గొన్ని ;
విత్తులన కొన్ని యెసఁగు ; నివ్విధమ వృక్ష
జాతి సంభవవైచిత్ర్యసరణి ; నిజము. ౫౧౪

క॥ తినఁ, గట్టన్, మందులకున్
గొనఁ, దలఁదాచికొనఁ, దెల్విఁ గూర్చికొనన్, శాం
తి నెగడఁగ, వృక్షకోటుల
మనుష్యకోటికి నగున్ సమస్తవిధములన్. ౫౧౫

క॥ నానావర్ణమనోహర
తానూన సుగంధవైభవాతిశయులస
త్సూనోత్కరములఁ దరువులు
మానవకోటి నొకకొన్ని మానుగఁ దనుపున్. ౫౧౬

కం॥ పరిమళమున్ వెదసల్లుచు
నిరంతరము వాయుశుద్ధి నెఱపఁగ నై, భా
సురలీలఁ గొన్ని గ్రాలున్
దరువర్యము, లవ్వని కవి తగఁ బుట్టె ననన్. ౫౧౭

కం॥ మనుజునకు రోగమన, జర
యన, మృతియన నెక్కడివి సమస్తగతుల నా
తని కే ముండగ ? నను న
ట్లానఘున్ దగ నంతకు నయి యొకకొన్ని తరుల్. ౫౧౮

తే॥ వజ్రమేనియు భేదింపవచ్చు నట్టు
లేము కలుగంగ నరు ? నని యొసఁగుఁ గొన్ని ;
వాయు జలపావకాదులవలనఁ గీడు
బుట్టకుండంగ నొకకొన్ని బ్రోవఁ జాలు. ౫౧౯

తే॥ ఆకసంబునఁ దేలి వే యరుగఁ జేయఁ
జాలు నొకకొన్ని యోషధుల్ సారశక్తి ;
నిట్లు మానవునకుఁ దార యెల్ల నగుచు
వృక్షసంతతు లెల్లెడ నెసఁగుచుండు. ౫౨౦

ఆ॥ చెట్టు లేదయేని చెప్పెడిదేమి ? లో
కంబు లేదు ; పెక్కుగతులఁ బ్రాణి
కోటు లంద బ్రదుకుఁ ; గూర్చికొనుఁ శాంతి ;
మఱి మనుష్యుఁ డందమహిమఁ గాంచు. ౫౨౧

కం॥ నానావిధపాదప సం
తానము మానవున కగువిధంబ యపార
జ్ఞాననిధి స్రష్టమత ; మది
మానుగ నరుఁ డెఱిఁగి మనుట మతమన నొప్పున్॥ ౫౨౨

క॥ తన కన్నింటికిఁ దరువుల
యనయంబును సాలియుండ నకటా! తనుఁ బో
లిన జంతుక్కోటి మాంసముఁ
దిను పాపంబేల? యేఁటి తృష్ణ నరునకున్? ౫-౨౩

క॥ నోరి చవి నీశ్వరాజ్ఞకు
దూరంబుగఁ గానిపని బ్రదుకనగునే గం
భీరజ్ఞాననిధి మనుజుఁ?
డారయ మానవుఁడె యాతఁ డట్లు నడిచినన్? ౫-౨౪

ఆ॥ అంత్రదంతవిధము నఖిలజీవులకు నా
హారమునకుఁ దగిన యట్లయుండుఁ;
గాన మానవునకుఁ గాదు మాంసము దిన;
నతని ప్రేవుఁ, బన్ను నట్లు గావు. ౫-౨౫

క॥ తన నోరి చవికిఁ దనుఁబలె
ననయంబును బ్రదుకు ప్రాణి నణఁపఁ దివురు టె
ట్లును గాదు; పొలసుఁ దినువా
నిన కాదే యాసురం డనిరి తొంటి బుధుల్. ౫-౨౬

తే॥ ఈశ్వరోద్దేశమునకు నిల్లెదిరి, తిరుగు
రక్కసుని కా జగత్ప్రభు రాజ్యమందు
గలదె తా? వ మ్మనుష్యుండు కాఁడె యంట
రానివాఁ డందు రమలవిజ్ఞానధనులు. ౫-౨౭

క॥ నీవును మాంసము ముట్టక
జీవింపుము; నోరి చవికిఁ జెలఁచికొనుట షే
లే విమలజ్ఞానోదు
శ్రీవిపులాయురభివృద్ధిసిద్ధులనెల్లన్? ౫-౨౮

వ॥ అయినను

క॥ ఎలమి ధ్రువప్రాంతములం
దలి మానవకోటిఁ బెంపొందవ జేయన్ జె
ట్టులు లేమి నమ్మనుష్యులు
పొలసు దినుచు బ్రదుకువా రెపుడు నెల్లెనిన్. ౫౨౯

తే॥ వసుధ మానవకోటి కావశ్యకంబు
లగు పదార్థజాలంబుల కమ్మనుష్యు
లెప్డునోచికొనమి, వార లెట్టులేని
జీవయాత్ర నంజూడు దిన్బుఁ జేసికొండ్రు. ౫౩౦

వ॥ పెక్కుయుగంబులకుఁ బూర్వ మమ్మానిసు లెమ్మెయి జీవించుచుండి
రొక్కొ ? యనియు, నింకఁ గొన్నియుగంబులు వో వార లే స్థితి
కిన్ వత్తురోకో యనియు, నారయుటకు మనకు బుద్ధి సాలదు ;
వెండియు. ౫౩౧

క॥ వారును మనసోదరుల ; యు
దారచరిత్రమున కట్లు తప్పిరి ; మఱియున్
వారికి మనకును ధర్మము
మేర యొకటి కాదు ; కల దమితభేద మిలన్. ౫౩౨

తే॥ ప్రకృతిమాతృ విచిత్రతర ప్రపంచ
సృష్టి లీలాసముద్రమం దెలమి వార
లొక యలకుఁ జెందియున్నవా, రొనర మనముఁ
జెందియుంటి మింకొకయల ; కిందు నిజము. ౫౩౩

క॥ వారికి, మనకున్, గల దా
హార విహారముల భేద మదిగావున ; నీ

వారయకు మత్తెఱంగ
గ్గోరమునకుఁ దప్పితి మనుకొను మెదనిండన్. ౫౩౪

వ॥ అట్లరసికొని శాంతిమెయి వర్తింపుము. ౫౩౫

క॥ మానవకోటి బ్రదుకునకు,
జ్ఞానమునకు, నంతకు మఱి సక్కనగు మహీ
జానీకమునకు నగుటయ
మానుగ నెల్లరకు విధి సమస్తవిధములన్. ౫౩౬

క॥ అక్కార్యమ కృషినాఁ జను;
నెక్కడ, నెప్పనులు, దాని కెడ్డను సరి కా
వక్కతమున; దానికి నై
తెక్కుడు దీక్షమెయి నీవు; నింతియ సాలున్. ౫౩౭

క॥ నో రొకఁడ లేదు పలుక మ
మహీరుహకులమునకుఁ; గాని యెఱుకయు సుఖదుః
ఖారోగ్యాయు రాహ్వ ధ్యా
హారస్వప్నాదులుఁ గల వయ్యో గతులన్. ౫౩౮

తే॥ ఘనపదార్థంబుల యనంగఁ గ్రాలు వృక్ష
తతులు పూచుట, కాచు టెంతయును గలదు
కావునన్ వానియందు నాకాశగుణము
కలదనిరి వృక్షశాస్త్రవి జ్ఞులగు బుధులు. ౫౩౯

తే॥ స్పర్శగుణమును గలదు భూజములకెల్లఁ
గరము వేడిమి యగునేనిఁ గాయ, పూవు,
నాకుఁ దోలును వాడఁ జీకాకున కయి
శాంతికిన్ దక్కి సోలుట కలదు గాన. ౫౪౦

తే॥ శబ్దగుణమును గలదు వృక్షములకుఁ బవ
మానవిర్ఘాతపావక ధ్వాన జంతు
కోటి కోలాహలో గ్రనిర్ఘోషముల నొ
కప్డు వాడుఁ, గలఁగు, సోలు, నట్లుగాన. ౨౪౧

తే॥ క్రాలు నానాసుగంధదుర్గంధ ధూప
సారముల రోగములఁ బాసి, సక్క నెసఁగి ;
యగరులము ; గాన ఘ్రాణేంద్రియంబున కగు
గుణముఁ గల దెప్డు వానియం దణఁగి, పర్వి. ౨౪౨

తే॥ వ్రేళ్ల, నాకులఁ, గవరాక వెలయు సంగ
సంధులన్ భోజ్య జీవరసంబుఁ గొనుఁ, దె
వుళ్లకుఁ బ్రతిక్రియలుసేయుఁ బొలచుఁ, గాన
కలదు రసనేంద్రియంబు వృక్షముల కెల్ల. ౨౪౩

తే॥ ఒకట నొక్కఁటి కింకొక్కఁ డొరసి కొనుట
యగునపుడు, మీఁటి, యనువగు నంతకు సన,
నల్లె యత్నించుటన్, హృదయమును, గన్నుఁ
జెట్ల కెల్లను గలవని సెప్పనయ్యె. ౨౪౪

తే॥ స్నేహవైరభయక్రోధచిహ్నములును
గలవు తరు సంతతులకని కానరైరి
వీరదులు కొంద ; ఱిట్లవి వెలయు మనముఁ
బోలె సర్వాంగయుక్తిమై సాల గ్రాలి. ౨౪౫

క॥ చక్కఁగ విహారమనునది
యొక్కండ కొఱంతె కాఁగ నొప్పున్ దరువుల్
తక్కువ యవి యందుము మన
మిక్కుతమునఁ దెలియనేర కింతకు వానిన్. ౨౪౬

తే॥ ఆయు రారోగ్యభాగ్యంబు లందు నెప్పు
డవియ మనకన్న నెక్కువ యవి యనంగ
నొప్పు సాల దనుక; మన ముండ నైతి
మంతకున్ సాలి మవి యుండ నంటి, మున్న. ౫౪౭

ఆ॥గీ॥ పూచి, కాచుఁ గొన్ని, పూయక గాచు కొ
న్ని యవి; గొడ్డువోయి, నేలకు బరు
వగుచు బ్రదుకుచుండు నట్టివి కల వొక
కొన్ని చాల బలిసి కోటి కొకఁడు. ౫౪౮

క॥ స్త్రీపుం నపుంసకము లను
రూపములును వానిఁ గల; వరుద పుంషండ
వ్యాపారము; కోటి కొకఁడ
సూపునకున్ జేటు నాఁగ సూడంగ నగున్. ౫౪౯

ఆ॥గీ॥ పుట్టుఁ, బెరుగుఁ, బండుఁ, బొలియు మూఁడు నెలల
యల్పకాలమంద యందుఁ గొన్ని;
బ్రదుకు నొక్కకొన్ని పదివేలుఁ, గా కిరు
వదియు నైదువేలు వత్సరములు. ౫౫౦

తే॥ మూఁడు నెలలు మొదలు ముప్పది వేలేండ్ల
దనుక బ్రదుకు వృక్ష తతులు, సాల
నొకఁటి కొకఁడు మించి యుండు నాయుఃప్రమా
ణమునఁ, బెక్కుజాతు లమరఁ బొలచి. ౫౫౧

ఆ॥గీ॥ ఒక్క పంట తోన నక్కనశించు వృ
క్షకులముఁనక పేరు సస్యకులము
నాఁగ; దానియందున గలవు పెక్కు జా
తులు ననేకభేదముల నెసంగి. ౫౫౨

క॥ సకలప్రకారముల వృ
క్షకులం బంతయును సృష్టి సౌందర్యము మా
టికిఁ బ్రకటింపుచుఁ జిరకాం
తికి మూల మగున్ విశుద్ధ తేజము పేర్మిన్. ౫౫౩

తే॥ మంత్రతంత్రంబులకు సాల మహిమఁ గూర్చు
నవియు; మఱి వాని నణఁగించునవియుఁ గలవు
వాని యందున నొక కొన్ని; మానవులకు
హానికరములుఁ గల; వవి యరుద సాల ౫౫౪

తే॥ వ్రేళ్లె కొమ్మలు, కొమ్మలె వ్రేళ్లుఁ గాఁగ
నరుదుగా కొన్ని వృక్షంబు లాడనాడఁ
గలవు; మార్పుల కెట్లును గానివియును,
నగు నవియునున్, గలవు సాల నరయ నగుచు. ౫౫౫

క॥ "పెంటపస పంట" యనుచో
వింటివికద కొంత యెరువు విధ! మిప్పుడు వా
కొంటకు మఱియున్ గల; దిది
గంటు వడని దీక్ష వినుము! కౌతుకముఁ దగన్. ౫౫౬

ఆ॥గీ॥ పరిసరప్రభావబద్ధంబుల యఖిల
జీవు ? లందుఁ గొన్ని కావు; కాని
సక్కనది యెసంగు సామాన్యధర్మమై;
దాని బుధులు ప్రకృతి తంత్ర మంద్రు. ౫౫౭

క॥ ఎరువులె తరుసంతతులకుఁ
బరమపరిసరములు వాఁగఁ బ్రస్తుతి కెక్కున్;
బరిణామక్రమమును త
త్పరిసరముల కుచితమైన ధర్మం బుర్విన్. ౫౫౮

ఆ॥ అపరసృష్టికర్త యననగు సద్బుద్ధి
శాలి, పరమకృషిక సత్తముండు,
పరసర ప్రభావ పద్ధతిఁ బ్రకృతి సృ
ష్టి క్రమంబు మార్చఁజేయ నోపు. ౫౫౯

క॥ ఒక జాతిచెట్టు విత్తిం
కొకజాతి తరువు మొలకగ నుద్భవమై, దా
నికిఁ దగఁ బూయన్, గాయన్,
బ్రకృతి నెదిరి సక్కఁజేయు పని యతని కగున్. ౫౬౦

తే॥ ఎల్లభంగులఁ బ్రకృతిఁ దా నెదిరి, వృక్ష
కులము మార్చునకున్, మఱి క్రొత్తజాతు
లను దేరంగ నేర్చు కర్షకుని కతని
యెరువులను మంత్రమహిమన యొసఁగుచుండు. ౫౬౧

క॥ మన పూర్వులు సెప్పన్ నా
వినిన తెఱంగునన నీకు వివరింతుఁ; దగన్
విను కొన్ని యెరువుల విధము!
విని, పిమ్మట చేసి, చూచు విధమున్ వలయున్. ౫౬౨

నానావృక్ష పరమదోహద విశేష వివరణము.

సీ॥ మార్జాలసూకరమత్స్యమలంబులు, రంభాదళసితసర్షపములు, సమ
భాగంబులుగఁ గూర్చి, బాగుగఁ బొడిసేసి, నేయితో నవియెల్ల నెరియఁ
బొదివి, ధూపంబువెట్టిన ద్రుమకులంబెల్ల చిరాయురారోగ్యపుష్ట్య
మితకాంతి । గరిమ నెసంగు; సక్కఁగఁ బూయుఁ, గాయు; వెండియు
నేతిధూప మింపయి సెలంగ,
యవజలము సాల వోయుచు, ననుదినంబుఁ
దిలలు, వ్వాయు విడంగముల్ గలియనూరి;

కల్క మిడ సర్వవృక్షనికాయము నభి
వృద్ధిఁ బొరయు, ఫలించు, పెక్కేఁడులు మను. ౫౬౩

తే॥ ఊడుగాకు కషాయంబు శోడ మధువు,
ఘృతముఁ, గూరిచి, పోయుచు, మృగవరాహ
మాంసములు సారముగ బెట్ట, మంచిఫలము
నిచ్చు, వర్ధిల్లు ద్రుమకులమెల్ల సాల. ౫౬౪

తే॥ జాజులకు, మల్లె పొదలకుఁ జందనజల
మెంతయు సుగంధమున్ గూర్చు; నెపుడుఁ బూయు
చుండు తరు గుల్మలతలకు నొప్పుసేయుఁ
గూర్మమాంసంబు నెరువుగాఁ గూర్చిపెట్ట. ౫౬౫

క॥ కరవీరము, మాధవియును,
గురంటకము నిండఁబూయు గుత్తులు విరుగన్
నిరతమును సంజవేళల
సురాభిషేకమున రూపు సొంపుఁ దలిర్పన్. ౫౬౬

తే॥ గోవులయు, మేకలయు, మఱి గొఱ్ఱెలయును
వెంటఁజేర్చి, జలము మొదలంటఁ బోయ,
సకల తరుగుల్మలతలుఁ బుష్పములుఁ, బండ్లు,
నెప్పుడు నొసంగు, వర్ధిల్లు సెప్పనగుచు. ౫౬౭

క॥ తిలమాషముద్గయవలయు
నులవలయు కషాయమున సముజ్వల ఫలపు
ష్పలసత్పల్లవగరిమన్
విలసిల్లు నిరంతర్గమును వృక్షములెల్లన్. ౫౬౮

తే॥ నారికేళము, వెదురు, ఖర్జూరము, వరి
మొల్కయును, మాంసజలమ యమోఘతరర

సాంజనంబయి తమ కొప్ప మంజులరుచిఁ
గ్రాలు, వృద్ధి రహించు, సక్కఁగ ఫలించు. ౫౬౯

తే॥ మాషముద్గమురాబీజమహితసార
తరకషాయంబునం దుప్పు, సురయుఁజేర్చి,
నారికేళంబునకుఁ బోయఁ జారుఫలస
మృద్ధి నెప్పుడు నది గ్రాలు, వృద్ధిఁ బొరయు. ౫౭౦

తే॥ పోకచెట్టు దళంబులఁ బొదవిచుట్ట,
హర్షపులకోత్కరంబు నా, నఖిలశాఖ
లందుఁ, బాదంటగా స్కంధమందుఁ, బనస
చెట్టునకుఁ బుట్టుకాయలు సెప్పనొప్పి. ౫౭౧

సీ॥ ప్లక్షవటామ్రపిప్పల జంతుఫలతరుపల్లవంబులతోడ బాగు మెఱయ
గారండవస్మృగాల సారంగగోధికాపిశితంబులన్, గూర్చి, పేర్చి, పాల
తోనుడకించి, గ్రందుకొనుతత్సారకషాయంబు మొదలంటసక్కఁ బోయ
మామిడిచెట్టు సమంచితఫలపుష్పసంపదఁ గ్రాలు; మేషంబుపాలసు,
వెంద్రుకలుగూర్చి, ధూపంబు వెట్టి, మఱియు
దాని మాంసపునీటితోఁ దడుపనైన
మంచిఫలమిచ్చు దానిమ్మ మహితపుష్ప
పల్లవోత్కర సారసంపన్నమగుచు. ౫౭౨

వ॥ వెండియు.

క॥ ఉలవలచూర్ణముతోఁ జే
పలు జేరిచి, యుడుకఁబెట్టి, పసఁ బొల్చిన త
జ్జలము మొదలంట బోసిన
మిలమిలమని మెఱయు దాడిమీతరువు కడున్. ౫౭౩

తే॥ గుడము, గోమాయుమాంసంబుఁ గూర్చి, యెరువు
వెట్టి, యా నక్కమాంసంబ వేమరుఁ బస
తోలఁగఁ గడిగిననీరు పాదునకుఁ జేర్ప
మాతులుంగంబు ఫలరమామహిమఁ గ్రాలు. ౫౭౪

తే॥ అదియు, నిదియు, ననఁగనేల ? నఖిలజంతు
మాంసజలములు లోకసన్మాన్యఫలస
మృద్ధికరముల నారంగి ; కేపుమీరఁ
బెరుగునది, వెండియును బుష్టిపేర్మి వెలయు. ౫౭౫

తే॥ వెలయ నాషాఢమునఁ బాదు వెట్టి, తెలక
పిండి నెరువుగనిడి, మన్నుఁ బేర్చి, గడ్డి,
గాదరలనేర్చి, తోలఁగింపఁ, గాయుఁ, గొమ్మ
లెల్ల విరుగంగ నిమ్మచెట్టేపు మెఱయు. ౫౭౬

తే॥ వర్షకాలంబునన్ బ్రతివత్సరముఁ బు
రీషమున్ మొదలంటఁ బేర్చి, మఱి మన్ను
గప్పినన్ జాలు, మిక్కిలి గ్రాలుఁ బోక
చెట్టు, మఱియు ఫలోత్కర శ్రీరహించు. ౫౭౭

తే॥ దంతచూర్ణానలమున సంతప్తమగు న
యశ్చలాకంబుతోఁ, గెల నంటఁ బొడువఁ,
గాయ లింతలు నంతలున్ గాక సెప్ప
నొప్పుఁ గదళికి ; మిక్కిలి యొరపు సూపు. ౫౭౮

తే॥ ప్రాతపేడ యెరువుఁ, దుషభస్మమును, మ
నోజ్ఞ రూపంబ్బు, బుష్టిని నూత్నకాంతి
గౌరవము, సత్ఫలోదయసారవైభ
వంబుఁ, గదళికిఁ గూర్చు సర్వమున కగుచు. ౫౭౯

తే॥ శశపురీషంబు, మఱియు మాంసంబును, సరి
పాళ్లఁ గూరిచి, యెరువుగాఁ బాదునిండఁ,
బేర్చి, పూడ్చిన మధురసస్ఫీతఫలస
మృద్ధి ద్రాక్షయొసంగుఁ, బేర్మికిఁ దగంగ. ౫౮౦

తే॥ మినుము లుసిరికలకు సాలమేలుఁ గూర్చు;
బాలతిందుకములకెల్లఁ బాలునీళ్లు
సారకములు; సకలవృక్షంబులకును
మృదుతరంబగు భూమియ వృద్ధి నొసఁగు. ౫౮౧

తే॥ మూషకవరాహముల క్రొవ్వు మొదళ్లుల నిడి,
నేయి ధూపంబువెట్టిన, నాయతఫల
భారనమ్రంబులగు, సౌరభమునఁ గ్రాలు,
నెల్లలతలును బేర్కొన నెంతయుఁ దగి. ౫౮౨

## వృక్ష చిత్రీకరణము.

తే॥ అంచి తాంకోలతైలంబునందుఁ, బద్మ
బీజచూర్ణముఁ దగనానబెట్టి, పిదప
జలము నం దిడ, సాల నాశ్చర్యమొదవ
నందుఁ గమల లతలుపుట్టు నాక్షణంబ. ౫౮౩

క॥ నీలోత్పల బీజము లం
కోలంబులతైలమందుఁ గూర్చి, తడిపి, స
న్నీళ్లులఁబెట్టిన యప్పుడ
సాలుగ నవి పుట్టి, పెరిగి, సక్కఁగ బూయున్. ౫౮౪

తే॥ అరయ నంకోలతైలంబ యఖిలబీజ
కోటికిన్, దన సోకునఁగూర్చు వాని

వానికిన్ దగు జన్మసత్వములఁ దత్త్వ
ణంబ మాయ తెఱఁగున, మంత్రంబువోలె.            ౫౮౫

తే॥ నందితాంకోలతైలంబునందు నూరు
తడవులు తడిసి, కరకార్ద్రితలమునందు
విత్తవడినట్టి యేచెట్టు విత్తునేని
యాక్షణమ యాకులున్ గొమ్మ లలరఁ బుట్టు.            ౫౮౬

చ॥ గొనకొని యేర్చి, పేర్చి, పులిక్రొవ్వున నర్వదినాల్గుమార్లు మ
ర్దనమొనరించి, యిచ్చలుఁ బదంపడి యాడుగనూనె నేమ మా
ర్లనువుగ నానవెట్టి, మఱి యాతపశుద్ధియొనర్చి, పెట్టఁజే
ర్పనయిన బీజముల్ సెడవు, బాగుగనుండు ననేకవర్షముల్.  ౫౮౭

క॥ వేలకొలఁది వత్సరములు
మూలంబులు మఱియు బీజములు నీక్రియచేఁ
గ్రాలున్, సెడ వనిరి ఋషులు
సాలపరిశ్రమముఁ జేసి జగమెఱుఁ గంగన్.            ౫౮౮

తే॥ దాసనపుఁజెట్టు పాలుపోతన్ దనర్చి,
పూయుఁ దెల్లనిపూవు లద్భుతమెలర్పఁ;
దెల్లని విరుల చెట్టుల వ్రేళ్లఁ దేనె
వెట్ట నెఱ్ఱని పూవులె పుట్టుఁ బిదప.            ౫౮౯

క॥ విలసిల్లు నప్పుడ మహిష
మలమూత్రములందు సప్తమర్దనములఁ బెం
పలరిన కువలయ కందము
జలంబులంటుట్లయు వృద్ధిసత్వఘనంబై.            ౫౯౦

చ॥ మునుకొని గోమయంబునను మూత్రమునందును బెక్కుమార్లు మ
ర్దన మొనరించి, నాటి, యుచితంబుగ మాంసము నీరుఁ, బంది క్రొ

వ్వ, నెపుడుఁ బోయఁ బోయఁ దగఁ బుట్టుఁ బదంపడి ప్రత్తివిత్తునం
దున విన్ను ! నిమ్మమొల్కు; మఱి తోఁపదు ప్రత్తిగుణంబు దానికిన్.

తే॥ పోల నెఱ్ఱనిపూవులు బూయు చెట్టు
వ్రేళ్ళకుఁ గనేయి వెట్టినఁ, దెల్లని విరు
లెప్పుడున్ బుట్టు; ని ట్లవి యొసఁగుటకు ని
రంతరము శ్రద్ధవలయుఁ; గా వనుట కాదు. ౫౯౨

వ॥ పారిజాతవృక్షమూలంబునందు గంటువెట్టి, యందు మల్లె తీవఁ
దూర్చి, మెత్తని మన్నుఁ జేర్చి, కప్పిపుచ్చి, జలంబు వోయుచు,
నారెండు నంటికొన్న పిదప, నమ్మల్లియమూలంబు దెగఁగోసి,
పాఱవైచి, మఱల మన్నుఁ జేర్చి, యది వాడకుండ నీరు వోయఁ
బోయఁ, గొన్ని దినంబులకు దానియందు మనోహరసుగంధబంధు
రంబులగు యెఱ్ఱనిపూవులు దోఁచు; నిది సేఁతకు మిక్కిలి శ్రమం
బనవసరంబు; వెండియు నెయ్యే వర్ణంబుల జలంబు, లెయ్యే విత్తు
లకుఁ బోసి, ప్రోదిసేయుదు, రయ్యె వర్ణంబుల మనోహరంబులగు
పుష్పంబు లయ్యె వృక్షంబులందుఁ బుట్టు; మఱియును. ౫౯౩

తే॥ ఎమ్ములఁ దనర్చుచోటుల నెసఁగుచుండు
తెల్ల జిల్లేడు చెట్టులకెల్లఁ బుట్టు
నెప్డు నెఱ్ఱని పూవులె; యేపువట్టి
పెరుగు నవి; కాని వాసన తఱిగియుండు. ౫౯౪

తే॥ తేనె తోడను, నేయితో, దీక్ష వట్టి
వంగవిత్తులనేర్చి, భావన యొనర్చి,
నాట, నవి యేపువట్టి, నానాఁటఁ బెఱిగి;
యెలమి మిక్కిలి పెద్దకాయలను గాయు. ౫౯౫

వ॥ కువలయ కందంబున కధోభాగంబున ఘృతంబును, మధువును బట్ట
నిచ్చి, మఱి యేవర్ణంబు లేపనంబుసేయుదు ? రావర్ణమ దానిపూవు
లందుఁ దోఁచు ; నం దన్యవర్ణంబునకుఁ దావులేదు ; వెండియు
నే జాతి బీజంబునేనియుఁ, బదిదినంబులుదనుక నేయిఁ బట్టనిచ్చి,
ప్రతిదినంబును బాల నాననిచ్చుచుఁ, బేడన్ బిసికి, సూకరహారిణ
మాంస ధూపంబుల నెసఁగించి, యజాసూకరమేదో రసంబున
మర్దించి, యిమ్మగుచోట విత్తి, పాలుఁ గలిపిన నీళ్లులు బోయన్
బోయ, నది సకుట్మలంబును, సోజస్ఫారంబునునగు మొలకయై
కన్పట్టి, యా క్షణంబ రేకెత్తి పూయన్ దొడంగు, మఱియును.

తే॥ యవలు, నూవులుఁ, బసపుఁజెట్టాకు, నెరువు
వెట్టి, యుచితంబుమై బాదు వెడల నీరుఁ
బోయఁ, దగఁ బ్రత్తిచెట్టునఁ బుట్టు నూడ
నగుచు నెఱ్ఱనిదూది యింపార నెసఁగి. ౫౯౭

వ॥ త్రిఫలంబులును, జెంగల్వకోష్టును, కల్లును, నీలియుఁ, బసుపును,
బూరుగుచెట్టు తోలును నూరి, ప్రత్తిచెట్టునకు లేపనంబు సేయన్
జేయ, దానికి జిలుకఱెక్కచాయన్ మించు మనోజ్ఞ పీతవర్ణ వర్ణనీయ
మృదులతరతూలపుంజంబు బుట్టు ; వెండియు మంజిష్ఠయుఁ, దిల
లును, యవలును, జీవంతీదళంబులును తింత్రిణీబీజంబులును నెరు
విడి, గోమేషచ్ఛాగిక్షీరంబులు పోయన్ బోయ, నా చెట్టునంద
చారునీలవర్ణభాసమాన తూలోత్పాదనం బగు ; నింకఁ బక్వేక్షురసం
బు బోయుచుండ నే చెట్టునకైన నకాలపుష్పఫలసంప్రాప్తియగు,
నిత్తెఱంగున. ౫౯౮

తే॥ గోమయంబుఁ, దిలలుఁ, గడుగును, విడంగ
ములు, నెరువువెట్టి, సంతతమున్ జెఱుకు ర
సంబు వోయంగ, నేపుమై నక్క బూయుఁ,
గాయు, నే చెట్టునేని యకాలమంద. ౫౯౯

తే॥ తేనెయుఁన్, దిలకష్ఠ, లతిమధురంబు,
నిప్పపూవులు నూరి, పెన్లేర్చి, యెరువు
వెట్ట మంచిఫలంబులు బుట్టు, టెంక
యనుట లేకుండఁ జెట్టున కద్భుతముగ. ౬౦౦

వ॥ కూశ్మాండ వార్తాకవ టోవికాది బీజంబులు వసాభావితంబులుఁగాఁ
జేసి, నాటి, వసాజలంబునన బ్రోదిసేయ, వానియందు విత్తులులేని
కాయలు పుట్టు, వెండియు. ౬౦౧

తే॥ అమర నంకోలఫలకషాయమున నేని,
యేదుఁ బందిరుధిరమందు నేని, నఱఁటి
చెట్టు వేళ్ళెల్ల మునుఁగంగఁజేయఁ, బుట్టు
నందు దానిమ్మపండ్లని కొందఱండ్రు. ౬౦౨

తే॥ వితత శశకూర్మరక్తభావితమునై, యె
సంగు మామిడిచెట్టు బీజంబు నాటి,
పాలుఁ బోయంగ, బోయంగ, ఫలమొసంగు
చుండు నదిపుట్టి, యెప్డును బెండువడక. ౬౦౩

తే॥ మనుజరక్తామిషములు, సామజము దంత
చూర్ణముఁ, గలిపినజల ముద్దీర్ణభంగిఁ
బోయఁ, బోయ, నరఁటియందుఁ బుట్టు నామ్ర
ఫలములండ్రు పరీక్షించి, పరమబుధులు. ౬౦౪

ఆ॥ వింటె ! ప్రకృతిసృష్టి వేవిధంబుల మార్ప
నగుట ? నిట్టు లిచ్ఛకైసభంగి ?
నిట్లు మార్పఁ బుట్టు నెల్లవృక్షములును
గ్రొత్తజాతివగుచుఁ గోమరుమిగులు. ౬౦౫

క॥ నా తెలిసినంతవట్టున
నైతిహ్యము నూఁది చెప్పి ; తవి నిజమునకుఁ
సూతము పరీక్షఁజేసియు ;
యే తెఱఁగున నిట్టిమార్పు లెనఁగెడి నోకో ? ౬౦౬

ఆ॥ ఎంతయేనిదీక్ష యివ్విషయంబునఁ
బట్టి, చేసి, నేసి, యట్టె గాన
నైరి తొంటిపెద్ద ; లవి కావనన్ రాదు ;
చేసి, చూచుటొప్పుఁ జెప్పినట్లు. ౬౦౭

క॥ చేయుట యందును దప్పుట
యేయెడలన్ గాదు ; తప్పి తేనియును సెదున్
నీ యరయనైన విషయము ;
పాయ జనదు దీక్షఁ ; బట్టు పట్టనవలయున్. ౬౦౮

క॥ చెప్పెడివార లొకించుక
తప్పనయిన, మనము సేయఁ దప్పనగుదు ; మీ
చొప్పున దీనఁ బ్రమాణము
చెప్పెడివార యని తేల్చి, సెప్పఁగ నయ్యెఁ. ౬౦౯

క॥ ఎరువులు కడు ముఖ్యములగు
పరిసరములు వృక్షములకు ; బాగున కెట్లున్.
జొరనైరి తత్ప్రభావం
బరయుమి మనకావువార లశ్రద్ధమెయిఁ. ౬౧౦

క॥ తప్పన్ బంటల కెరువులఁ
దప్పనయిన కర్షకుండు ; తఱికిన్ గూర్పన్
జొప్పడు తెఱంగు మే ; లది
సెప్పితి ము న్నింతదనుక ; సేయనవలయుఁ. ౬౧౧

## ఆరామావశ్యకతాది వివరణము.

ఉ॥ మానవకోటికెల్ల గరిమన్ దగు కృత్యములైన సప్తసం
తానములందుఁ, దోఁట లుచితంబులు ; శాంతినికేతనంబులున్ ;
జ్ఞానవిశేషభాగ్యవిలసన్మహనీయ విశుద్ధకాంతిసం
స్థానము ; లర్థసిద్ధి సుఖదంబులు ; వెండియు భోగయోగ్యముల్.
తే॥ పెక్కు ప్రాణులు జీవించుఁ బేర్మినెగడు
తోఁటలందు ; విశిష్ట వస్తువుల యందుఁ
బేరుకొందురు వానిని పెద్దలు మును
"భుక్తిముక్తుల కవి దేవభూముల" యని. ౬౧౩

క॥ కృత్రిమ వనంబు లనఁగఁ, బ
విత్రస్థానంబు లనఁగ, వెలయు నవి సుధీ
స్తోత్రములకుఁ బాత్రములై
ధాత్రిన్ వనదేవతాసదనతాగరిమన్. ౬౧౪

క॥ నానావిధతరుకుల సం
స్థానములై వెలయు నెప్డుఁ దగుఁ దోఁటలు ; లో
కానుభవయోగ్యముల యగు
వానిన పేర్కొంద్రు బుధులు వానిన్ సాలన్. ౬౧౫

తే॥ వాతపిత్తకఫాదులు, ధాతు నాడి
కారసాదులు వానికిఁ గలవు మనకుఁ
బోలెఁ ; గావునఁ దెవుళులు పుట్టుచుండు
నప్పు డప్పుడు తరువుల కాడనాడ. ౬౧౬

క॥ కానఁ జికిత్స యవసరము
వానికిఁ ; గృషికుండు వృక్షవైద్యకళావి
జ్ఞాని యగుట యది మే లెం
తేనియు ;- నతఁ డట్టిఁ డైన నెసఁగున్ దోఁటల్. ౬౧౭

తే॥ ఎల్ల మానవకోటికి నెప్డుఁ జెట్లె
యంతకుఁ జాలియుంట నొండైనఁ, బదియు
నైనఁ, బెక్కైనఁ బ్రతిమానవుఁడును
తరువులఁ బెంపుసేఁత సద్ధర్మ మరయ. ౬౧౮

క॥ తా నెన్ని చెట్లఁ ద్రుంచుఁ?
మానక పుట్టింపవలయు మానితధర్మం
బూని నరుం డన్నియ; పె
క్కేనియు; నిది యీశ్వరాజ్ఞ యెల్ల జగమునఁ. ౬౧౯

క॥ త్రుంచుటయ కాని, మఱి పు
ట్టించుటకుఁ జెట్ల సాలఁ డే నరుఁ? డాతం
డంచిత ధర్మాత్ముండని
యెంచవడఁడు; ధర్మసిద్ధి యె ట్లతని కగుఁ? ౬౨౦

ఆ॥గీ॥ చెట్టు నెంత పెంపుసేయు మానవుఁ? డంత
పేరుఁ బెంపు నతఁడు పేర్మిఁ బడయుఁ;
దగ నరునికినైన ధర్మంబులం, దిది
పెద్ద ధర్మమండ్రు పెద్ద లెల్ల. ౬౨౧

ఆ॥గీ॥ ఎట్టు మఱువవచ్చుఁ జెట్ల నరుం? డవి
యెంత కేని సాలి, యెప్డు నెట్టి
శక్తి వంచనకు నెసంగక, తగుఫల
మొసఁగుచుండుట తెలియుదుము కామె. ౬౨౨

క॥ వాఁడియును, దినఁ జాలమిఁ
బోఁడిమిఁ దూల్గియును, మన కెపుడు నొసఁగన యొం
డాడని చెట్టు లెసంగఁ,
గీడుఁ దలఁప నగునె వానికిఁ గలనేనిఁ? ౬౨౩

సీ॥ శాంతమై జీవరస ప్రవాహంబు నాడీజాలములయందు డీలువడఁగ,
వాయుస్థితానేక వస్తుసమాకర్షకములై యెసంగు పత్రములు కమర,
సూర్యబింబప్రభాస్ఫురణప్రవర్ధమానఘనచైతన్యవినాశ మొదవ,
భూరసగ్రహణప్రభూతమూలములు ప్రాకినవిప్రాకినయట్ల క్రిందనిలువ

వర్షలోపంబునన్ జేసి, వాఁడియు, సుడిఁ
దేటియును జూడనగుఁ గాదె తీగె, యొకఁడు,
రెండునేని యు మొగడలర్పించి, ప్రకృతి
దేవతారాధన యొనర్చు తెఱఁగు వత్స! ౬౪

ఉ॥ చెట్టులఁ గూర్చి యెంతయును జెప్పినఁ జెప్పఁగ నుండు సాల నిం;
కెట్టులనేని యిప్పటికి నింతియ సాలుఁ; గృషిన్ గుఱించి యి
ప్పట్టున సెప్ప నున్నయది బాగుగ నించుక; కానఁ జెప్పె; దీ
వట్టిటు దృష్టి వెట్టక, ప్రియంబు మెయిన్ విను! మేకదీక్షతోన్.

ఆ॥గీ॥ ఒక్కయేఁడునంద సక్క ఫలించి, నా
శంబు నొందు వాని "సస్యము" లని
వృక్షజాతియందు నేర్చి పల్కిరి తొంటి
పెద్దవారు పెక్కువేళ్ళుఁ దడివి. ౬౬

తే॥ ఇంక నడవులలో మన మేర్చి కొనఁగ
నైన సస్యంబులున్ గల వరయఁ బెక్కు;
లవియు కాక విదేశంబు లందును గల
వెన్నియేనియు విను! మన కెఱుఁగరాక. ౬౭

క॥ అవియు నివియుఁ, దెప్పించుకొ
నవలయు మన; మేఁటి పెంపనక బోలదు; మా
నవకోటి కెప్డుఁ బనికగు
నవియన్నియుఁ గావ కూర్చునాతఁడు; కానన్. ౬౮

ఆ॥గీ॥ అబ్దమొండు నిండునంతకుఁ బండు స
స్యంబులందుఁ జెఱుకు, నఁటి యును వి
శిష్టతరము లనుచుఁ జెప్పుదు ; రవి కృషి
యందు నింపు సొంపు నలరఁ గ్రాలు. ౬౨౯

ఆ॥గీ॥ తినఁగఁ, గట్టఁ, దీయఁ దనమునకున్, మందు
లకును, మఱియు నూనెలకును, సాయ
లకును సస్యములు వెలయు నారు తెఱఁగులై
వినుము ! వానినెల్ల విస్తరింతు. ౬౩౦

తే॥ అరయఁ బల్లఁపు ధాన్యంబు లనియు, మెట్ట
ధాన్యములనియు రెండు విధముల నొప్పు
నెల్ల ధాన్యంబులును ; వానినెల్లను దర
తరము విభజించి మఱి చెప్పెదన్ దగంగ. ౬౩౧

తే॥ అనఁటి చెట్టులు సస్యంబులయ్యుఁ, దోఁట
లందుఁ జేర్చితి నౌచిత్య మరసి, వానిఁ
బెంచు విధమును తోఁటలఁ బెంచునట్లు
యగుట, బోధనసౌకర్య మలవడంగ. ౬౩౨

తే॥ అనఁటి తోఁటలు కాపుల కర్థరాశు
లంద్రు పెద్దలు ; నిజమున కట్టివ యవి ;
యఱఁటిచెట్టు సమస్తావయవము లోకఁదు
రిత్తవో కెప్పుడు నుపకరించు సాల. ౬౩౩

కదళీవన ప్రసంశ.

తే॥ ఆకుఁ, గాడయుఁ, బూవును, రేకుఁ, గాయ ;
పండుఁ, గందము, దవ్వయుఁ, బైపొరలును
మనుజకోటికి నెంతయుఁ బనికినగు, నె
ఱుంగుదుము కాదె ? యెవ్వ రెఱుంగ రుర్వి ? ౬౩౪

క॥ సకలాంగములును సాల ప
నికినగు ఛరు వెయ్యదోకొ యని యరయు ధీ శా
లికి "నేన సుమ్మ" యన వృ
క్షకులమునందెల్ల నసఁటి కానంగ నగున్. ౬౩౫

క॥ పుట్టెడు నేల ననంటులఁ
బెట్టనయినఁ జాలుఁ; గాపు పేరునకుఁ దగన్
గట్టఁ దిన, వెట్టు నాతని
కట్టిటు గాక యవి; మఱియు నర్థముఁ గూర్చున్. ౬౩౬

చ॥ ప్రకృతి విలాససారరుచిరత్వము గ్రాలుచునుండు మాటిమా
టికిఁ గదళీవనంబులన డీల్వడుచుంద మొకప్డుఁగాని వో
లిక; నునుగాలితాకునఁ జలించెడు వానిబెడంగుఁ గూర్చి సె
ప్పక మఱి తప్పునే పరమభావవిశిష్టకవీంద్రకోటికిన్. ౬౩౭

సీ॥ ఒకరేకువిచ్చుటయునుసూడనై, దానిక్రిందసొంపెసలారుపిందెచాలుఁ
బిందెచాలున కింపుఁ, బెంపును నేకూర్పనై, మృదుకేసరాకృతులును
గేసరాకృతులకుఁ గ్రింద మరంద బిందువులచే నిండిన దొప్పగమియు
దొప్పలగమిఁ బారఁదూరి, తేనియఁద్రావి, యాటలఁబాటల నడరు నళులు,
నళులు ముసర ముసర, నసితచ్ఛవి కళంక
మై యెసంగ నెసఁగ, నరుణకాంతి
పూరగౌరవమునఁ బొలచు పూవులచెల్వుఁ
జూపు నరఁటితోఁట, కాపు పేట. ౬౩౮

క॥ కల వనఁటులందుఁ బలు జా
తు; లన్నియును వలసియుండుఁ దోఁట; కొకప్డున్
వల దవి యొక్కఁ డొకండున్
గలియఁ బులిమిబుచ్చు; వెడము గల్గన వలయున్. ౬౩౯

క॥ ఎరువుల పస యెప్డు వలయు
నజుఁటులకుఁ, నీటిపసయు నావశ్యకమై
పరగుఁ; గలుపు తీయుట మే;
లరయవలయు నవియెసంగు నట్టివడువులన్. ౬౪౦

క॥ తెవుళ్ళులును గల వసంటుల;
కవి సోఁకని భంగి నూచు టదిమే; లొకఁటిన్
దవిలిన తెవు లన్నింటిన్
దవులుట నిజ; మేల నవ్విధమునకు విడువఁ? ౬౪౧

క॥ ఏపు సెడుఁ, దెవులువట్టిన
రూపఱు, మఱి యనఁటి; యప్పరుసకు వలయున్
మాపుఁ రేపుఁ జికిత్సలు
కావున; కేమియును మేలు కలుగదు దానన్. ౬౪౨

వ॥ అనఁటిచెట్టువలన నగుమే లెంతయుఁ గొనియాడనై యుండు; నైన
నిప్పటి కిమ్మాత్రన సాలించి, ధాన్యవిశేషంబులన్ గూర్చి చెప్పెద;
నాకర్ణింపుము. ౬౪౩

కుళుత్థమాషముద్గాది శమీధాన్యజాతి విశేష వివరణసంగ్రహము

తే॥ మంచు వలనన యెసఁగుచు మంచిఫల మొ
సంగు నులవలు; వానికి సారవంత
మైన నేలలు, నమ్మోయిఁ గాని నేల
లైననున్ జాలుఁ; గలుపున నణఁగి సెడవు. ౬౪౪

తే॥ నల్లనివి, తెల్లనివియును నాఁగ రెండు
జాతులై యొప్పు నవి; పశు జాతికెల్లఁ
బుష్టికరమైన మేఁత సేఁ బొలచు; మఱియుఁ
బేదవారికి మిక్కిలి ప్రియముఁ గూర్చు. ౬౪౫

క॥ ఉలవల పొడియును, బప్పును,
బలు తెఱఁగుల కూరలకును, బచ్చళ్ళకు మి
క్కిలి పేదల సొమ్ములు నా
వెలయున్ ; వానికి నెరువులు వెట్టుటయుఁ దగున్. ౬౪౬

ఆ॥గీ॥ గంజి గ్రాచికొని తగన్ ద్రావుదురు పొట్ట
లెండ నులవలపొడి నెల్ల పేద
వారు ; మొరకలంద వర్ధిల్లు నవి ; పద
నైన-చోట్లఁ బెరుగ, వణఁగి నచ్చు. ౬౪౭

తే॥ నల్లనివి, పచ్చనివియును నాఁగఁ బెసలు
రెండు తెఱఁగుల నొప్పారుచుండు ; వాని
పప్పు లింపారుకూరలై పఱగు ; మేల్మి
భక్ష్యములకు నగున్ బహుభంగుల మఱి. ౬౪౮

వ॥ ఇవియు మెట్టనేలలంద సామాన్యంబుగ వృద్ధిఁగాంచు ; నైనను
గొన్ని దేశంబుల వారలు నంజలందు శాలిసస్యంబు లయిన పిమ్మటఁ
బచ్చపెసలు విత్తి, పండించుటయుఁ గలను, వెండియు. ౬౪౯

క॥ మినుములును మెట్ట నేలలఁ
బెనుపున్ గను మంచువలనఁ ; బెక్కు తెఱఁగులై
యొనరిన భక్ష్యంబుల కె
ల్లను బని కగు ; నొప్పుఁ గూరలకుఁ, బోపులకున్. ౬౫౦

తే॥ నంజలందును శాలిధాన్యములు పండు
నపుడు విత్తుటయును గల దాడ నాడ
వీని ; నాచేలు సన మఱి వృద్ధిఁగాంచి
సక్క నివి పండు ; విలువయు సాల గలదు. ౬౫౧

తే॥ పసులకున్ గూడ మినుములు బలము సాల
గూర్చునని యంద్రు ; కాపులు కోరికొంద్రు
వీని వడియంబులను విందువెట్టు నప్పు
డతిథులకుఁ, జుట్టలకు, మఱి యాప్తులకును. ౬౫౨

క॥ "కంది నెఱుంగని మనుఁజుఁడ
పంది" యనియు, మఱియుఁ "గందిపప్పురసము మే
ల్వీం" దనియు, నెల్ల దేశము
లందున్ వినవచ్చు దాని యందలి గుణమున్. ౬౫౩

క॥ కందులును మెట్టనేలల
యంద కరము బెరుగుఁ, బండు ; నధికప్రీతిన్
గొందురు వీనిన్ విను ! ప్రజ
లందఱు ; నివి పెక్కు తెఱఁగులై యొప్పారున్. ౬౫౪

వ॥ ఎఱ్ఱనివియుఁ, దెల్లనివియుఁ, జారలవియుఁ, బెద్దవియుఁ, జిన్నవియు
నను పెక్కుజాతులు వీనియందుఁ గల ; వివియన్నియుఁ బ్రజలకు
మిక్కిలి యుపకరించునవియ యని యెఱుఁగుదుము, వెండియు.

తే॥ కందిపప్పును నేయియు విందు ; లేఁటి
విందుభోజన మీ రెండు వెలయవేని ?
వెల కలదు సాల యెప్పుడు వీని, కెల్ల
వారు నీ రెండుఁ దినఁగోరు వారలగుట. ౬౫౬

క॥ మంచును వర్షజలం బా
క్కించుకయును గంధ్విచేల నెంతయుఁ బెనుపున్
గాంచునటులఁ గావించు, న
మంచితపరిసరములగుచు నదనునకుఁ దగన్. ౬౫౭

తే॥ పెద్దజాతికందులఁ బైరుఁబెట్టువారు
భిల్లజాతులవారల ప్రియముతోడఁ
గొండలం; దవి యచ్చట బెండు వోక
పెరుగు; మంచిఫలము నిచ్చుఁ బేర్మికిఁ దగ. ౬౫౮

వ॥ కాపులును గొన్నిదేశంబులందు వీనిన్ బైరువెట్టుటయుఁ గలదు, వెండియు. ౬౫౯

తే॥ కందికాడల నేర్పుమైఁ గాల్చి, మంచి
బొగ్గులఁ బడయనగు; నవి పొల్చు సాల
వెలకు; నీకీలుఁ గాపులు తెలిసి, సొమ్ముఁ
గూర్చికొను టెంతయును లెస్స కోరినట్లు. ౬౬౦

క॥ అనుములు, నలసందలు, మఱి
శనగలుఁ బేర్కొనఁగఁ బెక్కుజాతులు కల; వె
ప్డును వీని యవసరముఁ గా
దనఁ జాలము; మెట్టనేలలం దివియు నగున్. ౬౬౧

క॥ జనులందఱు వీని నెపుడు
ననేకవిధభక్ష్యములుగ నతినేర్పు మెయిన్
బొనరిచికొని తిందురు; మఱి
యనుకూలతవెలయఁ బప్పులగు నివియెల్లన్. ౬౬౨

క॥ పసులకు నివిపెట్టఁ గడుఁ
బస పుట్టగఁ జేయు; మంచుపాటునఁ గరమిం
పెసఁగఁ బెరుగు; వెలయుఁ గలదు;
వెస నెండవు వానలేమి, వేసవినేనిన్. ౬౬౩

ఆ॥ గీ॥ వీని పొట్టులఁ దినవెట్టనైనన్ బాడి
పసరములకుఁ బుట్టుఁ బాలు సాల;

కూరలందు వీనిఁ గూర్తురు మఱియును
జవులు పుట్టఁగోరి సక్కసగము. ౬౬౪

తే॥ పెక్కుదేశంబులన్ జాలపెంపుఁ గాంచు
చున్నయవి గోదుమలు ; వాని నొల్లని ప్రజ
లెందునున్ లేరఁట ! జగంబునందు వానిఁ
దినుచు సక్కసగముమంది మనుట నిజము. ౬౬౫

తే॥ వివిధభక్ష్యంబు లగునఁట ! వెరవుమెయి నొ
నర్ప నెవి ; పేరుఁగొన్న ధాన్యంబులందు
వానిపేరును మిక్కిలివాసికెక్కి
యున్నయది ; పండు సక్కగా దున్ననైన. ౬౬౬

క॥ పలుజాతులు కలవందురు
వెలయఁగ గోదుమలయందు ; విను ! మవిపండున్
బలముఁ, బసపెంపును గల
పొలంబులన ; కావఁట ! మరు భూముల నెట్లున్. ౬౬౭

తే॥ మంచుపాటునకున్ బసమూరని వలు
మెట్టనేలలయందును బుట్టి, పెరిగి,
సాలఫలమిచ్చు నవి ; కాని సారనిమ్న
భూతలంబులె వానికెప్పుడును లెస్స. ౬౬౮

క॥ విను నీరుపాటు, మఱి తడి
యును వానికినైన పరిసరోత్తమములు రెం
డును ; దక్కనొగలయవి యె
ల్లను వానికిఁ బిదపఁగావలయు నవియ తగన్. ౬౬౯

ఆ॥ గీ॥ పసరములకు మంచి బలమిచ్చు వానిపొ
ట్టుఁ దవుడును ; జెప్పఁడుట యెఱుంగ
కుండు ; మఱియుఁ జాల నొప్పు మేఁతకు దంటు
గడ్డివాములు బహుకాల మరయ. ౬౭౦

తే॥ ఎల్లకాలముఁ బండు, నీ కెప్పుడుఁ దగు
మాత్రముండిన సాలు ; సామాన్యపుఁ బ్రజ
లాదరించెదు సస్యంబులందు రాగు
లన్ని విధముల నుతిఁగాంచు నట్టి వయ్యె. ౬౭౧

వ॥ వానకాలమందు మెట్టనేలలును, వేసవియందుఁ బల్లపునేలలును, రాగులకు వలసియుండు ; మఱియుఁ బెక్కుజాతులు వానియందును గలవు ; వత్సరంబు పొడవున మూఁడుపంటల నొసంగు ; మేకలయు, గొఱ్ఱెలయు, శకృన్మూత్రంబులు వానికి మంచిసారంబు నీయఁ జాలియుండు, సర్వసాధారణంబుగ గాపులును బేదలును దినంబున కొక్కపూట వానివలనన జీవింపుచున్నవారనుట యసత్యంబు కాదు, పసరంబులకును రాగులు పుష్టికరమైన యాహారం బని నిర్ణయింపనయ్యె, వెండియు. ౬౭౨

తే॥ చామలందును విను ! పెక్కు జాతులు గల
వండ్రు ; కాపులు, బీదలు నారగింతు
రిచ్చలున్ వాని యన్నము ; నెప్పుడు నవి
మెట్టనేలలయంద పేర్మిమెయి వెలయు. ౬౭౩

తే॥ మంచు పాటును, సర్వసామాన్యమైన
వానపాటును వానికి వలసియుండు
ధనికులకుఁ గావు ; కావునఁ దఱచుగ వెల
రాదు వీనికి ; బేదల బ్రదుకున కగు. ౬౭౪

ఆ॥గీ॥ సజ్జలందుఁ గలవు జాతులు పెక్కులు ;
మెట్టనేలలంద మిగుల వృద్ధిఁ
గాంచు ; వీనికూడుఁ గాపులు, బీదలుఁ
దిందు రెంతయేసిఁ, దృప్తి ననరు. ౬౭౫

వ. సజ్జల జావ పసరంబులకును బుష్టికరమైన యాహారంబు ; వీని దంటుఁ గాఁడ లేర్చి, మోపులు గట్టి సంగ్రహించికొని పేదవారు తమపసరంబుల మేఁతకును, గుడిసెలఁ గప్పికొనుటకు నుపయోగింతురు, మఱియును. ౬౭౬

తే॥ కొఱ్ఱలును మంచిఫలమిచ్చు ; మిఱ్ఱునేల
లంద యభివృద్ధిఁగను ; వీని యన్నము కడు
మృదుతరం ; బెంత దిన్నను మేల ; యెన్నఁ
డరుగు బాటునకున్ గాద యనుట వినము. ౬౭౭

క॥ చులకని సస్యం బిదియని
తొలకరి యగునప్డ విత్తుదురు దీనిన్ గా
పులు ; వారి కోరికెకుఁ దగ
ఫలము నొసఁగు మూఁడునెలల పట్టున నిదియున్. ౬౭౮

క॥ జొన్నలుఁ బలు జాతుల వై
చెన్నెసఁగున్ ; గాపు శ్రద్ధఁ జేసి దివురనై
న, న్నేఁడ, రేప, యనరా
కన్నిదినంబులును వెలయునవి యైయుండున్. ౬౭౯

క॥ వేసవిఁ దడివెట్టవలయు ;
గాసికి నోర్వ ష్ణవి ; యెల్లకాపులు నిచ్చన్
జేసి యొనరించు సస్యము
లై, సక్కఁగఁ బండు ; వేగ నమ్ముడు వోవున్. ౬౮౦

తే॥ వాన కాలంబునఁ విత్తవలయు మెట్ట
నేలలన్నియు వేసవిన్ గొంత నీరుపడువుఁ
గల పొలములందు విత్తుట కార్య ; మిట్లు
లెల్లకాలంబులం దివి యెసఁగుచుండు. ౬౮౧

తే॥ జావలకు, సన్నమునకు, భక్ష్యంబులకును,
బనికి నగు జొన్న ; లింపుమై బసరములకు
వీని దంటు నుపకరించు ; వెలయుఁ గలదు ;
వండునేలల నివి క్రొవ్వువట్టి పెరుగు. ౬౮౨

తే॥ "కాపు బ్రదు కాఁకమెతుకు కాదె" యండ్రు
పలువు ; రప్పల్కు నిజము ; భూపతి దురాత్ముఁ
డైన, నప్పిచ్చి నాతఁ డత్యాశకుఁ దఱి
వేచువాఁడైన, మఱి కాపు వెలయు టెట్లు ? ౬౮౩

క॥ ఆరికపంటన్ మిక్కిలి
గారవమున నూతు రెల్లకాపులుఁ దమ యా
హారములం దిది మిక్కిలి
సారతరంబైనద యని సక్కనరయుచున్. ౬౮౪

తే॥ మెట్టనేలల యం దిది మిగుల బలిసి
పెరుగు ; మంచిఫలము నిచ్చుఁ ; బేదవారుఁ,
గాపులుఁ దీని యన్నంబుఁ గడుఁ బ్రియమునఁ
దిందు ; రతిపుష్టికరమని తెలిసికొండ్రు. ౬౮౫

ఆ॥ కంకి-విఱుగఁ బండఁ గలసస్యముల యందు
నారికయ నుతింప నైన దండ్రు ;
సక్క దీని వోలె సాల ఫలం బిచ్చు
సస్య మొండు లేదు జగతి యందు. ౬౮౬

క॥ ఒకపుట్టెడు పొలమున నా
రిక పండినఁ జాలు బ్రదుకుఁ బ్రీతి వెలయఁగా
నొకకాపు కుటుంబము ; లే
దు కఱవు ; తినఁ, గట్ట, భయము దోఁపదు మఱియున్. ౬౮౭

తే॥ వానకాలంబునన విత్తవలయు, నేల
మెత్తపడఁ దున్ని యారిక ; మేకమంద
దాని పెంపునకున్ మేలు ; వాన లెక్క-
వగుచున్న నది గాచు దానిసొం పణఁగకుండ. ౬౮౮

క॥ గోదుమలున్ బలె యవలును,
మేదిని నుతికెక్కినయవి ; మిక్కిలి వెలకున్
గాదనక కొందురు జనులు ;
లేదు తరుగు వానికిన్ ; ఫలించున్ జాలన్. ౬౮౯

తే॥ యవల గంజిన రోగార్తులైనవారి
కెల్లఁ, బథ్యంబుగా వైద్యు లిడుదు ; రెంత
యేని మేలుకలదు సూవె దానివలనఁ,
బండు నవి వండునేలల బలిసి సాల. ౬౯౦

క॥ పొడినేలల నవి కా ; వె
వ్వుడుఁ దడియుండన వలయు ; విపులవృష్టులనే
పడఁగియు, సావవు ; జల్లుల
సెడ ; వొక్కింతేని ఫలము నేకొనవచ్చున్. ౬౯౧

క॥ కా పెప్పుడు యవసస్యర
మాపారకృపారసమున కర్షుం డగుచున్
దీపింపవలయుఁ, గృషివి
ద్యాపాండిత్యంబు, లోకమంతయు మెచ్చన్. ౬౯౨

వ॥ మాషముద్గాదులు శమీధాన్యంబులనియు, యవగోధూమాదులు శూకధాన్యంబులనియు, దెలియునది; యింక శాలి ధాన్యంబులన్ గూర్చి యించుక వివరింతు వినుమని యమ్మహాద్విజుం డతనితో నిట్లనియె. ౬౯౩

తే॥ శాలిధాన్యంబులను బెక్కుజాతులు కల,
వొకటి కొక్కఁడు సరిపోలియు, సరిపోల
కయును; నాలుగు వేలుగ గణుతిసేసి
రెలమి నా జాతులను; గొంద ఱెక్కు డనిరి. ౬౯౪

క॥ ఈ జాతులన్నియును గర
మోజమెఱయ వృద్ధిఁబొందు చున్నవిపుడు నా
నా జాతుల నై, వెండియు
నీ జగమం దన్నియెడల నెన్నఁగ నగుచున్. ౬౯౫

తే॥ శాలిసస్యమ తమకు సజస్రముఁ బెను
ప్రాపుగాఁ బల్వురు జనులు బ్రదుకుచున్న
వారు; "వరికూడునకుఁ గాని వాఁడు లేని
వాఁడ" యని లోకులందఱు వల్కువారు. ౬౯౬

ఆ॥ ఒక్కపొలమునంద సక్క బంటలు రెండు
నొసఁగు శాలిసస్య మొక్కయోఁట
నందు రిచటికాపు; లన్యదేశములందు
మూడుపంటలు గొనువాఁడ కాపు. ౬౯౭

తే॥ వత్సరంబుపొడవు నెల్లవారును నరి
కూడ తినఁగోరుటఁ, వారి కోర్కికిఁ దగ,
మంచియెరువులు వెట్టి, సమగ్రఫలము
బడయునది కాపు నిజకృషిప్రౌఢి మెఱయ. ౬౯౮

క॥ చాలవెల కలదు వరి ; కా
చేల సకలసస్యకోటిఁ జెలు వెక్కుడుగాఁ
గ్రాలున్ ; బసరంబులు కల
కాలంబును మేయు వానిగడ్డిన ప్రీతిన్. ౧౯౯

క॥ కాపునకుఁ గులమువేలుపుఁ,
బ్రాపును వరి ; తక్కునుగల పంటలలో ను
ద్దీపింపుచు వరిపంటయ
రూపించున్ లక్ష్మికిది యిరువునాఁగఁ బ్రజల్. ౨౦౦

క॥ పొలమందు వరికి నిమ్మగ
జల మిడుటయు, నప్పుడప్పుడు సమయమెఱిఁగి వే
త్రోలఁగించుటయును, చేర్పన్
వలయున్ మును కర్షకుండవశ్యమును గృషిన్. ౨౦౧

తే॥ పాఱయును, నాఁగలియును, బాపటమును, వరి
పొలమునకుఁ గూర్చుసాధనంబు ; లివి మూడు
సక్క పఱుపని పొల మెంతసారవంత
మయ్యు మంచిఫలము నీక యట్టెయుండు. ౨౦౨

క॥ వరిపంట నెఱుంగని కా
పరయున్, భుక్తికిని ముక్తి, కంతకుఁ గాఁ డం
దురు ప్రజలందఱు దేనిన్
గర మిచ్చయొనర్చువారు కావున జగతిన్. ౨౦౩

తే॥ నీలిసస్యంబు సాల మెన్నికకు నయ్యెఁ
జాయలకునైన కృష్ణసస్యంబులందు ;
మెట్టనేలల దానికి మేలు ; మఱియుఁ
దడి యిగురనైనమళ్ళ నెంతయును లెస్స. ౨౦౪

కడియు, నారుటయున్ గల్గి, వడువు మెఱయు
పొలములందు కసున్ వృద్ధిఁ బొలచి వెలయు. ౨౧౦

తే॥ చక్కగాఁ బొలమంతయుఁ జాళ్ళువార
దున్ని, సరిసేసి, సారవుమన్నుతోడ
నెరువులున్ జేర్చి, తగ నవియెల్ల కలియ
దున్ని, యావయి సరిసేయుదురు మఱియును. ౨౧౧

వ॥ ఇట్లు సరిచేసిన పొలంబునందు చెఱుకు నాటుట మిక్కిలి లెస్స, వెండియు. ౨౧౨

ఆ॥ ఒక్కవత్సరమున కొక్కపంటయువచ్చుఁ
జెఱుకువలన; నైనఁ జేటులేదు;
సాల విలువవచ్చు శర్కరాగుడముల
కదియ యుపకరించు సట్లుగాన. ౨౧౩

క॥ చుట్టుటయుఁ, దఱికిఁ దగఁ దడి
పెట్టుటయున్, మన్నుఁ జేర్చి వెడ వెడ దిన్నెల్
బట్టించుటయును, జెఱుకున
కట్టివలయు; నేర్పు లెస్స యయ్యెపనులన్. ౨౧౪

తే॥ తిలలు, నావాలు, నాముదంబులును, నూనె
యొసఁగు సస్యంబులందెల్ల నుత్తమములు;
పెరుగు నివి మెట్టనేలలఁ బేర్చినట్లు;
మంచిఫలమిచ్చుఁ గాపు వాంఛించు పగిది. ౨౧౫

వ॥ నల్లనివియుఁ దెల్లనివియు, నెఱ్ఱనివియు నను మూఁడుజాతుల తిలలును దొలకరియందును వేసవియందును బండునవియై యుండుఁ, దడిలేకున్నను నీ రెక్కువయైనను నవి చెడు; నల్లిన మూఁడు నెల

వ॥ కొండఱు కాపులు దానిని మంచియెరువుగా సంగ్రహించికొను
టయుం గలదు ; చాయల కుపకరించునట్టిది కాన దానికి మంచి
వెలయు వచ్చుచుండు, వెండియు. ౨౦౫

క॥ చాయలకు వేపనూనెయు
వేయితెఱంగుల నగుట వివేకముగల కా
పే యెడలనేని, దన కృషి
కాయుప్రపట్టులని వానియంద మనమిడున్. ౨౦౬

వ॥ వర్ణంబుల కుపకరించువానియందెల్ల వేపయు, నీలియు, మిగులఁ
బ్రశస్తంబులగుట వానికి వెల వచ్చుచుండుఁ ; గావున వానిని
బెన్పుఁజేసి, యమ్మి, యవ్విత్తంబునన తనకృషి వ్యయంబులన్ దీర్చి
కొనుచు నెగడుట కాపునకు లెస్స; యిక్కతంబునన కృషి కాయువు
పట్టులని వానిన్ దడివిసెప్పనయ్యె ; వెండియు. ౨౦౭

ఏలా జాజి జీరకాదుల ప్రశంస.

తే॥ మందులకుఁ బెక్కుకూరలయందు గలిపి
వండుటకు సాలయగునట్టి వస్తుకోటి
నల్లముక్, దనియాలు, మిర్యాలు, జీర
కంబు, బాహ్లికము, వితున్నకంబుఁ, బసుపు. ౨౦౮

తే॥ ఏలకులు, జాజియును, నుల్లి, యింకఁ బెక్కు
సస్యములు నెన్నఁనయ్యెఁ ; గర్షకుఁడు వాని
వానికిన్ దగునట్లు పెంపూని, కృషి యొ
నర్చి, పండించికొనునది యేర్చి, పేర్చి. ౨౦౯

తే॥ ఇక్షు జాతు లనేకంబు ; లెడ్డు మేటి
ఫల మొసఁగుచుండు నవి కర్షకులకు ; మంచి

తడియు, నారుటయున్ గల్గి, వడువు మెఱయు
పొలములందు కషున్ వృద్ధిఁ బొలచి వెలయు. ౨౦౦

తే॥ చక్కగాఁ బొలమంతయుఁ జాళ్ళువార
దున్ని, సరిసేసి, సారవుమన్నుతోడ
నెరువుల్గూర్ జేర్చి, తగ నవియెల్ల కలియ
దున్ని, యాపయి సరిసేయుదురు మఱియును. ౨౦౧

వ॥ ఇట్లు సరిచేసిన పొలంబునందు చెఱకు నాటుట మిక్కిలి లెస్స,
వెండియు. ౨౦౨

ఆ॥ ఒక్కవత్సరమున కొక్కపంటయవచ్చుఁ
జెఱకువలన ; నైనఁ జేటులేదు ;
సాల విలువవచ్చు శర్కరాగుడముల
కదియ యుపకరించు నట్లుగాన. ౨౦౩

క॥ చుట్టుటయుఁ, దఱికిఁ దగఁ దడి
పెట్టుటయున్, మన్నుఁ జేర్చి వెడ వెడ దిన్నెల్
బట్టించుటయును, జెఱకున
కట్టైవలయు ; నేర్పు లెస్స యయ్యెపనులన్. ౨౦౪

తే॥ తిలలు, నావాలు, నాముదంబులును, నూనె
యొసఁగు సస్యంబులందెల్ల నుత్తమములు ;
పెరుగు నివి మెట్టనేలలఁ బేర్చినట్లు ;
మంచిఫలమిచ్చుఁ గాపు వాంఛించు పగిది. ౨౦౫

వ॥ నల్లనివియుఁ దెల్లనివియు, నెఱ్ఱనివియు నను మూడుజాతుల తిల
లును దొలకరియందును వేసవియందును బండునవియై యుండుఁ,
దడిలేకున్నను నీ రెక్కువయైనను నవి చెడు ; నల్లిన మూడు నెల

లంద ఫలం బిచ్చు, మంచి వెలయును గలదు ; సకలాంజనంబులును దైలంబులవలనన యగు ; నాముదంబులందుఁ బెద్దవియుఁ, జిన్నవియు నను రెండుజాతులు కలవు ; వీనియందు బెద్దవి తొలకరి-యుందును, జిన్నవి శరత్కాలమందును వి త్తనై యుండు ; దీపంబులకును, నానాయంత్రశకటాదులకును, మందులకును, నాముదం బుపకరించు ; వెండియు. ౭౧౬

తే॥ సర్షపములకు కాదు వర్షంబు ; వలయు
సాలుకొలఁదిగమంచు ; మాసములు మూడు
సనకమున్న ఫలము నిచ్చు ; సక్కబెరుగుఁ ;
గూరలకు, నూనెకు నవి యగున్ సతంబు. ౭౧౭

క. చాలవెల కలదు వానికిఁ ;
గ్రాలున్ గడుఁ బూఁతవట్టి కరము వెలయు న
క్కాలమున ; యెల్లవారలు
వ్రాలుదు రెప్డున్ బ్రియమున వానిన్ గొననై. ౭౧౮

క. తినఁ, బూయఁ బలుతెఱంగులఁ
దనరెడు సస్యముల నింతదనుక నొకఁ డొకం
డును గూర్చి చెప్పితి ; మఱియు
విను ! కట్టగనైనవానివిధ మెఱిఁగింతున్. ౭౧౯

కార్పాసాది సస్యప్రశంస.

తే॥ త్వక్ఫలక్రిమి రోమముల్ వస్త్రయోను ;
లెలమి నీనాల్గుఁ గాపుల యేర్చి, కూర్చు
వార లెల్లరకున్ గారవంబు మెఱయ
నొకఁడు నొక్కండుఁ ; దమతమ యోపినట్లు. ౭౨౦

వ॥ వృక్షకోటిలో నార నొసంగునవి పెక్కులుకలవు; వానినెల్ల సస్యం
బులతోఁ బెన్పుసేయుట కాపులకు దుర్ఘటంబై యుండు; సస్యం
బులవై, సులభంబుగ నార నొసంగు గోగును, జనుమును కర్షక
కోటికి సాల కూర్పునవియై యలరు; వానియందును బెక్కుజాతులు
కలవు; మఱియును. ౭౨౧

తే॥ వేగఁ దడియారుమళ్లను, బాగు మెఱయు
మెట్టనేలలయందును, మేల్మిసాయఁ
బెరుగు గోగును, జనుమును, బీరువోక;
కాని యతివృష్టి కెట్లునుగాక సుడియు. ౭౨౨

వ॥ వీనియందలి కొన్నిజాతులు మంచుపాటునఁ బెరుగునవి యగుట
శరదృతువునంద విత్తంబడు; వెండియు. ౭౨౩

తే॥ నాల్గునెలలన పక్వంబునకు నెసంగి
వచ్చు నివియెల్ల తగఁ; బూఁతవట్టు నపుడ
వీనిఁ బెఱికి, జలంబులవెట్టి, యూర,
నారదీయుదు రొగిఁ గాపువార లేర్చి. ౭౨౪

సీ॥ పలు జాతులై పొల్చుఁ బ్రత్తిచే; లన్నియు మెట్టనేలలయందమి
గులఁ బెరుగుఁ; । దొలకరియంద విత్తుదురు; విత్తిన నాల్గైదు
మాసంబులయంద పండుఁ; । బండుటయనఁ గాయ పగులుట;
యట్లు కాయలు పగులన్ వానియందు దూదిఁ, । గొనసగు;
దూదియ మనికిగా విత్తులు తగనంటికొన్నట్లు దవిలి యుండుఁ;
బరగ నట్లైన దూదిన ప్రత్తియందు;
రదియ సామాన్యముగ వివిధాంబరంబు
లై యొసఁగుఁ; గూటిపేదకు, నఖిలభూమి
నేలువానికిఁ దానయై సాల బొల్చి. ౭౨౫

వ॥ వరిచేలకుఁ బిమ్మట మళ్లు సక్కఁగదున్ని, యెరువుఁజేర్చి, నీరువెట్టి, తడి యారఁ మఱిలదున్ని, విత్తనైన యొకజాతి ప్రత్తియుఁ గల; దది యాషాఢం బాదిగా భాద్రపదాంతంబు దనుక మంచిఫలం బిచ్చుచుండు ; నెండియు. ౭౨౬

ఆ॥ ని॥ ప్రత్తిచేలు కాపు ప్రాణము ; వరి గుండె
కాయ ; మఱియుఁ దక్కుఁగల సమస్త
సస్యపుంజము లవి సకలాంగములు ; లోక
మతఁడు నిలుప, నెసఁగునట్టి యిల్లు. ౭౨౭

తే॥ పట్టుపురువులె మేలిమి పట్టునిచ్చు ;
వానిఁ దోఁటలలోఁ బెంపవచ్చు దీక్షఁ
దవిలి, నేర్పునఁ గా ; వివిధమునకుఁ దన
యోపుకొలఁదిఁ దివిరి ఫలమొందు వాఁడు. ౭౨౮

వ॥ లక్కపురువులును, బట్టుపురువులట్ల తోఁటలందుఁ బెనుపనై యుండు ; నీ రెండుజాతుల పురుగులు మిగుల వెలసేయు పట్టును, లక్కను నొసంగుననిచెప్పి, యప్పరమద్విజుం డప్పరమహాలికుని కిట్లనియె. ౭౨౯

తే॥ బాలుఁ, బెంటయు, రోమముల్ బ్రదుకునన్ని
నాళ్ళు గొఱియ లొసఁగు గాపునకు నిరంత
రం, బతఁడు వెట్టు కసవుమాత్రంబ తినుచు,
సాల మచ్చికఁ దిరుగుచు, సక్కనెసఁగి. ౭౩౦

తే॥ పెక్కతెఱఁగుల గుడ్డలై, ప్రియముఁ బ్రజకుఁ
గూర్చు వెంట్రుక లిచ్చెడు గొఱియ, యావు
కన్నఁ దక్కువయదియనఁ గాదు ; దాని
వెంట్రుకలు పెంపుమై సాలవెలకు నగుట. ౭౩౧

వ॥ గొఱియలందును నాలుగై దుజాతులు గల; వవి యన్నియును మిక్కిలి వెలకగు రోమంబుల నొసంగఁ జాలి యుండునందురు, వెండియు. ౨౩౨

ఆ॥ గీ॥ వెలయఁ జెవ్రులపోతు వెంద్రుకలును మంచి
విలువసేయఁజాలు వలువలగుట
కలదు; కాని వశము గాదు వానిన్ బెంపఁ
గర్షకునకుఁ; బనులు గలవుసాల. ౨౩౩

వ॥ ఇట్లు శశోర్ణవస్త్రంబులు దక్కఁ, దక్కన్ గల యఖిలవస్త్రంబులకును గర్షకోత్తముని పరిశ్రమంబ మూలంబై జగంబు నలరింపుచుండు; వెండియు. ౨౩౪

క॥ వెరవరులు నూలుఁదీయుదు
రఱఁటులనుండియును; వెలకు నది యెక్కువనాఁ
బరగున్; దద్వస్త్రంబులు
చిరకాలము సొంపుఁ, బెంపు, సెడక తనర్చున్. ౨౩౫

వ॥ ఇఁక ననేకవిధంబుల వస్తూత్పత్తి నేయువారలును గల; రిట్లు కర్షకపుంగవుండు లోకంబునకుఁ గూర్చు నానావస్తువులన్ గూర్చి కొంత దనుక సెప్పితి; నా చెప్పుటయందుఁ దప్పగుటయు, విడువనగుటయు నాడనాడ నయ్యెనొకో యను సంశయంబును గలదు; నీవ నీ యనుభవంబున నెఱుంగనగుదు; వెండియు. ౨౩౬

క॥ జగమునకెల్లఁ గృషికుఁడ
యగున, ట్లాతనికి, నింక నఖిలజనులకున్,
దగ నెప్డుఁ జెక్కు లెఱుఁగుల
నగుఁ బశువులు; వానిఁ గూర్చి యరయుట వలయున్. ౨౩౭

## గోకుల ప్రశంస.

క॥ సాధుతరంబు విశిష్టము
గోధనము ధనంబు ప్రజలకున్ ; దానిన యొ
ప్పాధారముగా వెలుఁగుట
మేధానిధుల మత ; మది యమితసుఖద మిలన్. ౨౩౮

తే॥ మానవోజ్జీవనంబ సమస్తగతుల
నరయు నీశ్వరునుద్దేశ మఖిలజనులు
గోధనమునంద తగ బ్రదుకుటయు ; యట్లు
మను నరుం డీశ్వరమత ప్రమాణవేది. ౨౩౯

వ॥ పాలునకును బనులకును నగు గోవులు, నెనుములు, గుఱ్ఱంబులు, నుష్ట్రంబులు, గొఱియలు, మేకలు మొదలగు సాధుజంతువులు సాధారణంబుగఁ బశువులుఁ, బసరంబులు నని చెప్పంబడు ; గొందఱి మతంబున నివియన్నియు గోధనంబని పరిగణింపన్ బడు ; నిదియు యుక్తికిఁ బోలిన తెఱంగ, వెండియు. ౨౪౦

తే॥ సాత్వికాహారములలోఁ బ్రశస్తములని
యెన్నఁబడుఁ బాలు ; వానియందెల్ల వస్తు
వుల గుణంబు గలదని పల్కురు మనీషు
లరసి చెప్పిరి ; విను ! సంశయంబులేదు. ౨౪౧

క॥ బల, మాయువు, నారోగ్యము,
విలసత్తేజంబు, బుద్ధివికసనగుణ, ము
జ్జ్వల సంతోషము దుగ్ధం
బుల వలనను నరు నికగు నెపుడు ననిరి బుధుల్. ౨౪౨

క॥ పా లిరుప్రొద్దులఁ ద్రావుచు,
నోలిన్ మజ్జి యొందుఁ గొనక, యుజ్జ్వలనియతిన్

గాలము గడుపఁ గనగు నరుఁ;
డేలా బహు గాధ? లతని కెక్కుడిచింతల్? ౭౮౩

క॥ కావునన మానవుని యు
జ్జీవనమున కనువుపడ సృజించె నెలమిమై
గోవుల నీశ్వరుఁ; డాతని
పావనమత మెల్లవారుఁ బాటింపనగున్. ౭౮౪

తే॥ బహువిధ తృణౌఘములుఁ, బత్త్రపల్లవములు,
సారతర్రమై యొసంగు నాహారము పశు
కోటి; కవి యమ్మెయిన్ బ్రదుకుటన, సాల
సాదుతనమున నరకోటి సాకనయ్యె. ౭౮౫

తే॥ పరమసాత్త్వికమూర్తులై పరిఢవిల్లు
గోవుల పయోరసము యది కూడదు గాఁగ
బ్రదుకుటయ మర్త్యకోటికి భవ్యమతము;
కా వితరవృత్తు; లవియేఁటిగాధ లరయ? ౭౮౬

తే॥ ఆదిమమనుష్యకోటి వృక్షాదుల, తమ
కన్నిఁటికిఁగా బ్రదుకునప్పు డసిరి కొన్ని
వృక్షముల నేర్చికొని, "కల్పవృక్షము" లని
తొల్లి; వారికి నితరవృత్తులన లేవు. ౭౮౭

తే॥ గోకులము నేర్చికొని, మఱికొంతకాల
ము నన, వారలు గోరసమునన బ్రదుకు
నపుడు తగఁ, "గామధేనువు" లనిరి కొన్ని
గోవుల నితరవృత్తులు కావ యనుచు. ౭౮౮

క॥ ఆ నాఁటిమనుష్యులు పర
మానంద సుఖానుభవసమంచితశాంతి

శ్రీనిధులై మని ; రమల
జ్ఞానము, నాయువును, వారి జన్మధనంబుల్. ౨౪౯

క॥ మోసము, వైరంబును, బే
రాసయు వారెఱుఁగరు కలనైనన్ ; బరమో
ల్లాసంబ నిరంతరమున్
వాసి వెలయు తోడవు వారివర్తనమునకున్. ౨౫౦

క॥ గోవుల తమ కంతకునై
బ్రోవన్, వారివ్విధమున బొలిచిరి శాంతి
శ్రీ వెలయఁ, దపోధనులై ;
కావున గోధనముఁ గూర్చ గడఁగన్ వలయున్. ౨౫౧

వ॥ అక్కాలంబున కవ్విధంబు సెల్లెన్ గాని, యిక్కాలంబున కది కాద నుట సరిగా ; దైనను నవ్విషయంబున దీర్ఘచర్చ సనదు ; మఱి యిప్పటి పరిస్థితుల కనువుపడ గోకులంబు బాగు విచారించుటయు మనకు వలయు ; వినుము. ౨౫౨

క॥ పనులకు, నెరువులకున్, బా
లునకున్, గోకులమెపుడుఁ బలుతెఱంగులఁ గా
పున కగు ; నది యూతని కూ
ర్చిన పెన్నిధి నాఁగ వినుతి సేయన్ జనదే ? ౨౫౩

క॥ గోధనము లేని కాపున
కే ధనములుఁ గావు ; కృషికి నెప్పుడును మహా
సాధనము గోకులము బహు
సాధనములయందుఁ ; బరమసారము మఱియున్. ౨౫౪

తే॥ గోకులము లేక యెబ్బంగిఁ గూర్పవచ్చుఁ
బెంటఁ ? బెంటయు లేదేనిఁ బంటయేడ ?

పంటపసలేక తానెట్లు బ్రదుకు? నెట్లు
జగమునకు నీఁగఁజాలుఁ గర్షకుఁడు సాల? ౨౫౫

తే॥ వెండియుఁ గర్షకుఁడు సాలవెరవు గల్గు
వాఁడ యయ్యును గృషిఁ బాలువడుట కెట్లు
సాలుఁ బనులందు నెద్దుల జతలు తోడు
వడక? కృషియన రిత్తకు వచ్చునెట్లు? ౨౫౬

క॥ తనకులముకన్న గోకుల
మనయము నెవ్వానికిన్ బ్రియతమం? బా కా
పునకు సరిలేరు కాపు; ల
తని కది కూర్చున్ యశంబు, ధనమున్, సుఖమున్. ౨౫౭

ఉ॥ గోవులు వృద్ధికిన్ జెడినఁ గూడునకున్ జెడుఁ దాను, లోకముల్;
గావున నెల్లభంగులను గర్షకుఁ డెప్పుడు వాని నిచ్చలున్
గావను, బ్రోవనున్, దలఁపు గల్గి యొసంగుట మేలు మానవో
జ్జీవనభంగికిన్ దగ సృజించె విధాత్రుఁడు వాని నంటకున్. ౨౫౮

క॥ తన పరమాకల్పము గో
ధనము జగత్సేవనవ్రతంబున, నని యె
ప్డు నరయు కర్షకభక్తుం
డనూన శాంతిసుఖగౌరవాప్తి రహించున్. ౨౫౯

క॥ తినవెట్టు, సుఖము నారయు,
ననయంబును గూర్చుఁ బ్రియ, ముదంచితదీక్షన్
దనుపున్ గోకులమ్మున్ జే
రునకుఁ దగన్ గృషికకులవరుఁడు జగమెన్నన్. ౨౬౦

క॥ పుష్టము, జిరసౌమ్య గుణవి
శిష్టము, గోకులము వృద్ధి చిహ్న విశేషా
కృష్టజగము,- గురుకాంత్యు
త్కృష్టమునై వెలయు, వెలయు కృషియ కృషియిలన్. ౭౬౧

సీ॥ తన యన్నఁ గాన్పుచందంబునదూడలుసమధికోదంచితశ్రద్ధఁబెరుగఁ,
దన భగినీభ్రాతృ జనముచాడ్పునఁ బడ్డలును, గోడెలును బేర్మిఁ
దనరి యెసఁగఁ,
దన పెన్పునకునైన తల్లిదండ్రుల పోల్కి, మొదవ లెద్దులును
నెమ్మది రహింపఁ,
దనతండ్రి కూరిమి తల్లిదండ్రులభంగి, వృద్ధగోకులమాదరింప నగుచు
సౌఖ్యమునఁ గ్రాలఁ బరమకర్షకుఁడు కృషియ
తనకు, లోకంబునకు నిరంతరముఁ బెన్ని
ధిఁగఁ దలంచుచుఁ సారశాంతి సుఖగౌర
వమున బ్రదుకు; నతనిద కేవలము బ్రదుకు. ౭౬౨

వ॥ ఇని యిట్లా బ్రాహ్మణపుంగవుం డక్కర్షక పుంగవుండు శ్రద్ధమెయి
వినఁ, గృశ్యావశ్యకతయుఁ, దత్క్రమంబును, గోకులావశ్యకతాది
పెక్కువిషయంబులువన్యసించి, మఱియు నిట్లనియె. ౭౬౩

తే॥ స్వయమ కృషిసేసికొనఁగోరి, వచ్చి, నన్ను
నడిగి; తది లెస్స; యొండన నాకు నగునె?
నీవు భూమికినై సముజ్జీవనంబు
సేయుటయ మాకు నిష్టము; వేయునేల? ౭౬౪

వ॥ ఐనను లౌక్యంబు ననుసరించి యేము నీకు భూమి నొసంగుటయం
దును, మా కీవు పాలొసంగుటయందును ధర్మశాస్త్రంబు పరమ
ప్రమాణంబు; తత్క్రమంబు వినుము. ౭౬౫

(శ్రీకృష్ణధర్మవిజయే_ప్రథమఖండే, ద్వితీయభాగే)

౧. శ్లో॥ న దేవమాతృకక్షేత్రే కర స్థిరతర స్మృతః।
న నదీమాతృకక్షేత్రే పరిహార్యః కదాచన.

౨. గావో భూమిర్జలం రాజా సూర్యచంద్రమసౌ ప్రజాః।
బాంధవాః కర్షక స్యైతే; లోక స్తేనైవ జీవతి.

౩. మన్వాదిరామపర్యంతం ధార్మికాః పార్థివాహః పురా।
ద్వాదశం దశమం భాగ మష్టమం సప్తమం తథా.

౪. అగృహ్ణాంత కృషేష్షష్ఠం చతుర్థమ్ చాద్యపంచమమ్।
దత్వా భాగం చతుర్థం మే గృహీత్వా హి కృషివ్యయం.

౫. యథాశాస్త్రం యథాచారమ్ శ్రద్ధయైవ కృషిం కురు
నృపానాం నాద్యసర్వేషాం కృషౌ శ్రద్ధా యథా పురా.

౬. పురా మహీశ్వరా స్సర్వే స్వయం కృషి మపాలయన్।
లోకకల్యాణమూలమ్ హి కృషిస్తు ఋషికర్మ సా.

---

తే॥ దేవమాతృకక్షేత్రమునకుఁ గేవలంబు
పన్ను తిరమొనరించుట పాడిగాదు;
కాదు సారనదీమాతృకంబయైన
పొలమునకు రిత్తమైఁ బన్నుఁ బొసఁడచుట. ౭౬౬

చ॥ పొలమును, గోగణంబును, నృపుండును, సూర్యుఁడుఁ, జంద్రుఁ
డున్ గృషీ। వలునకు నీటికిమ్ములగు వాగులుఁ, గూలిప్రజల్,
బ్రియంబు పెం। పలరఁగఁ జేయు చుట్టములు, నాప్తులు; మానవ
కోటికెల్ల ని। చ్చలిలరఁ గూడుగుడ్డలిడి సాకుట యాతని కృత్య
మెప్పుడున్. ౭౬౭

తే॥ ద్వాదశంబు, దశమము, సప్తమము, నష్ట
మంబు రాజభాగంబుగ మనువు మొదలు
రామచంద్ర ప్రభువు తుదిగా మహీశు
లెలమిఁ గృషినుండి గొనుచుండి రెల్లయెడల. ౨౬౮

తే॥ ఆఱవదియు, నేనవదియు, నరయ నాల్గ
వదియు రాజభాగము నేఁడు వసుధ నెల్ల
యెడలఁ గృషియందు; నేటి మహీశ్వరులకు
గౌరవము లేదు కృషియెడఁ; గానరాఁడు. ౨౬౯

తే॥ తొంటి భూపతులందఱు దొడ్డబుద్ధి
స్వయము కృషిపాలనము గౌరవంబునంద
తవిలియుండిరి; లోకులందఱును దృప్తి
మసరి నాఁ; డిప్పు డమ్మాట మఱువనాయె. ౨౭౦

క॥ నావలనఁ గృషివ్యయమున్
గేవలమున్ గొనుచు, సేయు కృషి! యుత్సాహ
శ్రీవెలయ శాస్త్రపద్ధతి
మై; వెరవది దానికెల్ల నందముఁ గూర్చున్. ౨౭౧

తే॥ శాస్త్రమునకు నాచారంబు సామరస్య
మొసఁగు తెరువు కృషికి లెస్స, యోలినెల్ల
పంటలందును నాల్గవభాగ మొసఁగు
చుండు మాకు; నంతకుమించి యొప్పదెట్లు. ౨౭౨

తే॥ కృషియెడల గౌరవము సూపి, కీర్తిఁగనిరి
తొంటిరాజులందఱు; వారి దొడ్డతనము
నేమిసెప్పఁ? గూటికి, గుడ్డ, కెందు నేనిఁ
గఱవు పుట్టదు; సంతృప్తి కలదు ప్రజల. ౨౭౩

వ॥ దీనికి నిదర్శనంబుగ నొక్క రాజసత్తముని పరిపాలనక్రమంబు నించుక
తడవి సెప్పెద ; నాకర్ణింపుమని యయ్యార్యవర్యుం డతని కిట్లనియె.—

### నారాయణుఁడను నొకకాపు కృషిప్రశంస.

క॥ కలఁ డొకకా పొకయూర, న
తుల కృషి దీక్షాఘనుఁడు, సుతులు నల్వురుఁ, గూ
తులు మువ్వురు, నాలును, దన
బలగంబై వన్నెఁగూర్పఁ, బౌరుషముఁ దగన్. ౭౭౫

తే॥ అతని పేరు నారాయణుం ; డతని యాలి
పేరు సీత ; వారిద్దరుఁ బేర్మి పెంపుఁ
గనిరి కాపుకులమున నఖండదీక్షఁ
గృషి యొనర్చుటయందు నాఁ డెల్లయెడల. ౭౭౬

క॥ వారికి గోధనము కలదు,
సారతరము సాలదనుక సకలశ్రేయ
స్స్ఫారము, భవ్యకృషికళా
ధారముఁ, దేజఃప్రశాంతిదము, నుజ్జ్వలమున్. ౭౭౭

క. పొల మూరికి దూరంబునఁ
గలదు తటాకాంబు వాపికాబంధుర, ము
జ్జ్వల విటపీకూజత్ఖగ
కులముఁ, బ్రశాంతిమయరుచ్యకుంఠంబును నై. ౭౭౮

క॥ ఉడుగక గోకుల మాతని
కొడుకు లిరువు రెలమిఁ గాచికొనుచుండుదు రె
ప్పుడు శ్రద్ధయుఁ, గుతుకము, నిను
మడింపగాఁ, దోడి కాపుమానిసు లెన్నన్. ౭౭౯

సీ॥ పాలిచ్చువసరముల్ బక్కలై చిక్కి, పొదుగులెండఁగాఁ బెంపుఁ దూలు విధముఁ,
గోడెలు, నెద్దు లెక్కుడు పనులకు నయ్యుఁ, బోఁడిమి సెడి, తూఁగి యాడు తెఱఁగుఁ
మొదవల పడ్డల కడుపులు తఱికిఁ దప్పాటను నై మఱి గొడ్డుపోవు వడువుఁ,
గొయ్యలై కాళులు గుదివడ లేఁగ లేపున్ దక్కి, యాఁకటఁ బొక్కు చంద,
మెన్నఁడున్ గాని చూడ్పున నెద్దిమెద్ది,
నక్కుమారకు లిరువురు నధికదీక్ష
నరయుచుందురు గోకుల, మంతకంత
కభినుతికినెక్కి, యతివృద్ధి నలరునట్లు. ౭౮౦

కం॥ మలమూత్ర క్రిమి దుర్వ్రణ
కలితానారోగ్యదశకుఁ గాకుండఁగ, వా
రలు గోకులము నెడన్, మి
క్కిలి శ్రద్ధ వహింతు, రింపు కేవలముఁ దగన్. ౭౮౧

కం॥ తోలఁగుటయును, దన్నుటయును,
గలఁగుటయును, బొడచుటయును, గఱచుటయును, లే
దులుకుటయు, నెప్డు నా గో
వులందు ; నొక్కటియు రిత్తవోవదు మఱియున్. ౭౮౨

కం॥ అభినవగురుశాంతిమయ
ప్రభాపటలసంకలిత పరమపావనతా
విభవఘనం బా గోధన,
మభిరూపతఁ గూర్చు వారి కశ్రాంతంబున్. ౭౮౩

క॥ నిలువ నిలుచుఁ, జనఁ జను, న
ర్మిలి నాకున్, సంజ్ఞసేయ మేఁతకు సొచ్చున్,
బాలమున నా గోకులు, మి
చ్చలుఁ గాపుకొడుకులు నెమ్మి సమకూర్పంగన్. ౨౮౪

క॥ పులినేని నెదిరి యొంపన్
గల వాగోవు లోకకదుపుఁ గట్టి, తీరముమై
నిలిచి, తమ కాపుకుఱ్ఱల
కులుకు జనింపంగనీక, యుద్భటరేఖన్. ౨౮౫

ఆ॥ మేసి, త్రావి, నెమ్మిమెయి నెమరిడుచుఁ, బ్ర
శాంతిరేఖ గోవ్రజంబు దొడ్డి
త్రోవఁ బట్టునపుడు, కేవలానందమ
గ్నులగుచుండ్రు కాపుకుఱ్ఱలెలమి. ౨౮౬

సీ॥ తొలిచూలు పడ్డకదుపు నడుమన్ గుఱ్ఱకోడెతండము వేడ్కఁ గొల్వ
క్రమము,
నెదలైన మొదవల నేర్చి మూర్కొనుచు, అంకెలిడుచుఁ బోవు
కోడెల తెఱంగు,
నెమ్మిమై శాంతిక్రమమ్ముఁ గైకొని, నెమరిడుచు మెల్లనబోవు
యెద్దులవిధ,
"మంభా" యనుచు లేఁగ లాత్మగతములు గా, వడిఁ జను ధేను
కావ్రజము రేవ,
పాలు విడిచినదూడల పదువురంగు
సూచుచున్ గౌతుకంబునఁ జొక్కుచుండ్రు
కాపుకుఱ్ఱ లొడళ్లఁ బుల్కలు రహింప,
నోలిఁ బిల్లనఁ గ్రోవుల నూఁదికొనుచు. ౨౮౭

తే॥ రత్నగర్భకు వన్నెఁ గూర్పంగఁ జాలు
సాధు జంతువులైన పసరముల తమ
ధనముగాఁ నొప్పు సాధుసత్తములు, కాపు
వార ఘనులు, జగతి నెల్లవారికన్న. ౭౮౮

క॥ సకలధనము లెప్డున్ బా
పకళంకాంకితములండ్రు ప్రాజ్ఞులు తత్త
త్ప్రకృతుల నరసి; యుభయతా
రక మొక్కఁడ గోధనము, పరమపావనమున్. ౭౮౯

తే॥ క్షేత్రలక్ష్మి, గోలక్ష్మియుఁ, జెలులు; వార
లెలమిమై నొండొరుల నాశ్రయించికొని, ర
హింతు; రొంటి వెలుంగ లే; రుభయతార
కంబు వారిసంయోగంబు కర్షకునకు. ౭౯౦

తే॥ ఇట్లతిసమృద్ధిమై, లెక్కకెక్కి, పెంపుఁ
గన్న యగ్గోధనంబు, నా కాపుకత్తె
లిర్వురున్ గాచికొనుచుండి, రింతకంత
కది కరంబుఁ, బ్రవృద్ధిమై యతిశయిల్ల. ౭౯౧

క॥ ఆ నారాయణుఁ డాలును,
సూనులుఁ, బుత్రికలుఁ దోడుసూపన్ గృషి నెం
తేనియు దీక్ష నొనర్చుచుఁ,
దాను గనియెఁ బేరుఁ, బెంపుఁ, దనసరివారిన్. ౭౯౨

తే॥ ఆశ్రమంబును, బెన్నిధి, యనఘతీర్థ,
మతనికి పొలంబ; పొలము కా కన్యమెఱుఁగఁ
డాతఁ; డొల్లఁడు సురలోకమైనఁ; గాక
చక్రవర్తిపదమునైన, సాలఁబేర్చి. ౭౯౩

క॥ మది నొక భావము, నాలుక
తుది నొకవాక్యంబు నగు బ్రదుకు చొప్పెఱుఁగం;
డెదయును నాల్కయు నొకఁడుగ,
నుదారగతి నతఁడు గాంచుచుండున్ బేర్మిన్. ౭౯౪

తే॥ చదువులేదు; శ్రుతంబును సాల; దార్య
గోష్ఠికిన్ గాఁడు; పెక్కుపల్కులును, వంక
మాటలును నేరఁ; డెట్టికల్మషము దాపఁ;
డతనియెడ భావగాంభీర్య మదియు సున్న. ౭౯౫

క॥ ఇచ్చుటయ యెఱుఁగుఁ; బ్రతిఫల
మిచ్చినదానికి గణింపఁ; డిచ్చివగవఁ; డే
మెచ్చులకున్ గాఁడు; తనకు
నచ్చినదానిన యతం డొనర్చున్ దివురున్. ౭౯౬

క॥ తనకున్ నచ్చిన విషయం
బునఁ గొంకఁడు వల్క భీతి బుట్టి యుపాయం
బున నేని యెవ్వరేమ
న్ననైన నిష్కపటవర్తనము సంధిల్లన్. ౭౯౭

తే॥ అతని పొలము సస్య శ్యామలాభిరామ
భూతిఁ దనరారుఁ; దద్గృహంబును సతంబు
నూత్ననూత్న ధాన్య శ్రీమనోజ్ఞగౌర
వంబునన్ గ్రాలుచుండు, లోకంబు మెచ్చ. ౭౯౮

క॥ పాలిచ్చునవియు, వెండియుఁ
జూలుఁ గొనిన యవియు, నగుచు సురుచిరరేఖన్
గ్రాలు నెపుడు నావులు పది
వేలకు వెలవెట్టఁ జాలు విభవ మెలర్పన్. ౭౯౯

క॥ చెఱలాడు నవియు, మఱి క్రే
ళ్ళుఱుకు నవియు, నగుచు లేఁగ లొప్పు మెఱయు నొం
డొరుమీఁకి తొట్టు పట్టు ల
విరళ శ్రీగౌరవాభివృద్ధి రహింపన్. ౮౦౦

తే॥ క్షేత్ర గోష్ఠ ప్రదేశ లక్ష్మీ మనోజ్ఞ
భూషణంబుల యై సాలఁ బొల్పెసంగు
వృషభరాజంబులు, పరమకృషికళాధి
దేవతా ప్రాణములు, కదుఁ దేజమడర. ౮౦౧

వ॥ ఇట్లన్నారాయణుండు గోక్షేత్రసంతానసంపత్సమృద్ధి విలసిల్లు
నక్కాలంబున. ౮౦౨

ఆ॥ రత్నగర్భయగు ధరాదేవి పరమభ
క్తుండు, కృషికళానిగూఢ తత్త్వ
వేది, రాజు, లోకవిద్వరుం డొక్కండు
గలఁడు ధర్మకర్మఘనుఁ; డనఘుఁడు. ౮౦౩

క॥ సకలవిధ ద్రవ్యోత్ప
త్తికిఁ గారణజన్మ లీపృథివిఁ గావును, గా
ర్మికుఁడు, నని వారలయెడ, న
ధిక గౌరవబుద్ధి నయ్యధిపుఁడు మెలంగున్. ౮౦౪

వ॥ మఱియు నారాజసత్తముండు, ౮౦౫

తే॥ బహువిధంబుల సామ్రాజ్యపదవికన్న
కృషియ మేలని యతఁడు భావించుఁ; గాన
రాజ్యమందలి సకలవార్తలను మున్న
యరయుఁ, గృషివార్త నిత్యకృత్యములలోన. ౮౦౬

ఉ॥ చారుల నేర్చిపుచ్చి, యసిశంబు నుదంచితదీక్షమైఁ, గృషిన్
బేరును బెంపుఁగాంచి, కడుఁబేర్మి నెసంగెడి మేటికాపుల్లన్
సారెకుఁ బిల్వనంపి, తగ సత్కృతులన్ దనియించి, పొచ్చె న
బ్బ్భారమణుం డొగిన్, దన ప్రభుత్వము లోకులకెల్ల నింపుగన్.

వ॥ వెండియు నన్నయజ్ఞుండు, ౭౦౮

తే॥ ప్రజల కోష్టసుఖంబులఁ బొలుఁ గొనెడు
వాఁడువోలె, నమాత్యులతోడఁ బర్య
టనమ్ముసేయు రాజ్యము నెల్లెడల నొకించు
కేని నాడంబరము లేక యిప్డునప్డు. ౭౦౯

నారాయణుని శీలంబుఁ బరీక్షింప నొకరాజు
కపటోపాయంబు సేయుట.

వ॥ పరమకర్షకుండైన నారాయణుని కృషివార్త లరయుచుండువాఁడు, కావున యతని కృషిప్రకారంబును, శీలంబును బరీక్షింప నిశ్చయించికొని, యారాజసత్తముం డొక్కనాఁ డిర్వురు మంత్రులన్ గొని, పయనంబుసేసి, యొక్కెడవిడిసి, వారునున్ దానును మారువేషంబులు గైకొని, యొక్కఁ డొకఁడుగఁబోయి యన్నారాయణు నరయువారై, సనుచుండి; రందందఱికన్న మున్న పేదబాపని వేషంబుఁగైకొన్న ప్రధానామాత్యుండు. ౭౧౦

క॥ పుత్రులును, బుత్రికలును, గ
ళత్రంబును దోడువడఁ, బొలముపని సచ్చా
రిత్రుఁడు నారాయణుఁడు ప
విత్రాత్ముండుండఁ, వచ్చి, వెరపుదలిర్పన్. ౭౧౧

తే॥ డాసి, దీవింపుచున్, బెంపునేసి, ప్రియము
పుట్టుభంగి నటింపుచు నిట్టులనియె;

నయ్యా ! నేనొక పేద బ్రాహ్మణుఁడ ; నిన్నుఁ
గానవచ్చితి నీదయఁ గాంచిపోవ. ౭౧౨

క॥ నన్నుఁ గృపఁదేల్చి, యెట్లున్
మన్నింపఁగసాలుదీవు ; మాదృశులకుఁ జే
రెన్నికగల మీ బోఁటుల
కన్నన్ దిక్కునఁగ వేఱ కలదేయెందున్ ? ౭౧౩

క॥ పనిసందడి నీవుంటన్
వినఁగా దెట్లేని నాదువృత్తాంతము ; కా
వున నొకముహూర్తకాలము
పని సాలింపఁగదయ్యా ! పాఱుఁడనయ్యా ! ౭౧౪

క॥ అనుడు నతం డాతనిఁ గ
న్గొని, యెదమెత్తవడఁ, దనపనుల కమ్మెయిఁ బు
ట్టిన విఘ్నంబునకు విసివి
కొనుచు, నతనిడాసి, తోడికొని, ప్రియమెసఁగన్. ౭౧౫

వ॥ ఒక్కచెట్టునీడఁ గూర్చుండవలికి, యతండు గూర్చుండఁ, దాను నతని కభిముఖంబుగాఁ గూర్చుండి గౌరవంబుమెఱయ నిట్లనియె.

తే॥ ఏలవచ్చితి రిటకు ? మీ రెచటివార ?
లేమిపని నాయెడన్ గల ? దెవరునన్నుఁ
దడివిసెప్పిరి ? పెద్దయుఁ దడయ నాకుఁ
బోల ; దెఱిఁగింపుఁ డంతయు ; బొంకుకాదు. ౭౧౬

క॥ అనుడు నతం డాతని కి
ట్లను లోకంబెన్ననైతి వనఘా ! యది కా
వున నిన్నెఱింగి వచ్చితి ;
విను నేను కళింగదేశ విప్రోత్తముఁడన్. ౭౧౭

తే॥ చదివితిని వేదములును శాస్త్రములుఁ; బెక్కు
దానములు చేసితిన్; నాకు నేన సెప్పి
కొనుట పోలదు; కాని నాకునసరి విప్రుఁ
డొకఁడు లేఁడను సత్కీర్తి నొందఁగంటి. ౮౧౯

తే॥ పెక్కుదానంబు లొనరించి, పేదనైతి;
కలరు దారపుత్రాదులు; కఱవుపుట్టె
నొకట మాదేశమందు; లేఁడొక్కఁడేనిఁ
బలువ్గుర భరింపఁగల్గు సంపన్నుఁడందు. ౮౨౦

వ॥ కావున నేనాదిఁగాఁ బల్వురు పేరుగలమానిసులును, సామాన్యు
లును సకలసస్యవిభవ సంపన్నంబైన యీ మీదేశంబునకు యా
చించికొన వచ్చితిమి; వినుము. ౮౨౧

తే॥ పాలునకు వాచికొనిరి మా బాలురు; తిన
నొల్లరన్న; మల్లరసేయుచుందు రెపుడుఁ;
గాన దయచేసి, నాకునై, ధేనుదాన
మాచరింపవె? విప్రుఁడ నంట వినవె? ౮౨౨

వ॥ అని బ్రాహ్మణ ప్రభావంబుతోడ దానమహిమ సెప్ప నుంకించు
నతని వారించి, యతం డిట్లనియె. ౮౨౩

తే॥ తడవుసెప్పకు; మింతమాత్రంబసాలు;
సాలపని కల దావల; సక్కవినుము!
దానమున్గొన లోకులందఱును బాత్ర
తములె యనసరమగుచో నిజమున కెపుడు. ౮౨౪

క॥ కొంద ఱొసఁగు వారలు, మఱి
కొందఱు కొనువార్లు, ననఁగూడదు; జగమం
దందఱు నీయఁగ, గొన నగు
చుందురు తఱి; కిమ్మతంబుఁయు క్తమకాదే? ౮౨౫

తే॥ శక్తికల యంతవట్టు యాచనకుఁ గడఁగ
వలవ దెవ్వండునేనిఁ ; గేవలము దాన
ములు గొన్న పుట్టితిమి నిజమునకు నేమ
యనుట యెరికిఁ గూడ ; దన్యాయమ యది. ౮౨౬

వ॥ ఇప్పుడు నీతో సాలదనుక ముచ్చటింప నాకున్ బోల ; దొక్కమాట
సెప్పెదు వినుము. ౮౨౭

తే॥ నీకు నత్యవసరమ యేనియును ? నీవ
శక్తుఁడవయేని, మఱియు నసత్యమునకుఁ
బాలువడ వేనియును, వేయిపల్కులేలఁ ?
గొనుము నీ యిచ్చకగు నావు మనసునిండ. ౮౨౮

ఆ॥ గీ॥ అనుడు నతఁడు గొంటి నా ; వెల్లివచ్చి తో
డికొని పోదు ; నిప్పటి కిదిసాలు
ననియె ; దాని కెలమి న క్కాపతనికి ని
ల్లనియె మఱియుఁ జిత్త మలరఁ బొలచి. ౮౨౯

ఆ॥ గీ॥ పాలుఁ, బెరుగు, నేయిఁ బసివట్టి నోరూర
నారగింప నేర్తు ; రంతగన్న
నొండెఱుఁగరు విప్రు లొప్పమై నావు, దూ
డయును బెంపుఁగాంచుటయు, సెడుటయు. ౮౩౦

ఆ॥ గీ॥ పాపమనరు ; తల్లిపా లొక్క గ్రుక్కెడుఁ
ద్రావనీరు ; దూడసావ గోరు
చుంద్రు ; బ్రదుకునేనియును గాళ్ళురా కది
యెప్డు, సుడిసి, ప్రేవులెండ నుండు. ౮౩౧

ఉ॥ అక్కట ! బాపనయ్యల గృహాంగణసీమల నుస్సురంచు, నే
లెక్కకుఁగ్రాక, పెంపుసెడి, లేఁగలు కాళ్ళులురాక, తూలుచున్,

స్రుక్కుచుఁ, గోయ్యబొమ్మలయిపోలుచునుండుటసూతు;మారా!వా
రెక్కడి మానిసుల్ ? కలదె యించుకయేనియుఁ దెల్వి వారికిన్ ?

క॥ నీ వట్టి యనయన్న త్రికిఁ
గావ యని తలంతు ; నట్లుఁగా కందఱి యు
ట్లావుల్, దూడల్ గలచెదో ?
సావునకున్ దెత్తొ ? యెట్టి చందంబొ కదా ? ౮౩౩

తే॥ ఇంటివారెల్లఁ బాలున కెడ్డు సూతు ;
రట్లు సూడ రదేఁటియన్యాయ మావు
దూడ ? శాస్త్రోక్తులకుఁ దిగుదురు ; కృతజ్ఞ
త యన నేమొ యెఱుంగ ; రధర్మపరులు. ౮౩౪

తే॥ నోరు లేని పసరముల గోరమునకు
నగ్గమొనరింతురయ్య ? యన్యాయమునకు
వెఱవరయ్య ? యింకేఁటి వివేక ? మేఁటి
సదువు ? దుర్జాతి కేఁటి శాస్త్రంబు గొడవ ? ౮౩౫

తే॥ బాపనయ్యలె కా రిడ్డు కాపువారు
పలువు రక్కానిపనికిఁ బాల్పడుట విందు ;
మేఁటి మర్యాద ? గోవుల కెడ్డు హాని
వుట్టు ? లోకంబునకు నష్ట వుట్టుఁ గీడు. ౮౩౬

వ॥ మాకు గోధనంబ పరమధనం, బట్లయ్యు నవసరంబు నరసి, లోకంబున కుపకరించు చొప్పున నిచ్చుచుందు ; మీవు నీకంటి కింపైన యావు నేర్చికొని, దాని బాగునకగుచు, నీవును బాగున కగుము ; మఱియు నీవు గొన్నయావు బాగునరసి, నీకవసరం బగునప్పుడెల్ల మాయోపిన ట్లేమేనియుఁ గూర్చిపెట్టను దలంపు కల ; దనుటయు న వ్వేషధారి యతని గోభక్తికిని, మహౌదార్యంబునకును లోన మెచ్చికొనుచు, నిట్లనియె. ౮౩౭

ఆ॥ గీ॥ ఇంత ప్రశ్న సెప్పనేల ? సూచెదుగాక
నాదుభక్తి గోగణంబు నెడల
యెట్టి దొకొ యది ; మహితగుణ ! రిత్త మా
రకుము ! నన్నిపుడు కరంబు బేర్చి. ౨౩౭

వ॥ అని యిట్లు వా రిరువురు సంభాషించికొనుచుండఁ, బేదకాపువేషం
బుఁ గైకొనిన యొడయం డల్లనల్లన యప్పొలంబెల్లఁ గలయన్
జూచుచు, నన్నారాయణున్ సమీపించి, చనవుమెఱయ నిట్లనియె.

పేదకాపు వేషంబుగైకొని వచ్చినరాజు నారాయణునితో
సంభాషించుట.

క॥ ఏమన్నా నీ ప్రజలకు
సేమమె ? గోకులమునకును సేమమె ? మఱి మీ
భూమిపతి కాపుప్రజలన్
బ్రేమయలర సూచునే ? తఱికి నగుచున్నే ? ౨౪౦

తే॥ ఈతిబాధలు లేవుకాదే ? పొలంబు
పండునే వృషఁలంబుగఁ ? బ్రతిపనియుఁ
గలదుకాదే ? కొడుకులుఁ, గూతులును బనుల
కగుదురే ? కవ్వమునఁ దడి యారదు కద ? ౨౪౧

తే॥ కఱవుబుట్టి మా దేశము కళవళించి
పోవుచున్నది ; వానలు లేవు ; పసులు,
నేము, సుడివడుచున్ బ్రేవు లెండఁ దిరుగ
నైతి మొకతెన్ను, నొకయూరు ననుటలేక. ౨౪౨

వ॥ ఇట్లు తిరిగి తిరిగి, కొండదఱివలన. ౨౪౩

తే॥ అయ్య ! నీ పేరు విని, బండెడాసతోడ
నిందు వచ్చితి, బిడ్డల కింత గంజి

దొరకుఁ బో యని పొంగుచు; దొడ్డ కావు
వీవు కల; వేఁటిచింత నా కింక నిచట? ౮౪౪

తే॥ దొరికితివి నాకు జాతి బందుగుఁడ విచట;
చనవుసూపి, నీ కూటిలో సక్క సగము
నారగింపంగనైతి; వే మందు? వొకటి
సెప్పు! మురి యాడెడిని నాదుచిత్తము కదు. ౮౪౫

వ॥ అనుటయు నారాయణుం డతని కిట్లనియె. ౮౪౬

తే॥ చనవు సూపింప సెల్లదే సక్క, నీకు
నా యెడన్ నీ పలికినట్లు? నన్ను సెప్పు
మంటి; వట్లేల? నిన్నుఁ గాదందు నెట్లు?
జాతి బందుగుఁడవు; బుద్ధిశాలివి మఱి. ౮౪౭

క॥ ఐన నడిగె దొక్కఁటి; యది
హీనోక్తిఁగఁ దలఁపక, మనసిచ్చి, ప్రియం బెం
తేనియు సెల్లఁగఁ జెప్పుము,
దీనతకున్ గొల్పకుమది ధృతి తఱుగంగన్. ౮౪౮

తే॥ నిజమునకు నీవు కాప వేనియును నాలు
బిడ్డలను, గొంప, విడనాడి బిచ్చగాని
చందమున యిందు, నందు, నిశ్శంకఁ దిరుగు
దయ్యె కడుప కైలాసమై యావురనుచు. ౮౪౯

తే॥ లేఁడె మీ దేశమున రాజు? లేమికి నతఁ
డాయెనే? ప్రజలకుఁగాని యధముఁడె? మఱి
యెండెనే నూతుల్లును, సెలయేళ్ళు, యేళ్ళుఁ?
గృషికి భూమి కాదాయెనే కేవలంబు? ౮౫౦

తే॥ పేరుఁ బెంపును సెడి కాప బిచ్చకుఁ దిగు
నంతవుట్టెసే, యీ జగమంతయున్ గ
లంగదే? పుట్టదే యకాల ప్రళయము?
సర్వ మొకటియు మిగులక సమసిపోదె? ౭౫౧

తే॥ నిజము సెప్పుము నీవు దుర్నీతికైతొ?
కాపుఁ దనమెల్ల గంగలోఁ గలిపి, సండి
వైతొ? యప్పులవారికి నగ్గమైతొ?
యేల గతిసెడి తిరుగ నీ కిట్టులాయె? ౭౫౨

క॥ ముక్కుకొన నూర్పు గలుగన్
దక్కనె పౌరుషము పొలము తనకుండన్ గా?
పెక్కడిమాటలు పల్కెద
విక్కరణిన్? నమ్మఁజాల; నిక్లేమిటికిన్? ౭౫౩

ఆ॥గీ॥ ఉన్నరూపు సెప్పుమన్న! నిన్నొల్ల నే
ననుటకాదు; దూరనాడితి నని
చిన్నవోకు! మొకటి సెప్పెద వినుము నీ క
గుదు, నగుదు, నోపునంత కగుదు. ౭౫౪

తే॥ నీవు మాతోడ నీపూట నీరుఁ బాలుఁ
గుడిచి, వేచని, నీవారిఁ గూర్చికొనియు
రమ్ము! నాదాయఁబలె నాదరమున నీకుఁ
గూర్చివెట్టుదు నాయోపుకొలఁది నెప్డు. ౭౫౫

వ॥ అన్ని యించుక విచారించి మఱియు నిట్లనియె. ౭౫౬

తే॥ మేనిసొంపుఁ, బల్కులతీరు, మేల్మికాంతి
యింత యొప్పునె నీకు? నీ వేఁటికాపు
మానిసివి? నోరి, క్రొడలికి, నైన చంద
మింతకున్ గాననయ్యె; వేయేలఁ బేర్ప? ౭౫౭

క॥ నీ వీచందమువాఁడవు
కావునఁ, గాపుఁదనమెల్ల గంగఁగలిపి వా
పోవుచుఁ దిరిగెద విమ్మెయిఁ
గేవలమున్ గుల మకీర్తికిన్ బాల్గాగన్. ౨౫౮

వ॥ ఐనను.

క॥ కులబాంధవుండ నన్నున్
గలిసికొనఁగనైతి ; మేలుఁ గాంచితి విమ్మై ;
గలఁగకుము ! నిన్ను మా వా
రలలో నొక్కనిఁగ నాదరమున నరయుదున్. ౨౫౯

క॥ మారాజు కాపువారల
గారవమునఁ జూచుఁ, బెంపు గావింపంగా
నారయుఁ గృషి ; యాతనికిన్
గా రిప్పటి నృపులు సరి జగంబున నెందున్. ౨౬౦

ఆ॥ క్షేత్రలక్ష్మి కేళ్ళు, సెలయేళ్ళు నెప్పుడుఁ
గూర్చుచుండఁ బాదుకొల్పెఁ బెక్కు
సేతువులను రాజ్యసీమ నెల్లెడల మా
ప్రభువరుండు, లోకబాంధవుండు. ౨౬౧

తే॥ ఒకటనేని లోపము పుట్టకుండనరయు
చుండు, వేయికన్నులఁ గృషి ; నోలి పెక్కు
పాళులకు నాసపడి పట్టువట్టఁడు ; తటి
కగుచునుండు దైవమువోలె నన్నియెడల. ౨౬౨

క॥ అగుఁ బ్రజల కాతఁ ; డతనికి
నగుదురు ప్రజలెల్ల తటికి ; నాతఁడ దేవుం
డు, గురుండు, సఖుఁడుఁ, జుట్టముఁ,
దగఁ బ్రజలకు నెల్ల ; ప్రజ లతనికాన్పుఁ బ్రజల్. ౨౬౩

క॥ తమ్ముఁడ! యదె చనుము కుటీ
ర; మ్మేఁహ్మో గుడిచి, వేగ రమ్మిచటికి; లే
లెమ్ము! పని సాలకలదు; ప్రి
యమ్మున నాపల్కుఁగొను! నయమ్మున కగుచున్. ౧౬౪

క॥ అనుడు నతఁ డతనిసద్వ
ర్తనమున కచ్చెరువు, సమ్మదమును, గదుర న
ల్లన నగుచు నిల్లనియె నా
తనితో నవ్వేషధారి తగవు మెఱయఁగన్. ౧౬౫

తే॥ ఇన్ని నాళ్లకు నవ్వన కిట్లు నోచి
కొంటి నీసమ్ముఖమ్మునఁ గుడువఁ, గట్ట,
నగుడు నని బండె డాసమై; నాపురమను
చొప్పునకు నింక నిమ్మెయిఁ దప్పనైతి. ౧౬౬

క॥ మీరాజు సుపరిపాలన
గౌరవమున్ శ్రుతిసుఖంబుగా విననై, పెం
పారు కుతుకంబునకు మును
గోరికొనినయట్లు నోచికొన నిష్టైతిన్. ౧౬౭

తే॥ కాపువాఁడ నేఁ గాననఁ గాదు; కాని
కృషికి నెల్లనిఁ దప్పిపోయితిఁ, గలిమికి
మురిసిపోవుచుఁ; గీళులుమూడె దాన;
నిప్పు డవియెల్ల దడిపిన నేమిమేలు. ౧౬౮

వ॥ ఏనొక్క మహాత్ముని కతిథినై, కడుపారఁదిని, నిన్నుఁజూడవచ్చితిఁ; గాన యిప్పాట భోజనం బవసరంబుకాదు; నీ యాదరంబునకైతి; నింతియసాలు; నెల్లి సని, నా బలగంబు దోడికొనివత్తు; వచ్చి, నీ యిచ్ఛకగునట్లు వర్తింతునని, యేమేనియు నింక మాటలాడ

నుంకించుచుండ, భిక్షుకవేషంబు గైకొనిన రెండవమంత్రి వచ్చి,
యక్కాపున్ దర్శించి, దీవింపుచు నిట్లని స్తుతించె. ౮౧౯

భిక్షుకవేషధారియగు రెండవమంత్రి నారాయణున్‌దర్శించి
సంభాషించుట.

తే॥ భూమిదేవికిఁ గూర్చిన పుత్రకుండుఁ
బేదసాదల పాలిఁట పెన్నిధి, మఱి
భిక్షుక కులంబునకుఁ గల్పవృక్షమున్, జ
గంబునకునెల్ల బెనుప్రాపు కాపురాజు. ౮౨౦

తే॥ లక్ష్మి యెవ్వని పాణితలమునఁ బుట్టి,
పెక్కురూపులు గైకొని, సకల లోక
మెల్లెడలఁ దానయై యుండు నెప్డు? నట్టి
కాపురాజునకున్ నమస్కారశతము. ౮౨౧

వ॥ ఇట్లు స్తుతించి.

తే॥ ఏఁ గళింగదేశంబున నించుకంత
పేరుఁ బెంపును బడసిన భిక్షుకకుల
మునకుఁ జెందినవాఁడ; యాచనయ మా కు
లంబువారల పరమధర్మంబు; నిజము. ౮౨౨

క॥ కులధర్మంబున కెన్నఁడుఁ
దొలఁగని దృఢనిష్ఠమై బ్రదుకుదుము, మము లో
కులు చుల్క నాడినను, ని
చ్చలు సమ్మానించినను నెనఁగుదుము సమతన్. ౮౨౩

క॥ మా కిచ్చి, సుకృతమునకున్
లోకం బగుచుండు నిచ్చలును; నీ పని కా

లోకేశుఁడు సృష్టించెన్
మాకుల ; మిది మాకునైన మహిమ మహాత్మా ! ౮౭౪

తే॥ కూడు గుడ్డలు మానవకోటికెల్లఁ
గూర్ప మిమ్మును, సుకృతంబుఁ గూర్ప మమ్ము,
నీశ్వరుండు సృజించె ము ; న్నింతవట్టు
మా కృతులఁ జెప్ప వడియె ; నిమ్మాట నిజము. ౮౭౫

తే॥ మా కొసఁగువారలకు నూర్ధ్వలోక, మీని
వారికెల్ల నధోలోక మేరుపఱచె
సుకృతి దుష్కృతవ్యాజంబున సకలకార
ణాత్ముఁడగు నీశ్వరుండు సృష్ట్యాదియందు. ౮౭౬

తే॥ మూడు దినములు మెఱసెడి మెఱుకికొంప
తనువు ; సంసార మది యనిత్యంబ ; నేసి
కొన్న సుకృతం బొకఁడ తరుగునదుఁ గాని
శాశ్వతధనంబు, విను ! మానుషంబునందు. ౮౭౭

తే॥ కాన సుకృతం బొసంగి లోకంబు నుద్ధ
రించు మాకులమునకు నేమేని యిచ్చి,
సద్గతిన్ జూరఁ గొనుము ! మీ జాతియెడల
కలదు మా జాతికి సనవు, గౌరవంబు. ౮౭౮

తే॥ వలదు మీకు సదువు, గోష్ఠి వలదు, పుణ్య
కర్మములును, దపంబులున్ గావు ; నిక్క ;
మన్నిఁటికి మేము కలము ; వ్యయప్రయాస
ములకుఁ బాలువడకుఁ ! డిది తెలిసికొనుఁడు ! ౮౭౯

తే॥ కఱవుపుట్టి మా దేశము కలఁగుచుంటఁ
జేసి, మీ దేశమునకు వచ్చితిమి మాకు

లంబు ధర్మము నడుపఁ దలంచి; కానఁ
దఱికి మాకు నొసఁగి, సుకృతంబు గొనుము! ౮౮౦

క॥ యాచన యనఁగడు సుల్కఁగఁ
జూచుట సహజమయి పోయె సుకృతంబునకున్
నోచికొనని మూర్ఖుల; కీ
వాచొప్పున్ గొనక, యిచ్చి, యనుపుము నన్నున్. ౮౮౧

క॥ తన్నుఁ బునీతు నేయఁగ
నున్న సుకృతమూర్తి యాచకోత్తముని తగన్
మన్నింపనేరని నరుని
కన్నఁ దెలివిలేని ప్రాణి కలదే యెందున్? ౮౮౨

తే॥ మాయయను కల్లుఁ జెడఁ ద్రావి, మత్తువట్టి
యున్న దీలోక; మేమన? నొక్కఁడేని,
దానికిన్ దప్పి, తన మంచిదారి పట్టి
పోవువాఁడు లేఁడాయె సద్బుద్ధిశాలి. ౮౮౩

క॥ కోఱలు కన్పట్టన్, బెను
నోరు దెఱచి, జగము మ్రింగ నుంకింపుచు, ను
గ్రారభటి నేయుచున్న ద
వారణ గతి మృత్యు; వెదురవశమే దానిన్? ౮౮౪

క॥ సుకృతంబను నస్త్రము క
ల్మికి నది వెఱచి నను; భయము లే దెందుఁ యా
చకు మనసుఁ గొన్న సజ్జను
నకు; నిది నిక్కంబ యనుచు నమ్ముము నెమ్మిన్. ౮౮౫

తే॥ అని యతఁడు వెండియును బెక్కులాడఁ దివురు
టయును, విసివికొనుచు నెదఁ బ్రియముఁ దక్క,

యిట్లనియె నా కృషికరత్న మింతవట్టు
సాలునయ్య ! నే నెఱుఁగుదు ; నేలఁ బేర్వ ? ౮౮౬

నారాయణుండు భిక్షుకునిన్ దూరనాడుట.

తే॥ వంకమాటలు నేర్చినవాఁడఁ గామిఁ
బెక్కు లాడంగ సాల ; నీ వెక్కడి నయ
మూఁది యిమ్మెయిఁ బల్కెదు ? లేదె నీకు
వెఱ పసత్యంబునం ? దేఁటి వెరవుకల్మి ? ౮౮౭

తే॥ మాయమాటలు నేర్చి, మర్మము లెఱుంగఁ
గలిగి, యిమ్మెయిఁ దిరిగెదు గాలివార్త
లెన్నియేనిఁ గల్పించి, యెల్లని జగము
మోసమున ముంప, దుష్కర్మమునకు సాలి. ౮౮౮

తే॥ కాలు, సేయియు, సత్వముఁ గలుగ, మాన
హాని కోర్చి, యాచ్నకుఁ దిగనౌనె ? మాను
షంబునకు నైనవాఁడు ? నిజముగ నేఁటి
గాధ యని దానిఁ బొగడెదు కరము బేర్చి ? ౮౮౯

వ॥ పనికిఁగాని వికలాంగులు, నశక్తులున్ దప్ప, యడిగికొని జీవించుట యేరికిన్ గాదు ; సర్వశక్తి సంపన్నంబగు నాత్మతోడను, గరచరణాద్యంగకంబులతోడను, విశిష్టంబగు మానుషజన్మంబు యాచనకై యని సెప్పుటకన్న మోసం బొండు లేదు ; ధర్మం బిట్టులుండఁ దేవలము యాచనకొఱక యొక కులంబు పనిఁ గల్పించికొనుట భగవదుద్దేశంబని చెప్పసాహసించు నిన్నే మన్నను జాలదు ; మఱియును.

తే॥ ఇచ్చువారలు సద్గతి, కీనివారు
దుర్గతికిఁ బోదురఁటె ? యీ నదువున కెంత

శ్రమ పడితో ? మోసమున కిట్లు సాహసింతె ?
యింతినట్టును సాలు ; సిగ్గేడ నీకు ? ౮౯౧

ఆ॥ ఒడలువాంచి, పాటువడనొల్ల, కెవ్వయే
నియును గల్లలాడనేర్చి, జగము
మోసమునఁ గలంచి, ముంపఁదలంచు నీ
సాహసంబు నెట్లు సైపవచ్చు ? ౮౯౨

తే॥ బుద్ధి కలదేని, యూర్జవంబునకు నగుదు
వేనియును, కూలినాలి నెట్లేనిఁ గడుపుఁ
బ్రోచికొను ; మింక నెన్నండు "యాచన" యను
పల్కునకుఁబోకు ! నాబుద్ధిబట్టి బ్రదుకు. ౮౯౩

తే॥ కలదు భూదేవి, ప్రాణులఁ గన్నతల్లి ;
యాశ్రయింపు మాయమఁ జెమటార్చి, పాటు
వడుచు మమ్మున్ బలెన్ ; గానిపనికిసాచ్చు
చెనటివైతి ; విసీ ! యేమిసెప్ప నీకు. ౮౯౪

తే॥ ఘోరపాతకినేనియుఁ గూర్తుఁ గొంత
సాయపడి ; కాని నినుఁబోలు సందు నూడఁ,
బలుక, నామదినొల్ప ; దిప్పాట బుద్ధిఁ
దెచ్చికొని, పాటువడి, నెమ్మదిమెయి బ్రదుకు. ౮౯౫

క॥ నీచతకునోర్చి యెమ్మెయి
యాచన మేలంటి ? ఘనత కగునేయది ? యా
లోచింప రెదిరివారని
నూఁచెదవో జగ్గము బాలిశుఁడవై యెంపన్. ౮౯౬

ఆ॥ ఒడలువాంచి, పాటువడనొల్ల రెవ్వ ? రా
సండిపోతులఁ జెఱసాలవెట్టి ;

యణఁచి, పనులుగఁజూసి, యాపయి విడచుటెం
తయు నృపులకు మేటిధర్మ మరయ. ౮౯౭

క॥ నృపులది మా కేమిటికని
యుపేక్ష యొనరింతురేనియున్, సిగ్గున కో
ర్చి, పనులనొల్లని సందుల
కపారనిధియగుచు, యాచ్న యందఱుఁ జెఱచున్. ౮౯౮

తే॥ సారమానుషజాతి వృక్షమునకెల్ల
బదనికలు యాచకులు; వీని బలుపు దాని
నాశనంబునకున్ గారణంబు; రాజు
లరయువా రిది తమకుఁ గృత్యముగ నెపుడు. ౮౯౯

తే॥ చోరులును, యాచకులు, విటుల్, జూదరులును
బలుపుఁ గాంచంగనైన, నపారమైన
హానివాటిల్లు జగతికి; నంతవట్టు
పుట్టకుండ నరయునది భూమిపతులు. ౯౦౦

తే॥ ఇచ్చువారల భూషింతు, రీనివారిఁ
దిట్టుదురు యాచకులు; వాండ్రు పెట్టికొన్న
నిధులె ప్రజ? లేఁటి బలువుమైనిక్కి, నోరి
బలిమి నూపుదు రీతులువలు సెలంగి? ౯౦౧

క॥ కలరు వికలాంగులు, నశ
క్తులుఁ, బేదలు; వారలె యగుదురెపుడు దానం
బులు గొన, మఱి దాతల ధ
న్యులసేయన్; యాచకులన నొప్పరు మాకున్. ౯౦౨

క॥ వేయేలఁ జెప్పి పలుకన్
వాయోడక? యిచట నిల్వవలదు, ననును, నా

పై యలుగకు ; మింతలు నీ
శ్రేయంబున్ గోరి సాలసెప్పితి సుమ్మీ. ౯౦౩

ఆ॥ ఒడలువాంచి, పనుల కోర్చు దేనియు నినుఁ
గూర్చికొందు ; నోపుకొలఁది నగుమ ;
నిష్టమేని నిల్వు ; మిష్టముకాదేని
యేగు మిచటనుండి యిపుడతొలఁగి. ౯౦౪

తే॥ కలదు భిక్షుకకులము లోకంబున నొకఁ,
డనుటకున్ లజ్జయగుచున్న దనుడు, నతఁడు
సాలులే ! యేటి నీ సరసత్వ మనుచుఁ
దొలఁగి సని యటనుండి యెందులకు నేని. ౯౦౫

వ॥ అనంతరంబ విప్రవేషధారి యగు ప్రధానామాత్యుం డన్నారా
యణు నుద్దేశించి, యయ్యా ! నీమాటచొప్పున రేపు పెందలకడన
వచ్చి, నాయిచ్చకైన యావున్ గొని, చనియెదనని, ప్రియంబుమై
సెప్పి చనియెఁ, బదంపడి కర్షకవేషధారియగు రాజసత్తముండు
సకల సస్యసౌభాగ్యలక్ష్మీసదనంబు నానొప్పు నప్పొలంబు నూచు
వాఁడున్ బోలెఁ దిరిగి, పరీక్షింపుచు. ౯౦౬

తే॥ ఔర ! యీ కర్షకుని సముదంచితకృషి
చాతురీమహిమామహోత్సాహశక్తు ?
లిట్టిధన్యులఁ గాంచికాదె వసుంధ
రాఖ్య భూదేవి వినుతింప లగుటయెల్ల. ౯౦౭

క॥ తెలివియును, దానికిన్ దగు
బలగంబును, దానికి బహుభంగులఁ దగు మే
లొప్పొలమును, దానికిఁదగు గో
కులము, నితని కింత లిట్లగుటమేలు ! బళే ! ౯౦౮

తే॥ ఏఁటిరాజ్యము గొడవ? యిట్లింతలు నొడఁ
గూడఁ బరమ ప్రశాంతి లోకులకు నగుచు,
నీతఁడుకా బలె నుండుట యిదియ పుట్టు
వునకు సాలదె; యితఁడు నా మనసుఁగొనియె. ౯౦౯

తే॥ కాప ప్రాణంబు సకలలోకంబునకని
విందు మును, గంటి నిప్పు డివ్విధము నేత్ర
పర్వముగ; నిట్టికాపులఁబడసి, నాదు
రాజ్యలక్ష్మి గర్వంబునఁ గ్రాలకున్నె? ౯౧౦

తే॥ సర్వశక్తులును గృషిరక్షణము నంద
ధారవోయురాజులు ధన్యతములు జగతి
నందు రాఠ్యలు; నిక్కంబ యది; ప్రజలకుఁ
గూడు, గుడ్డయుఁ గృషి నొనగూడుఁగాన. ౯౧౧

వ॥ ఏను మనంబు జాయిన్‌జేసికొని, పరమ నిష్కపటస్వభావ పవిత్రుం
డగు, యిక్కర్షకోత్తముని మాట మెలకువన్ వంచించియు, బలిమి
మెయి సర్వస్వమ్ములుఁ గొనియు, దిగులు పుట్టించియు, యీతని
కృషిచాతురీవిశేషంబుఁ బరీక్షించి, యావల రాజ్యంబునన్‌గల
యెల్ల కాపులకన్న నధికున్‌జేసి నూచెదఁగాక యని, లోన నాలో
చించికొని, యన్నాగాయణు నమీపించి, ప్రియంబుమై నారాజ
సత్తముం డిట్లనియె. ౯౧౨

తే॥ అన్న! నీ చెప్పినట్లు నా యాలుబిడ్డ
లకా, మఱియు నాకు నగువారలన్, బ్రియంబు,
మెఱయఁ గొనివత్తు; నాకు నేమిఁటఁ గొఱంత
పుట్ట; దాజ్ఞ యొసంగుము పోయి వత్తు! ౯౧౩

క॥ అనుఁడు నతఁడు మే లది పొ
మ్మనుటయు, నచ్చోటువాసి, యరిగె విడిదికిన్
మనమలరఁ, గాపువేషముఁ
గొనిన నృపుం; డతనిఁ, గూడికొని రా మంత్రుల్. ౯౧౪

వ॥ ఇట్లా రాజు మంత్రులన్ గూడికొని, వారికిఁ దన యాలోచించిన చొప్పుఁ జెప్పి, వారలు మే లనఁ, బురంబుఁ బ్రవేశించి, రాజ్యంబునఁ గల మేటికాపులఁ బిలిచికొని రా భటుల నియోగించెఁ; బదంపడి యాభటుల పిలుపునన్ జేసి. ౯౧౫

క॥ అనువుపడిన కానుకలన్
గొని, యొక్కఁడు నొకఁడుఁ గూడికొని, వచ్చిరి నె
మ్మి నెగడ, సముచితవేషము
లొనరంగా మేటికాపు లుత్సాహముతోన్. ౯౧౬

వ॥ ఇట్లు వచ్చిన, వారినెల్ల నాదరించి, వా రొసంగిన కానుకలన్ గొని, బసదనంబు లిప్పించి, తనపురంబునఁ గొన్నిదినంబులు వారి నునిచికొని, యన్న రేంద్రుం డొక్కనాఁడు సభఁజేసి, యందుఁ బాల్గొనిన యమ్మేటికాపులందొక్కనిన్ బిలిచి, నీ బ్రదుకుచందం బెట్లున్న దని యడుగుటయు, నతం డి ట్లనియె. ౯౧౭

క॥ దేవరకృప మాకున్, మా
గోవులకున్ సేమ; మెందుఁ గొఱఁతయనన్ లే;
దా వానగాలి పొలముల
దేవత లెప్పుడును గరుణఁ దేల్తురు మమ్మున్. ౯౧౮

వ॥ అనుడు నతనిఁ గూర్చుండ వల్కి, తక్కిన మేటికాపులనెల్ల, వరుసగా నొక్కొక్కనిం బిల్చి యట్ల యడుగుచు, వారందఱు నట్ల మారువల్కఁ, గూర్చుండ వల్కుచు, నవ్వరుసను వచ్చిన నారాయణున్ జూచి, యంతరంగంబున సంతోషంబును, గార్యచింతయు,

నొండొరులమీఱి యలమికొన, గాంభీర్యంబున వాని నణంచికొని, యమ్మహీశ్వరుం డయ్యందఱ నడిగిన ట్లడుగుటయు, నతం డిట్ల నియె. ౯౧౯

తే॥ నా పరిశ్రమమునిఁ జేసి, నా పశువులుఁ,
బొలము, నెప్పుడుఁ బాడిపంటల నొసంగు
చున్నయవి ; కఱవనఁగ లే దెన్నఁడేని ;
మాకు, మా పసులకును సేమంబ సాల. ౯౨౦

వ॥ అనుటయు నారాజసత్తముండు సంతసించియు, నది దోఁప నీక.

తే॥ లేని కోపంబు నాత్మఁ గల్పించికొని, స
భాసదుల నెఱ్ఱనగు చూడ్కిఁ బఱపి, నూచు
టయును, గళవళపడి, వారు భయముతోడి
యిచ్చకమునకుఁ దిగి, తగ నిట్టు లనిరి. ౯౨౨

క॥ ఇతఁ డేమియు సరకుగొనం,
డతివాదంబునకు నిర్భయంబునఁ దిగె ; నేఁ
టి తులువతన ? మిమ్మెయి నన
మతిసెడియెనొ ? కాక దురభిమానమొ ? యేమో ? ౯౨౩

క॥ మీ చిత్తము వచ్చిన య
ట్లీ చెనటిన్ గూర్చిసేయుఁ ; డే మెవ్వర మా
లోచన సెప్పఁగ ? నీ దు
ర్వాచాలుత్వంబు సైప వచ్చునె యెట్లున్ ? ౯౨౪

వ॥ అని యంత నిలువ, కా సభ్యు లన్నారాయణుఁ జూచి, గర్హిం పుచు నిట్లనిరి. ౯౨౫

తే॥ నోరి క్రొవ్విన యింతలు కాఱులఱచి
తెచ్చికొంటివి ముప్పు ; మదించి ప్రభుల

నరకుఁ గొనని ముక్కిడి కేఁటిచదురు? బ్రదుకు
తెరువు? నీకింక యెం దేని దిక్కు కలదె? ౨౬

తే॥ పొలముఁ బుట్టుచు నన యేడ కలవు మనకు
ప్రభువు కన్నెట్టనైన? నీ పల్కు దోస
మెంత కయ్యెనొ? యెఱిఁగితే? యేమిసేయ
వచ్చు? నీ యెడ మాఱె దైవంబు చెయ్వి. ౨౭

వ॥ ఇంకనైన బుద్ధి దెచ్చికొని, యేలికవారికి నీ సర్వస్వము సమర్పించి కొని, యెందేని సని, యెట్లేని జీవింపు; మిది నీ బుద్ధిమాలిన తనంబునకుఁ దగినదండం; బనుటయు రా జిట్లనియె. ౨౮

తే॥ మీరు పల్కినదాని కే మించి యొండు
సేయఁ బోలమి, మనసు నొచ్చియును సైచి;
తట్లు కావింపుఁ డన, వార లతనిఁ జూచి
యేమి సెప్ప దనుడు నతఁ డిట్టులనియె. ౨౯

క॥ మీరును, మన యీ యేలిక
వారును, తగ మాటమెలుకువమెయిన్ నన్నున్
గారించి, సర్వమున్ గొను
వారై రఁటె? కొనుఁడు! దూరవల్కుట యేలా? 30

నారాయణుండు రాజసభ నిర్భయంబుమై వల్కి, తన సర్వస్వ
మర్పించికొనుట.

వ॥ ఏను శ్రమకోర్చి, తుప్పలున్ డొంకలున్ ద్రవ్వి, మిట్టు పల్లం బులు సరిసేసి, మళ్లుఁ గట్టి, యందు నూతుల నెలకొల్పి, చెఱువుల సేయించి, యిట్లరణ్యంబు సుక్షేత్రంబుఁ గావించికొనియుఁ, బ్రభుత్వంబు వారికిఁ బాల్గొసంగుచుఁ బనులతో శ్రమపడి, యిప్పాలంబునం దెట్లేని జీవించుచున్నారము, కాని ప్రభుత్వము

వారిది తిని యెఱుంగము ; నిజం బిట్లుండ, వాచెడి మిమ్మున్ బలె వంకమాటలాడి, యిచ్చకంబునకు సొరనాకేల ? నన్యాయంబునకు వెఱవక, మీరును ప్రభుత్వంబువారును, నా సర్వస్వముఁ గొనఁ దలంచితిరేనిఁ గొనుండు ; దైవంబు నక్కఁ జూచునేనియు, నాఁగలి వాఁడి సెడదేనియు, నే నెచ్చోనేని సుఖజీవనంబు సేసికొనఁ గలవాఁడ ననుటయువిని యూరా జిట్లనియె. ౯౩౧

తే॥ పెక్కులాడకు ! మేఁటికిఁ జేర్చ ? నీ పొ
లంబునకుఁ జేరువ బృహచ్ఛిలాతలంబు
కల దొకండని విందుము ; కరుణఁదలఁచి
యది యొసంగితి నీకు ; నొండనక గొనుము. ౯౩౨

క॥ అది పొలము జేసికొని, నె
మ్మది బ్రదుకుము పొమ్ము ! నీ సమస్తధనములున్
ముదమెసఁగ నిచ్చికొను మా !
కెదఁగలఁగకు ! కాఱుబఱచి తిందఱులోనన్. ౯౩౩

వ॥ నీ సర్వస్వమ్ములుఁ గొంటి ; నింతియ నిన్నుఁ జెఱవెట్టించి, దండింప మనసు కాదు పొమ్మనుడు నతం డిట్లనియె. ౯౩౪

తే॥ న్యాయమన నేడ ? యది యరణ్యంబువట్టె ;
నాదు సర్వస్వముఁ గొని, మనమునఁ గరుణఁ
దలఁచి, యిప్పించితిరె శిలాతలము ? సాలు
నదియ దైవము కృపసేయనైన మాకు. ౯౩౫

ఆ॥ కంట నీరు గ్రమ్మఁ గాపు కలంగిన
నేమిమేలు ? రాజ్యమెల్లకలఁగు
నని యెఱుంగవైతి ; నక్కట ! నీవెంత
మూరనైతి ? వేమి మాయయొక్కొ ? ౯౩౬

క॥ నీ మంచితనంబంతయు
నీమెయి నెఱుఁగుటకుఁ దపింతు ; నింతియ ; మఱి యొం
డేమియు నా యెదలే ; దే
నేమన్నను దప్పె ; యాజ్ఞయిమ్ము సనియెదన్. ౯౩౭

వ॥ అనివలికి యన్నరేంద్రు నాజ్ఞవడసి, కొందఱు రాజభటులు తనతో రా, నతండు తనయూరుసేరి, తనవారి కదియంతయుఁ జెప్పి, తన గోధనక్షేత్రాది సర్వస్వమ్ములును వారి కప్పగించి, తనకు రాజొసంగిన బృహచ్ఛిలాతలంబునకుఁ జేరువ నొక కుటీరంబు నిర్మించికొని, తనవారితో నందువసింపుచుఁ, జెంగటి మృణ్మయప్రదేశంబు ద్రవ్వి, యెత్తికొని, తచ్ఛిలోపరి భాగంబంతయు మృణ్మయంబు గావించి, యందు సస్యంబుల కుపకరించు సారపదార్థంబులు జేర్చి, సక్కదున్ని, మన్ను తొలంగిపోవకుండ గట్టులుగల్పించి, తత్ప్రదేశంబునకు నాలుగుమూలల నూతులు ద్రవ్వి, యేతాములున్ గూర్చి, నీరెత్తి, సల్లి, పెక్కు సస్యంబులు పుట్టించి, పెంపుసేయుచుండె ; నంత. ౯౩౮

తే॥ నూతినీరును, గ్రొత్తమనున్ను, సమున్న
తప్రదేశమునైన కతమున నందుఁ
బెట్టినట్టి సస్యంబులు పుట్టి కొంకఁడు
సాలు సనఁ దగి యేపుమై సక్క పెరిగె. ౯౩౯

తే॥ మూడుపుట్ల పొలంబయ్యె మొక్కవోని
చందమున నా బృహచ్ఛిలా స్థలము ; తఱికిఁ
బండనయ్యె నందలి సస్యపంక్తులెల్ల
కొన్నినెలలు సనన్ గడుఁ జెన్నెసంగి. ౯౪౦

వ॥ అంత,

క॥ ఆతని భవ్యకృషికళా
చాతుర్యం బట్టులగుట సాలుగ వినఁచున్
సూతము కాకనివచ్చె మ
హీతలపతి వేడ్కమీఱ నిష్టులతోడన్. ౯౪౧

ఆ॥ ఇట్లు వచ్చి, యచట యిమ్మగునెడల గొ
రవ మెలర్ప విడిసి, రహిఁ సెలంగఁ
బిలువ ననిచె మిగుల బేర్మిమై నప్పంట
కాపు నా నృపాలక ప్రవరుఁడు. ౯౪౨

వ॥ పదంపడి.

తే॥ రాజు వచ్చి, విడిసి, యాదరం బెలర్పఁ
బిలువనంపించుటకుఁ గడుఁ బ్రియముఁ, గౌతు
కమును, మది వెల్లివిరియ, మొగంబు సక్క
నై, యతఁడు వచ్చి, దర్శించె నన్నరేంద్రు. ౯౪౩

ఉ॥ ఈసును గోపమున్ మది నొకించుకయేనియుఁ బుట్ట; వంచితో
ల్లాసము, గారవంబు, నకలంక శుభాశయ సంభృతోరు వి
శ్వాసముఁ బెద్ద లా కృషికవర్యుని కన్నరపాలవర్యు నం
దాసమయమ్మునన్; వినుతి కర్హమ యాతనిశీల మమ్మెయిన్.

తే॥ ఏల బిల్పించి నొకొ? నృపుఁ డిమ్మెయి నని
కలఁగఁ డించుకయును దొంటిగాథఁ ద్రవ్వి;
ప్రభు ననుగ్రహమునకు నిబ్బంగి నైతి
నని మురిసిపడఁ డక్కాపు మనసు నిండ. ౯౪౫

వ॥ ఇవ్విధంబున నతివిమల స్వభావంబుమైఁ దన్నుఁ దర్శింపవచ్చిన
యప్పరమకృషీవలు నత్యాదరంబుమైఁ బల్కరించి, కూర్చుండ
నియమించి, యా నృపాలుం డిట్లనియె. ౯౪౬

రాజు నారాయణునితో గారవంబుమెఱయ సంభాషించుట.

తే॥ త్రవ్వెదో తొంటి మనగాథఁ? దగవు వెట్టె
దో? ప్రియంబున మము సూచెదో? యిఁ దేఁటి
మాయయని యీనడించెదో? మనసు నిచ్చి,
పల్కునకు సారు! మిదియొక పనిఁగఁ దలఁచి. ౯౪౭

వ॥ అనుడు నతం డతని కిట్లనియె. ౯౪౮

తే॥ వంకమాటలు నేర్చినవాఁడఁ గాను
నన్ను మీర లెఱుంగుదు రన్న పల్కు
కండ నాపల్కు నగునది; కాని, పోని,
లేనిమాటలుఁ, దలఁపులు లేవు నాకు. ౯౪౯

క॥ మీ రట్లు నాఁడు సేసిన
వారసి మీ యెడల నుడుకువాఁడన్ గా; నె
వ్వారికిని గీడుఁ దలఁపన్;
నో రోకఁడుఁగఁ, బల్కకఁడుఁగ నూల్కన నెందున్. ౯౫౦

తే॥ ఊయి పొలమయ్యెఁ, బండు నిరంతరంబు
మొక్క వోవక యేపుమై నక్క సకల
సస్యములు దానియందు? నా శ్రమము రిత్త
వోవునే? లేఁడె యూపయి దేవుఁ డొకఁడు? ౯౫౧

క॥ మీ రిట్లు వచ్చి, నిడిసిన
కారణ మరయంగరామి గలఁగెడు నెద; యే
కోరికమెయి ని ద్దేలిక
వా రున్నారొక్కొ? యెఱుఁగ వశమే మాకున్? ౯౫౨

తే॥ అనుడు నత్యాదరమును, బ్రియమును, వెల్లి
విరియుభంగి నిరూపించు విధ మపాంగ

మఁలు వహింపంగఁ, జిరునవ్వు మోముల౦క
రింప, నా నృపుఁ డతనితో నిట్టులనియె. ౯౫౩

క॥ విను ! నీ సేమ మరయు టొక
పనిగా వచ్చితిమి ; కొంతపనియుఁ గల ; దెఱుం
గ నగున్ బిమ్మటఁ ; గలఁగకు !
మనుమానంబునకు, భీతి, కగ్గంబగుచున్. ౯౫౪

క॥ బలగము గల మేటికృషీ
వలుఁడవు ; నీ సేమమరయ వలదే మా కి
చ్చలు ? రాజ్య తరువు మూలం
బులు గారే యరయ నిన్నుఁ బోలినకాపుల్ ? ౯౫౫

వ॥ రాజ్యంబునన్ గల మేటికాపులనెల్ల రావించి, యిచ్చట సభఁజేసి, పెక్కువిషయంబులు చర్చించిపోవన్ బెద్దతలంపు వెట్టికొనివచ్చితి ; నీవును సభకు రావలయుఁ జుమ్మీ ! యని పల్కి, యాక్షణంబ భటులన్ బంచి, రాజ్య మెల్లెడలఁ గల మేటికాపులన్ బిలిపించె, ననంతరంబ. ౯౫౬

తే॥ మేటి కాపులు వేడుకమీఱ, నొకఁడుఁ
దప్ప కందఱువచ్చిరి తడవుసేయ ;
కాదరించె వారల నెల్ల నవ్విభుండు ;
పెద్ద సభఁజేసెఁ బిమ్మట పేర్మిమెఱయ. ౯౫౭

వ॥ ఇట్లు సభఁ జేసి.

క॥ శిలఁ బొలముఁ జేసికొని, యి
చ్చ లలరఁగా నందు సకలసస్యంబులుఁ బెం
పలరన్ బుట్టించు ఘనుఁడు
కలఁడే మీలోనఁ బెద్దకా పొకఁడేనిన్ ? ౯౫౮

క॥ అనుటయును వారలందఱు
విని, యది యత్యద్భుతకరవిషయమనియు, న
ప్పనికై నవాఁడు తమలో
న నొకండును లేఁడనియు, వినయ మొనఁగంగన్. ౯౫౯

క॥ వినిపించుటయును నాతఁడు
విని యిస్సీ! మీకు నేఁటి వెరవు? కృషి యొఱుం
గని నోటి పోటు శూరుల;
రని యిట్లని మఱియు దూరనాడుచుఁ గినుకన్. ౯౬౦

రాజు మేటికాపుల దూరనాడి నారాయణున్ బొగడుట.

తే॥ సమధికంబుగ నెసఁగు వేషంబులకును
భాషలకు సాలుదురు; మఱి పనికిఁ గారు
మీర; లెక్కడి కాపుల? రార! యెంత
లాడితిరి నాఁటి సభ నప్డు? డట్లు కారె? ౯౬౧

ఆ॥ ఇంత లేసి కాపు లిందఱు కలుగ మా
కేఁటి లోపము? ప్రజ కేఁటి కఱవు?
కాదె ఱాయి పొలము? కాదె? కాదే? రండు
చూత మొక్కెడ నది ప్రీతి యెసఁగ. ౯౬౨

వ॥ అని పల్కి, దిగ్గన యాసనంబునుండి లేచి, యమ్మహీశ్వరుండు నడుమన్ సాగె; నతని వెన్నంటి సభవారందఱు వెల్లనగుచు నడిచి; రిట్లు వారు రా, నతండు నారాయణుని శిలాక్షేత్రంబు దర్శించె, నందు. ౯౬౩

సీ॥ ఒకమూలఁ బండి, నేలకుసొంపుఁగూర్చుచు, వ్రాలి, కడున్ గ్రాలు
రాగిచేలు, । నొకవంక వెన్నుచా లొప్ప, వెదురుపొద చాడ్పున

యొదిగిన సజ్జచేలు, । నొక ప్రక్క సాల గాఱుకొని, యేపారి, పొట్టల
కల్మి ఫైలయు మెట్టవరిచేలు, । నొక్కెడ నొండొరు నొరసికొం
చున్, జెల్వొనఁగ మిసమిసలాడు చామచేలు,
నొక్కచోటఁ బలిసి, యొక్కండు బెక్కులై
చెన్ను మీఱఁ బొలచు జొన్నచేలు,
వెండియుఁ బలుచోట్ల వివిధసస్యములు నే
త్రోత్సవమగుపేర్మి నొప్పుచుండె. ౯౬౪

తే॥ ఇట్లు బహువిధ సస్యసమృద్ధి నెసఁగు
నా శిలాక్షేత్రముఁ గన్నులారఁ దాను
సూచుచున్, వారికెల్లను జూపుచు, హృద
యంబు నిండారఁ బొంగె నయ్యవనివిభుఁడు. ౯౬౫

వ॥ ఇట్లున్న రేంద్రుం డత్యానందంబునఁ బొదలుచుఁ దత్క్షేత్రనిర్మాణ
చాతుర్యంబునకు మెచ్చి తలయూచుచుఁ, బదంపడి సభ్యులలోఁ
దాను నొక్కండై, యేమియు ననక సూచుచున్న కర్షకశ్రేష్ఠు
నారాయణు నత్యాదరంబున సమీపించి, యతనిపాణితలంబు నిజ
పాణితలంబున గ్రహించి, తోడికొనివచ్చి, యా సభలో నుచితా
సనం బొసంగి, తానును సముచితాసనంబు నలంకరించి, సభ్యుల
నందఱఁ గూర్చుండఁ బలికి, యుచ్చస్వరంబునఁ దత్సభ్యులగు కర్ష
కుల కిట్లనియె. ౯౬౬

క॥ ఈ నారాయణు నెఱుఁగుదు
రే ? నా డాసభ నితని నరిన్ బలె మీ రే
మేనియుఁ బేరిచి పల్కితి ;
రేను ప్రియముఁ బొందఁ దిగితి రిచ్చకములకున్. ౯౬౭

వ॥ నాఁటిసభ మిమ్మందఱ నొక్కఁ డొక్కఁడుగఁ బిలిచి మీ బ్రదుకు
చందం బెట్టిదని యడుగుటయు. ౯౬౮

క॥ దేవరకృప మాకుఁ, మా
గోవులకును నేను ; మెందుఁ గొఱఁతయునఁ లే ;
దావానగాలిపాలముల
దేవత లెప్పుడును గఱుణఁ దేల్తురు మమ్ముఁ. ౯౬౯

క॥ అని యంటి ; రప్పలుకు లె
ల్లను యిచ్చకమునకుఁ గేవలముఁ దిగి నామె
ప్పునకై మీ రాడిన య
త్యనృతానుచితోక్తు ; లెఱిఁగి తప్పుడ వానిన్. ౯౭౦

వ॥ ఎఱింగియు లోకోత్తరకృషికళాఘనుండైన యున్నారాయణుని కృషిచాతుర్యంబుఁ బరీక్షింపన్ గోరి యున్నవాఁడ నగుటఁ గార్యంబుఁ దలంచి, యప్పటికి మీ యనృతోక్తుల సహించియు, ననుసంధించియు మీ కింపుపుట్టఁ బ్రవర్తించితి ; నిప్పుడు నాఁటి మీవాక్యంబుల విమర్శించి, తగవు సెప్పుట యవసరంబు ; కావున యట్ల సేయుదు, వినుండు. ౯౭౧

క॥ నాకృపయన నేమిఁటి ? దది
మీకున్, మీ గోవులకు నమితశుభదంబై
సేకూర్చునె శాంతిసుఖము ?
నాకరయన్ బోల ; దేమనన్ మీ మెప్పున్ ? ౯౭౨

తే॥ రాజ్యమను వృక్షమునకు నారయఁగఁ గాపు
వార మూలము ? లిది లోకవార్త, కఖల
శాస్త్రసారవాదమునకు, సత్యమునకు,
సమ్మతమగు సిద్ధాంతంబు సాలదనుక. ౯౭౩

తే॥ కాన మీకృపకేను నిక్కముగ నగుదుఁ
గాక, మీ రెట్టులగుదురు నాకరుణకు ?

సత్యమిట్లుండ, మీర లసత్యవాద
మునకుఁ దిగితిరి నా చిత్తమునకు బడయన. ౯౭౪

తే॥ కలఁడు మీకును, నాకు, లోకమున కెల్ల
నీశ్వరుం డొక్కరుం; డతఁ డెల్లవారి
యెడల సముఁడు; సంరక్షకుఁ; డెంతయేనిఁ
బొగడఁ, జర్చింపఁ, బూజింపఁ, దగినవాఁడు. ౯౭౫

వ॥ అది యట్లుండనిండు, నాఁటి మీ యనృతకల్పనాబంధురస్తోత్రపాఠం
బింక నెంతేనియు విమర్శించి, మిమ్మిప్పుడు తిట్టనై యుండు, నైన
నదియంత ద్రవ్వనేలయని యడిగెద, నాఁడు మీ యందఱియట్లు
గాక యున్నారాయణుండు. ౯౭౬

తే॥ నా పరిశ్రమమునఁ జేసి నా పశువులుఁ,
బొలము, నెప్పుడుఁ బాడిపంటల నొసంగు
చున్నయవి; కఱవనఁగ లే దెన్నఁడేని;
మాకు, మా పనులకును సేమంబసాల. ౯౭౭

క॥ అనిపలికె, దాని కీరె
ల్లను నీతనియెడఁ గినిసి, తలకు నొక్కఁటి చొ
ప్పునఁ బెక్కులాడితిరి నా
మనముఁ బడయుఁగోరి, మంచిమానిసులు బలెన్. ౯౭౮

వ॥ నాఁటి మీ చందంబు, నితనిచందంబును బాగుగ నెఱింగియు, నీతనిఁ
బరీక్షింపఁగోరి, మీ మాటచొప్పున యితని సర్వస్వములుఁగొని,
పైనుఱాయి నొసంగి కృషిచేసికొని బ్రదుకు పొమ్మంటి; నితండు
దానికి సహించి, తన యపారపరిశ్రమంబును, గృషికళానైపుణ్యం
బును దేటపడ ఱాయిన్ బొలంబుగావించికొని, యందెల్లసస్యంబు
లును బుట్టించి, పెంపుఁజేసికొనియె, నిప్పుడది మనకుఁ బ్రత్యక్షంబ
కాదే? ఘుఱియును. ౯౭౯

తే॥ ఇతని యీనాఁటిపల్కుకన, కిప్డుకాన
నైనదానికి, నేమందు ? రనుఁడు ! వంక
మాటల న్నేర్చికొనిన దుర్మతుల ; వీర
లేమి పల్కిననేమి ? మీ కేఁటిసిగ్గు ? ౯౮౦

క॥ మీ రేఁటిప్రజలరు ? కృషికిఁ
గారు ; మిమున్ జూడఁ, బలుకఁ గాదు ; చెడున్ బో
మారాజ్యము మీవలనన్
బేరున్ బెంపు వెసమాసి, పెలుచఁ గలఁగుచున్. ౯౮౧

క॥ శిల పొలమగుటయు, నందు స
కల సస్యంబులును బెంపుఁగాంచుటయును, మీ
రలకాదు, మరియు మీ పూ
ర్వులునేనియు నెఱుఁగుదురఁ బోలదుకాదే ? ౯౮౨

తే॥ పిలుపునేయుచె తడవుఁగాఁ బెద్దపెద్ద
బిరుదములు, వేషములు నొప్ప, మురిసిపడుచు,
వచ్చితిరి కాపుఁదనమెల్ల యచ్చువడఁగఁ ;
గాని, కాపులరని సెప్పఁగాదు మిమ్ము. ౯౮౩

తే॥ కల్లబొల్లిమాటలు పనిగావు ; కూడ
దిచ్చకముఁ ; దోడికాపులమెడ నసూయ
సనదు కాపుల ; కీ రట్టిచందమునకు
నగుదురే ? చెప్పుడ ! నిజంబ యంతవట్టు. ౯౮౪

తే॥ ప్రకృతిసృష్టికి వన్నెఁగూర్పంగఁ జాలు
వాఁడ నిజమునక్షక గాపువాఁడు ; ఱాయి
పొలమగున్, విత్తొకండ పెక్కులగు, మంచి
కాపు కృషిచాతురీసమగ్రతరమహిమ. ౯౮౫

ఉ॥ ఎక్కడికాపువారమని యిమ్మెయివచ్చితి ? రేమిసెప్పనై
యిక్కడఁ కింద ? రీతెలివి యెందును సూడముకాదె ? యేఁటికీ
ముక్కడిమూక యందురు మిమున్గని, యాసభ నప్పుడన్న యా
చక్కని పెద్దపల్కులపసన్ దలపోసియు మేటిమానిసుల్. ౯౮౬

తే॥ వంకమాటలు నేరిచి, శంకదక్కి
ప్రేలు మీకేఁటిసిగ్గని, పేర్చి, నోరి
చేటుగాఁ బెక్కులాడ నాకేఁటిగోడవ ?
చెల్లెఁబో ! మీ తెలుంగెల్ల తెల్లమయ్యె. ౯౮౭

వ॥ అని పెక్కు తెలుంగుల వారిన్ దూరనాడి, నారాయణు నాదరంబు
మై వీక్షించి, యయ్యా ! నీతెలుంగరయన్గోరి యేను కాపువేషం
బును, బ్రధానమంత్రి బ్రాహ్మణవేషంబును, మఱియొకమంత్రి
భిక్షుకవేషంబునుగైకొని, నిన్నును, నీ పొలంబును దర్శించి, యా
నాఁడు పెక్కుపోకలన్బోయితి, మెఱింగితే ? యని యారాజసత్త
ముండు మఱియు నిట్లనియె. ౯౮౮

తే॥ కోరికొను మెద్దియేని, నీకుఁ దగంగఁ
గూర్తు ; ననవుడు నతఁడు నేఁ గోరుటయును,
మీ రొసంగుటయును, నాకు మెచ్చు గావు ;
మీ మదికి నైతి ; నిదియ నా మెచ్చుపదవి. ౯౮౯

వ॥ అనుటయు నమ్మహీశ్వరుం డక్కర్షకరత్నంబున కుత్తమాశ్వంబును,
బల్యంకియుఁ, జీనిచీనాంబరంబులు, భూషణంబులు నిచ్చి, సత్క
రించి, యతనివలన మున్నుగొన్న సర్వస్వమ్ములు నిప్పించి, తక్కిన
కాపులకెల్ల వస్త్రాదు లిప్పించి, యాదరించి, బుద్ధి సెప్పి, తన పురి
కిన్ జనియె ; నని చెప్పి యప్పరమ ద్విజుం డక్కాపున్ జూచి,
మఱియుఁ నిట్లనియె. ౯౯౦

తే॥ వింటె యక్కాపు కృషికళావిభవగరిమ,
యమ్మహీశ్వరు నౌదార్య ? మతనిఁ బోలు
రాజు, లక్కాపుఁ బోలు కర్షకులుఁ, గలిగి
రేనియున్ భూమిదేవికి యేఁటి కొదువ ? ౯౯౧

వ॥ అని వెండియు నతం డతని కిట్లనియె. ౯౯౨

తే॥ ఎంత కూరిచి సెప్పిన నింక మిగిలి
యుండుఁ గృషిసత్కళావైభవోన్నతియుఁ, బ్ర
శస్తతయు ; నేఁటి కింతియ సాలు ; బుద్ధి
మంతుఁడ ; వెఱుంగనోపుదు వంతయుఁ దగ. ౯౯౩

వ॥ మఱియును.

తే॥ స్వయమ కృషిసేసికొను నిచ్చ వచ్చితి ; వది
మేలు ; నీ యభ్యుదయమున సాల గోరు
నేను కాదందునే ? నాకు నింతకన్న
నింపుపుట్టించు వార్త యింకేమి కలదు ? ౯౯౪

క॥ నాలుగు పాళులలో నొక
పాలొసఁగుము మాకు నెల్లపంటల ; నేమున్
బాలు కృషివ్యయములకున్
బోలఁగ నిత్తు ; మది శ్రద్ధఁ బుట్టించుఁ గృషిన్. ౯౯౫

వ॥ అని పల్కి లోక విద్వరుండగు నా బ్రాహ్మణశ్రేష్ఠుం డక్కర్షకో
త్తమునకు నా క్షణంబ, సకలకృషిపరికరంబులతో నెద్దుల జతయును,
విత్తులును, గృషివ్యయంబునకై కొంతధనంబును యిప్పించి, కృషికి
నిమ్మగు తన పొలంబొండు పేరున్ దడివి యిచ్చి, యాదరించె,
నది సూచి. ౯౯౬

తే॥ ఆద్విజోత్తము పత్నియు నా కృషికుని
కెల్లవస్తువులను గూర్చి, యిచ్చి, పంచె ;
వారలకు వందనము సేసి, గారవంబు
మెయి నతం డింటికిన్ బోయె మెచ్చుకొనుచు. ౯౯౭

క॥ తన యిల్లు సేరి, యాలికిఁ
దన పోయినతెఱఁగు, విప్రదంపతులు ప్రియం
బున తన కిచ్చిన విధమును
వినిపించెన్ సంతసంబు వెల్లి విరియఁగన్. ౯౯౮

వ॥ దానికిఁ దత్సహధర్మిణియగు సరళయు సంతసంబునన్ దేలి, యాతనికిఁ దోడ్పడి, బ్రాహ్మణదంపతు లిచ్చినవెల్ల నింటఁజేర్చికొని, యెద్దులను సాలఁగట్టి, కృషిపరికరంబుల నొక్కచో భద్రపఱచి, యతని కిట్లనియె. ౯౯౯

క॥ మన యెడల నెంతయేనియు
ననుగ్రహము పేర్మి సూపి, రాదరము మెయిన్
ఘను లాద్విజదంపతు ; లే
మని వారిన్ బొగడఁ ? గూర్చి రన్నియు నిమ్మై. ౧౦౦౦

క॥ వారి ఋణము వాపికొనం
గా రానిదయయ్యె మన కొకట నిమ్మెయి, లో
కారాధ్యంబు, పవిత్రము
వారల శీలంబు ; లేరు వారికిఁ దుల్యుల్. ౧౦౦౧

తే॥ అట్టి మాన్యుల దయకు నిట్టైతి ; మింక
భుక్తి ముక్తుల కగుదు ; మెప్పుడును భక్తి
తఱుగకుండ వారలఁ గులదైవములకు
మున్న పూజించికొంద మమోఘనిష్ఠ. ౧౦౦౨

వ॥ అనుడు నతండు నట్లకాక మఱి యేమనియె, నిట్లు వారిర్వురు
నొక్కమనసుతో నా బ్రాహ్మణదంపతులయెడఁ బరమభక్తి తత్ప
రత్వంబు మెఱయఁ గొన్నిదినంబులు పుచ్చి, యొకనాఁటి శుభ
ముహూర్తంబున హాలకర్మకుఁ దొడంగిరి, నాఁడు సకలపరికరంబు
లతో నాఁగలిన్ గొని, యెద్దులజతఁ దోలికొనుచు, నిజేశుండురా,
నక్కర్షకకుటుంబినీరత్నంబు, శౌచం బలవరించుకొని, పూజా
ద్రవ్యంబులు గొని, బిడ్డలతో బ్రాహ్మణోత్తముం డొసంగిన
పొలంబునకుఁ జని, యచ్చట నొక్కెడ నాఁగలి నర్చించి, భర్త
మొగంబు సూచుటయు నతండు. ౧౦౦౩

తే॥ పరమశాంతి నెసఁగు వృషభంబుల జత
నాఁగలికిఁ గట్టి, యమ్మడి నడుమ నిల్పి,
తడవి, నూల్కొల్పి, సాలసంతసముఁ బ్రియము,
వెలయ, వానికి ముందఱ నిలిచి, మ్రొక్క. ౧౦౦౪

తే॥ కొమ్ములఁ బసపుతోడఁ గుంకుమముఁ బూసి,
పూలదండలు మెడల నేర్పుమెయిఁ బెట్టి,
గందపున్ బొట్టు లిడి, కౌతుకమునఁ బొదలి
కాళ్లఁ గడిగి, సమస్తాంగకముల నంటి. ౨౦౦౫

క॥ కేవల విశ్వాసము మై
నావృషభయుగంబు నర్థి నర్చించెన్ బెం
పావహిలఁగ నప్పరమ కృ
షీవలుఁ డెంతయును మోము చెలువు దలిర్పన్. ౧౦౦౬

వ॥ ఇట్లతం డర్చించి, పరమవివేకవతియగు నాలిమొగంబు సూచుటయు
నాయమయు నయ్యెద్దులకు నమస్కరించి, చేతులుమోడ్చి, భక్తి
నెఱపి. ౧౦౦౭

వృషభ స్తోత్రము.

క॥ మీమెడలాధారము గా
నేమును, నేమ యననేల నెల్ల ప్రజలు నీ
భూమి నిలువనగుదుము ; మీ
సేమము లోకమున కెల్ల సేమంబరయన్. ౧౦౦౮

ఉ॥ నాఁగలి మూలవడ్డ మఱునాఁడ సమస్తజగంబుఁ గూలనై ,
యేగతి కేనిఁ గాక, తపియింపక తప్పమి సర్వమానవ
శ్రీగరిమాసమంచితవిశేషము మీ క్రమమైన యూర్పుపై
బాగుగ నిల్చియుండునని పల్కుదు రార్యులు, లోకవిద్వరుల్.

తే॥ కటికినేలయ పానుపు, గసవమేఁత,
గాఁగ శ్రమపడి, సకలలోకమును భోగ
భాగ్యగౌరవనవరేఖ బ్రదుకునట్టి
వడువుఁ గావింతు రెందుఁ జేడ్వడక మీరు. ౧౦౧౦

క॥ మీవాలము కదల, జగము
జీవింపఁగ నగుటఁ, బూజసేతుము మిము మో
దావహాభంగిన్, మా కుల
దైవములకు మున్న, సంతతము సద్భక్తిన్. ౧౦౧౧

క॥ మీ మలముఁ జిల్కుమేనియు
నేమియు ఫలమీరుమాకు నింతయునిజ మీ
భూమియు, మా కులదైవము ;
లీ మీ మాహాత్మ్య మింత కేమని పొగడన్ ? ౧౦౧౨

తే॥ సకలలోకంబు నిట్లు ముక్కుకొన నూర్పు
వచ్చు నన్నాళ్ళుఁ బోషించి, సచ్చియు మఱి
యుపకరింతురు జగతి కింకొండుభంగిఁ
బనికి నెంతయు నగు కళేబరము లొసఁగి. ౧౦౧౩

సీ॥ గోరిజలు, నెమ్ములుఁ, గొమ్ములు, రోమంబు, లేర్చికూర్చినమంచి
మెరుపుగాఁగఁ । జర్మముల్ బాదరక్షాప్రముఖ బహూపకరణ
సామగ్రిసంఖ్యలను బెనుప, । మూలమాదిగలకు మతికొందఱకును
మాంసము మేల్మికూరమై చవులనీన, । విండ్లకుఁ, బ్రత్తిఁగావించు
బద్దలకును, నారులై వారులు, నాఁడులెసఁగ
సచ్చియు సముద్ధరింతురు సాలదనుక
నిట్లు లోకము; కలదె యెందేని నొక్క-
యంగమును రిత్తవోవక, యంతకునగు
మృతపదార్థ? మీ యున్నతి మీకె చెల్లు. ౧౦౧౪

క॥ మీపూజఁజేసికాదే
మాపూర్వులు సకలలోకమాన్యమహారాజ
శ్రీపరిణతిఁ గాంచుట, ని
ష్పాపచరిత్రులగుటయుఁ, బ్రశస్తిఁగనుటయున్? ౧౦౧౫

ఉ॥ ఇప్పుడు మిమ్ముపేక్ష యొనరించుట మానవకోటికంతయున్,
ముప్పులుఁ ద్రిప్పలున్ గలిగె; ముందటివారల భంగిగాక యి
ట్లొప్పనివారలై రకట! యూరక యెల్లరు; దానికేమి? మా
తప్పుల సైఁపుఁడో వృషభదైవములార! యనుగ్రహంబుమై.

క॥ మీ యాండ్రావులును గరిమ
వాయక మాకిత్తురెపుడుఁ బాలున్, బెరుగున్,
నేయియు, వెన్నయుఁ, దక్రము;
నీ యౌదార్యంబు గలదె యేప్రాణులకున్? ౧౦౧౭

క॥ ఎనయంగఁ "గావునకు గో
ధనము ధనం" బను జగంబు; దానికి నది కా
దను వారులేరు; సరి; మా
ధనములు మీరగుట మేము ధన్యులమెట్లున్. ౧౦౧౮

వ॥ అని యనేకవిధంబుల నప్సరమోక్షయుగంబు నుద్దేశించి, నుతించి, వలగొని మ్రొక్కి, యనంతరంబ క్షేత్రరూపంబునఁ గ్రాలు భూదేవిన్ విధ్యుక్తంబుగఁ బూజించి, చేతులుమోడ్చి, యా సతీరత్నంబిట్లు ప్రార్థింపన్ దొడంగె. ౧౦౧౯

శా. పాతాళాదితలంబులేడుఁ మఱి నాపై స్వర్భువర్లోకముల్
మాతల్లీ! భవదీయభాగములుగా మాన్యుల్ నిరూపింతు; రీ
రీతిన్ నీకును వానికెల్లఁ గరమర్థిన్ బొల్చె సంబంధమున్,
స్ఫీతైకాన్వయ జన్మగౌరవ సమస్థిత్యాది మాహాత్మ్యముల్. ౧౦౨౦

క॥ మీకులమునకున్ జెంది య
నేకగ్రహగోళపంక్తు లింక గల వసం
ఖ్యాకములై, యన్యోన్య స
మాకర్షణగౌరవాదు, లభినుతికెక్కన్. ౧౦౨౧

ఉ॥ ఎవ్వరి త్రోవ వార చరియింపుదు రెప్పుడు మీకులంబు వా,
రెవ్విధి నెన్నఁడున్ నిమిషమేనియునిల్వ, కొకం డొకండు, దా
దవ్వుల నీశ్వరాజ్ఞఁ దలఁ దాలిచి, చుట్టము సూపు పూజ్యమై
నివ్వటిలంగ, సారమహనీయజవంబు నుతింపనై, తగన్. ౧౦౨౨

క॥ అరయఁబోలదు మీ ప్ర
స్ఫారజవాకర్షణాదిశక్తులు మా; కే
పార బహుయోజనంబుల
దూరము నీవునన నోపుదువఁట గడియలోన్. ౧౦౨౩

క॥ శనిగోళం బొక్కఁడ మె
ల్లన సనుచుండు నని మా తలం; పది స్వరి కా
దని మఱికొందఱు వాదం
బును గల; దింతకును నరయఁ బోలదు మిమ్మున్. ౧౦౨౪

క॥ చాలుఁగ భూమ్యాదిగ్రహ
గోళకులంబునక చెంది, క్రొమెరొప్పన్ బా
తాళాదితలము లేడని
పోలిచి రొకకొంద అతివిపులబుద్ధిఘనుల్. ౧౦౨౫

క॥ పరమ జవాకర్షణతా
భరిత గ్రహకులమునందు బాగుగ నీవున్
జిరయశము గాంచితివి ; నీ
చరితము పావన, మనంతసారముఁ, దల్లీ ! ౧౦౨౬

ఉ॥ పుట్టితి రొక్కచో, విడిచిపోయితి రంట కొక ల్లొకల్లఁ దోఁ
బుట్టువులయ్యు మీకులము పోకలు నా ని వి మీరు ; మాకు మీ
చుట్టరికంబు భంగి కడుఁ జోద్యమమై కనవచ్చుచుండు ; మీ
యట్టివి కావు మాకులమునందలి చుట్టరికంబు చందముల్. ౧౦౨౭

క॥ మీకులము వారలందఱు
మాకున్ జుట్టముల ; కాదు మాతలు, మాన్యల్ ;
మాకులము, నెల్ల జీవులు,
నీ కడుపునఁ బుట్టి, పెరిగి, నెగడు కతమునన్. ౧౦౨౮

చ॥ క్రొమరు దలిర్ప నెల్ల గ్రహగోళము, లీవును, నిట్టు లేక గో
త్రమునక చెంది యుండినకతంబున, నేముఁ, గుజాదిగోళవ
ర్గమునకుఁ జెంది పెంపుఁ గను కాపులుఁ, జుట్టలమైతి మర్థి నీ
క్రమమునఁ జాతిగౌరవముఁ, గర్మము, వృత్తియు నొక్కరూపకాన్.

ఉ. ఇచ్చటి రాజులట్ల ప్రజనేచి, కలంచి, సెలంగు వా రొకో
యచ్చటిభూమిపాలు ? రది యట్టిది కాక సమాదరంబు పెం
పచ్చుపడన్ జరింతురొ నిరంకుశభావముఁ దక్కి ? కాపులం
దచ్చటివారికెల్లను బ్రియంబు, నయంబు నెసంగునొకదా ?

ఉ॥ ఎన్ని యుగంబు లేని పని నింతకు ; నెన్ని యుగంబులేనిఁ బో
నున్నవి నీ ప్రవర్తనసముజ్జ్వలభంగికినెల్ల లోనివై ;
యెన్నఁగ మాకు శక్య మగునే ? యది యట్టిద ; దానికేమి ? నీ
కన్న ప్రజల్ మమ్ముల్ సతముఁగావుము తల్లి ! యనుగ్రహంబు మై.

క॥ నీ కన్న దిక్కు కలదే
నీ కడుపునఁ బుట్టి, పెరిగి, నెగడెడి మా, కీ
లోకమునకు ? నో పావని !
మా కుల దేవతవు నీవ మాన్యవు మఱియున్. ౧౦౩౨

తే॥ సకలచేతనకోట్లు నిస్సంశయముగ
నీ ప్రజలు ; వానికెల్లను నీవ దిక్కు ;
కాని మానవ కోటిలోఁ గాపుల మగు
యేము నిన్నెప్డు సేవింతు మింత నిజము. ౧౦౩౩

ఉ॥ ఎండకు, గాలివానలకు నెల్ల సహింపుచు, నోటిలోని నీ
రెండినదైన నిల్లు సొర నేగక, గ్రుక్కెడు నీరుఁ ద్రావి, మా
ర్తాండుఁడు గ్రుంకునంతకు సతంబును మాపనిఁ జేసికొంచు, నీ
యుండనయుంట నీ వెలుఁగు, దంతయు మా పిననాఁటి నుండియున్.

క॥ నాఁగలిఁ జొనిపియు, గుద్దలి
వేగన్ బఱపియును, నిన్ను వేధింతుము మా
బాగు నరసి ; యప్పనులకు
బా గందువ, కాని, కినిసి పలుకవు తల్లీ ! ౧౦౩౫

చ॥ మసలక నిన్ను ద్రచ్చి, తిను మా శొకకీడుఁ దలంప, కర్ధి మా
పసులకు గడ్డి గాదరలు, బౌడియుఁ, బంటయు, మాకు నెప్డు నీ
వొసఁగుట సాలచిత్రము ; దుమూహ్యము నీ చరితంబు ; నీదు మా
నస మకలంకసారకరుణామయ ; మెన్నఁగ మాకు శక్యమే ? ౧౦౩౬

ఉ॥ మానస మాదిగాఁగల సమస్తపదార్థము లీయఁ గల్గినన్
గాని యనుగ్రహింపఁడు జగద్గురుఁ డప్పరమేశుఁ; డీ వొకిం
తేనియుఁ గోర, కీవి యన నిట్టిదవో యని పాటుభంగి నీ
లోన నెసంగి, పాటువడు లోకుల కీత్తువు సర్వ, మెప్పుడున్.

క॥ మన్నుఁ దిని, చెమటఁ గ్రక్కుచు
నెన్నండు నిరాశపడక యీవ గతిగ, యె
ప్డు న్నిన్న కొలుచు కాపుల
కన్నన్ భక్తులన నీకుఁ గలరే యితరుల్? ౧౦౩౮

సీ॥ పాలబుగ్గలుఁ, జిన్నిపలుకులుఁదగ ముక్కుపచ్చలారని బాలబాలికలును
రమ్యవిలాసగౌరవము, సత్కాంతిభూతియు నింపెసఁగుయువతీయువకులు
సంతానసౌభాగ్యసంపద నెంతయు బాగుమీఱిన గృహిణీగృహపతు,
లొకకొంత దండము లూఁదియ నడువనై, పెంపుఁదూలిన వృద్ధ
దంపతులును,

నిల్లు, నూరును బాటింప, కెప్డు నిన్నుఁ
గొలుచుచుండుట కెద మెచ్చికొనుచు, వారి
కైహికాముష్మిక సుఖంబు లర్హాభంగి
నిచ్చుచుందువు జనని నీ కెవ్వ రీడు? ౧౦౩౯

తే॥ సకలరస లోహరత్నవృక్షలతికా తృ
ణాది జాతీయమూలబీజాణుకోటిఁ
బొట్ట నిడికొని, యవి రూపుఁ బొందుసమయ
మగుడుఁ, బ్రోది యొనర్తు వయ్యై విధముల. ౧౦౪౦

తే॥ స్థావరంబులకును బోలె, జంగమములు
రూపుఁ బొందుటకున్ను, సూక్ష్మరూపమున నె
సంగు బీజాణుకోటి నభంగ గరిమ
దాచి యుంతువు, నెగడింతు తఱి యగుటయు. ౧౦౪౧

చ॥ జడములముఁ, గావువాండ్ర, మొక సంగతికిన్ జొరం మెన్నఁడేని, నీ
కడుపునఁ బుట్టి, నీవ గతిగా మనుచుందుము ; కాన మమ్ము నె
వ్వడుముఁ గృపఁ జేల్పు మో జననీ ! భుక్తికి ముక్తికి నీవ యాను వి
శ్వకుశీ ప్రజకెల్ల ; నీ కడుపు కందినఁ గందు సమస్తలోకముల్.

క॥ నీ కొకటి సమర్పింపఁగ
మాకున్ దలసాల ; దీవ మాపున్ రేపున్
మా కన్నింటికి నగుదువు ;
నీ కగుదుమె మేము ? తరమె నినుఁ గొనియాడన్. ౧౦౪౩

వ॥ అని భూదేవిన్ బ్రార్థించికొని, పెక్కు మ్రొక్కు లర్పించి, యచ్చటి
కనతిదూరంబున, దెసలు నాకసంబు నావరించికొన్న చాడ్పున బీరు
వొక పెరిగి, నానాశాఖోపశాఖాజటావత్రపల్లవవిసరాభిరామం
బును, వివిధప్రాణి వితానాశ్రయభూతంబును, వనస్పతిరాజంబును
నై, యొప్పు నొక్క మహావటవృక్షంబున్ దర్శించి, దాని యున్నతి
కచ్చెరువందుచుఁ జేరన్ జని, మొదలంట జలంబు లురివి, గోమ
యంబుఁ జిలికి, యలికి, పూవులిడి, యర్చించి, దూపంబు వెట్టి,
చేతులు మోడ్చి, వినయంబున నప్పరమప్రాజ్ఞ యిట్లు ప్రార్థింపన్
దొడంగె. ౧౦౪౪

తే॥ ఓ వనస్పతి రాజమ ! నీవ మాకు
నిలువ నీడయు, నెలవు, నై వెలయఁ జేయు
సర్వవిధముల నీవ యాశ్రయము గా నె
సంగు నీ ప్రాణితతు లట్ల సక్క మమ్ము. ౧౦౪౫

## వనస్పతి స్తోత్రము.

ఆ॥ జగతియందుఁ గలవు జాతులు నాలుగ ;
మొదటిజాతి లోహములు, ద్వితీయ

జాతి సర్వవృక్షసంతతుల్ వెలయు ; నీ
వందుఁ బేర్మి పెంపు నలర నైతి. ౧౦౪౬

క॥ క్రిమి ఖగమృగాదు లన్నియు
నమరుఁ దృతీయమగు జాతియందున్, బరిణా
మము మై మా జాతి చతు
ర్థము నా నుతిఁగాంచె బహువిధంబుల జగతిన్. ౧౦౪౭

ఆ॥ ఆద్యజాతియు కర మాశ్రయంబు గను మీ
జాతి •మొనఁగుచుండు సంతతంబు ;
మొనసి మీఁక దక్కు, మూఁడవ నాల్గవ
జాతు లున్నతిమెయి సక్క బ్రదుకు. ౧౦౪౮

క॥ మీ జాతియ లేదేనియు
నీ జగతికిఁ బేరుఁ, బెంపు, నెక్కడ ? శశ్వ
త్తేజమునాఁ నది యెక్కడ ?
మా జాతికి నేడ యింత మహిమయుఁ, బెంపున్ ? ౧౦౪౯

చ॥ ప్రకృతిమనోహరత్వ రుచిరత్వ విలాసగతిత్వ సార భా
తిక మహితత్వభంగులకుఁ దేజము పుట్టునె మీదు జాతి మా
టికిఁ బరిణామ భూతిఁ బ్రకటింపద యేనియు ? నేఁటి పెంపు దా
నికి నోడఁగూడు లోకము గణింపద యేనియుఁ, దద్విలాసమున్.

ఉ॥ ఎక్కడిదీ కూడు ? గుడ్డ యన నెక్కడి ? దెక్కడికొంప ? జీవనం
బెక్కడ మాకు ? మా నిలుచు టెక్కడ ? యంతకుమీఁరకాక ? మా
యక్కర కెల్లనై వెలయు నట్టిది మీ పెనుప్రాప ; యెన్నియో
నిక్కరణిన్ యుగంబులు గతించె ; గతించెడి నింక నెన్నియోన్.

తే॥ గాలి యుచ్ఛ్వాస నిశ్వాసగతుల నెల్ల
ప్రాణికోట్లకుఁ బ్రాణమై పరిఢవిల్లుఁ ;

గాని యది పారిశుద్ధ్యంబుఁ గాంచదేనిఁ
గాలకూటంబు వోలె జగంబు నేర్చు. ౧౦౫౨

ఉ॥ అట్టి యుపద్రవంబు జగమందలి చేతనకోట్ల కేమియున్
బుట్టకయుండ మీర కడుఁ బ్రోది యొనర్తురు పారిశుద్ధ్య మె
ప్పట్టున నేనియున్ జడనిభంగి సదాగతికిన్ ఘటింపుచున్
జుట్టము సూపు, గౌరవముఁ, జొప్పడ లోకము బ్రోవనో యనన్.

క॥ మీకును ఖేదము, మోదము,
శోకము, నెమ్మదియు, భయము, సుఖదుఃఖంబుల్;
మాకుఁ బలెఁ గలవు; కాని య
నేకగతుల నవి యొసంగు నిరుతెగలందున్. ౧౦౫౪

క॥ హృదయముఁ, జైతన్యంబును,
మృదునాడులు, జీవరసము మీకెట్టివో? పెం
పొదవగ మాకట్టివ; మఱి
మెదడుకలదో? లేదొ మీకు? మృగ్యంబదియున్. ౧౦౫౫

తే॥ అమలుఁ డాత్మఁ డుపాదిధర్మముల నెసఁగు
భంగి తత్తదుపాధిసంబంధవశము
వలనన యటంచుఁ బ్రాజ్ఞులు వల్కుదు; రది
నిజము; సందియ మించుకేనియును లేదు. ౧౦౫౬

క॥ క్రమమున నా బ్రహ్మాస్తం
బము సర్వప్రాణికోట్లుఁ బ్రకృతిమహాగ
ర్భములోని యణువులం ద్రు
త్తమమేధానిధు; లదియును తథ్యమసూడన్. ౧౦౫౭

ఉ॥ కావున మీరు, నేమును, జగంబునఁ జేతనకోటులన్నియున్
గేవల మొక్కవస్తువునకే తగఁ జెందితి; మట్టులయ్యు మా

జీవనయాత్ర యెల్ల వినుసెప్పెద మీ మహనీయజాతియం
దే విలసిల్లు ; నిక్కమిది ; యెవ్వరుఁ గాదనరెట్లు దీనికిన్. ౧౦౫౮

క॥ తినఁ, గట్టఁ, బూయ, మందున్
గొన, నిలుగట్టికొన, నంతకున్ మీరల యె
ప్డును మాకున్ బ్రాపులు నాఁ
జను, మఱి క్రిమిఖగమృగాది జంతుతతులకున్. ౧౦౫౯

తే॥ ఎసయ మూడవజాతి మా కెవ్వియేని
యక్కఱలకగుచోఁ జూడ నదియుఁ బేర్మిఁ
జేసి, మీజాతి నాశ్రయించియ రహించు ;
నెట్టులేని మీజాతియె యెల్లకునగు. ౧౦౬౦

తే॥ ఒకఁడునేనియు రిత్తవోవకయ, పేర్మిఁ
గన్న మీజాతి సకలాంగకమ్ములును ద
గంగ మాకెల్ల నుపయోగకరములై యె
సంగు ; మిమ్ము నుతింపవశమ్మె మాకు. ౧౦౬౧

వ॥ అని యనేకవిధంబుల నవ్వనస్పతిరాజంబు నగ్గించి, నమస్కరించి, యమ్మహావృక్షంబునందు వనదేవత లుందురని తలంచి, వారల నుద్దేశించి, యయ్యెల్లా లాపాదపంబు చేరువన్ గుడశర్కరామిళితంబగు పానకంబును, ఫలంబులు నుపాహారంబువెట్టి, యాహ్వానింపుచు నమస్కరించుటయుఁ, బ్రహర్షంబున నొక్కవనదేవత యదృశ్యరూపంబున నత్తరుశ్రేష్ఠంబునందు నిలిచి, సువ్యక్తస్వరంబున నిట్లనియె. ౧౦౬౨

### వనదేవతోపన్యాసము.

ఉ॥ ఎట్టితపంబు లోకజనయిత్రి యొనర్చెనో భూమిదేవి నీ
పుట్టువుఁగూర్చి ; నీవుఁ దగఁబుట్టితి వాయమపొట్ట నల్లగాఁ ;

బుట్టువుతోన మాయమ కపూర్వవిలాసముఁ గూర్తువెప్డు ; నీ
యట్టుల మాతృభక్తి వెలయంగఁ జరించెడు సాధ్వి కల్గునే ?

ఆ॥ గీ॥ రత్నగర్భయన, ధరాదేవి యన, వసుం
ధర యనన్, రసప్రదాత్రి యనఁగ,
భూమిదేవి నీవుపుట్టి పాటువడు క
తమునఁ గాంచనాయె నమితకీర్తి. ౧౦౬౪

సీ॥ సమయంబుతోన వర్షమువడ, నేలతావికిఁబొంగి, పొలమునవిత్తునపుడు
మొలకలు రేకెత్తి, మిలమిలలాడుచుఁ, బెరిగి, పెంపున్ గనుతరుణమందు
నెన్నులుఁ బలిసి, విత్తేర్పడి, ముదిరి, సక్కఁగఁబండి, యొరగెడు కాల
మందుఁ, । గోసినచేలెల్లఁ గుప్పలుఁ బెట్టి, నూరిచి, ధాన్యములసేకరించు
నపుడు,

మమ్ము మఱువక, బలులిడి, మంచితనము
నెఱపుదువు ; తొంటివార లెన్నివిధు లిచ్చ
నడిపి ? రావిధులన్నియు నడుపుదు, వొక
లీలఁ బోదువు వారల కాలిజాడ. ౧౦౬౫

తే॥ పూర్వపద్ధతిఁదప్ప, నిప్పుడిపుడ చెల
రేఁగి, బలిసిన నవనాగరికత యనిన,
నొచ్చికొందువు ; పెక్కుతెన్నులును, బెక్కు
పోకలును గిట్టవెన్నఁడు నీకుఁ బుత్రి ! ౧౦౬౬

తే॥ వలయుఁ గాలోచితంబగు వర్తనంబు ;
తక్కనుఁగల కులములకు ; దానికేమి ?
నీకులమువారి కదికాదు ; నీవు, భూమి
యును సతంబును నొకభంగి నుండువారు. ౧౦౬౭

తే॥ ఈవసుంధర ఫలమీయదేని, నీవు
పాటుపడవేని, లోకంబు బ్రదుకుచొప్పు
కలదె మఱియొక్క తెఱఁగున? గాననీవు,
నీక్షితియు నొక్కభంగిన యెసఁగుటొప్పు. ౧౦౬౮

తే॥ పరమనవనాగరికతా ప్రభావమున జ
నించె నాస్తికత యది యన్నిఁటికి మించి,
నిఖిలమానవకోటి దుర్నీతితోన ;
విషయసుఖమ సుఖమునేఁడు వేయిగతుల. ౧౦౬౯

తే॥ ఈశ్వరుఁడులేఁడు ; జగతికినెల్ల నేమ
ప్రభువులము ; లేవు పుణ్యపాపములు రెండుఁ,
జావుతోడనతెగు సమస్తమును ; నచ్చి
బ్రదుకుదురనుట కల్ల యెబ్భంగినేని. ౧౦౭౦

తే॥ చావుతోఁ దీరదఁట? పునర్జన్మ మఁట? య
నేకలోకంబులందు ననేకగతులు
గల్గునఁట? యీశ్వరుండఁట? కర్మమఁట? యి
వేఁటిగాథలు? బొంకుల కింతయేల? ౧౦౭౧

క॥ అనికొందఱు ధీమంతులు
వినిపింతురు పెద్దనోట విసువు విరామం
బునులేక ; వారిమాటలు
వినువారునుగలరు వేనవేల జనంబుల్. ౧౦౭౨

క॥ విని విని జను లాచందమ
గొనువారై ; రెల్ల రిట్లగుట యీలోకం
బున మాకుఁ దావు లే దెం
దును దలఁ దాచికొనఁ ; బెంపు దూలితిమి కడున్. ౧౦౭౩

క॥ పరిణామ తత్వవాద
స్ఫురదురుబుద్ధినిధి "డజ్ ది సో లెజిస్టా
ప్టరు డె" త్తని యొక్క మహా
పురుషుఁడు ప్రశ్నించుఁ దన విపులవాగ్ధాటిన్. ౧౦౭౪

Does the soul exist after death?

క॥ "ఐ కెన్ నాట్ నో థట్ సార్;
హౌ కెన్ ఐ డిస్క్రైబిట్" మహాత్మా! యని వే

I connot know that sir; How can I describe it?

వాకొను నొక్కరుఁ డప్పలు
కాకర్ణించుట తనకు నాలస్యముగాన్. ౧౦౭౫

ఆ॥గీ॥ ఇట్ల తర్కనుగల యెల్లవారును దమ
యెఱుఁగమి నొకఁడ ప్రకటింతురు, తమ
చావు తోన దీరు సర్వమనియు, మ తే
మియును బ్రకృతి తప్ప మిగుల దనియు. ౧౦౭౬

క॥ ఇది యేఁటి వెఱ్ఱితనమో?
మది కెక్కదు మాకు; నేఁటి మానవతతియం
దుదయించె నిట్టి దౌర్భా
గ్యదశ; కటా! జ్ఞానశక్తి యంతయుఁ దరిగెన్. ౧౦౭౭

క॥ తమకంటికిఁ, దమ బుద్ధికిఁ
గ్రమమున గనరానివెల్ల కల్లలనియు, మో
సము లనియుఁ బల్కు టొక్కఁడ
క్రమమై వీరియెడఁ దోచు కాలము వచ్చెన్. ౧౦౭౮

తే॥ వీరి కంటికిఁ గలశక్తి, వెండి బుద్ధి
కిఁ గల శక్తియు నెంతలు? కేవల మవి

యణువులంతల యని సెప్ప నగు నపార
శక్తి సాగరమందు; మోసంబు లేదు. ౧౦౭౯

తే॥ విషయలౌల్యంబు పెరిగె, వివేక మఱిగె;
నిదియ మానవకోటియం దిప్పుడు క్రమ
పరిణతిన్ గాంచినట్టి దౌర్భాగ్యదశ; వి
శంకట జ్ఞానవిజ్ఞానశక్తు లణఁగె. ౧౦౮౦

వ॥ మీ లోకంబున్ గూర్చి యట్టె విచారించుటవలన మాకున్ గీడు వాటిల్లు, మా దృష్టికి మీ లోకం బొక కారాగృహం బట్ల తోఁచు; మీదు స్సంకల్పంబులు మా కసహ్యంబులు; మా లోకంబులఁ గూర్చియు, మాస్థితిగత్యాదులఁదడివియు, మీకు సెప్పుట మాకున్ బనిగా; దైనను నీవు మాయెడ భక్తిసూపుచున్న పుణ్యాత్ము రాలవు, కాన యించుకంత యెఱింగింతు వినుమని యవ్వనదేవత యమ్మనస్విని కిట్లనియె. ౧౦౮౧

తే॥ క్రమముగ ననంతకోటిలోకము, లనంత
కోటివర్గములకుఁ జెంది కొమరు మిగులు;
నాత్మలుఁ గలవు కర మసంఖ్యాకము లయి
యొకఁటి కొక్కఁడు మేటి నా నొప్పు మెఱసి. ౧౦౮౨

తే॥ ప్రకృతిసాగర మది యపారంబు; దాని
యందు లోకంబులన్నియు బిందుమాత్ర
ములు; సకల చేతనోత్కరంబులును వాని
యందుఁ బరమాణుమాత్రంబు, లగణితములు. ౧౦౮౩

తే॥ మరణమనునది లేద యాత్మ; కది బహుళ
దేహబీజాణుసంధుయుక్తిఁ దిరుగుచుండు,
నిచటి కచటికి మేను లెన్నే నిఁ దాల్చి,
ముక్తిపర్యంతము విరామమునకుఁ దక్క.   ౧౦౮౪

తే॥ మరణమున్ గూర్చి భీతి నుమ్మలిక వడుట,
సావుతోనన తెగు సమస్తంబు ననుట,
వెఱ్ఱితన; మిజ్జగమ కాని వేఱ యొద్ది
యేని లేదంటఁ గూర్చి యింకేమి సెప్ప? ౧౦౮౫

ఉ॥ ఇచ్చటి పుణ్యపాపముల కించుకయేని ఫలంబు లేదనన్
వచ్చునె? యట్టు లైన బలవంతుఁడు దుర్బలు నొంపఁ, గాదనన్
వచ్చునె? మంచిసెడ్డ లనవచ్చునె కార్యములందు? నెల్ల వా
రిచ్చకు వచ్చినట్ల చరియించిన నిల్చునె లోక మింతకున్? ౧౦౮౬

వ॥ మీ లోకంబున నెన్నివర్గంబులు చేతనకోటులం దేర్పడి యున్న? వన్ని వర్గంబులకు మించి మా లోకంబునఁ బ్రాణికోటు లుండుననిమీ రూహించికొనుం; డెల్ల భంగుల జ్ఞానవిజ్ఞానంబులందును శక్తిస్థితిగత్యాదులయందును మీకన్న మేమధికులము; మాకన్న నధికశక్తిసంపన్నంబులగు నాత్మలును గలవు; మమ్మారాధించువారలయం దేము ప్రసన్నులమై యుందుము; కాని మీ సంబంధంబు మాకు బంధకారణంబగునను భయంబును గలదు; మాకును దేహాంతరప్రాప్తి సహజంబ; మీ లోకంబునందలి కర్మవాసనలు బహువిధ దేహాంతరప్రాప్తికిఁ గారణంబులై యుండు ననియు, మీ శరీరంబులతోన యవి నశింపక, యసంఖ్యేయ దేహాంతరప్రాప్తి యందును స్ఫురించుచుండు ననియును, మంచివాసనలు సద్గతులకును, జెడ్డవాసనలు దుర్గతులకును హేతువు లగుననియు, నమ్మి యెల్లకార్యంబులందును వివేకంబు మెయిఁ బ్రవర్తింపుఁడు; మఱియు నేమకాదు బ్రహ్మాదిపరమలోకవాసులును గర్మభూమి నాఁ దగు మీలోకంబు నందును, నేతాదృశలోకంబు లందును బుట్టియ సిద్ధిఁ బడయువారల, మింక ననేక లోకంబుల ననేకశరీరంబులు గైకొన నున్నారము, మావృత్తాంతము నిప్పటి కిమ్మా

త్రమ యిబ్భంగిఁ దెలిసికొని, సక్క వర్తింపుము, నీకుశుభం
బగుఁగాక యని యుపన్యసించి, యవ్వనదేవత మఱి పలుకు
టుడిగెఁ; బడంపడి యమ్మహోపదేశంబున కాశ్చర్యంబును, సంతో
షంబును మనంబునఁ బొదుకొన, నన్నారీరత్నం బచ్చోటువాసి,
పని, భర్త నుద్దేశించి, లెండు పొలంబు దున్న నారంభింపుం డను
టయు, నతం డెద్దుల నూల్కొల్పి, దున్న నుంకించునప్పుడు.

తే॥ బిలము వెలువడి, పిల్లలపిండు సుట్టు
రా, నెలుకయొక్కఁ డొక్కచో రహిసెలంగ
నిలిచి, యక్కాపుఁ జూచుచు, నెలమి నెద్ది
యేనియుఁ దనకుఁదాన భాషింపఁదొడఁగె. ౧౦౮

వ॥ సకలజంతువులందును మనఃప్రవృత్తి బహువిధంబుల వెలయు
చుండుననియు, భావంబు దాని సారశక్తియనియు, నబ్భావంబు
భాషారూపంబున వెల్వడుననియు, నెల్లరు నెఱింగిన విషయంబ,
కాని యెల్లజీవులందు నొకజాతిభాష యింకొకజాతి కెఱుంగరా
కుండు, నైనను యోగసిద్ధులగు మహాత్ములు మనోజయంబుఁ
గాంచినవారగుట, సకలప్రాణివర్గభావతరంగప్రవర్తనంబు నెఱుంగ
నోపుదురు; పరమదైవంబు లననైన యమ్మహనీయుల కరుణఁబడ
సినయే, మమ్మూషకంబు యొక్కయు, దానిన్బలె నప్పరమకృషి
కునితోఁ బరిచయంబును, స్నేహంబును నెఱపి, తమ కృతజ్ఞత
సూచించిన క్రిమిఖగమృగాదులయొక్కయు భావనాప్రపంచంబు
నెఱుంగఁ జాలితిమి; కావున నవ్విషయంబు మా పాఠకమహాశయు
లకు నివేదించికొనియెద, మది యెట్లనిన నట్లు మున్ను పేర్కొనిన
నయ్యుందురుశ్రేష్ఠం బక్కాపు నుద్దేశించి, తన కృతజ్ఞతఁ ప్రక
టింపుచు నిట్లనియె. ౧౦౯

## మూషకోపన్యాసము.

తే॥ నీవ మూషు హితుండ వన్నిఁటికి ; మూ కు
లంబువాండ్రము నీదు పాలంబ యాశ్ర
యముగ మనుచుందు మొందుభయంబుఁదక్కి ;
హాలికోత్తమ ! నిన్ను నేమని నుతింప ? ౧౦౯౦

తే॥ ఏన యననేల ? నింక ననేకజీవ
కోటులును నీవ తమకు దిక్కుగ సమాశ్ర
యించి జీవింపుచున్న ; వి ట్లీవుతప్ప
నిన్ని ప్రాణులఁ బ్రోచువాఁ డెవ్వఁడుర్వి ? ౧౦౯౧

తే॥ సత్రములు, యాగములుఁ, బాంథశాలలు, మఱి
వివిధదానంబులుఁగలవు వేలకొలఁది ;
కాని మానవకోటి సౌకర్యమునక
యవి యొసంగుతెఱం గారయంగనయ్యె. ౧౦౯౨

సీ॥ ఏసత్రమందేని, నేయజ్ఞమందేని, నేపాంథశాలయందేని, మఱియు,
నేకర్మకాండమందేని, నేవ్రతములందేని, నేదానమందేని, మీర
దిక్కుఁగా మీయూరఁ దిరుగుచుఁ, బరమవిశ్వాసంబు నెఱపుచు
సాధువృత్తిఁ । గొట్టిన, మెడఁద్రాడుఁజుట్టి యీడ్పించిన, నేడ్పుట
తప్ప యొకించుకేనిఁ,
గినియ, కెందేనిఁ జన, కొకకీడుఁదలఁప,
కపుడ పిలిచినఁ బొంగి వెన్నంటివచ్చు
కుక్కపిల్లకుఁ బెట్టెడుకూడువెట్టు
దాతలు కలరె మీ నరజాతియందు ? ౧౦౯౩

క॥ దాతృత్వమనఁగ నిదియక
దా ? తెలిసితి ; మింత లేసి దాతలుగల మీ

జాతిఘనగౌరవము మా
జాతికి నంతకును గడు నసహ్యంబయ్యెన్. ౧౯౪

ఆ॥గీ॥ ఐన నేమిసేయనగు మీకు బుద్ధి బ
లంబు కలదు మాకులములనెల్ల
నణఁచిపట్టి, కలఁచి, యాజ్ఞ సెల్లింప; మా
పాపమ యిది; మీరు పల్కరాదు. ౧౯౫

వ॥ జగత్సృష్టియందు లోహాదులు మొదటిజాతియు, వృక్షాదులు రెండవజాతియుఁ గ్రిములు జలచరంబులుఁ బక్షులు మొదలగునవియు, గూడ మాజాతి మూడవదియు, మీజాతి నాల్గవదియునై యొసంగుచుండు; మీ జాతియు, సామాన్యంబుగ మా జాతియు, రెండవజాతియంద జీవింపనై యుంట స్రష్టయుద్దేశంబని తలంతు; నిది యిట్లుండ మీ జాతివారు మా జాతియం దధికారంబు సెల్లింతురు; దీనికి మీ బుద్ధిబలంబును మాబుద్ధిదౌర్బల్యంబును, కారణంబులు; కాన యిది భగవచ్ఛాసన మనఁగాదు; దీనినింత ద్రవ్వనేల? యని మీరడుగఁ జూతురకాని మా యెడలన్ జూపుచుండు క్రౌర్యంబు మానఁజాల; రది మాకు దుర్భరంబును, దుస్సహంబునునై యున్నయది; వెఱపించియు, వెంటాడియు, మోసంబుసేసియు, నురులు, నుచ్చులు, బోనులు, వలలు మొదలగువాని నొడ్డియు, నగ్గి రగుల్కొల్పియు, శస్త్రాదులు ప్రయోగించియు, నింక ననేకసాధనంబులుపయోగించియు, విషంబువెట్టియు, మా జాతిన్ మ్రందించియు, నొంచియు, నణంచియుఁ, గలంచియుఁ, గాలన్ జమిరియుఁ, జేతఁ బిసికియుఁ, గొట్టియుఁ, దిట్టియు మీరు తృప్తిసనకున్నవారు; దీననగు ప్రతిఫలం బచిరకాలంబునన మీ కనుభవంబునకు వచ్చుట సిద్ధంబ; కాని మా రిత్తవాక్యంబుల మీ రుడుగుదురే? వినుము మీరు మ మ్మింతలుసేసి హింసించినను మాజాతినశింపక, తొంటి

యట్లు చెక్కుచెదరకుండుట కేమి కారణ ? మది మా ధర్మ ప్రవృత్తికి నిదర్శనంబు ; వెండియు మీజాతి యభివృద్ధిఁ గాంచనేరకుండుటకు నీవేమనఁగలవు ? దానికి మీ దురాశయు, స్వార్థపరాయణతయుఁ, గ్రౌర్యంబును, నీసును గారణంబు ; లివి మీయందు లేకుండునేనియు, నింతకుఁ గోటిమడుంగులు మీజాతియు, మాజాతియు నభివృద్ధిఁ గాంచియుండెడివి ; మీ జాతియం దగుచుండు యుద్ధములు, వివాదములు, నన్యాయాక్రమణంబులు మొదలగునవి మీ దుర్గుణంబుల సద్యః ప్రతిఫలంబు ; లోకనిరక్తంబున నింకొకఁడు కాలిఁగడిగికొనుట శౌర్యంబనియుఁ, బరాక్రమంబనియుఁ, బ్రకటించికొను మీజాతివా, రన్యజాతుల నణంపననూతురు కాని, దయఁ దలంతురనుట వెఱ్ఱితనం ; బిది యిట్టిదై యుండ మీజాతి వారు మాజాతి కేమేనిఁ బెట్టరేయని ప్రలాపించుట మాకుఁ గూడనిపని, మఱియును. ౧౦౯౬

క॥ మీ పూర్వులు లోక విదులు
పాపమునకు వెఱచి, తొల్లి వాటించి "రహిం
సాపరమో ధర్మో" యని
దీపించెడు శాస్త్రమత, మతి శ్రద్ధ మెయిన్. ౧౦౯౭

క॥ మముఁ దినుమని మీకే శా
స్త్రము జెప్పెన్ ? మీ సదంత్రదంతహృదయపిం
డముల సముంచితసృష్టి
క్రమ మందుల కగునో ? కాక కాదో ? యరయుఁడా ! ౧౦౯౮

ఆ॥ ఏమి నేసితిమని యెప్డు మీవాండ్రు, మా
వాండ్ర నొడిచి, యణఁచి పట్టి, మ్రింగఁ,
జూతు ? రెంతపొగరు బోతుతనంబు మీ
జాతివాండ్రయందు సహజమయ్యె ? ౧౦౯౯

క॥ ప్రేమయనఁ, గరుణయన, నవి
యేమో మీవార లెఱుఁగ; రెఱిఁగిరయేనిన్
మోమోడరేల మాపై
నేమియు? నాగరికతయన నిట్టిదియ కదా? ౧౧౦౦

ఉ॥ మిడుక నొక ళ్లొకళ్లఁ దిగమ్రిఁగనసూతు, రొక ళ్లొకళ్లపై
నుడుకుదు, రొండొరుల్ గలిసియుండియు నొంపఁదలంతు; రిట్టి మీ
నడువడి మాక కాదు భువనంబున నేరికినైనఁ గిట్ట; ది
వ్వద్భువన నున్న మీకుఁ బెఱవారన నెందుల? కేఁటి చుట్టముల్.

తే॥ కలవు మీకు శాస్త్రంబులు, గాథ, లెన్ని
యేని; నవియేల? గాల్పనే? యెందునేనిఁ
గొన్నిమాత్రమ మావారిఁ గూర్చి యొకఁడు
రెండునున్ బల్కి, మముఁ బల్కరింపఁ జూచు. ౧౧౦౨

క॥ పరిణామక్రమమున ని
ద్ధరఁ దుది యే నెట్టులే నధర్మరతులు, ము
ష్కరులున్, గ్రూరులునగు మీ
గురు పాపపుజాతిఁ బుట్టఁ గోర నొకప్డున్. ౧౧౦౩

వ॥ ప్రకృతిశాసనం బలంఘనీయంబు గావున నాకు మీపాపపు జాతిన్ బుట్టక తప్పని పరిస్థితి యగునేని, లోకంబునకెల్ల నేడుగడ యగు కాపుపుట్టువున్ బ్రసాదింప సృష్టికర్తన్ వేడికొందు; నిది నా నిశ్చయం; బింతదనుక మీజాతివారిన్ దెగి తిట్టితిననియు, నిదియప్రస్తుతాంశము, నస్థానసంరంభము ననియు నీవు కోపింపకుము, మీజాతియందు నీ వొక్కండవ యేనాదిగాఁగల మా జాతివారల కుటుంబముల నెన్నింటినేని నూచియు, నూడకయు బోషింతువు; నీ వలన మేల, కాని మా కెట్టికీడును బుట్టదు, వెండియు— ౧౧౦౪

క॥ భాతిగ మీ జాతియు, మా
జాతి యనేకములు, వృక్షజాతిన్ సంఖ్యా
తీతములగు నన్నియు, నీ
చేతన్ బోషింపఁ బడుట సిద్ధము సుమ్మా. ౧౧౦౫

వ॥ మా జాతియందు మీ జాతివారికిన్ గల నిర్దయానిరంకుశత్వంబులన్ గూర్చి, యింతలాడవలసెన్ గాని నిన్నుఁగూర్చి కాదని మఱియొకసారి విన్నవించికొందు, నార్యవర్య! నీ మేలు మఱచునంతటి మహాపాపంబు నాకు వలవదు, కాని నీమేలున కర్హమ్మౌ భంగిఁ గృతజ్ఞత నెఱపికొనవలనుపడమికిఁ జింతించెద, నాయోపుకోలఁది నీ పైరు పంటలన్ బాడుసేయు క్రిమికీటకంబుల నేర్చి యేర్చి, మ్రందింపుచు, నీ పొలంబునందె యొక్కచో సురుంగంబు జేసికొని, యందు సుఖంబుమై నుండి, నీపంటలందు భాగంబులు గొని, యొకభంగిఁ గుటుంబ భరంబు నిర్వహించుకొనుచుండుదు, గ్రద్దయు, డేగయుఁ, గాకియు, గూబయుఁ, జెట్టుపిల్లియు, నక్కయుఁ, బామును నాకిచ్చటి ప్రాణశత్రువులు; వానికంటఁబడ కెట్లేనిఁ దప్పికొని తిరుగుదుఁ; గడుపుఁ గక్కుర్తియు, జిహ్వాలౌల్యంబును దమకు సహజగుణంబులుఁగా మారి, మా కులంబునందలి కొన్ని మమ్ము విడిచి, మీ యూళ్లన్ బ్రవేశించి, మీ యిండ్ల మఱిగి, మీ పదార్థంబులన్ దినుచు, నచ్చో స్థిరనివాసంబు లేర్పఱచికొని, యున్నవి; వీను మట్లవి బ్రదుకుట నాకొకభంగి నిష్టంబ; కాని మీ వస్త్రపాత్రపుస్తకాది నానావస్తువులఁ బనిలేక కొఱికి పాడుసేయుట యిష్టంబకాదు; దానన్ జేసి యవి మీ కోపంబునకుఁ బాత్రమ్ములై మీ రొడ్డినబోనులు వలలు మొదలగువానిన్ దవిలికొని చిక్కియు, విషంబు గలిపి మీరిడిన పదార్థంబులఁ దినియు, మీ కఱ్ఱదెబ్బలఁ, గత్తిపోటుల సుడిసియు, మీ పెంచిన శునక మార్జాలంబులచేతన్

గఱునఁ బడియు, మ్రందుచు వృద్ధిఁ గాంచనేరకున్నయవి ; మరియు వానిలోఁ గొన్ని మిమ్మున్ గఱచి విషంబెక్కించుటయుఁ గల ; దద్విషంబు క్రమంబుగ మీ దేహంబులకుఁ బాముల విషంబు వోలె నపాయంబు దెచ్చుఁ ; బాముకాటున కెట్లట్ల దానికిని మంత్రౌషధాది ప్రతిక్రియ వలయు, సర్పాద్యురగకులంబునకును, మృగకులంబునకును, నడుమదియై మాకులంబు పరిణామక్రమంబు సూచించుచుండు, నది యెట్లనిన మాదంతంబులును, దోఁకయు నురగకులంబునకును, బాదంబులును జెవులును గుండెయును మొదలగునవి మృగకులంబునకును ననుబంధంబులు ; కావున మా విషంబు మీకు దుస్సహం ; బల్లవె యత్తరుశాఖలపయిన్ గూర్చుండి నిక్కి నిక్కి నిన్నుఁ జూచుచున్న ముంగియు, నుడుతయు మాకులంబునకుఁ జెందిన, మమ్మున్ బలె నీపొలంబున జీవించు సాధుజంతువు ; లందు ముంగి నీ పైరుపంటలన్ బాడుసేయు పురుగులను, నీ పసరంబులకును నీకును బ్రాణవైరు లగు సర్పంబులను మ్రందింపుచు, నీ కుపకారంబు సేయుచుండు ; నది నీ పైరుపంటలను దినియుఁ, దినకయు జీవింపఁగలదు ; దానిన్ మచ్చికమై సాకుదేని యది నీబంటువోలె నీ యాజ్ఞకు లోనై, నీ వెన్నంటివచ్చుచు, నీకుఁ బ్రియంబుసేయు ; నది నీ యింట నుండునేని సర్పాదులును, మాకులంబు వ్యక్తులును, మాయ మగు ; నీ పిల్లియుఁ గుక్కయు దానికి వైరులు ; కాన వాని నేమఱక సూచికొనుచుండుము, వెండియు. ౧౧౦౬

చ॥ ఉడుతయు ముంగియట్ల కడు నుత్తమజంతువు ; సాకుదేని నీ
యెడఁదగు మచ్చికన్ దిరుగు, నింటఁబొలంబునఁ ; గుక్క, పిల్లియుం
మిడుకన వేచి, పట్టి వెసమ్రింగన సూచును ; దాని యందుఁ గ
న్నిడి, గయిసేసి, పెంచికొను ! మేమఱు టొప్పదు ! స్పాటిచెప్పితిన్.

వ॥ ఇట్లు చెప్పి, యనంతరంబ. ౧౧౦౮

తే॥ చాలనేపాయె; నా యీ ప్రశంస యింత
దనుక పెరుగుట పాలు; సంతసమ యయ్యెఁ,
గడుపుమంటకు నోర్వ; నెక్కడికి నేనిఁ
బోదునని పల్కుచుఁ, దొలంగిపోయె నెలుక. ౧౧౦౯

వ॥ ఇట్లెలుక సన్న యనంతరంబ. ౧౧౧౦

ఉ॥ ఎచ్చట నేపదార్థము లభించునొకో యను నాస రేఁపఁగా
నచ్చోటుఁజేరి, యయ్యెలుక యమ్మెయిఁ బల్కినపల్కు లన్నియుఙ్
హెచ్చినదీక్షమై విని, యనేకవిధంబులఁ జర్చ నేసియుఙ్
నచ్చక చీమ యొక్కటి మనంబున నారయఁ జొచ్చె నీక్రియఙ్.

పిపీలికోపన్యాసము.

వ॥ ప్రాణికోటులందుఁ జీమకు భాషలేకుండుట యాశ్చర్యకరవిషయం;
బట్లయ్యు నది తన స్పర్శజ్ఞాన బలంబున సంఘంబుఁ ద్రిప్పికొంచు,
భాషకల జంతువులక కాక బుద్ధిబలంబు గల మనుష్యులకుఁ గూడ
దుస్సాధ్యంబైన సంఘబలంబును, దాల్మియుఁ, జాకచక్యంబును,
నిరంతర పరిశ్రమక్రమంబును, నిజకుటుంబవ్యవహారనిర్వహణ
మందుఁ బ్రకటింపుచుండు. ౧౧౧౨

తే॥ భాషయుఙ్, గ్రమశిక్షయు, భవ్యబుద్ధి
బలమునున్ లేక యిది యిట్లు పనికి నగుట
యెట్లొకో యని మాకు నూహింప నయ్యె
నిత్తెఱఁగు; కాని తెలియ రాదాయెఁ దుదకు. ౧౧౧౩

వ॥ అప్పిపీలికా రత్నంబు తలంపుచొప్పు యోగసిద్ధులైన మహాత్ముల
యనుగ్రహంబున మా కెఱుంగనగునంతవట్టు మా పాఠకమహాశయు

లకు నివేదించికొందు; మది యెట్లనిన నా గండుచీమ యక్కర్షక పుంగవు నుద్దేశించి యిట్లనియె. ౧౧౧౪

ఉ॥ ఇంతలు సాలసెప్పి చనియెన్ దన త్రోవన యెల్క, భాష యొ
క్కింత యెసంగి యుంట; నది యిట్లని యట్లని పల్కరాదు నా;
కంతియ కాక, నా యెఱిఁగినంత యెఱుంగుట దానికౌనె? యా
వంతయు దానివాక్యముల నర్థముఁ సారముఁ బెంపు నున్నదే?

ఉ॥ మానవజాతి దూష్యమని మాటికిఁ దిట్టుచు, నిన్ను నమ్మెయిన్
దానుతిరస్కృతిఁ పాత్రమును, ధర్మము నైచను నెట్లు? నీవు నున్
దానిక చెందినాఁడవు కదా? యది యట్టిద; యెల్క యేడ? ను,
జ్ఞానము నాఁగ నేడ? సరసత్వము నా మఱి యేడ? నేఁటికిన్?

ఉ॥ కేవలము మనుష్యకోటి శత్రుకులంబులకుఁ జెందిన దాని దూషణ భూషణాదులతో నీకున్ బనిలేదు; వినుము మృగత్వమానవత్వ దేవత్వంబులలో, మృగత్వంబుకన్న మానవత్వంబు శ్రేష్ఠతమం బనుట తెల్లంబు; దేవత్వంబు మానవత్వంబునందె సిద్ధింపనై యుండుఁ; గాన మీ జాతి మాకు వంద్యంబ కాని దూష్యంబ కాదు; కాలక్రమంబున నది యథఃపతనదుర్దశకు వచ్చుట నా యోర్చునట్టిది కాక, మనంబు గలంగ, నిటు నటు దిరుగుచు దైవ వశంబున నిచ్చోట నిన్నుఁ బొడగంటి; నావంత కొంతదనుక శాంతింప, నీతో నెద్దియేని భాషింప వలనుపడమి, భావనాలోకంబున మనో విద్యుత్కిరణంబు బఱపుచు నానందించు చున్నదాన; నాది యుగంబున మానవకోటిలోఁ బల్వురు పరమకర్షకులు, వార మహా ర్షులని పిలుపన్ బడువారు; వెండియు. ౧౧౧౭

తే॥ ఆశ్రమములను పొలములయందుఁ, దమకు
వలయు పండ్లను, గాయగూరలను సాలు
కొలఁది నెప్పుడుఁ బండించికొనుచు, వారు
కాల మంతయు శాంతిమై గడిపికొనిరి. ౧౧౧౮

తే॥ ప్రత్తియును, సన్ననారయుఁ, బట్టు, నేర్చి
కూర్చి వస్త్రంబులను నేసికొనుచునుండి
రమితదీక్షఁ బ్రయత్నపూర్వముగ నేని,
సహజమై యేని, నప్పని సక్క నచ్చి. ౧౧౧౯

తే॥ ఇట్లు కూటికి, గుడ్డకు, నించుకంత
యేని లోపంబు బుట్టమి నెప్డుఁ బరమ
శాంతిసుఖభూతిఁ గాలంబు సక్క గడిపి
కొనఁగ సాలిరి వారు, పెక్కులకుఁ గాక. ౧౧౨౦

తే॥ ఆశ్రమోచితకళలు, విద్యయును, వారి
బాలబాలికలకు నెల్ల బాల్యమంద
కఱపఁ బడుచుండెడివి, కొంతకాలము బహు
నియమపద్ధతులును, సాలనిష్ఠయుఁ దగ. ౧౧౨౧

తే॥ ఆత్మశుద్ధికి వలయు విద్యయును, జీవ
యాత్రకు వలయు కూడు, దేహమున కెపుడు
వలయు వ్యాయామమును, మఱి వస్త్రముఁ, దమ
కిమ్మెయి లభింప, వారు సుఖింపనైరి. ౧౧౨౨

ఉ॥ ఏమిఁట నేని లోపమన నెట్టిదియో ? తమ జీవయాత్రయం
దేమియు నెప్డెఱుంగరు, సుఖించిరి తద్దయుఁ బెద్దకాలముక్
బ్రేమయు, నార్జవం, బుచితరీతియు నొండొరులందు నెల్ల వా ;
రేమని వారి భంగి వినుతింపుదు నెట్లును బల్కఁబోలమిక్ ?

క॥ వారికి నాహారమున, వి
హారమునన్, గలదు దృఢనియమపద్ధతి పెం
పారి ; యది యట్టి దగుటన్
వారలు జీవించిరి బహు వత్సరశతముల్. ౧౧౨౪

ఉ॥ ఒండొరులందుఁ బ్రేమయు, సముజ్జ్వలగౌరవభావ, మాత్మలన్
నిండి యొసంగ, వార లతి నీతిమెయిన్ జరియింతు; రేమిఁటన్
సందితనంబు లేదు, చిరశాంతియు, ధైర్యము వారి సొమ్ము; లె
న్నండును బ్రాలుమాలి విడనాడరు పెంపుగరు నిత్యకృత్యముల్.

వ॥ మఱియు నక్కాలంబున యింతులు బానిసెలు, నింపు పుట్టించు వస్తువులున్ గాక, పరమ గౌరవంబు బడయుచుండిరి; వేళకు నాశ్రమములందుఁ బాటుపడుటయందును, వల్కలాదివస్త్రకర్మంబు లందును నయ్యోతెఱంగులఁ బురుషులకు వనితలు తోడుసూపు చుండిరి; నాఁటి వివాహపద్ధతి వధూవరుల యానుకూల్యంబుమైఁ బెద్దలవలనఁ బాటింప నగుచుండెడిది; మైథునంబు మహాభోగం బను దుర్భ్రాంతియు, విషయ లౌల్యంబును మృగ్యంబులు; దురా శయు, నీసును, గోపంబును, లోభంబును, మోహంబును, నాల స్యంబును, బ్రమాదంబును వారియందు లేకుంటన్ జేసియు, నాహారవిహారాదులందు దృఢనియమం బనుసంధింపఁ బడుచుండుట వలనను, నకాల సంతానాకాల జరామరణాదులును, దుర్భిక్ష క్షామాదులును, లోకక్షయకర సంగ్రామాద్యకార్యంబులును నాఁడు లోకంబున నరిది; మానవకోటి యంతయు నొక్కకుటుంబ మట్లు వర్తింపుచుండె; నాఁడ యంతర్బహిశ్శక్తులు మానవాధీనం బులై, వారి దేవత్వవిజృంభణంబున కనుకూలంబు లగుచుండెడివి, నాఁటి మానవునికిని నేఁటి మానవునికిని శారీరక మానసికబలంబుల హస్తిమశకాంతరంబు కల; దనంతరంబ సాలకాలంబున, కమ్మా నవకోటియందు స్వార్థపరాయణత్వంబు తోఁచె; దానియందుఁ గ్రమంబునఁ గామక్రోధ లోభమోహమదమాత్సర్యంబులను నరి షడ్వర్గంబు విజృంభించె; నిదియ మానవకోటి పురోఽభిగమనంబు నిరోధించునది కావున నరిషడ్వర్గంబునాఁ బడు; వారు దీనికి లోనై

సముద్యానంబు పెంపుఁదక్కి, యధఃపాతదశన్ బ్రాపించి, కృశించి, యాత్మైక్యత విస్మరించి, బహుముఖంబుల వ్యవహరింపఁ దొడంగిరి; తోడ్తోఁ బరస్పరేర్ష్యాపిశాచంబు వారియం దావేశించి, యవిద్యారూపంబున వ్యాపించి, నానాకలహంబులకు మూలంబై, నిరంకుశత్వంబునఁ గ్రాలన్ దొడంగె; దాని యుద్రేకంబునకు సహింపక, వారిలోఁ గొందఱు బుద్ధిమంతు లొక్కయెడఁ గూడి, తమ తొంటి యౌన్నత్యంబున్ గూర్చి కన్నీరిడి, మరల దానిన్ బ్రాపించు నవకాశంబు దోఁపకున్కి, నెద్దియేని సదుపాయంబున జాతి నిలువన్ బెట్టికొనఁ దలంచి, సాహసౌదార్య శౌర్యగాంభీర్య తేజోబలసంపన్నులగు పురుషశ్రేష్ఠులఁ గొందఱనేర్చి, వార జాతినంతయుఁ బాలించు వారలుఁగా నిలిపి, వారికిన్ బాలనాదివ్యవహారంబులఁ దోడ్పడ మఱికొందఱ బుద్ధిబలతేజోఘనుల నియమించి, యెల్లవారు నేఁటేఁట శక్తికిఁబోలి నల్లేమేనియు వారి కిచ్చికొనుచుఁ, దచ్ఛాసనంబునకు లోనై ప్రవర్తింప నొప్పించి, రాజ్యంబు లాడనాడ నేర్పఱచుటయుఁ, బ్రజానియుక్తులైన యా ప్రభువులు తమతమ రాజ్యంబులకుఁ బాలకులై, ప్రభుత్వంబు నెఱపుచుండిరి, పదంపడి. ౧౧౨౬

తే॥ చక్క బలువు రొక్కెడఁ గూడి, చర్చఁ జేసి
చేసి, ధర్మశాస్త్రంబులు సేయుచుండి,
రఖిలజగతీహితులగు మహర్షు, లెలమి
నెఱపి; నాఁటి ప్రజాప్రతినిధులు వార. ౧౧౨౭

క॥ వారల శాసనములకున్
మారాడక తమ కవియ ప్రమాణంబులుఁ గా
నా రాజులు గొనుచుండిరి
సారవినీతియును, నేర్పు సంధిల్లంగన్. ౧౧౨౮

వ॥ అంతియకాక.

తే॥ ఏము ప్రజల నియోగింప నిట్లు రాజ్య
భారము వహించితిమి; కాక పాలన మన
నేడ వారికి నింపు పుట్టింపమేనిఁ?
బ్రజలు మావార; వారి వారలమ మేము. ౧౧౨౯

చ॥ ప్రజలకు నేము, వారు బహుభంగుల మాకును నెప్డు నొదు రే
న్నిజముగ రాజ్యతంత్రములు నిల్చుఁ, గ్రమంబుగ వృద్ధిఁగాంచు; నా
ర్యజనులు మేలనన్ బ్రజలు, రాజులు నొండొరులందుఁ బ్రేమ య
క్కజముగఁ బొల్తురేని యు సుఖంబగుఁ; జేటగు నీసుపుట్టినన్.

క॥ ఏమన నన్యులమె? ప్రజా
క్షేమమ మా క్షేమమనుచుఁ జెప్పన్ జనుఁ గా
దే మాకు? వారలకు మా
క్షేమముఁ దమసేమ మనుచుఁ జెప్పన్ రాదే? ౧౧౩౧

క॥ అని నాఁటి ప్రజాధీశ్వరు
లనేకభంగులఁ దలంచి, యప్పటికిన్ బో
లిన చందమునఁ బ్రజాపా
లన మొనరించిరి మహర్షుల మతమ సెల్లన్. ౧౧౩౨

తే॥ అందఱుఁ బ్రజానియుక్తుల యగుట, మఱి ప్ర
జాహితమ వారలకు నెల్ల సార మగుట,
వారలును ధార్మికు లగుట, వారియందు
రాజ్యకాంక్షలు, యుద్ధవార్తలును లేవు. ౧౧౩౩

వ॥ ఇట్లు పెద్దకాలంబు లోకము పరమశాంతిసుఖసంపదఁ గ్రాలుచుండ.

తే॥ రాజులందుఁ బ్రభుత్వదుర్మదముఁ, బ్రజల
యందు బానిసె తన, మెప్పు డంకురించె ?
నష్ట మానవజాతి మహాత్మ్య మణఁగె ;
మాసె నైసర్గిక ప్రతిభాసమృద్ధి. ౧౧౩౫

వ॥ అక్కారణంబున నపారజ్ఞానసంపన్నంబైన మానవజాతియం దవిద్య
యు, నధర్మంబును విజృంభించి, పూర్వవాసనాసారంబై యెందేని
నణంగియున్న జ్ఞానలేశంబను సత్త్వంబున్ బీల్చి, యశక్తులన్ జేయు
టయుఁ, దృష్ణాపిశాచంబు రేకెత్తి ప్రజలయందును బ్రభువుల
యందు నొక్కభంగి నావేశించి, కలంచె ; దానన్ బ్రభువులం
దన్యోన్యరాజ్యాక్రమణకాంక్షయుఁ, బ్రజలయం దితరేతరాసహన
భావంబును, బహుముఖత్వంబును దోఁచి, మానవజాతిక్షయకరంబు
లైన యుద్ధంబులును వివాదంబులును బుట్టుచున్నవి. ౧౧౩౬

ఉ॥ అక్కట ! దివ్యశక్తి మహిమాఢ్యము మానవజాతి ; దానియం
దిక్కరణిన్ మహాహవము లింతలు పుట్టునె ? నేఁడు ! పోరులం
దొక్కనిఁ జంపఁ జూచు మఱియొక్కరుఁ డాగ్రహమూఁది, ప్రేమకున్
దక్కి, యుదారకారుణిక తాదళ వమ్మొనరించి, యేమనన్ ? ౧౧౩౭

తే॥ ప్రేమ మానవహృదయమన్ బెన్నిధి మణి
వోలె వెలలేనివస్తువై సాలఁ గ్రాలు ;
దాని నెచ్చోటనో దిగఁ ద్రావి వీర
లిట్టు లని నొండొరులఁ దెగనేసి కొంద్రు. ౧౧౩౮

తే॥ తోడి సోదరు వేడినెత్తురు శిరమునఁ
జల్లికొన, బలుమొగముతో సక్కనడచు
వాఁడును నరుండ యని సెప్పవలసినంత
వుట్టెనేనియు నా హేతువునక సత్తు ౧౧౩౯

క॥ ఛీ! యేఁటి మానవత్వ? మి
సీ! యిది యీ దుస్థితిన్ నశింపనగుటకున్
నామెద కలంగి నీరై
పోయెన్ ; మెయినెల్ల వణఁకు పుట్టెశిని గడున్. ౧౧౪౦

ఉ॥ క్రూరతకోర్చి, సోదరుల కుత్తుకలన్ దెగనేయు దుర్జనున్
వీరుఁడు,, శూరుఁ డంద్రు పదివేలజనుల్ బదివేల నోళులన్,
వారును వీరుఁ బ్రేమయను వార్తయు నేరని హీనులౌట, దు
ష్పౌరుషులౌటఁ ; గ్రూరులకుఁ బోలునె ప్రేమ నెఱుంగనెమ్మెయిన్?

చ॥ పురుషుల వేడిరక్తమున బ్రుంగియు, వారి కుటుంబముల్ నిరం
తరమును గార్చు నశ్రుజలధారలఁ దోఁగియు, భూమిదేవి ము
ప్పిరిగొను వంతఁగుందియుఁ, దపించియు, సారముఁ దప్పియున్నది
క్కరణి ననాథమై బహుయుగంబులనుండియు వ్రేటుపోటులన్.

ఆ॥ గీ॥ ప్రేమ పుట్టియేని, భీతిఁ గలఁగియేని ;
యుద్ధమునకుఁ బోవ నొల్లరు ప్రజ,
లెప్పు? డదిమొదలు నశింపక మానవ
జాతి మెల్లన వికసనముఁ గాంచు. ౧౧౪౩

వ॥ మీ మానవజాతియందు నాకుఁ గల నిర్మల గౌరవభావంబ యింత దనుక నన్నిట్లు విమర్శింపన్ జేసె ; నైకమత్యంబకాని కలహంబెఱుంగని జాతియందుఁ బుట్టిన నాకు జాతీయకలహంబులనిన నేవగించికొనుటయుఁ, దిరస్కరించుటయు సహజలక్షణంబులైన ; విని మంచివనికాని, కావనికాని విచారింపనోప ; నిది యిట్లుండ నింకొక ముఖ్యవిషయంబు విచారింపనై జ్ఞప్తికివచ్చుచున్న ; దది యెయ్యా దనిన. ౧౧౪౪

ఆ॥ భూమియందపుట్టి, భూమియనెలవుఁగా
బ్రదుకు మనుజకోటి బహువిధముల

భూమిదేవికడుప బొడచుచుఁ, దినఁగట్ట
వలదె ? యేఁటి లాఁతివ ర్తనములు ? ౧౧౪౫

క॥ కర్షకులుకారె తొంటి మ
హర్షులు ? శాంతిసుఖ, మాయురారోగ్యమహో
త్కర్షములు తమ ధనములు గ
హర్షంబున మసిరికాదె యమ్మహసీయుల్ ? ౧౧౪౬

ఉ॥ పుట్టెడు భూమిసాలుఁ దలపోయఁగ నొక్కకుటుంబ మిచ్ఛలున్
గట్టఁ, దినన్, బ్రశాంతిమెయిఁ గాలముబుచ్చఁగఁ గర్షకత్వమె
ప్పట్టుననేనియున్ జెడనిభంగి నెసంగుచుఁ బాటువడ్డచో ;
నట్టివకావె తొల్లిఁటి మహర్షుల యాశ్రమసీమ లన్నియున్ ?

క॥ సమతన్ జాతిన కాక జ
గమునన్ బహుజీవతతులఁ గాపు నిజపరి
శ్రమమునఁ బ్రోచున్ ; దజ్జ
న్మమ జన్మము ; వానిమతమ మత మన్నింటన్. ౧౧౪౮

తే॥ ఏనుఁ బరిణామమునఁజేసి, యెప్పుడేని
మానుషంబున కగుదేని, మాన్యమైన
కాపుకులమంద పుట్టి, సక్కగ నెసంగ
నిష్ఠమై స్రష్టను భజింతు నేఁడుమొదలు. ౧౧౪౯

వ॥ అది యట్లల నందు వేని. ౧౧౫౦

సీ॥ భూదేవి “నాకై నపుత్రుఁ డీతండ యెల్లరిలోన” ననుచు నుల్ల
సిలుచుండు ; । శ్రీదేవి “యితని కృషియనాకు జన్మసంస్థానం”
బనుచు సమ్మోదమునఁ బొదలుఁ ; । బ్రకృతిదేవి “యితండ పని
వడి నాకు సొంపున్ గూర్చువాఁ” డని పొంగుచుండు ; । మాను
షలక్ష్మి “యిమ్మానుష్యుండ పెనుపనే బ్రదుకుచుండు” నని గౌర
వము సేయు

శాంతిలక్ష్మి "యితండ నా జన్మభూమి"
యనుచు దీవింపుచుండు నిండారు ప్రేమ,
నే పరమపుణ్యు నొండొరుల్ సూపికొంచ
తండు సామాన్యుఁడే ? మహాత్ముండు కాపు. ౧౧౫౧

తే॥ అట్టి కాపుకులంబునఁ బుట్టుపుణ్యు
మునకు, సామాన్యులై తగు జనులు, నోచి
కొందు రే ? యేఁటిమాట ? యెక్కువ తపంబు
కల్మి గలవారిక యది సక్కఁగ లభించు. ౧౧౫౨

వ॥ కావునఁ గాపుపుట్టువునకై నేఁడాదిగాఁ దపంబుసేయుదునంటి ; మఱచితి నీ సందర్భంబున నొక్క విషాదకరవార్తయు నూహింప నయ్యెడి, నది యెయ్యదనిన. ౧౧౫౩

తే॥ భూమిదేవికెపుడుఁ గూర్చు పుత్రులైన
కాపులఁ, గరాతికరపీడఁ గలఁచుచున్న
వారు రాజులు, ఘోరాహవరతు, లత్యు
దగ్రకఠినస్వభావు, లధర్మరతులు. ౧౧౫౪

వ॥ మహర్షులకుఁ గరాతికర సమర్పణ రూపసంబంధంబు రాజులందు లేకున్కి, వారు శాంతిసుఖం బనుభవింప నగుచున్నవారు ; కావున కట్టివడుపు లేదయ్యెఁ ; గావున నతండు లోకక్షయంకర సంగ్రామ రతులు, నిర్దయులు, స్వార్థపరులుఁ, గ్రూరులు, వ్యసనపరాయ ణులు, నగు రాజులవలనఁ గాసిన్ బడుచున్నవాఁడు ; ప్రజలు రాజుల కేఁటేఁట నేమేనియు నర్పించుకొనుట ధర్మంబు కాదనరా ; దైనను వారి న్యాయంబులకుఁదగి కిరంబులు నుండవలయు ; నిది యిట్టిదియైయుండఁ గావున్ గూర్చి సెప్పనేల ? మానవకోటికె కాక, మానవేతర ప్రాణికోట్లన్ బెక్కింటికి నగు నతనికి రాజులును బ్రజ

లును నెంతయేనిఁ గూర్పనై యుండియు నట్లు కాకున్నవారు ; విశే
షించి పీడింపను దిరిగి, వెండియు. ౧౧౫౫

తే॥ కావు హృదయం బెఱియ నెప్డు కందు ? నడ్డ
కందు జగమంతయు ; నిది నిక్కం ; బతండ
లేఁడయేని జగంబునా నేడ ? యతని
చిత్తమె ? ట్టట్లు లోకము సేయన దగు. ౧౧౫౬

వ॥ నే నాదిగాఁ గ్రిమికీటకవర్గంబులు పెక్కులును, పారావతకపోతాది బహుపక్షిగణంబులును, శశహరిణరోహిషాది నానామృగసంతతులును, కర్కటమండూక కచ్ఛపాది జలస్థలచారి ప్రాణికోటులును, గర్షకమహర్షి క్షేత్రాశ్రమమందుఁ గొన్నిపాళ్లుఁ గొని జీవింపుచుండు, మింతియకా కమ్మానసీయుని కరస్పర్శసౌభాగ్యంబున నిట్ల వాడిచి, రేకెత్తి, యచిరకాలంబునన వృద్ధిఁ బొరయు నానాసస్యతృణలతావృక్షపుంజంబుల వలనఁ, బారిశుధ్యంబుఁ బడసి వాయుదేవుండును తన జగత్ప్రాణనామధేయంబు సార్థకంబుగ సదాగతి యగుట తెల్లం ; బిట్లెల్లవిధంబులఁ దన జీవనంబు జగదుపకారభాజనంబై సెల్లఁ, బరమశాంతిమెయి, నిజక్షేత్రాశ్రమంబున వర్షవాతాతపహిమాదులకోర్చి, తపించుచుండు నతండు లోకంబునకెల్లఁ బూజ్యుండు నాఁ గాఁడె ? యిట్టి నిన్నుఁ గూర్చి, యెంత కొనియాడినను యింక మిగిలి య యుండు ; నైన నే నిచ్చో మనలుట పాడిగాదు ; మా యేలికవారి కోపంబున కగ్గమగుదుఁ ; గానఁ బూర్వోక్తవిషయంబుల కనుబంధంబు నాఁ దగు నొక్క చిన్నవిషయంబు ననుసంధించి, మఱి పోదు, నది యెట్లనిన.

తే॥ ప్రజలయం దెప్డు సోదరభావ మణఁగె ?
మోసమున్, స్వార్థపరతయు, నీసుఁ బొడమెఁ ?
బాప భీతి తొలంగె ? దుర్నీతి సెలఁగె ?
నడ్డ శాసకులుంట యత్యవసరంబు. ౧౧౫౭

తే॥ వార రాజులు నా సెప్ప వడుదు ; దమ్మ
హాబలుల యెప్డును విరామ మనుట లేక,
పాటువడనై యొసఁగుదు ; రప్పాట యుభయ
వర్గముల వారికిన్ గౌరవంబుఁ గూర్చు. ౧౧౫౯

తే॥ రాజు శాసింపకుండినఁ, బ్రజలు ధర్మ
పథమునన్ బోవు దురె పరస్పరముఁ బ్రియము
వట్టి? వారలయందెల్ల నట్టిమతమ
యొసఁగు నేనియు, రాజున నేఁటి భయము? ౧౧౬౦

తే॥ చండశాసనుఁ డని రాజు సాలవెఱవు
దోఁప నిందింప నగునె? నిర్దోషులె ప్రజ?
లేల తమలోనఁ దారు వా రెప్పుడుఁ గల
హించికొందురు కుక్కల? ట్లేమివచ్చు? ౧౧౬౧

ఉ॥ ఒక్కనిపేరుఁ జెంపు విననోపఁడు వే ఱొకఁ; డింట నొక్కఁ, డిం
కొక్కఁడు వీధి గుమ్మమున, నొండొరులన్ జెడఁ దిట్టికొందు రే
యక్కరకేనిఁ గాని విషయంబులలోఁ బ్రజ; లేఁటి సిగ్గు? పెం
పెక్కడ? యేడ నీతి యన? నెంగిలికూటికిఁ గుక్కలున్ బలెన్.

క॥ నీతికి నియమంబునకున్
మూఁతి విఱిచికొంద్రు, మోసమునకుఁ దిగుదు ; రే
మో తలఁచి పఱువు లెత్తుదు ;
రే తెరువును గానరు తుద కీ యెల్ల ప్రజల్. ౧౧౬౩

తే॥ పరమ పావన తరము, నపారశక్తి
సంభృతమునగు మానవజాతి యకట!
యిట్లు సెడ నాయెనే? యింక నేడ జగము ;
ప్రకృతిమాతృమనోజ్ఞతా పటిమ యేడ? ౧౧౬౪

ఆ॥ మా కులంబునందు, మధుమక్షికల కట్ల
కలరు రాణు లధికబల సమగ్ర ;
లేము వారి యాజ్ఞ కెదిరి సనము, వారు
మమ్ముఁ గినియరు పనిమాలి, క్రొవ్వి. ౧౧౬౫

క॥ పాటిమెయి భూమిలో మా
కోటలుఁ, దరుశిలల వారి కోటలు నుండున్
బాటువడుదు మెప్పుడు న
క్కోటలన సమాశ్రయించికొని వా, రేమున్. ౧౧౬౬

క॥ ఒకచెట్టున, కొక శిల యన,
కొక చేవన, కెపుడుఁ దిరుగుచుండున్ బూ దే
నెకు నై యెల్లెడ మధుమ
క్షికాకులము గుంపులుగొని, చెలిమి దలిర్పన్. ౧౧౬౭

ఆ॥ ఇందు నందు ననక యేమును దిరుగుచుం
డుదుము గుంపులు గొని ; బ్రదుకు తెరువ
కాని, కలహమునకుఁ గాలు ద్రవ్వము ; పనిఁ
గల్గియుందు ; మొందు కాదు మాకు. ౧౧౬౮

తే॥ కడుపు మంటకు నేనియుఁ, గాక నోరి
చవికి నేనియు, మారాణి సక్క మాకుఁ
దప్పి తిన ; దేము నా యమఁ దప్పి తినము,
తిరుగ ; మాయమ తృప్తియ తృప్తిమాకు. ౧౧౬౯

తే॥ ఐకమత్యంబు, నితరేతరానుకూల
గౌరవంబును, గర్మయోగమును, మమ్మ,
మధుకరకులమ్ముఁ జూచియే న్మనుజకోటి
యలవరించికొనుట లెస్సయని తలంతు. ౧౧౭౦

సీ॥ రాజులుఁ బ్రజలు ధర్మమ ప్రాణమై పెల్ల నొండొరుల్ సుముఖత
నుండుచొప్పు, । వనిత లుచితగౌరవమునకై పతులకుఁ బనులందు
నెప్డుఁ దోడ్పడువిధంబు, । గోవులు మానవకోటికిఁ బూజనీయం
బులై యభివృద్ధి నలరుతెఱఁగు, । నెల్లవారును గృషి కిచ్చసేయు
చుఁ బాడిపంటలఁ దులఁదూగి బ్రదుకుభంగి,
యాతన్ముఖమ్మునఁ దీన యేనియు, నింకనొండు
మేననేనియు సంప్రీతిమెఱయ, నేత్ర
పర్వముగ నూడఁగలమహాభాగ్యమబ్బు
టెన్నఁడో కద నాకు సర్వేశ్వరు కృప ? ౧౧౭౧

తే॥ భాషయున్, గౌరవము, మేని బలములేని
నాతలఁపునందు మానవజాతి కాద
రంబగునొ ? కాదొ ? యవ్విషయంబుఁ గాల
మునకె విడచితిఁ ; బోదు నా పనికినింక. ౧౧౭౨

వ॥ అని చెప్పినట్లు మనంబునఁ దడివి, యప్పిపీలికారత్నం బెచ్చటికేని
యున్ జనియె, ననంతరంబ యొక్కకప్ప భూబిలంబునుండి నిర్గ
మించి, యున్నత ప్రదేశంబున నిలిచి, తన కృతజ్ఞత నెఱపికొన నో
యన నిట్లనఁదొడంగె. ౧౧౭౩

మండూక శశకరక్షిపక్షుల యుపన్యాసములు.

తే॥ ఏను జలచరకోటిలో నించుకంత
కాలియందంబు బడసిన గౌరవంబు
దగ నెసంగుదు, భూచరత్వంబునుఁ గల ;
దూర్పులేదు, గాలిన్ మ్రింగుచుండు నుర్వి. ౧౧౭౪

తే॥ చర్మ ముచ్ఛ్వాసనిశ్వాసకర్మకాండ
మునకుసాలు భూగర్భంబునను జలముల ;

గన్నులున్, నోరునున్, గుండెకాయ, చెవులుఁ
గలవు నాసికనాఁగఁ, దోఁకయును, లేవు. ౧౧౭౫

ఉ॥ పుట్టితి గ్రుడ్డునుండి ; మఱి పుట్టువుతోడన నాకుఁ గాళ్లులే ;
విట్టటుఁ గొంతకాలము జరించితిఁ జేపల నొక్కచేప నాన్,
నెట్టనఁ గొన్నినాళ్ళకు జనించెఁ బదంబులు రెండు మేను పూ
ర్వెట్టుటకొక్కనాఁగ ; మఱి రెండు క్రమంబునఁదోఁచెఁబాదముల్

ఉ॥ తోఁక తనంతఁ దాఁ దఱిగెఁ ; దోఁపదు పిమ్మట ; కాని మేనిపై
నీకలువుట్ట ; పూర్పుఁ గొను పెన్నఁడు లేదు ; కులంబు వారితో
నీ కరణిన్ జలంబుల జరించితిఁ ; గాంచితి మార్పు లన్నియున్ ;
నా కిపు డుర్విమీఁదఁ జరణంబుల కల్మి జరింప నయ్యెడిన్.

ఆ॥గీ॥ కొంతకాల ముర్విఁ, గొంతకాలము నీటి
యందు, నర్థి జీవయాత్ర సేయు
చుందు ; నీ పొలంబునందలి పురువుల
నేర్చి తిందు ; నీకు హితమ సేఁతు. ౧౧౭౮

వ॥ ఏనును మీనకులంబులందలి కొన్నియుఁ, గర్కటకంబును, నీపొలంబు
నందలి వరిపూవు దుమారంబుఁ దిను కాలంబునఁ గ్రొవ్వువట్టుదు ;
మిత్తెఱంగున నీవలన మాకున్ బ్రయోజనంబుంట మా మీన
కులంబులవారిపక్షంబు బూఁది యిదె నీకుఁ గృతజ్ఞతా పూర్వక
ప్రణామంబు లర్పింతు ; నని శశాగమనంబు వీక్షించి, యది నక్క
పిల్ల యను భ్రాంతిన్ బడి, చెచ్చెఱ యమ్మండూకంబు బిలంబు
నకున్ జనియె ; నంత యట్లు వచ్చిన కుందే లప్పరమ కృషీవలునకుఁ
గృతజ్ఞత నెఱపి యిట్లనియె. ౧౧౭౯

తే॥ పదముల ఖురపుటములుండుఁ బశుకులముల
కెల్లఁ ; దృణసస్యకోటుల, నింక నాక

లములఁ దినుచు బ్రదుకు నవి; నెమరువెట్టు
నందు నొకకొన్ని శృంగసమన్వితములు. ౧౧౮౦

తే॥ పరమ సాధుజంతువు లవి; పచ్చికయును,
నాకలమ్ములు వానికాహార మగుట;
నేనునామేఁత యట్టిద కాన, వాని
కులములకుఁ జెందితిన యనుకొనుచు నుందు. ౧౧౮౧

తే॥ కాని నాపాదముల లేవు వానికిఁ బలె
గొరిజ; లిఁక మాంసమున్ దిను క్రూరమృగకు
లములకున్ బోలె సనఖాంగుళక్రమంబ
దోఁచెడిన్, బన్ను లిందు నందు నను గావు. ౧౧౮౨

వ॥ ఇవ్విశేషంబు మృగజాతియందలి కొండొక పరిణామక్రమంబ యని తలంతు, నెఱిఁగెనను. ౧౧౮౩

తే॥ ఏను సాదుమెకంబున; యింత నిజము;
నా మృదులరోమములు శశోర్ణమను పేరఁ
గొని వెలకు సాలనైన దుకూల మగుట
నా విశిష్టతకు నిదర్శనంబు; సాలు. ౧౧౮౪

వ॥ మహాత్మా! లోకంబున కిట్లు నావలనఁ గొంతదనుక ప్రయోజనంబు కలదు, నా యాహారవిహారక్రమంబున్ బట్టి యేను పశుకులంబులక చెందితిఁ; గావున మాకులంబుల వారైన లులాయగవయహరిణరోహిసాదులపక్షంబూఁది నమస్కరింతు; నే నాదిగా మా కులంబులవారలము నీ పొలంబున భాగంబులు గొనుచుందు మనిచెప్పి, యకాలంబున నాకసంబునఁ జరించు ఋషిపక్షిన్ గని, యది సాళువంబని భ్రమించి, యా చెవులపోతు తుప్పకున్ జనియె, ననంతరంబ గగనంబున నట్లు చరించు నప్పరమసాధుపక్షిరత్నంబు

కాళ్లు లేమి నేలపైఁ బ్రాలి, నిలువ వలను పడమిఁ, జేరువనున్న చెట్టుకొనపైఁ బ్రాలి, వ్రేలాడుచు, నక్కాపున్ వీక్షించుచుఁ, గృతజ్ఞత నెఱపి యిట్లనియె. ౧౧౮౫

క॥ ఫలములు, నాకులుఁ, దిను చి
మ్ముల బ్రదుకుదుఁ; గాళ్లులేవు; మూఁతియుఁ గర్ణం
బులు, గుహ్యముఁ స్తనములు మృగ
కులమునకున్ జెంది, సాల గొమరొప్పారున్. ౧౧౮౬

క॥ ఱెక్క లవి పేరుమాత్రనఁ
బక్కి కొలంబునకుఁ జెందుఁ; బరికింపంగా
నిక్కముగ బహు సృష్టికి
సక్కనెసఁగు చందము నవి సాటెడిని గడున్. ౧౧౮౭

తే॥ గోళ్లు ఱెక్కలఁ గల; వవి కొమ్మకుఁ దవి
లించికొని, తలక్రిందుఁగా నెప్డు వ్రేలి
యుండుదున్; బిల్లలన్ గనుచుందు నొకఁడు
నొకఁడు; నిద్రింపుదుఁ బవళ్ల నొకవిధమున. ౧౧౮౮

ఆ॥ సంఘజీవనంబు సల్పుదు నొక్క మ
హాతరువు సమాశ్రయముగఁ; గూడుఁ
గట్టికొను తెఱుంగ నెట్టులున్; రాత్రిఁ జ
రింతుఁ; బొలసు నంట నెన్నఁడేని. ౧౧౮౯

వ॥ ఇట్లు వదనదంతగుహ్యస్తనకర్ణాదుల వలన మృగకులంబులకును, ఱెక్కలు నా నగు వానిన్ బట్టియు, నాహారవిహారక్రమంబు వలనను బక్షికులంబులకును, ఱెక్కలయందు సక్కనెసంగు నస్థి లేశంబులవలన బాహుశిల్పపరిణామక్రమంబు సూచింపుచు, బాహు విశిష్టతమ వానరాది ప్రాణివర్గంబులకును జెందితి; ని ట్లిన్నింటికి

నయ్యా, నా నృత్తిధర్మంబు పక్షికులంబునకు చెందియున్న కారణం
బున, నీ పోలంబున భాగంబులుఁ గొను మయూరపారావతకపోత
కుక్కుటశుకకలవింకచక్రవాకాది శకుంతగణంబుల పక్షంబున నిల్చి,
నమస్కరింతు నని చెప్పి, యా సాదుపులుగు మఱియు నిట్లనియె.

క॥ నినుఁ గొనియాడక, మఱి వం
దనము సమర్పింప, కిట్లు తప్పి తొలఁగి పోఁ
జను నీ కృషి బ్రదికెడు చే
తనకోటికిఁ ? గాన, నవ్విధంబున కగుదుఁ. ౧౯౧

వ॥ అని పల్కి, యది తన కృతజ్ఞత మాటికి సూచింపుచు నక్కర్షకో
త్తము నుద్దేశించి యిట్లు వినుతించె. ౧౯౨

దండకము.

శ్రీమత్సమస్త ప్రపంచస్తుత జ్ఞాన విజ్ఞాన గంభీర దివ్యప్రభాసం
స్ఫురన్మానసశ్రీమనోరంజనాంచత్కృషి ప్రక్రియాచాతురీ మండితో
దార మేధామహాజఃప్రవాహ ప్రపూతాఖిలాంగా ! ప్రసన్నాంత
రంగా ! నినున్ జూడ, నీ తోడ భాషింప, నా కాయెనే యిట్లు నేఁడిచ్చ
టన్ ; సంతసం బయ్యె ; భూదేవికిన్ గూర్చు పుత్రుండవై, సర్వలో
కంబు లీలన్ భరింపంగ శక్తుండవై, యొప్పు ; దే నెమ్మెయిన్ నీ మహా
దార్యమున్ గూర్చి వర్ణింపనేర్తున్ ? జగం బెల్ల నీ లాంగలంబే కదా
ప్రోవఁజాలున్ ! దదీయ ప్రభావం, బవాచ్యం, బమోఘంబునుఁ ;
గావునన్ వాసుదేవాగ్రజుండైన రాముండు దానిన్ ధరించెన్ ; సమ
స్తాస్త్రశస్త్రావళీశ్రేష్ఠమై, లోకమం దప్రతిద్వంద్వసారంబునుఁ, దేజ
ముఁ గూర్చె నా ప్రోఢ కా సాధనం ; బింక నవ్వీరు నిక్కాలము
దెవ్వరున్ మార్కొనన్ జాల ; రద్దేవుఁడున్ దాని కల్మిన్ మహాయోగ
విద్యారహస్యప్రపంచజ్ఞుఁడై, యాత్మవిచ్ఛేత్రిమ్మలం ధన్యుఁ డయ్యెఁ ;

యదుశ్రేష్ఠు లిక్కాలమం దెల్లరున్ గర్షకవ్రాతచూడామణుల్ సుమ్ము! వీరోత్తముల్; ధర్మసంస్థాపకుం, డద్వితీయప్రభావప్రపూర్ణుండు, దేవోత్తముం, డుజ్జ్వలజ్ఞానవిజ్ఞానయోగాధికుం, డవ్యయాత్ముండు, గోపాలదేవుండు మీవాఁడ శ్రీకృష్ణుఁ; డాదేవు లోకోత్తరోద్యత్ప్రభా వాంశమున్ దాల్చి వర్తించు మీ హాలికశ్రేణి లోకైకపూజ్యంబు నాఁ గ్రాలు టాశ్చర్యమే? మీర కాదే జగత్ప్రాణునిన్ శుద్ధునిన్ జేతు రెప్డున్ లసత్సర్వసస్యద్రుమవ్యూహ సంసర్జనస్ఫూర్తి వాటించి; దానన్ జగద్బాంధవుల్ నా నుతిన్ గాంతు; రా రామచంద్రుండు, శశ్వద్యశస్సాంద్రుఁ, డార్యుండు, సేవ్యుండు, రాజర్షి, మీ యాఁడు బిడ్డన్, గుణస్ఫీత సీతన్ జగత్ఖ్యాత దేవేరి గాఁ బొంది కాదే యవాచ్య ప్రభావంబునన్ గ్రాలి, సర్వోన్నతస్థానమున్ గాంచెనాయెన్; మహ ర్షుల్ త్రికాలజ్ఞు, లుద్యత్తపస్సిద్ధు, లత్యున్నతజ్ఞానవిజ్ఞానమూర్తుల్, ఘనుల్, సూడ మీ వార కారే? కృషిస్థానముల్ గావె శ్రీవారి భవ్యాశ్రమంబుల్, ప్రశాంతిప్రభాపావనంబుల్? స్థిరప్రజ్ఞమై వర్షవాతాతపాదివ్యథల్ లెక్కకున్ రానిచందంబునన్ సంతతక్షాంతి దీక్షావిశేషస్థితిన్ వ్రాలి, విశ్రాంతిభావింప, కత్యంతసాధుస్వభావంబు దీపింపగా, లాంగలం బంతకున్ సాల, భూదేవి సంప్రీతి బొందన్ దపం బెప్డు గావింతు, వొక్కింతయున్ గూటికిన్ గుడ్డకున్ లోపమన్ పల్కు లోకంబునన్ బుట్టకుండంగ, మర్త్యేతరప్రాణు లెన్నేనియున్ దృప్తిఁ బొందంగ, నీ యీ జగత్సేవకున్ సర్వజీవుల్, మనుష్యుల్ కృతజ్ఞుల్, సుశీలయ, తేజోవిశాలాయ తుభ్యమ్ నమస్తే నమస్తే నమః. ౧౧౯౩

వ॥ అని సంస్తుతించి, యాసాదువులుఁ గెగసి చనియెఁ; బదంపడి. ౧౧౯౪

క॥ సుముహూర్తంబునకున్ దగఁ
బ్రమదంబున దున్నె హాలము బఱపి, పఱపి, యు
శ్రమమున నాతఁ డష్టా
క్కమడి; ననంతరము సరళకౌతుక మెసఁగన్. ౧౧౯౫

వ॥ ఇ ప్పాట కిమ్మాత్రము పనిసాలుఁ, గ్రమంబుగ నన్నియు సమకూర్చికొని, సమగ్రకృషికర్మకున్ జొత్తము కాక! యనుటయు నెద్దుల నాఁగలికిఁ దప్పించి, చేరువనున్న చెఱువునకుఁ దోలికొని సని, జలంబుఁ ద్రావించి, కడిగి, మరల వానిన్ దోలి కొనుచు, నాలును, బిడ్డలును, రా నిల్లుసేరి, యా సతీమణి సత్వరంబుగ వండి పెట్టిన వంటకంబులు బిడ్డలతోఁ గూడ భుజించి, యా యమయున్ దిని, యుల్లాసంబుమై నుండ, నతం డిట్లనియె. ౧౧౯౬

క॥ సకలోపకరణములకు, మ
నకుఁ, బసులకు, న పొలంబునన్ గుడిసెలఁ గ
ట్టి కొనక వలయున్ గాదే ?
యిఁక నప్పనులకును జొత్త మీావున్ నేనుఁ. ౧౧౯౭

క॥ అనుడు నతని కాయమ యి
ట్లను మన మిర్వురము సేయ నైన వె విను! మ
ప్పను ? లాద్విజాగ్రణియ లో
కనుతుఁడు సేయించువాఁడు గాక యెలమిమై. ౧౧౯౮

వ॥ కావున నాతనితోఁ జెప్పికొనుట కర్జం బనుటయు, నతం డిది మేలని యప్పురోహితశ్రేష్ఠుని కడకున్ జని, తానునుఁ దనపత్నియు నాలోచించికొన్న చందం బెఱింగించి కొనుటయు, నతండును బలే యని పలువుర నియోగించి, యక్కర్షకోత్తముండు సెప్పిన ట్లప్పనులన్నియుఁ బది దినంబులలో సేయించెఁ ; బదంపడి యక్కర్షకదంపతులు సకలకృషిపరికరంబులను, బసులనుఁ దమ పొలంబునందలి గుడిసెలన్ జేర్చి, పవళ్లు విశ్రమింపఁ దమకు వలనైన మఱియొక గుడిసెఁ దారును బ్రవేశించి కృషి కారంభించిరి, తత్కృషిప్రకారం బెట్లనిన. ౧౧౯౯

సరళ తనభర్తతోఁ గృషికిన్ జొచ్చుట.

తే॥ ఇది పవలు, రాత్రి యిది యని యించుకేనిఁ
దెలియఁ బడ, వొక్కవిముసను నిలువఁ డింటఁ;
బొలము తన కిల్లుఁగా వేళఁ బుచ్చు, నా కృ
షీవల శ్రేష్ఠుఁ డతిదీక్షఁ జేసి, చేసి. ౧౨౦౦

వ॥ మఱియు నతండు. ౧౨౦౧

క॥ ఎఱుఁగున్ బొలము; తదస్వం
బెఱుఁగం డొకయిచ్చవృట్టియేనియు; లోకం
బెఱుఁగ దతని; లోకము నతఁ
డెఱుఁగఁ డనుటయు సరి; పెక్కు లేఁటికిఁ బేర్వన్? ౧౨౦౨

క॥ ఆకుతుకం, బా శ్రద్ధయు
నా కౌశల మెందుఁ గాన; మత్తెఱఁగ తగన్
గై కొనునది సకలకృషిక
లోకము లోవంబు కృషిఁ గలుగకుండంగన్. ౧౨౦౩

ఆ॥గీ॥ వస్తువునకును శక్తి బలె నెల్లపనులందు
నాప్తిఁ దోడుసూవ నంతికస్థ
నిధి, పతివ్రతామణి సతి కలదు భవ్య
కృషికళాఢ్య యతనికిన్ సుశీల. ౧౨౦౪

క॥ "ఆయమలే కేవనియును
సేయంగాఁ జాలఁ డా కృషీవలుఁ" డని పెం
పేయది సెప్పఁగ నగు; న
న్యాయాతిశయోక్తులు కల వనరా దందున్. ౧౨౦౫

తే॥ వ్యక్తికిఁ బరిసర ప్రభావ మవసరము;
ప్రకృతిమ్మాత సమస్తసూత్రములలోఁ బ్ర

ధానముగ నొప్పు నొక సూత్రమిది ; యిత్తె
ఱం గెఱుఁగుట సృష్టి నెఱుంగుట యగు. ౧౨౦౬

తే॥ వాసిగా నాకృషీవలవ్యక్తి, కతని
పత్నియ పరిసరంబాయెఁ ; బరిసరంబు
లందు నెల్లఁ బురుషునకు నాస్తినెసఁగు
భార్యయోర్తె యత్యుత్తమ పరిసరంబు. ౧౨౦౭

ఉ॥ పిల్లలనెల్లఁ దోడఁగొని, ప్రేమదలిర్పఁగ వాండ్రఁ, జేరువన్
జల్లని చెట్లనీడనిడి, సాలశ్రమంపడి, యాలతాంగి మే
నెల్ల సెమర్పఁ బాటువడు నీసు వహించినదొక్కొ నాఁ గడుఁ
వల్లభుతోడ నెప్డుఁ, జెలువమ్ము నెసంగెడు నప్పొలంబునన్.

క॥ చేదోడును వాదోడును
నాఁదగు నాయమ యతని కనయ ; మాతని మ
ర్యాదకు, నార్జనమున, కా
హ్లాదమునకు నప్పరమ కళత్రంబ యగున్. ౧౨౦౯

ఆ॥ గీ॥ ఇంతి ప్రొద్దు గ్రుంకు నంతదనుకఁ జేయిఁ
గలిపి, భర్తతోడ గాఢదీక్షఁ
బొలము పనులునేసి, పోవుఁనింటికి బిడ్డ
లఁగొని, సంతసంబెలర్పఁ బిదప. ౧౨౧౦

చ॥ ఎలమి గృహంబుసేరి, రుచులేర్పడఁ జెచ్చెఱ వంటఁజేసి, బి
డ్డలకును భర్తకింపునెగడన్ గడుపార భుజింపవెట్టి, యి
చ్చలు మఱి తా భుజించి, మృదుశయ్య సుఖంబుగ నిద్రబోయి, ది
క్కులఁ దెలుపెక్కఁ, గోళ్ల గమిగూయఁగ, మేల్కనుసత్వరంబుగన్

వ॥ వెండియు.

ఆ॥ గీ॥ అతిథిపూజయందు, నాప్తబంధుజన ప్రి
యంబునందు, గారవం బెలర్ప
నింటిపనులయందు, నెల్లవారల పొగ
డ్తఁ గనె సత్పతివ్రతా తిలకము. ౧౨౧౨

వ॥ మఱియు నక్కుటుంబినీరత్నంబు. ౧౨౧౩

సీ॥ మధ్యాహ్నవేళఁ గ్రామంబుగఁ బొలమునందలికొంపలోన నిత్యమును
నూలు । వడుకు రాట్నముపనివట్టి, యేకులుఁ జుట్టుఁ, బ్రత్తియేరిచి
కూర్చుఁ, బసరములకుఁ । గుడితి నేర్పునవెట్టుఁ, గోళ్లకు బాతుల
కును మేఁతలిడు మఱి కుక్కలకును; । రాత్రి గ్రామమున నిద్రకు
మున్ను తనశిక్షఁ బడయవచ్చిన బహుబాలికలకుఁ,
గుట్టుపనియును, సదువుఁ, బెక్కులగు వంట
కములు వండు తెఱంగు, లెక్కలును, బేర్మి
నమరు ప్రత్తిపనియు, నివి యాదిగా న
నేకకళలఁ గఱపు; దీక్ష నెగడనేయు. ౧౨౧౪

వ॥ వెండియు.

సీ॥ అరుణోదయంబగు నంతకుమున్న యింటిపనులన్నియు సంఘటించి,
బిడ్డ । లకు నన్నమిడి, వారలఁగొని, యింటితలుపు లన్నియుమైచి,
సిద్ధాన్నభాండ । ముం దలనిడికొని, మందమందగతిఁ బొలమునకుఁ
బోయి, వల్లభుని కచట । నన్నంబువడ్డించి, యాతండుఁ దాను
నస్యముఁ గబళించి, పెల్లాక్రమించి,
యురుపుకొని యుండుఁ తృణపుంజ మూడఁబెఱుకు,
గొప్పఁ ద్రవ్వఁ నేతాములఁగూర్చి, నూఁత్తు
లందలి జలంబుఁదోడి, యేపారు నసఁటి
తోఁటలకు సల్లును జెఱకుతోటలకును. ౧౨౧౫

ఆ॥ దీక్షపెం పెసంగ ద్రాక్షాలకాదిక
లతలనెల్లఁ, గౌశలంబు మెఱయ
స్వయమ ప్రోదిసేయు వల్లభు తోడ్పాటు
లేకయేని నచ్చెలియ సతంబు. ౧౨౧౬

ఆ॥ ఆ సతీపతులకు నానందదాయి, వి
లాసభవన మహాలంబ ; యింట
నిలువనొల్ల రొక్క నిమిషమేనియు, "నింట
నేమికార్య" మని వచింతురెపుడు. ౧౨౧౭

తే॥ చాలఁ బ్రొద్దెక్కి, యెండ తీక్ష్ణముగఁగాయు
నప్పు, డొక్కింతసేపు మధ్యాహ్నవేళ
బిడ్డలు ప్రియంబు గూర్పంగఁ, బేర్మి గుడిసె
విశ్రమింతురు నునుగాలి వీవవారు. ౧౨౧౮

చ॥ వినయముఁ, దాల్మిపెంపును, వివేకము సొమ్ములుఁగా నెసంగు న
వ్వనితకు సాటివచ్చు జనవంద్యచరిత్ర, సుశీల, ధర్మవా
దిని కులకాంతయైన నరుదే యశమున్, సుఖమున్, బ్రశాంతియున్
మనుజుని కీఁడునందు నసమానవిభూతియు గౌరవంబునున్? ౧౨౧౯

వ॥ అట్లు గావున.

తే॥ సకల జగదభివంద్యలక్షణసమేత
యైన యానతి తోడ్పడ, నఖిలకర్మ
కాండ మొనరింపుచును, నెఱుఁగం డొకించు
కయును గలనేనిఁ గష్ట మక్కాపు కందు. ౧౨౨౦

చ॥ ధనము, సఖుండునున్ సముచితంబగు మానము, భాగ్యమున్, సుఖం
బు, నతని కాన్సతీమణియ వో, తగ ; నాయమ లేదయేని యా
తని కొకపేరునాఁ గలదె? దానికినేమి? ఘనుండు కృష్ణుఁ డ
య్యనఘుఁడు సాలమెచ్చికొని నాయమఁగాదె జగద్గురుండుమున్?

కII మేదినిఁగల దంపతులకు
నాదంపతుల యితరేతరాతిశయ ప్రే
మోదయ నవ ప్రబంధం
బాదర్శ ప్రాయము, గణనార్హము, మఱియున్. ౧౨౨౨

హాలికదంపతుల కృషి సౌభాగ్య ప్రశంస.

వII ఇట్లొప్పు నప్పరమహాలికదంపతుల కృషి ప్రకారంబును, దత్సౌభాగ్యంబును నెట్టివసిన నా కృషీవల శ్రేష్ఠుండు. ౧౨౨౩

కII లలితముగఁ జాలు సాలుకా
గలిసి, నడుమ నెడమలేనిగతి కన్పట్టన్
బొలమెల్లఁ గొన్నినాళ్ళకు
నలఘుతరంబై నదీక యడరఁగ దున్నెన్. ౧౨౨౪

వII ఇట్లుదున్ని, యనంతరం బాతం డయ్యైపైరుల కయ్యైభంగులఁ దగు నెరువులిడి. ౧౨౨౫

తేII కాల మగుటయు సస్యానుకూలవృష్టి
తోన దఱివేచి, మంచివిత్తులనునల్లి,
మరల నాపొలమంతయు బిరుసువోవ
దున్నెఁ జాలును సాలుఁ గ్రందుకొనునట్లు. ౧౨౨౬

వII ఇట్లు విత్తు దుక్కియైనపిమ్మట నచిరకాలంబున. ౧౨౨౭

తేII బీజసంస్థితశక్తులన్ బీరువోని
స్వోదరస్థితశక్తుల నొకటఁ గూర్చి,
వ్యక్తమొనరించె సప్పాల మదనున కగు
పదునుపస లెస్సదొరకొనఁ బ్రబ్బి, పొంగి. ౧౨౨౮

తేII ప్రకృతిరక్షింప బీజగర్భముల సూక్ష్మ
రూపమున నున్నశక్తు, లారూఢి భూమి

వారి సంయోగవశమునన్, వ్యక్తతాద
శాభిరామ పరిస్ఫూర్తి నలరె నంత. ౧౨౯

ఆ॥ ఎనయ సూక్ష్మరూపమున బీజమందు నే
శక్తులుండు ? నవియ సమయ మగుడు
రూఢి వెలయ వృక్షరూపకల్పనయు నొ
నర్చు మెల్లనఁ బరిణామయుక్తి. ౧౨౩౦

క॥ అతి సూక్ష్మతరం బంతః
ప్రతిష్ఠితము, గూఢమున్, బరమశక్తి సమ
న్వితము, తరు రూపము సమం
చితమగు బీజమునఁ బెంపుసెసక రహించుఁ. ౧౨౩౧

సీ॥ కొన్ని దినంబులు కోమలపల్లవవ్రాతమనోజ్ఞతాభూతి నెగడి,
కొన్ని దినంబు లాకులు దట్టముగ శీతలచ్ఛాయ నింపుసెలంగ నొప్పి,
కొన్ని దినంబులు కుసుమవిసరలసత్పరిమళసారబంధురతఁ బొలచి,
కొన్ని దినములు ఫలోన్నతి నధికసంపన్నతావిస్ఫూర్తిఁ బరిఢవిల్లి,
బహుళ శాఖాన్వితంబయి, బాహ్యమందుఁ
గానఁ బడు నే తరు ? వది సూక్ష్మతరరూప
మెనయ, బీ జోదరంబున నిమిడి యున్న
యదియ యింతకుఁ బూర్వ మత్యద్భుతముగ. ౧౨౩౨

తే॥ ఏమి ! యీ సృష్టివైచిత్ర్య ? మేటిగాథ ?
యౌర ! పరమాణువట్ల యీ యఖిలజగ, మొ
కప్డు గురుశక్తి పుంజమం దణఁగి యుండి,
పరిణమించి, విశాలమై పరగె నిట్లు. ౧౨౩౩

తే॥ సరవిమై నిమ్మహాప్రపంచమ్మునఁ బెంపు
వెలయు నే శక్తిపుంజ ముద్వేలభంగి ?

నది విశేషించి యొకపరమాణువందుఁ
గల దతినిగూఢతరముఁ నగ్రాహ్యము నయి. ౧౨౩౪

వ॥ ఇమ్మాత్రన యిమ్మహావిషయచర్చ విరమింత మట్లు. ౧౨౩౫

చ॥ పొలమున నాకృషీవలుఁడు బొంపిరివోవక సల్లినట్టి వి
త్తుల యుదగంబులం, దురువుదోఁప నెసంగెడు శక్తు లెల్లను
జ్వలగతి నేకమై, బిరుసువారి, తొలంగక, లేఁత మొలక లై
వెలువడియెన్ ధరిత్రికి నవీనమనోజ్ఞత పెంపుఁ గూర్చుచున్.

వ॥ అంతఁ గొన్ని దినంబులకు. ౧౨౩౭

తే॥ ఆకసంబునఁ జుక్కల యట్టు లా న
వాంకురశ్రేణి బీజగర్భాంతరస్థ
జీవరసముఁ బరిగ్రహించికొని, యించు
కంత రేకెత్తి, మిలమిల లాడె మళ్ల. ౧౨౩౮

ఆ॥ జగము కన్న సూర్యభగవానుఁ డా నవాం
కురసమూహములకుఁ గూర్చుచుండుఁ
బుష్టియును, జవంబు, భూరితేజంబును,
వేయికేల్లఁ బఱపి వేఱవేఱ. ౧౨౩౯

ఆ॥ ప్రకృతిదేవి భూతపంచకసూర్యులన్
దాను లార్వ రాత్రిఁ దవిలి, కొల్వ
నానవాంకురంబు లను శిశుశ్రేణికిఁ
గ్రొత్తసొంపుఁ బెంపుఁ గూర్చు చుండు. ౧౨౪౦

వ॥ మఱియు మఱికొన్ని దినంబులకు. ౧౨౪౧

ఆ॥ ఆ నవాంకురప్రతానంబు లై శవా
వస్థఁ గడిచి, లోకవల్లభతర

మై రహించు యౌవనావస్థఁ బ్రాపించె
మహితభూతిమైఁ గ్రమక్రమముగ. ౧౨౮౨

ఆ॥ ఆ యవస్థ యంద యవి యన్నియును నసా
మాన్య సర్వలోక మాననీయ
చారుతర సమగ్రసౌందర్య రేఖావి
లాస భూతిమై సెలంగుచుండు. ౧౨౮౩

క॥ సౌందర్యలక్ష్మి జగదభి
వందితసహజగుణగౌరవ స్ఫూర్తియు, నా
నందమును వెలయ న ప్పొల
మం దతిలీల విహరించు నాసమయమునన్. ౧౨౮౪

వ॥ మఱియు నప్పుడు. ౧౨౮౫

క॥ ప్రకృతి కృషికునకు సాహా
య్యకారిణియు, నింటివేల్పు నై, నిజసౌంద
ర్యకళా ప్రకటీకరణా
తి కుతూహల భూతిఁ జేలఁ దిరుగుచు నుండున్. ౧౨౮౬

తే॥ క్రమముగా యౌవనావస్థఁ గడచి, సస్య
వర్గములు పేర్మిమై మూడవ యదియగు న
వస్థఁ బ్రాపించెఁ ; బొట్టలు వట్టు, నెన్ను
చాళ్ల వెస నీను నప్పుడ సక్కఁగ నవి. ౧౨౮౭

వ॥ అనంతరంబ మఱికొన్ని దినంబులకుఁ బంట కాలం బగు ; నప్పుడు.

తే॥ వినుతసౌభాగ్యదేవతా విగ్రహంబుఁ
దాల్చి, వేడ్కన్ బ్రకృతిదేవత పరిపక్వ
సస్యపంక్తుల విహరించు, సాటిలేని
లీలఁ గృషికుండు పాలవెల్లి బలెఁ బొంగ. ౧౨౮౮

క॥ ఆ పంట కాలమందున
కాపు సతీసుతుల తోడ గారవ మాత్మన్
దీపింపన్ దృష్టికి నగుఁ,
బ్రాపించు నవప్రభన్ బరమ మోదమునన్. ౧౨౫౦

వ॥ ఇట్లు పంటకువచ్చిన సర్వసస్యంబులన్ గోసి, భద్రపఱచుచు, మరల నామళ్ళు మెత్తవడునంతకుఁ బలుమార్లు దున్నుచు, నెరువు లిడుచుఁ, గాలంబునకుఁ దగిన సస్యంబులు వెట్టుచు, వానిన్ బ్రోదిసేయుచు, సంవత్సరంబు పొడవున రెండుమూడు పంట లేక ప్రదేశంబునన పడయుచు, నెల్లపంటలందును దొంటి నిర్ణయంబు ననుసరించి, భూస్వామియగు పురోహితోత్తమునకు నాల్గవపాలు సమర్పించుచుఁ, దక్కిన వింటన్ జేర్చికొని, పాలె కాపులకుఁ గూలి వారలకు నయ్యై కాలంబులకుఁ దగ నొసంగుచు, దీనానాథజనంబుల కగుచుఁ, బరమ వివేకసంపన్నయగు సరళ యన్నింటికిఁగాఁ గృషి సేయుచు, నలరుచుండి, యక్కాపొకనాఁ డొకమడిగట్టు వ్రచ్చి, దున్నుచుండ నాఁగలి కొనఁ దవిలి యొక్కమహానిధి వెలువడియె ననంతరంబ. ౧౨౫౧

## మహానిధిలాభాది విషయ సంగ్రహము.

సీ. స్పష్టాక్షరాంక విభాసితంబులు, రాజముద్రా సమన్వితములు నైన
నిష్కంబులును,వర్ణనీయ మహాభారకాంచనమయకణికాశతములుఁ,
జక్కనేర్పంబడి కుక్కుటాండప్రమాణములైన గొప్పవజ్రములు, మౌక్తి
కంబులుఁ,బుష్యరాగములాదిగాఁగల సకలరత్నమణులుఁ జారుతరము
లామహానిధియం దభిరామ నవ న
వోల్లసత్కాంతిపూరసముజ్జ్వలంబు
లై, కనంగనగుటయు, నత్యద్భుతముఁ, బ్ర
హర్షమును ముప్పిరిగొనంగ నాతఁ డెలమి. ౧౨౫౨

ఉ॥ మెల్లన నెద్దులన్ నిలిపి, మిక్కిలి చేరువఁ జెట్లనీడ న
త్యుల్లసనంబు తోడ సుఖమున్న కులాంగనఁ బిల్చి నో మనో
వల్లభ ! రమ్ము ! రమ్ము ! యని ; వచ్చె రయమ్మున నాడ కానవో
త్ఫుల్ల సరోజలోచన యపూర్వకుతూహల ముల్లసిల్లఁగన్. ౧౨౪౩

క॥ వచ్చి, నిధిఁ జూచి, మిక్కిలి
యచ్చెరు వాటునుఁ, బ్రహర్ష, మాత్మ నడరఁగా
న చ్చేడియ యిది యేలొకొ
యిచ్చో స్థాపించిరి ? ఘను లెవ్వరొకొ ? కదా ! ౧౨౪౪

వ॥ అని పల్కి యతండును దానును నమ్మహానిధి చుట్టును గ్రమ్మి
యున్న మన్నున్ ద్రవ్వి, యేర్చి పుచ్చి, యది బాగుగ సకలజన
గోచరం బగునట్లు సేసి, పదంపడి యతని నుద్దేశించి, విస్మయహర్ష
కౌతూహలంబు లొక్కపట్టున మనఃబున సందడి సేయ, వాని కను
రూపంబుగ మొగంబు సక్క నై యిట్లనియె. ౧౨౪౫

క॥ ఈనిధి యెవ్వరి ? దెవ్వఁడు
దీనికిఁ బ్రభువై, విభూతి దీపింపఁ గలం ?
డే నరపుంగవుఁ డొక్కొ
దీనిన్ స్థాపించె నెమ్మదికినై యిచ్చోన్ ? ౧౨౪౬

తే॥ ఇచట మన కిది కనవచ్చె నీశ్వరుండు
కరుణసేయ నిన్నాళ్లకుఁ ; గాని సాలఁ
భయము యగుచున్నది " నిధి యపాయకరము
యెట్లుఁ బ్రజలకు " నను వార్త యెల్ల కగుట. ౧౨౪౭

తే॥ మనకుఁ గృషిసేయన యొసంగె మాన్యుఁ డమ్మ
హాత్ముఁ డీపొల ? మ్మంతియ ; యన్నియుఁ గొన
నొసఁగఁ ; డదిగాన మనము మా యొడ్డి పల్క
రాదు దీనిని గూర్చి, గోరమున కొర్చి. ౧౨౪౮

తే॥ చనదు మన కెట్లు నీనిధి ; శాస్త్రమునకు
లోకము నకు వెఱతుము, మేలున కగుదుము ;
కాని యడిగాన యేల ? లోకమునఁ దిట్ట
వడుదుమే పుట్టి మనసరివారిలోన ? ౧౨౫౯

తే॥ మనకు నిధి కాదె కృషి, లోకమాన్య కర్మ ?
మెన్నఁడును జేటునా దాని కెందు వినము,
కనము ; మఱి యక్షయం బంద్రు కాదె దాని
నెఱుక గలవారు ? చాలు నో యింత కదియ. ౧౨౬౦

తే॥ అతఁ డీ భూమికిన్ స్వామి, యనఘుఁ, డెంత
కేనియున్ జాలుఁ ; దనవారి నెట్లు ? లట్ల
మనలఁ గడుఁ గూర్చుఁ ; గాన నాతనిక సెల్లు
నెట్లు నీనిధి ; యెవ్వర మిందు మనము ? ౧౨౬౧

తే॥ ఆ ద్విజాగ్రణి నెఱుఁగుదు ; మాతఁ డిమ్మ
హానిధిఁ బడసి, తన కగు నంత దనుక
సేయు లోకోపకృతి నిచ్చఁ జేసి, పెక్కు
కార్యములు తొంటికన్న జగంబు మెచ్చ. ౧౨౬౨

ఆ॥ అతఁడు మనకుఁ గూర్చు నట్లు మనముఁ గూర్ప
వలదె యాతనికి నవశ్య ? మతఁడు
పెంపుఁ గనిన మనముఁ బెంపుగాంతుము ; విప్ర
వరులసొమ్ము మనకు వలదు వలదు. ౧౨౬౩

వ॥ ధర్మ నిర్ణయంబు సేసి, యార్యవర్గంబువారేనిఁ, గాక మఱి యెవ్వ
రేనియు, నీ నిధిన్ మన కిప్పింతు రేనియు మన కొండనఁ బోలమిన్
గొని, యమ్మహాత్మునికె సమర్పింతము గాక యనుటయు విని,
యా కృషీవలుండు పరమ ధర్మశీలయుఁ, బ్రాజ్ఞయు నగు కుటుంబినీ
మణి కిట్లనియె. ౧౨౬౪

క॥ ఎయ్యది నాయుద్దేశం?
బయ్యది నీ యాత్మఁబోడము టాశ్చర్యము ; మే
లయ్యె ; మన యిర్వరమతము
లియ్యెడ నొకరూపుఁగొనుట కేమనవచ్చున్? ౧౨౬౫

ఆ॥ గీ॥ ఇపుడ యమ్మహామహీసురు పాలికిఁ
బొమ్ము! పోయి, గారవమ్ము మెఱయ
నీపొలంబునందు నిధియొండు సూచితి
మనుము! రమ్మనుము హితాళితోడ. ౧౨౬౬

క॥ ఇచ్చటికి నాద్విజాగ్రణి
వచ్చుదనుక వేచియుండువాఁడ, నన ముదం
బచ్చుపడఁగ బిడ్డలఁ గొని,
యచ్చో టవ్వనిత వాసి యరిగె రయముప్తె. ౧౨౬౭

వ॥ ఇట్లరిగి.

సీ॥ ఎండకు నగ్గమై యించుకవాడిన నెమ్మోనికాంతి వన్నియకుఁ దరుగఁ,
దగసలక్షణమైనమొగము సౌభాగ్యసదనము నానతినమ్మదమున గ్రాల
నాత్మప్రకాశబాహ్యచ్ఛాయలననైన వాలుఁగన్నులు చెలువంబుఁ
జిలుక, । సారమర్యాదా ప్రశస్తవినయగౌరవంబు సముచితవేషంబు
సాట.

మందయానవిలాసక్రమంబు నూప
ఱులకుఁ గడు మెచ్చుపుట్టింప, నెలమిఁ బొలిచి,
యప్పరమహాలికవధూటి యమ్మహాను
భావు మందిరమున్ జేరె బ్రాహ్మణవరు. ౧౨౬౮

వ॥ ఇట్లప్పరమసతి యమ్మహాన్యుని మందిరంబు నేరంజను నంతకుమున్న.

మిత్రశర్మ పురాణకథా కథనాది ప్రశంస.

తే॥ ఆర్యవర్గంబువారు, గ్రామాధిపతియు,
మఱియుఁ గొందఱు ప్రజలు, సమ్మదమెలర్పఁ
జుట్టుఁ గూర్చుండి, విన నాద్విజుఁడు పురాణ
మొండు చదువుచు వినిపించుచుండెఁ గరము. ౧౨౨౦

క॥ ఎనయఁ బురాణము వాక్రు
చ్చు నతని కంఠస్వనంబు శ్రుతిపేశలమై
విననగు బహుదూరము వ
ర్ణనీయతురగోత్తమఘనరావము వోలెన్. ౧౨౨౧

క॥ ఆతని మృదుకంఠవిని
ర్యాతములై వేఱ వేఱ రాగములు పరి
స్ఫీతములు పురాణకథా
శ్రోతల కర్ణోత్సవముగ సొంపలరారున్. ౧౨౨౨

క॥ ఆయతరాగాలాపము
సేయునపు డొకింత వృద్ధచిహ్నముఁ గనరా
దాయనఘునందుఁ దొంబది
హాయనములు సనినవృద్ధుఁ డాతండయ్యున్. ౧౨౨౩

క॥ యువకుఁడు పూరింపఁగఁ బెం
పువెలయు శంఖస్వనంబు పోలె నిగుడుఁ, బ
ట్టువిడిచి, గళమెత్తి యతఁడు
వివిధగతులఁ బుచ్చు స్వరము విన విన మఱియున్. ౧౨౨౪

చ॥ వితత తరంగరూపమున వేమలు నాతనికంఠనాళని
ర్గతమృదువాయు వింపుసెలఁగన్ బహుశబ్దవిలాససౌష్ఠవా
యతగతిఁ దత్సభాస్థితమహాజనకర్ణపుట ప్రవేశల
స్థితి విలసిల్లి యెంతయుఁ బ్రసిద్ధికి నెక్కె ననేకభంగులన్.

తే॥ వళులుఁదోఁప నించుక చెలువంబు తరిగి
యున్ దదీయాననము కళలొలుకుచుండు
బ్రహ్మతేజః ప్రవాహపూర్ణమ్మునై, ప్ర
శాంతిసారము వర్షించు చందమునను. ౧౨౪౬

సీ॥ అమ్మహాద్విజు భుజంబంటి విశుద్ధవర్ణంబగు బ్రహ్మసూత్రమ్ముఁ
బొలుచుఁ; । గంఠమ్మునందు సూక్ష్మద్యుతులీనుచు రుద్రాక్షమాల
లారూఢి నెసఁగు; ఫాలస్థలమునందు, బాహువులందు, వక్షము
నందు నందంద, సాంద్రతరము । బ్రహ్మలేపనము విభాసిల్లుచుం
డు; మహర్షివోలికఁ గాననగు నతండు;

నతనిచిత్తంబు పరమసౌహార్ద్రబంధు
రంబు, నకలంక, మత్యూర్జితంబు, భవ్య
శాంతి కలనావిశేషప్రశస్త; మతని
వచనరచన వితతమార్దవకలితంబు. ౧౨౪౭

వ॥ వెండియు.

క॥ అమరఁ బురాణకథాశ్రో
తృ మహాజనమధ్యమందుఁ దేజోనిధి భ
వ్యమనస్కుఁడు తారామ
ధ్యమునన్ జంద్రుండు నా నతఁడు గన్పట్టున్. ౧౨౪౮

వ॥ ఇట్లు శ్రోతృజన శ్రవణానందకరంబుగాఁ బురాణకథా కథనంబు
సేయుచున్న యమ్మహాద్విజుం డల్లంతదూరంబున నప్పరమకృషీవల
కుటుంబినిన్ వీక్షించి. ౧౨౪౯

తే॥ ఏలకోవచ్చుచున్న దాయింతి, సరళ
మొగము సక్కని తెలివిమై నెగడ? దానిఁ
గూర్చు కూతురువోలె నెక్కువ గరిమయుఁ
బ్రియముఁ దోఁపంగ లాలింతుఁ, బ్రీతిఁగాంతు. ౧౨౫౦

క॥ ఊరక రా దాసతి ; యొక
కారణ మట యెద్దియేనిఁగలదు ; మొగము నం
దారయువడ దోఁకగంటు ; వి
చారక్రమ ; మొకట నంతనము రూపించున్. ౧౨౮౧

వ॥ అని యతండు శ్రోతలతో మెల్లన ముచ్చటించుచుండు నవస
రంబున, నాధర్మవాదిని వినయంబు రూపొందిన చాడ్పునఁ గాన
నగుచుఁ, జేరన్ వచ్చి, యాతనికిని, సభ్యులకును నమస్కరించి,
పదంపడి య మ్మహాత్ము నుద్దేశించి యిట్లనియె. ౧౨౮౨

ఆ॥ దేవ ! కరుణతోడ నీవు మా కొసఁగిన
పొలము దున్నుచుండి భూరి మణిగ
ణాభిరామమగు మహానిధి నొకఁటి నా
భర్త సూచె నేత్రపర్వముగను. ౧౨౮౩

మిత్రశర్మతో సరళ నిధిలాభవార్త నెఱింగించుట.

క॥ ఆ నిధి చుట్టును మిక్కిలి
పూనిక మెయిఁ ద్రవ్వి, మన్ను వో నిచ్చితి, మ
త్యానందము నంధిల్లఁగ
నేనును, మత్పతియు, నొక్క నిముషము లోనన్. ౧౨౮౪

వ॥ ఇట్లు మన్నంతయున్ బెఱికివుచ్చుటయు, సకలమణిరత్నహాటక
కణికా నిష్కపుంజమంజులకాంతి భరితంబగు నమ్మహానిధినుండి.

క॥ వివిధమణిరత్నకాంతి
ప్రవాహ మురు వివిధవర్ణ పటలోజ్జ్వలమై
రవిబింబనము దృగ్ద్వాః
ప్రవాహము ల్లెల్లదెసలఁ బర్వెడిని గడున్. ౧౨౮౫

ఉ॥ అవ్వర రత్నసంభృతమహానిధి నిప్పటివారికేమి ? ము
న్నెవ్వరుఁ జూడరున్ వినరు నెందును నాఁగఁ దలంతు ; నిచ్చలుక్
నవ్వ మొగంబునందును, మనంబున మోదముఁ గ్రొత్తసొంపుమై
నివ్వటిలన్ సెలంగుదువు నీ విపు డచ్చట దాని నూచినన్.

సీ॥ అన్నంబు లేమి నిరాంత్రంబునాఁ గానవడుచు వెన్నంటిన కడుపుతోడ
నడుగు వెట్టుటయ ప్రయాససాధ్యపుఁ గర్మ మగుచు గుంటపడిన
మొగముతోడ, । రక్తప్రవాహావియుక్తంబులైన చందమున, నెండిన
యంగకముల తోడఁ, । బెక్కు పేరికలు గాన్పింప బిరుసు, లావుఁ
దక్కిన జీర్ణవస్త్రంబు తోడ,
నెవ్వరికి నెందులకుఁ గాక, యెప్డు బ్రదుకు
కూటిపేదయుఁ గోటీశు క్రొమరుఁ దాల్చు
నమ్మహానిధిఁ దాఁ జూడనైన మాత్ర
నని తలంచెదఁ ; బాగడ శక్యంబు గాదు. ౧౨౮

ఆ॥ ఎన్నఁడేని, యెచట నెవ్వని నోట నే
నియును విని యెఱుంగ నేను ప్రోవు
లై, యెసంగుచున్న యానిధిలోని ర
త్నమణి నిక్కపుంజ నామములును. ౧౨౯

శా॥ ఏ జన్మంబున నేమి సేసితి మొకో యే పాఱు నిష్ఠా రతిన్ ?
రాజుల్, వెండియుఁ జక్రవర్తులును గూర్పన్ గాక, యింపై, కరం
బోజన్ బొల్చిన యమ్మహానిధి సమగ్రోత్సాహమొప్పార నే
మీ జన్మంబునఁ జూడఁ గంటి ; మది నీ కెల్లనియున్ దక్కెడిన్.

క॥ నీవును నీ చుట్టములును,
నీ వారలు, నీ సభికులు, నిండుమనములన్
రావలయు నిప్డ యచటికి ;
నావుడు నా ద్విజవరుఁడు మనం బలరారన్. ౧౩౧

వ॥ తన చుట్టు నున్న యమ్మహాజనుల కిట్లనియె. ౧౨౯౨

ఆ॥ ఆర్యులార ! యీ శుభాంగి విశుద్ధ వ
ర్తనము కల్మి యివ్విధమునఁ దెలియ
నయ్యెఁ గాదె ? తనక మైనవిధికి వార్తఁ
దెచ్చె నట్టె యీ సతీ తిలకము ? ౧౨౯౩

క॥ ఏ యూసకుఁ జోరదయ్యెఁ
నా యందలి ప్రేమ నిమ్మనస్విని ; తన కే
మో యది కాదఁట ? నా కఁట !
యీ యార్జవ మెందుఁ గలదె యింతకు జగతిఁ ? ౧౨౯౪

వ॥ మీయందఱ నొక్కండును దప్పక నాతోఁ గూడి రాఁ గోరెద,
నీ సాధ్వీ వచనరచనన్ బట్టి యమ్మహానిధిసంగ్రహావిషయంబున
నీయమ మనం బొండు తెఱంగున నున్నట్లు తోఁచు మన్న యది,
ధర్మనిర్ణయంబును మఱి యచ్చట యత్యావశ్యకంబ ; దాని కే
నొక్కండన కామియఁ దెల్లంబ ; యే మందు రనుటయు, వా రది
మేలని లేచి ; రతండును బురాణంబుఁ గట్టిపెట్టి, లేచి, యెల్లరకు
ముందఱ నడచెఁ బదంపడి. ౧౨౯౫

ఆ॥ వంగపండు మేలి వర్ణంబుఁ బదనుమైఁ
గూర్చి పెట్టి నట్లు కోమరు మీరి,
తనువు ముదిమి సోఁకి నను వన్నె తరుగ ; దా
పిప్పుఁ గూర్చి వేఱ వినుతి యేల ? ౧౨౯౬

చ॥ ఎనుబదికన్న వత్సరము లెక్కువ సెల్లియు, నించుకంతయే
ని నడుము గూని వోదు, కడు నిక్కు పసిండి శలాక వోలెఁ గా
ననగు ; భుజంబులందుఁ జరణంబులయందును బుష్టివాయ ; ద
య్యనఘుని లావుఁ బాతకమహాశయు లారయనోదు రిచ్చలున్.

ఆ॥ మిగులఁ బొడవుఁగాదు, మిగుల గుఱుచకాదు
వానిమేను ; కాని వళులు తోఁచి
యున్నవని వచింపకుండుట దోష ; మ
ట్లయ్యుఁ బుష్టి సెడియె ననుటకాదు. ౧౨౯౮

సీ॥ చెవిదోయిఁ బరమరుచి శ్రీకి నెలవులై, కోమరుమీఱిన రత్నకుం
డలములుఁ, । బరిశుద్ధవారిసంపర్కంబునఁ లసత్పాండురచ్ఛవులీను
బ్రహ్మసూత్ర, । మమలత్వమును, మృదుత్వము, సూక్ష్మతయును,
సముచితంబులుగ నొప్పు నుత్తరీయ, । మతి దానధర్మసంగతిఁ గుడి
చేత లోకమెఱుంగ నిడికొన్న కంకణంబుఁ,
జెలువు పెంపొడఁగూర్ప వేంచేసెఁ దనువు
నుండి మహనీయతేజ మఖండమగు ప్ర
వాహమున్ బోలె నెల్లెడఁ బర్వుచుండ
నమ్మహానిధి యున్నెడ కతఁడు ప్రీతి. ౧౨౯౯

వ॥ అతనితోడ నమ్మహాజనులును నడిచిరి, పదంపడి. ౧౩౦౦

క॥ పరమర్షి వోలె నీగతి
నరుదెంచిన యమ్మహాత్ము నల్లనఁగని, బొం
పిరి వోవనిభక్తి నమ
స్కరించె నాకాపు ముదము గడలుకొనంగన్. ౧౩౦౧

వ॥ ఇట్లు నమస్కరించి, యతం డవ్విప్రపుంగవుని కప్పెన్నిధిన్ జూపు
టయు, సూచి, యతం డద్భుతంబును, బ్రహర్షంబును, మనంబున
వెల్లివిరియఁ, దనతోఁ వచ్చిన యమ్మహాజనులకు దానిన్ జూపుచు
నిట్లనియె. ౧౩౦౨

## మిత్రశర్మ తనతోవచ్చిన మహాజనులతో నిధిన్గూర్చి సంభాషించుట.

తే॥ ఇట్టినిధి సూచియెఱుఁగ నే నెన్నఁడేని,
వినుటయును లేదు ; కనుటయు, వినుటయేని
కల్గెనే యెన్నఁడేని నిక్కముగ నిచట
నున్న మీయెల్లవారిలో నొక్కనికిని ? ౧౩౦౩

క॥ ఇవె నూచితిరే భాస్వ
చ్ఛవు లీనుచుఁ బ్రోవులై, ప్రశస్తములై యు
న్నవి రత్నములున్, మణులున్
వివిధంబులు, పదులు, నూర్లు, వే, లయుతంబుల్. ౧౩౦౪

క॥ వినుత గురుకాంతి రేఖా
కనత్కనకమండిత కణికాపుంజము సూ
డ నతిప్రాచీనం బ
య్యు నిపుడ చేసినదివోలె నొప్పెడిని గడున్. ౧౩౦౫

క॥ ఈయవి యిచ్చో పెట్టుట
కేయది హేతువగు నొక్కొ ? యీవైదగ్ధ్యం,
బీయొప్పు, నీమనోజ్ఞత
యేయెడ నేనిధికిఁ బోల వెన్నండేనిన్. ౧౩౦౬

క॥ ఏ యుగమున నే లోక
శ్రేయః కాంక్షియగు పురుషసింహుఁ డెలమిమై
నేయిచ్చఁ జేసి, యీనిధి
నీయెడ నెలకొల్పెనొక్కొ ? యెఱుఁగవడదువో ! ౧౩౦౭

క॥ ఇక్కడ నీనిధిఁ జేర్చిన
యక్కాలమువారి వార్త లారయనేనిన్

జిక్కదె యొక యాధారం ;
బెక్కడ మన? మెఱుఁగుటయున నెక్కడదీనిన్ ? ౧౩౦౮

వ॥ ఇమ్మహానిధి యిచ్చోఁ స్థాపించినకాలంబున యీ ప్రదేశంబు నావ
రించికొని, యూరేని, కాక నగరమేని, కాక యరణ్యంబేని యలరు
చుండెడి దని మాత్రము మన మూహింపనేర్తు, మైనను. ౧౩౦౯

క॥ పరమప్రాచీనము త
చ్చరితము ; తర్కింపఁ బ్రజ్ఞసాలదు మన కె
వ్వరికేని మహాయోగ
స్థిరబుద్ధి విశిష్ట దివ్యదృష్టికిఁ గామిన్. ౧౩౧౦

క॥ ఓ యయ్యలార ! సూచితి
రే యీనిధిఁబోలు దాని నెన్నండేనిన్ ?
నా యెఱిఁగినంతవట్టు క
దా యెఱుఁగుట మీకు నయ్యె? నది యట్లుండెన్. ౧౩౧౧

క॥ ఈనిధి నేర్పడ సూడన్
నానయనము సాలదాయె నవరత్నోద్య
న్నానావిధరుచిపటలము
మానుగ మిఱుమిట్లు గొల్పుమాక్కి నడరుటన్. ౧౩౧౨

తే॥ సాధువ్వును, నాకుఁ జాల విశ్వాసపాత్ర
తముఁడు, నగు నీ కృషీవలోత్తమునకిమ్మ
హానిధి లభించెఁ బూర్వపుణ్యమున నిట్టు ;
లింతమే లొనరించునే యీశ్వరుండు ? ౧౩౧౩

చ॥ కుడువఁగఁ గూడుఁ, గట్టికొనగుడ్డయు నెన్నఁడు నెన్ని కష్టముల్
వడిన లభింపమిన్, మిగుల వంతఁ గలంగెడు నీకృషీవలుం,
డిడుమల కింకఁ గాఁడు ; మఱి యిష్టులుఁ దాను సతీసుతాదులున్
గుడువను గట్టనై, ప్రియముగూర సుఖించెద రెప్డుఁ దృప్తిమై.

చ॥ కలిగిరి బిడ్డ లీతనికి గర్భము సల్లగ ముత్యముల్ బలెన్
బలువురు, లోకనాయకు కృపన్ ; సుగుణంబుల ప్రోవునా, సతీ
తిలకము నా, జగంబు వినుతింపఁ గృతార్థతఁ గాంచినట్టి భా
గ్యలసితపుణ్యశీల కులకాంత మహాసతి వీని కిచ్చలున్. ౧౩౧౫

క॥ ఇది యంతయు నయ్యాశ్వరు
సదమలకరుణా విశేషసంప్రాప్తము ; వీ
నిద భాగ్యరేఖ యన వో
లదె ? నాయెద యుబ్బునకుఁ గలదె మేర యనన్ ? ౧౩౧౬

చ॥ ఎనసిన దైవయోగమున నించుక యత్నము లేక యిమ్మెయిన్,
దనకు లభించినట్టి నిధిఁ ద న్నొరు లెవ్వరు సూడకుండ, మె
ల్లన నిలు సేర్చి చందముఁ దలంపక, యీతఁడు వోలె వార్తనం
పు నతఁడు కల్గునే ? యితని పూజ్యగుణోన్నతి యింత యొప్పునే ?

క॥ ఇంచుక పరిచయమును, మ
న్నించుటయును గలుగు నన్ను నిట్లు పిలువ నం
పించి, తన భక్తి పెం పెఱిఁ
గించికొనియె లోకమునకు నితఁ డిబ్భంగిన్. ౧౩౧౭

క॥ వినుఁ డీతఁడు సౌఖ్యోన్నతిఁ
గనుటయ నా యభిమతము ; జగతి నా కాంక్షిం
చునది మఱి యొండు లే ; దే
మనఁ గొడుకున్ బోలె వీని నరయుదుఁ గానన్. ౧౩౧౯

ఆ॥ వీనికన్న నాకు వీని భార్య ప్రియంబుఁ
గూర్చు సాల ముద్దు కూతు రట్ల ;
యిది గుణములకెల్ల నిరవు వో ; దీనిఁ బో
లిన సతీతిలకము లేదు జగతి. ౧౩౨౦

ఆ॥ ఈడు సెల్లి, ముదిమిఁ బోఁడిమి సెడ్డ నా
కన్నులారఁ జూడఁ గల్గె నీశ్వ
రకృప నిధి లభింప రహివొల్చు వీరి పెం ;
పిదియ సాలుఁ ; గలదె యింతకన్న ? ౧౩౨౧

క॥ దారిద్ర్యము నిరసించి, య
పారసుఖప్రాప్తిఁ గని, విభవ మలరారన్
బేరును బెంపును గాంచుచు,
వీ రెసఁగన్ గనుటయ, పదివేల్నా కరయన్. ౧౩౨౨

వ॥ అని యమ్మహాజనులతోఁ బలికి, యతం డంతనిలువక కాపుతోఁ
బ్రియంబుమై నిట్లనియె. ౧౩౨౩

మిత్రశర్మ కర్షకోత్తమునికి హితోపదేశంబు సేయుట.

క॥ విను నీ ప్రవర్తనం బ
త్యనఘతరము ; నిధి లభింప నది యెల్లరకున్
వినిపించువాఁడు కలఁడే
నినుఁ బోలెన్ ? జాలు నిదియ నీ పేరునకున్. ౧౩౨౪

క॥ నీ నిష్కళంకవర్తన
మే నెఱుఁగుదు మున్ను ; వీర లెఱిఁగిరిపుడు ; మే ;
లేనున్, వీరున్, జగతికి
నీ నీతిన్ సాటుదుము పనికి నై యెప్పుడున్. ౧౩౨౫

క॥ ఈ నిధిఁ దగ శకటంబుల
పై నిడి, యిలు సేర్చు, మేఁటి కాలస్యము ? నీ
తోన యరుదెంచు వారల
మేను, మఱియు నూడు వీర లెల్లరు నెలమిన్. ౧౩౨౬

తే॥ ఈశ్వరుఁడ మీకు దయచేసె నిది కృపార
సంబు దళుకొత్త మీ శుద్ధచరితమునకుఁ
బారితోషికముగఁ; జాలఁ బ్రమదమయ్యె;
నాకు, వీరికి, మఱియు నీ లోకమునకు. ౧౩౨౭

క॥ ఈనిధి నేకొని, పరమసు
ఖానుభవస్ఫూర్తి వెలయు మాప్తులతో; నె
ప్డేనియు గురులోభగుణా
ధీనుండవు కావలవ; దది సెఱచుఁ గీర్తిన్. ౧౩౨౮

క॥ ఆయువు చంచలము; ధ్రువం
బేయదియును గామి తెల్ల; మది యరసి తగన్
నీ యోపినంత నుపకృతి
నేయుము గతిలేని హీనజీవుల కెల్లన్. ౧౩౨౯

క॥ గర్వంబు కూడదు; సెడిరి
గర్వమునన్ బలువు; రేఁటి గర్వ? మిసీ! యీ
యుర్వికి నాభరణంబు ని
గర్వియొకఁడ; కారు వానికన్న ఘను లొరుల్. ౧౩౩౦

క॥ కేవలము మైత్రి వెలయు స్వ
భావము, విస్ఫుర దుదారభావము, జగతీ
పావనము జీవనము నై
నీవు ప్రవర్తింపుము మహనీయస్ఫూర్తిన్. ౧౩౩౧

క॥ పరమాదరణీయులు విను
నిరుపేదల సారధర్మనిష్ఠుఁ దవులు స
త్పురుషులకుఁ; బేద చందం
బరయఁ గనుట యొండ ప్రేమ యనఁబడు నుర్విన్. ౧౩౩౨

తే॥ వర్ణభేదంబు పాటింపవలదు పేద
వానియెడ; వాని దేవర్ణమైన నేమి?
దానమున్ గొన సత్పాత్రతముఁడు వాఁ డొ
కండ యెల్లరిలో నతిగౌరవమున. ౧౩౩౩

తే॥ అఖిల జనములుఁ దనయెడ నాదరంబు
సూపి, శాశ్వతపుణ్యవిస్ఫూర్తి నొందఁ
జేయఁ జాలిన పేద వచ్చినఁ, బ్రియంబుఁ
గూర్పఁ డెవ్వండు? భువి కృతఘ్నుండు వాఁడ. ౧౩౩౪

క॥ పరమేశ్వర నిష్ఠాత
త్పరతఁ బ్రవర్తింపుము! చెడుపను లెన్నండుఁ!
బరగింపకు! నొరులకు ని
ష్ఠురముగ బల్కకుము! కా దసూయ యొకప్డున్. ౧౩౩౫

క॥ పగవారును మెచ్చికొనన్
దగు సద్వర్తనమునందుఁ దవులుటయున్, గ
ల్గి "గుణాఢ్యుం డితఁడు" నాఁ
బొగడ్తఁగను; మఱియు లోకపూజ్యతఁ గూర్చున్. ౧౩౩౬

క॥ చూడన్ దగు మందిరమో,
మేడయొ, గట్టించికొని, యమితసౌఖ్యమునన్
గ్రీడింపు, మందు నిష్టుల
తోడన్ దుర్వ్యసనముల కెదురుచుక్కవు నాఁగ. ౧౩౩౭

క॥ నానాజాతీయతరుల
తానికురంబాభిమండిత ప్రకటగృహో
ద్యానస్థాపనయత్నము
మానకు; మది సారసుఖసమగ్రతఁ గూర్చుఁగ. ౧౩౩౮

క॥ ఏకాంతవాససౌఖ్య
శ్రీకి నెలవు తోఁట; తోఁటఁజేరఁ జనులఁ జీ
కాకుపడిన డెందమునకుఁ
జేకూరున్ శాంతిసుఖ మచిరకాలమునన్. ౧౩౩౯

తే॥ ప్రకృతి మాతృచమత్కారపటిమ తోఁట
యందుఁ జేరిన మానిసిడెందమందుఁ,
గందళదమందతరమహానందదాయి
యగుచు రూపించు నతివిస్మయావహముగ. ౧౩౪౦

క॥ దేవతలఁగూర్చి వ్రతములు
గావింపుము! వారు పెంపుఁగావింతురు సూ,
వావిరి; దేవవ్రతుఁడనఁ
గా వినవే భీష్ము, సుగుణఖని, వీరవరున్. ౧౩౪౧

క॥ కాదు కుజనసాంగత్యము;
వాదము కానిపని విబుధవర్గముతోఁ; బెం
పూఁదవలయు మిక్కిలి య
జ్ఞాదులు గావించుదీక్ష నడరెడు వేళన్. ౧౩౪౨

చ॥ అనుటయు నాకృపీవలు కులాంగన యందఱియట్ల తానునున్
వినె నది కాన నప్పరమవిప్రశిఖామణికిన్ నమస్కరిం
చి, నయముమీఱ నిట్లనియెఁ జేతులుమోడ్చి, వినమ్రయై, బలే
యని కుతుకంబుమై నడరి యార్యగణంబు నుతింపుచున్ వినన్.

సరళ మిత్రశర్మతో తమ స్థితిగతుల విన్నవించికొనుట.

క॥ కేవల మీమాతనువులు,
జీవితములు నీయవియ, విశిష్టచరిత్రా!
కావున నేమన్యులమే?
నీవారమకాక? యేల నీ వింతలనన్. ౧౩౪౪

తే॥ వితతభవదీయ భక్తిమిళితములైన
రక్తకణములు మాశరీరములఁ గాలు
మొదలుఁ దలదాక నాడీసమూహసూక్ష్మ
మార్గములఁ బాఱుచున్న వనర్గళముగ. ౧౩౪౫

క॥ ఒకనిమిషమేని మేము బ్ర
దుకఁగలమె వినుతకార్యదుర్య ! యరయ తా
వక పాదసేవమాని ? వి
నికృష్టులము ; మాకుఁ బ్రభువు నీవమహాత్మా ! ౧౩౪౬

క॥ కలదే మా కీ సేనిధి
వలనఁ బ్రయోజనము ? లోకవంద్యుఁడవగు నీ
విలసత్కృపాకటాక్షము
కల ; దంతియసాలు ; బ్రదుకఁగలము సుఖముగన్. ౧౩౪౭

క॥ నీయదియ యీపొలం ; బిం
దేయది దైవవశమున లభించు ? నది తగన్
నీయదియ యగున్ గా ; కది
మాయది యెట్లగు ? నిదేఁటిమాట మహాత్మా ? ౧౩౪౮

క॥ ఇది నీయదియో ? మఱి మా
యదియో నిర్ణయముసేయ నర్హుండవు నీ
వ ; దయాధర్మాదికవిధి
విదగ్రగణ్యుఁడవు ; లోకవేదివి మఱియున్. ౧౩౪౯

తే॥ విషము నెట్లట్ల సామాన్యవిప్రు సొమ్ము
నూతుము ; సమస్తలోకపూజ్యుఁడవు, మాకుఁ
దల్లియును, దండ్రియును, మఱి దైవము నగు
నీ ధనముఁగూర్చి మఱి పల్కనేర వేఱ. ౧౩౫౦

క॥ ఈనిధి నీక్షేత్రంబున
మానుగ వీక్షించినంతమాత్రన యిది మా
కౌనె ? యివి యేఁటి మాటలు ?
మానుఁ ! డనక తండ్రి ! మమ్ము మన్నింపుదయన్. ౧౩౫౧

వ॥ అట్లుంగాక.

క॥ ఈ యది మాసొమ్మయనుచు
నీ యరయుట యయ్యెనేని, నీ కొండన క
ర్త్యాయతమతి నర్పణమున్
నేయుదు ; మి క్లేఁటి ? కనక సేకొను దీనిన్. ౧౩౫౨

క॥ మా కీ పొలంబ పెన్నిధి ;
ప్రాకటతరసారభాగ్యరాశి ; యిదియ పొల్
నీ కరుణ లభించినయది ;
లోకస్తుత ! నీకు మా ర్వలుక నిట్లాయెఁ. ౧౩౫౩

క॥ క్షమి యింపుము మా ప్రతివచ
నముల ; మహాత్ముఁడగు నీ మనసు నొచ్చిన నా
శము గాంతు మేము ; నీ చి
త్తము వచ్చినభంగి సేయఁ దగు దీ మీఁదఁ. ౧౩౫౪

క॥ నీ పొలము దున్నికొనుచున్
నీ పెంచిన చెట్టులమయి నిరంతరంబును నీ
ప్రాపున జీవింతు ; మిదియ
మా పుట్టినబుద్ధి ; యట్ల మనుఁ డనవె కృపన్ ? ౧౩౫౫

క॥ ఈ నీభృత్యులమగు మా
పై నీకు నను గ్రహంబపారమ యేసిన్
మానుగ నీ క్షేత్రముఁ గరు
ణానిధి యిప్పింపు మా ధనంబై సెల్లన్. ౧౩౫౬

క॥ ఘనసౌధమేని, హర్మ్యం
బు నేని మాకున్ వలవదు; పూరిపుడకలన్
దనరారు కుటీరము చా
లు; నింతకును నీకరుణ గలుగు టురు వరయన్. ౧౩౫౭

క॥ అని యిట్లు విన్నవించుట
యును, న్యాయము పరమధర్మయుక్తికి మోదం
బెనయఁగ నా ద్విజవరుఁ డి
ట్లనియెన్, గాఢాదరమున నాసతి తోడన్. ౧౩౫౮

క॥ అమ్మా! సౌభాగ్యవతివి
క; విమ్మా నీపతియు వెలయుఁ గావుత నారో
గ్యమ్మును, చిరాయువును, భా
గ్యమ్మును దనరారఁ దొంటికన్న నురువుమై. ౧౩౫౯

క॥ నీ చక్కని శీలము, నా
లోచన గరిమయును సర్వలోకస్తుత కా
ర్యాచరణ దక్షతయు, నిం
పై చనుఁ గా కెప్డుఁ! గీర్తి నలరితివి కడున్. ౧౩౬౦

చ॥ అనుఁగుఁ గుమారి పోలె నిను నారయు నన్ జనకుండు నాఁగ నీ
వనయము నాదరంబుమెయి నారయు నెంతయు నొప్పు; నట్లు గా
వున విను! నీవు పెద్దతగవున్ గొన, కిచ్చలుఁ దొంటియట్ల నా
పనిచినభంగిఁ బూని, పరిపాలనకున్ జొరు నాదు వాక్యముల్.

చ॥ వినుచు ముదంబుఁ గాంతు సుమి! వీనులకింపుగ నీ విశుద్ధవ
ర్తనమును గూర్చి, లోక ముచితంబుగ సంస్తుతిసేఁత; వీరు వా
రను టదియేల? నీచరిత మంతయుఁ గ్రొత్తది కాదు; నా యెఱిం
గి నదియ; లోకమందుఁ జిరకీర్తి వహించితి; చాలుఁ గూతురా!

క॥ నీవు చిరకీర్తి మనుచు
న్నా వని వల్కుటకు నామనము పరమానం
దావేశమహోత్కృష్టద
శావహ లీలన్ రహించు ననయముఁ దల్లీ! ౧౩౬౩

క॥ నీ చిన్ననాఁటినుండియు
నా చెప్పినయట్ల నీవు నడతు; వొకప్డున్
వా చెడి మార్వలుకవు కా
దే చనవున నేని నెట్టి తెఱఁగది యయ్యున్? ౧౩౬౪

క॥ మీ మేలకాక, యన్యం
బేమియుఁ గోరనని, నన్ను నెఱిఁగి యెఱిఁగియున్,
నామాటఁ గీటువుచ్చుచు,
నీ మెయి మార్వలుక నగునె యిందఱిలోనన్? ౧౩౬౫

క॥ న్యాయసరణి నెఱుఁగుదు కా
దే? యెఱిఁగియు మీక దొరికి, యెంతేనియుఁ బెం
పై యొప్పిన యీ పెన్నిధి
నాయిలు సేర్పఁ దలఁచి; తిది నయమే నీకున్? ౧౩౬౬

తే॥ ఎవ్వఁ డేనేల దున్ని, పండించికొనుచు,
బ్రదుకు నాలుబిడ్డలతోడఁ బరమనియతి?
వాని దయ యాపొలము సర్వవస్తు వితతి
తోడ; నిదిధర్మ; మేరికిఁ ద్రోయ రాదు. ౧౩౬౭

తే॥ దాని నొసఁగిన ప్రభునకు దాని మేల్లుఁ
గీళులకును దగన్గూర్చి పాళు లొసఁగు
టొప్పు; దానక్రయాదు లేయూర నెట్టు
లేనియున్ గావు; కృషిసేయ కుండరాదు. ౧౩౬౮

తే॥ పాళు లోనఁగండ యేనియుఁ, బ్రాలుమాలి
కృషి నుచితభంగిమై నొనరింపఁ డేనిఁ,
బొలమునకుఁ దప్పిపోవుఁ గాపు ; మఱి దాని
ప్రభువ యార్యవర్గము నాజ్ఞఁ బడ్డయు దాని. ౧౩౬౯

క॥ కావునను పొలము నాయది
నా వలుకుట కింక గాదు నా కెన్నండున్ ;
మీ వలనఁ బాళు లుచితము
మై వడయన యగుదు ; ధర్మ మది యెల్లరకున్. ౧౩౭౦

తే॥ కాపుఁ గృషినుండి వెడలింపఁ గాదు ; బ్రహ్మ
హత్యకన్న దారుణతర మైన పాప
మందు రది ; యాలుబిడ్డల కాతఁ డెట్లు
పాలుఁ బోషింప మడిలేక సక్క నెసఁగి ? ౧౩౭౧

వ॥ కావున.

తే॥ పొలము పంటలనుండి యెప్పుడును బాళ్లుఁ
గొనుట కేనగు ; దింతియ ; వినుము నిధులఁ
గూర్చి మీరు నే నెన్నఁడుఁ గూడవలికి
కొనుట లేదు కాదే యొకకొంత యేని. ౧౩౭౨

క॥ తలఁపకయున్, గోరకయుఁ,
బలుకకయున్ దొల్లి, యాసపడి యిప్పుడు మీ
రలవఁ చించి, నిధిన్ గొను
తలఁపునకున్ పొత్తు నెట్లధర్మంబునకై ? ౧౩౭౩

చ॥ పరమ దయాసముద్రుఁడును, భక్తశరణ్యుఁడు, నైన యప్పరా
త్పరుని కృపాకటాక్ష ముచితంబుగఁ బర్వుటఁజేసి, మీకునై
దొరికిన యానిధిన్ నయము దొందడి గీటునఁబుచ్చి, గైకొనన్
బరగునె నాకు ? నేమియని పల్కెదు నన్ను నెఱింగి యుండియున్.

క॥ న్యాయసరణి నీ కెఱుఁగని
దే? యెఱుఁగుదు; వేల సంనిధిన్ గొనుమనిసన్
వాయోడక షల్కెద? వ
న్యాయము నాసేయుకార్య మగునే చెపుమా? ౧౩౭౫

క॥ ఈనిధిఁ గొనుమని పల్కుట
మానుము; నీవకొని నాదుమాట యురువుమోఁ
బోని; మ్మనుఁగున్ గూతురుఁ
గా నిన్నరయుదును బేర్మిఁగాదే పుత్రీ? ౧౩౭౬

చ॥ చన వెసలార మీ యురువ సమ్మతిఁగోరెడి నాదుపల్కుఁ గై
కొనుము! వివాద మిక్కరణిఁ గూడదు; నావచనంబు చొప్పుఁ గై
కొని సుఖముండుఁ! డట్లగుటకున్ విను నాస్వజనంబుతోడ నే
నును, మఱి మీరలందఱును, నూల్కొను ప్రీతి రహింతు మెంతయున్.

చ॥ అన విని యమ్మహాద్విజుని కాయమ యిట్లను సత్స్వభావ మిం
పెనయ, మహాత్మ! నీపలుకు నెన్నఁడు గీటునఁబుచ్చ లే నెఱుం
గ, నయిన నిప్డు మార్వలుకఁగా వలసెన్; క్షమియింపు! మీవ మ
జ్జనకుఁడ, విష్టదైవమవు, సద్గురువర్యుఁడ వట్లఁ గావునన్. ౧౩౭౭

ఆ॥ సకలసస్యఫలనిచయమందుఁ బాల్గుమా
డేముఁ గొనఁగనగును; మీవు నేము
నప్పు డాడికొంటి; మంతియ; నిధులను
గూర్చి నాఁడు పల్కికొనుట లేదు. ౧౩౭౮

క॥ నీ పొలమునంద నూచితి
మీ పెన్నిధి; నంతమాత్ర నిది మాకగునే?
పాప మిది యనక గైకొన
నోపము; కాపులము; మాకు నొండేమిఁటికిఁ? ౧౩౮౦

క॥ కేవల మేమెల్లరమును
నీ వారల మెట్లు ? లట్ల నీయదియ మహా
త్మా ! విను మీా పెన్నిధియును ;
గావున మము వేఱుసేయక, నయము పేర్మిన్. ౧౩౮౧

క॥ నీ యిష్టమువచ్చి నటుల
నేయుము, మాకొండువల్క నెల్లదు ; వినుత
న్యాయసరణి నీ వేయది
సేయుఁ డనిన మార్వలుకక నేయుదు మదియున్. ౧౩౮౨

వ॥ అని పల్కి పసంపడి యూరకుండె. ౧౩౮౩

తే॥ మృదువు సెడక, విరసముఁగా, కొదవె నిట్టు
లమ్మహానిధిఁగూర్చి మహాత్ముఁడైన
యా ద్విజోత్తమునకుఁ, గర్షకాంగనకు వి
వాద, మ ద్దచ్చటన్ గలవారు బాగడ. ౧౩౮౪

వ॥ ఇవ్విధంబున నాద్విజాగ్రణికిని గర్షకపురంధ్రీమణికిని మృదువు సెడక వివాదంబు ప్రవర్తిల్లి, యప్పటి కది తీర్పరాకుంటన్ జేసి యార్యవర్గంబువా రాదిగా నెల్లవారు నిది యిచ్చోటఁ బరిష్క రింపఁ బడు నట్లు లేదు ; గ్రామంబున నెల్లని సమయంబునకుఁ దగఁ దీర్పనై యుండునని, యమ్మహాసతీపురోహితశ్రేష్ఠుల బాసఁ గొని, యమ్మహానిధి బండ్లపై నెక్కించికొని, వచ్చి, యార్య కార్యాలయంబుఁ జేర్చి, మఱల నందఱుఁ దద్వివాదపరిష్కారంబు నన్ దవిలి యుండిరి ; రా సమయంబునకుఁ దగ శ్రీకృష్ణభగవానుం డయ్యార్యరికి విచ్చేయుటయు, వారందఱు నమ్మహాత్మునిఁ బూజించి, యవ్వివాదక్రమంబు నివేదించికొనుటయు. ౧౩౮౫

తే॥ ఆ జగద్గురుఁ డదియెల్ల నవధరించి,
రేపు సముచితభంగిఁ బరిష్కరింతు
ననియె ; నతిసంగ్రహంబుగ నవ్విషయ మొ
కింత సూచించి విడిచితి మేము మున్ను. ౧౩౮౬

వ॥ ఇవ్విషయంబు మాపాతకమహాశయు లెఱింగిన యదియు, దాని
నిప్పుడు విస్తరించి నివేదించికొందు ; మది యెట్లనిన. ౧౩౮౭

ఆ॥ అట్లు కృష్ణదేవుఁ డాయూరిలోని జ
నంబుచేత గౌరవంబు బడసి,
యిష్టగోష్ఠి నుండునెడఁ, గాపునతియు, న
వ్విప్రవరుఁడు, లేచి, వినయ మెసఁగ. ౧౩౮౮

తే॥ తమ వివాదంబుచంద మంతయును విన్న
వింపఁ దఱివేచి, యాలోకవేది ప్రక్క
నొదిగి, యొకకొంతసే పట్టియుండి, సమయ
మగుడుఁ, గట్టెదుటవడి, యత్యధికభక్తి. ౧౩౮౯

వ॥ నమస్కరించి, తమ వివాదక్రమంబు విన్నవింపఁ దొడంగుటయు, వారల యుద్దేశం బెఱింగి, యా సర్వజ్ఞుండు మీ యుభయులం దొక్కరుమాత్రమ యవ్వివాదక్రమంబు నున్నరూపు మున్నెఱింగించికొనునది, యని మఱియు నిట్లనియె. ౧౩౯౦

క॥ తగవుఁ బడినవా రిద్దఱు
మొగిఁ గాకులువోలె, బిట్టు మునరి యఱచుచున్.
మొగమోడరెచట ? నలి నా
తగ వచ్చుటఁ దీర్పఁబడమి తథ్యం బెట్లున్. ౧౩౯౧

క॥ ఈయెల్లవారు విని, యిది
న్యాయవిరుద్ధంబుగా దనన్, దగవుమెయిన్

మీయుభయులందు నొక్కర
వాయోడక సెప్పఁ డవ్వివాదక్రమమున్. ౧౩౯-౨

వ॥ అనుటయు నయ్యుభయులం, దప్పరమబ్రాహ్మణుం డేన మున్న విన్నవించుకొందునని మొగంబు సక్కఁగనిలిచి, యిట్లనియె. ౧౩౯-౩

## మిత్రశర్మ శ్రీకృష్ణపరమాత్మునితో నిధివిషయంబైన తన వాదంబు విన్నవించుట.

క॥ ఈయమ సాధ్వీతిలకము ;
న్యాయసరణి నెఱుఁగు ; నెఱిఁగినట్ల నడచు ; లే
దీయింతి కొరులయందు న
సూయ ; కలదు కౌశలంబు చొప్పు పనులలోన్. ౧౩౯-౪

క॥ కేవలము శాంతికిన్ నెల
వీవనితామణియ యనుచు నెల్లరుఁ బొగడున్
వేవిధముల నీయమ ; నది
నా విననోచుకొనుఫలము నాఁ జెప్పనగున్. ౧౩౯-౫

ఉ॥ ఈయమపేర మున్న గణియింపనగున్ సకలప్రపంచమం
దాయతసర్వకార్యగరిమాతిశయంబున, విద్యయందునున్,
న్యాయమునందు, శీలమున, నంచితగౌరవమందు, నార్యజా
తీయామహాగుణాన్విత సతీతిలకంబులలోన నెంతయున్. ౧౩౯-౬

ఆ॥ గీ॥ ఎల్లపనులయందు నీయమకు నిమిత్త
మాత్రమ పతి ; లోకమాన్య ! యట్టు
లయ్యు వానిపన్పునం దగౌరవము లే
దీసతీలలామ కించుకేని. ౧౩౯-౭

క॥ నాయెడ విశ్వాసము కల
దీయింతికి సాలదనుక ; నేఁ గూతురు న
ట్లీయమ సూతున్ ప్రేముడి
వాయక యిదికాపు, దేను పాటుఁ డనకయుణ్. ౧౩౯౮

క॥ ఈయమపతియును మిక్కిలి
నాయెడ గౌరవము గల్గి, నాపన్ను తగన్
సేయున్ ; నా నచ్చినవా
రీ యింతియు, దీనిపతియు, నిద్దరు నెపుడున్. ౧౩౯౯

క॥ దాంపత్యధర్మ మెంతయుఁ
బెంపై, వీరియెడఁ గానుపించుట నా మ
న్నింపునకున్ దగి, మఱి ప్రే
మింపనగుదు రనుటసాలు ; నేఁటికిఁ బెక్కుల్? ౧౪౦౦

ఆ॥ గీ॥ అగ్గలముగఁ బనులయందుఁ బాలువడి, వీ
రేడెనిమిది దినము లేగుదనుకఁ
గానవడరయేనిఁ, గళవళపాటు నా
మానసమున రేఁగి మాడ్చు నన్ను. ౪౦౦౧

తే॥ కడుపుసల్లగ నీయమ కనియె నాణి
ముత్యములవోలె ముద్దులమూటలైన
కొడుకులణ్ బల్వురన్ ; వాండ్రయెడలఁ బ్రేమ
గాక, యీాయూర నీర్ష్యయొక్కనికిలేదు. ౧౪౦౨

క॥ పరమేశు ననుగ్రహమునఁ
జిరకాలం బా బుడుతలు జీవింతురు గా
కురు కృషికలోకధర్మా
చరణస్ఫూర్తిణ్, గరము ప్రజల యెన్నికకై. ౧౪౦౩

ఆ॥ గీ॥ పూసి, కట్టి, తొడిగి, పుత్రులఁగొని, పతి
తోడ నీగుణాఢ్య, యాఁడుబిడ్డ
వోలె వచ్చుఁ బండువున బున్నమను నాగ్ర
హాంబు పరమవైభవాప్తిఁ గ్రాల. ౧౪౦౪

క॥ మాయాఁడుదియును, మఱి నే,
నీయమకున్ గట్టఁ, దొడుగ, నిత్తు మెలమిమై
మాయోపినట్లు కొంచెం
బో? యురువో? దానికేమి వో పరమాత్మా! ౧౪౦౫

క॥ ఈ యమ నేనును, మఱి న
న్నీయమయుఁ, దిరస్కరించు టెన్నండును లే;
దాయతగౌరవసంపద
మా యిర్వురయందు సమమ మాన్యచరిత్రా! ౧౪౦౬

ఆ॥ ఎలమి సర్వసస్యఫలములయందుఁ బా
లొకఁడ నా కొసంగి, యున్నమాడు
పాల్గఁ దార గొనుచు భర్తయు నిదియును
నా పొలమునఁ గృషి నొనర్తు రెపుడు. ౧౪౦౭

క॥ ఆ పొలమున జలమండిత
కూపము లెన్నేనిఁ గలవు; కొమరారు సము
ద్దీపిత నానాజాతిమ
హా పాదపపంక్తులు, మఱి నభిరామముగన్. ౧౪౦౮

ఆ॥ ఎచటనేని నెప్పుడేని సస్యారిష్ట
మాపొలమునఁ దోచు టరిది; పండు
సకల సస్యములును సతముఁ బుష్కలముగఁ;
గఱవులేదు; వడువు కలదు సాల. ౧౪౦౯

వ॥ పెక్కేఁడు లే నాహాలంబునఁ గృషి సేసి, సుఖంబున నైతి; వార్ధ
కంబు కారణంబుగ నిప్పుడు దానికిఁ గాక వీరి కొసంగితి; నా
శుశ్రూషన్ జేసి వీరును గృషికళాప్రవీణులైరి; మఱియుఁ గృషి
ధర్మప్రకారంబు నెఱుంగనేర్తురు, వెండియు. ౧౮౧౦

చ॥ ఎనయ సతీలలామయగు నీయమ వృద్ధిన కోరుచుండు నా
కనుపమసంతసంబు మది నావహిలంగ లభించె నప్పొలం
బున నిధి యొక్కఁ డీయమ విభుం డొగి దున్నుచునుండఁగా "ఫలా"
ళని సడియిచ్చి, దైవము తనంతన గూర్ప హాఁహా గ్రభిన్నమై.

క॥ ఆ నిధిఁ గైకొన దీయమ;
నానెత్తిన వెట్టఁ దలఁచినది; యది యేమో
కాని యెఱుఁగ నేనెన్నఁడు
నానుడి కీయమ చలంబునన్ మా రనుటల్? ౧౮౧౨

వ॥ ఏను వీరికి భూమి నొసంగిన కాలంబున నిధ్యాదులఁగూర్చి ప్రశం
సించుట లేదనియు, నక్కారణంబునఁ దనకు లభించిన నిధి తనకుఁ
జెందదనియు, నీప్రాజ్ఞ వాదించుచున్నయది; యీ సందర్భంబున.

ఉ॥ ఆ యమ సొమ్ముఁ గైకొనియె నక్కట! యెక్కడి విప్రుఁ డీతఁ? డి
స్సీ! యని లోకులెల్ల నిరసింపరె? నోరికివచ్చినట్లు లే
మో. యదియేల సెప్ప? మొగమోడక దిట్టరె యాసపుట్టి, యే
నాయత ధర్మమున్ దొఱఁగి, యీనిధి నంటితినేని? యో ప్రభూ!

ఆ॥ గీ॥ మా వివాద మిదియ; మాన్యులరైన మీ
రరసి, యెట్లు ధర్మ? మట్లుసేయుఁ;
డకట "యిది వివాద" మని భవత్సన్నిధి
వలుక సాహసింపవలసె నిట్లు. ౧౮౧౪

వ॥ ఇని యిట్లా బ్రాహ్మణోత్తముండు విన్నవించి, యించుక తొలంగి నిలిచె; ననంతరంబ యమ్మహానుభావుం డక్కర్షకకుటుంబినీరత్నంబు మొగంబు సూచుటయు. ౧౪౧౬

ఆ॥ గీ॥ ఇంచుకంత లజ్జ యెదఁ దోఁప, సెప్పక
వలను పడమి గౌరవంబు సెడక
తన్వి నిజపద ప్రదత్త నిరీక్షణ
యగుచు విన్నవించె నప్పు డిట్లు. ౧౪౧౭

శ్రీకృష్ణస్వామితో సరళ నిధివిషయంబైన తన వివాదక్రమంబు విన్నవించుట.

చ॥ అనఘచరిత్ర! యీ బుధజనాగ్రణి మత్పితృతుల్యుఁ; డిమ్మహా
త్ముని మహనీయ సద్గుణసముచ్ఛ్రయుఁడు నా నుతిసేఁతు రెల్లవా
రు; నది నిజంబ; మా బ్రదుకుతెరువు జగన్నుతశీలుఁడైన యీ
తని కృపకల్మి నివ్విటిలు; దైవము మాకు నితండ యెప్పుడున్.

క॥ కలనేని నిమ్మహాత్ముఁడు
పలుకఁడు బొంం; కెట్టి యుఱుకువా రెన్నఁడు లే;
దలుక యితనిచిత్తమునన్
గలదని యెవ్వరును సెప్పఁగా లే రుర్విన్. ౧౪౧౯

చ॥ ఎనయ మహానుభావుఁ డగు నీఘను సర్వజగద్విశిష్ట వ
ర్తనము మహార్ఘలేని "నవురా" యనునట్టిదియై తనర్చుఁ; నీ
తని రసనాగ్రరంగమునఁ దాండవకేళి రహించుచుండు న
ల్లన సుకుమారధోరణి సెలంగి సరస్వతి లోకమాన్యయై. ౧౪౨౦

క॥ ఈతండు మహావక్తయు;
నీతిజ్ఞుఁడు; మృగ్యమ్మీతని యెడల గర్వం;
శాతత విమలాచారో
పేతుఁడు; ధర్మమన నితని పేరనక తగున్. ౧౪౨౧

ఆ॥ సార సకలశాస్త్రపారంగతుఁ డగు ని
యాన్యనఘునాల్క బొంకనందు, మఱి య
సంగతంబునందు జడతవహించు ; నిం
చుకయుఁ గదలకుండు చొప్పు నదియ. ౧౪౨౩

ఉ॥ ఈతని కాలిక్రింద వడి యేనియుఁ జావద యొక్కచీమయున్ ;
బ్రీతియకాని యించుకయు భీతివహింపదు ప్రాణికోటిలో
నీతనిఁ జూచి యొక్క నలుసేనియు ; శాంతికళాధురీణుఁ డా
నీతని ప్రేమతత్వ మది యెట్టిదియో ? యెఱుఁగన్ మహాప్రభూ !

క॥ ఔదార్యము, శాంతియు, మ
ర్యాదయు, ధర్మంబునందు శ్రద్ధయు, సతమున్
బీదలయెడలన్ గనికర ;
మాదరణీయంబు లితనియందలి గుణముల్. ౧౪౨౪

క॥ ఈతండ మాకు జనకుం ;
డీతనిసతి తల్లి ; నిక్క ; మేమందఱ విశ్వా
నీతికళానిపుణుని సం
ప్రీతిన్ జుట్టికొని బ్రదుకు బిడ్డలము ప్రభూ ! ౧౪౨౫

క॥ భానుఁడు సమస్తలోకము
మానుగ వెలయించునట్లు, మమ్మందఱ వి
ద్యానిధి యొనఁగించు నితఁడ
మానితవిలసత్కృపాసమగ్రహృదయుఁడై. ౧౪౨౬

క॥ మా కితఁడ గతియు, బ్రభువును,
లోకము ; నీతండుగాని లోకమెఱుఁగ ; మో
లోకస్తుత ! యీతఁడ వో
లోకోత్తరపురుషుఁడని పలుకవడువాఁడున్. ౧౪౨౭

ఆ॥ గీ॥ కట్టఁ దోడఁగనిచ్చి, గాఢతర ప్రేమ
సత్కరించుఁ బెక్కుచందములను,
నన్నుఁ దండ్రి వోలె సన్నుత ప్రేమరా
శియగు నితఁడు పెంపు సెల్లునట్లు. ౧౪౨౮

క॥ అదను నరసి యీతనిపొల
ము దున్ని, పండించి, పాళ్లు మూడు ప్రమోదం
బొదవఁగ నేను గైకొని,
తుదిషాలితనికొసంగుదుము భక్తిమెయిన్. ౧౪౨౯

ఆ॥ గీ॥ ఎలమి సర్వసస్యఫలముల నధికార
మిచ్చె మాననీయుఁ డితఁడు మాకుఁ ;
గాని యించుకంతయేని నాపొలమునం
దన్యవస్తువితతులందుఁ గాదు. ౧౪౩౦

క॥ కేవల మధికారము మా
కేవస్తువులందు నొసఁగె నీతండు కృపన్ ;
దేవా ! వానిన కొందుము ;
కావు తదన్యములు మాకుఁ గలలోనేనిన్. ౧౪౩౧

చ॥ ఎలమిదలిర్ప నొక్కమడి నిమ్ముగ నాపతిదున్నుచుండ, నాఁ
గలికొన దాఁకి, యొక్కనిధి కానఁగ నొటయుఁ, బొంగి, వేగ నీ
పొలమున నొక్కపెన్నిధి ప్రపూజ్యము గానఁగనాయె, నిద్ద రా
వలయు నటంచు నేఁ బిలువ వచ్చితి నూరికి ; వచ్చె నీతఁడున్.

వ॥ ఇట్లు పలువురు పెద్దలున్ దానును గూడివచ్చి, యిమ్మహాత్ముం
డానిధిన్ జూచి, విస్మయానంద రస విజృంభణం బొనసంబునకుఁ
గ్రొత్తవన్నియున్‌ గూర్ప నన్నున్ జూచి. ౧౪౩౩

తే॥ "దైవ మిదికూర్చె మీకు నెంతయును గరుణ ;
సంతసంబాయెఁ ; గొనుఁడు ; మోసంబులేదు ;

నాకుఁ గా" దని నానెత్తిన యుడఁదలఁచె
నేమి సూచియొ? మమ్ముఁ దా నెఱుఁగఁ డెట్లు? ౧౪౩౪

తే॥ బహువివాదపరిష్కృతి ప్రౌఢులైన
యార్యవర్గంబువారును నౌననుటయుఁ,
గాదనుటయు లేకుండిరి కార్యమరయ
నేమొకో యప్డు? కాక యింకేఁటి వడువో? ౧౪౩౫

క॥ తగ వెన్నఁడేని నెఱుఁగము;
తగవాయె మహాత్ముఁడగు నితనితో మా కి
ప్పగిది మహాత్మా! నీ వీ
తగవున్ దీర్చి, మముఁ బ్రోవు దయ దళుకొత్తన్. ౧౪౩౬

క॥ ఈ మహితనిధిన్ గొనుఁడని
యేమును, మాకు నది కాద, యీరల కొనుఁడం
చీమహనీయుం డనుటను
స్వామీ! తగ విట్లు మాకు సంభవమయ్యెన్. ౧౪౩౭

క॥ అరసి తగ మావివాదముఁ
బరిష్కరింపంగ సాలు ప్రభుఁడవు నీ; వె
వ్వరుఁ గారు; సకలజగములు
నఱచేతన్ బోలెఁ జూడనగుదు మహాత్మా! ౧౪౩౮

తే॥ స్వప్నమందేని బ్రాహ్మణ స్వాపతేయ
మంటు టెఱుఁగము; పరమపుణ్యాత్ముఁడైన
యిమ్మహాద్విజు సొమ్మంట నీనిభంగి
మమ్ము రక్షింపవే జగన్మాన్యచరిత! ౧౪౩౯

తే॥ స్వామియును, బోషకుండును, సద్గురుండు,
నంతయును మా కితండంటి; న ట్లితనిక

నిధి లభించెఁ బరాత్పరునికృప ; నెట్లు
దానిఁ గాపుల మేము నిందపడి గొనుట ? ౧౪౪౦

ఆ॥ గీ॥ పలుకుఁ జంద మెఱుఁగ ; భ్రాంతురాలన్ ; దెల్వి
లేను ; భయము కలదు ; వాదమునకుఁ
గాను, నుద్ధరింపు కరుణ మాకుల ; మాఁడుఁ
బేదరాల ; సాలఁ బెక్కులాడ, ౧౪౪౧

వ॥ అని విన్నవించికొని భక్తిమెఁ బునః పునః ప్రమాణంబు లాచరిం
చుచు నప్పరమసతి యొకింత తొలంగి సని, యొక్కెడ నిలిచి,
సూచుచుండె నంత. ౧౪౪౨

క॥ ఈరీతిఁ బ్రవర్తిల్లిన
వారి వివాదంబు తెఱఁగు వాత్సల్యం బే
పార విని, యమ్మహాత్ముం
డౌరా ! మీ రెంతధన్యు లని కొనియాడెన్. ౧౪౪౩

వ॥ ఇట్లు కొనియాడి, యప్పరమపురుషుం డవ్విప్రోత్తమున్ జూచి,
యాదరంబు మై నిట్లనియె. ౧౪౪౪

క॥ ధన్యుఁ డవు విప్రవర ! స
న్మాన్యము నీ విమలవర్తనము ; లోకము సా
మాన్యమె నీ యౌదార్యము ?
సన్న్యాసివి సకలకర్మజాలమునందున్. ౧౪౪౫

తే॥ యత్న మించుకయును లేక, యర్థరాశి
దొరకఁ, దృణమట్ల దాని నెందులకుఁ గొనని
వాఁడు కలఁడె యానకుఁ గానివాఁడు, ధన్యుఁ ?
డీ వొకండవ తక్క నీ యెల్ల జగతి. ౧౪౪౬

క॥ నినుఁ బోలు మహాత్ముల క
ల్మిని గాదే యీ జగంబు మేర సెడక ని
ల్వనగుట ? బ్రాహ్మణుఁ డను బే
రునకున్ దగి ; తిట్లు కా రౌరుల్ బల్వ రిలన్. ౧౪౪౭

క॥ ఈవిధి వివాదమంతయు
నే నెఱుఁగఁ దలంచి, వచ్చి తిందుల ; కెఱుఁగం
గానయ్యె మీచరితములు
దానికిఁ దోడుగఁ ; గడున్ ముదంబున కైతిన్. ౧౪౪౮

తే॥ ధర్మదేవత కిట్టు లిద్దఱును గూర్చి
ప్రజల రై తిరి మీరు ; మీ భవ్యశీల
మెల్లవారు నుతింపనై, యింకఁ గ్రాలఁ
గలదు చిరకాల మెల్ల జగంబునందు. ౧౪౪౯

వ॥ అని యాతనిన్ గొనియాడి, పదంపడి యగ్గోపాలదేవుం డక్కర్షక
కుటుంబినీరత్నంబు సత్యాదరంబుమై వీక్షించుచుఁ, బ్రియంబు
దోఁప నిట్లనియె. ౧౪౫౦

తే॥ కాపువారి మర్యాదను గాచి తమ్మ
నిధికి నాసఁ గొనక, ధర్మనిష్ఠఁ బొలచి ;
నిన్నుఁ బోలు పావనశీల లెన్న జగతి
నెంద జేనియు లే రిప్పు ; డిది నిజంబు. ౧౪౫౧

తే॥ "పొలమ పెన్నిధి" యను తలంపునకుఁ జొచ్చి,
యన్య మొల్లవు ; నినుఁ బోలె నాత్మనిష్ఠ
నలరు ప్రాజ్ఞలకల్మి నీ యవని నిలిచి
యున్న దింతకు గతిఁ దప్ప, కుచితభంగి. ౧౪౫౨

తే॥ తనకుఁ దాన లభించె రత్నముల ప్రోవు
నిధి, మహామూల్య ; మీవు దానికి మనంబుఁ
గొల్పవు ; పొలంబ యెప్పుడుఁ గల్పతరువుఁ
గాఁ దలంతు, వాసకు నెట్లుఁ గావు ; మేలు. ౧౪౫౩

తే॥ చాలు నీజన్మమునకు ; నీ సచ్చరిత్ర
మెల్లవారును గొనియాడ, నెంతయేని
నొప్పి యున్నది ; లోకవంద్యుండ యిమ్మ
హీసుర శ్రేష్ఠుఁ డును, ధన్యుఁ, డిద్ధబుద్ధి. ౧౪౫౪

తే॥ ధర్మ నిష్ఠయు, నంతతౌదార్యగరిమ
నీకుఁ దోడవులు ; నీవు వానికిని, నీకు
నవియు నగు చంద మారయ నఖిలలోక
వంద్య ; మిబ్భంగి మిక్కిలి వాసిఁ గంటి. ౧౪౫౫

వ॥ అని యమ్మహాసతి నగ్గించి, యమ్మహాపురుషుం డచ్చటఁ గూడి
యున్న ప్రజలతో నిట్లనియె. ౧౪౫౬

తే॥ ఇవ్వివాదంబు తెఱఁగు నా యెఱిఁగినంత
దనుకఁ జర్చించి, మీర లందఱును గూడ,
రే పుభుక్తికిఁ బిదపఁ బరిష్కరింతు ;
సాలు నిప్పటి కిది ; వింటె ; నక్క నచ్చె. ౧౪౫౭

వ॥ అని పల్కి యమ్మహాత్ముం డప్పటికిఁ దగఁ బ్రవర్తించె ; నావలి
కథ యంతయు మా పాఠకమహాశయు లింతకు నెఱింగినవార ;
వెండియు. ౧౪౫౮

తే॥ జాగరంబు నెపంబున సాల శ్రమకుఁ
బాలునేసితి మింతకుఁ బాఠక ప్ర
వరులఁ గథయందుఁ ; దన్మయత్వంబునొంది,
వారు మాతప్పు సైరించు వారొ ? కారొ ? ౧౪౫౯

తే॥ ఏల సైరింప రాఘను? లేము తప్పుఁ
జేసితిమి, సైపరే యని చెప్పికొంటి,
మింతకున్ గాదె? జగమున నెల్లయెడలఁ
బేరుఁ గాంచిన మాన్యులు గారె వారు? ౧౪౬౧

ఆ॥ కర్షకోత్తముండ కాఁడె జగంబున
కైన పుణ్యుఁ? డతని కంత లింత
లేము కూర్చి సెప్పి యొసఁగించితిమి కథ;
నెల్లవారుఁ గృషిక యొడ్డుదు దిగ. ౧౪౬౧

క॥ దానఁ బెరిగె నింతకును బ్ర
ధానంబై యవ్విషయము; తప్పాటయును మా
కైన యది పెక్కు చోటుల;
దాన నవియు నివియుఁ బెక్కు తప్పు లె యయ్యెన్. ౧౪౬౨

తే॥ ఎన్ని తప్పులు సేసిన నేమి? మమ్ముఁ
దప్పనాడరు పాఠకోత్తములు; వార
ఖండ విజ్ఞాననిధు; లది గాన వారి
యాదరమున మఱియుఁ గూర్పనాయె మాకు. ౧౪౬౩

వ॥ ఇది యిట్లగుట నవశిష్ట కథాగ్రథనంబునకు వచ్చితి; మది
యెట్లనిన. ౧౪౬౪

ఉ॥ అచ్చట నూరివారు తను నెమ్మియి జాగరముండి, కొల్వఁగా
నచ్చపు యోగనిద్రఁ బరమాత్ముఁడు కృష్ణుఁడు సేయుచుండెఁ, దా
నిచ్చలు రేఖాసర్పఁగల యెల్లపనుల్ దన దీపటంబునం
దచ్చిడినట్లు చిత్రితములై యొసలారఁగ, శాంతిధాముఁడై. ౧౪౬౫

వ॥ అంత.

ఉ॥ చక్కనిభక్తిపెం పమర జాగర మిమ్మొయి సేయుచున్నవా
రొక్కఁడుఁదప్ప కూరిప్రజ ; లోడరు ; వేఁగుట దోఁచె ; ధన్యులై
రిక్కడ నిట్లు; "మే" లని రహింపుచుఁ బాడఁదొడంగెనో యనన్
"గొక్కొరొకో" యటంచెలమిఁ గోళులుగూసెఁ ద్రిభంగినెల్లెడన్.

## శ్రీకృష్ణస్వామి నిద్రనుండి మేల్కని యార్యవర్గాదులతో భాషించుట.

వ॥ ఆసమయంబున.

సీ॥ సకలజగత్ప్రశంసా పాత్రతముఁడై, యహర్నిశంబును శాంతినలరు
ప్రభువు, । మానుషోజ్జీవన మహిమావిశేషసముద్ఘాటనస్ఫూర్తి
నొప్పు ఘనుఁడు, । సర్వప్రజా ప్రభు సంఘమర్యాదావిచక్షణతా
సర్వసార వేది, । దుష్టభూపాలనికృష్ట కర్కశమనః పాషాణనిర్ఘాత
పాతవేగుఁ,
డసమతేజోవిరాజితుఁ, డప్రమేయ
శక్తిపూర్ణుఁడు, యాదవస్వామి, మాన
నీయ ధీసాగరుఁడు, యోగనిద్రనుండి
మిక్కిలి కుతూహలంబుమై మేలుకనియె. ౧౮౬౭

వ॥ ఇట్లు మేల్కని యయ్యపార శాంతిధాముం డంతకుమున్న మేల్కని, యార్యవర్గంబువారితో నేమేని సంభాషింపుచు, నాజ్ఞకొఱకు నిరీక్షింపుచున్న సారథిన్ బిల్చుటయు, నంత నయ్యార్యవర్గంబువారును గూడిరా వచ్చి, నమస్కరించి, మహాప్రసాదంబన, నమ్మహాత్ముండు వారి నాదరించి, సముచితసల్లాపంబుసేయుచుఁ, దల్పంబు డిగ్గి, వారును, వారిన్ గలిసి మఱికొందఱును జలపూర్ణపాత్రంబులు ధరించి, యతివినయంబును భక్తియును గదుర వెన్నంటిరాఁ గదలి, గంభీరమందయానంబున గ్రామబాహ్యప్రదేశంబున కరిగి,

యందఱ నచ్చో నిలువ నియమించి, తాను మఱికొంతదూరం
బోక్కుండఁజని, యిమ్మగుచోట బహిష్కర్మంబును దచ్ఛుద్ధియును
గావించికొని మరలి, తనయాజ్ఞ నిలిచియున్న యా జనంబుఁ గలిసి,
వచ్చి, తన తల్పంబునం దాసీనుండయ్యె నంత. ౧౪౬౮

సీ॥ మంచున మేనులు ప్రాన్పడఁ బల్మిమైఁ గాలుసేయియు నోరుఁ
గదుపువారుఁ, । జలిగాలి తాఁకున సకలాంగకంబులుఁ గడునొవ్వ
వడవడ వడఁకువారు, । సోలినయొడళ్ళుల కోలి నించుకశక్తిఁ గలి
గింప బిఱుదుమైఁ బలుకువారుఁ, । గునుకుపాటునకైన కనుల నులు
పుచు నందంద సల్లనినీటఁ దడుపువారు,
నదె మహాత్ము లిప్పు డరిగిరి బయటికి,
వచ్చిరి మఱి యనుచు వలుకువారు,
నైరి జాగరమున కచ్చోటఁగూడి, పెం
పారు దీక్షఁ గొన్న యూరివారు. ౧౪౬౯

వ॥ పదంపడి.

ఆ॥ కోడిగముల మాఱుకూఁతకుఁ బ్రీతిరె
ట్టింపఁ, గౌతుకంబు పెంపుఁ గదుర,
నెల్లప్రజలు నుల్లసిల్లిరి ; రాత్రి వేఁ
గుటయుఁ దోఁచె వారి కోర్కెకీఁదగ. ౧౪౭౦

ఆ॥ గూళ్ళనుండి వెడలెఁ గోళ్ళును, బాతులుఁ,
బందిగములు, మఱియుఁ బావురములు ;
నఱచె లేఁగకదుపు "లంబా" యనుచు లేచి,
తోఁకలెత్తి, కట్ల నాఁకికొనుచు. ౧౪౭౧

తే॥ "మే" యని యఱచె వడిలేఁచి మేకపిల్ల ;
"గొ" యని యఱచె వెండియుఁ గొఱియపిల్ల ;

రాత్రి యూరెల్లఁ దిరిగి, విశ్రాంతిఁగోరి,
సూచికొనెఁ బిల్లి యిమ్మగు-చోటు వెదకి. ౧౪౭౨

తే॥ దధిమథనమ్ముచుమంజుశబ్దంబు లూర
నెల్లెడలయందు వినసయ్యె ; నింతులుఁ గడు
సత్వరము యింటిపనులెల్ల సక్కఁజేసి
కొనుచునుండిరి మిక్కిలి కుతుక మెసఁగ. ౧౪౭౩

వ॥ ఆసమయంబున నక్కడ. ౧౪౭౪

తే॥ అదె మహాప్రభు లేమేని నాజ్ఞవెట్టు
వారలయి ; రార్యవర్గంబు వారలు విన
నోచికొనువారయిర యని నుడివికొనుచు
నుండి రచ్చోటుఁ గదలక యూరిప్రజలు. ౧౪౭౫

వ॥ అనంతరంబ,

క॥ మన మలర నార్యవర్గముఁ
గనుఁగొని, యాలోకగురుఁడు కార్యమరసి, యి
ట్లను నెల్లప్రజలఁ బనులకుఁ
బనుపుఁడు ! మీగలును సనుఁడు ! పనుపులు వైట్టన్. ౧౪౭౬

వ॥ మిత్రశర్మ మందిరంబునకును, నరళ యింటికిని దగువారిన్ బంచి, యక్కడ వారికి వారెల్ల పనులఁ దోడువడన్ జేయుఁడు ! తక్కిన వారందఱు సత్వరంబుగఁ దమతమ యింటిపనులు సక్కఁ జేసికొని, నాయొద్దకు వచ్చువారుఁగా సెప్పుఁడు ! వారు రా మనమందఱ మును మీ యూరి చెఱువునందు స్నానంబు చేసి, మీ దేవాలయంబున్ దర్శించి, దేవునిన్ బూజింతముగాక ! నా కింకను సాలపనులు గలవు ; తడయవలదు సుండీ ! యనుటయు, వారలు మహాప్రసాదం బని, యాజ్ఞవడసి, యెల్లవారికి నది వినిపించుటయును, వారు.

తే॥ గీ॥ ఏము ధన్యులమైతిమ యింత, కమ్మ
హానుభావుఁడు మమ్మిట్టు లాదరించె
ననుచుఁ బొంగుచు నిండ్లకు సనిరి, సక్క
జేసికొని రింటిపను లతిశీఘ్రమ మఱి. ౧౪౭౮

వ॥ ఇట్లెల్లవా రతిసత్వరంబుగ నింటిపను లెల్ల సక్కజేసికొని, యప్పరమ
పురుషుం డున్నచోటికిఁ జేరుటయు, నార్యవర్గంబువారు వారిలోఁ
గొందఱ నేరికొని, వారిన్ మిత్రశర్మకును, సరళకును బనులందుఁ
దోడ్పడ సెప్పి, పుచ్చి, తక్కినవారును దారును, గ్రామాధికా
రియుఁ, గరణంబును, నమ్మహాత్ముని యాజ్ఞకొఱకు నిరీక్షింపు
చుండి, రంత నిక్కడ. ౧౪౭౯

తే॥ సత్వరమ యింటిపనులెల్ల సక్కజేసి
కొని కుతూహలరేఖమై మనసు లలర,
నూరఁ గల యింతులందఱుఁ జేరికొనిరి ;
సరళగృహ ; మాయమయు సంతసమునఁ దేలె. ౧౪౮౦

ఆ॥ అంత మిత్రశర్మ యాలును, మఱికొంద
ఱమ్మ లక్కలును, బ్రియమ్ముతోడ
సరళ కెల్లపనుల సాయపడిరి బహు
వస్తుతతుల దీక్షవట్టి, కూర్చి. ౧౪౮౧

క॥ అలుకుటయు, గోమయంబున్
జలుకుటయును, వంటకములు సేయుటయును, గూ
రలఁ దఱిగి కూర్చుటయు, ము
గ్గులు వెట్టుటయున్, జలంబు గొని తెచ్చుటయున్. ౧౪౮౨

తే॥ వంటకట్టియ లిడుటయు, వంటల రుచు
లిట్టి, విట్టివి యని యెఱిఁగించుటయును,

బీటలను, చాపలను గూర్చి పెట్టుటయును,
బాత్రములఁ దోముటయుఁ, జెత్త బఱపుటయును. ౧౪౮౩

వ॥ మొదలగు పనులందుఁ గొందఱు నేర్పుగల యిల్లాండ్రు సరళ కొక్కింతయు శ్రమ దోఁపని భంగిఁ బ్రవర్తిల్లిరి, తక్కినయింతులు మిత్రిశర్మసతి బుద్ధిపట్టి, స్నానంబుసేసి, శౌచం బలవరించికొని, యప్పురుషోత్తమునిఁ బూజింప నరిగిరి, పదంపడి సరళగృహంబున నెల్లపనులకు నమరియున్న యిల్లాండ్రు. ౧౪౮౪

శ్రీకృష్ణపరమాత్మునిని యారగింపునకై యూరి యాండ్రు
సరళాగృహంబున నెల్లపదార్థంబు లమర్చుట.

ఆ॥ ఆరగించునఁట మహాప్రభు ? వాతని
కింపుపుట్టఁగ, రుచు లేర్పడంగ,
వంట లిందుసేయువాండ్రమైతిమి ; మన
కెంత సాహస ? మిది యెట్టు లొక్కొ ? ౧౪౮౫

తే॥ అమ్మహాత్ముండు కరుణించు టంతియ ; మఱి
కాక మన మెవ్వరము నేర్పు గలిగి, సక్క
వండి, వడ్డించి, తగు గారవంబు సూపి
యింపు పుట్టింప ? సామాన్యుఁడే యతండు ? ౧౪౮౬

సీ॥ ఆతనికిన్ దల్లియై, లోకమాన్యగౌరవమున నే యమ్మ గ్రాలునొక్కొ ?
యమ్మహాత్మునిసతియై నిత్యమేయమ్మ యతివైభవస్ఫూర్తి నలరునొక్కొ?
యావేల్పునకు గూతురై, పరమపవిత్రతాదశ నేయమ్మ తనరునొక్కొ ?
యాదొడ్డ దొరవారికనుఁగుసోదరియై యశంబున కేయమ్మ సాలెనొక్కొ?
యెంతయని వారిభాగ్యము నెన్న వచ్చు ?
వా రతనిచిత్తమున కగువారు గాక ;

మన మనఁగ నెవ్వర? మతండు మనల యెడల
నెవ్విధమువాఁ డగునొ? యెవ్వ రె ఱుఁగువారు? ౧౪౮౭

వ॥ అని యనేకవిధంబుల బలుకుచు, నేమఱక, య య్యిల్లాండ్రందఱు నేర్పు మెఱయఁ, దమతమ పనులన్ బ్రవర్తింప, మిత్రశర్మ సతి పెద్దతనంబువహించి యది యిట్లని యట్లని సెప్పుచు మఱియు నిట్లనియె. ౧౪౮౮

తే॥ ఆ మహాప్రభు వీయూర నడుగు వెట్టె
సాలు ననుకొంటి; మంతియ; సరళయందు
నాతని యనుగ్రహంబు నేమనఁగ? నార
గించు నఁట యిమ్మహాసతి యింట నేఁడు? ౧౪౮౯

తే॥ ఈయమ నెపంబునన్ మనకెల్ల నతని
సేవ సేయంఁగ నయ్యె; నా చెప్పు టెంత?
మీరు మీనేర్పుకొలఁదిఁ బేర్మిమెయి వంట
లందు వర్తింపుఁ డతిభక్తి నమ్మలార! ౧౪౯౦

తే॥ ఏడనో దేవతలు కల; రెఱుఁగ వడరు;
కాని యీ దేవుఁ డీ రీతిఁ గానవయ్యె
మన మహాభాగ్యమునఁ; గాన మాటవడని
చొప్పునన్ వంటలన్ నేర్పు సూపు టొప్పు. ౧౪౯౧

తే॥ ఆతని యనుగ్రహంబున కైతి; కైతి
మన్నమాత్రన సాల; దాయనకు నింపు
వుట్టునట్లు శ్రమంపడఁ బోలు; మనకుఁ
దక్కు మగవారి కన్న నెంతయును మేలు. ౧౪౯౨

వ॥ అనిచెప్పి యప్పరమబ్రాహ్మణియు వారియట్ల తానును దనకైన భంగిఁ బనులందుఁ బ్రవర్తింపుచుండె, సరళయు వారిన్గలిసి,

పనులుసేయుచుఁ దన భావిభాగ్యంబున్ గూర్చి విచారించికొను
చుండె; నిక్కడ మిత్రశర్మ గృహంబునను బలువురు పలుపనుల
కున్ జొచ్చి, మాటలు సేయుచుండి; రక్కడ. ౧౪౯౩

తే॥ అయదుస్వామి యూరివారందఱుఁ దన
యాజ్ఞ కువ్విళులూరుచు నట్టులుండ,
నెంతయేసియు నాదగ మెసఁగ వారి
యందుఁ దా నొకఁడై యుండ నాత్మఁదలఁచి. ౧౪౯౪

వ॥ తక్షణంబ తల్పంబునుండి లేచి. ౧౪౯౫

క॥ స్నానోచితమంజులవరి
ధానబృహతికాయుగంబు దాల్చి, లలి వినో
దానందంబులు వెలయం
గా నప్పుడ వెడలె నార్యకార్యాలయమున్. ౧౪౯౬

వ॥ తదనంతరంబ.

తే॥ దేవపూజాదులందు సుదీర్ణకాంతి
గౌరవామలతేజో వికాసము లొడ
గూర్పఁ జాలిన చారుదుకూలయుగము
బట్టికొని దారుకుం డతిభక్తి మెఱయ. ౧౪౯౭

తే॥ ఆ జగద్గురు నప్పరమాత్ము ననుగ
మించువాఁడయ్యె న; ప్డయ్యమితమహోవి
శాలు, లోకజ్ఞు, నయ్యదుస్వామికి విన
యంబుమై మ్రొక్కి యూరివా రందఱెలమి. ౧౪౯౮

వ॥ వారందఱును ముందఱను, వెనుకను, పార్శ్వంబులను నల్లంతదూరం
బున మెల్లననడువ, నమ్మహాపూరుషుండు మార్గంబువట్టి, స్నానంబు
సేయ నూరిచెఱువునకుఁ బోవువాఁడై, గ్రామంబు నిర్గమించి,

గ్రామంబున కల్లంతదూరంబునఁగల పొలమునడుమఁ గట్టవడిన మాలపల్లెన్ జూచుచుఁ, దల యూఁచుచు ననునప్పుడు. ౧౪౯౯

తే॥ సంభ్రమము, నద్భుతంబును, సాలభయముఁ
దోఁప, నమ్మాల లెంతయుఁ దూరమునకుఁ
బరువులిడి, వనమృగముల పగిది నొక్క-
చోటఁ గుమిగూడి, తన్నట్లె సూచుచుండ. ౧౫౦౦

క॥ వారల యవ్విధమున క
క్కారుణిక ప్రవరుఁ డాత్మఁగంది, తన సదా
చార క్రమంబు, ధర్మము,
నారసి, యచ్చటన నిలిచి, యాదరమెసఁగన్. ౧౫౦౧

వ॥ ఆర్యవర్గ గ్రామాధికారులన్ జూచి, సేయెత్తి, యమ్మాలల దిక్కు-సూపి, మనలన్ జూచి యడవిఁ దిరుగు లేళ్లన్ బోలె భీతిఁగలంగి, సాలదూరంబునకుఁ దొలంగిన్ బారి, నిలిచి సూచుచున్నవా, రల్లదె యయ్యనాథు లెవ్వరు ? వా రట్లేలఁ బఱువున బారి కలంగుచున్న వారు ? వారల మనలన్ జేర నేర్పునన్ బిలువుం డనుటయు, వార లమ్మహాత్మని కిట్లనిరి. ౧౫౦౨

తే॥ వాండ్ర యిమ్మాలపల్లియవాండ్రు ; వాండ్ర
నంటరా ; దట్లుఁగావున నంతదూర
మునకు సత్వరము తొలంగి, సనిరి ; తొలఁగ
కుండరా దెన్నియున్ బాధ లొదవునైన. ౧౫౦౩

వ॥ వాండ్ర తెఱం గిట్టిది ; మఱి దేవరవారి యాజ్ఞ యెట్లట్ల సేయువారల ; మనవుడు నా సదాచారఘనుండు వారల కిట్లనియె.

తే॥ వాండ్ర చందంబువింటి మీావలన, సాల
నద్భుతంబయ్యె ; వారేల నంటరాని

వారయిరి ? మానవుల కారెవారు ? నరుల
వైర యేనియు నట్లన నగునె మనకు ? ౧౫౦౫

వ॥ చెప్పుఁడనుటయు, వా రెద్దియున్ దోఁపక తడవడుచు, నిక్లేలంటి ! మిమ్మహాత్ముని కెవరిసెప్పువారలమే ? యని కలంగుచు, వినయంబుమెయి నిట్లు విన్నవించికొనిరి. ౧౫౦౬

తే॥ ఏ మెఱుంగము వాండ్రేల నిట్టు లంట
రానివాండ్రయిరో యది ? కాని మా పు
రోహితుఁడు మిత్రశర్మ యెఱుంగు ; నతఁడ
వెరవుమై దేవరకు విన్నవించువాఁడు. ౧౫౦౭

క॥ అనుటయుఁ జిఱునగ వొప్పఁగ
ననియెఁ వారలకు నమ్మహాత్ముఁడు మీ రి
ట్లనుట విచిత్రము ; మైనను
వినియెద మఱి మిత్రశర్మ వినిపింపఁ దగన్. ౧౫౦౮

వ॥ అతం డిప్పు డిచ్చట లేఁడుకాఁడే ? కావున మనము స్నానంబుచేసి, యూరుసేరి, యవకాశంబు జూచికొని, యతనితో నివ్విషయంబున మాటలాడుదముగాక ! మఱి మీరు సెప్పిన యమ్మాలవారును మనతోఁ గలిసి స్నానంబుసేయన్ గోరుదు, వారల చందంబునకు సాల జాలి యగుచున్నది ; మీ రేమందు ? రనుండనుటయు, వారలొండొరులమొగంబులు సూచికొనుచు, నొండొడ నోడి, దేవర చిత్తం బెట్లట్ల సేయువారలమని వినయంబున విన్నవించి, యయ్యనాథులన్ బిలుచుటయు, వార లిక్లేలఁ బిలుతు ? రేమిమూడు నొకో ? యని బెదరుచు, రాకతప్పమి మోముల దైన్యంబుదోఁప, భయంబునన్ జేసి•కన్నుల తెప్పలువడక, వడఁకుచుఁ బులులన్ జేర వచ్చు లేళ్ల తెఱంగునె వచ్చుటయు, నద్దీనబాంధవుం డెల్లవారు నచ్చెరువుమై సూడ వారి నుద్దేశించి, యత్యాదరంబుమై నిట్లనియె.

తే॥ రండు ! మీ కేఁటిభయము ? మీరలును నరుల
కారె ? మీరెల్ల మమ్ములఁ గలిసి, జలము
లాడఁగోరుదు ; నేమియు ననరు వీరు ;
వీరలకు నచ్చఁజెప్పితి ; విసిరిపేర్మి. ౧౫౧౦

సీ॥ అనుటయు వారలత్యానందమును విస్మయమంబును బొంప, భయంబు
నకును, । దైన్యంబున కొంకింత తప్పి, సేరన్ వచ్చియును దొంటి తమ
చందమునక మఱల । సార, నార్యవర్గంబు సూచి, నెమ్మదివుట్టఁ
బలుకుచుఁ, దగ నంటె, బల్మిఁ దన్నుఁ । గలిపి కొనుటయు, వేడ్క
మెయి వారలుఁ బొంగి, "కో" యని యఱచుచుఁ గూడినడువఁ
దొడఁగి ; రి ట్లెల్లవారలతోడ నమ్మ
హాపురుషసత్తముండు, దయాసముద్రుఁ
డరిగె నూఁగి చెఱువు సేర ; నతని యవ్వి
ధమున కాప్రజలెల్ల జిత్రంబ యనిరి. ౧౫౧౧

సూర్యోదయాది వర్ణనము.

సీ॥ అణ్వాది నానావిధానంతకోటిచేతనసముదాయ చైతన్యదాయి,
ప్రకట భూగోళక ప్రముఖ భ్రమ ద్గ్రహస్తోమసమాకర్ష సూత్రధారి,
సకల పదార్థపుంజ విచిత్రబహు విధాంచ ద్విశంకట వర్ణసాగరుండు,
సత్పుణ్యవాసనా సంయుత దేవతాగణ భువనభవదఖండమూర్తి,
సర్వలోకతమో వినిస్సరణపటు స
హస్రకరుఁడు, పవిత్రాత్ముఁ, డప్రమేయ
దీప్తిరాశి, యినుఁడు, తూర్పుదిక్కునందు
సూర్యనారాయణుఁడు పొడ సూపె, నంత. ౧౫౧౨

వ॥ తదనంతరంబ. ౧౫౧౩

సీ॥ నుతహరిద్రాభ వినూతనవర్ణప్రశస్తపక్వకలమ సస్యములయు,
శశ్వదాసన్న ప్రసవసమయస్ఫురజ్జాలకోజ్జ్వలపనస తరువులయు,
స్ఫురమాణకోరక పుష్పగుచ్ఛవితానవిలసిత పున్నాగవృక్షములయు,
ఫలశలాటూత్కర భాసురశాఖోపశాఖాఢ్యజంబీరసాలములయు,
సారసారభగ్రహణ ప్రశస్తగతివి
శాలమై; హిమకణకోటి సంగబంధు
రతరమై, లోకసౌఖ్యకరంబునై, యె
సంగి, వీవన్ దొడఁగె మంచి సల్లగాలి. ౧౫౧౪

తే॥ అల్ల నిల్లన వీచెడి సల్లగాలి
తాఁకున నెసంగి, యొండొరుల్ దఱుముకొన, సె
లంగు చాడ్పున సామాన్యభంగవితతు
లా తటాకము నెల్లెడలందుఁ బొలచె. ౧౫౧౫

తే॥ రాత్రి నెల్ల జలక్రీడ రహి సెలంగ
నుంటఁ జేసి, వినువుపుట్టి, పుట్టి, యొయ్యనొయ్య
నొడ్డు సేరి, యచటనుండ నోడి, తత్త
టాకగర్భంబునన్ గమరంబు నిలిచె. ౧౫౧౬

తే॥ ఒడ్డుఁ జేరి, కదలక, యొండొరుల సంటి
కొని, నభంబునకుఁ దమ చూడ్కులు నిగుడ, న
నేకముఖములుగాఁ బొల్చి, నీరు తోఁపు
లందుఁ గ్రమ్మ మఁడూకఁబు లట్లయుండె. ౧౫౧౭

సీ॥ చక్రవాకంబులు జలవిహారప్రౌఢిఁ జుట్టువారుచుఁ బేర్మిఁ జూపుచుండె,
లకుముకుపిట్టలల్లననీటిపైఁ దేలియాడుమీలఁగొనుచు నరుగుచుండెఁ,
"సీ" అని యఱచుచు, నీటికోళ్లొండొంటిఁ బొడుచుచుఁ దన్నుచుఁ
బోరుచుండె, । నీటికాకులుఁ "గి" ఇని యఱచుచున్, బెక్కు
తావుల కెగయుచుఁ, దలఁగుచుండె,

నచలనిష్ఠఁ దవిలి, కొంగ లట్టె నిల్చి
యుండె, నొండొరు నంటక యొక్కఁ డొకఁడు
నా చెఱువునందుఁ; జేప లందంద యెగసి
పడుచు, నులుకుచు, నురియుచుఁ, బారుచుండె. ౧౫౧౮

వ॥ మఱియు.

తే॥ ఆ చెఱువుగట్టు మీఁదఁ బెంపలరు వివిధ
వృక్షపంక్తుల నివసించు విహగకులము
పాడునదియు, నెగసి మింటఁ బారునదియు,
నిలుచు నదియు నగుచు, సాలఁ బొలచి యుండె. ౧౫౧౯

తే॥ సారఝుంకార గాన ప్రశస్తచంచ
రీకములు పై ముసరుటకోర్చికొనుచు, దృఢ
నిష్ఠఁ దవిలినయదివోలె నిలిచియుండెఁ
గమలకర్ణికావేదిపైఁ గప్పపిల్ల. ౧౫౨౦

సీ॥ ఆయదుస్వామిదేహచ్ఛాయ కెనవచ్చి, యుప్పారుచారునీలోత్పలములు
నా ప్రాభవఖని దీర్ఘాక్షుల కీడులై, పొలచిన నవసితాంభోరుహములు
నమ్మహాపూరుషు హస్తపాదరుచులకున్ సాటిగానైన కోకనదము,
లాజగద్గురు ప్రథితామల సత్కీర్తిగరిమ నుద్ఘాటించు కైరవములు,
నా ఘనుని దివ్యగుణసౌరభాతిశయము
గరముఁ బురుడించు సౌగంధికములుఁ, జూడ
నయ్యెన ప్డాతటాకంబునందు భృంగ
కులము నకు విందులై, సాలకొమరు మిగిలి. ౧౫౨౧

సీ॥ జలవిహంగవితానకిలకిలారావముల్ ప్రచురనానావిధవచనములు గఁ,
గుముదసౌగంధికకువలయపద్మకోకనదాదు లవి యలంకారములుగ,
నింద్రనీలచ్ఛాయ నెసఁగు జలంబులొప్పారు మనోజ్ఞ నీలాంబరముగ,
విలసిత బహువిధ జలచరోత్కరము లుదంచిత దీప్తాఖిలాంగకములుఁ

గాఁ దటాకలక్ష్మీదేవి కరము రమ్య
వేషగౌరవమున సర్వవేది, కిమ్మ
హాత్మునకు నింపువుట్టించె; నప్డు కౌతు
కోన్నతి రహించిరట్టె నయ్యూరి ప్రజలు. ౧౫.౨౩

వ॥ అనంతరంబ.

## శ్రీకృష్ణస్వామి స్నానాభివర్ణనము.

ఉ॥ స్నానము సేయువేడ్క యదుసత్తముఁ డత్తటి నీటసొచ్చె; న
బ్జానుతునాజ్ఞ నెల్లరును భోరునసొచ్చిరి తోన; సొచ్చి, యెం
తేనియు లీలమున్గుచు, నొకించుకసేపున కట్టె తేలుచున్;
మానుగ జల్లుఁ బోరునకు మార్కొనుచున్ విలసిల్లి రా ప్రజల్.

తే॥ ఆర్యవర్గంబువారు, గ్రామాధిపతియుఁ,
గరణమును, నమ్మహాత్ము, లోకగురు నుపచ
రింపఁగోరి, తదాజ్ఞకై యెలమి వేచి
యుండ, నవ్విధమెఱిఁగి యయ్యోగఘనుఁడు. ౧౫.౨౪

క॥ మీ యిచ్ఛకైన భంగిన్
సేయుండన, నిమ్మహాత్ము చిత్తము మన కి
ట్లాయె నని పొంగుచున్ వా
రాయతసద్భక్తియున్, భయము గదురంగన్. ౧౫.౨౫

వ॥ పాత్రంబులతో జలాభిషేకంబుసేసియుఁ, జరణంబులంటితోమియుఁ, దడి యొత్తియు, నతండు మున్గుచుఁ దేలుచు గ్రీడింపఁ గరావలంబనాదుల నలరించియు, నింక ననేకవిధంబుల సేవింపుచుండ, వారిన్ జూచి యెల్లవారు నేన నేనయనుచు నొక్కమొగిఁ జుట్టుసేరి, యప్పనులు వారును సేయన్ జేయఁ, గొంతసే పట్టెయుండి, యప్పరమార్థ

వేది, యజ్ఞనంబుల ననువుమెయిఁ దప్పించుకొనువాఁడై కొందఱన్
బుడికియుఁ, గొందఱు వీపులఁదట్టియుఁ, గొందఱు మెల్లనఁ ద్రోసియు,
జలంబులనుండి నిర్గమించి, యొడ్డుసేరెఁ, జేరుటయు. ౧౫౨౬

క॥ కొందఱు తడి నొత్తిరి, మఱి
కొందఱుఁ గడిగిరిపదములుఁ గుతుకము నత్యా
నందమును బొదల, వేఱొక
కొందఱు లేయెండ నడ్డఁగూడిరి గుములై. ౧౫౨౭

సీ॥ కృతవర్మ గదసాత్యకి ప్రభృతి మహారథులకు వెరవుఁగూర్పు
నలఘువీర్యుఁ, । డక్రూర శూరసేనాదిమహారాజ నీతిజ్ఞులకు బుద్ధి
నేర్పు ఘనుఁడు, । నుద్ధవకంకాది యోగవేదులు తన్ను భక్తిసే
యఁగఁ బొల్చు పరమయోగి, । వసుదేవదేవశ్రవః ప్రముఖార్య
వర్గమునకు ధర్మమార్గంబుసూపు
చతురుఁ, డప్పరమాత్ముఁ, డాసర్వవేది
యాప్రజలు తన్ను ననవుమై నట్లువలుక
నంట, నుట్టునుజేర, నొండనక వారి
లోనఁ దానొక్కఁడై పొల్చె, భూనుతుండు. ౧౫౨౮

వ॥ ఇవ్విధంబున.

ఉ॥ మానసికప్రపంచమున మాన్యవిమర్శపు దృష్టిఁ గాంతు రె
వ్వాని గుణస్వరూపము ధ్రువంబుగ నిప్పటియోగు ? లా మహా
జ్ఞాని, మహానుభావు, యదుసత్తము, నాప్రజ లట్లుసేరి స
న్మానముసేయనైరి పలుమాఱులు ; వారల భాగ్య మేమనన్ ?

సీ॥ దరహాసచంద్రికా భరితము ఖేందుమండలవిలాసము పెంపు గలుగు
వాఁడు, శృంగగరుత్పరి స్ఫీతవినీలకాంత శ్మశ్రుపటలంబు దనరు

వాఁడు, । నాయతకృష్ణపక్షాష్టమీచంద్రరేఖంబోలు ఫాలతలంబు వాఁడు, । మాణిక్యకుండలమండితశ్రీకారసమలసత్కర్ణపుటముల వాఁడు,

నింద్రనీల సదృశసాంద్రమేచకరుచి
రమ్యమృదులకచభరంబువాఁడు,
మాననీయచల దమానుపదివ్యప్ర
భావిశేషభంగిఁ బరగువాఁడు. ౧౫౩౦

వ॥ ఐన నమ్మహానుభావుం డా ప్రజలఁ జూచి, మనమిచ్చోఁ దడయరా, దూరఁ జాల పనిగలదు, పోదముగాక యని దారుకుం డర్పించిన విమల దుకూలద్వయంబు నందికొని, యందొకటిఁ బరిధానంబుగ నింకొకండు నుత్తరీయంబుగను ధరించి, యూరిమార్గంబువట్టి, యెల్ల రకు ముందఱ మెల్లన నడిచివచ్చుచుండె, నా ప్రజలందఱుఁ దత్పవిత్ర పదముద్రితంబైన జాడకు నమస్కరింపుచుఁ, దోలంగి నడచుచుండి; రంతకుమున్న యయ్యూరి యాఁడువారెల్ల శౌచంబలవరించికొని, ఫలపుష్పాదులు పళ్లెరంబుల నమర్చి, యయ్యోగాచార్యు నర్చించువారై, యార్యకార్యాలయంబునొద్ద మఱ్ఱిక్రింద వేచియుండిరి ; వారి యాచందం బెఱింగి, మాలపల్లెన్ గల యాంధ్రం దఱుఁ దమలో నిట్లనుకొనఁజొచ్చి, రం దొక్కతె తక్కినవారి కిట్లనియె.

తే॥ ఎవ్వరొకొ యమ్మహాప్రభు ? యెల్లవారొ
కండుఁ దప్పక మనయూరు కదలి, వారి
ననుసరించి సనిరి జలమాడ ; నింక
వత్తు రొక్క గడియలోన వారలెల్ల. ౧౫౩౨

క॥ ఊరఁగల యమ్మలు సదా
చారంబఁట ! యేమొ ? యెఱుఁగఁ జాల ; మెఱమి సిం
గారించికొని ముదంబున
నేరిరి కట్టియుఁ, దొడిగియుఁ జెచ్చెర మఱ్ఱిన్. ౧౫౩౩

తే॥ వత్తురా ప్రభు లియ్యూరి వారితోడ
నిష్ఠ యీత్రోవ; మఱి మనమెల్ల నతని
నెలమి నీ మఱ్ఱిక్రిందఁ బూజింత మడ్డు
నిలిచి, మన మగవాండ్రు దీనిఁ గొనియాడ ౧౫౮౫

వ॥ ఇది నా యాలోచించిన తెఱంగు, మీరును నా బుద్ధి వట్టుదురని తలంచెద ; నంతగొప్ప ప్రభువు మనపూజలఁ గైకొనని మొఱకుఁదనంబు వహింపఁ డనుకొనుండు ; మఱి యంతవాఁడు కోపంబు సేసినను మనకు మేల కాక యింకేమగు ? నెల్లభంగుల సాహసంబు మేలు ; నేఁటితో మన యఁటరాని తనంబు పోయి, మనమును సాటికిసాటి యూరిలోని పెద్ద జాతి పెద్దమ్మలతో గలిసి మెలిసి, మాటలాడనగుట న య్యయ్యవా రియ్యూరనుండు నప్పుడ జరుగ వలయు, నతండ కాక మనల నంటనిచ్చు పుణ్యాత్ము లియ్యూరన్ గలరే? వారితో మన కేటితగ ? విప్పుడ లెండు ! జలంబులాడి, మనకుఁ బరమాత్ముం డందసేసిన పువ్వు లాకులుఁ గొని, వారి కెదిరినిలిచి, బలిమి సూపి, చనవుసేసి, పాదంబు లంటి పూజింత, మనుటయు నాయమ పల్కుల కలగి, కూర్చికొని, యమ్మాలెత లందఱుఁ జెచ్చెర జలంబులాడి, కట్టికొన్న జీర్ణమలినవస్త్రంబులన సక్క నీటన్ బులిమి పులిమి, మఱి యొండు పుట్టంబులు లేమి నా తడికోకలన గట్టికొని, తమ పల్లె చేరువనున్న గన్నేరుపూవులును, మారేడు దళంబులను సంగ్రహించికొని, పల్లెరంబులు లేమిన్ జేసి. ౧౫౮౬

తే॥ చేటలన్, జల్లెడల, మఱి సిబ్బెల నవి
సక్క నిడి, మఱ్ఱిచేరువ సరణిఁ గుంపుఁ
గట్టి నిలిచిరి వా రాసకల జగచ్ఛ
రణ్యుఁ బరమపవిత్రాత్ము రాకఁ గోరి. ౧౫౮౭

వ॥ ఇట్లిమ్మాలెత లమ్మెయి దీక్షవట్టియుండు నంతలోన. ౧౫౪౮

సీ॥ ఇమ్మహాత్ముల వెన్క నిమ్మెయి నడువఁగా నాయెనే మనకని యలరు
వారు, మనజీవితముల సుదిన మీదినము, యింతకును సాలుఁగద
యనుకొనెడివారు, । పీమహాప్రభు లిట్టు లేలకో సేసిరి ? తలపోయ
రాదని తలఁచువారు, । సీతనిఁబోలువే ల్విజ్జగంబునఁ గలం డన
రాదు పోయని యరయువారు,
నగుచుఁ, దనవెంట నా ప్రజ లతికుతూహ
లమ్ము మైఁ జనుదేర నుల్లసదమేయ
బుద్ధిఘనుఁ డాయదుకుల ప్రభుండు వచ్చె
మాలెతలు నిల్చియున్న యమ్మత్రికడకు.

ఆ॥ గీ॥ అమ్మహానుభావు నల్లంతదూరంబు ౧౫౪౯
నందనూచి, వెల్లనగుచు, సంభ్ర
మమును, భయము గదుర, మాలెతల్ సెదరియు,
నిలిచియుండి రట్టె తొలఁగ కపుడు. ౧౫౫౦

తే॥ వారి యాచంద మెఱిఁగి సర్వజ్ఞుఁ, డాద
యానముద్రుండు, చిఱునగ వాననము న
లంకరింపఁగఁ "బొండు—తొలంగుఁ" డనక
నిలిచె నవ్వటవృక్షంబు నీడవట్టి. ౧౫౫౧

వ॥ ఇట్లద్దీనబాంధవుండు కంచెవెట్టిన తెఱంగున మార్గంబున కడ్డునిలి
చియు, ధైర్యంబుసాలక, వెల నగుచుఁ, దారు మున్నుతలంచినట్లు
చనవుసూపి, పాదంబులంటి, పూజసేయనోడి, యట్టె బొమ్మలచం
దంబునఁ జేష్టలుదక్కియున్న యయ్యనాథల, నయ్యస్పృశ్యల,
నయ్యెఱుకసాలని మొఱకుచేడియలన్ జూచి, సాల దయఁ దలంచి,
నిలిచె ; నిలచుటయున్ జూచి, యతిసంభ్రమంబున బఱతెంచి.

తే॥ ఆర్యవర్గంబువారు, గ్రామాధికారి
యున్, గరణమును, దమతమ యుత్తరీయ
ముల నొకటఁజేర్చి, యాసనమున్ ఘటించి
రాజగద్గురుమూర్తికి నచట భక్తి. ౧౫౫౩

తే॥ దానిపైఁ గూరుచుండె నుదారకాంతి
రాశి యయ్యదువర్యుఁ; డా ప్రజలు నతని
యాజ్ఞఁ గూర్చుండి రచట నల్లంతదూర
మందు; సమ్మానితలునుండి రట్టె యట్లు. ౧౫౫౪

వ॥ అనంతరంబ యప్పరమకార్యచాతుర్యధుర్యుండు మనపురోహితు
నతిసత్వరంబున నిక్కడకు రప్పింపుఁ డతనితో నొకింతమాటలాడనై
యున్న, దని యార్యవర్గంబువారితోఁ జెప్పుటయు, వారు మహా
ప్రసాదంబని యాక్షణంబ యవ్వార్తసెప్పి, యప్పరమద్విజుఁ
డొడ్డనిరాఁ గొందఱఁ బంచుటయు, వారుసని. ౧౫౫౫

తే॥ ఆ పరమబుద్ధిశాలికి నత్తెఱంగుఁ
బూసగ్రుచ్చినభంగి సెప్పుటయు, నాతఁ
డెంతయున్ సంతసంబుమై నేఁగుదెంచె
నాఘనుండున్న యచ్చోటి కతిరయమున. ౧౫౫౬

వ॥ ఇట్లతండువచ్చి, నమస్కరించి, యతిభక్తిఁజేసి నిలచుటయు.

తే॥ రండురండని యత్యాదరంబు దోఁప
నయ్యదువిభుండు తనచెంత నతనిఁ గూరు
చుండ వెట్టికొని, పరమయుక్తియున్, బ్రి
యంబు, మెఱయఁ బదంపడి యానియెనిట్లు. ౧౫౫౭

శ్రీకృష్ణస్వామి మిత్రశర్మతో మాలవల్లెయొద్ద సంభాషించుట.

తే॥ ఇష్టమృష్టాన్నరాశుల నెల్లప్రజలఁ
దర్పణము సేతకై పనిఁ దవిలియున్న
మిమ్ముఁ బిలిపింపనాయె, నేమిఁటికిఁగాని
యొక్క చిన్నతగవు బుట్టె సక్కనిట్లు.    ౧౫౫౯

వ॥ అది యెట్లనిన వినుం డేనును నీప్రజలును, స్నానంబునకై చను చుండ, మమ్ముఁ జూచి, పులులన్‌గన్న లేళ్ళతెఱంగున భీతిఁ గలంగి, దూరంబునకుఁ బాఱి, యొక్కెడనిలిచి, మీ యన్నిపను లకై మీచేత తర్జనభర్జనంబులన్ బడుచు, నెట్టి యీసును రోసం బును వహింపక, పరమ సాధువృత్తి మెలంగు నీయంటరానిమాని సులు వెల్లనై యపరాధులట్ల తడబడుచుంటఁ జూచి, మనంబు మెత్తపడ, నియ్యార్యవర్గంబువా రాదిఁగాఁగల పెద్దలతో వారల్లెల వెఱపుమైఁ బాఱి యొక్కెడ నిలిచి, మనలన్ జూచుచున్నవార నియు, వారెవ్వ? రేఁటితెఱంగువారనియు నడిగితి; నే నట్లడుగు టకుఁ దగు కారణం బెఱింగియు, వీ రెఱుంగనివారుపోలె నటించి, వాండ్రు మాలలనియు, నంటరానివాండ్రనియు నింకేమేనియు సెప్పిరి; పదంపడి వారి యంటరానితనంబునకుఁ గారణంబేమియని యేను ప్రశ్నించితి; దానికి వీరు మాకేమియుఁ దెలియరాదనియు మా పురోహితులు సెప్పనగుదురనియు నుత్తరంబిచ్చి, మా కిష్టం బగునట్లు సేయుండని; రాపయి వీరిమాటవట్టి, మీ ప్రాజ్ఞతన్ గూర్చి విమర్శించి, చనవుసూపనగుట దోఁచుటయు, నియ్యనాథుల మాతో నంటఁగలిపికొని, స్నానంబుచేసి వచ్చుచుండ, బేలలగు నిమ్మాలెత లతిభక్తిమై నన్నుఁ బూజించువారై, మార్గంబు నిరోధించి యదె యట్లున్నవారు, వీరి చందంబుజూడ నాకు సాల జాలియగుచున్నది;

కావున నిమ్మెయి నిచ్చో నిలిచి మీకు వార్త నంపితి, మీరు సమ
యంబునకు వచ్చితిరి ; వెండియు. ౧౫౬౦

తే॥ ఈర లార్యుల ; రాస కొక్కింతయేని
మనసు నీయక, ధృతిఁ బొల్చుఘనుల ; రేమి
సెప్పనగుఁ గోట్లకు విలువసేయు నిధిన
యొల్లని మహాత్ములరు, పండితోత్తములరు. ౧౫౬౧

క॥ పౌరోహిత్యము సార్థక
మై రూఢిఁ దలిర్పఁ బొలచు నత్యంతసదా
చారవిశిష్టుల, రమలవి
చారనిధుల, రఖిలవేదశాస్త్రజ్ఞులరుం. ౧౫౬౨

క॥ మీరలు షట్కర్మరతుల ;
రారయ బ్రాహ్మదశ నెప్పు డతినిష్ఠన్ బెం
పారు తపోధనులరు, మీ
పేరును సార్థకమ జగము పేర్కొనఁ గడుం. ౧౫౬౩

తే॥ ఇట్టి మీరలు సెప్పవా ; రీప్రజలును
నేను, నిమ్మానిసులఁ బ్రాపులేని జడుల
యంటరాని తనముఁ గూర్చి యాలకించు
వారలము మీ నుడుల వేదవాక్యములుగ. ౧౫౬౪

తే॥ వాదనై పుణ్య మెప్పుడుఁగాదు ; బుద్ధి
బలము కొలఁది నెసంగుచుఁ బరగు చుండుఁ
గాని యది పారమున్ ముట్టఁ గాంచ నోప ;
దనఘ ! సత్యమ యూఁతకో లంతవట్టు. ౧౫౬౫

తే॥ వేదముల, శాస్త్రములఁ, బురాణాదులం, దొ
కింత నాకుఁ జొరవకల ; దెఱుఁగఁ జాలు

దింత లంతలు ధర్మంబు ; లింక నెఱుఁగ
వలసి యున్నది మిముఁ బోలువారి నడిగి.    ౧౫౬౬

వ॥ అనుడు నతం డదరిపడి, యతివినయంబును, నయంబును గదుర లేచి, నిలిచి, ప్రాంజలియై, దేవరవారి కిట్లానతిచ్చుట యుచితంబు గా దని విన్నవించికొన సాహసించెద ; సర్వజ్ఞులరైన మీ వాక్యంబ వేదవాక్యంబుగాక నేమన నెవ్వర ; మేమ కా దియ్యఖిల లోకంబున మీకు సరివచ్చు వారు కలరే ? సకలజగదుద్ధరణధురీణులరగు మీ సన్నిధి వాదింప నాక కా దెవ్వరికి తరం ? బది యట్టు లుండె వాదంబునకు నన్నీయార్యవర్గంబు వారు నియోగించువా రఁటె ? దాని కేమందు ? నంటరాని తనంబు మానవులందు మానవులకుఁ గల దనుటన్ గూర్చి యేను సాలకాలంబునుండియు వగతు, నైనను బ్రజల కోటి యూరకుందు ; నివ్విషయంబు నిర్ణయించి మాకు బుద్ధిసెప్ప మీరసమర్థులరు ; నా పేరుఁ దడివి, దేవరవారి సన్నిధి నీమెయి నన్ను గననోచికొనిన వానిన్ జేసిన మా ప్రజలకుఁ గృతజ్ఞుండ, వెండియు.    ౧౫౬౭

తే॥ ధర్మసంస్థాపనార్థమ తగఁ జరించు
నీరకాక ప్రజలనుద్ధరించు వారు
కలరె ? మీ పల్కు వేదవాక్యంబ కాక
యేల నొండగు ? మాపలు కేఁటి పలుకు ?    ౧౫౬౮

తే॥ అనుడు ముసిముసి నవ్వుచు, నితని నేయి
పట్టి, తివిచి, సమాదరం బుట్టిపడఁగ
నెలమిఁ గూర్చుండఁబెట్టి, యట్లేల నంటి ?
రనుచు నాథునుఁ డతని కిట్లనియె మఱియు.    ౧౫౬౯

క॥ మాట మెలుకువ యది కడున్
డేటపడఁగ నిట్లు పల్కితిరి ; మే లది ; మీ

బోఁటి బుధులు వాదమునకుఁ
జో టీయరు, శుష్కవాక్యశూరులుఁ గామిఁ. ౧౫౨౦

వ॥ మీకు శుష్కవాదంబునకు పొఱరు కావున నా వాక్యంబ ప్రమా
ణం బగు ; నైనను మీకు నిర్బంధంబు వలవదు ; నా చెప్పినయది
మీకు నచ్చదేని మోమోడక వాదింపుఁడు ! సత్యంబు దాచి
పుచ్చుట కానిపని ; నా యీపల్కు మీకు సమ్మతంబకాదే యను
టయు, నవ్విప్రోత్తముం డాదిగా నెల్లవారు మేలు మే లని ; రనంత
రంబ యమ్మహానుభావుం డతిమృదుమధుర వచన రచన యెసంగ
నిట్లుపన్యసింపన్ దొడంగె. ౧౫౨౧

శ్రీకృష్ణభగవానుం డస్పృశ్యతన్ గూర్చి యుపన్యసించుట.

తే॥ వేదములయందు, మఱియు శాస్త్రాదులందు,
నంటరానితనము సెప్పు నట్టి గాథ
లెందు విస్పష్టముగ సూడ ; మేఁటి గాథ
లనుచు వానిని జొన్పింతు రందు ఋషులు ? ౧౫౨౨

వ॥ కొన్ని పురాణంబులందును శాస్త్రంబులందును మాలలన్ గూర్చి
కొన్నిగాథలు కలవు ; కాని యగ్గాథ లస్పృశ్యతన్ బోధించునవి
యని నిశ్చయింపన్ గాదు ; మఱియు నవి కొన్ని యర్థంబులను
సూచింపుచు నక్కాలంబునన యనుష్ఠేయంబులై యుండెఁ ; గాని
పరిణామక్రమంబు నిరోధింప ; వింతియ కాక సమస్తవృత్తివిధిజ్ఞు
లైన మన్వాదులమతంబున వర్ణంబులు నాలుగ వాచ్యంబు, లిట్లు.

తే॥ మాన్యులగు నమ్మహర్షుల మతమునందు
సకలమానవకోటి వృక్షమున కెల్ల
నాల్గు వర్ణంబు లన నవి నాల్గు కొమ్మ ;
లేనవది యెందునేనియుఁ గానవడదు. ౧౫౨౪

వ॥ పంచమ వర్ణం బెందేనిఁ గానవచునేని నది కల్పితం బ యని యెఱుంగునది, వెండియు. ౧౫౭౫

తే॥ వర్ణములఁ గూర్చి వివరింప వలసి యుండు
నెంతయేనియు ; మన కిప్పు డేల నంత
గాథ ? వాని తెలుంగు సంగ్రహముఁగా వ
చించితిన్ ; సాలు నమ్మాత్ర మిత్తెఱఁగున. ౧౫౭౬

వ॥ వర్ణంబులు వృత్తి సూచకంబులు గావున.

తే॥ మాలలని సెప్పవడెడు నిమ్మానిసులును
నరయ నా నాల్గు వర్ణంబు లందు నెద్ది
యేని నొకవర్ణమునక ము న్నెన్నఁడేనిఁ
జెంది యుండెడి వారని చెప్పవచ్చు. ౧౫౭౭

తే॥ కాన శాస్త్రంబులం దంటరానిశనము
సెప్పవడదాయె ; నల్లేల సెప్పుదురు మ
హర్షులు, తపోధనులు, సముదంచితపరి
ణామసూత్రక్రమవిదు, లుద్దామమతులు. ౧౫౭౮

వ॥ అట్లగుచో నెన్నియేని యుగంబులనుండి వీరిల్లేల బహిష్కరింప వడి ? రని మీరు రడుగవచ్చు, నదియుఁ జెప్పుదు వినుండు. ౧౫౮౦

తే॥ అంతకున్ జాలి, ప్రజలనిత్యమును బ్రోచు
గోవ యుపమాత ; దానిని గోసి మెసవు
వాండ్ర మాతృహంతకు లనవడెడు పాపు ;
లాది యుగమున జను లంటరైరి వారి. ౧౫౮౧

వ॥ కావున నక్కాలపు బుద్ధిమంతులు గోహంతలఁ బహిష్కరించిరి ; వారిమతంబు సర్వజనవంద్యం బగుటఁ జేసి, యప్పాపులు గ్రామంబులకుఁదప్పి, బాహ్యస్థలంబుల గుడిసెలఁ గట్టికొని నివసించువారై రట్టులయ్యు. ౧౫౮౨

తే॥ వర్ణములు మార్పుఁ గాంచెడివడువు పెక్కు
శాస్త్రములఁ జెప్పవడియె విస్పష్టముగను ;
గాన నప్పాపులును దమ కానిపనులు
మాని ప్రజలకునగు మంచిమతమువట్టి. ౧౫౮౩

వ॥ మఱిల గ్రామంబులు సేరికొన నగుదురను నుదారభావంబు తొంటి ప్రజలకుఁ గలదని స్పష్టమగుచున్నయది ; వినుం డీప్పరమార్థంబు గ్రహింపక, కొందఱు స్వార్థపరు లియ్యనాథులఁ బసరంబులన్ బోలె హింసింపుచున్నవారు ; కాని యాౌదార్యంబుసెల్ల నుద్ధరింపబూని కొనరు, వెండియు. ౧౫౮౪

క॥ పలువెతలకుఁ బాలై, వీ
రలు మానుషమునకుఁ దప్పి, బ్రదుకఁగ నై రి
ట్టుల ; వీరల కెట్టిగతియుఁ
గలుగుట లేదాయె నింతకాలము దనుకన్. ౧౫౮౫

క॥ కలనేని వీరి దుర్దశఁ
దలఁచు కృపాళుండు లేఁడ ; దైవంబును వీ
రలయెడ నిట్టిదయయ్యెన్ ;
గలదే యిమ్మానిసులకు గౌరవమొందున్. ౧౫౮౬

తే॥ మాలలఁట ? యంటరాదఁట ; మానిసులనఁ
గారఁట ? యివేఁటిపల్కు ? లొక్కఁడును సత్య
మునకుఁ జోటిచ్చు నిర్మలాత్ముండు లేఁడ
ప్రజలయందు ? వీ రెక్కడి ప్రజలు నూడ ? ౧౫౮౭

ఉ॥ అంటఁగరానివా రయిరె యక్కట ! మానిసులయ్యు వీర ? లి
ట్లంటకు నాల్కరాద ; ప్రజలం దుచితజ్ఞత యేడ ? వీరు త
మ్మంటిన నేమికీడగు ? నహంకృతి వారల కట్లు సెల్లుఁ గా !
కంటన నేడ యెల్లపనులందును వారిక వీరలై తగన్ ? ౧౫౮౮

సీ॥ కడుపుమంటన్ బలుకానితిండ్లన్ దిను కుక్కలఁదగ నంటికొం డ్రుగాదె?
విట్చరంబులు నాఁగ వెలయుచుఁ గడుగోతకునగు పందుల నంటి
కొం డ్రుగాదె? । పురువులు, నెల్క లెప్పుడును మేఁతఁగ నంటఁ
గ్రోకు పిల్లుల నంటికొం డ్రుగాదె? । మలములఁ, గ్రిమికీటముల,
ధాన్యములఁ దిను కోళ్ళ నింపుగ నంటికొం డ్రుగాదె?
ప్రజలు; వీరలకవి యంటరానివనుట
కాదఁట! తమకు నెల్లయక్కరల కగుచు,
నెలమిఁ దమజాతివారమై యెనఁగు, వీరి
నంటరాదఁట? దీని కేమనఁగవచ్చు? ౧౪౯

తే॥ ప్రజల విజ్ఞానగరిమ యిబ్భంగిఁ బరిణ
మించెనే? మానుషంబన నేడ నింక?
వారు త మ్మొల్లమిన్ వీరు, వీరి నిట్లు
పఱచుటల్ జేసి వారుఁ, బాపమునకైరి. ౧౫౦

ఉ॥ అక్కట! యంటరానితనమన్ బెనుదయ్యము మర్త్యకోటి ని
ట్లుక్కడఁగించుచున్నయది యూరక; మానుషలక్ష్మి కింకఁ బే
రెక్కడ? యిట్టి కానిదశ నెప్పుడు సూచుచు మిన్నకుందురే
యెక్కడిబుద్ధి పండితుల? కెవ్వరు రాజులనంగ? నేమనన్? ౧౫౧

తే॥ తలఁప మానవజాతి యంతయును నొకఁడ
కాక వెక్కులె? వీరి నేకారణమున
నణఁపఁజూతురు మాలవాం డ్రనుచు, నంట
రానివాం డ్రు ననుచు, నెల్లప్రజలుగోసి. ౧౫౨

తే॥ నీతిబాహ్యుండ మాలఁడనిరి మహాత్ము
లందఱుల్ దొల్లి; ప్రజలెల్ల నణఁప, నసద
లైన వీర నీతికి బాహ్యులైరె? ప్రజలు
కారె? వారేలకారు? దుర్గ్రాహ్యమ యది. ౧౫౩

సీ॥ ప్రజల యర్థములను బ్రాణంబులను గొంట పరిపాటియై పొల్చు
ప్రభువుమాలఁ, । దూరున్ మఱిగి, పొలమొల్లక, యెడ్డప్పులక
చేయిసాచు కర్షకుఁడు మాలఁ, । దనయంబు శిష్యుల కాత్మబలంబు
నేర్పనఁ గూర్పలేని గురుండు మాలఁ । దజ్ఞానదుర్దశాహతమై
కలంగు లోకంబునకున్గాని కవియమాలఁ,
డెల్ల లోకంబునకుఁ గీడ యెపుడుఁ దలఁచు
దుర్జనుఁడు మాలఁడు ; తన బ్రదుకున కొరుల
మేలుఁ బొరిపుచ్చు కూళయు మాలఁ ; డింక
నెందఱేని మాలలు కల రెల్ల ప్రజల. ౧౫౯౪

వ॥ లోకంబున కెవ్వనివలనఁ గీడగు వాఁడ మాలండను నార్యోక్తులు పెక్కులు కలవు ; మాలతనం బిట్టిదియై యుండ, లోకంబున కెల్ల విధంబుల నగుచుండు వీరిని మాలలని బహిష్కరింపవచ్చునే ? యది యట్లుండె ; నంటరాని తనంబు నా నది యెద్దియో విచారించుట భావ్యంబు ; వీర లంటరాని వార యగుదురేని వీరివలనఁ బనులు గొనవచ్చునే ? వీ రంటికొనిన ధాన్యంబులును, బండ్లును, గాయ గూరలును నివి యవి యననేల నెల్లవస్తువులు నంటరానివి కావే ? యేమి తలంచి వానిన్గొందు, రింతియకాక. ౧౫౯౫

తే॥ ఎమ్ములు విఱుగఁ గొట్టి, యేమేని నేత
వెట్టఁ, గడు సంతసంబుమై వెడలు వీరి
నించుక దయఁ దలంపరే ? యెంతకఠిన
హృదయులైరి ప్రజలు ? వారి కేఁటి నీతి ? ౧౫౯౬

సీ॥ పొలములఁ బసరముల్బోలె నెల్లపనులు నోపికమైసేయుచుండు వీరిఁ,
దోఁటల నెల్లప్రొద్దులుఁ బలుపాటుల నుస్సురనక యెట్టైనుండు వీరి,
నంటక, దూరంబునంద యేమేనియుఁ దినవెట్ట, మురియుచు దినెడువీరి
నెంత యుప్పించిన నంతియ వేలును, లక్షలుఁ గాఁగఁ దలంచు వీరి,

నకట! యూరక దిట్టుదురయ్యా! సావఁ
గొట్టుదురఁటయ్యా! కాకులకుఁ బలె నార
బైటఁ దినవెట్టుదు రఁటయ్యా? పనులకుఁ దగు
నట్టు లీయరఁటయ్యా! యేమనుట? ప్రజలు. ౧౫౯౮

వ॥ ధర్మంబుఁ దలంపక వీరి నిట్లు పలుగోరంబులకు నగ్గంబుసేసి, కృతఘ్నతా దోషోపహతస్వభావులై ప్రజలును, వారివలనఁ బలువెతలకు నగుచు సంఘబలంబును, బుద్ధిబలంబును సాలక వీరును మానుషంబునకుఁ దప్పిరి; దానన్ జేసి. ౧౫౯౯

చ॥ కఱవులు, నీతిబాధలు, నకాలజరా మరణోద్భవాములున్,
దురితములున్, నిరాశయును, దుర్దశలున్, జగమెల్ల నేచు సం
గరము, లవిద్యతోడి పలుగాధలుఁ, దోఁచుచునున్న; నిప్పుడె
ల్లరహృదయంబులున్ గళవళంబునఁ గందఁగనయ్యె నెల్లెడన్.

తే॥ మానుషోజ్జీవనమునఁ బ్రధానలక్ష
ణంబు శాంతి; సమస్తలోకంబు దాని
యంద తేజంబు గను; నిప్పు డది యదృశ్య
మయ్యె; మోహాంబ తతికిన్నై యాక్రమించె. ౧౬౦౦

వ॥ ఇప్పుడైనను బ్రజలు తెలివిఁదెచ్చికొని, తేటి, తమ యత్యున్నతస్థానంబు నొందుటమేలు; దానికిఁ గరుణయు, శాంతియుఁ బరమసాధనంబులు; లోకంబను మహామందిరంబున మానవు లందఱు నేకకుటుంబవ్యక్తు; లిది పరమ సత్యసంభృత సిద్ధాంతసారంబు; తక్కిన వన్నియు బుద్ధిబలంబును వంచనయు సూచించు యుక్తివాదంబులు; కావున మానవులమై, మానుషంబునకుఁ దప్పిన యియ్యనాథుల నంటినిండు; వెరవుమై వీరి యజ్ఞానంబుఁ బోఁ దోలి, సుజ్ఞానంబుఁ గూర్పుఁడు; మీతోఁ గలిసి మెలిసి తిరుగఁ దమ

కామెనే యను సంతసంబున పీరచిరకాలంబునన బాగునకు
వత్తురు; మానుషంబునఁ గేవలము బాలురమై యున్న వీరిన్
బాధించియేని, బోధించియేని మంచికి దెచ్చుట మిముఁ బోలు
మాన్యులకు ధర్మంబుకాదె? వెండియు. ౧౬౦౧

తే॥ శాస్త్రమునకును, యుక్తికిఁ, జర్చ, కనుభ
వంబునకు నెట్లుఁ గాక, పాపంబునకు ని
రంతరంబును నగు నంట రానితనముఁ
గడకఁ బోఁదోలి, పుణ్యంబు గట్టికొనుఁడు! ౧౬౦౨

క॥ గోవధము వీర లెన్నఁడుఁ
గావింపరు, చౌర్యమునకుఁ గడఁగరు, కల్లున్
ద్రావరు మీరు కలిపికొన,
మీ వారల యగుదురు మఱి మీ రలరంగన్. ౧౬౦౩

వ॥ వర్ణంబులన్ గూర్చియు, నంటరానితనంబున్ గూర్చియు నెంత
యేని సెప్పవలసి యుండియు, నంతకేల యని సంగ్రహంబుగా
నిమాత్రంబు గూర్చి చెప్పితి; నిప్పు డంటరానితనంబుఁ గూర్చి
మీకైనభావంబుల తెఱంగు మోమోడక సెప్పుడు! నావలని
ప్రియంబున నిప్పుడు మేలని, రేపు కాదనుటకూడ; దది మాను
షంబునకుఁ గళంకంబు దెచ్చు; ననుటయుఁ, దెలివిననలరిన మొగంబు
లతో నవ్విప్రోత్తముం డాదిగా నా ప్రజలందఱు మేలు మేలనియు,
నెక్కడి యంటరాని తనంబు? వీరును మాయట్టి మానవుల
యనియు, నింతకాలంబునకుఁ దెలిసికొనన నైతిమనియు, దేవరవారి
శ్రమకు నమస్కరింతుమనియుఁ బెక్కు బాసలాడి; రనంతరంబ
య మ్మహాత్ముం డెల్లవారికి నమస్కారములతెతల సూపించుచు నిట్లనియె.

సీ. కరములందున్ రాగికడియముల్; మెడలందుగురిగింజ లేరిచికూర్చినట్టి
పేరులుఁ, బూసలపేరులు, రిత్తదారములును; ముక్కుల రాగికాడ;

లెస్సఁ జేనియు నూనె నెఱుఁగని తలలు, మాసిన మొంటి చీరలుఁ,
జెలువమునకు దక్క, పల్బస్తులఁ జిక్కినమేనులు, నన్నమునకు
వాచికొన్న తలఁపు,
లకట కడుభీతిమై వెల్లనైనమోము,
లివ్విహీనల కిట్లాయెనే? మనంబు
కరుగదే వీరి చందంబుఁ గాంచ? గంటఁ
బుట్టదేతడి? మఱి పల్క నెట్టులొక్కొ? ౧౬౦౪

వ॥ అనిపల్కి, కటకటన్‌బడి, లేచి, యమ్మాలలయం దెల్లవారికి సద్భావంబగుట నెఱింగినవాఁడు కావునఁ దనతోడనలేచిన యప్పురోహితోత్తముని పాణితలంబువట్టికొని, యార్యవర్గ గ్రామాధికారి కరణంబుల నేరికొని, వార తనవెంటరాఁ దక్కినవారినందఱి నచ్చటన యుండఁబలికి, యాయ్యనాథజనబాంధవుం డయ్యఖిలజగదుద్ధరణదీక్షాఘనుండు మాలపల్లెకు నడచి, యందు వివృతద్వారంబైన యొక్క గుడిసెఁ బ్రవేశించె; నా గుడిసెకు. ౧౬౦౫

## శ్రీకృష్ణస్వామి యార్యవర్గాదులతో మాలపల్లియన్ బ్రవేశించుట.

తే॥ ద్వారమొక్కండ; దానికిఁ దడకయ తలు;
పెన్నఁడో గాలికి సెదిరి, యెండమంచు
గాలివానల సొరనిచ్చు కప్పు; మంటి
గోడ; లొక్కదూలంబును గొమరు మిగులు. ౧౬౦౬

వ॥ దానియందు.

తే॥ తాఁటిచాపయు పఱపుఁగా, దగ్గుచుఁ గడు
మూల్గుచుఁ, దెవులుసోఁకిన ముదుసలి పడి
యుండె నొక్కఁడు; మఱిఁ గడుపెండఁ జిక్కి,
వానికిన్ దోడునై పిల్లికూన యొకఁడు. ౧౬౦౭

తే॥ గ్రుడ్లఁ బొదవుచుఁ బట్టులోఁ గోడిపెట్ట
యొకఁడు నుండె ; దూలంబున కొప్పుమెఱయ
వ్రేలఁగట్టిన యుట్టికి వ్రేగులగుచు
నుండె నంచులుపోయిన కుండలైదు. ౧౬౦౮

క॥ ఒకకుండ నంబలియు, నిం
కొకకుండన్ జావయు, మఱి యొకకుండన్ మా
నిక డారికనూకలు, వే
ఱొకకుండన్ జొన్నపిండియును నుండెఁ దగన్. ౧౬౦౯

తే॥ అన్నిఁటికిఁ గ్రిందిదగుకుండ యందునుండె
బియ్యపుఁ దవుడు ; దానినపేర్చి, నిల్వ
యుంచికొందు, రింకెవ్వియు నొకఁడు నేని
దొరకని తఱి భుజింపఁగాఁ దోపఁజేసి. ౧౬౧౦

వ॥ మఱియు నాగుడిసెయందు. ౧౬౧౧

తే॥ కుంపటియు, మూలఁ జినిగిన గంపయు, నొక
త్రాటికట్టయు, సిబ్బియుఁ, జేటయు, నొక
రోకలియు, గుద్దలియు, రాతిఱోలుఁ, గొడవ
లియును, గత్తియు, నొక జల్లెడయును గలవు. ౧౬౧౨

వ॥ ఇవియుకాక యింక నాగుడిసె మఱియెవ్వియు లేవు ; వీనినెల్ల నమ్మహాత్ముండును, బురోహితుం డాదిగాఁగల తక్కువారు నొకండు నొకండు నేర్చి, యేర్చి సూచిరి, పదంపడి యిట్లుచూచి, తలయూఁచుచు, నాలోకవేది వారితో నాగుడిసె వెడలి, యేమేని సంభాషింపుచు వచ్చి, తొంటియట్ల యమ్మఱ్ఱిక్రిందఁ జేలమయాసనంబు నలంకరించి, గూర్చుండి, తక్కినవారిన్ గూర్చుండవలికి, యెల్లవారును విన నిట్లనియె. ౧౬౧౩

తే॥ ఇయ్యనాథుల బ్రదుకు చొప్పెఱుఁగువారు
కోటి కొక్కరుఁ గలరనఁ గూడదు ప్రజ
లందుఁ; గూటికి గుడ్డకు నక్కట! కట!
యెంత దురటిల్లుదురొ వీర లెండియెండి? ౧౬౧౪

క॥ అని తా నాగుడిసెన్ జూ
చిన వస్తువుల తెఱఁగెల్ల సెప్పెన్; విని, వా
రును జాలిన్ బడిరి, కటా!
యని, రింతకు నెఱుఁగమైతి మని రదియెల్లన్. ౧౬౧౫

వ॥ అనంతరంబ యప్పురుషోత్తముండు. ౧౬౧౬

తే॥ ఎల్లవారల చిత్తంబు లిట్లు కరుగ
నాడి, బొమ్మలచాడ్పున నట్టె నిలిచి
యున్న యమ్మాలెతలఁ జూచి, నన్ను మీర
లెట్లు తలఁచితిరో? సేయుఁడట్ల యనిన. ౧౬౧౭

వ॥ వారును దేఱి, యలరెడు మొగంబులుతో వచ్చి, యమ్మహాత్ముని
దివ్యచరణంబులంటి, పలుమాఱులు మ్రొక్కుచుఁ, బూవులును
బిల్వదళంబులును బెట్టి, పూజించి, కృతార్థులమైతిమ యను పర
మానందంబుతో వెడలి; రిట్లు. ౧౬౧౮

సీ॥ రుక్మిణీదేవినిరుపమయోగాభ్యాసమునకు నెంతయుఁ గూర్చు ఘనుఁడు
యోగి, । సత్యభామాకార్యచాతుర్యము నధికగౌరవంబున మెచ్చు
కార్యవేది, । జాంబవతీబంధు సత్కారమునకు గారవమెలర్పఁ దని
యు రసికవరుఁడు, । లక్షణ సమాగ్ర్యలక్షణంబునకు మర్యాదఘ
టించు పరమవిలాసి,
తలలు, నొడళ్ళులు, నొంటిచీరలును, మాసి,
యేవపుట్టింప, నొకభంగి నెనఁగి, వచ్చి,

యయ్యనాథ, లమ్మాల్తెత లంటి, పూజ
సేయఁ, గైకొనెఁ జాలమచ్చికఁ యెలర్ప. ౧౯౧౯

వ॥ ఇట్లమ్మాల్తెతల పూజలఁ గైకొని, యాదవనూనము ద్రుంపు, దారు కుఁ బంచి, తనరథంబునందు సంగ్రహించిన హేమనిష్కసహ స్రంబు దెప్పించి, పంచియిచ్చి, సాల సత్కారంబుఁజేసి, వారల నచ్చటన యుండఁబలికి, పదంపడి యప్పురోహితసత్తము నుద్దేశించి, యిట్లనియె. ౧౯౨౦

ఆ॥ అవసరంబు భంగి నరసి యీఁగెడు నీవి
దాన మంత్ర బహువిధముల నార్యు;
లవసరంబు గల్గి, యది పొందఁ జాలని
యతఁడు దానపాత్ర మఖిల జగతి. ౧౯౨౧

క॥ కొను వాని, నిచ్చు వాతని,
ననయముఁ బ్రియ మొందఁజేయు నట్టిదియై, యొ
ప్పనవలయు నరయదానం
బనేక విధముల నెసంగు నది లోకమునన్. ౧౯౨౨

వ॥ ఇయ్యర్థంబును విస్తరించి సెప్పుట కిప్పుడు సమయంబు సాలదు, వినుండు. ౧౯౨౩

క॥ మానుషమునకున్ దప్పిన
మానిసు లీ యునదలు; గతిమాలిరి; బ్రదుకున్
గానరు; తినఁ, గట్టన్ లే;
దేనాఁడును సుఖము నెఱుఁగ; రింకేట్లొకో? ౧౯౨౪

తే॥ ఎల్లదానంబులకు నర్హు లిప్డు వీర;
కాన నాబుద్ధిఁ గొనవగు నేని, శక్తి

వంచనకుఁ బాలువడక, కేవలముఁ గరుణఁ
దలఁచి, యేమేని నీకుఁ; దండఱును లెండు! ౧౬౨౫

వ॥ అనుచు నమ్మహాత్ముని యౌదార్యంబున్ గొనియాడుచు, నప్పరమ పురోహితుం డమ్మాలపల్లెన్ గల యెల్లరకుఁ దలకు రెండేసిచొప్పున నూతనవస్త్రంబు లిప్పింప బాస యిచ్చెఁ; బదంపడి యార్యవర్గంబువారు మూఁడునెలలకు సాలు ధాన్యంబు లిప్పింతుమనియు, గ్రామాధికారియున్ గరణంబును వారిన్ దమ యూరన్ జేర్చికొని, గృహోచితస్థలంబులతోన గృహోపకరణంబులు గూర్చి యిత్తు మనియుఁ, దక్కినవారుఁ దమతమ మోపుకోలంది నీయను బాస నిచ్చిరి, వెండియు. ౧౬౨౬

తే॥ ఇంత మర్యాద కై తిమే యిట్టు లనుచు
నెంతయేనియు నమ్మాలలెల్ల సంత
సించి; రీ ప్రభు వలఁగాఁగ నిట్టు లీయ
నోపితిమ యంచు నుబ్బి రయ్యూరి ప్రజలు. ౧౬౨౭

వ॥ ఇట్లెల్లవార లుబ్బునఁ గలకల మను మొగంబులతోఁ దన వెంట రా, నమ్మహాత్ముం డచ్చట నుండి కదలి, దేవార్చన సేయువాఁడై యూరు సొచ్చి, దేవాలయంబున్ దర్శించి, తనరాకకై నిరీక్షింపుచుఁ, గాంచి, యత్యంతభయభక్తిసంభ్రమంబులతో నెదురేగుదెంచి, నమస్కరించిన దేవార్చకుల నమస్కారంబు లందికొనుచు, న ద్దేవాలయంబున్ బ్రవేశించి, యందు వెలుంగుచున్న విష్ణుమూర్తికి నమస్కరించి, యర్చకులును బురోహితుండును ఫలపుష్పాదులు తనకందీయ, భక్తిమెయి నర్పించి, కన్నులు మూసి, మంత్రంబు జపించుచుఁ, గొంతసేపుఁ బుచ్చి, యనంతరంబ లేచి, మఱల నమస్కరించి, దేవప్రసాదంబు స్వీకరించి, వెడలి, యద్దేవాలయాంగణంబునంద కూర్చుండి, యెల్లవారి నద్దేవుని బూజింప

నాజ్ఞవెట్టి, వారందఱు నట్లచేసి రాఁ, గూర్చుండవలికి, వారందఱు
విన, దేవపూజావశ్యకతన్ గూర్చి గంభీరంబుగా నిట్లుపన్యసించె.

శ్రీకృష్ణస్వామి దేవపూజావశ్యకతన్ గూర్చి యుపన్యసించుట.

క॥ వినుఁ డెల్లవారలును దే
వుని వారల ; మఱియు నతఁ డవున్ జగమున కె
ల్ల ; నతఁడ సృజించె నీ జగ
మనంత కోటులగు చేతనాళులతోడన్. ౧౬౨౯

తే॥ ఆకసమునందు నణువులయట్ల కాన
నగుచు, "మిణుకు మిణుకు" మనునట్టి చుక్క
లొక్కఁ డొకఁడు నొక్కొక లోక ; మక్కజంబు
వాని చందంబుఁ గొనియాడ ; వశము గాదు. ౧౬౩౦

తే॥ ఎల్లలోకంబులును దన కిండ్లు గాఁగ
నా పరాత్పరుఁ డున్నవాఁ ; డతని యాజ్ఞ
నవి యెసఁగు చుండు ; మన లోకమట్ల యవియు
బహు చరాచర చేతన భాషితముల. ౧౬౩౧

క॥ పరుఁడు, భగవంతుఁడు, పరా
త్పరుఁడుఁ, బరంధాముఁడు, మఱి ప్రభువు ననఁగ, నీ
శ్వరుఁ డనఁగా న ద్దేవుఁడు
పరగు నొకఁడ పెక్కుపేళ్ల, బహునామములన్. ౧౬౩౨

క॥ ఇనుఁ డున్, జంద్రుఁడుఁ, బావకుఁ,
డనిలుఁడు, సాగరుఁడు, నమ్మహాప్రభు నాజ్ఞన్
మనకున్ మేల్గోడఁ గూర్చుచు
ననారతమ్ము నున్నవార లంచితశక్తిన్. ౧౬౩౩

క॥ సాగరుఁ డాతని యాజ్ఞన
వేగపడఁడు, జగము ముంప వెరలండు, నదీ
వేగమునకుఁ దోలఁగఁడు, మన
బాగు నరయు నెప్పుడుఁ దన బాగునకన్నన్. ౧౬౩౪

క॥ ఆతనివలనన మేఘ
వ్రాతంబులువుట్టుఁ, దఱికి వర్షించున్, నా
నా తృణసస్యతరు కులము
లాతత గతిఁ బుట్టుఁ, బెఱుగ, నావయిఁ బండన్. ౧౬౩౫

క॥ అనిలుండు "జగత్ప్రాణుం"
డను బిరుదము సార్థకముగ నద్దేవుని యా
జ్ఞ నెఱపువాఁడై జగతికి
ననుకూలుండగుచు వీచు నంతటఁ దానై. ౧౬౩౬

క॥ ఈయెడ కాయెడ కాతఁడ
తోయదసంతతుల నెప్డుఁ దోలుచుఁ, గరమ
త్యాయతభంగిన్ గుఱియఁగఁ
జేయున్; వెలగించు నగ్నిఁ జె న్నొందఁ గూడన్. ౧౬౩౭

క॥ అనలుఁడు నద్దేవుని శా
సనమున నెలంగుఁ, గాంతి సమకూర్చున్ జే
తనకోట్లకు; వేండియు నవి
తినఁ, గదలఁగ శక్తినిచ్చు, దీపించుఁ గడున్. ౧౬౩౮

తే॥ యంత్రములకును, వంటల, కగ్ని దేవుఁ
డెప్పుడున్ గతియౌనాట మీకెఱుఁగవచ్చుఁ
గాదె? రేలందు దీపముల్ గ్రాలు బెట్టు
లగు నతఁడ లేఁడయేనిఁ? బాడగుజగంబు. ౧౬౩౯

క॥ మన పితృవర్గము వారే
ల్ల నివాసముసేయఁ బె పలరు లోకము నా
వినుతికినెక్కిన చంద్రుం
డను దేవునియాజ్ఞ నెప్పుడున్ దలఁదాల్చున్. ౧౬౪౦

క॥ సకలతృణసస్యవృక్షుల
తికావితానములకెల్లఁ దేజస్సార
ప్రకటవిభవంబు లాతం
డకాఁడె సేకూర్చువాఁ డొడయఁడై యెప్పుడున్ ? ౧౬౪౧

క॥ పితృకర్మములన్ గవ్యము
లతినిష్ఠఁ గూర్చియిడుదు, మవియన్నియు న
ద్భుతగతిఁగొని యద్దేవత
లితనిక యర్పింతురని వచింతురు పెద్దల్. ౧౬౪౨

క॥ భగవంతుని యాజ్ఞన్ బహు
జగద్భరణధుర్యుఁడనఁ బ్రశస్తిఁగాంచెఁ
దగ సూర్యుఁ; డతఁడ భానుఁడు,
జగతీబాంధవుఁడు, సర్వశక్తియుతుండున్. ౧౬౪3

తే॥ అఖిలచేతనకోటుల కతఁడ జీవ
శక్తి నొడఁగూర్చువాఁడు, విశాలమూర్తి;
యతని యాకర్షణమునన యలరుచుండు
నెప్డు నిబ్భూమిదేవియు నేపుసెలఁగ. ౧౬౪౪

క॥ ప్రాకటతేజోమయగో
ళాకృతిఁ దత్తనువు మెఱయు; నందమరులు సు
శ్లోకులు వసింతు రెప్పుడు;
నాకం బంద్రు మఱి యమ్మహామూర్తి బుధుల్. ౧౬౪౫

తే॥ కాంతిసాగరుఁడన, నంధకారభంజ
నుం డనంగ, జగద్బాంధవుఁడు నాఁగ,
ద్వాదశాత్ముఁడునా, సర్వవర్ణఖని యన
నంగ సద్దేవుఁడు సతం బెసంగువాఁడు. ౧౬౪౬

క॥ ఇప్పు డొకకొంతమాత్రన
జెప్పిన యనిలాదులన్ సృజించెన్ దేవుం
డొప్పెసఁగ; మఱి నిజాజ్ఞన్
దప్పక, లోకమున కగువిధము నేర్పఱచెన్. ౧౬౪౭

క॥ మనకంటికిఁ గనఁబడునవి
యును, గనరానివియును గల వుద్యత్తేజో
ఘనములగు పుణ్యలోకము
లనేకములు; దేవుఁడు కలఁ డయ్యన్నింటన్. ౧౬౪౮

క॥ ఆదేవుని సారమహిమఁ
గాదే మనమెల్ల బ్రదుకఁ గల్గుట? మఱి సౌ
ఖ్యోదయము మన కగుటయున్
మోదం బొడఁగూడుటయును, ముక్తి కగుటయున్. ౧౬౪౯

తే॥ పాపకర్మము లెప్డు నొప్ప? వవి సేయు
వార లిందును నందుఁ గోల్పడుదు రాత్మ
శక్తుల; మఱియు దుఃఖభాజనుల యగుదు;
రీశ్వరుని యాజ్ఞ నెదిరింప నేరితరము? ౧౬౫౦

క॥ ఆదేవుఁడ మన కొసఁగెన్
వేదము; లవి చెప్పు ధర్మవిద్యావిజ్ఞా
నాదుల తెఱంగులు; వివే
కోదయమగు మనకు వానినూఁదినడచుటన్. ౧౬౫౧

క॥ అమలజ్ఞానమునకు ధ
ర్మము మూలము ; ధర్మమునన మనము సకలలో
కములన్ జయింపనోపుదు ;
మమరులు సరిగారు మనకు నా చదురైనన్. ౧౬౫౨

క॥ మనసౌఖ్యము యెల్లగతులఁ
దనసౌఖ్యముఁగాఁ దలంచి, తగ నంతయుఁ గూ
ర్చిన యబ్భగవంతుని శా
సనమున్ జెల్లింపక మనఁజనునే మనకున్. ౧౬౫౩

క॥ మనకున్ గరుణయు, శాంతియు,
ధనంబు ; లారెండు సౌఖ్యదశకున్ గూర్చున్
మనల ; మఱియు నారెంటన
దనరున్ ధర్మంబు దైవతదశాస్పదమై. ౧౬౫౪

క॥ ఈదేవతాలయమునన
కాదు సకలదేవతా నికాయ్యంబులయం
దాదేవుఁడు బహురూపుఁడు
నాఁదని యలరారు సజ్జనములకు గతియై. ౧౬౫౫

తే॥ మానసము దేవునందు నిర్మగ్నమగు వి
ధంబువలయు ; నది సతంబు ధర్మమందుఁ
బేర్మిఁగాంచు నెంతయు మేలు ; ధర్మమంద
పేర్చిన నెల్లశక్తులుఁ బెంపుఁగనుట. ౧౬౫౬

వ॥ మనయందు దయ్యాశ్వరుండు తనశక్తుల నిగూఢంబుగ నిడియున్నవాఁడనియు, వానిన్ విజృంభింపఁ జేయుటకు మన మజ్జగన్నాథునియందరమింపనై యుందు మనియు, దానికి ధర్మం బూఁతకోలనియు, దానికమై మన మెల్లపనుల వర్తింతముగాక యనియు, ధర్మంబొల్లని

నరుం డెందులకుఁ గాక దుఃఖభాజనుండగుననియుఁ, బెక్కువిషయం బులన్ గూర్చి యాగ్రామీణులకు ధర్మంబునందును, భగవంతుని యందును బుద్ధిపుట్ట నయ్యపార బుద్ధిసాగరుం డుపన్యసించె; నిట్లు.

సీ॥ పరమర్షివర్యసంభావ్య భవ్యప్రభావస్ఫూర్తిఁ బొసఁగు వరతపస్వి,
మహనీయయోగసమగ్రతారూఢి యోగాచార్యుఁ డనుపేర నలరు
ఘనుఁడు, । శశ్వదమానుషశక్తిసంపూర్ణావతారలక్షణయుక్తిఁ దనరు దేవు
డాయతలోకకల్యాణ సంఘటన ప్రశస్తి నేపారు దీక్షావిశిష్టుఁ,
డఖిలశాస్త్రపారంగతుఁ డైన ప్రాజ్ఞుఁ,
డమలనిష్ఠ నెసఁగు పరమాత్ముఁ, డవ్వి
ధమున నాయూరి ప్రజల చిత్తములు నచ్చఁ
బలికెఁ; బూజించె నీశ్వర ప్రతిమ భక్తి. ౧౬౫౪

వ॥ తదనంతర మాకృష్ణభగవానుం డాప్రజలందఱు వెంటరాఁ గదలి, తన్నుఁ బూజింప నార్యకార్యాలయంబు నొద్ద వేచియున్న యమ్మల యెడ దయఁ దలంచి, యచ్చోటికిన్ విచ్చేసి, యచ్చటఁ బొలచి యున్న మట్టి క్రిందఁ దాఁటి చాపపైఁ గూర్చుండి, యాప్రజలఁ గూర్చుండఁ బలికె; నంత. ౧౬౫౫

ఊరి యాండ్రు శ్రీకృష్ణస్వామిన్ బూజించుట.

చ॥ స్ఫురదురు దివ్యకాంతి పరిశోభిత భూతినెసంగువాని, భా
స్వర రుచిరత్వరేఖ ననిశంబు రహించెడువాని, నమ్మహా
పురుషు, సమస్తలోక గురుఁ బూజయొనర్చిరి సారభక్తిమైఁ
దరతర మవ్వెలందులు ముదంబున నాప్రజలెల్ల మెచ్చఁగన్.

సీ॥ భయమునబెడఁగుస్ఫూర్తిపట్టకప్రేమయరూపింపఁ గాఁజేయురూపులమరఁ
జిన్నిమొగంబుల చెన్నాటపాటలఁ గరముఁ బొల్చిన మనఃక్రమముఁ
జెప్పఁ, । దమపని తీర, నందఱకు ముందఱఁబోవుపంత మంతకు వేగ

పాటుఁ దెలుపఁ, । దమ్మహాప్రభువుండు పాదము లంటనిచ్చక తమ్ము న
నిబ్బచందంబుఁ జోఁప,
బాలికలు భక్తిమైఁ బూలుఁ, బండ్లు సక్కఁ
బాదము లయొద్ద నిడి, యయ్యపారశాంతి
ధామునకు మ్రొక్కి; రతుల వాత్సల్యమొప్ప
నమ్మహాత్ముండు దీవించి, యనిపె వారి. ౧౬౬౧

సీ॥ భయమును, సిగ్గు, వినయమును జూపులు రూపింపఁజేయుచు రూఢి
నెసఁగఁ, । గాటుక రేఖలఁ గ్రాలు వాల్గన్ను లిందీవరంబుల సొంపుఁ
దెలుపఁ జాల, । గందంపుఁ బూఁత సక్క దలిర్చు చెక్కులు మొగలి
పూరేకులఁ దెగడ నోపఁ, । బిరుదులఁ గప్పుచుఁ బరగు పెన్గొప్పులు
చమరవాలంబుల సౌరుమించ,
నూత్నకాంతికి సాలఁజెన్నునొడఁగూర్చు
నట్టివై కట్టుపుట్టంబు లమర, యువతు
లమ్మహాత్ముని పాదంబు లంటి, మ్రొక్కి,
పూజసేసిరి పండ్లును బూలు వెట్టి. ౧౬౬౨

వ॥ పతులకు నత్తమామలకుఁ బరమ ప్రేమాపాత్రంబులై సత్సంతాన
సౌభాగ్యసౌఖ్యసమృద్ధి బ్రదుకుదురుగాక! యని దీవించి, వారి
నా హృషీకేశుండు వెడలననిచెఁ; బదంపడి. ౧౬౬౩

సీ॥ కుంకుమ తిలకముల్ గొమరొప్ప ఫాలతలములకుఁ గ్రొత్తయంద
మొడఁగూర్పఁ, । బసపుఁ బూఁతన్ సాయఁ బట్టిన మోములఁ బినయ
చిహ్నలు సొంపు విరివిసేయు, । నల్లపూసలపేర్ల నడుమఁ గూర్చినపవ
డంబుల జతలు మెడల రహింప, । నేలిక వారి కేమేమి సమర్పింప
నోపుదు? మను వినయోక్తు లెసఁగ,
నా జగద్గురుపాదంబు లంటి మ్రొక్కి,
యలరులును, బండ్లు, గంధము నర్పణంబు

నేసి రిల్లాం; ద్రతండు విచ్చేయుటఁ దమ
యూరు పావనమయ్యె నా నుబ్బ దోఁప. ౧౬౬౪

వ॥ అతిథి పూజా బంధుమిత్రసమారాధన భృత్యదీనజనాదరభావ సకల కర్మశ్రద్ధాళుతాధర్మచింతాదైవభక్తివిశిష్టతా సంపన్నులై, వృద్ధసేవయుఁ, బతిపుత్రభ్రాతృజన ప్రేమా పాత్రతయు, సౌభాగ్యంబును బాటిసెలంగ మనుదురుగాక! యని దీవించి, యప్పురమ సంసారి వారల నత్యాదరంబు వెడల ననిచెఁ బదంపడి. ౧౬౬౫

సీ॥ వ్రాలినఁదుములు, సోలినమేనులు, వడఁకుఁదలలుఁ, బలువళుల నెసఁగు
మొగములు, దగ్గునబిగుపుఁదప్పినబోసినోళ్లును, దడవడుగాళ్లు, నూఁతకోలలు, బల్మిమై తేలెడిపలుకులు, నెరసినకొప్పులు, మురువుఁ జెడినచూపు, లో మాతంండ్రి! యీ పెద్దకాలపువాండ్రపై శీకృపవరలనీవె?
యనుపలుకు లొప్పఁగా మున శ్లాపరమ ద
యానిముద్రుపపాదంబు లంటి, మ్రొక్కి,
యెలమి రెండేసి మూఁడేసి ఫలములు, విరు,
లర్పణము జేసిరి ప్రమోద మతిశయిల్ల ౧౬౬౬

వ॥ దైవభక్తియుఁ, దాల్మియు, శాంతియు, నీతిబోధనోల్లాసంబును నెసఁగ మనుదురుగాక! యని పల్కి, య ద్దీనబాంధవుండు నమస్కరించి, గౌరవంబుమై వారిన్ వెడల ననిచె, నిట్లు వారందఱు సమర్పించిన ఫలపుష్పంబు లొకపెద్దరాశి యగుడు, దాని నచ్చటఁ గూడిన బాల బాలికలను వృద్ధులకుఁ బంచిపెట్టఁ గొండఱ నియమించి, పాఠశాలన్ దర్శించువాఁడై, లేచి, యా ప్రజల నచ్చటన యుండఁ బలికి, సారథి యొక్కరుండ రా, నార్యకాఠ్యాలయంబున్ బ్రవేశించి, యందుఁ దానంతకు ధరించిన దేవపూజోచిత పరిధానోత్తరీయ దుకూలంబులు విడిచి, తన కింపుపుట్టించు పుట్టంబులఁ దీసికొని, సముచితవేషం బలవరించికొని, వెడలి. ౧౬౬౭

సీ॥ హాస్తీం ద్రహస్తోప మాజానుదీర్ఘ సముజ్జ్వలతర బాహు యుగము
వాఁడు, నవపంకజాతపత్ర విలాసహారి దీర్ఘతరాభిరామనేత్రముల
వాఁడు, । లలితరేఖానముల్లసదురు స్నిగ్ధశంఖము బెడంగు జయించు
గళమువాఁడు, । ధర్మసామ్రాజ్యసంస్థాపనదీక్షార మోజ్జ్వలరుచిఁ
గ్రాలు నుగమువాఁడు,
మానసీయులోకమంగళదివ్యవి
గ్రహమువాఁడుఁ, జలదఖండసార
కాంతిరాశినాఁగఁ గన్పట్టువాఁడు, న
య్యాదు విభుండు నూడనయ్యె నపుడు. ౧౬౬౮

ఆ॥ స్ఫీతమదమయూర పింఛాభిరామంబు,
హైమబిందుకలిత మమ్మహాను
భావు శీర్షమున శిరోవేష్ట మురుకాంతు
లీనుచట్టిదై రహింపుచుండె. ౧౬౬౯

వ॥ మఱియును.

ఆ॥ గీ॥ ఆకృపాళు విగ్రహమునుండి వెడలు కాం
తి ప్రవాహమం దుదీర్ణభంగి
మునిఁగి, సకల కలుషములఁబాసి రయ్యూరి
వారలెల్ల గౌరవంబుపేర్మి. ౧౬౭౦

మ॥ అతులశ్లాఘ్య, ముదార, మాతని యుపన్యాసంబు ధర్మార్థసం
గతమున్, శ్రోత్రమనోహరంబును, నిరాఘాటంబు, సువ్యక్త, మా
యతవర్ణంబు, రసోచితంబు, ననవద్యంబున్, స్ఫురద్భావగ
ర్భితముఁ సారవిమర్శశోభితము, గంభీరంబునై యొప్పెడిన్.

ఉ॥ వాసిగ "ధర్మమెద్ది ?" యనువారికిఁ దానితెఱంగు సెప్ప ను
ల్లాసము పేర్మి నాతఁడు, సలక్షణపద్ధతి పెంపుమై నుప

న్యాస మొసంగునట్టితఱి నైనను వల్కఁడు గర్వము ద్రితా
న్యాసహనోక్తి నించుకయు; నాతని వాగ్మితఁ గూర్చి యేమనన్?

క॥ వీరలు గ్రామీణులు, మఱి
నేరరెలమి నెద్దియే ననియుఁ దలఁపం, డ
ప్పూరుషవర్యుఁడు; వారిన్
గౌరవమునఁ జూచుఁ, బలుకుఁ, గదియుఁ నవ్వున్. ౧౬౭౩

క॥ సకలజగదుద్ధరణ భ
వ్యకార్యదీక్షాఘనుఁ డగు నయ్యదుకులభ
ర్తకు హీనులు, మధ్యములు, న
ధికులను భేదమతి లేమి తెల్లంబయ్యెన్. ౧౬౭౪

చ॥ అతనిసరోజపత్త్రయుగ మట్ల విశాలమునైన లోచన
ద్వితయమునుండి వెల్వడెడు దృష్టి తదీయగభీరభావనా
స్థితిఁ బ్రకటించు సాలవిలసిల్లుచు, సారతరప్రశాంతిసం
భృత, మకలంక, మూర్జిత, మభీఃప్రదమున్, గరుణామయంబునై.

క॥ ఆయురుతేజుని మృదుమధు
రాయతసంభాషణ క్రమాకర్షణతా
శ్రేయస్సంప్రాప్తికి నై
రాయూరిజనములు, భాగ్యమన "వారిద" కాన్. ౧౬౭౬

వ॥ పసంపడి యా సకలవిద్యాసారజ్ఞుం, డా ప్రజలు వెంటరాఁ గదలి, యూరు నిర్గమించి, చేరువ నభిరామంబగు నొక తోఁటనడుమ నిర్మింపఁబడి, పరమశాంతికి నెలవైన పాఠశాలన్ జేరంబోవ, సంభ్రమభయభక్తిగౌరవంబు లెసంగఁ, దత్పాఠశాలోపాధ్యాయు లెదురు వచ్చి, నమస్కరించి, తోడ్కొనిచని, యప్పాఠశాలయం దంతకు మున్న యతనికొఱ కమర్చిన యున్నతాసనంబు సమర్పించుటయు,

దానిపైఁ గూరుచుండి, యందఱుఁ గూర్చుండవలికి, యయ్యుపా
ధ్యాయులు నుద్దేశించి, యత్యాదరంబుమై నిట్లనియె. ౧౬౭౭

ఉపాధ్యాయవర్గంబుతో శ్రీకృష్ణస్వామి సంభాషించుట.

తే॥ ఈ ప్రజలకెల్ల నచ్చు, నేమేనిఁగూర్చి
మృదుమధురవచనరచన యింపెసఁగ, ను
పన్యసింపుఁడు విద్యాప్రధాన ; మేను
దీనిఁగూర్చి యిం దందఱుఁ దేరనాయె. ౧౬౭౮

క॥ అనవుడు వారలు మిక్కిలి
వినయంబును, బలుకుతెరువు వెరవు మెఱయ న
ల్లన విన్నవించికొని రి
ట్లనంత గుణసాగరుఁడగు నాతనితోడన్. ౧౬౭౯

క॥ ఊరి యుపాధ్యాయుల ; మే
పేరునకున్ గాము ; నేర్పుఁ బెంపును లే ; దె
వ్వారును మమ్మెల్ల ; రదియ
గౌరవలక్షణము మాకుఁ గలకాలంబున్. ౧౬౮౦

తే॥ అరయ సర్వజ్ఞులురగు దేవరసమక్ష
మందు నక్క నిలిచి, హృదయంబు సెదర,
కెందు నెంత విద్యాధికుఁ డేనిఁ జెప్ప
వాఁడు కలఁడే? యనఘ! యేఁటి వార్త మాకు? ౧౬౮౧

తే॥ ఈ ప్రజలలోని వారమ యేము ; మమ్ము
నెల్ల ధన్యులఁజేయ, నిందేగు దెంచి
నట్టి లోకప్రభులరు మీ ; రంతవట్టు
సత్య ; మే మెవ్వరము? మా ప్రశంస యేడ? ౧౬౮౨

వ॥ దేవరవార లేమేని నానతీయ విననోచికొందు, మని యయ్యుపా
ధ్యాయులు చేతులు మోడ్చి, వినయంబుమై విన్నవించుటయు,
నా జగదుద్ధారకుండు నవ్వుచు వారల కిట్లనియె. ౧౬౮౩

తే॥ మాను జీవనమునం బ్రధానవిషయ
మరయ విద్య; ప్రజలకెల్ల నది యొసంగు
మాన్యులరు కారె మీరు? మీ మతము కాదె
యెల్లవారుం గైకొనం బెన్మి నెసంగుచుండు? ౧౬౮౪

క॥ లోకమున నెల్లవారలు
మీకు నయినవార యగుట మీమతము సుండీ!
లోకప్రవృత్తికెల్ల న
నేక గతుల హేతువగుచు నేపారుం గదుర. ౧౬౮౫

తే॥ ఇట్టి మాన్యులరగు మీర లీప్రజలకు
నచ్చుం జెప్ప నేరమనుట నాకు వింతం
గొప్పదే? మాటమెలకువకుం దిగి, యిట్లు
తప్పనాడితి; రెఱుంగుదుం; దప్పు గాదు. ౧౬౮౬

క॥ నా వలనన్ వినువారై
యీ విధమునం బల్కితిరి; బలే! మీ స
ద్భావము సంస్తవ్యం; బది
గావున వినుం డందఱున్ దగన్ శ్రద్ధమెయిన్. ౧౬౮౭

వ॥ అని అప్పరమవక్త గంభీరంబుగా నిట్లుపన్యసింపన్ దొడంగె. ౧౬౮౮

మనసి ప్రభావ ప్రశంస.

తే॥ జ్ఞాన విజ్ఞాన కలితంబు మానస; మది
యెప్పుడున్ దనయందు ననేకశక్తు

లెసఁగఁ గ్రాలన్ గనుటఁజేసి, యెలమి నరుఁడు
మాను షాహ్వయమున కయ్యె, మహిమఁగాంచె. ౧౬౮౯

వ॥ వెండియు.

క॥ పరమ మనశ్శక్తిలస
ద్గరిమ నెసఁగువాఁ డగుట సకలజంతు సము
త్కరముల నధికుం డయ్యెన్
నరుం డమరతామహిమ తనకు లభ్యము కాఁగన్. ౧౬౯౦

క॥ మన మాత్మునికిఁ బరమ సా
ధన, మఖిల వ్యాపకము, నుదారము, సూక్ష్మం,
బనుపమ బహుళశక్తిమయం,
బనూనతేజో ఘనము సమస్తాకృతులన్. ౧౬౯౧

తే॥ తినుట, గూరుట, సంతానమునకు నగుట,
యెప్డు సామాన్యకర్మంబు లెల్లజీవ
కోటులకు; నప్పనులక యై, కొమరు మిగులు
మానసము పలుతెఱఁగుల వానియందు. ౧౬౯౨

క॥ మానవుని యంద సర్వ
జ్ఞానకలితమై యెసంగు సక్క నెపుడు, న
మ్మానస, మురుపరిణామ ద
శానూనస్థితిగతుల నుదంచితరేఖన్. ౧౬౯౩

క॥ మానవ శరీరసృష్టియు
నానావిధ చిత్రకల్పనాఘన మన నై
కాన నగున్; బ్రత్యణువు న
నూనమహిమఁ గూర్పఁ జాలి, యొప్పెసలారున్. ౧౬౯౪

తే॥ నాలుకయు, ముక్కుఁ, దోలును, నయనముఁ, జెవి,
యనఁగ జ్ఞానేంద్రియము లివియైదు ; వాక్కుఁ
బాణియును, బాదమును, బాయ్యుపస్థ లనఁగ
నమరు కర్మేంద్రియము లివియైదుఁ గూడ. ౧౧౯౫

క॥ పరమాంగములు పది ; యివియ
పరగు దశేంద్రియము లనఁగఁ బ్రస్తుతి కగుచున్
నరుని తనువునన్ ; వీనిక
యరఘు నగున్ దక్కిన యవయవములు వరుసన్. ౧౧౯౬

క॥ ఎలమిమెయి నిద్దశేంద్రియ
ము లెపుడుఁ బరమోపకరణములు మనసున ; కు
జ్వలభంగి వీని నడుపన్
గలిగి, యది యొసంగుఁ ; బెంపుఁ గాంచున్ మఱియున్. ౧౧౯౭

ఆ॥ దాని యాజ్ఞ లేద యేనియు నే యంగ
శమును నెప్పనికిని గాక యుండు ;
నివియ యనఁగ నేల ? నెల్ల యణువులందు
దాని మహిమ మేనఁ దగ నెసంగు. ౧౧౯౮

క॥ మానసము మాఱురూపము
మానవు తను వండ్రు బుద్ధిమంతులు ; విమల
జ్ఞానము నిజస్వరూపము
దీనికి ; నిది యట్టిదైన తెఱఁ గొప్పుఁ గడున్. ౧౧౯౯

ఆ॥ ఇది దశేంద్రియముల కెట్లు ప్రభువు ? దీని
కట్ల ప్రభువు నగుచు నాత్మఁ డెసఁగు ;
నతని యాజ్ఞ వెలయు, నణఁగుఁ బొలియు మఱి
యది యనేకదశల కెప్డు నగుట, ౧౨౦౦

తే॥ ఆత్మసామ్రాజ్య మేలంగ నర్హుఁడ యగు
దీనిఁ దనయాజ్ఞ నిడికొను మానవుండు;
వాని తత్వ మట్టిది; యిది కాని తెరువు
వట్టకుండ సూచికొనుట వానికిఁ బని. ౧౨౦౧

క॥ నానౌజోమయశక్తులు
దీని పరమవేగమునకు దినుసులు కా; వె
వ్వాని కిది పరమసాధన?
మానవుఁడు మహామహిమకు నాస్పదుఁడెప్డున్. ౧౨౦౨

క॥ అనయంబు నేమనుష్యుఁడు
మనోవినిగ్రహమునన్ సమర్థుఁడు? వినుఁ డా
తని కెందు లే దసాధ్యము;
ఘనుం డతఁ; డపారశక్తికలితుఁడు మఱియున్. ౧౨౦౩

క॥ మానసమునకున్ బరమ
స్థానము మస్తిష్క; మదియ శాస్త్రములం దెం
తేనియును సహస్రారము
నా నెప్డున్ గాంచుఁ బేరునకుఁదగ, వినుతిన్. ౧౨౦౪

క॥ మానసవృత్తియ భావము
నానావిధసకలచేతనవ్రాతములన్
నానావిధముల నెసఁగున్
మానుగ నది, యతులవేగమహితం బగుచున్. ౧౨౦౫

తే॥ సర్వసంస్థానమగు ప్రాణసాగరంబు
నుండి, మానస మొకకొంత యోపుకొలఁది
ననిశ మాకర్షణము నేసికొనుచు, దానిఁ
బంచు జగతికి భావరూపమునఁ బేర్చి. ౧౨౦౬

తే॥ వాక్కు బాహ్యరూపంబు భావనకు; నది య
పారశబ్దసాగరమందుఁ బరఁషులేశ;
మఱయ వాక్యజాలమ భాషయండ్రు ప్రాజ్ఞు;
లది యనేకవిధంబుల నలరుచుండు. ౧౭౦౭

తే॥ మానవేతరజంతు సమాజములను
బ్రదుకుఁ దెరువుల కెప్పుడుఁ బనికినైన
సాధనంబై యొసంగు భాష; యదిలేని
జంతువులు కొన్ని యరుదుగ జగతిఁ గలవు. ౧౭౦౮

క॥ కేవలముఁ బ్రవృత్తిక కా
కావశ్యకమగుచు, నరుని కన్ని తెఱఁగులన్
జీవితపరమార్థం బిది
నా వెలయున్ భాష భావనామూలంబై. ౧౭౦౯

క॥ కాన నిల భాషవలనన
మానవుఁడు విలక్షణుఁడు సమస్తవిధములన్
నానాచేతనకోటుల
వానికి నది, దాని కతఁ, డవశ్యము నగుచున్. ౧౭౧౦

క॥ మానవుఁడు పెక్కుభంగుల
దా నార్జించిన సముంచితలనదపార
జ్ఞానధనము లోకమునకు
నీ నోపున్ భాషఁ జేసి యెప్పుడు నిచ్చున్. ౧౭౧౧

తే॥ అక్షరంబు భాషారూప; మక్షరంబు
లేనిభాషకు రూపంబులేదు; మఱి న
శించు నది కొన్నినాళ్ళ కెల్లైని; నక్ష
రంబు సంస్తుతిఁ గాంచు సార్థకమ యగుచు. ౧౭౧౨

తే॥ అక్షరములను వివిధవర్ణాళిఁగూర్చి,
భావయుక్త బటమందు, నేర్పరియగు కవి
చిత్రకరుఁ డోగి నిజభావచిత్రముక్త ఘ
టించు, నదియ గ్రంథము నాఁగ నెసఁగుజగతి. ౧౭౧౩

తే॥ గ్రంథపఠనము విద్యనా గణుతికెక్కె ;
నది మఱియు నొప్పు విజ్ఞాన మనఁగ ; దానిఁ
బడసిననరుం డిహమునందుఁ, బరమునందుఁ,
జాల సుఖియగు ; వెండియుఁ గ్రాలుఁగీర్తి. ౧౭౧౪

క॥ మనమున కింద్రియములు సా
ధనములు ; తత్సుఖము లెల్ల తలఁచినను నిజం
బునకున్ సుఖములు కా ; వవి
యనయము సుఖములని తలఁచు నజ్ఞుఁడుకలఁడే ? ౧౭౧౫

తే॥ అరయ భావనాలోకంబునంద నరుఁడు
నిజముగ వసింపనగువాఁ ; డనేకసిద్ధు
లాతని ధనంబులై యుండు నందు ; నదియ
వానిలోకమనుచు నెప్పవచ్చు మఱియు. ౧౭౧౬

మ॥ కల రాలోకమునం దనేకులు జగత్కల్యాణమూర్తుల్ సము
జ్జ్వల విజ్ఞానవిశేషసిద్ధులు, సుధీవంద్యుల్ ; ముదంబార వా
రల దర్శింపుచు, వారుచూపెడు విచిత్రంబుల్ దగన్ జూచుచున్
వెలయుక్ మర్త్యుఁడు తత్త్వబోధనకళావిఖ్యాత ధీసంపదన్.

క॥ సారెకు విద్యాధికులగు
వారల యాలోకమందు వాసిక గను వా ;
రారయ విద్యాహీనులు
కా రెన్నఁడు దాని కెన్నిగతుల నెసఁగినక. ౧౭౧౭

తే॥ భావచిత్రవిశిష్టమై పరగుకృతియ
భావనాలోక ; మందుఁ గన్పట్టు వివిధ
చిత్రములు బోధనార్థవిశేషములు ; స
కలజనగ్రాహ్యములు నాఁగ గ్రాలు నవియ. ౧౭౯

క॥ మానవమాత్రుని సహజ
జ్ఞానం బణుమాత్ర ; మది విశాలతఁ గాంచం
గానుండుఁ బెక్కుభంగుల ;
వానితెఱఁగు వినుఁడు తెలియ వల్కు దొకింతన్. ౧౭౨౦

తే॥ సజ్జనులగోష్ఠియును, సుప్రశస్తదృశ్య
దర్శనంబును, విబుధవర్తనవిశేష
వేదనంబును, జ్ఞానప్రవృద్ధిముఖ్య
కారణము లెన్నియేనియుఁ గారణములు. ౧౭౨౧

క॥ పరిణామముఁ గాంచు, నిరం
తర మిమ్మూటన్ ప్రశస్తతా ఘనసిద్ధిన్
బొరయున్ జ్ఞానం ; బవి యె
ల్లరకున్ సులభక్రియల నలభ్యము లెందున్. ౧౭౨౨

ఆ॥ గీ॥ చక్రవర్తికేని సాధ్యంబు లివి పొంద
ననుటకాదు ; బహుళయత్నసిద్ధిఁ
గాంచనుండు ; నట్లు గాంచన్ బడియును బ్ర
శస్తములని సెప్పఁ జనవు మఱియు. ౧౭౨౩

వ॥ ఏమి ? వీని తెఱంగిట్టిదే ? యని యనకుఁడు ! దానిన్ విశదంబుగ వినిపింతునని యేమ్మహావాగ్మి యిట్లనియె ; సత్పురుషులగోష్ఠి సామాన్యంబుగ దుర్లభంబు ; సత్పురుషులన నెవ్వరు ? వారిగోష్ఠి

యన నేమి ? మఱియు నది యెట్లు బడయనగు ? నను మొదలగు వానిన్ గూర్చి విచారించు టత్యవసరంబు ; తద్విచారణ కనువగు శ్రద్ధయు, దానికిఁ దగు బుద్ధి వికాసంబును, దానికిందగు నోర్పును, దానికుచితమైన దీక్షయు మఱియు నత్యావశ్యకంబు ; లివి సాధారణంబుగ నందఱకు నలవడునట్టివి కావు ; వీనితెఱం గిట్టి ; దిది యిట్లుండ నిండు ; నానావిధపుణ్యక్షేత్ర పురనగర మహాపురుష వనశైల నిర్ఝరారామసరోవర తపోవనాదిదృశ్యసందర్శనంబునుసులభసాధ్యంబుగా ; దంతియాకాక పరమర్షి యోగి పండిత తత్వజ్ఞ కవి ధర్మారాధక భక్త పతివ్రతా దాతృప్రముఖ పూజ్యజన ప్రవృత్తి వేదనంబును గష్టసాధ్యంబ ; యిట్లు దుర్లభంబు లీరెండు ; వీని కన్నను సజ్జనగోష్ఠి పరమదుర్లభం ; బిమ్మూడును జక్రవర్తికేని సుసాధ్యంబులు కా ; వొకభంగి సాధింపఁ బడినను నవి యకాలంబునక చెందియుండునవియై యుండుఁ ; గావున సాల ప్రశస్తికిన్ గా ; వింతకు నివి యిట్లు దుర్లభంబు లగుటన్ జేసి, మనుష్యుని జ్ఞానంబు పరిణామమున్ గాంచక యట్ల యుండ వలయునే యనిన నదియున్ గాదు ; వినుండు విద్య మానవుని జన్మధనంబు ; దాని వలనన యతం డెల్లసిద్ధులఁ బడయనగువాఁ ; డెల్లసిద్ధులకన్నను జ్ఞానం బత్యావశ్యకం ; బది మున్ను చెప్పిన మూటఁ బడయనై యుండు, నమ్మూడును విద్యాధికునకు సులభ తరంబు ; లది యెట్లనిన విద్యాశాలి పెక్కు గ్రంథంబులన్ బఠించువాఁడు కావున జ్ఞానసిద్ధులగు గ్రంథకర్తల విశాలభావనాలోకంబున విహరింపన్ గలిగి, తత్పరిచయభాగ్యంబున్ బడయు ; నిదియ సత్పురుషగోష్ఠి యనన్ బరగు నది వెండియు. ౧౭౨౮

సీ॥ కృతులందనేక దేవతలు, ననేకలోకంబులు, బహుయోళకములు, బహు యు। గములనాఁటి మహర్షిగణముఁ, దత్వజ్ఞులు, సాధువుల్, భక్తులు,

శాస్త్రవిదులు, దాతలును, సతీమతల్లులు, ధర్మాత్ము లగురాజులును,
మంత్రులాదిగాఁగ సజ్జనులును, వనశైలనదీనదతీర్థప్రకృతిచిత్రదివ్యదేశ
సారసుక్షేత్రఖగమృగ జాతు లాది
గా ననేకదృశ్యంబులు గానవచ్చుఁ;
గానఁబోవు విద్యాశాలి వానినెల్ల,
నిడియ దృశ్యదర్శనమన నెలమి నొప్పు. ౧౭౨౫

ఉ॥ చాలఁ బ్రసిద్ధిఁ గాంచి తగు సజ్జన కోటుల సచ్చరిత్రముల్
వేలకొలంది గ్రంథముల, వే మఱుఁ బోలిచి సూడనూడఁగాఁ
గ్రాలు మఁ గానవచ్చు నురుకాంతి యొసంగ సతంబునున్ సుధీ.
శాలికి; విద్యకల్మి ననిశం బతఁ డంతకున్నె యొసంగెడిన్. ౧౭౨౬

వ॥ ఇది యార్యజనవర్తన వేదనంబు, వెండియు. ౧౭౨౭

తే॥ వింటిరే యివ్విధంబున విద్యగల మ
నస్వి సుజ్ఞానసిద్ధి ఘనత్వగౌర
వములఁ బడయు తెఱఁగు? విద్యవలనఁ బడయ
రాని దెద్దియు లే దెందు మానవునకు. ౧౭౨౮

వ॥ ఇట్లు—

క॥ మానవుఁ డొగి నార్జించిన
జ్ఞానధనము దాచికొనఁగ నక్క నెసంగున్
వానికి గోర్ద్రిము పేటిక
నా నెప్పుడుఁ; దద్విధము వినన్ దగి యుండున్. ౧౭౨౯

## మస్తిష్క ప్రభావప్రశంస.

వ॥ వివిధదృశ్యదర్శనానుభవజనిత జ్ఞానసంగ్రహణశక్తివిశిష్టంబై, మాన
వుని తలయందు సహస్రారచక్రంబను యంత్రంబు వెలయుచుండు;
దానిన మస్తిష్కంబందు; రాయంత్రంబునకుఁ బ్రధానోపకర

ణంబైన మానసం బపారజ్ఞానసాగరంబునకుఁ గాల్వనాఁదగి, స్వయ
ముగను, బంచేంద్రియ ద్వారమునను నానారూపగుణ బంధుర జ్ఞాన
ప్రవాహంబు నాకర్షించుచుండు; నా జ్ఞానప్రవాహం బాసహ
స్రార యంత్రపేటిక యందు సముచితస్థానంబులఁ జిత్రింపన్‌బడి,
నానా రూపంబుల నలరుచుండు; వెండియు నా చిత్రరూపంబుల
స్వేతవర్ణవిశిష్టంబైన యొక్క ద్రవపదార్థంబు మాసిపోకుండ రక్షిం
పుచుండు; మఱియును. ౧౭౩౦

తే॥ ఆ ద్రవము మాసెనేనియు నవియు మాయు;
నది యలరుచుండ నవి సాల నలరుచుండు;
నెట్టు లేనియు నవి మాయు నెప్పు? డపుడ
మానవుని జ్ఞానమంతయు మాసి పోవు. ౧౭౩౧

తే॥ అతిగభీర సహస్రారయంత్ర మఖిల
యంత్రములలోన మేటిదై యలరుచుండు,
మానవుని దేహమున; దాని మహిమయింత
యంత యనిరాని భంగిఁ బెంపారుచుండు. ౧౭౩౨

తే॥ ప్రకృతియందు రహించెడు సకలశక్తు
లిమిడి, పరమాణువులభంగి నెసఁగుచుండు
నెప్డు నయ్యంత్రమున; నది యెవ్వరున్ గ
ణింపరాని చిత్రాకృతి నెసఁగి క్రాలు. ౧౭౩౩

క॥ ఒక్కొక బ్రహ్మాండంబును
సక్క నెసఁగి, యావరింపఁ జాలు గరిమ పెం
పెక్కి పొలచు నాయంత్రము
యొక్కొక్కయణువుఁ దఱికి సముజ్వలభంగిన్. ౧౭౩౪

సీ॥ ఈయంత్రమునఁజేరి, యొసఁగి రూపున్ గన్న జ్ఞాన మెన్నండును
మేనితోన । శింపక, యిచ్చలుఁ జిత్తంబునందంటి, వాసనారూపమై,
వాసిఁగాంచి, । జీవుని సంతత మావరించికొని, పెక్కిసెలంగ బహు
సూక్ష్మరేఖ నుండు । నెల్లలోకంబులం దెల్లరూపముల ; దాని తె
అంగుఁ జిత్రమనిరి మహాత్మ ;
లెన్నియేని గలవు దీనికేర్పడఁగ ని
దర్శనంబు ; లోకంబు మాత్రంబ యందు
సంగ్రహముగ వచింతు, నాశ్చర్యమునకుఁ
గాదు ; సత్యంబునకు నొక్కకడను బిదప. ౧౭౩౫

వ॥ ఇప్పటికది యట్లుండనిండు మహాల్లోకంబునందలి సారపదార్థంబును,
మానవుని సహస్రారమందలి సారపదార్థంబును, నొక్కండ యని
తత్వజ్ఞులు సెప్పుదు ; రిట్టి యపారమహిమాఖనియైన సహస్రార
చక్రంబు మానవజన్మసహజసిద్ధజ్ఞానపేటిక యనుటయం దతిశ
యోక్తిదోషంబు లేదు ; వెండియు. ౧౭౩౬

క॥ దీనికిఁగాఁ డెవ్వఁ ? డతఁడు
మానవుఁ డనఁ గాఁడు ; వాని మస్తిష్కంబ
జ్ఞానతమో దూష్యము ; మఱి
వాని బ్రదుకు పశువు బ్రదుక ; వాఁడేమిటికిన్ ? ౧౭౩౭

క॥ జ్ఞానము నీయంత్రమునకు
మానుగ నెప్పుడును గూర్చు మాన్యుఁడు సద్వి
ద్యానిధి యొక్కఁడ ; యతఁ డతి
మానుషుఁ డననైనవాఁడు మానవకోటిన్. ౧౭౩౮

తే॥ వానియందవికాసత వడయుచుండు
నెప్పు డీయంత్ర ; మిది యిట్టు లెసఁగనగుట

వాఁడుఁ గాంచుఁ ద్రిలోచనత్వముఁ గ్రమక్ర
మంబుగఁ ; జ్ఞానసిద్ధుఁ డమ్మహిత మతియు. ౧౭౩౯

తే॥ జ్ఞానలోచనమున్ విచ్చి, సర్వము నొక
చూపులోనన నిజముగ నూడనేర్చు
నమ్మహాత్ముండు ; వాని మహాత్త్వ మెన్నఁ
దరముగాదు ; గురువుల కాతండు గురుఁడు. ౧౭౪౦

క॥ అభివంద్యసారవిద్యా
ప్రభావముననె యిదియెల్ల పరిపాటిమెయిన్
బ్రభవింపనైన యది ; బహు
శుభములకుఁ విద్య కూర్చు చోటం ద్రు బుధుల్. ౧౭౪౧

తే॥ శాంతిసౌభాగ్యమునకు నిచ్చలును నోచి
కొన్నవాఁ డెప్డు విద్యాధికుండ, కూటి
పేద యయ్యును ; నది పొందరాదు నిక్క-
మెట్లుఁ గోటీశ్వరునకు ; లే దిందు భ్రాంతి. ౧౭౪౨

వ॥ దీనికి నుదాహరణంబుగ నొక్క చిన్నకథఁ జెప్పెద, నాకర్ణింపుఁడు.

ఒక కోటీశ్వరుని యశాంతి ప్రశంస.

సీ॥ కలఁ డొక్కపురి దైవవిలసనఘనుఁ డొకకోటీశ్వరుఁడు, పేర్మిఁ
గూర్పనేర్పుఁ। గలవాఁడు ; విద్య యొక్కండు మాత్రమ సాల
దతనికిఁ ; దక్కిన యన్నిఁటన్ ఘ। నుండు నానైనధన్యుండతం ;
డాతని కలిమికిఁ దగుభంగిఁ గలదు బలగ ; । మాప్తులుఁ, జుట్టము;
లనురక్తులును సాలఁగలరు ; మచ్చునకేనిఁ గానవడరు
శాత్రవులు ; పండితులు, భృత్యజనులు, లేఖ
కులు, నుపవిలేఖకులుఁ, గార్మికులును గలరు ;
కల దొకించుక యీావి ; లోకమున నతని
పేరునకు నెల కల ; దింత పెంపుఁగలదు. ౧౭౪౪

వ॥ మఱియు నతండు నేర్పుమెయిఁ బెక్కు వాణిజ్యంబులు సేసియుఁ, బెక్కు పొలంబులను గ్రామంబులను గొనియుఁ, బలువురు ప్రజల కప్పు లిచ్చియు, నేఁటేట సాలధనం బార్జింపుచుండు; వెండియు నతనిదృష్టి కెందును గొఱంతలేని చందంబు గానవచ్చుచుండు, సిట్లయ్యును. ౧౭౮౫

తే॥ అచ్చుపున్ శాంతిసేకూరదాయె నతని
కన్నిఁటన్ ఘనుఁడయ్యు, నత్యంతబుద్ధి
శాలి యయ్యు; సహస్రార చక్రమతని
యందు విద్యాధికత లేమి నణఁగియుండె. ౧౭౮౬

తే॥ ఇట్లు శాంతిసిద్ధ్వివత కెప్పు డగ్గ
మగుచు నాతఁ డాత్మీయ సౌధాగ్రమందు
నొంటిఁ గూర్చుండి, నలుదెస లోలి సూచు
చుండె మానసముఁ గలంగ నొక్కనాఁడు. ౧౭౮౭

ఉ॥ ఆసమయంబునన్ గనదుదంచితభావనము ద్రమందు, ను
ల్లాసతరంగముల్ గదు సెలంగ, మనోహర శాంతిగానమున్
భాసురలీలఁ దొంటిపరిపాటి నొనర్చు మహామనస్కుఁ, దే
జోసహితున్, బ్రసన్నముఖుఁ జూచెఁ గుటీరనివాసి నొక్కనిన్.

వ॥ అక్కుటీరం బమ్మహాధనికుని సౌధంబు ప్రక్క నొక్కెడ నుంటఁ జేసి, యప్పురుషుని శాంతిగానం బక్కోటీశ్వరునికి విననగుచుండుఁ, గావున నతం డగ్గానంబునందు మనంబుఁ జేసి, యొక్క పరిచరునిన్ బంచి, యతనిన్ బిలిపించికొని, యతండు రా, నతిగౌరవంబున నాసనం బొసంగి, కూర్చుండన్ బలికి, యిట్లనియె. ౧౭౮౮

కోటీశ్వరుండు కుటీరవాసితోఁ దన దురవస్థ నెఱింగించుట.

క॥ ని న్నెఱుఁగ నెన్నఁడేనియు
ము; న్నిప్పుడు నీదుగానము మనోహరమై

సన్నెఱుఁగఁజేసె నిమ్మెయి
నిన్నున్ ; నీ గాన మేమని నుతి యొనర్పన్. ౧౭౫౦

తే॥ శాంతికళ నీనెడిన్ సుప్రసన్నతా వి
శిష్టమై పొల్చు నీ మోము ; పుష్టియున్ వి
శాలకాంతియున్నీమేన సాల నొప్పి
యున్నయవి ; చూడ్కులును సెప్పనొప్పు మఱియుఁ ౧౭౫౧

ఉ॥ ఎంతయుఁ దృప్తిపేరిమి వహించి, యనేకవిధంబులన్ లస
చ్ఛాంతికళా విశిష్టమయ్యు, సాల నెసంగెడి భంగిఁ దోఁచె నీ
స్వాంత ; మొకప్పు డేనియు విషాదము పుట్టదుకాదె ? దాన నీ
వింతకు నైతివంచు నెదనెంతు విచారము జేసి బాగుగన్. ౧౭౫౨

క॥ ఏమిటఁ జిరశాంతికళా
శ్రీమహిమోన్నతికి నైతి ? సెప్పు ! మతులని
ష్ఠామహితము నీదు తెఱఁగు ;
సామాన్యుల కెందు నిట్టిచందము కలదే ? ౧౭౫౩

క॥ విన విన, మఱియున్ విననై,
మనోహరము, మృదుతరంబు, మధురము నై, యొ
ప్పు నెఱపు నీ గానము శాం
తినిరూఢ పదక్రమోన్నతిన్ దిరమగుచున్. ౧౭౮౪

క॥ నీ వాసికిఁ దగదు కుటీ
రావాసము ; మేడనుండ నర్హుఁడ వనుచున్
భావింతు ; హీనదశ నీ
కే విధమున నయ్యె ; దీని కేమన నెమ్మె ? ౧౭౫౫

క॥ నామనము శాంతికిన్ గా
దేమొయి యత్నించి సూడ నేనియుఁ ; గల దు

ద్దామతర శ్రద్ధ ; యదియు
నేమిఁటికిన్ గాకపోయె ; నేమనవచ్చున్ ? ౧౭౫౬

క॥ పండితులు పలుతెఱఁగుల నొ-
కండు నొకఁడుఁ గూర్చి, పెక్కు గాథల్, కథలు
ద్దండతర దీక్షఁ జెప్పుదు ;
రొండెన్న కవి విందుఁ ; దవిలి యుండుదు నెమ్మిన్. ౧౭౫౭

క॥ నా తల కెక్క వవి ; మఱియు
న్నూతనగాథలును గా ; వనూన బహుకథా
చాతుర్యంబును బనిగా ;
దే తెరువులుఁ జొప్ప దవ యనేకవిధములన్. ౧౭౫౮

క॥ మేల యగు నెల్లపనులన్ ;
గాలము ననూకూలగతిఁ దగన్ జెంపెసఁగున్ ;
సాలు క్రొలఁదిఁ గల వన్నియు ;
నే లోపముఁ బుట్టు టెఱుఁగ నింతకు నెపుడున్. ౧౭౫౯

క॥ ఈవియుఁ గల ; దెల్ల ప్రజలు
నావారలుఁ గాఁ దలఁతు ; మనంబును దిరమై
వావిరి విలసిల్లున్ నా
నా విభవసమృద్ధి కనుదినముఁ బొంపగుచున్. ౧౭౬౦

తే॥ ఇన్నిఁట ఘనుండనయ్యు నదేఁటిమాయ
యో ? యెఱుంగం బడదు ; సెప్ప నొండులేదు ;
శాంతిసౌభాగ్యగరిమా ప్రశస్తి కించు
కంతయున్ గాకపోయి ; తే మనఁగ నింక ? ౧౭౬౧

క॥ ఒరు లెవ్వరు నన్ను శపిం
పరు శాంతికిఁ దప్పి కలఁగఁ ; బండితులు నిరం

తరమున్ శాంతిన బోధిం
తురు, శాస్త్రము లెత్తి సూపుదురు గోష్ఠికి నై. ౧౭౬౨

క॥ ఇవి యవియన నేమిఁటి ? కై
ష్ఠు వెరవుమై శాంతిక పనిఁ బూని చరింతున్
వివిధవ్యవహారములన్
దవిలియు ; నది నాకుఁ బడయఁ దగనిద యయ్యెన్. ౧౭౬౩

క॥ నీ కెవ్వరు బోధించిరి ?
శాక స్వయమ యెఱిఁగితో యఖండితదీక్షన్
నై కొని శాంతికి నగు తెరు ?
వేకరణిన్ దానిఁ బడసి ? తెఱిఁగింపు ! తగన్. ౧౭౬౪

క॥ అనవుడు నప్పురుషుం డా
తని కిట్లను మొగమునందు దరహాసము సొం
పునకై, శాంతికిఁ దోడవై,
యనూన తేజోలహరికి ననువై, యొప్పన్. ౧౭౬౫

కుటీరవాసి కోటీశ్వరునికి హితోపదేశము సేయుట.

ఆ॥ గీ॥ శాంతి కీవుగానిచందంబునకుఁ బెక్కు
కారణములు గలవు ? గాథ లెల్లఁ
గూర్చి త్రవ్వనేలఁ ; గొంతకొంత తడివి
వినుము ! వానిభంగి విస్తరింతు. ౧౭౬౬

క॥ నీ వన్నింటన్ ఘనుఁడవ ;
కావనరా ; దే నరునకుఁ గలవు ధనంబుల్
గేవలముఁ బెక్కు ; లాతఁడ
సూవె ఘనుం ; డెల్ల రతని చుట్టములు మహిన్. ౧౭౬౭

తే॥ ఎన్ని కలిగిన నవి యెల్ల నేలఁ ? దృప్తి
సనని మానవునకు నవి చాల ; వింక
వలసియుండుఁ ; సత్యాశకుఁ గలదె పార ? మెల్ల
జగములు దానికి నెప్డుఁగావు. ౧౭౮

క॥ పరమాంగకంబు తృప్తియ
నిరంతరము శాంతి ; కెవ్వనిమనం బాశా
భరితం బది శాంతికిఁ గా
దిరవు ; నిజమవల్కు మిమ్మొయికి నీవగుచే ? ౧౭౯

క॥ కలవస్తువులకు నెప్పుడు
కలుగున్ గీ ; డష్ట మనసు కలఁగున్ ధనవం
తుల ; కెట్లు శాంతికిన్ వా
ర లగుదు ? రీ వరయ నత్తైఱంగున కైతే ? ౧౮౦

తే॥ ఇంద్రియసుఖంబులను గాదె యెప్డు భోగ
ములని పల్కుదు రెంతయు మురిసిపడుచు ?
నవి యొకప్డు లభింపమి యైన, హాని
కగ్గమైనన్, గలఁగుట యగు ; నిజంబు. ౧౮౧

తే॥ కలఁగనైన మానస మెప్డుఁగాదు శాంతి ;
కెన్ని వచ్చినఁ, బోయిన, నింకనెవ్వి
ధంబు వాటిల్లినను ధృతిఁ దప్పఁ డెవ్వఁ ?
డమ్మనస్వియ శాంతికి నైనవాఁడు. ౧౮౨

వ॥ తమోగుణప్రధానంబైన మృగత్వంబునం దింద్రియానందంబును,
రజోగుణప్రధానంబైన మానవత్వంబునందు మానసానందంబును,
సత్వగుణప్రధానంబైన దేవత్వంబునం దాత్మానందంబును సహజం
బులు ; మృగత్వమానవత్వదేవత్వంబులు మనుష్యుని పరిణామదశా

రూపంబౌ ; లెవ్వాఁ డింద్రియానందంబునఁ దవిలియుండు ? వాఁడ
మృగత్వంబునఁద యున్న వాఁడని యెఱుంగుము ; ధనంబు లింద్రి
యానందంబున కూర్పఁజాలు ; నీవు మహా ధనవంతుండవనియు,
నన్నింట ఘనుండవనియుఁ దలంతు, విప్పుడు నీధనంబు లెందులకు
సాలునో యెఱింగితివికాదే ? వెండియు. ౧౭౭౩

తే॥ మానసానందమంద సూ మానవత్వ
మెప్పుడున్ గ్రాలునని చెప్పి ; తింతకున్ మ
నోవికాసంబునకు గతి కేవలంబు
విద్య యొక్కండ ; యది సాల వెలకువచ్చు. ౧౭౭౪

తే॥ విద్య సాలమిఁ జేసి, కోవిదులు నీకు
నెన్ని కూర్చి చెప్పినఁ దల కెక్కవాయె ;
నెప్పుడు మృగత్వమంద రహింతు ; విన్ని
కారణంబుల శాంతికిఁ గాకపోతి. ౧౭౭౫

క॥ ధనసంపాదనమున్ గా
దనఁ బోలదు ; కూర్చుచుండు! మన్యాయము కా
దు ; నితాంతధర్మచింతా
ఘనుఁడవగుము !! విద్యఁగూర్పఁ గడఁగుము ! మఱియున్. ౧౭౭౬

తే॥ విద్యయంద వికాసతావృద్ధిఁగాంచు
మానసము ; మానవత్వము దానియంద
పరిణతిన్గాంచు ; నెప్డు నబ్బంగి యంద
శాంతి యలరారు ; నది నరు జన్మధనము. ౧౭౭౭

వ॥ పండితులు శ్రమకోర్చి, పలుగాథలుఁగూర్చి, యెంతసెప్పినను నది
తల కెక్కదనియు, శాంతి సేకూరదనియు, వగచిచెప్పితివి ; వినుము
పరమ స్వాతంత్ర్యభాసురంబైన మానుషం బపరోక్షజ్ఞానంబు వల
ననకాని, పరోక్షజ్ఞానంబువలననఁ దృప్తిపడయదు ; తృప్తియంద

శాంతి రహించునని మున్న సెప్పితిఁ; గావునఁ దృప్తిలేమి నీవు శాంతికిఁ గాకపోయితి; వొరుండు నోటఁ గ్రుక్క తినిపించిన మృష్టాంబును రుచికిని, బుష్టికిని గానిభంగిఁ, బరోక్షజ్ఞానంబు తృప్తికిని శాంతికిని గాదు; వెండియు. ౧౭౭౮

తే॥ కావునన్ గూర్చికొనుము శీఘ్రంబ విద్య;
శ్రద్ధయుఁ, దాల్మియును, మహోత్సాహమును, బ
రిశ్రమము దానికి వలయు; నాశ్రయమును
సాలఁ మంచిదియైయుంట మేలు; మఱియు. ౧౭౭౯

క॥ నీ వేమిట శాంతికి నై;
తే విధులన్ నడుపుదు? వవి యెట్లొకొ? యని ము
న్నీ వడిగితి నాచందముఁ?
గావున వినుపింతు విను! తగన్ శ్రద్ధమెయిఁ. ౧౭౮౦

తే॥ నాకుటీర మీసౌధంబునకు సమీప
మంద పెక్కేండ్లనుండియు ననఘ! యున్న;
దీవు దాని నెన్నఁడు సూచి యెఱుఁగ వేమిఁ;
కార్య మాగుడిసెఁ జూడఁ గలదునీకు. ౧౭౮౧

తే॥ గీ॥ ఏను పెక్కేండ్లనుండియు నెప్డు దాని
యంద వసియింతు; గలరు నా కాలుబిడ్డ;
లెందులకుఁ గాక యిప్పరి యంద కూలి
నాలి జీవింతు; మదియ మాకైన వృత్తి. ౧౭౮౨

ఉ॥ నీచతకోర్చి, బుద్ధిసెడి, నిందకుఁ బాలయి, యెన్నఁడేనియున్
యాచనసేయ నొల్లము; ప్రియంబున నన్యులు బల్మిఁ బెట్టఁగాఁ
జూచిననేనిఁ గైకొనెడి చొప్పునకున్ దిగ; మీనువృత్తి యా
లోచన కెట్లునున్ సారము లోకులహానినిఁ గూర్చి యేమియున్.

తే॥ దైవవశమున సాల దుర్దశకు నైతి;
మట్టులయ్యును గలనేని నడలువుట్టి
కలఁగు టెఱుఁగము; తృప్తియ గాంతు మెప్డుఁ
గల్గినను, గల్గకున్నను గాఢనిష్ఠ. ౧౭౮౪

క॥ ఆలికి, నాకున్ దినమును
గూలి దొరకుచుండు నొక్కకొంత; యదియ మా
పాలిఁట నగు భాగ్యముఁ, బది
వేలున్, బెన్నిధియు, రాజ్యవిభవము సూడన్. ౧౭౮౫

వ॥ కూలి వుట్టని దినంబులందును, దెవుళ్లువట్టునప్పుడును, బంధువులం
దును, వలయు వెచ్చంబు లకును, బిడ్డల వివాహాదులకును, మా
కూలియందును గొంతకొంత మిగిలించికొని నిధి నేసి కొనుచుం
దుము. మఱియును. ౧౭౮౬

క॥ కలవారు కారు బంధువు;
లలఁతులు మముఁ బోలువార యాప్తులుఁ జుట్టం
బులుఁ గల రొకకొందఱు; వా
రల వలనన్ మేళ్లుఁ, గీళ్లు రా వెన్నండున్. ౧౭౮౭

క॥ మము నొల్లని వారల నొ
ల్లమనుట కా; దెప్డు వారలకుఁ దఱి కగుచుం
దుము; శాంతి యొండ మాకు ధ
న; మలుక పనిగాదు; పగఁ గొనము; లే దీసున్. ౧౭౮౮

తే॥ బిడ్డలకుఁ గల్మికిన్ దగఁ బెట్టి, వాండ్రు
తిన, భుజింతు మాలును నేను దినము రెండు
ప్రొద్దు; లతిథుల కెప్డుఁ గూడ్తుము తగంగ
నోపుకోలఁది; డంబంబు తెన్నునకు ననము. ౧౭౮౯

క॥ కూరలుఁ, జిఱుతిండ్లు నెపుడు
నోరి రుచికిఁ దగఁ భుజింప నోచికొనరు మా
గారవమున కిగు బిడ్డలు ;
నేరర యని పల్కవచ్చు నేర్పదియేనిన్ ? ౧౭౯౦

క॥ ననుఁ జదివించెన్ మును మ
జ్జనకుఁడు ; చదివితిని పెక్కు శాస్త్రంబులు నే
ననఘా ! పలువురు గురువుల
యనుగ్రహమహాధనమునకై శ్రద్ధమెయిన్. ౧౭౯౧

క॥ నా చదువునకున్ దగ నా
లోచన యొప్పారు ; నది వెలుంగున్ శాంతి
శ్రీచరణసేవ యందు, స
దాచారమునందు, నోర్పునందును సాలన్. ౧౭౯౨

క॥ కవికిన్, బాఠకునకు నె
ప్డు వలయుఁ దన్మయత ; యవ్వాడువు తద్దయు లె
స్స ; వెరవు కల్మియు వలయుఁ ; జ
దువునం దర్థంబుఁ దప్పఁ దొలఁగమియుఁ దగున్. ౧౭౯౩

క॥ నానావిధాయతార్థ
జ్ఞానమ ప్రాణమనవచ్చుఁ జదువున ; కది యెం
తేనియు వెలకగు ; దానికిఁ
గాని చదువు నిజము సదువుగాదు మహాత్మా. ౧౭౯౪

క॥ కవిభావ మరయఁ గల్గు వె
రవ యర్థజ్ఞానమునకుఁ బ్రాణం ; బది రి
త్త వడయరానిది ; దానికి
వివిధ కృతి పరిశ్రమ ప్రవీణత వలయున్. ౧౭౯౫

తే॥ గీ॥ తన్మయత్వంబ ప్రాణంబు తద్దయుఁ గవి
భావవేదనమున ; కది సూవె పాత
కుని సహస్రార చక్రమం దనుపమ ప్ర
భావిశిష్టచిత్రాకృతి ప్రాప్తిఁ బడయు. ౧౭౯౬

కం॥ నానావిధోజ్జ్వలార్థ
జ్ఞానముఁ, దద్వివిధరూపసంప్రాప్తియుఁ, దే
జోనిరుపమశాంతి విశు
ద్ధానందంబులును దన్మయతఁ బొందనగున్. ౧౭౯౭

తే॥ తన్మయత్వ మహత్త్వ మింతయని, యంత
యని వచింపంగరాదు ; మహాప్రభావ
సార చారు సహస్రార చక్రమునకు
నదియ ప్రాణం బౌనంచు కీలంద్రు బుధులు. ౧౭౯౮

కం॥ మానసము తన్మయతకున్
మానుగఁ బ్రాణంబు, విను మమలతరము, వశం,
బై నెగడవలయు నది యన
మాన వికాసత నెసంగ మనకు సతంబున్. ౧౭౯౯

కం॥ మానితమనోవినగ్రహ
తానై పుణ్యంబు సముచితముగ మనకు లే
దేనియుఁ దన్మయతకు నె
ల్లనియుఁ గా ; మిది నిజంబ యింతకు సాలన్. ౧౮౦౦

ఆ॥ గీ॥ బంటువోలె నెల్లపనులందు నాయిచ్ఛ
కగుచునుండు నెప్డు ననఘ ! మాన
సంబు ; దానియంద సర్వశక్తులు వివి
ధాకృతుల నెసంగి, యలరుచుండు. ౧౮౦౧

తే॥ చంచలమనోవినిగ్రహశక్తి, పరమ
దృఢతరాభ్యాసమునందె సిద్ధించు; నదియ,
మనకు వలయు మహానిధి మానుషమున;
దానికొఱకె పుట్టితిమను తలఁపు లెస్స. ౧౮౦౨

క॥ మానసశక్తివిశిష్టము
మానుష; మిది మాననీయ మహిమావిపుల
జ్ఞాననిధానం; బెట్లున్
దీనికి సరిగాద యంద్రు దేవత్వంబున్. ౧౮౦౩

క॥ నానాగ్రంథవ్రజవి
జ్ఞానంబునఁజేసి నాకు సమకూరెన్ ని
త్యానందమయము శాంతి, మ
నోనిగ్రహశక్తి కవితనూతనదీప్తిన్. ౧౮౦౪

తే॥ అనఘ కవిభావనాలోకమంద యెప్పుడు
నామనంబు తిరంబు. నానందమయము
నగుచునుండు; వికారంబు లంట వవ్వి
ధమున నదియు టఁజేసి; దోషములు కావు. ౧౮౦౫

తే॥ గీ॥ పెక్కులోకంబులను జూతుఁ; బేర్మి వాని
యందలి రహస్యమున్ దెలియంగ నేర్తుఁ;
దన్మయతఁ గాంతు వానియంద, చిరకాల
మమ్మహాభావనాలోకమందు నిలిచి. ౧౮౦౬

వ॥ సృష్ట్యాదినుండి యింతదనుక సెల్లి, యపారకాలమహాసముద్రగర్భ
స్థంబులు నాఁజను నానాయుగచరిత్ర మణిసముత్కరంబు లాలో
కంబునందు సువ్యక్తతరంబు, లింతియకాక. ౧౮౦౭

ఉ॥ పెక్కులు తత్త్వవేత్తల యభేద్యవిశిష్టమహోపదేశముల్
సక్క వినంగవచ్చు, ననిశంబును బుద్ధికినచ్చి, తెల్వి పెం
పెక్కఁగనైన చాద్పున రహింఛుఁ, దొలంగు సమస్తదోషముల్,
మిక్కిలి తేజమున్, జనసమృద్ధియు సేకురు నాజగంబునన్. ౧౮౦౮

చ॥ పరమమునీంద్రులున్, యతులు, భక్తులు, సిద్ధులు, యోగులుఁ,
మహా। పురుషులు, సత్కవీంద్రులుఁ, బ్రభుప్రవరుల్, సురలాది
గాఁగ ఖే। చరులుఁ, బతివ్రతామణులు, సాధులుఁ, బేదలుఁ,
దత్త్వవేదు, లా। సురుచిరలోకమందుఁ బొడసూపుచురింక ననేక
సజ్జనుల్. ౧౮౦౯

సీ॥ సకలదేశంబులు, శైలనదీనద కాననపట్టణ గ్రామపక్క,
ణాదు, లంభోనిధు, లఖిలమృగంబులు, ఖగములుఁ గ్రిమికీటక
ములు, వివిధ। తీర్థపుణ్యస్థలుల్, దేవమందిరములు, నివి, యవి,
యని యెన్న నేల ? జగతి। యందలి సకల చరాచరవ్యక్తులు, నబ్భా
వనాలోకమందుఁ గాన

వచ్చుఁ, బ్రకృతి విచిత్రదివ్యప్రభావ
మంతయును దానియందు నిరంతరము న
నేకవర్ణనలకు సాలనెక్కి, చేఁత
వెట్టినట్టి విధమునఁ గన్పట్టు ; నిజము. ౧౮౧౦

ఆ॥ దానియంద యెప్పుడుఁ దవిలి యుండుదు, మహో
త్సాహవిపులశక్తి సహితమైన
శాంతి నాయెడన్ బ్రశక్తికి నెక్క క్రా
లెడిని ; గలఁతయొందు లేదునాకు. ౧౮౧౧

క॥ తనువు పనులందుఁ, గవి భా
వనా జగమునందు మనము వర్తించుట, యెం

దును శాంతికిఁ దక్కక, యే
ననయముఁ గ్రాలంగనగుదు నానందమునన్. ౧౮౧౨

తే॥ పండితులు నీకొసంగిన పరమబోధ
సారమంతయు విను మవ్విశాలలోక
మందలి యొక యణువ యని యరయు; మరయఁ
గల్గినంతకు నది నీకుఁ గానవచ్చు. ౧౮౧౩

వ॥ ఏ నింతదనుక సెప్పిన యిమ్మహావిషయంబునకు నిదర్శనంబుగా నే
దేని నొకపురాణంబేనిఁ, గాక మఱి యే గ్రంథంబునేనిఁ బఠింపు!
మందు నా చెప్పిన ట్లన్నియేనియున్, గాక కొన్నియేనియు నీకున్
గానవచ్చు; నట్లు కానవచ్చిన యాదృశ్యంబులు నీ తన్మయత్వంబున
కనువుపడ నానందంబును శాంతియును సేకూర్చునవియైయుండు;
వివిధగ్రంథసముదాయంబ కవి భావనాలోకంబని యెఱుంగు! మని
మఱియు నతం డిట్లనియె. ౧౮౧౪

కోటీశ్వరునితోఁ గూటిపేద తననిత్యకృత్యంబు లెఱింగించుట.

తే॥ గీ॥ చదువుసాలమి నీకు నసాధ్య మవ్వి
ధంబు; గావున దృఢదీక్షఁ దవిలి, చదివి
కొనుము పండితవర్యులగోష్ఠిఁ; జదువు
కాదె సుజ్ఞానమున కాదికారణంబు. ౧౮౧౫

వ॥ అర్థజ్ఞాన కవిభావవిత్త్వతన్మయత్వాదుల ప్రకారం బింతకుమున్న
యెఱింగించితి; వాని తెఱంగు నెఱింగి, మఱి సక్క విద్యాధికుండ
వగుదుగాక యని హెచ్చరించి, యతండు వెండియు నిట్లనియె.

క॥ వివిధవ్యవహారములఁ జ
దువుపొంలెన్ మాను టొప్పదనుమీ! యవి తొం
టి విధమునన పెంపగుచుం
డపలయు, నయమునకుఁ దక్కుట యొకఁడు దక్కన్. ౧౮౧౬

వ॥ నీ వింతలు సెప్పెదు కాని, కూలివాలికిఁ దక్క, మఱి మహోద్యమం
బున కేల సారవు? నీవుట్టి విద్యాధికుని కవి యగునే? యని
యందువేని వినుము. ౧౮౧౮

తే॥ దైవ వశమునఁ జిక్కితి; దానికేమి?
కలదు నాకు మహోద్యమకాంక్ష; కాని
వేచియుందుఁ దఱికిఁ; గాదు వేగపడుట
నామతంబున; శాంతియ నా ధనంబు. ౧౮౧౯

క॥ విను నీ యశాంతికిన్ నా
మనము కలంగెడిని; బుద్ధిమంతుఁడవు, మహా
ధనశాలివి; తాల్మిఁ జదివి
కొనుము బుధులయొద్ద! వగపకుము! మేల యగున్. ౧౮౨౦

క॥ అని పల్కి, యాతనిన్ వీ
డ్కొని యబ్బుధవర్యుఁడు తన గుడిసెకుఁ బోయెన్;
మన మలర నమ్మనస్వి వ
చనముల నాధనికుఁడున్ బ్రశాంతికి నయ్యెన్. ౧౮౨౧

క॥ అని చెప్పి, యయ్యదుప్రభుఁ
డనర్గళవచోనిరూఢి నా ప్రజలెల్లన్
దనివిసనక విన, వెండియు
ననియెన్ దగ నెంతయేని నాదర మెసఁగన్. ౧౮౨౨

తే॥ ఈ జగంబున నరునకు నెందఱేసిఁ
గలరుపుత్త్రులు, బంధు, లాప్తులును సఖులుఁ,
గలవు పెక్కు ధనంబులుఁ; గాని యొక్కఁ
డేని నిజమునకున్ గాదు వాని కండు. ౧౮౨౩

వ॥ అది యెట్లందు రేని వినుండు—— ౧౮౨౪

క॥ వానివ యివి యన్నియు నగు
నేనియు, వానిన్ విడువక యేఁగవలయుఁ గా
దే నెఱి నెట్లేనియు మర
ణానంతర మతఁ డెచటికి నరుగు నచటికిన్ ? ౧౮౨౫

తే॥ గీ॥ అట్లగుటఁ గాన మేయుగమందు నైనఁ;
గాన మానవునకు నిజ్జగంబు నందు
నొక్కటియు లేదు నిజముగ; నొకఁడ వచ్చు;
నొకఁడ పోవు; నన్నియునుండు నున్నయట్ల. ౧౮౨౬

తే॥ సుకృత దుష్కృతవాసనాస్ఫురణము దగ
మానసం బొండ వెన్నంటి వాని తోడఁ
బోవు, నానావిధజ్ఞానపుంజ మంద
యిమిడియుండు మస్తిష్కమం దెట్టు లట్ల. ౧౮౨౭

తే॥ ఎంత ప్రజ్ఞాన మార్జించె నిజ్జగమున
మానవుం ? డంతయును వాని మానసంబు
నంటికొని, వానితోడన యరుగు; నిజము;
జ్ఞాన మనఁగ విద్యయ యంద్రు శాస్త్రవిదులు. ౧౮౨౮

వ॥ సహస్రారయంత్రసమాకృష్టంబులై, యంద రూపున్ దాల్చిన
నానావిధానంతకోటి ప్రతిబింబంబు లొకం బొకండుఁ గలిసి జ్ఞానపుం
జంబు నాఁబడుఁ; గావునఁ గవి భావనాలోకంబున బాటకొండు బడసిన
వివిధ జ్ఞానపుంజంబును వానితోడన మరణానంతరంబును వెన్నంటి
సను నటయుం దాశ్చర్యంబు లే; దిక్కారణంబున. ౧౮౨౯

క॥ మానవుని జన్మధన మనఁ
గానై నది విద్యయొకఁడ; కా వన్నియు; నె
వ్వానికి నది యలవడు నె
ట్లేనియు ? నాతండ భవ్యుఁ డెల్ల జగములన్. ౧౮౩౦

### శ్రీకృష్ణస్వామి యొక పూర్వగాథ యుపన్యసించుట.

వ॥ దీనికి నిదర్శనంబుగా నా యెఱింగిన యొక్క గాథన్ జెప్పెద, వినుండు ! కాశీపట్టణంబున మద్గురుదేవుం డగు సాందీపుం డధ్యక్షుండుఁగాఁ బొల్చిన గురుకులాశ్రమంబునం దేనును నానాదేశంబుల వారలకు పల్వురును, నానావిద్యల నభ్యసించుచు, నొక్క నాఁటి సాయాహ్న వేళ నే మందఱముఁ గలిసి, గంగాతీరంబునకు సని, యచ్చట నాటలఁ బాటలఁ దనివిసనక, సాల రాత్రి యగు నంతకు మసలి, పదంపడి వేగపడి వచ్చుచు, మార్గంబుఁ దప్పి, యమ్మహాపట్టణ పితృవన ప్రదేశంబు నడుమన్ బడి, తడవికొనుచుఁ, దిరిగి, తిరిగి, యం దొక్కెడ బలిసియున్న యొక మహావటవృక్షంబున్ నేరికొని, కొంతసే పచ్చట నిలిచితి ; మనంతరంబ యప్పాదపోత్తమాగ్ర శాఖనుండి. ౧౮౩౧

తే॥ గీ॥ వేదపాఠరవము మాకు వినఁగనయ్యె
స్వరము సెడక, గభీరత వమ్ముపోక,
యెంతయున్ స్పష్టముగ ; నిది యేఁటి చిత్ర ?
మనుచుఁ గలఁగితి మందఱ మడలుపుట్టి. ౧౮౩౨

తే॥ మాకు భయంబునకున్ దగ మఱియు మఱియు
వేదపాఠ రవము సాల వింత వింత
మార్పులన్ విన నగుచుండె మఱ్ఱినుండి ;
గడచె నిట్టు లొకముహూర్తకాల ; మంత. ౧౮౩౩

వ॥ ఏ నెల్లవారిభయం బుపలక్షించి, గుండె గట్టిసేసికొని, యవ్వేదరవంబు వినవచ్చుచున్న వృక్షభాగంబునకు దృష్టిఁ బఱపి, యం దెద్దియున్ గానవడకుండుటన్ జేసి, యది భూతంబు కా నోపునని శంకించి, దాని నుద్దేశించి, యిట్లంటి. ౧౮౩౪

తే॥ ఇమ్మెయిన్ మమ్ము వెఱపించె దేమి కోరి?
యెవ్వఁడవు నీవు? నీ తెఱంగెల్ల సెప్పు!
మెఱుఁగ మేమెవ్వరము నిన్ను నింత; కేము
వెఱతుమే యిందఱము? నేఁటి వెఱ్ఱితనము? ౧౦౩౫

క॥ నీ వేదరవం బాశ్చ
ర్యావహ; మిట్లగుట నొకమహాత్ముఁడ వనిసం
భావింతుము నినుఁ; జెప్పుము!
నీ వార్త యొకింత, యేల నీ కిట్లయ్యెన్? ౧౦౩౬

వ॥ మావలన నీ కెద్దియేనియుఁ బ్రయోజనంబు కలదేని, నీవృత్తాంతం
బుతో నదియు నెఱింగించి మేలువడయు; మట్లుకాక కేవలము
మమ్ము వెఱపించుట నీకుఁ బ్రయోజనంబేని వినుము. ౧౦౩౭

తే॥ శబ్దభేది ప్రముఖమహాస్త్రములు బఱపి
యేని, మంత్రతంత్రాదులనేని, నిన్ను
నణఁపఁ జాలుదుఁ మెవ్వర మనుచు మమ్ము
నిట్లు వెఱపింప సూచె దీ వెంతనేవు? ౧౦౩౮

క॥ నీ వేదరవముతో నిను
వావిరిఁ బొడిసేయఁ జాలువారల, మము నే
లా వెఱపింపన్ సూచెదు?
నీవ వెఱతు గాక! మావసికి మేమైనన్. ౧౦౩౯

క॥ అనుడు నది వేదరావం
బునకు సొరక, సాలభీతిఁ బుట్టినయది వో
లె నిలకుడిగి, మనుజాకృతిఁ
గనుపట్టుచు, మమ్ముఁ జూచి, కడుఁ బ్రియమెసఁగన్. ౧౦౪౦

తే॥ గీ॥ ఇట్లనియె మిమ్ము వెఱపింప నిట్లు వేద
పాఠమునకు నేఁ జొచ్చితన్ పల్కు కాదు;

నాకు నచ్చినభంగి, మనంబునొప్పి
సక్కఁదీఱ, నిమ్మెయి నొంటిఁ జదివికొందు. ౧౮౪౧

తే॥ మిమ్ము వెఱపింప నాకు నేమిపని ? యేఁటి
శంక ? దాన నాదురవస్థ సక్కపడునె ?
నాకునైన దుర్గతికిఁ మనంబునొవ్వ
నెప్డు నాలోన నేనయై యేడ్చికొందు. ౧౮౪౨

వ॥ వినుం డేను సాలకాలంబునకుఁ బూర్వ మిప్పట్టణంబున మేటి
బ్రాహ్మణుండ. ౧౮౪౩

శ్రీకృష్ణస్వామి యూరిప్రజలతోఁ గాటిరాకాసికథఁ జెప్పుట.

చ॥ చదివితి వేదముల్, సకలశాస్త్రములున్, మఱియున్ బురాణముల్
బదువుర నోరికెక్కితి ; నపారముదం బలరారఁ గ్రాలితిఁ ;
జదువున నాకు నేన ; మఱి సాటి యొకండును నాకుఁ బోలఁడన్
మదమును, దానితోడ నభిమానము రేఁపఁగ విఱ్ఱవీగితిన్. ౧౮౪౪

తే॥ ఆశ్రయించిరి నన్ను విద్యార్థు లెంద
ఱేని నక్కాలమున సాలఁ ; గాని మర్మ
మిచ్చి, యం దొక్కవిద్యార్థినేనిఁ బెద్ద
సేయుబుద్ధి పుట్టుటలే ; దసూయకలదు. ౧౮౪౫

వ॥ మఱియును.

తే॥ గీ॥ ఒక్కపూటయుఁ గడుపార నొక్కయతిథి
కేనిఁ బెట్టుపుణ్యంబున కెప్డుఁబోవ
నైతి ; సాల గడించి ; తన్యాయమునకు
పొచ్చుటయు లేదు ; మర్యాదచొప్పు కలదు. ౧౮౪౬

తే॥ రాజులు, ధనికు లెప్డు గౌరవము నూపు
వారు నావిద్యకున్ ; మఱి కోరికొన్న

యన్నియు నొసంగిపుత్త్రు రొండనక ; యెందు
నెట్టిలోపంబు బుట్టు లేనెన్నఁడెఱుఁగ. ౧౮౪౭

క॥ ననుఁ దర్కవాదమున మిం
చిన పండితుఁ డొకఁడు నేమిసెప్పఁడు లేఁ డెం
దును నాఁడు ; పులికి లేళ్ల
ట్లనయంబును వెఱతురు బుధులందఱు సాలన్. ౧౮౪౮

తే॥ గర్వమును, నిర్దయయు నాదు కానిగుణము
లనఘ ! నాజీవితంబునం దప్పు ; డవియ
కారణములయ్యెఁ గాటిరాకాసితనము
నాకు నిష్టిల్లగుట ; కేమనంగవచ్చు ? ౧౮౪౯

తే॥ నాఁడుపెట్టని యక్కారణమున నేఁడు
కడుపుమంటకునైతిఁ ; జీకాకువడదు ;
నేరి నేమన ? నాకర్మ మింతకాయె ;
నిప్పు డెంతతపించిన నేమిఫలము ? ౧౮౫౦

తే॥ చదువుసాల కలదుగాన శాంతికగుదుఁ
గొంతకొంత యప్డప్పు "డీ ఘోరమునకు
నేన కారణ ; మిది తీరు నెప్పుడేని "
నని తలంచి, యూరటఁగాంచ నగుదుఁగొంత. ౧౮౫౧

తే॥ ఎల్లధనములుఁ, జుట్టంబు, లింక నెవ్వ
యేని మానవునకుఁ గా వొకింతకుఁ ; జదు
వొకఁడయగు నెల్లజగముల ; నొండులేల ?
నని తలంతు నిష్ఠిల్లైన యనుభవమున. ౧౮౫౨

తే॥ కాటిరాకాసితనము నాకరణిఁ బడసి
నట్టివారెల్లఁ గలఁగుచు, నందు నిందుఁ

గడువుమంటకుఁ దిరుగుచుఁ, గాంచనేర
కుండ్రు శాంతిఁ, జదువులేమి నొప్పుఁదరిగి. ౧౮౫౩

క॥ ఉడుకుడుకు నా తెఱంగున్
మిడుకమిడుక సూచుచుఁ, దిగమ్రింగికొనుదు రె
వ్వుడు దుఃఖము ; వారలు నా
వడువునకున్ గారు ; తాల్మివట్ట రొకప్డున్. ౧౮౫౪

సీ॥ తర్కశాస్త్రాదిశాస్త్రంబుల చందంబుఁజర్చకు నొకపరి సక్కఁగొందు,
వేదపాఠక్రమ విధివిశేషాది విచారంబునం దొకసారె పొల్తు,
సకలపురాణవిస్తార కథాప్రపంచమునందు నొకమాటు సంచరింతు,
సారవేదాంతశాస్త్రమహోపదేశపద్ధతి కొకవేళఁ జిత్తంబునిత్తు
నిట్లు పలుభంగులన్ గూర్చి యెప్డుమంట
శాంతికయగుదు, నీకాని చందమందుఁ
గూడ ; విద్యయ నాకింతకున్ సతము వి
శుద్ధనిరుపమరక్షణసూత్రమయ్యె. ౧౮౫౫

వ॥ నాచందం బిప్పు డిట్టిద, కాన వేదపాఠంబునకు సొచ్చితిఁ, గాని మిమ్ము వెఱపించుటకుఁ గాదు ; నావలన నేమేనిఁ దెలిసికొనను, నాకు మేలుసేయను, మీకు మనంబు లగునేని రేపటిరాత్రినుండియుఁ గొన్నిరాత్రు లిచ్చటికి విచ్చేయుం ; డేను సాలనే పిట్లుండఁ బోలదు ; కావునఁ బోయెదనని చెప్పి, . యబ్బ్రాతం బదృశ్యంబై చనియెఁ ; బదంపడి తడవికొనుచు నొకభంగి నేము గురుమందిరంబుసేరి, మారాకకై యెదురు సూచుచుండు నమ్మహాత్మునికివ్వార్త నెఱింగించి, యతం డనుజ్ఞసేయ నమ్మఱునాఁటిరాత్రి మొదలుకొని, కొన్నిరాత్రు లబ్బ్రాతం బున్నయెడకుఁ బోయి, దానివలన నత్యద్భుతకర విషయంబులన్ గ్రహించికొని మేము

మేలుఁ బడసి, దానికి మేలుసేసితి ; మవి యెల్ల నిప్పుడు సెప్ప నవ
కాశంబు సాలదని యమ్మహావిద్వాంసుం డిట్లనియె. ౧౮౫౬

క॥ అభివంద్యంబగు విద్యా
ప్రభావమున్ వింటిరే ? పరమ మంత్రము స
ర్వభయంబుల నది ; విద్యా
విభవమ్ము మానుషమునందు విభవం బరయన్. ౧౮౫౭

శ్రీకృష్ణస్వామి విద్యాప్రభావంబున్ గూర్చి యుపన్యసించుట.

ఉ॥ ఎట్టి కురూపికేనియు ఘటించు సురూపముఁ గాంతినిచ్చి, యె
ప్పట్టుననేనియున్ జెడనిభాగ్యము, ప్రాణము మానుషంబు నం
దిట్టిది దీనిరూపమని యెవ్వరుఁ బోల్పఁగరాక, తెల్వికిన్
బట్టగు నాదిశక్తి పలుభంగుల విద్య జగంబు లన్నిఁటన్. ౧౮౫౮

తే॥ ఈయ నీయ మఱియుఁ బెంపు నెసఁగుచుండుఁ ;
దఱుగ దెన్నండునేని విద్యాధనంబు ;
బల్మినేని వంచననేనిఁ, బరులు దానిఁ
గొన సమర్థులుగా ; రంతకు నదియ యగు. ౧౮౫౯

తే॥ ఇష్ట బంధువుల యగుదు రెల్లప్రజలు ;
నెల్లదేశంబులందు లే దెగ్గు పుట్టు
టెందు విద్యాధికుని కతఁ డెంతపేద
తనమునకు నైన, మఱి కాని దశకు నైన. ౧౮౬౦

తే॥ తఱుగునకుఁ గాక, వలయునంతకును దాచి
కొన్న ధన మెప్డు విద్య ; పెక్కు సుఖములకు
మానవుఁడు దానగు ; లోకమాన్యతయును
బడయనగు విద్యవలనన బహువిధముల. ౧౮౬౧

తే॥ ఎప్పు డఱుగునకున్ స్మృతి, కెట్లుఁగాక
యెల్లజగమందు నొకభంగి నుల్లసిల్లు
కీర్తిలక్ష్మికి మానవుఁ గేవలమ్ము
గూర్చు విద్యయ; దానికిఁ గొఱఁత లేదు. ౧౭౬౨

తే॥ ఈ ప్రపంచంబునంద కా, కెల్లజగము
లందు నుజ్జ్వలశాంతిభాగ్యంబుఁ గూర్చు
మానవుని కెప్పుడున్ విద్య; మఱియు నా ప్ర
శాంతి భాగ్యంబునకుఁ గీ డెసంగ దెందు. ౧౭౬౩

తే॥ ఆపదలయందుఁ బరమాప్తునట్లు తోడు
సూపుఁ, దల్లివిధమునఁ బ్రోచున్, హితంబు
గఱపుఁ దండ్రి బలెన్, గులకాంతవోలె
నుల్లసిలఁజేయు విద్య పెంపొప్ప నరుని. ౧౭౬౪

తే॥ రాజులును, జక్రవర్తులు, బ్రజలు బహువి
ధంబులఁ బ్రశంససేయుచు, ధనము లొసఁగి,
పూజసేయంగనైన పొల్పునకుఁ గూర్చుఁ
బరమ శక్తిరూపమ్మై పరగు విద్య. ౧౭౬౫

తే॥ ప్రాణమునకును బ్రాణమై, భాగ్యమునకుఁ
బరమభాగ్యంబునై, శాంతి పదవికి మఱి
పరమపదమై, సమస్త ప్రపంచమందు
విద్య పరదేవతాకృతి వెలయుచుండు. ౧౭౬౬

తే॥ ఎంతవర్ణించినను సాల దింక మిగిలి
యుండు విద్యాప్రభావ; మే నొందు రెండు
పల్కులన సంగ్రహంబుగఁ బల్కి తిట్లు
దాని చందంబు; సాలు నింతకును నదియ. ౧౭౬౭

క॥ మానుషలక్ష్మికిఁ బ్రాణము
మానుగ విద్య ; యది విబుధమాన్యము ; శాంతి
స్థానము ; భాగ్యము ; దానికిఁ
గాని మనుష్యుండు రెండుకాళ్ల పశు విలన్. ౧౮౧౮

తే॥ విపులవిజ్ఞానకలితమా విద్య కెపుడుఁ
గాని బ్రదు కేఁటి బ్రదుకు ? లోకంబు కేవ
లంబు విద్యా విభవసముల్లాసగరిమ
నెసఁగ వలదే ? యవిద్య నశింపరాదె ? ౧౮౧౯

తే॥ వినుఁడు మీయందుఁ బల్వురు విద్యలేని
వారలట్ల తోఁచుచునున్న వారు ; మీ తె
ఱంగు పోలదు ; మేమూరి ప్రజల మనుట
కాదు ; విద్యకు నెవ్వరు కానివారు ? ౧౮౨౦

తే॥ ఇంతసేపు వింటిరకాదె యేను విద్యఁ
గూర్చి సెప్ప ? మఱియు రిత్త గూర్పనేల ?
మానుషము విద్యకొఱక ; నా మతము వట్టి,
చదువునకు సొరుఁ డది మీకుసాల గూర్చు. ౧౮౨౧

క॥ వీర యుపాధ్యాయులు, మీ
యూరి ప్రజలు గారె ? వీరి యొద్దన్ బ్రియ మొ
ప్పారన్ జదివింపుఁడు మీ
గారమున కైన బాలికా బాలకులన్. ౧౮౨౨

తే॥ పురుషులక కాక, యెందును బొలఁతులకును
బోలునే చదు ? వనరాదు ; పురుషులెట్టు
లట్లు యింతులుఁ జదువున కర్హ ; లోక
భంగి వనితల విద్యకుఁ బరగువారు. ౧౮౨౩

తే॥ ఇంతిలేని జగంబునా నేడ? పెద్ద
గాథ వలదు; మనలనెల్లఁ గన్నవార
లింతులేకద? వారికి నెట్లుఁ గాని
విద్యమన కేల? నది యేఁటివిధము సెప్పుఁడ? ౧౮౭౪

తే॥ "తల్లికిన్ లేనిసారంబు పిల్లకెట్టు
లబ్బు" ననెడి లోకోక్తికి నర్థమిందుఁ
గూర్పరాదనఁ బోలునే? కూర్పవచ్చు
ననుటయేల? దీనినకూర్చి యది జనించె. ౧౮౭౫

తే॥ స్త్రీలు నరకోటికిన్ గామి సెప్ప సాహ
సించు ధీశాలి కలఁడె? నచ్చియును, నచ్చ
కెవ్వరేసియుఁ బల్కఁడు "ఇంతులెప్డు
సదువునకుఁగాఁ" రని తడకచాటునుండి. ౧౮౭౬

క॥ వెలకలదె యించుకయు వా
రలపలుకుల? నేల నానరణి? యయ్యతివా
దులతో వాదమునకుఁ దిగ
వలదు; నిజంబునకు వార వత్తురుపిదపన్. ౧౮౭౭

తే॥ ఆత్మకున్ స్త్రీపురుషభేద మన నొకండు
లేదు మానుషమున; నది కాదు మఱియుఁ;
గాన సదువున కెల్లరుఁ గడఁగవలయు;
వెలయుఁ జుండు నరత్వంబు విద్యయందః ౧౮౭౮

క॥ మీసంతానంబున్ వి
ద్యాసారవిభూతి నలరు నట్లొనరింపుం;
డాసవలదె సంతతిపై?
నాసయనఁగ రిత్తపల్కు లగునే సెప్పుఁడా? ౧౮౭౯

క॥ మానుషలక్ష్మికొఱక సం
తానముఁ గా మనుట మేలు ; తగ నాయమ కే
ల్లేనియు విద్యయు ప్రాణము
నా నెఱుఁగుదు రింత కీరు నావచనములన్. ౧౮౦

క॥ మానుషమందు శునకసం
తానక్రమ మొప్పు ; దద్విధమునకు దిగునే
హీనుఁ ? డప్పశుధర్మిన్
మానవజాతిఘ్నుఁ డండ్రు మాన్యులగు బుధుల్. ౧౮౧

ఆ॥ గీ॥ అమితబాధ్యతాయుతము మనుష్యునకు సం
తాన ; మందుఁ గెలచి ధన్యుఁ డైన
వాఁడ యిహాపరముల వాసికి నగువాఁడు ;
మఱి నిజమున కతఁడ మానవుండు. ౧౮౨

వ॥ మీసంతతివారి యాయురారోగ్యతేజోబల విద్యావృత్తి సుఖంబు
లకు సామాన్యంబుగ మీర ముఖ్యహేతుస్వరూపులరు ; కాన మీ
బాధ్యతన్ గూర్చి, తెలిసికొని మఱి వర్తింపుఁడు ; దీనికిఁ గారేని
మీసంతానక్రమంబు శునకసంతానక్రమంబ యని చెప్పనగు,
వెండియు. ౧౮౩

క॥ తన బిడ్డల సౌభాగ్యం
బునకున్ గాని జనకుండు పోలన్ బున్నా
మనరకమున కెమ్మియుఁ ద
ప్పినవాఁడగు ? వాని కేఁటిపెం పరయంగన్ ? ౧౮౪

క॥ తనసంతతి సత్యున్నతి
కి నగు విధమునేయు తండ్రికిన్ గఱవే యెం
దును బరమసుఖము ? లాతఁడ
ఘనుండు, మాన్యుంతఁ, పేరుఁగలవాఁడుర్విన్. ౧౮౫

శ్రీకృష్ణస్వామి యూరి యుపాధ్యాయవర్గము నగ్గించుచుఁ బలుకుట.

తే॥ అరయ మీ యూరియుపాధ్యాయు లందఱుఁ గడు
నోర్పు, విద్యయుఁ, బేర్మియు నొప్పఁ బేరుఁ
బడసిన ఘనులు వోలెఁ గన్పట్టుచున్న
వారు; పాత్రముల్ మీ గౌరవమున కెపుడు. ౧౮౮౬

తే॥ వీరియొద్ద నెమ్మదిఁ జదివింపుఁ డెల్ల
వారు; వీరలకున్ మీరు, వీరు మీకు
నగు తెఱంగు మిక్కిలి లెస్స; యవ్విధంబు
నంద పటుతేజమున్ గాంచు నరయ విద్య. ౧౮౮౭

క॥ వీరన మాయూరి ప్రజల
కారే యని చుల్కనాడఁగా; దురు విద్యా
సారసకలజ్ఞు, లార్యు, లు
దారులు మఱి; వీరు పరమధన్యులు సుండీ! ౧౮౮౮

క॥ ఆగయ మీసంతానము
వారల భావిసుఖధర్మవర్తన విద్యా
సారజ్ఞానాదులకున్
వీరల యుపదేశమకద వెలయున్ గతియై. ౧౮౮౯

తే॥ వీరల మహత్త్వ మెట్టిదో విందు రీరు
వీరిఁ గూర్చి యే నేమేని విస్తరించి
పలుకు నప్దది; వీరి సద్భావ మెంత
సేపు సెప్పిన వెండియుఁ జెప్పనుండు. ౧౮౯౦

తే॥ వీరి సద్భావమున కగువిధము మీకు
వలయు ముందెల్లపనులందు; వారు వీరు
ననుటయేల? మీ కందఱికై నవారు
వీర సుండు! వేభంగుల; వేయునేల? ౧౮౯౧

క॥ వీరలకు నెల్లభంగుల
మీరలు కారేని, నిజము మీసంతతికిన్
వీ రెట్లునుఁ గా; రెమ్మెయి
వీరిన్ గండనుట? యేఁటి వెరవది మనకున్? ౧౮౯౨

క॥ ఏమేనిఁ బెట్టకుందు రె
భూమిపతులు వీరి కనుట పోలదు; ప్రజలం
దేమియు బుద్ధియనన్ లే
దేమోయది కాని? నృపుల కిక్కాలమునన్. ౧౮౯౩

క॥ వా రొండొరుల నణంపను
బోరులకున్ దిగినవా రిపుడు; సైన్యములన్
గూరిచికొను టొక్కఁడె పని
వారికిఁ; బ్రజలనఁగ నేఁటివా రరయంగన్? ౧౮౯౪

క॥ తమ పూర్వుల యాచార
క్రమమునకున్ సున్న వెట్టఁ గామిఁ, బ్రజల చి
త్తము వడయు నిదియు నొక్క నె
పముఁగా వా రిడుదు రీ యుపాధ్యాయులకున్. ౧౮౯౫

క॥ అదియేనియు నిమ్మాన్యుల
బ్రదుకునకున్ సాలు ననఁగరాదు కదా! వా
రి దయాదాక్షిణ్యముల కొ
లఁదిన పెరుగుఁ, దఱుగు వీరలకు నద యగు వోన్. ౧౮౯౬

తే॥ ప్రభువులకు విద్యయందు, ధర్మంబు నందు,
శ్రద్ధయేనిఁ బ్రజల ధన ప్రాణములకు
నేల హానిని బుట్టింతు రెప్డుఁ గాని
పోరులకు దిగి? బుద్ధి నా వారి కేడ? ౧౮౯౭

క॥ సకలప్రపంచసంక్షో
భకర మహావ్యసనమంద్రు ప్రాజ్ఞులు పో, రిం
తకు సర్వదుర్వ్యసనముల ;
నిఁక దానిన తవులు నృపుల నే మనవచ్చున్ ? ౧౪౯౮

ఆ॥ ప్రజల తలలు గొట్టి, బలముల గొఱక య
య్యర్థరాశులన్ వ్యయంబు సేయు
వారు ప్రభువు ; లట్టివార యుపాధ్యాయ
వర్గములకు నీగువారె ? యెట్లు ? ౧౪౯౯

వ॥ ఈయన్ దలంపుపుట్టినను యుద్ధంబులకె యంతయు వ్యయం బగుచుండ, నిఁక వారికి విద్యావిషయంబున సాలుకొలంది పెట్ట సాధ్యంబగునే ? కావున నేమేని నుపాధ్యాయుల పొట్టన్ బెట్టుదురు ; వెండియు. ౧౫౦౦

క॥ ఇది యట్టిద యగు కతమున
"బ్రదుకు సెడిన యాతఁడ బడి పంతు" లని ప్రజల్
బదివేల నోళులన్ బ
ల్కుదు ; రకటా ! వీరి కెంతగోరము పుట్టెన్ ? ౧౫౦౧

తే॥ సకలమానవకోటి విజ్ఞానవృక్ష
మూలములు, సాధు జీవనామోఘ నైష్ఠి
కులగు ధన్యులు, వీ రింతచులకనాడ
నైరె ప్రజలందు ? నేమందు ? నక్కటా ! కట ! ౧౫౦౨

తే॥ ఎన్నియేని సమర్పించి, యెంత యేని
భక్తి సూపి, కొల్చియునైనఁ బ్రజలు వీరి
ఋణము వాపికొనన్ లే రనేక కార
ణములఁ జేసి ; నిజం బిది ; నమ్ముఁ ! డీరు. ౧౫౦౩

తే॥ ప్రభుల యేమేని నిందురు ప్రజల మేలుఁ
గోరి వీరల కని రిత్త జేరములకు
సొత్తురయ్య! వీరల కోడ? నెత్తెఱఁగున
వీరి మేలు మఱతు రయ్య? మీర సెప్పుఁడ! ౧౯౦౪

క॥ చాలన్ మీ కగువీరల
మేలు మఱువ నైన ద? యని, మీ కరయంగాఁ
బోల దని, సెప్పి తింతకు;
మేలు మఱచు నట్టి ప్రజలె మీ రూహింపన్? ౧౯౦౫

క॥ కలవు మన దేశమున గురు
కులాశ్రమము లచట నచటఁ గొన్ని; ప్రజలు, రా
జులు వాని కగుదు రెప్పుడుఁ
బలుభంగుల లన దుదార భావము లొప్పన్. ౧౯౦౬

వ॥ వాని యందు నున్నతవిద్య వడయ నగు; నైననుఁ బ్రజలకెల్లఁ జేరువలం దవి లేవు; మఱియుఁ బ్రజలందఱు వాని యంద విద్య వడయ వలయునను శాసనంబును గా; దింతియకా కెల్లవారును వానియంద విద్యఁ బడయ నేగఁ గల్గుటయు, నవి భరింపఁ గల్గుటయు వినము, కనము, వినుండు. ౧౯౦౭

తే॥ ఎన్నియేని సౌకర్యంబు లెప్డు వాని
యందుఁ దమకుఁ గలుగ నుపాధ్యాయవరు, ల
నేకులు సుఖంతు రందుల నెందు బుద్ధి
వోక, మహనీయ శాంతికినై, కరంబు. ౧౯౦౮

తే॥ ఆ యుపాధ్యాయులకు వోలె నంతకు నగుఁ!
డెప్డు వీరలకున్ మీర లెల్ల; రాజు
లిచ్చునది సాలునే వీరి? కేఁటి యీవి
రాజులకు ఘోరసంగ్రామరతుల కరయ? ౧౯౦౯

తే॥ శాంతిమెయి నెప్పుడున్ బాలశాల యంద
యుండు వారుఁగ నొనరింపుఁ డోపి, మీర
లిమ్మహాత్ముల ; వీరికి నెందునేనిఁ
గొఱఁతవుట్టని భంగిఁ జెక్కు లోడఁ గూర్చి. ౧౯౧౦

క॥ ఏ రడుగువారు, నిచ్చెడు
వారున్ మీరు, నగుభంగి వల ; దడుగుదురే
నోరుసెడి వీరు ? యాచన
వీరికగునె ? యెంతవారు వీ రనవచ్చున్ ? ౧౯౧౧

వ॥ ఇచ్చినను గైకొన సిగ్గుపడువారు కొందఱును, రాజు లేమేని నిచ్చుచుండఁ బ్రజలవలనఁ గొననగునే యని ధర్మంబువట్టి కొందఱును, నొరులవలన నేమియున్ గొనమను నిష్ఠ వట్టు వారు కొందఱును, నుపాధ్యాయులందుఁ బలువురు కలరు ; వారి చందంబున కత్తెఱంగు లుచితంబుల ; కాని వీ రిట్టివారు కదా ! యని ప్రజలోక సెపంబునఁ దప్పికొనుట కూడదు ; వీరును సంసారంబునందున్నవారు, కాని సన్న్యాసులు కారు ; కావున మన కె ట్లట్ల వీరికిని బలువస్తువు లావశ్యకంబులు ; వానిన్ గూర్చికొనుట యందు వీరు పలు పాట్లకై శాంతికిన్ దక్కుదురు ; ఏ రశాంతి కగుదురేని మీ బాలబాలికలకు సముచితంబగు విద్య యబ్బదు ; కావున.

తే॥ బలిమినేనిఁ, మనసు పుట్టఁ బలికి యేని,
నెల్ల వస్తువులున్ గూర్పఁ డీరు వీరి ;
కిమ్మహాత్ములు శాంతిమై నెప్పు డుండఁ
గనుట కన్నఁ బుణ్యము వేఱ కలదె మీకు ? ౧౯౧౩

క॥ కలుగున్ మీ కేవస్తువు,
కలుఁగవలయు వీరికినది ; కాదని వీరల్

బలికినను మాను టొప్పదు ;
చలంబుఁగొని యేని యిచ్చుచందను వలయున్. ౧౯౧౪

వ॥ భగవంతునికిని, బ్రభువునకును, గురువులకు వీరికిని, సమర్పింపక
మన మేపదార్థంబును ముట్టరా ; దట్లేల నందురేని వినుండు.

క॥ మనపుట్టువులకు, నంతకు
ననయము నగువాఁడు కాఁడె యఖిలజగత్స
ర్జనపాలన శీలుఁడు, ధ
ర్మనేత, భగవంతుఁ, డఖిలమాన్యుం డరయన్? ౧౯౧౬

క॥ మనసుఖము తనసుఖంబుగ
ననయము విశ్రాంతినెఱుఁగ, కందఱకున్ మే
లొనరించువాఁడు కాఁడే
ఘనుఁడు ప్రభువు పరమధర్మఘటనాధికతన్? ౧౯౧౭

క॥ మానుషవికాసహేతు
జ్ఞానము నెల్లరకు నెపుడు సమకూర్పంగాఁ
దానయగువాఁడు కాఁడే
ధీనిధి గురుఁ డప్రమేయతేజుం డెందున్. ౧౯౧౮

వ॥ కావున.

క॥ తనియున్ సమస్తలోకము
లనయంబును వీరు తనియ ; నాచందము మే
లొనరించు సాల ; దానికి
నెనయగు ధర్మంబుఁ గాన మెల్లజగమునన్. ౧౯౧౯

శ్రీకృష్ణస్వామి యొకపేదరాలి యౌదార్యంబున్‌గూర్చి
యుపన్యసించుట.

ఆ॥ గీ॥ ఒక్కయూర విధవ యొకపేదరాలు క
లదు సుశీల, ధర్మలంపట ; సుతుఁ

తొక్కఁ డాయమకు సముజ్వలతేజస్వి
కలఁడు, బాలుఁ డార్యగణ్యబుద్ధి. ౧౯౨౦

వ॥ అబ్బాలుం డయ్యూరి పాఠశాలఁ జదువుచుఁ దనతోడి విద్యార్థుల
కన్నఁ జదువునందును బుద్ధియందును బెద్దయై, యుపాధ్యాయుల
యనుగ్రహంబున కగుచుండు; నిట్లుండ నొక్కనాఁడు. ౧౯౨౧

సీ॥ ఆపేదరాలికి నయ్యూరఁగల యొకభాగ్యవంతుం డీవిఁబరగువాఁడు,
పండ్లును, కూరలు బాలు ధాన్యంబులుఁ గొంచెము కొంచెముఁ
గోర్కికిఁ దగ । నిచ్చి, కరుణసూపె; నింతి వానిన్గొని, యెంత
యుఁబొంగుచు నిల్లుసేరి, । తన కూర్మిపట్టి కాదాత కరుణసెప్పి,
యేగె నొక్కపనికి నెచటికేని;
నిట్లు తల్లిసనన్, వానినెల్ల కూరుని
యిల్లుఁజేర్చి, యబ్బాలకుఁ డుల్లమలర
వచ్చి, తనపనికిఁ దాన మెచ్చుకొనుచు
నుండెఁ; దల్లియుఁ జనుదెంచె నింటువేడ్క.. ౧౯౨౨

వ॥ ఇట్లువచ్చి, యప్పేదరాలవ్వస్తువుల నింటనెందునుఁగానక, యేమియు
నెఱుంగనివాఁడువోలె నుల్లాసంబున సదువుకొనుచున్న యబ్బా
లుని బిలిచి, యింతకు నిఁటఁగల వస్తువులేమాయెనని యడుగు
టయు, నెంతయు నుబ్బుదోఁప వాఁ డిట్లనియె. ౧౯౨౩

తే॥ గీ॥ అమ్మ! నాతోడిబాలకులట్లు నేను
నిన్నినాళ్ళకు గురువుల కీయనైతి
నీవు తెచ్చినవన్నియు నిచ్చి; యింక
యేమిసేసినఁజేయు! మే నెట్లుబొంక. ౧౯౨౪

క॥ నను నెల్లబాలకులలో
మును నదివించున్ గురువులు ముదమున; నా చే

సినతప్పుల నెప్పుడు మ
న్ననసేఁతురు, తిట్టరొక్కనాఁడు నలుకమై. ౧౯-౨౫

తే॥ గీ॥ తండ్రి లేని బిడ్డఁడనని దయఁదలంచి,
పెట్టసూతు రేమేనియుఁ బ్రేమనెఱపి
వారు; వారిమేలు మఱువవచ్చు నెట్లు?
నే ననఁగ నెవ్వఁడన్? వారి కింతయేల? ౧౯-౨౬

క॥ అన నబ్బాలుని శీలం
బున, కౌదార్యంబునకును బొంగుచు, నిమ్మో
మనుదుగదే? నాతండ్రీ!
యని వానిన్ ముద్దుఁగొనుచు, నాయమ పలికెన్. ౧౯-౨౭

క॥ నాపాపపు సేతులతో
నోపనయితి మీగురువుల కొకవస్తువు మేల్
జూపుచు నర్పించికొనన్;
బాపఁడ! మన బ్రదుకు లేని బ్రదుకై యుంటన్. ౧౯-౨౮

క॥ గురువులకు మున్నువెట్టని
నరుఁడు నరుఁడె? వానిశవము నక్కలు ముట్టన్
దొరకొనునె? బ్రదుకునే య
ద్దురాత్మకుఁడు? వానిఁ గూడుదురె మతిమంతుల్. ౧౯-౨౯

వ॥ అని యప్పేదరాలును బిడ్డండును నింక నేమేనియు ననుకొనుచుండ, నబ్బాలుండు తనయింటఁ జేర్చిన వస్తువులకుఁ దోడు మఱికొన్ని వస్తువులన్ జేర్చి, వానినెల్లఁ బట్టించికొని, పరమశీలుండైన య య్యార్యి యుపాధ్యాయుం డచ్చటికి విచ్చేసి, నేఁ డిదియేమిభాగ్యం బని యులరుచున్న యప్పేదరాలికి సాదరంబున నవియెల్ల నిచ్చి, ప్రియంబుసెప్పి, యబ్బాలునిఁ గోపించువాఁడుఁబోలెఁ బలుకుచుఁ,

దోడ్కొని పాఠశాలకుఁ జనియె ; వింటిరే ? యప్పేదరాలి యౌ
దార్యంబని చెప్పి, యప్పరమాత్ముండు వెండియు నిట్లనియె. ౧౯౩౦

ఆ|| ఇట్టి గాథ లింక నెన్నియేనియుఁ గల ;
వేల వానినెల్ల నిప్డు విస్త
రించి చెప్ప ? మీర లెఱుఁగఁ గలుగు మంచి
ప్రజలరు ; గురులయెడ భక్తి కలదు. ౧౯౩౧

ఆ|| గీ|| శక్తికొలఁది నిండు ! సద్బుద్ధిమై గురు
వులకు ; బాలబాలికలకుఁ బుస్త
కములుఁ, బలకలుఁ, గణికలుఁ, గూర్చి దీక్షఁ బు
ట్టింపుఁడు ! సదవికొనఁ బెంపు సూపి. ౧౯౩౨

తే|| పాఠశాలకు దినముఁ దప్పక సముత్సు
కత్వమున బిడ్డ లేగు నక్కొని తెలుఁగు,
సేయుఁడు ! గురువులకు నది చెప్పుఁ ! డెట్లు
వారు సెప్పుదు ? రొనరింపుఁ డీరు నట్లు. ౧౯౩౩

క|| అనఘతరసారవిద్యా
ఖనినా మీయూరు పేరుఁ గాంచ వలయు, మీ
రు నఖిలలోకంబునఁ బెం
పును సొంపున్ బడయుఁ ! దివ్యబుధవరులకృపన్. ౧౯౩౪

వ|| అని చెప్పి, యప్పరమ బోధకుం డయ్యుపాధ్యాయులన్ జూచి.

క|| మీ విద్యార్థులకున్ స
ద్భావము బుట్టంగఁ గొంత పలుక వలయుఁ గా
దే ? వారల సూపింపుఁడు !
నావచనముఁ బట్టున ట్లొనర్పుఁడు ! నెమ్మిన్. ౧౯౩౬

వ|| అని చెప్పుటయు వారలు మహాప్రసాదంబని యమ్మహాజన సమూ
హంబునం దచ్చటచ్చట నెమ్మిన్ గూర్చొని, యప్పరమవిద్వాంసుని

గంభీరోపన్యాసంబున కలఁరు మొగంబులతోఁ, దమలోఁ దారేమేని మెల్లనఁ దడవి సెప్పుకొనుచున్న విద్యార్థుల నేరి యేరి, యొక్క మొత్తమ్మునకుఁ దెచ్చి, యేమేని మెల్లనఁ జెవి నూది, యమ్మహా పురుషుని యెదుట సక్క నిలుఁవన్ బెట్టుటయు, వారలన్ జూచి, యుల్లాసంబు రెట్టింప, నాలోకజ్ఞ శిఖామణి యిట్లనియె.

### శ్రీకృష్ణస్వామి విద్యార్థులకు హితోపదేశంబు సేయుట.

క॥ మీ కొక్కటి చెప్పఁ దలఁచి ;
తాకర్ణింపుఁ ! డది లెస్స నందఱుఁ ; దెలియన్
రాకున్న చోట్ల నడుగుఁడు !
చీకాకు పడఁకుఁడు ! శ్రద్ధ సేయుఁడు ! సాలన్. ౧౯౩౮

క॥ మీ గురువరు లింతకు మేల్
బాగందురు కాదె నా యుపన్యాసము నం
దే గాధకు సార ; కీరును
బాగని నా చెప్పినట్లు పట్టుఁడు ! బుద్ధిన్. ౧౯౩౯

క॥ ఇదె మీ వారందఱు మీ
చదువున కింతకును నా వచన మూఁదిరి ; మీ
బ్రదుక తమ కెల్ల భంగులఁ
బదివేలని ; రింక బాగుపడ మీ కయ్యెన్. ౧౯౪౦

క॥ వారలు మీ గురువర్యుల
నారాధింపుదురు మీకునై ; మఱి మీరున్
వారిమతము వట్టుఁడు ! మీ
మూరునకున్ బేరుఁ దెండు ! యోగ్యత మెఱయన్ ! ౧౯౪౧

క॥ మీవలనన మీ యూరున్
మీ వారున్, మీ కులంబు, మీ దేశంబున్
గేవలము మంచి దశలన్
వే విధములఁ బడసి, కీర్తి వెల యన వలయున్. ౧౯౪౨

క॥ పలు విద్యలుఁ బలుకళలున్
బలు తెరువులు మీకు బుద్ధిఁ బట్టించి సము
జ్జ్వల కీర్తిన్ మీగురువరు
లలరవలయుఁ గాదె మీర లందులకుఁ దగన్. ౧౯౪౩

క॥ ఇంతదనుక విద్యఘనత
నెంతయు రూపింపఁజెప్పి; తీయందఱితో
సంతసమున వింటిరి మీ
రంతయుఁ గద! యేల నింక నది బోధింపన్ ? ౧౯౪౪

క॥ కలదు సుఁడీ యంతమహిమ
యలఘుతరంబైన విద్యయం; దెంతటి వా
రలునున్ దాని ప్రభావముఁ
దెలిసి పలుక లేరు; కొంత తెలిపితి నిమ్మై. ౧౯౪౫

క॥ మీరలకద! దానికి నగు
వారలు మీకు నది పడయ వచ్చిన, మఱి మీ
సార ప్రభావ మెంతటి
వారికి నేనియును బొగడవశమే యెట్లున్ ? ౧౯౪౬

క॥ దేవతలు, వెండియున్ బితృ
దేవతలును, జాలఁ బ్రియము దీపింపంగా
దీవింతురు, మెత్తురు, మిము
మీ విద్యకు నలరి, యెప్డు మేలున కగుచున్. ౧౯౪౭

క॥ కవులకుఁ బరమసఖులు, భూ
ధవులకుఁ బూజ్యులును, బహువిధములఁ బ్రజాగౌ
రవపాత్రము, లగుదురు వి
ద్యవలన మీరెల్లఁ; బొగడఁ దరమే దానిన్? ౧౯౪౮

క॥ వే యేల నున్నతదశలు
మీ యఱచేతులన యొసఁగు; మీకు నసాధ్యం
బే యెడల నుండ సన; దన
పాయోన్నత విద్య మీరు బడసిర యేనిన్. ౧౯౪౯

తే॥ శ్రద్ధ సాలవలయు మీకుఁ జదువునందుఁ;
గా వొకప్పుడునున్ బెక్కు-గాథ; లేఁటి
గాథలవి? వాని కెప్డును గారు కారె
మీరు; చదువను పని యొండ మీకు వలయు. ౧౯౫౦

క॥ గురువర్యు లెద్ది బోధిం
తు? రది మదికి లెస్స నెక్కఁ దోరపుఁ దెల్విన్
బరగింపుఁడు! ప్రశ్నింపుం!
డరయంగా రానిచోట్ల నవి తేటపడన్. ౧౯౫౧

క॥ పలు కళలున్, విద్యలు, గా
థలు నీతులు నేర్చికొనుఁడు! తగు నేర్పు మెయిన్;
వల దెన్నఁడేని శ్రద్ధకుఁ
దొలఁగు విధం; బదియ కాని త్రోవలకుఁ గొనన్. ౧౯౫౨

తే॥ ఇంటనేని, వీధులయందునేని, నిందు
నందు, ననసేల? నెల్లెడలందుఁ, బాఠ
శాలయందుఁ బట్టెన్ మది నక్కనై మె
లంగుఁ! డవినీతులకు నగుభంగి కాదు. ౧౯౫౩

క॥ సోమరపోతుం దనను కా
దేమియు ; నది మీకు వైరి ; యెన్నంటను మీ
రేమఱకుండు ! దాని ; నొకట
నేమఱచినఁ జెఱుపఁజాలు నెల్లకుఁ దానై . ౧౯౫౪

క॥ కూడురుచికి, బలు నిద్రకు,
వేడుకలకు, నెందు మనసు వెట్టకుఁ ! డెప్డున్
గూడకుఁడు ? తుంటరుల ; బలు
కీడులకున్ వాండ్రు పొత్తు కేవలము నగున్. ౧౯౫౫

క॥ ఒకటిఁ గఱప, రెంటిఁ గఱచు
నకలంక ప్రజ్ఞవలయు ; నభ్యాసము దా
నికి మూలం ; బదియలవడ
సకలకళలు, విద్యలున్ బ్రశస్తిన్ గాంచున్. ౧౯౫౬

తే॥ శ్రద్ధ మిత్రుఁ, డాలస్యంబు శత్రువు, గురు
పాదసేవ నిష్కారతిఁ బరగు మీకు ;
నెప్డు నీ రెంటి చందంబు నెఱిఁగి సిద్ధిఁ
బడయుఁ ! డందుఁ దిరంబగు ప్రజ్ఞ సూపి. ౧౯౫౭

క॥ సారోజ్జ్వలవిద్యాసా
ధారోహణమునకుఁ బ్రజ్ఞ యధిరోహిణి నాఁ
బేరుఁగొని యున్న ; దదియు న
పారము, నత్యున్నతముఁ బ్రభావాస్పదమున్. ౧౯౫౮

క॥ ఆరయ విద్యాసాగర
పారము ముట్టింప నావ పగిదిన్ గడుఁ బ్రో
ల్పారున్ బ్రజ్ఞ నితాంత
స్ఫారౌజశ్శక్తి రేణుపటలభరితమై. ౧౯౫౯

క॥ స్ఫురదోజఃపటల నిరం
తర గగనతలంబు విద్య ; దానికిఁ దోడ్పై
సరిలేని రుచివెలుఁగు భా
స్కరమండల మొప్పుఁ బ్రజ్ఞకాదే తలఁపన్. ౧౯౬౦

క॥ సకల భువనాభివంద్య
ప్రకటోద్గ్రంథోల్లసదుదపానకలశయం
త్రకదంబము మేధాబల
మకలంకము సర్వతోముఖాతిశయంబున్. ౧౯౬౧

తే॥ ప్రాకటమహార్థసారతటాకకుల్య,
యంచితానేకభావగృహప్రదీప,
మతులసారంబు ప్రజ్ఞ ; మీ కదియ పరమ
సాధనము సుండు ! దానికి సక్కనగుఁడు! ౧౯౬౨

క॥ గురుశాసనమర్యాదా
భరితశ్రద్ధాంబుయుక్తిఁ బ్రజ్ఞాలత భా
సురభంగిఁ గ్రాలు విద్యా
తరువరమున ; మీకు నవ్విధము కడువలయున్. ౧౯౬౩

క॥ ప్రజ్ఞాఘనుండ నిజముగఁ
బ్రాజ్ఞుఁడు, ప్రాజ్ఞతయ జన్మఫలము ; జగద్వం
ద్యజ్ఞానవిశిష్టుఁడు గురు
నాజ్ఞ మెలఁగువాఁడు ; మీకు నది వలయుసుఁడీ! ౧౯౬౪

తే॥ ఆటలున్ బాటలున్ గురునాజ్ఞ నతని
సన్నిధిఁ జరుపుటది మీకు సాలలెస్స ;
యతఁడు కావనఁగావు ; మీ కతఁడ దేవుఁ ;
డన్నిఁటి కతండ యివియవి యనఁగనేల ? ౧౯౬౫

క॥ ఒడ్డారులుఁ గుక్కలున్ బలె
గండుమిగిలి, కలహమునకుఁ గాల్ద్రివ్వుట యె
న్నండును మీకుఁ దగ; దది
సండితనంబునకు మిమ్ము సక్కఁగ నీడ్చున్. ౧౯౬౬

క॥ లోకసమాకర్షణతా
ప్రాకటవినయంబు గురువరపదాంబుజసే
వాకలనతఁ బడయుం! డది
మీకుఁ బరమవిద్య; సాల మేలొడఁగూర్చున్. ౧౯౬౭

క॥ కోపించి పెక్కులాడిన,
రూపుసెడన్ గొట్టినన్, బరుషభావమునన్
రూపించిన, గురువరునెడ
నూపన్ జన దవినయంబు చొప్పెన్నండున్. ౧౯౬౮

క॥ వినయంబ ప్రమాణము సుం
డనయంబును విద్య; కెవ్వఁ డది తొడవుగఁ గై
కొను? వాఁ డఖిలభువనరం
జనమహిమన్ గ్రాలు; మఱి యశంబునకు నగున్. ౧౯౬౯

తే॥ గీ॥ ధర్మమం దెన్నఁడేని సెదరని నిష్ఠ
నలవరించికొనుఁడు! విద్యకదియు, దాని
కెప్పుడున్ విద్యయు, నగు టెంతేని లెస్స;
గురువరుల మీకు నా రెండుఁ గూర్చువారు. ౧౯౭౦

తే॥ ధైర్యమునకు నెన్నండేనిఁ దప్పు చొప్పు
కాదు; చాతుర్యము వలయుఁ; గార్యశూర
తయును గడులెస్స; యావేశ దైన్యమునకుఁ
జో టొసంగదు, పెంపున నూపుచుండు. ౧౯౭౧

కం॥ అనఘతరసారవిద్యా
తనువునకు విభూషణంబు తద్దయు సద్వ
ర్తన ; మా రెండును గురువుల
యనుగ్రహము వలనఁ బడయనైనవి మీకున్. ౧౯౨

తే॥ కాశికాపురి కాటికారాసికథ వి
ఱుంగవల్కితిఁ గాదె ; యెఱుంగనైరి
కారె యింతకుమున్ మీరు ? గాన విద్య
కెప్డు నగునది ధర్మమంచెఱిఁగికొనుఁడు. ౧౯౩

కం॥ మీభావంబు లుదారము
లై, భువనహితోజ్జ్వలక్రియా ఘటనసుదీ
ప్తాభరితములై యెంతయు
శోభిల్లన్ వలసియుండుఁ జుం ! డీమీఁదన్ ! ౧౯౪

కం॥ మీదేశభావి సౌభా
గ్యోదయమంతయును బేర్మి యొప్పారఁగ మీ
మీఁదన యుండున్ జుండీ !
కాదన కాచందమునకుఁ గందు ! గురుకృపన్. ౧౯౫

కం॥ మీదేశపుఁ బ్రభువుల మ
ర్యాదకుఁ దగ నేర్చి మెలఁగుఁ ! డంచిత ధర్మం
బాది మహావిద్యాధికు
లై, దైన్యముఁ దక్కి, పెద్దలై యున్నింటన్. ౧౯౬

కం॥ మానుషమునందు విద్య ప్ర
ధానం ; బది కూర్చు దేవతాదశ నెప్డున్ ;
దానికి, మఱి విద్యకుఁ గాఁ
డే నరుఁ ? డతఁడు పశువంటి నింతకు సాలన్. ౧౯౭

క॥ తప్పఁ దిరిగి, ధర్మమునకు
ముప్ప కరముఁ దెచ్చుచుండు మ్రుక్కడులన్ మీ
రెప్పుడుఁ గూడకుఁ ! డత్తెఱఁ
గొప్పదు ; మీ విద్య కది యయోగ్యతఁ గూర్చున్. ౧౯౭౮

తే॥ గీ॥ విద్యయందు, ధర్మమునందు, విపులబోధ
మందు మీ మానసము లుండు నట్టితెరువ
మీరు గైకొనవలె నది ; మీకుఁ బెక్క
గాధ లొప్పవు ; శాంతిభంగకరము లవి. ౧౯౭౯

తే॥ బ్రహ్మచర్యవ్రతము మీరుఁ బట్టుఁ ! డర్థి
నదియ యుజ్జ్వలసాగవిద్యాభివృద్ధి
కెల్ల మూలము ; దానికి నెవ్వరగుదు
రిందునందు జయముఁ గాంతు రెడ్డు వారు. ౧౯౮౦

తే॥ వీరె మీగురువర్యులు ; వీర సాల
జెప్పుదురు ; నే నొకించుక చెప్పి విడిచి ;
తింకఁ గఱుపంగ నగునవి యెన్ని యేనిఁ
గలవు ; వీరల యవి యెల్లఁ గఱపువారు. ౧౯౮౧

తే॥ ప్రాణమాదిగనైన సర్వస్వములు స
మర్పణముఁ జేసినను దీర దరయ గురు ఋ
ణంబు ; కాని యా ఘనుల మనంబుల కయి
ఘనమనస్వి శిష్యుఁడు దీర్చికొనఁ గలండు. ౧౯౮౨

క॥ వినుఁ ! డీ మీ గురువర్యులు
విను వా, రే నిపు డొకింత వినిపింపఁగ ; మీ
రును విందురు గా కెంతయు
మనంబు లుత్సాహసారమగ్నంబులుఁ గాన్. ౧౯౮౩

వ॥ అని యక్కరుణాసముద్రుం డవ్విద్యార్థిగణంబు నెడలఁ బరమవాత్సల్యంబు మెఱయ నుపన్యసించి, సారథిన్ బంచి, యమూల్యవస్త్రయుగంబులను హేమనిష్కసహస్రంబును దెప్పించి, యం దేనూఱు నిష్కంబులను వారలకు బహూకరించి, దీవించుటయు.

క॥ వారలు, నగ్గురువులు, న
య్యూరి ప్రజలు నమ్మహామహుని వాత్సల్యో
దార కృపాళుత్వములన్
భోరున వినుతించిరి, కడుఁ బొంగిరి మఱియున్. ౧౯౮౫

వ॥ అనంతరం బా జగద్రక్షణకళాధౌరేయుండు విద్యార్థులకు బహూకరించిన నిష్కంబు లేనూఱు వో, నింక మిగిలియున్న యేనూఱు హేమనిష్కంబులను, నయ్యమూల్యవస్త్రయుగంబులను నొక్క పెద్ద పళ్లెరంబునఁ బెట్టించి, దానిన్ సర్వలోకశుభంకరపాణియుగంబున నెత్తిపట్టి, య య్యుపాధ్యాయవర్గంబు సేరన్ బిలిచి, వారలలరుమొగంబులతో వచ్చి, తన కట్టెదుట నతివినయంబు దోఁప నిలువ, నిజాసనంబునుండి లేచి, నిలిచి. ౧౯౮౬

సీ॥ మానుషలక్ష్మీసమంచితోద్గమనాదిసౌకర్యకారణ జన్మఘనులు,
మానితానన్యసామాన్యవిలాసావహిమేమయోరుశాంతిలక్ష్మిప్రియులును,
సకలశాస్త్రప్రపంచవిహారనిపుణతాఘనబుద్ధిలక్ష్మీవికాసమూర్తు,
లఖిలప్రపంచ రహస్య సార జ్ఞాన లక్ష్మీమహాస్సముల్లసిత చిత్తు,
లెవ్వ? రా గురువర్యుల, రిద్ధ దీక్ష
నలరు బుధులరుఁ గారె? మీ రనఘులార!
యింట! కొనుఁ డతిభక్తి నర్పింతు నీ ప్ర
దేశనంబుఁ గృతజ్ఞత తేటపడఁగ. ౧౯౮౭

క॥ అని వారికి నందిచ్చుట
యును మా భాగ్యమన నింత యొప్పెడిని గదే?
యని పల్కుచు, మురియుచు, వం
దనములతోఁ గొనిరివారు తడయక దానిన్. ౧౯౮౮

తే॥ ఇట్లు గొని, యొక్కచో దానినిడి, శిరంబు
లందుఁ జే మోడ్పులొప్పఁ బ్రహర్ష వినయ
భాసురముఖులగుచు నా ప్రభాసముద్రు
నెదుట నిలిచి, వారలు విన్నవించి రిట్లు. ౧౯౮౯

క॥ మా తలలు మీనుతికి నగు
నే తలఁపగ? దేవరకృప కే మిపు డిమ్మై
నై తిమిగా; కే మేడ? వి
భూతి ఘనుల రీర లేడ? పురుషప్రవరా! ౧౯౯౦

తే॥ అఖిల భువనసముద్ధరణార్థాలసద
మానుషోరు తేజోనుపమాన లీలఁ
గ్రాలు దేవరవారి యకారణకృప
కై, పరమ ధన్యతన్ గంటి మనఘచరిత! ౧౯౯౧

తే॥ పరమ భవదీయ పరిచయ భాగ్యమునకు
నోచికొనమి, దేవరవారి నుతికి సాల
మైతి; మూరి ప్రజలము; యేమనగ నింత
కెవ్వరము దేవర నుతింప? నెఱుఁగ మెట్లు. ౧౯౯౨

క॥ మాకుఁ గృతజ్ఞుల రఁటె జగ
దేక మహాప్రభువుల రగు నీరు? కరుణామై
నీకరణి నానతిచ్చుట
యేకతమున నాయెనొక్కొ? నెఱుఁగము ప్రభువా! ౧౯౯౩

తే॥ అనుడు వారలఁ గూర్చుండుఁడని పలికి, ప్రి
యంబుమైఁ దానుఁ గూర్చుండి, యాదరంబు
మెఱయ నిట్లను నతఁ డతిమృదుమధురమ
నోజ్ఞమితవచనరచనానూనగరిమ.

శ్రీకృష్ణస్వామి ఉపాధ్యాయులతో సరసంబుగ సంభాషించుట.

తే॥ ఆర్యులు తమకుఁ దార యేమైన సెప్పి
కొందురయ్య ? ప్రజల యెఱుంగుదురుగాక ;
మీర లూరి ప్రజలరఁటె ? మేలు ! మాట
మెలకువకు సొచ్చితిరి నేర్పుమెఱయ నిట్లు. ౧౯౯౫

తే॥ యేను మీకుఁ గృతజ్ఞుండఁగానె ? యేల
నంటిరట్లని యింతకు నడిగితి ; రది
సెప్పవలయునె ? యదియ మున్ జెప్పుదున్ ; వి
నుండు ! బహ్వర్థములు గొనకుండు దాన. ౧౯౯౬

తే॥ ధర్మసంస్థాపనము నిమిత్తంబ యెల్ల
భంగులన్ బాటువడుదు ; నాపనికిఁ బ్రజల
యైనవారు ; ప్రభువులు కారండ ; రెవ్వ
రేని నొకకొందఱ యగుదు ; రింతనిజము. ౧౯౯౭

క॥ మానుషలక్ష్మి తనువునకు
మానితమగు విద్యయతల ; మాన్యులు, సర్వ
జ్ఞానులు, గురువుల కారే
దానిఁ బ్రజల కొసఁగువా రుదారతనెల్లన్ ? ౧౯౯౮

క॥ మీ రగ్గురువర్గంబున్
జేరిన మాన్యులర ; ప్రజల సేమమున కడున్
గోరెడి ధరాత్ములు ; రి
క్కారణమున నంటి నట్లు గౌరవము తగన్. ౧౯౯౯

క॥ అది తప్పే? మీరల నె
మ్మది నించుక చర్చఁజేసి, మఱి పల్కుఁడు! త
ప్పఁ దలంచి యట్లు నే వ
ల్కుదునే? మీ రగుదు రంతకుఁ; వేయేలా? ౨౦౦౦

క॥ చిరపరిచయ గౌరవమున
గురువర్యులమహిమఁ గొంతకొంత యెఱుఁగు; దె
వ్వ రెఱుంగ రుర్వి? మఱి యె
వ్వరు మీ కెందేనిఁ గానివా రూహింపన్? ౨౦౦౧

క॥ కవివరుల భావనాలో
క విహారప్రౌఢిఁ బ్రజకుఁ గఱపనొక్కో నా
నవతారముఁ గాంచిన త
త్త్వవిదగ్రణులైన దేవతల రీరుర్విన్. ౨౦౦౨

క॥ మీసేవకుఁ గా కెవ్వఁడు
భాసురవిజ్ఞానధనముఁ బడయఁగలం డు
ల్లాసకళాసంభృతమే
ధాసహితుఁడయ్యుఁ దనకుఁదాన ఘనుండై? ౨౦౦౩

తే॥ జ్ఞానసాగరాకర్షణశక్తిఁ బొలచి,
సారబోధనామృతవృష్టి సక్కనెల్ల
ప్రజల విజ్ఞానబీజాంకురము లెసంగఁ
జేయునట్టిది గురుఘనశ్రేణియకద. ౨౦౦౪

తే॥ ప్రజలునా దారువులయందు బహునిగూఢ
గతినెసంగు సుజ్ఞానాగ్నికణముఁ బరమ
బోధనోన్మథనాంచితస్ఫూర్తి వెలుఁగఁ
జేయుచతురులు భువి గురుశ్రేష్ఠులకద? ౨౦౦౫

తే॥ విమలబోధతేజోనిధిత్వమున సాలఁ
గ్రాలుచుఁ బ్రబోధనాంశు పరంపరా ప్ర
సారమహిమ నజ్ఞానాంధకార మణఁచి;
గురురవియకాఁడె జగతికిఁ గూర్పుఁదెల్వి? ౨౦౦౬

తే॥ సకలమహానీయశాస్త్రవృక్ష ప్రపంచ
మునకుఁ దేజంబు, సౌందర్యము నొడఁగూర్చి,
జగతికిన్ సద్గురుఁడను వసంతమూర్తి
కాఁడె మేలొనరింపుచుఁ గ్రాలువాఁడు? ౨౦౦౭

తే॥ కవిపరిశ్రమతరువు సక్కఁగ నెసంగఁ,
బల్లవింపఁ, బూయన్, గాయఁ, బండ, లోక
మునకు దానమేలుఁ గూర్ప, మూలమట్ల
పొలచువాఁడు గురుఁడుకాఁడె యలఘుబుద్ధి? ౨౧౦౮

తే॥ విమలబోధాంజనలేపనమున, గాఢ
మూఢతాంధత్వమునఁ గృత్యమునకుఁ జెడిన
ధీనయనమున, కుజ్వలదృష్టిఁగూర్చి,
జ్ఞాననిధిఁజూపు గురుచికిత్సకుఁడు కాఁడె? ౨౦౦౯

తే॥ సారబోధనోజ్వలతరచంద్రికా ప్ర
సారగరిమావిభూతి యొసంగ, సకల
జగము సద్గురుచంద్రుండు, శశ్వదురుక
ళానిధియకాఁడె యెప్డు నుల్లసిలఁజేయు? ౨౦౧౦

తే॥ పరమబోధనాంచితసౌరభంబు, సకల
శాస్త్రజాలానుభవసార సారముఁ, దగ
జ్ఞానఫలదానగరిమా ప్రశస్తి నెసఁగు
జగతి గురుఁడను కల్పవృక్షంబకాదె? ౨౦౧౧

తే॥ మానుషమునందఁ దేవత్వమహిమఁ గూర్పఁ
సంతతుఁడు దాన శాలి, ప్రశాంతిసుఖ స
మగ్రతఁ భూమిదేవుఁడై, యలరువాఁడు
సద్గురుఁడుకాఁడె సకలశాస్త్రచతురుండు ? ౨౦౧౨

తే॥ ధర్మదేవతాశ్రయతాత్మ్యదారసార
కాంతిగంభీరమేధావికాసభాస
మానగరిమావిభూతిసమగ్రతాఘ
నుండు, మాన్యుఁడు, గురుసత్తముండు కాఁడె ? ౨౦౧౩

తే॥ ఎంతవర్ణించినను సాల ; దింక మిగిలి
యుండు గురుసత్తముని మహిమోన్నతి ; మహా
నీయుఁ డాతండ మనుజులందెల్ల ; నతని
వలనన జగంబు పెంపొందవలసియుండు. ౨౦౧౪

తే॥ ఎన్నఁడేనియుఁ దీర్పంగ నెట్లుఁ జాల
దరయ నీసకలజగంబు గురుకులంబు
ఋణము ; వారలు తమ ధర్మమొంచి సంత
సింతు ; రింతియకాక యింకేమికలదు ? ౨౦౧౫

తే॥ గీ॥ మీర లఖిలార్థవిదులరు ; మీర చెప్ప
నగుదు రెల్లజగమునకు ; నైన నిపుడు
నేను ధర్మసంస్థాపన నిష్ఠ నెనఁగు
వాఁడఁ గాన నించుక సెప్ప వలసె మీకు. ౨౦౧౬

క॥ మీ రాదరంబుమై విను
వారే ? యనుడు విని, యెంతవారల మే ? మో
పూరుషవర ! యేమిటికని
యీ రిమ్మెయి నానతీయ ? నింత కగుదుమే ? ౨౦౧౭

తే॥ సకలజగదుద్ధరణసుదీక్షాఘనులరు
మీర లిట్లు కరుణఁ జెప్ప, మేము వినఁగ
నోఁచికొందు ; మంతియ ; కా దనుటకు మాకు
సాలునే తల ? యేఁటి మా సాహసంబు ? ౨౦౧౮

క॥ అని యయ్యోజ్ఞులు మిక్కిలి
వినయమొసఁగ లేచి, విన్నవించుటయును, మే
లని, కూర్చుండ వలికి, య
య్యనఘుం డిట్లనియె వార లందఱును వినన్. ౨౦౧౯

శ్రీకృష్ణస్వామి యుపాధ్యాయులకు హితోపదేశంబు సేయుట.

వ॥ ఏను మత్పరమగురుదేవులగు సాందీపమహాత్ముల యనుగ్రహంబునఁ
బడసిన విద్యానుభవంబున నించుక సెప్పన్ గోరుదు ; శ్రద్ధమై
నందఱును వినుండు. ౨౦౨౦

తే॥ పాఠశాల యాశ్రమముగఁ, బరమబోధ
నోల్లసనము తపంబుగ, నుజ్వలమగు
దీక్షఁ బరమర్షులట్లు శాంతిమెయి, సర్వ
జగమునకు మేలుసేయుఁడు ! సక్కమీరు. ౨౦౨౧

తే॥ ఇనుముఁ గనకంబుగ నొనర్చు నెట్లు సాల
వెరవు గల్గు రసాయనవేది ? యట్లు
మొఱకునేనియుఁ బండితముఖ్యు సేయ
నోపుదురు మీర, లురు శిక్ష నొసఁగి, తేర్చి. ౨౦౨౨

తే॥ విమల బోధనామృతవృష్టి వెల్లిఁగొలిపి,
మనుజుల నమరులన్ జేయు మహిమ మీకు
సాలఁ గలదు ; మీ పావన జన్మములకు
వదియ సముచితఫల మని యరయుఁ డెపుడు. ౨౦౨౩

తే॥ దేవలోకంబు వృద్ధిఁ బొందించువారు
కావునన మిమ్ము బుధులు భూదేవు లండ్రు;
నరకలోకంబు శుద్ధ శూన్యముగఁ జేయుఁ!
డెల్లవారు ధర్మాత్ములై యెసఁగఁ జెప్పి. ౨౦౨౪

తే॥ కవులుఁ, బండితులును, మహాకార్యశూర
వరులుఁ, దత్త్వవిదులు, ఋషివర్యు లాదిఁ
గాఁగల ఘనులు మీ శిక్షఁ గాంచి కాదె
యంతలేసి వారగుట మహాత్ములారా! ౨౦౨౫

క॥ మీ రింతకు నెందేనియు
లేర యనఁగ నైనచోఁ, బొలియదే త్రుటిలోఁ
బేరేడ నిజ్జగం? బా
గోరం బెన్నఁడును బుట్టకుండనవలయున్. ౨౦౨౬

తే॥ మానుషమునకుఁ జెడుదురు, మఱి మృగత్వ
మునకు వత్తు, రెట్లేనియు మొఱకులైన
మీరు మీ శిక్షకున్ గాక; వారి సంఖ్య
నరకలోకంబునంద గణ్యతకు వచ్చు. ౨౦౨౭

క॥ అట్టిదియీ లోకంబునఁ
బుట్టని తెలుఁగునకు దీక్షఁ బూనుఁ డెపుడు! మీ
యట్టి మహనీయ బుద్ధుల
పుట్టువు లందులక కావె పోల నరసినన్? ౨౦౨౮

తే॥ చదువు సెప్పు టొక్కఁడ యెట్లుఁ జాలదు; నను
వేల నది ధర్మమునకుఁ గాదేని? వలయు
నెప్డు నారెండు; వానిన యిచ్చి జగము
నుద్ధరింపుఁ! డప్పని మీక యొప్పు సాల. ౨౦౨౯

తే॥ చదువునేర్చి, దుర్నీతికిన్ సాల నైన
వాఁడ చెఱచు జగముఁ గడు; వానికన్నఁ
జదువులేని యతండ లెస్స; యిది లోక
మందు మనకుఁ బ్రత్యక్షంబ యరయ నిపుడు. ౨౦౩౦

ఆ॥ గీ॥ మీ ప్రవర్తనంబ మేటి ప్రమాణమై
జగతికిఁ దగ విమల సారధర్మ
నిరతనుండుఁ! డెల్లనీతులు ధర్మంబు
నంద తేజముఁగన నైన నరయ. ౨౦౩౧

తే॥ ధర్మమునకుఁ గలవు వివిధంబులైన
రూపములు; వానిఁ జాల నేర్పుమెయి నెఱిఁగి,
యెఱిఁగినట్ల వర్తింపుచు, నెల్లవారి
నట్ల వర్తింప బోధింపుఁ! డధిక దీక్ష. ౨౦౩౨

తే॥ చదువుతో నెల్లకళలను సాలదనుకఁ
గూర్చి, కఱపుఁడు! విద్యార్థికోటి శీల
మునకు, బ్రదుకుఁ దెరువుల కిమ్ములఁ దగంగ,
నీతి తోడవయి వాని యన్నిఁట రహింప. ౨౦౩౩

తే॥ కాపుఁ, బ్రభువును, గురువును, గవియు నాఁగ;
లోకమున కగువారు నల్వుర తగంగ;
సాల బాధ్యత కగువాఁడు సంతతంబు
వారిలోఁ గురుఁ; డిది నిక్కువంబు సుండు! ౨౦౩౪

తే॥ ఎల్లమానవకోటికి నేను యగుడు
మిదియ మా ధర్మమని మీర లెంచి, మార్గ
దర్శకుల రగుఁ దుర్విశకంతకును సత్ప్ర
వర్తనంబు నుచితగౌరవంబును దగ. ౨౦౩౫

తే॥ సహజ మనుకరణంబు మానుషంబునందుఁ ;
బరిసర ప్రభావంబును బరిణతిఁ గను
చుండు దానన్ మఱియుఁ ; గాన నోలి మీర
లెప్డు నా రెంటి కగుఁడు ! మే లెంచి ! శౌరి ! ౨౦౩౭

తే॥ అనుకరణమ యభ్యాసమం డ్రార్య లోక-
భంగి ; సాంగత్యమున్ మఱి పరిసర ప్ర
భావ మందు ; రీ రెంటిని బరగసేఁత
తగుఁ, బ్రజలఁజేర్చికొని, మార్గ దర్శకులయి. ౨౦౩౮

తే॥ విద్యతోన సద్వర్తనవిధము మీర
యెప్పుడు నిదర్శనమునకై, యెల్లవారి
కెఱుఁగ బోధింపుఁ, డప్పని కీర తగుదు ;
రొరులు కారు ; మీకది సాలనొప్పుఁగూర్చు. ౨౦౩౯

వ॥ దీనికి నిదర్శనంబుగా నొక్క యితిహాసంబు జెప్పెద ; వినుండు.

శ్రీకృష్ణస్వామి శంఖలిఖితుల ధర్మప్రకారం బుపన్యసించుట.

తే॥ గీ॥ తొల్లి శంఖుఁడు, లిఖితుఁడన్ దొడ్డ ఋషులు
కలరు ; వారల శంఖుఁ డగ్రజుఁడు ; లిఖితుఁ,
డనుజుఁ ; డొక్క నదీతీరమందు వారి
యిరువురకుటీరములు సాల నింపెసంగు. ౨౦౪౦

క॥ వారల యాశ్రమములు భువిఁ
బేరున్ బడసినవి బహునిబిడతరనానా
భూరుహగుల్మలతాసము
దారలసద్విభవమండితములై యెపుడున్. ౨౧౪౧

తే॥ ప్రకృతి బహుచిత్రసృష్టిప్రభావమునకు
నవమనోజ్ఞతఁగూర్చి, నానావిధస్వ

సృష్టిచాతుర్యమం దెసఁగించి, రమ్మ
హానుభావులు మిక్కిలి యద్భుతముగ. ౨౦౪౨

క॥ అమిత ప్రశాంతి కర్యా
శ్రమములు నుతిసేయనై యెసంగిన సంస్థా
నములు, వివిధచేతనవ
ర్గములకు నానందసారకాంతిప్రదముల్. ౨౦౪౩

తే॥ అమ్మహర్షి ప్రవరుల శిష్యవ్రజంబు
లా జగన్నుతసారతరాశ్రమంబు
లంద యధ్యయనముసేయు నఖిలవేద
శాస్త్రముల శాంతిసంభృతోత్సాహగరిమ. ౨౦౪౪

తే॥ అతులమహిమావిభూతిఁ బెంపలరువార
యమ్మహర్షిప్రవరు లిర్వు; రందు శంఖు
మహిమ వర్ణనాతీత; మమ్మాన్యుఁ డెంత
కేనియున్ జాలుఘనుఁడు; వేయేలఁ గూర్ప. ౨౦౪౫

వ॥ అప్పరమర్షివర్యుం డొక్కనాఁ డెందేనియుఁ జనువాఁడై, కొందఱు
శిష్యులన్గైకొని, తక్కనశిష్యుల నాశ్రమంబునంద నిలువ నియో
గించి, మఱి చనియె; నతండు సన్న మఱునాఁడు. ౨౦౪౬

తే॥ శిష్యగణములతోడ విచ్చేసిరి ఋషి
సత్తములు కొంద అమితతేజమునఁ గ్రాలు
నా లిఖితుఁజూడ; నాతఁ డత్యాదరమున
వారిఁ బూజించి, కడు గారవంబు నెఱపి. ౨౦౪౭

వ॥ వారితోఁ గొంతసేపు గోష్ఠిసేసి, తన యాశ్రమంబునందు వార
లకు సాలునన్ని ఫలమూలంబులు లేమింజేసి, తనపనికి నగ్రజుండు
సంతోషించున కాని కినియుండని తలంచి, శంఖుని యాశ్రమంబు
సొచ్చి, తచ్ఛిష్యులకుఁజెప్పి, వారు సూపింప, వలయునన్ని ఫల

మూలంబులు తన శిష్యులచేతఁ దెప్పించికొని, యచ్చటనుండి వెడలి
నిజాశ్రమంబు జేరి, యా ఋషిశ్రేష్ఠులను దచ్ఛిష్యులను దనిపి,
వారు నన, వారిన్ బ్రశంసించుచు శిష్యులును దాను నుండునంత.

తే॥ వచ్చె శంఖుండెలమి శిష్యవర్గసహితుఁ
డై ; పరమభక్తిమెయి నమ్మహర్షి కెఱఁగి,
మునులరాకయు, నమ్మహాత్ములకుఁ దాను
సంఘటించినవిధమును సక్కఁ జెప్పి. ౨౦౪౯

వ॥ లిఖితుం డూరకుండుటయు, నమ్మహాత్ముండు చాలసేపు విచారించి
తమ్ముని కిట్లనియె. ౨౦౫౦

తే॥ తప్పుఁ జేసితి ; తమ్ముఁడా ! తగునె యివ్వి
ధంబు సకలజగద్వంద్యధర్మశాస్త్ర
వేదివగు నీకు ? మనము యివ్విధమునను సా
రంగ మఱి యేడ ధర్మశాస్త్రముల ఘనత ? ౨౦౫౧

తే॥ మన ఋషికులంబకాదె సమస్తధర్మ
శాస్త్రనిర్మాణగరిమా ప్రశస్తి కగుట ?
దానిని గొనియకాదె భూధవులు ప్రజల
నెల్ల ధర్మనిరూఢి శాసించుటరయ ? ౨౦౫౨

తే॥ ఇట్టి మనము శాస్త్రంబుల కెదిరినపుడ
నేమిపుట్టునొ జగతి నూహింపవైతి ;
వడుగ కొరుల సొమ్మున్ గొన నగునె వార
లెప్డుఁ దనమాట సెల్లించు నిష్టులైన ? ౨౦౫౩

వ॥ ఏనును నీవు నేకోదరజాతులమయ్యు, నిప్పుడు వేఱువేఱ యాశ్రమ
ధనంబుల నున్నవారలమగుట నీభావంబు సక్రమంబు కాదు ;
వెండియు. ౨౦౫౪

తే॥ ధర్మసూక్ష్మవిధంబు లుదారము; లవి
యెప్డుఁ గాలముతోడన యెన్నియేని
మార్పులకు నగుచుండుఁ గ్రమక్రమముగ
నాఁడ నేఁడు మఱియు నేఁడ నాఁడుఁగామి. ౨౦౫౫

తే॥ శాస్త్రకారుం డెపుడుఁ దన శాస్త్రమునకుఁ
దాన యెల్లవిధముల నిదర్శనమున
కగుట యెంతయు నొప్పుఁ గా; కతఁడు తప్పు
వాఁడయగునేని మఱి సెప్పవచ్చు నెట్లు? ౨౦౫౬

తే॥ మనము కామె యీ శిష్యసమాజములకు
మార్గదర్శకులము; మన మంచితనమ
యిట్టులుండ, వీరికి మఱియేమి సెప్ప
వచ్చు? వీరు చేటున కగువారె? చెపుమ! ౨౦౫౭

తే॥ ఎంతబాధ్యత కలదో నీ వెఱుఁగనైతె
గురుకులమువారికిఁ? వార కూర్చువాడు
మేలునాఁ గీడునా రెండు మేదినికి న
వశ్య మెల్లరు వారలవార యగుట. ౨౦౫౮

వ॥ కావున నీవు రాజు సన్నిధికి సని, నీ చేసిన తప్పుఁ జెప్పికొని, సము
చిత దండంబు వడసి, దోషంబు వాపికొని రమ్ము! పో! మ్మనిన
విని లిఖితుం డన్న కిట్లనియె. ౨౦౫౯

తే॥ నీవునున్ ధర్మశాస్త్రప్రణేతలగు మ
హర్షివరులం దొకండ, వత్యంతమహిమ
నలరు ఘనుఁడవు; నా దోష మట్టిదైన
నీవ శిక్షింపఁగాదె దానికిఁ దగంగ. ౨౦౬౦

వ॥ అనుడు నతండు సకలలోకంబు శిక్షింపను, రక్షింపను, ప్రభుత్వంబు రాజునంద కాని యన్యుల యందు లేదు ; మహర్షివర్యులు కాలంబునకుం దగ ధర్మశాస్త్రంబులు గల్పించి, రాజుల కొసంగువారు ; కాని యన్నిఁటికిం దార కారు ; రాజు లా ధర్మశాస్త్రంబుల ననుసరించి, ధర్మంబుఁ బాలింతురు ; కాన నీవు రాజు చేతన దండింపఁబడుదువు గాక ! యనుటయు, విని లిఖితుండు రాజు సన్నిధికిఁ జన నుంకించుటయు, నతనితోఁ దచ్ఛిష్యులును శంఖుని శిష్యులలోఁ బలువురును వారలధర్మనిష్ఠ కచ్చెరువందుచు నడువన్ దొడంగి ; రిట్లు పలువురు శిష్యులతోఁ బయనంబు సాగించి, యతండు రాజున్ దర్శించుటయు. ౨౦౬౧

తే॥ సంభ్రమము దోఁప, నెదురేగి, సముచితమగు
గౌరవము సూపి, తగ నమ్మహీరమణుఁడు
శిష్యయుతముగ నా ఋషిశ్రేష్ఠుఁ బూజ
సేసి, వచ్చినపని మఱి చెప్పుఁ డనియె. ౨౦౬౨

వ॥ నావుడు నా ఋషిశ్రేష్ఠుం డిట్లనియె. ౨౦౬౩

లిఖితుఁడు రాజుతోఁ దన తప్పుఁజెప్పికొని, శిక్షింపఁ గోరుకొనుట.

ఉ॥ ఏ నొకతప్పుఁ జేసి ; తది యిప్పుడు సెప్పఁగ నయ్యె ; నొప్పుమై
దాని తెఱం గెఱింగి, యుచితంబుగ దండితుఁ జేసి పుచ్చు మో
మానవనాథ నన్ను ; నిది మాపనికాదని, ధర్మనిష్ఠకుల్
బూనక, తేలఁ బల్కు టొగిఁ బోలదు సు ! మ్మది మున్న చెప్పితిన్.

వ॥ అనుడు నబ్భూపాలుం డాశ్చర్యంబు సూచింపుచు, నితం డిట్లేల ననియె ? నని చాలదూరంబు విచారించుచు, నతని కిట్లనియె.

తే॥ ధర్మశాస్త్రవినిర్మాణదక్షులరును,
బరమ పావనసారతపఃప్రభావ

ఘనులరున్, మీరర కారె? లోకమునకెల్ల
మార్గదర్శకులరు, సుధీమాన్యులరును. ౨౦౬౬

తే॥ ఇట్టి మీరు తప్పొనరించు టేమిటి కగు?
నెప్పు డట్టిది పుట్ట; దె ట్లేని నొక న
పంబు వెట్టి, నన్నున్ ధర్మపాలనంబు
నందు నిట్లు పరీక్షింప నాత్మఁ దలఁచి. ౨౦౬౭

క॥ అరుదెంచితిరని యింతకు
నరయంగా నయ్యె; నేఁటి కంతకుఁ దిగ? మీ
రురు మహిమాఢ్యుల; రే మీ
పరీక్ష కెట్లేనిఁ జాలఁ బరమర్షివరా! ౨౦౬౮

ఉ॥ ఏన యనంగనేల? మఱి యీ యఖిలావని మీ పరీక్ష కే
మానవ నాయకుల్ మనుజమాత్రులు సాలరు; మాకతనైన వి
జ్ఞానము నాఁగ నెంత? యిఁక శక్తులఁ గూరిచి యేల సెప్ప? నె
ట్లేనియు ధర్మమందు మము నెప్పుడు నిల్పితి రీర యింతకున్.

క॥ అయినను బనిఁగొని యెట్లే
నియు నోపుకొలంది మీ పనిచినట్ల కడుఁ
బ్రియమున సేయన తగు మా;
కయుక్త మిది, సేయఁ బోల, దనరా దెప్డున్. ౨౦౭౦

తే॥ కాన, వచ్చినపనిఁ జెప్పి, కరము నన్ను
ను గ్రహింతురు గాక! యనుడు నిదేఁటి
కింతగాధఁ బేర్వంగ? నే నెట్లు నిన్ బ
రీక్ష సేయంగ దిగుట లే; దింత నిజము. ౨౦౭౧

క॥ ఎఱిఁగియుఁ బ్రమాదమున బడి,
ఎఱుఁగని వానిఁ బలెఁ జేసి తే నొకదోషం;

బెఱిఁగి, యిప్పుడు దానిన్ గ్ర
చ్చుఱ వాపికొనంగ బుద్ధి సమకట్టి, తగన్. ౨౦౭౨

క॥ నీ యొద్దకు వచ్చితి ; నను
న్యాయసరణిఁ బేర్చి, దండనము సమ బుద్ధిన్
జేయుము ! ధర్మము కర మ
త్యాయతగతి వెలయ, లోకులందఱు నెఱుఁగన్. ౨౦౭౩

క॥ చెప్పొదు నే నా త ? ప్పేఁ
జెప్పిన యాపిదప నేమిసేయుటకున్ గా,
కొప్పు మెఱయఁ బల్కుచు, నెదఁ
దప్పఁ దలఁపుఁ బెట్టికొనమి తథ్యంబ కదా ! ౨౦౭౪

క॥ అనుడు నతఁ డిమ్మహాత్మం
డనఘుం డిట్లేలఁ బేర్చి యాడఁ దొడఁగె ? నే
మనువాఁడ ? నితని చందం
బునకున్ గా దనఁగ నెట్లుఁ బోలమి తోఁచెన్. ౨౦౭౫

వ॥ వినియెదన్ గాక యని, యప్పరమముని నుద్దేశించి, మహాత్మా !
మీ రెట్లు చెప్పిన నట్ల చేయుదుఁ ; గాదన నగునే ? యాజ్ఞ యిం
డని య బ్భూపాలుండు వెల్లనగుచు విన్నవింప, విని యత్తాపసో
త్తముం డిట్లనియె. ౨౦౭౬

ఆ॥ ఇంత వెల్లనగుట యేల ? నీ కేఁటిభ
యంబు ? ధర్మమునకు హానివుట్ట
కుండ బుద్ధిఁ బట్టు ! మొండనఁ బోలునే
నాకు నిన్నుఁ గూర్చి నరవరేణ్య ! ౨౦౭౭

వ॥ అని తనచేసినదోషంబును, దానికిఁ దన యగ్రజుండు చెప్పిన చం
దంబును, బూసఁ గ్రుచ్చినట్లు నక్క వివరించి సెప్పుటయు, విని

యన్నరేంద్రుండు కొంతతడవు విచారించి, యమ్మహాత్ము నుద్దే
శించి, యిట్లనియె. ౨౦౭౮

ఒకరాజునకు లిఖితునితో ధర్మసూక్ష్మవిషయంబైన సంవాదక్రమము

తే॥ ధర్మసూక్ష్మ ప్రకారమంతయును మీరు
చెప్ప నేను పాటించుట సిద్ధ; మత్తె
ఱంగు మీరలు సక్క నెఱుంగువార
కాదె? కాదన మీకన్న ఘనులు కలరె? ౨౦౭౯

తే॥ నిగ్రహానుగ్రహంబులు నృపున కెప్డు
వలయు; నా రెంట నెయ్య, దెవ్వానియందు,
నెప్పు, డే చందమరసి, పాటింపవలసి
యుండు? నతఁ డట్లు గైకొనుచుండువాఁడు. ౨౦౮౦

వ॥ ధర్మసూక్ష్మంబు లనేకవిధంబులై యుంట మీ రెఱుంగనిది కాదు;
శిక్షించుటయందు మాకెంత యధికారంబు కలదో? రక్షించుట
యందు నంతియకలదు; కావున మీరు దోషయుక్తంబని చెప్పిన
యప్పని, మాకు క్షమింపనయ్యెనది; మీయందు దోషంబు లేదు;
చనుండనుటయు నమ్మహాత్ముండు సంతసింపక రాజుతో నిట్లనియె

క॥ సమబుద్ధి నీకు లేనివి
ధము నీవిట్లనుటయంద తగ నెఱిఁగితి; ధ
ర్మము మొగమోటమియం దో
టమిఁగాంచుట నిక్క; మిట్లొడంబడ నగునే? ౨౦౮౨

వ॥ నీ ధర్మంబుఁ దలంచి, నన్ను దండింపు మనవుడు నమ్మహీవల్లభుం
డమ్మహాత్మున కిట్లనియె. ౨౦౮౩

తే॥ రాజుల కనుగ్రహంబు ధర్మంబు గాద
యేని, నది ధర్మశాస్త్రమునం దెట్లు సేర్చ

వచ్చు? దానికి నేమి? కేవలము మీఁదు
దోషులరె? మీఁపనిన్ లేదు దోషబుద్ధి. ౨౦౮౪

వ॥ కేవలముఁ గార్యంబున్ బట్టి యన్ని యెడల దోషంబు నిర్ణయించుట ధర్మంబుగాదు, భావంబున్ బట్టి కొన్నిచోట్ల ధర్మంబు నిర్ణయింప వలసియుండు; మీ భావశుద్ధిన్ గూర్చి, యేన చెప్పవలయునే? మీర యెఱుంగుదు; రది యట్లుండనిచ్చి, మీయానతిన్ దలఁ దాల్చి, మిమ్ము దండింతు నన్నను, నదియుఁ బోలదయ్యె, నది యెట్లనిన నొక్క ధర్మాత్ముండు ప్రమాదంబున నొక్కతప్పుఁజేసిన నీతఁ డిట్లుచేసెనే? యిది ధర్మబాహ్యంబకాక మఱి యే? మని యతని నప్పనికిఁ దగ దండించుట పాడియగునే? కాదు, చెప్పి పంపించినన్ జాలు; నతం డప్పనికిఁ బశ్చాత్తాపంబునఁ గ్రాగుచు, నింక నెన్నండు నట్టిది సేయకుండు; ధర్మసూక్ష్మప్రకారంబు మీ శాస్త్రంబులం దిట్టిదియైయుండ, సకలలోకమాన్యులరగు మిమ్ము నా దోషంబుకాని దానిన్ దోషంబని నిర్ణయించి, దండించుట ధర్మంబో? కాక యధర్మంబో? మీర యరసి, యాజ్ఞ వెట్టనగుదు రనవుడు నత్తాపసోత్తముం డతని కిట్లనియె. ౨౦౮౫

తే॥ నీవు పోల్చినదంతయు నిజము; నా యె
ఱుంగమికిఁ దగునట్లు నేర్పుమెయి, నీకుఁ
బోలినట్లు దండించి నన్ బుచ్చు! మేఁటి
కొక్క? యత్తెఱఁ గందేనియు మఱి వినుము. ౨౦౮౬

తే॥ చూడు! మీ మాయనుంగు శిష్యులను వీరి;
వీరకాక యాశ్రమమున వేలకొలఁది
కలరు; వీరికకాక, లోకమునకెల్ల
నేము మార్గదర్శకులము గామెయెట్లు? ౨౦౮౭

వ॥ మాభాఁబుభంగి యెట్టిదైనను మాశిష్యుల నేమంబకోరెడి మాకు మాపనికిఁ దగినదండంబ కర్తవ్యంబు; కావున నీ వొండనక దం

డింపు ! మనుటయు, మాఱాడనోడి, యతండు కటకటంబడుచు, నమ్మహాత్ముని హస్తంబులు రెండు నఱికించి, విడిచిపుచ్చె ; నని సూచి, యందఱు ప్రజలట్ల తారును గాఢవిస్మయవ్యాకులచిత్తు లగుచుఁ, దచ్ఛిష్యు లప్పరమధార్మికు ననుసరించి పోవుచుండ, రిట్లు విచ్ఛిన్నబాహుండై క్రొన్నెత్తురు దొరుగఁ, జలింపక యతండుసని శంఖునిన్ దర్శించుటయు, నమ్మహాత్ముండు నిజతపఃప్రభావంబున, నతనికిఁ జేతులువుట్టించి, పరమానందంబునన్ దేలె ; నా లిఖితుం డును నబ్భంగి దోషంబుఁబాపికొని, తన యాశ్రమంబునకుఁ జని సుఖంబుగనుండె ; ననంతరం బమ్మహానుభావులశిష్యు లొక్కెడఁ గూడి, తమ గురుదేవుల ధర్మనిష్ఠన్గూర్చి, పెక్కుభంగులఁ బ్రశం సించికొనుచుఁ, దారును నట్ల నడువను, లోకంబునకు బోధింపను, నిశ్చయించికొని ; రిట్లు. ౨౦౮౮

తే॥ వింటిరే యమ్మహాత్ముల విపులధర్మ
నిష్ఠ శిష్యవాత్సల్యగరిష్ఠభావ
శుద్ధియును ? మీకు నెప్డు నా చొప్పవలయు ;
మీర లోకము, లోకము మీరునగుచు. ౨౦౮౯

క॥ కేవలమును మీ పావన
జీవనములు సర్వలోక సేవక మెప్డుఁ
గావలయు, నొండు తెఱఁగులు
కావు సుఁడీ ! మీకు విద్యఁగఱపుటయందున్. ౨౦౯౦

తే॥ ఎంతగోరము వుట్టిననేని, ధర్మ
నిష్ఠనెప్డుఁ జలింపని నిరుపమాన
దీక్షమీకు వలయుఁ జుం ; డదియ సమస్త
కార్యములయందు విజయంబు గలుగఁజేయు. ౨౦౯౧

వ॥ దీనికి నిదర్శనంబుగా నొక్క చిన్న యితిహాసంబు జెప్పెదు, వినుండు !

శ్రీకృష్ణస్వామి యాగ పూర్వేతిహాసంబు నుపన్యసించుట.

క॥ సారోజ్వల ధర్మ సదా
చారఘనుఁడు తొల్లి యొక్క సద్గురుఁడు మహా
ధీరుండు గలం; డతనికి
భూరమణుం డొక్కఁ డెప్డుఁ బ్రోది యొనర్చున్. ౨౦౯౩

తే॥ అమ్మహీపాలకుని హృదయమ్ము సంగ
రవ్యసనమంద యెప్పుడుఁ గ్రాలుచుండు;
నీవియుఁ గలదు; కరుణ కెల్లనిఁ గాని
మొఱకుఁదన మాతనియెడ నిమ్మగ నెసంగు. ౨౦౯౪

వ॥ ఒక్కనాఁ డానృపుం డగ్గురుసత్తమున్ బిలిపించి, యెంతయేని సత్క
రించి, ప్రియంబు పుట్ట నాడి, పదంపడి యిట్లనియె. ౨౦౯౫

క॥ గురులరు మీా, రెల్లనియుఁ
బరోపకారంబ కోరి పాటువడుచు నుం
దురఁట? మహాత్ముల రగు మీా
కరయగ నా చందము కడు నందముఁ గూర్చున్. ౨౦౯౬

క॥ ఏ నెల్లభంగులన్ బనిఁ
బూని, సతము మీాక యగుచుఁ, బ్రోది యొనర్తున్;
జ్ఞానము, మానమునున్ గల
మీా నడువడి నాకుసాల మెప్పున కయ్యెన్. ౨౦౯౭

తే॥ రాజులకు నైన సకలధర్మంబులందు
సంగరమ ముఖ్య; మెవ్వాండు సచ్చుఁ బోర?
నాతఁ డొక్కండ పరమ మాన్యతముఁ డంద్రు
దేవలోకంబునందు; సందియము లేదు. ౨౦౯౮

క॥ వీరుఁ డను పేరుఁ బడయని
భూరమణుని బ్రదుకు బ్రదుకె? భూతమ కాఁడే

పోరికిఁ గాని మనుష్యుం ?
డారయ నా సంఢిపసర చునద యనఁ బడుర్. ౯౯౯

క॥ చంపుటయు, సచ్చుటయు, నను
దెంపునకగువాఁడ కాఁడె దేవ వితతి మ
న్నింపన్ దగువాఁ ? డాతని
కింపగునే యింట సచ్చు టెన్నండేనిర్ ? ౧౦౦౦

చ॥ ఉఱికి, మొగంబు సక్కనయి, యొండు తలం పెదఁ జేర్ప, కోలిఁ జి
చ్చుఱ పిడుగున్ బలెన్ విమతసైన్యము దైన్యముఁబొందఁ, గొందఱన్
దఱిమియుఁ, గొందఱన్ సదమదం బొనరించియుఁ, దృప్తి కెమ్మెయిన్
జొరని మహానుభావుఁడ విశుద్ధచరిత్రుఁడు, ధన్యుఁ డన్నిఁటర్.

తే॥ కరుణ మానుషమున నెట్లుఁ గాదు ; పిఱికి
తనము కరుణయనన్ బడు ; దాని కేమి ?
పులి తెఱంగున రక్త మెప్పుడును ద్రావఁ
గోరు నతఁడ నిజంబునకున్ నరుండు. ౧౦౦౨

క॥ పలువురఁ జంపుట, పలువుర
వలనన్ జచ్చుటయు, రెండ వలయుఁ బురుషుఁడై
యిలఁ బుట్టినవానికి ; నిది
తెలిసికొనుట యొకఁడ మేటి తెలివి యనఁ బడుర్. ౧౦౦౩

క॥ పప్పు బరమభాగ్యం బని
యెప్పు డఱచు బాపనయ్య లెఱుఁగరు పోరన్
జొప్పడు నుల్లాసము ; మఱి
చెప్పినఁ దెలిసికొనలే ; రిసీ ! వాండ్రేలా ? ౧౦౦౪

క॥ చదువులఁట ! సంధ్యలఁట ! తమ
బ్రదుకున నవి కూర్చుఁ జాల భాగ్యంబఁట ! సీ !

ధ్యది యేఁటి మతము ? పోరుల
కొదవించునె యెన్నఁడు నవి యుల్లాసంబున్. ౨౧౦౫

ఆ॥ చదువులయ్యలయ్యు, సారంబుఁ గల రాజ
వంశమునకు నైన వార లీరు ;
కానఁ జదువు తోనఁ గలుపుఁడు ! యుద్ధ మ
హిమ, జగంబు దాని నెఱిఁగికొనఁగ. ౨౧౦౬

ఆ॥ పోరఁ జచ్చు పరమ పుణ్యులు గారె నా
కంబునందు సుఖముఁ గాంచువారు ;
జగతి నెల్లవారు సక్క నా పదవికిఁ
బోవఁ గలుపుఁడు ! పనిఁ బూని యెపుడు. ౨౧౦౭

ఆ॥ ఏను తొంటికన్న నింకఁ గూర్చుదు మీకు
సాలు కొలఁదిఁ బెక్కు చందములను ;
నా మతంబుఁ బ్రజలు నచ్చ బోధింపుఁ ! డ
ప్పాణ్యమునకు మీరుఁ బోవువారు. ౨౧౦౮

క॥ అనుడు తన కదియ తటి సె
ప్ప నని తలఁచి, యాతఁ డా నృపాలునితో ని
ట్లను మోమోడక, దైన్యం
బునకున్ గా, కొందు తలఁపుఁ బూనక, ధృతిమై. ౨౧౦౯

ఉపాధ్యాయుండు రాజుతో యుద్ధమువలన నగు
కీళ్లన్ గూర్చిన్ చెప్పుట.

క॥ ఏ నింతకుఁ బూర్వము నీ
తో నివ్విషయమయి సాల దూరము సెప్పం
గానరయుదు ; సమయ మెపుడుఁ
గానన్ ; గావునను పెద్దకాలము సెల్లెన్. ౨౧౧౦

క॥ ఇప్పుడు నీ వింతదనుక
సెప్పుట సమయంబు నాకుఁ జిక్కెన్ మున్నేఁ
జెప్పఁ దలంచిన యంతయుఁ
జెప్పఁగ; నిబ్భంగి మేలుఁ జేసితివి కడున్. ౨౧౧౧

తే॥ ఏను పాఱుఁడఁగామి నీ వెఱుఁగుదు; నృప
కులమునకుఁ జెందితిన; కాని కలహ మన్న
నొచ్చికొందుఁ; గరుణ యన్న నచ్చియుందు;
శాంతికిని ప్రేమకును గాపు సంగరములు. ౨౧౧౨

క॥ విను! ఎప్డుఁ గృపయ మానుష
మున నున్నత దశకు నైన మూలము; కృప లే
ని నరుండు నరుఁడు కాఁ; డా
తని కెందును లేవు పరమదశ లూహింపన్. ౨౧౧౩

క॥ కరుణఁ గల సజ్జనములక
సురలోకము నందుఁ గలదు చోటు; కృపకు నె
ప్పరుసునఁ గాని దురాత్ముల
కరయఁగఁ జోటందు లేద యంద్రు మహాత్ముల్. ౨౧౧౪

తే॥ తాను నచ్చుఁ టొరులఁ జంపఁ దలఁచు టేటి
చందము మనుష్యునకుఁ? దన జాతి పెంపుఁ
దలఁచువాఁ డెట్లు సావ, నితరులఁ జంపఁ,
దలఁచు? నది హానికరమ సూ ధర్మమునకు. ౨౧౧౫

క॥ తనజాతిన కాక, జగం
బు నెల్లఁ బెంపునకుఁ దేరఁ బుట్టు నరుం; డా
తనిభంగి యట్టిచందం
బున కగుఁ గా; కొండుసేయుఁ బోలునె యెందున్? ౨౧౧౬

క॥ సకల ప్రపంచ సంక్షో
భకరంబులు యుద్ధము ; లోకభంగి నడరి, వా
నికి మనసిచ్చుట మానవు
నకుఁ బోలదు ; ప్రాజ్ఞుల కవి నచ్చునె సేయన్ ? ౨౧౧౭

ఆ॥ గీ॥ యుద్ధమందు నచ్చు టొప్పు ; దసంపూర్ణ
జీవితమరణమది ; చేటుఁ దెచ్చు ;
దాని కెవ్వఁ డగు నతండు పిశాచలో
కంబుఁ బడయువాఁడు ; కాఁడు దివికి. ౨౧౧౮

తే॥ కరుణ నించుక బూనఁడు కానఁ బోరఁ
జచ్చు మనుజాధముండు పిశాచలోక
వాసి యగుఁ గొంతకాల ; మావల మహోగ్ర
నరకలోకంబునకుఁ జను ; నాడ మ్రగ్గు. ౨౧౧౯

తే॥ కరుణయును, శాంతియును, బ్రేమ గలమహాను
భావులక గాక యవిలేని పరమకఠిన
హృదయులకు స్వప్నమందేని నెట్లు బడయ
వచ్చు దేవలోకము ? దాని వార్త యేల ? ౨౧౨౦

క॥ కృపయున్ శాంతియు నను రెం
డెపుడున్ మానుషమునన్ రహింపనయిన య
చ్చపు గుణములు ; పోరుల కవి
విపరీతములున్ యశోఽభివృద్ధికరంబుల్. ౨౧౨౧

క॥ కావున నెన్నండేనియు
నీవు మనసు వెట్టఁగా దనికి నని, మఱి యే
మో వలుకు నగ్గురుని న
బ్బావరుఁ డలుకమెయి సూచి, బొమలు ముడివడన్. ౨౧౨౨

వ॥ కన్నుల నిప్పులు రాలఁ జఱచుచున్ జూచుచు నిట్లనియె. ౨౧౨౩

క॥ నిన్నింత ద్రవ్యమంటినె?
నన్నెఱుఁగుదు కాదె? నా మనసుఁ ద్రిప్పికొనన్
బన్నితివే యింతకు ము?
న్నన్నా! నీ వెంతసేయ నరసితి వాత్మన్? ౧౦౧౪

క॥ చేవ సెడి, పారశాలన్
జీవితమున్ గడుపు నిన్నుఁ జెట్ట యనక, యే
లా విలిపించి? తిసీ! యది
నీవరయవ? యింతలాడ నేర్చితె యిమ్మై? ౧౦౧౫

ఆ॥ బ్రదుకఁ దల, చితేనిఁ బనివడి నా చెప్పి
నట్ల యెల్లవారి ననికిఁ గఱపు!
మేఁటి సదువు? నాకు నెదురాడ నోడ; విం
కేమి సెప్పఁ దలఁచి? తెల్లఁ జెపుమ! ౧౦౧౬

వ॥ అనుడు నగ్గురు సత్తముం డిట్లనియె. ౧౦౧౭

ఆ॥ హితము గోరి చెప్పి తింతకు; నీమది
కెక్క దాయె నది; విహీన బుద్ధి
వైతి; వీవుఁ జెడుదు, వందఱఁ జెఱుపుదు;
వేఁటి పోరులు? తుద కేమివచ్చు? ౧౦౧౮

క॥ నీకు వెఱచి, ధర్మమునకుఁ
గాక, యధర్మంబు సెప్పఁ గడఁగుట యెందున్
నాకగునే? దుర్మతము వి
వేకి గొనం దగునె? యేఁటి వెరవది తలఁపన్? ౧౦౧౯

తే॥ ఈసు వట్టిరి పార్థివు లెల్లఁ, బ్రజలు
రోసికొని రిప్డు నప్డుఁ బోరులక నీవు

కాలుఁ ద్రవ్వుట; నీక గాక యది రాజ్య
మునకుఁ గడు హానిఁదెచ్చు నెట్లును గడువక. ౨౧౩౦

వ॥ నీవు దుర్మతంబు వట్టి, ముణిసిపడుచున్నవాఁడ; వదికా, దను టయు విని, మండిపడి, యద్దురాత్ముం డతని కిట్లనియె. ౨౧౩౧

క॥ నా మతము దుర్మతంబే?
నీ మతమఁ బె మంచిమతము? నీవ ప్రభుఁడ విం
కే మన మా కందఱకున్?
నీ! మూర్ఖుఁడ! యింక నెదిరి సెప్పకుము! యనన్. ౨౧౩౨

వ॥ అమ్మహా మనస్వి యోర్పుమెయి నింకేమేనియు సెప్ప నుంకింపు చుండ, బిట్టాడి, వారించి, యద్దురాత్ముండు భటులన్ బిలిపించి, యిద్దురాత్ముం డు బోధకుం డగుట మనకును, లోకంబునకును జేట యగున్ గాని మేలు గాదు; కావున వీనిన్ బంధించి, చెఱ వెట్టి, బుద్ధిఁ దెచ్చుకొను నంతకు నందు నానాబాధలన్ బెట్టుఁడు! మఱి వీని పుత్త్రు నిప్పుడ తోడికొని రండు! లెం! డనుటయు, వా రప్పరమోపాధ్యాయుని విఱిచికట్టి, తోడ్కొనిచని, చెఱవెట్టి, బాలుండగు నతని పుత్త్రునకిన్ జెప్పి, వాఁడుఁ దోడరాఁ గదిలి యానృపాధము నొద్దకు వచ్చుటయు, నాముక్కిడి దొర యబ్బా లుని కిట్లనియె. ౨౧౩౩

క॥ నీ తండ్రి పాటుఁ జూచితె?
నాతోఁ బగవట్టి పలికె; నా బుద్ధికిఁ గాఁ;
డా తెరువు నీవుఁ బట్టక,
సూతము! మఱి యేమి చెప్పఁ జూచెదొ? చెపుమా! ౨౧౩౪

వ॥ అనుడు నబ్బాలుండు మోమోడక, ధైర్యంబూఁది, తెలివిమై నిట్లనియె. ౨౧౩౫

క॥ నాతండ్రి లోకమాన్యుం;
డాతని బుద్ధిఁగొన నోపవైతివి; తగునే
యాతనిఁ జెఱవెట్టఁగ? నీ
చేతకు మేలయనునట్టి చెనటులు కలరే? ౨౦౩౬

క॥ నీ వాతని మతమెఱుఁగవు;
కావునఁ జెఱవెట్టితివి; పగన్ గొనువాఁడే
యా వెరవరి? యకటా! యతఁ
డీవడువునకై నవాఁడె? యేమనవచ్చున్? ౨౦౩౭

క॥ కావు రణములని యాతఁడు
కావించిన బోధనమున కలదే త? ప్పే
లావాడితనము సూపితి
వీవాతని యెడల? మాన్యు నిట్లు పఱతురే? ౨౦౩౮

ఉ॥ ఎక్కడిబుద్ధి నీకు? దురుసెక్క మహాత్ముల నొంపఁజూతురే?
తక్కితిగాక యాఘును నుదంచితశాపము పాలుఁగాక; ని
న్నెక్కడి రాజుఁగాఁ దలఁచి, యింతలు నాతఁడు బుద్ధిసెప్పె; నీ
చక్కటి కెట్లుసేరుదురు సజ్జను లీపయిమేలుఁ గోరుచున్? ౨౦౩౯

క॥ వెరపుమెయిఁ బులి వసించెడి
యరణ్యమందును వసింపనగుఁ గాక, నిరం
తరమున్ గ్రూరుండగు భూ
వరురాజ్యము నందుఁగాదు వసియింపగన్. ౨౦౪౦

ఆ॥ గీ॥ కావు పోరులని తగన్ జెప్పువారలు
కారు నీకు; లేదు గౌరవంబు;
కాలు ద్రవ్వచుందు కయ్యంబులక; యేఁటి
చంద? మంద నీవు సత్తుగాక! ౨౦౪౧

వ॥ నాపుడు మండిపడి, యామదురాత్ముని కోపంబు పట్టఁజాలక, తటాలున లేచి, వాలుఁబెఱికికొని, నన్ను స్తానమంటివి! నీవ శత్రువుగాక! యని, యబ్బాలుని కంఠంబుఁ దెగనేసి, యంతన తనివిసనక, వెండియు భటులన్ బిలిచి, దురాత్ముండగు నయ్యుపాధ్యాయుని సర్వస్వమ్ములుఁ గొల్లవెట్టి, యగ్గురుపత్ని నిల్లువెడల నడిపించి, రం! డనుటయు, వాని కెదురాడనోడి, మంత్రిప్రముఖు లూరకుండ, నా కింకరులు సని, యట్లుచేసి, వచ్చి, యంతయు నెఱింగించుటయు.

తే॥ అద్దురాత్ముండు లోనికి నరిగె మండి
పడుచు, నేఁ డిట్లుసెల్లె నా పంతమనుచు;
వాని యకార్యనిపని కెల్లవారు రోసి
కొనిరి; పదఁపడి సూర్యుఁడు గ్రుంకె; నంత. ౨౧౪౩

వ॥ అమాత్యకర్మసచివ మహామాత్రప్రముఖు లొక్కచోఁగూడి, దురాత్ముండునుఁ గ్రూరుండు నగు నయ్యోడయుని నిరంకుశత్వంబు నకు రోయుచు, నేమేని నాలోచించికొని, యయ్యుపాధ్యాయుం డున్న కారాగారంబుసేర నరిగి, యతనిన్ దర్శించి, తత్పుత్రకళత్ర సర్వస్వమ్ముల తెఱంగెఱింగించి, తమ సంతాపంబుఁ దెలియ వలికి, మఱి యిట్లనిరి. ౨౧౪౪

తే॥ రాజు ముష్కరుఁ; డతని దౌర్జన్యమునకుఁ
దగఁ బలుకరాదె? యేఁటికి ధర్మపథము
నూప? నమూర్ఖుఁ డెప్డు నా చొప్పు పట్టు
వాఁడె? యిమ్మెయి నింత చేష్టుడఁగనైతి. ౨౧౪౫

ఒక యుపాధ్యాయుండు మంత్రిప్రముఖులకు హితోప
దేశంబు సేయుట.

వ॥ నీపుత్రుండు తగవాడి బలాన్మరణంబున కగుటకును, నీసతి యిల్లు వెడలి యెందేనిఁ బోనగుటకును, నీ సర్వధనంబులు కొల్లవెట్టఁబడు

టకును, నీ వకారణంబ చెఱ నవయుటకును, మిగుల వగచుచున్న వారల; మెంతవగచియు నీపుత్రుని బ్రదికింపఁజాలము; కాని నీ చెఱఁ దప్పించుటకును, నీ సర్వస్వమ్ములు మఱల నీకుఁ జెందించుటకును, మామతంబు నీవుఁ బట్టుదేని సాలుదుము; మా మతంబు వట్టి, రాజు మతంబున కంగీకరించు తెఱంగుదోఁప, నతనియొద్దఁ బలుకవే! యనుటయు నమ్మహాత్ముండు నవ్వుచు వారల కిట్లనియె.

ఆ॥ గీ॥ ధర్మమార్గమునకుఁ దప్పి చరించు రే
యార్య? లమ్మతమ్ము నందు నున్న
నాకు నొండనంగ నగునె? లోకము హాని
గోర్చి, తప్పవలుకు టొప్పునెట్లు? ౨౧౪౭

క॥ నా కొడుకు తప్పనాడక
నాకంబున కేఁగె; నది మనఃప్రియమ యగున్
గా కొండగునే యెట్లును
నాకున్? నాసతియునుండు నాదుమతమునన్. ౨౧౪౮

క॥ దానికి, నాపాటునకున్
నేనువగవ; దుఃఖమునకు నిరవగునే నా
మానసము ధర్మనిష్ఠా
జ్ఞానకలిత; మేల మీరు సంతాపపడన్? ౨౧౪౯

ఆ॥ సంగరములు లోకసంక్షయకరములు;
వానిమాన్ప దీక్షవట్టవలదె
మానుషమునకైన మతిమంతుఁ? డవి కూడు
ననుచుఁ బలుక నాకు నగునె సెప్పఁడ? ౨౧౫౦

తే॥ ధర్మమునకుఁ బ్రాణము నేని ధారవోయు
వాఁడ; సుఖదుఃఖములు మదివట్ట; వేల

నన్నుఁగూర్చి యుండఁగ మీకు ? నామతంబు
పోలునేని యిమ్మెయినుండఁ బోలుఁగాదె ? ౨౧౫౧

తే॥ కవియు, రాజును, గురుఁడును, గర్షకుఁడును,
నల్వురగుదురు లోకంబునకు సతంబు ;
వీరు కానిత్రోవలుఁగొన్న, వీరరాక
చెడు జగంబెల్ల, త్రోసిపుచ్చినదివోలె. ౨౧౫౨

తే॥ కాన లోకహితముఁగోరు ఘనులు వీరి
మెప్పుఁగోరి, యొకప్పుడున్ దప్పనాడఁ
డెదిరి, తప్పులుసూపించి, యేర్చి, పేర్చి
పల్కుదురు మేలకోరి బిట్టలుకయ్యు. ౨౧౫౩

క॥ భూమిపతి తప్పఁ దిరుగుడు
మోమోడక, మంచిమార్గమునకు వెరవుమై
నేమేనిఁబల్కి, త్రిప్పుట
నామతమునఁ గార్య ; మొండనన్ జనదచటన్. ౨౧౫౪

ఆ॥ గీ॥ మీరు మనప్రభునకు మేల కోరుదురేని,
గానిపనికి నతఁడు గడఁగకుండ
సూచికొనుఁడు ! రాజ సుండు ! ప్రజలకెల్ల
మార్గదర్శకుండు, మాన్యతముఁడు. ౨౧౫౫

క॥ ననుఁగూర్చివంతఁ గుందక
సనుఁడు ! మననృపుండు చండశాసనుఁ ; డీ రి
ట్లను టెల్లనిఁయు వినినన్
గినిసి పలుకు మిమ్ముఁ ; గాక కీ డొనరించున్. ౨౧౫౬

ఆ॥ అతని కెదిరి, పేర్చి, యన్యాయమున కింక
దిగక, శాంతిమై బ్రదికెడు చొప్పు

సేయుఁ! డొకటఁ దెంపుఁజేసి, వధింప యు
త్నంబు సేయకుఁ! డది తగదు సుండు! ౨౧౫౭

తే॥ అతఁడు మీాపల్కులకు మాఁడి, యట్టెమిడిసి
పాటునకు నగునేనియుఁ, భయముపుట్టఁ
బలుకుఁ! డేపనులకుఁగాని భంగి నడుపుఁ
డొక్కకీడుఁ దలంపకుఁ! డోర్పువలయు. ౨౧౫౮

తే॥ ధర్మ మెల్లని నాతనితలకునెక్కఁ
జెప్పిచూడుఁడు! రాజ్యంబు సెడనిభంగి
నరయుచుండుఁడు! కా దమర్యాద ప్రభువు
నెడల; నాతఁడు సెడఁ బ్రజల్ జెడుదురు మఱి. ౨౧౫౯

తే॥ తనకుఁదాన ప్రశాంతిమైఁ దగవుపట్టి
వచ్చి, సన్దేర్పునంతకు నొచ్చియేని,
నింద యుండుదు; శక్తులరేని నతని
గోలి బుద్ధిఁగఱపుఁడు! పోం! డేలఁదడయ? ౨౧౬౦

వ॥ అనిపల్కి యతం డూరకుండుటయు, నదియు యుక్తంబని, వారు
చని, యారాత్రిఁబుచ్చి, యమ్మఱునాఁటినుండియు యాదుష్ట
ప్రభువు స్వభావంబు మార్పను, శాంతిఁగూర్పను, బ్రయత్నిం
పుచు, విఫలమనోరథు లగుచుండి; రంతఁ గొంతకాలంబునకు.

సీ. అతిబలశాలిచిత్రాశ్వుండునారా జమితమహాసైన్యసమేతుఁడుఱుక,
దాడివెడలి, వచ్చి, తటిఁగనియమ్మహీశ్వరునిపురంబు నిశ్శంకఁ జుట్టి,
యాక్రమించుటయును, నానృపుండెదిరి సేనలఁగూర్చికొని, పోరొనర్ప,
నందుఁ! జచ్చె బలములందు సగము; కొడుకుఁదెగెఁ; దక్కినసైన్య
మంతయును గలఁగి,

పాటె ; బోరి పోరి పట్టువడియె నా ధు
రాత్ముఁ డలవుఁ దక్కి, యలసి, సొలసి,
తుదను శాత్రవులకు ; దుర్దశ పాలయ్యె ;
మదమడంగెఁ ; బేరుమాసిపోయె. ౨౧౬౨

వ॥ ఇట్లు పట్టువడిన యక్కానిచేనిఁ సుదృఢబంధనంబుల పాలుఁజేసి, చెఱనిడఁబంచి, తన్మంత్రి ప్రధానాదుల వెరవున్నెఁ బిలిపించికొని, భయంబుడుగఁ బల్కి, సన్మానించి, యా చిత్రాశ్వమహారాజిట్లనియె. ౨౧౬౩

ఆ॥ కయ్యమునక యెప్డుఁ గాలుఁద్రవ్వెడి మీ నృ
పుండు సిక్కెఁ ; దత్పుతుండుఁ గూలె ;
సేనలందు సగముఁ జెల్లె ; మాకున్ వశు
లైరి పురముతోడ మీరు నిట్లు. ౨౧౬౪

చ॥ మదమునఁ జీరికిన్ గొనఁడు ; మమ్మడికించెడి నేర్చిపేర్చి ప్ర
ల్లదుఁడయి పల్కి, యేమియుఁ దలంకక పోరికిఁ గాలుఁ ద్రవ్వుచున్
పదఁపడి మీ నృపుం ; డతనిభంగి సుదుస్సహమయ్యె మాకు ని
ట్లద నోడఁగూడ మా తలఁచి నంతయుఁ జేసితి మిప్పు డోలిమై. ౨౧౬౫

క॥ మీరాజ్యముఁ గొన నిది యొక
కారణముగ వచ్చితి మనఁగా ; దొల్లను మీ
పేరును బెంపును జెఱుపన్ ;
మీరాజ్యము నేలికొనుఁడు ! మీరు నయముమై. ౨౧౬౬

క॥ మా చేతికి నయ్యెఁ దులువ,
నీచుఁడు మీరాజు ; మాపనికి నిది చాలున్ ;
మా చెఱసాలలఁ గలఁగన్
నోచికొనిను నతఁడు తనపనుల కడియుతగన్. ౨౧౬౭

వ॥ ఇంకఁ బోరన్ జాలక మిగిలిన యాతనికొడుకు నేనిఁ, గాక మనుమని
నేని, మీకుఁ బ్రభువుఁగా నిల్పికొని, మీరాజ్యంబు మీర సేని
కొనుండని చెప్పి, యానృపుండు సేనలతోఁ దన రాజ్యంబునకున్
జనియె ; ననంతరంబ మంత్రిప్రధానాదు లొక్కచోఁ గూడి,
కార్యం బాలోచించికొని, తమ ప్రభువున కెవ్వరేని లేమికిఁ జింతిం
పుచుఁ, జెఱనున్న యుపాధ్యాయుని బుద్ధిఁగొనువారై, యతనిఁ
దర్శించి, బంధముక్తున్ జేసి, సగౌరవంబుగఁ దోడికొనివచ్చి, యున్న
తాసనం బర్పించి యిట్లనిరి. ౨౧౬౮

తే॥ చిక్కె మనరాజు వైరులచేత ; నతని
పుత్త్రుఁడును సేనలున్ జచ్చెఁ బోరిలోన ;
నేమ పావక మిగిలితి మింతదనుక ;
నేమిసెప్పుదు ? మీగోర మింతకయ్యె. ౨౧౬౯

క॥ ఎఱుఁగము వైరులసడి ; మా
కెఱుఁగనయిన నింతవుట్ట దేమొకొ ? మము నే
డ్తెఱఁ గ్రమ్మి, యొంచి, వారలు
తఱిమి తఱిమి తోలి రుఱుక తమ కది సెల్లన్. ౨౧౭౦

ఉపాధ్యాయునితో మంత్రిప్రముఖులు తమ పరాభవంబు
నెఱింగించుట.

ఆ॥ గీ॥ మఱచి యుంటఁ జేసి, మార్కొనఁగా నేర
మైతి మేము వారి ; నట్టు లగుట
బ్రదికి పోవనైరి పగతుఱు మాచేతఁ
బడక ; వమ్మువోయెఁ బౌరుషంబు. ౨౧౭౧

క॥ ఎదిరి, రిపుల ప్రందింపఁగ
నిది తఱి కాదని తలంచి, యే మలసులు నాఁ

జెదరి, యొక యుపాయంబున
బ్రదికితి మతి దూరదృష్టిఁ బఱపి, వెరవ్రమై. ౨౧౭౨

వ॥ అంతియ గాక. ౨౧౭౩

తే॥ కానిపనికి వేగపడుట కాదు ; తఱి నె
ఱింగి యరుల నిరోధింప, భంగపఱుపఁ,
దఱుమఁ, జిత్రవధము సేయఁ దలఁచి, పనికిఁ
గాకపోయితి మనిలో నగంబు నచ్చి. ౨౧౭౪

క॥ మనరాజు కయ్యమున కె
ప్డును గాల్ద్రివ్వటన యింతవుట్టెన్ గోరం ;
బనఘా ! యేమందు ? మెదిరి
మనసు నెఱుంగం డతండు మత్తుం డగుటన్. ౨౧౭౫

క॥ నీ మతము నరకు సేయమి
నీ మాడ్కిన్ భంగపడియె నిట్లు రిపుల చే
నేమిఁటికిన్ గాక యతం ;
డేమన నగు ? నతని కర్మ మింకె ట్లో కదా ? ౨౧౭౬

క॥ తొడరి యనిలోన నాతని
కొడుకు బడియె ; సగము సేన కూలెన్ ; మును నీ
కొడుకున్ జెండిన ఫల మి
ప్పు డతని కనుభూత మయ్యెఁబో ! వేయేలా ? ౨౧౭౭

ఉ॥ అంతియ కాక నిన్నుఁ జెడనాడి, మదంబున బందె వెట్టి, భూ
కాంతుఁడు నేఁడు తత్ఫలముఁగాంచె ; మహాత్ముఁడవై యెనంగు నీ
స్వాంతము నొవ్వఁజేసిన యసభ్యుఁడు, లోక వినింద్య కిల్బిష
స్వాంతుఁ డడంగకున్నె తనవారును దాను ఘోర దుర్దశన్.

క॥ మనరాజు పోరు తీపికి
ననయము నుడికిరి ; తఱిఁగని యడఁగించిరి ; కా
దనఁ జాలము రిపురాజుల ;
నన నింకేమి కల దిప్పు ? డంతయుఁ దీరెన్. ౨౧౮౯

క॥ మీా రాజ్యము నేలి కొనుఁడు
మీార ; వలదు మాకు ; మమ్ము మెచ్చక యెప్డున్
బోరులక కాలుఁ ద్రవ్వెడి
మీారా జిదె చిక్కె ; సాల మే లిట్లయ్యెన్. ౨౧౯౦

క॥ అని పల్కి వైరిరాజులు
సనిరి మననృపాలుఁ గట్టి సక్కఁ గొనుచు ; నొం
డనఁజాల కట్టె నిలిచితి
మనఘా ! యే ; మింతగోర మయ్యెన్ జామీా ! ౨౧౯౧

ఆ॥ నీ మతంబ పట్టి, యే మెల్లపనులు నీ
పయి నొనర్ప దీక్షఁ బట్టితి ; మిది
కాదు నాకుఁ, గాని గాధ యేమిటి కన,
కీవ సెప్పి పన్పు మెప్డు మమ్ము. ౨౧౯౨

క॥ గురుఁడవు, మంత్రివరుండవు,
దొరవు నగుచు, నీవ సాలు దువు పాలింపన్
బురుషవర ! మమ్ము, రాజ్యము ;
నిరతము మన్నింతు మేము నీ శాసనమున్. ౨౧౯౩

ఆ॥ గీ॥ కొడుకు సచ్చె, ధనముఁ గోలువడితిఁ, జెఱఁ
గంది, తేఁటి పెద్దగాధ ? నాకుఁ
బోల దనుచు నొకట తేలవల్కక మమ్ము
నేలి కొనుము ! రాజ వీవ యగుము ! ౨౧౯౪

క॥ అనుడు నతఁ డప్డు వారివ
చనముల కలరక, మనమున సాలఁ గలఁగి, యి
ట్లను మెప్పునకున్ జొర, కొ .
నని యేనియుఁ బలుక నొప్ప, కతి తీక్ష్ణముగన్. ౨౧౮౫

ఉపాధ్యాయుండు మంత్రిప్రముఖులఁ గినిసి పల్కుట.

తే॥ మీర లందఱుఁ గలుగ భూమి పతి నరులు
చేతఁ జిక్కించికొనిరె? యిసీ! యిదేఁటి
మగతనము? మిమ్ము నే బుద్ధిమంతుఁ డేని
మెచ్చునే చెడఁ దిట్ట? కిమ్మోయికి నై రె? ౨౧౮౬

క॥ స్వామిద్రోహము సేయుదు
రే మీ రీగతి? నుపాయమే యిది? యకటా!
యే మందు మిమ్ముఁ? జెఱఁబడి
యేమగు నొకొ యాతఁ? డతని కెవ్వరు మీరల్? ౨౧౮౭

తే॥ అతనిఁ బేరునకున్ నిల్పి, యఖిల రాజ్య
మీర యేలికొనం బగదే దురాశ
పుట్టె నేనియుఁ? గాదన, కెట్టు లరుల
కా దొరన్ జిక్కఁ జేసితి? రక్కటా! కట! ౨౧౮౮

క॥ మీ రెక్కడి ధర్మాత్ముల?
రారక ధర్మంబుఁ దడవు చుందురు నోటన్;
క్రూరులరుఁ, గృతఘ్నుల; రె
వ్వారికి నిది యింపుఁ గొలుపువార్త యరయుగన్? ౨౧౮౯

తే॥ రాజు క్రూరాత్మకుఁ డని, శాత్రవుల కతని
నప్పగించి, వారల కృప నఖిలమునకు

బాసఁ గొన్న మీపని "బలే బా" గనంగ
నాకుఁ బోలునె? యింత యన్యాయ మగునె? ౨౯౦

క॥ క్రూరతమున్ జోరకుండన్
వారింపన్ గాదె మీ కవశ్యము మున్నా
భూ రమణు? నతని చేష్టల
కీరు "బలే బాగు" ననిరి హితమున కగుచున్. ౨౯౧

వ॥ అట్లతనిన్ నానా క్రౌర్యంబులకుఁ బోవనిచ్చి, కపటంబువట్టి, తఱి వేచి, యరులకు నప్పగించి, వారి యనుగ్రహంబున రాజ్యంబు సంపాదించికొని, నాకున్ జెప్పవచ్చితిరి; మిమ్మిప్డు కాదన్నను బ్రయోజనంబులేదు; మీతో సక్క మాటలాడుటకు నాకు మనంబు గాకున్నయది; నన్నేమియు ననకుండుఁ డేను నాయిచ్ఛ కైనచోటికిఁ బోవుదు ననుటయు, నమ్మహాత్ముని పలుకుల కదరిపడి వార లిట్లనిరి. ౨౯౨

క॥ స్వామిద్రోహంబున కే
మేమియుఁ గా; మా కుచర్య కెవ్వఁడు పూనున్?
మామనసు లెఱిఁగి, యెఱిఁగియు,
నీమెయి మీ రాడనగునె యిందఱిలోనన్? ౨౯౩

ఆ॥ ఏమ రాజ్యకాంక్ష నిక్కనిపని కొడిఁ
గట్టికొంటిమేనిఁ, గార్యమునకుఁ
జోరక మిమ్ము నేల జొప్పింతు? మదియేని
నరయరాదె? తగునె యంతలాడ? ౨౯౪

వ॥ ఉన్నరూపుమాత్రంబ సెప్పి, తక్కిన కార్యభారమంతయు మీపై నిడితిమి; మీ యిచ్చవచ్చినట్లు మీర చేసికొనుం! డే మెందుల కేనియుఁ బోమెద మనవుడు వారల వారించి, యతం డిట్లనియె.

తే॥ అంత తెంపునకుఁ జొరనగునె ? యరయ
రాదె నాబుద్ధి ? యీ యకార్యంబున కను
మానము వహింపకుండునే తానయగుచు
జగము కాదం, చిదేటి దుశ్చర్యయనుచు ? ౨౧౯౬

వ॥ కాన లోకంబు నడికోడియు, నధర్మంబునకు వెఱచియుఁ, బ్రభుభక్తిఁ బ్రకటించికొను నిశ్చయంబుమై, మన మెల్లనియుఁ బ్రయత్నించి, మన ప్రభువుఁ దెచ్చికొని, రాజుఁ జేసికొనుటయ యిప్పటికిఁ గార్యంబు ; రాజద్రోహంబు కూడదు ; పరుమాఱులాతనికేను బుద్ధిఁజెప్పి చూచితిఁ; గాని నామాటఁ గొనండాయె ; మీ రుపేక్షించి, యప్పు డూరకుండిరి ; మీరును నాయట్ల మోమోడక యొత్తిసెప్ప దిగిరయేని నతండు తప్పఁ దిరుగకుండెడివాఁ; డప్పు డట్లుపేక్షించి; యిప్పు డతనిచేటునకు సంతసించుట పాడిగాదు; రాజు కానిత్రోవఁ బట్టునపుడు మంత్రులు మొదలగుమాన్యులెదిరి నిరోధింపవలసియుందురు ; మఱి తమకు వశుండు కాఁడేనిఁ, బ్రజలకుఁజెప్పి వారివలననేని సన్మార్గంబునకుఁ ద్రిప్పనై యుందు ; రింతియ ; కాని రాజు దుష్టుండని మంత్రిప్రముఖులును బ్రజలును నతనిన్ వైరులపాలుసేయుట నీతిగాదు ; వెండియు. ౨౧౯౭

తే॥ రాజు ప్రజలను, మఱి ప్రజల్ రాజు ధర్మ
పథమునన్ నడిపించుట పరమనీతి ;
దానికిఁ వారు తప్పిరయేనిఁ జెడుదు
రొకరొకళ్ల నమ్మక, సాల నుడికికొనుచు. ౨౧౯౮

వ॥ మీయుపేక్షవలన దుశ్చేష్టలకుఁబాలై, కయ్యంబులకు కాలుద్రవ్వువాఁడని మన ప్రభువు నెఱుంగుదు ; దానికి రాజులందఱు నుడికికొ టయు నెఱుంగుదు ; మీరును దెంపునేయ వలనుగామిఁ బోరనుపాయంబునఁ బ్రాణంబులు గాచికొనుటయు నిజంబ ; కాని

లోకం బిట్లనుకొనదు; మఱి మనయం దవినీతిదోషంబు నారో
పించుఁ; గాన మనమందఱముఁ గూడికొని, యెట్లైనియు మన
రాజున్ బంధముక్తునిఁగావించి, రాజ్యంబునందఁ నిల్పికొందఁ; మప్పు
డకాని మనము లోకంబునడికిఁ దప్పికొనఁజాల; మనుటయు విని,
వార లతని సౌశీల్యంబునకు మెచ్చికొనుచు నిట్లనిరి. ౨౧౯౯

తే॥ అనఘ! నీబుద్ధియ ప్రమాణమంటి; మింత
కెఱుఁగుదువుకాదె? యెట్లు నీ కిష్ట మట్ల
మమ్ము నడిపింపు! మీవు సామాన్యుఁడవె? మ
హాత్ముఁడవు; నిన్నుఁ గాదననగునె మాకు? ౨౨౦౦

వ॥ అనుటయు నతండు వారల కిట్లనియె. ౨౨౦౧

తే॥ కావు పోరులు; నేర్పుమైఁ గార్య మొకయు
పాయమునఁ జేసికొనుటయ పరమధర్మ;
మట్లు కావున బ్రతిమాలిమైనఁ, దగవు
సూపియైనను సంధికిఁజొచ్చి, తివిరి. ౨౨౦౨

వ॥ మన శత్రురాజు చిత్తంబుబడసి, రాజున్ దెచ్చికొందమని చెప్పి,
వారి యంగీకారంబుబడసి, వారునుఁ దోడరాఁ గదలి, చిత్రా
శ్వుని పాలికిన్బోయి, యతం డాదరింపఁ, గొంతసేపు సల్లాపసౌఖ్యం
బునఁ బుచ్చి, యప్పరమోపాధ్యాయుం డతని కిట్లనియె. ౨౨౦౩

## ఉపాధ్యాయుండు చిత్రాశ్వునితో సంభాషించుట.

తే॥ పెక్కులాడి, విరోధంబు పెంచికొనుచు,
నుడుకుఁబుట్టించు రిపురాజు నోర్చి, యతని
రాజ్య మొల్లని ధర్మపరాయణుండు
కలఁడె నీకన్న నొరుఁ డిజ్జగమున నెందు? ౨౨౦౪

తే॥ అంత తెంపునకుఁ జొరనగునె ? యరయ
రాదె నాబుద్ధి ? యీ యకార్యంబున కను
మానము వహింపకుండునే తానయగుచు
జగము కాదం, చిదేటి దుశ్చర్యయనుచు ? ౨౧౯౬

వ॥ కాన లోకంబు నడికోడియు, సధర్మంబునకు వెఱచియుఁ, బ్రభు భక్తిఁ బ్రకటించికొను నిశ్చయంబుమై, మన మెల్లేనియుఁ బ్రయత్నించి, మన ప్రభువుఁ దెచ్చికొని, రాజుఁ జేసికొనుటయ యిప్పటికిఁ గార్యంబు ; రాజద్రోహంబు కూడదు ; పరువమాఱు లాతనికేను బుద్ధిఁజెప్పి సూచితిఁ; గాని నామాటఁ గొనండాయె ; మీ రుపేక్షించి, యప్పు డూరకుండిరి ; మీరును నాయట్ల మోమోడక యుక్తిసెప్ప దిగిరయేని నతండు తప్పఁ దిరుగకుండెడివాఁ; డప్పు డట్లుపేక్షించి; యిప్పు డతనిచేటునకు సంతసించుట పాడిగాదు; రాజు కానిత్రోవఁ బట్టునపుడు మంత్రులు మొదలగుమాన్యులెదిరి నిరోధింపవలసియుందురు ; మఱి తమకు వశుండు కాఁడేనిఁ, బ్రజలకుఁజెప్పి వారివలననేని సన్మార్గంబునకుఁ ద్రిప్పనైయుందు ; రింతియ ; కాని రాజు దుష్టుండని మంత్రిప్రముఖులును బ్రజలును నతనిన్ వైరులపాలుసేయుట నీతిగాదు ; వెండియు. ౨౧౯౭

తే॥ రాజు ప్రజలను, మఱి ప్రజల్ రాజు ధర్మ
పథమునన్ నడిపించుట పరమనీతి ;
దానికిఁ వారు తప్పిరయేనిఁ జెడుదు
రొకరొకళ్ల నమ్మక, సాల నుడికికొనుచు. ౨౧౯౮

వ॥ మీయుపేక్షవలన దుశ్చేష్టలకుఁబాలై, కయ్యంబులక కాలుద్రవ్వువాఁడని మనప్రభువు నెఱుంగుదు ; దానికి రాజులందఱు నుడుకుటయు నెఱుంగుదు ; మీరును దెంపుసేయ వలనుగామిఁ బోర నుపాయంబునఁ బ్రాణంబులు గాచికొనుటయు నిజంబ ; కాని

లోకం బిట్లనుకొనదు ; మఱి మనయం దవినీతిదోషంబు నారో
పించుఁ ; గాన మనమందఱముఁ గూడికొని, యెట్లేనియు మన
రాజున్ బంధముక్తునిఁగావించి, రాజ్యంబునందు నిల్పికొంద ; మప్పు
డకాని మనము లోకంబునడికిఁ దప్పికొనఁజాల ; మనుటయు విని,
వార లతని సౌశీల్యంబునకు మెచ్చికొనుచు నిట్లనిరి. ౨౧౯౯

తే॥ అనఘ ! నీబుద్ధియ ప్రమాణమఁటి ; యింత
కెఱుఁగుదువుకాదె ? యెట్లు నీ కిష్ట మట్ల
మమ్ము నడిపింపు ! మీవు సామాన్యుఁడవె ? మ
హాత్ముఁడవు ; నిన్నుఁ గాదనవగునె మాకు ? ౨౨౦౦

వ॥ అనుటయు నతండు వారల కిట్లనియె. ౨౨౦౧

తే॥ కావు పోరులు ; నేర్పుమైఁ గార్య మొకయు
పాయమునఁ జేసికొనుటయ పరమధర్మ ;
మట్లు కావున బ్రతిమాలియైనఁ, దగవు
సూపియైనను సంధికిఁ జొచ్చి, తివిరి. ౨౨౦౨

వ॥ మన శత్రురాజు చిత్తంబుబడసి, రాజున్ దెచ్చికొంద మని చెప్పి,
వారి యంగీకారంబుబడసి, వారునుఁ దోడరాఁ గదలి, చిత్రా
శ్వుని పాలికిన్ బోయి, యతం డాదరింపఁ, గొంతసేపు సల్లాపసౌఖ్యం
బునఁ బుచ్చి, యప్పురమోపాధ్యాయుం డతని కిట్లనియె. ౨౨౦౩

### ఉపాధ్యాయుండు చిత్రాశ్వునితో సంభాషించుట.

తే॥ పెక్కులాడి, విరోధంబు పెంచికొనుచు,
నుడుకుఁబుట్టించు రిపురాజు నోర్చి, యతని
రాజ్య మొల్లని ధర్మపరాయణుండు
కలఁడె నీకన్న నొరుఁ డిజ్జగమున నెందు ? ౨౨౦౪

ఆ॥ ఎంతలేసి రాజులేనియు నినుఁబోల;
రేల బెక్కుఁగాడ? శీల మందు
నీకు నీవసముఁడ; వేకార్యమును బాప
మునకు సొచ్చిసేయ వనఘచరిత! ౨౨౦౫

వ॥ యుద్ధంబు లకార్యంబులనియు, దుర్మదంబు హానికి మూలంబనియు, బుద్ధిఁ జెప్పిన మండిపడి, నన్నుఁ జెఱవెట్టించి, నా యట్ల పల్కిన మత్పుత్రుఁ దెగనేసి, నా కుటుంబిని నిల్లు వెడలన్ జేసి, నా సర్వ ధనంబులుఁ గొని, యట్లు పాపంబునకై మా రాజు నీవలనఁ దత్ఫలంబు ద్విగుణంబుగ ననుభవించువాఁ డయ్యె; నీ యంతవాని కతం డెదుర నైనవాఁడే? యనుటయు నుబ్బి, యతం డతని కిట్లనియె. ౨౨౦౬

క॥ మీ రాజ్యము మీక విడిచి;
తేరికి నర్పింప కీర యేలికొనుం! డే
కోరిక లున్నను దెలుపుఁడు!
గూరుతు నవి నాకు నోపుకొలఁదివ యేనిన్. ౨౨౦౭

వ॥ అనుడు నతం డలరి, యతని కిట్లనియె. ౨౨౦౮

తే॥ బాస యిచ్చి, యొకప్డుఁ దప్ప వని విందు
మింత; కిప్డు డెఱుఁగనయ్యె; నేమిసెప్ప
నీ మహౌదార్యమున్, మహనీయ శీల?
మెంతవాఁ డవునా సన్నుతింతు నిన్ను? ౨౨౦౯

వ॥ మా వచ్చినకార్యంబు విన్నవింతు మవధరింపుము! నీవు మహౌదార్యంబున్ బ్రకటించి, మా రాజ్యంబు మాక విడిచి, యేలికొండని చెప్పి వేంచేసితి; నీ మహౌదార్యంబునకుఁ గృతజ్ఞులై యిదె యీ వచ్చిన ప్రజాప్రముఖులు మొదలగు వారందఱును నేన నేన

యను నడి యూసన్ బడి, కలహంబునకు దిగి చంపను జావను డెంపుఁజేసికొని యున్నవారు, మా రాజ్యమం దెల్లెడల నశాంతి ఝంఝూ మారుతంబును, గలహానలంబును విజృంభించుచున్న యవి; దీనికి నెద్దియుఁ దోఁపక యొకనెపంబు వెట్టి, వీరి నందఱిని గూర్చికొని వచ్చి నీకు విన్నవించికొను వాఁడనైతి; నీవును మన్నించి మీ యిష్టంబడుగుఁడు! నాయోపుకొలఁదిఁ గూర్తునని బాస యిచ్చి; తది యట్టులుండ ని! మ్మిప్పుడు వీరికి నేమిసెప్పి పుచ్చనగునో? యది సేఁయుదు గాక! యనుటయుఁ, జాల విచారించియు నెద్దియున్ దోఁపమి నతం డతని కిట్లనియె. ౨౨౧౦

తే॥ బాస యట్లయ్యె; మఱి యిప్డు పంచి యీయఁ
జాల; రాజ్యవిభాగంబు ననదు; తోఁప
దేమియును; ననుఁ గాదన కీవ యొక వి
ధంబునఁ బరిష్కృతి నొనర్పు! తగవు మాన్పు! ౨౨౧౧

క॥ అనుడు నతం డాతని కి
ట్లను, నీయాజ్ఞఁ దలఁ దాల్చి, యప్పనికిన్ జొ
త్తు, నరేంద్ర! యొకటిఁ గోరుదు,
ననుగ్రహము పేర్మిఁ గూర్పు మది మును నాకున్. ౨౨౧౨

వ॥ నీ యనుగ్రహంబున్ బడసిన రెండు నిమిషంబుల లోన నివ్వివాదంబు నతి సులభంబుగఁ బరిష్కరింప నోపుదు, ననవుడు నతం డతని కిట్లనియె. ౨౨౧౩

తే॥ కోరి కొనుమయ్య! నా యోపు కొలఁదిఁ గూర్తు;
బాస యిచ్చితిఁగాదె యిప్పాట మున్న?
యనవుడు నతం డతని కిట్టు లనియెఁ, గోరి
కొందు, నీ దయ కెట్లు నగుదుఁ, దగంగ. ౨౨౧౪

వ॥ అని వినయంబుఁ దోఁప వలికి మఱియు నిట్లనియె. ౨౨౧౫

ఉపాధ్యాయుండు తనరాజున్ విడువఁ జిత్రాశ్వునిఁ బ్రార్థించుట.

తే॥ తప్పుఁ దిరిగె మా రాజు; జడ్డతనికిఁ దగిన
దండమయ్యెను; గాదనఁ దగదు; వచ్చు
బుద్ధి కీపయిఁ; బ్రజల పెంపున్ దలంచి,
యతని విడిపించి పుచ్చవే యనఘ చరిత! ౨౨౧౬

క॥ నా కెదు రెవ్వరు కల రీ
లోకంబున నని కడున్ దులువ తనమున మా
భూ కాంతుఁడు తిరిగెన్ మును;
నీ కతమున బుద్ధికి నగు నేఁడు మొదలు గాన్. ౨౨౧౭

వ॥ అనిన విని నవ్వుచు నమ్మహీకాంతుం డతని కిట్లనియె. ౨౨౧౮

చ॥ చెఱనిడె నిన్ను; నీ కొడుకుఁ జెండి వధించె; భవత్కుటుంబినిన్
దఱిమె గృహంబునుండి; యుచితంబుఁ దలంపఁడు; నిన్ను నెప్పుడున్
సరకుఁ గొనండు; మీనృపుఁ డసభ్యుఁడు, మూర్ఖుఁడు; దానినంతయున్
మఱచితె? యించుకంతయును మండవు; శాంతికిఁదప్ప వేమియున్.

తే॥ పులికి గొఱియలపిండునున్ బోలె నగుదు
రెల్ల ప్రజలు దురాత్ముఁడై యెసఁగు దొరకు,
నెడ్డ సుఖమునకున్ గాక యేపుఁ దరిగి;
యెఱుఁగవే నీ? వెఱింగి, యిట్లేల బలుక? ౨౨౨౦

క॥ చిక్కిన పులిఁ గరుణఁ దలఁచి
సక్క విడుపుసేయు తలఁపుచందము మేలే?
యెక్కడి యేలిక మీ కా
ముక్కిడి తొత్తు కొడు? కెంత మూర్ఖుఁ? డెఱుఁగవే? ౨౨౨౧

క॥ మీా మేల గోరి పలికెద
నీ మెయి ; నెన్నఁడును బాస కేఁ దప్పఁ జుమీా !
యే మందు ? వనుము ! సూతము !
మోా మోడక, హేతువాదమునకు దిగకయున్. ౨౨౨౨

వ॥ అనవుడు నతం డతని కిట్లనియె. ౨౨౨౩

తే॥ రాజు ధార్ష్ట్యంబు ప్రజల యర్థంబులకును,
ప్రాణములకును, హానికరంబ యగుట
యే నెఱుంగుదు బాగుగ ; నెఱిఁగియు మఱి
యిట్లు నిను వేఁడికొనుట ; నీ వెఱుఁగ వెట్లు ? ౨౨౨౪

క॥ క్షమవలయున్ మానుషహృద
యమునకు ; నది లేక కలుగ దమలతరజ్ఞా
నము ; ధర్మసిద్ధి యప్రా
ప్యము దానికిఁ గాక ; పరమపద మదియ సుమీా ! ౨౨౨౫

వ॥ మానుషంబున భ్రమప్రమాదంబులు సహజంబు ; లజ్ఞానంబున
నేనిఁ, గాక కుసాంగత్యంబుననేని, నుపేక్షవలననేనిఁ, బరిసరప్రభా
వంబుననేని, వానికిఁ గొంతకాలంబు వశుండైనవాఁడు మఱి బాగు
నకుఁ గాఁడనుట యవివేకంబని పెద్దలు సెప్పుదురు ; వెండియు
మానుషంబు జ్ఞానతేజోమయంబు ; విను ! మెంత శుష్కహృద
యంబునందేనియు జ్ఞానబీజంబులు లేవనుటకా ; దవి నిద్రాణంబులై
స్ఫురణంబునకుఁ గాకుండు ; నింతియ ; వానిన్ స్ఫురణకుఁ దెచ్చుట
యత్యావశ్యకంబు ; బుద్ధిమంతుల కది యనుష్ఠేయంబు ; నీవును
దాన్ని కదువుగాక ! యనిచెప్పి మఱియు నతం డతనితో నిట్లనియె.

ఆ॥ ఒకఁడు తప్పుసేయ, నొగి దానికిఁ మాఱు
తప్పుసేఁత యేఁటిధర్మ ? మచట

క్షాంతివలయు ; సహనశక్తియుఁ దోఁప్పడు
మాఢ్క్రియుఁ దగుఁ ; గాదు మండిపడుట. ౨౨౨౭

ఆ॥ చేసె మీరుఁ గీడు చెనటి మీ ప్రభువని
యెత్తిసూపి, చెప్పితిప్డు ; నిజము ;
కాని యది సహింపఁగాదె ? క్షమకుఁగాని
వానిఁ బ్రాజ్ఞుఁడండ్రె ? మానవేంద్ర ! ౨౨౨౮

తే॥ నీవు ప్రాజ్ఞుండ ; వేమని నీకు బుద్ధి
సెప్పఁజూచుట ? మన్నించిసెప్ప నియ్యు
కొంటి వింతకు, నిత్యంబుఁ గూర్తువు మఱి
బాసఁ జెల్లించికొనవె ? యో ప్రభువరేణ్య ! ౨౨౨౯

వ॥ అనుటయు నారాజసత్తముం డతని కిట్లనియె. ౨౨౩౦

ఆ॥ లోకవృత్తిఁదలఁచి, మీకెల్లరకు సుఖం
బగుటఁగోరి, యింతకంటె నట్లు ;
కాని, బాసఁదప్పఁ ; గైకొనుఁ డమ్మూర్ఖుఁ
బ్రభువు, సనుఁడు ! వేగపడుటయేని. ౨౨౩౧

క॥ పులి విడిపించెద రిమ్మెయిఁ
దలఁకక ; యదిమేల ; కాని దానికి వశులై
మెలఁగుదురేనియు నది యి
చ్చలు మిముఁదినఁజాలు టది యసంశయము సుఁడీ ! ౨౨౩౨

వ॥ అనుడు నతం డతని కిట్లనియె. ౨౨౩౩

క॥ ఎఱుఁగుదు మాచందము ; నే
మఱి కీడున్ దెచ్చికొనము ; మావశమున మే
ల్గలుపుదుము ; మంచికెట్లున్
మఱిగింతుము ; తొంటి యుఱుకు మాన్పింతు మొగిన్. ౨౨౩౪

వ॥ అనుటయు నప్పరమ నృపాలుండు. ౨౨౩౫

క॥ నీవ విడిపించికొను ! మా
భూవరు, నని యతనితోడఁ బుచ్చెభటుల ; మో
దావహముగ నాతఁడు నని
వేవేగన్ గాంచె మొగము వికసింప నృపున్. ౨౨౩౬

వ॥ అట్లు గాంచుటయు నతండు. ౨౨౩౭

తే॥ సిగ్గు ప్రేగున శిరము వంచికొని, యెద్ది
యేనిఁ బలుకంగ నోరురా, కెంతయున్ గ
లంగి, కన్నుల నీరు జారంగ, నట్టె
నిలిచె విభ్రాంతి నొందు చేష్టలకుఁ దక్కి. ౨౨౩౮

వ॥ ఇట్లు కలంగుచున్న యాముష్కర ప్రభువున్ జూచి. ౨౨౩౯

## ఉపాధ్యాయుండు రాజున్ జెఱనుండి విడిపించి యతనితో సంభాషించుట.

తే॥ అతఁ డకృత్రిమసారసౌహార్ద ముట్టి
పడఁగ, నిండుమనంబుతో “వడి నిదేటి
కలఁత” యని పల్కుచు నతనిఁ గౌఁగలించి
కొనియె ; నతఁడుఁ జలించె సిగ్గువడి, స్రుక్కి. ౨౨౪౦

వ॥ ఇట్లు కౌఁగలించికొని, యతండు నివ్వెరపడి సూచుచుండఁ, దత్క
రంబున్ దనకరంబున వట్టికొని, సాంత్వనపూర్వకంబుగా నిట్లనియె.

తే. ఎవ్వనికి నెప్పుడేగతి నేమివుట్టు ?
నెవ్వఁ డెఱేఁగి ప్రవర్తించు ? నెట్టులేని
సుఖము దుఃఖంబు నగుచుండుఁ జూవెయెల్ల
ప్రాణులకు ; నేరికిన్ దప్పరాదు వాని. ౨౨౪౧

క॥ అఱచేత సకలలోకముఁ
గర మరుదుగ బట్టనె, యఖండితమహిమా
స్ఫురణమునఁ గ్రాలు ఘను లెం
దఱేని దుర్దశలకైరి దైవముకతనన్. ౨౨౮౩

మ. అతులావాచ్యతర ప్రభావమును, లోకాతీతకార్యక్రమో
ద్గతియుఁ గాంచినమాననీయులు, జగత్కల్యాణమూర్తుల్ సుదు
ర్గతికిన్ బాలయి రెందఱేసియును మున్ రాజన్యు ; లిక్షీవు నీ
క్షితియం దెవ్వఁడ ? వేఁటిలెక్క ? యగునే చింతింప నీకిమ్మెయిన్ ?

క॥ చనుదెమ్ము ! లెమ్ము ! నాతో
మనరాజ్యంబునకుఁ ; గలఁత మానుము ! నీ చే
సిన కానిపనులకున్ మది
ననుమానింపకుము ! సెల్లెనవి యపు డమ్మె. ౨౨౮౫

క॥ ఈదేశపుఁ బ్రభు వతిమ
ర్యాదన్ మమ్మలరఁజేసెఁ ; బ్రార్థించితి మే
మాదట నిన్విడిపింపన్ ;
గాదన కతఁ డియ్యకొని తగవుమెయిఁ బలికెన్. ౨౨౮౬

తే॥ కానఁ బోవుట మనకిప్డు కార్య ; మిచటఁ
దడయ రాదు ; దైవం బెట్లు తలఁచు నొకొ ?
యనుడు నాతని సౌజన్యమునకు మెప్పు,
నొప్పుఁ, గదురఁగ ననియె నయ్యోడయుఁ డిట్లు. ౨౨౮౭

ఉ॥ నీ సకల ప్రపంచవరణీయ సుశీలము నేమి చెప్ప ? నా
చేసిన కీడు లెంచవు, వచింతువు మేల తలంచి యిమ్మెయిన్ ;
నానఖుఁడున్, గురుండు నన, నాథుఁడు నా న్నిను సెప్ప నొప్పుఁగా
దే ? సభలందు నేఁడు మొద లీక్షితి నే మనునంతకాలమున్.

తే॥ కీడుఁ జేసినవాని నగ్గించి, మేలు
సేయఁ దలఁతురె యెందేనిఁ ? జిత్రము గద !
నీ చరిత్రము ; న న్నతినీచుఁ బెద్దఁ
జేసికొన నేల ? మే లేమి సేసితినని ? ౨౨౪౯

చ॥ కొడుకు కనిఁ జచ్చె, సేనలును గూలెఁ ; బదంపడి యేనునున్ జెఱన్
బడితి ; ననాథునట్లు పలు బాములకైతిఁ ; బ్రజల్ నిరంతరం
బుడుకుచు నుందు రింతకు మహోగ్రుఁడు నాఁ దగు నా కుచేష్టలన్ ;
గడు నెద లజ్జయున్, భయము, గాఢనిరాశయు నాకు నయ్యెడిన్.

క॥ ఎక్కడి రాజ్యము నా ? కే
నెక్కడి ప్రభుఁ డన్ ఖలుఁడ ? నిమ్మెయి నాత్మన్
స్రుక్కక తప్పని నా ? కీ
వెక్కడి హితమున్ దలంచి యిట్లు శ్రమ పడన్ ? ౨౨౫౧

క॥ నా కానిచేష్టలఫలం .
బీకరణిన్ గుడువనయ్యె ; నేమందువు ? చీ
కాకు పడఁగ నీ కేఁటికి
నా కొఱకై ? పొమ్ము ! విడువు ! నాపై నాసన్. ౨౨౫౨

తే॥ ఒక యుపాయంబునన్ జేసి యుసురుఁ బాపి
కొనఁ దలంచితి ; సంసార మనిన రోయ
నయ్యె ; నేమని సూతు మీ యలరుమొగము ?
లే నరుఁడఁగానె ? సిగ్గు లేదే యొకింత ? ౨౨౫౩

క॥ అలుపాలఁ బొనుపడునె నా
యలమట ? యిం కెన్నినాళ్ళకైన సుఖము నాఁ
గలదే ? నను బాధింపక
తొలఁగి చనుము ! నీకు మ్రొక్కుదు విధేయుఁడనై. ౨౨౫౪

క॥ అనుడు నతం డాతని కి
ట్లను, నిమ్మెయి ధృతికిఁ దొలఁగనగునే ? విధిసా
లని నాఁటి దుర్దశలకున్
వనటన్ గ్రుంగుదురె కార్యవాదులు జనులై ? ౨౨౫౫

తే॥ ఎంద ఱేనియు నీకన్న హీనదశల
కైరి విధిసాలక నరేంద్రు; లట్టులయ్యు
నీతెఱఁగున నిరాశకై రే? తలకొని
యున్నతికి నైరికారె ము న్నోలిఁ బేర్చి ? ౨౨౫౬

క॥ కావున నిరాశఁజెందక,
నావచనము వట్టి, రమ్ము ! నాతో జడు పే
లా ? వెడలుము ! తొంటిపనుల
కేవవడితి ; వదియు సాలు నింతకు నీకున్. ౨౨౫౭

క॥ విను ! పశ్చాత్తాపంబున
ఘనపాపము లేనిఁ బాసి, కాంచఁగలం డె
ట్లును శాంతిపదముఁ బిమ్మట
మనుష్యుఁ ; డిది సృష్టిలోని మహిమ నరేంద్రా ! ౨౨౫౮

వ॥ కావునఁ బశ్చాత్తాపంబునకైన నీ యం దెట్టి దోషంబును లేదని నిర్ణయింప నగుచున్నది ; నీ వుత్సాహంబు నలవరించికొని, నాతో వచ్చి, తొంటి యట్ల నీరాజ్యపదంబునందు సుస్థిరుండ వగుమనిన నతం డిట్లనియె. ౨౨౫౯

ఆ॥ తగ నిమిత్తమాత్రముగ నను నిల్పి, రా
జ్యంబు నీవ సేతె ? యట్టి బాన
యిమ్ము ! నాకు, గారవమ్మున వత్తు నీ
తోడ నెలమిఁ బెక్కు లాడు టుడిగి. ౨౨౬౦

క॥ నాయిచ్చ నాక బలువుఁగఁ
జేయించితిఁ, జేసితిన్ గుచేష్ట; లివియు నా
రేయింబవళ్ల కృత్యము;
లే యెడ నీ జగతి నాకు నెదురే? యనుచున్. ౨౨౬౧

తే॥ ప్రజలకున్ గాక పోయితి; రాజలోక
మును నహంకృతి దుర్మదములు సెలంగ
నుమకుఁ బుట్టించి, కలఁచి తెప్పుడు, హితంబ
కోరి సెప్పెడి వారల దూరనాడి. ౨౨౬౨

తే॥ దాన నింతలు పుట్టె; దుర్దశకు నైతి;
నొరుల నేమన? నేన నాయొక్క బుద్ధి
మెచ్చునకుఁ గాఁగ నీ చేటుఁ దెచ్చికొంటి;
నేలఁ గాకుండు దుర్మతి కిట్టి పాటు? ౨౨౬౩

క॥ పోరులు కావనియుఁ, బ్రజల
కోరికకున్ గాని రాజు మందుట కగు న
ష్టో? రేపో? తనకై యె
వ్వారును గాకనియుఁ దెలియవచ్చె ధ్రువము లై. ౨౨౬౪

తే॥ ఇప్పు డిది తెలియఁగనైన నేమిఫలము?
నమ్ముదురె యింక మన ప్రజల్ నన్ను? నొక యు
పాయమున మోసమునకు నిబ్బంగి నితఁడు
సొచ్చెఁ బో యంద్రు కాక, యీ చొప్పు ననరు. ౨౨౬౫

తే॥ ప్రజలలోఁ దాను నొక్కఁడై, బహు విధముల
వారి మేలుఁ దలఁచి, పాటువడెడు వాఁడ
దొడ్డ ప్రభువను కీర్తిఁ బొందుటయు, శాంతి
కగుటయును నిప్పుడ యెఱుంగనయ్యె నాకు. ౨౨౬౬

తే॥ ఇప్పు డెంత తెలిసికొన్న నెవ్వరేని
మెత్తురే నను? జగమెల్ల మ్రింగఁజూచు
వాఁడఁగానె యూనాఁ? డిట్టివాని రాజుఁ
జేసికొని యేఁటిమే లీరు చెందువారు? ౨౨౬౭

వ॥ అయినను నీ హితోక్తులకు మాఱాడనోడి, నన్ను నిమిత్తమాత్రముఁగ నిల్పికొని, నీవ రాజ్యంబు సేయుదువేని వత్తునని యింతకుమున్న పల్కితిన్ గాన వత్తు, నీ యిచ్చకగునట్లు నన్నే మేనిఁ జేసికొను! మనుచు, నతం డతని వెన్నంటినడిచె; నట్లు తనయేలికన్ దోడ్కొని యయ్యుపాధ్యాయుం, డాచిత్రాశ్వమహారాజున్ దర్శించుటయు, నతండు వారల నాదరించి, పదంపడి తన్నున్ మొగంబునక్కనై చూడను, బల్కను సిగ్గువడి వెల్లనగుచున్న యారాజున్ జూచి, యిట్లనియె. ౨౨౬౮

చిత్రాశ్వుండు దురాత్ముండగు నొకరాజునకు హితముపదేశించుట.

తే॥ ఏల నమ్మోయి లజ్జింప? నేఁటి సిగ్గు
కానిపోరుల కెప్పుడుఁ గాలుఁ ద్రవ్వ
తులవలకు? దుర్మదంబునఁ ద్రుళ్ళిపడుచు
నోడ లెఱుంగక ప్రేలుచు నుండ్రువారు. ౨౨౬౯

తే॥ ప్రజలు నీకెన్నఁడును గారె? ప్రజలనేచి
కొనుచుఁ దినఁ బులిబలె నీకగునె? దురాత్మ
కుఁడ, విసీ! నీమొగము సూడఁగూడ; దేఁటి
రాజ? వీచందముతగునే రాసుతునకు? ౨౨౭౦

తే॥ రాచవారికిఁ బరమధర్మము ప్రజాభి
రక్షణం; బదిలేనిదుర్మతులు నిన్నుఁ

బోలె రేంటికిఁజెడుదు ; రెప్పుడును బ్రజల
సరకుఁగొనవఁట ! యేఁటి నీ సాహసంబు? ౨౨౭౧

తే॥ హింసకును సావునకుఁదప్పి, తింక నేని
బుద్ధిఁదెచ్చికొనుము ! కాని పోరులకు ది
గకుము ! ప్రజలెల్ల నీవారుఁగా మెలంగు!
మట్లు మెలఁగిన శాంతికి నగుదుసుమ్మ ! ౨౨౭౨

తే॥ శాంతియును, ధర్మమును, బ్రజాసారగరిమ,
రాచవానికి వలయు ; దుర్మదము ప్రాణ
శత్రు ; వుచితజ్ఞతయు, మహోత్సాహము సఖు ;
లేదుగడ సత్య ; మివియెల్ల నెఱిఁగికొనుము! ౨౨౭౩

తే॥ ఇయ్యుపాధ్యాయసత్తముం, డియ్యమాత్యు,
లీప్రజలు, నిందఱునుగూడి, యెంతమేలు
జేసిరో నీకు ? నేనేలసెప్ప ? నీవ
యెఱిఁగి బ్రదుకుము! వీరిమేలెంచి కొనుము! ౨౨౭౪

క॥ నీమేలుఁగోరి పలికితి
నీమాడ్కిన్ దూరి, యాతఁ డిట్లనియెని యం
చేమేని ననుకొనకు ! నను
నీ మిత్రునిఁగాఁ దలంపు ! నేఁడు మొదలుగాన్. ౨౨౭౫

వ॥ అని పల్కి యాప్రభువరేణ్యుం డతనికి సత్కరించి, సాదరంబుగ
వీడ్కొల్పుటయు, నతండు తెలివిఁదెచ్చికొని, యయ్యుపాధ్యాయ
మంత్రిప్రభృతులతో నచ్చటనుండి వెడలి, నిజపురంబుఁ బ్రవే
శించి, యయ్యుపాధ్యాయవరుండ తనకు ధర్మోపదేష్టయైయుండ,
మంత్రులమాట గీటునన్ బుచ్చక, ప్రజారంజనంబుగ రాజ్యంబు
జేసి, చిరకీర్తికాగనీ, దివంబునకున్ జనియెనని చెప్పి, యమ్మహాను
భావుండు మఱియు నిట్లనియె. ౨౨౭౬

## శ్రీకృష్ణస్వామి కొండొక యుపాధ్యాయుని యితిహాసము నుపన్యసించుట.

తే॥ కన్న ప్రజలట్ల యరయు, లోకమున వారి
మేల భావించుఁ దనకు నేమియునుగాక,
యఖిలవిద్యార్థులకుఁ గురుం, డనఘమూర్తి;
పక్షపాతంబు, నీసుఁ, గోపమును లేవు. ౨౨౭౭

క॥ తన వృత్తియ పరమనిద
ర్శనమై, విద్యార్థులకు ముదం బొడఁగూర్పన్,
ఘనుఁడు గురుం డొకపక్షం
బు నూఁద, కత్యంతదీక్షఁబూని మెలంగున్. ౨౨౭౮

వ॥ దీనికి నిదర్శనంబుగ నొక మహోపాధ్యాయుని యితిహాసంబుఁగూర్చి
చెప్పెదు, వినుం! డని యప్పరమవక్త యిట్లనియె. ౨౨౭౯

క॥ ఒకయూర మహాత్ముఁడు కలఁ
డొక గురువర్యుఁడు, దరిద్రుఁ, డున్నతవిద్యా
ధికుఁడుఁ, గుటుంబియు, దృఢనై
ష్ఠికుఁ; డాతనికీర్తి వెలసెఁ జిరకాలంబుల్. ౨౨౮౦

వ॥ అతం డయ్యూరివారి మేలకోరుచు, బహువిద్యార్థిగణసంభృతం
బైన పాఠశాలయందు నానావిద్యాకళాబోధనంబునందె నిత్యంబును
మగ్నుండై యుండు, నిట్లు కొంతకాలంబునన. ౨౨౮౧

తే॥ అతనికొడుకు, నావిద్యార్థులందు నొక్క
బాలుఁడును, సాటిమై నొక్కపాఠ, మొక్క
శాస్త్రమున దృఢదీక్షమైఁ జదువుచుండి;
రెప్డు వారిద్దరు సముల యెల్లకళల. ౨౨౮౨

వ॥ అప్పాఠంబు వారిద్దఱకును సులభగ్రాహ్యంబుగాక, యతిదృఢదీక్షా
కలితపఠనసాధ్యం బగుటయు, నాలోచించి, యగ్గురుపుత్త్రుండు తన
సహపాఠియగు నబ్బాలుని కిట్లనియె. ౨౨౮౩

తే॥ ఎల్లకళలందు సాటిమై నింతదనుక
వచ్చితిమి; మేల; కాదనవచ్చునెట్లు?
కాని మన నేఁటిపాఠంబు కష్టసాధ్య
మట్లు రూపించెడిని, దొంటియట్లుకాదు. ౨౨౮౪

వ॥ దీని యందు మన ప్రజ్ఞా బలంబు సూపనై యుండు, నిందు మన
యిద్దఱిలో నెవ్వండు మున్ను కృతార్థుండగు? వాఁడ రెండవవాని
కన్న నధికుండని ప్రకటించికొన నగుఁ గాదే? యనుటయు విని,
యబ్బాలుం డిట్లనియె. ౨౨౮౫

తే॥ అంతమాత్రన సాల; దెట్లయ్యెఁ బన్ని
దంబునక దిగ నీ విట్లు తలఁచి పలికి;
తేను గాదందునే? బుద్ధిహీనుఁ డనరె
కాదనినఁ దోడిబాలు రొక్కమొగి నవ్వ? ౨౨౮౬

వ॥ కావున నా తలంచిన పన్నిదంబు చందంబు వినుము. ౨౨౮౭

తే॥ అందు మున్నెవఁడు కృతార్థుఁ డగు? నతని క
వశ్యమున్ దన యోటమి వల్కి, నేయ
వలయుఁ బరిచర్య నోడినవాఁడు దాసుఁ
డై వినయ మొప్పఁ బండ్రెండు హాయనములు. ౨౨౮౮

క॥ దీనికి నేమందు? వనుము!
నా నగ్గురుసుతుఁడు మోమునన్ నగ వొప్పం
గా నిట్లను నీ వంతకు
నై నన్ నేఁ గానె? నిల్పు! మప్పన్నిదమున్. ౨౨౮౯

వ॥ అనియె నిట్లు వారిద్దఱు పన్నిదంబునకు దిగుట కుల్లాసంబుదోఁప, దోడి విద్యార్థు లొక్కఁ డొకండున్ జేరి, పెక్కు లాడి, వారికి నుత్సాహంబుఁ గల్పించి, యప్పన్నిదంబును సుదృఢతరంబుఁ గావించిరి ; పదంపడి ప్రొద్దు వోయె ; వారంద ఱిండ్లకున్ జని ; రగ్గురు పుత్త్రుం డిల్లుసేరికొని, యొకమూల మంచము పయిన్ బరుండి, వేళకుఁ దిండికి రాక, తల్లి పిలుపున్ బాటింపక, నిరశన దీక్ష వట్టి న ట్లుండె ? నది విని గురుండు సని వాని కిట్లనియె.

ఒక మహాగురుండు పన్నిదంబు జఱచిన తనకుమారునిన్
గినిసి పలుకుట.

క॥ ఇది యేమి ? కొడుక ! కుడువవు !
సదువవు ! మంచంబు వట్టి సాలఁ గలఁగె ! దొ
ప్పదు నీ చందము, చెప్పుము !
మదిఁగల యంతయును నలుకమాని తిరముమై. ౨౨౯౧

వ॥ అనుడు నబ్బాలుండు తండ్రి కిట్లనియె. ౨౨౯౨

క॥ నామాటన్ సెల్లింపుదె,
యేమిటి కీ గాథ యనక ? యెఱిఁగింతున్, దం
డ్రీ ! మేల తలంపుము ! నా
కై ; మర్మము వోల ; దట్ల యానను ! మనవే ? ౨౨౯౩

వ॥ అనుడు నతండు కొడుకున కిట్లనియె. ౨౨౯౪

క॥ ప్రేమకు నెంతేనియు నగు
నీమేలుఁ దలంప నెట్లు ? నేఁ డరయ నిదే
మో ? మాట మొలకువకు దిగి,
తేమిటి కది ? విప్పి సెప్పు ! మేర్పడ దానిన్. ౨౨౯౫

క॥ నీ చెప్పెడి దంతయు విన,
కే చొప్పును లేక, పల్కు నెట్లగు నా? కా
లో చింపఁ గాదె? పెద్దలు
వాచెడి పల్కుదురె? తగవు వట్టరె యెందుక్? ౨౨౮

క॥ చెప్పుము! దాచక, మఱి నీ
చెప్పెడి దెల్ల విని, మేలు సేయ నయిన, నా
చొప్పునకు దిగుదుఁ; గాదే
నప్పటికిన్ దగిన చంద మరయుదుఁ, బిదపన్. ౨౨౯

వ॥ అనుటయు నబ్బాలుండు తన మేలున్ దలంచియు, నతని యెడలఁ దనకుఁగల చనవు భావించియుఁ, దనకును దన సహాధ్యాయునికి నైన పన్నిదంబు చందం బెఱింగించుటయు, విని యగ్గురువర్యుం డిట్లనియె. ౨౨౧

తే॥ చదువు నందు నీ మాత్రపు సాహసంబు
మేల; కాని, పన్నిద మెట్లు మేలు కాదు;
దాని వలన మాత్సర్యమున్, దాని వలన
నీసుఁ, బుట్టు; నదియ హానికెల్లఁ గుదురు. ౨౨౫

వ॥ అయినను బన్నిదంబు నిశ్చితంబయ్యెఁ; గావున, దాని వలననగు ననర్థంబున్ దడవికొనుట వలన నిప్పుడు మేలు లే; దట్లగుటన్ జేసి.

తే॥ దేని నమ్మి నీ వింతకు దిగితొ? యాశ్ర
యింపు మా ప్రజ్ఞ నోలిమై; నేను మెచ్చ
నెట్లు నగ్గాథ; నేన కా దెవ్వరు నది
పోలు ననరు; పాఠము త్రోవఁ బొమ్ము! లెమ్ము! ౨౩౦౧

వ॥ అనుడు నబ్బాలుం డిట్లనియె. ౨౩౦౨

తే॥ నీవ కలవను ధైర్య మన్నిఁటికి నాకు
నింతకున్ దోడుపడు చుండ, నేను డిగితిఁ
బన్నిదమునకుఁ; గాన నా పక్షమూఁది,
జయముఁ గూర్పవె! నాతప్పు సైచి, తండ్రి! ౨౩౦౩

క॥ ఏ నోడుట యన నీ కవ
మానకరము గాదె? నన్ను మన్నింపవె? నా
ప్రానిక నెఱపవె? నీ కేఁ
గానే? ప్రేమకుఁ దతి యిది కాదే నెఱపక? ౨౩౦౪

వ॥ అనుడు నగ్గురువరుం డిట్లనియె. ౨౩౦౫

తే॥ ఎంతలాడితి? తగునె నా కెన్నఁడేనిఁ
బక్షపాత? మొరుల నమ్మి, పన్నిదమున
కెవ్వఁ డేనియు దిగునె? మే లెట్లు దాన?
నెఱుఁగ కిట్లంటి; దానికి నేమి? వినుము! ౨౩౦౬

వ॥ విద్యనొసంగుట యొండె తనకర్తవ్యంబునాఁ దలంచు వెంగలి మాట మాటకాదు, సద్గురుండు తన విద్యార్థిగణంబునకు విద్యతోడన సౌజన్యంబును గూర్పనై యుండు; నతనికది పరమ కృత్యంబును ధర్మంబునున్గా నెఱుంగు; మట్లుగాన నీ వాదిగాఁగల నీ సహాధ్యాయులకెల్ల మార్గోపదేష్టనైన నేన నీయందలి వాత్సల్యంబు నక్జేసి, పక్షపాతంబునకు దిగిన నెంతనిందకును బాపంబునకును నగుదునో? నీవ సెప్పు! మనుటయు, నబ్బాలుండు తన తండ్రి వలన నెట్టిసాయంబును బడయరామికి వగచి, ధైర్యంబు నవలంబించి, యుత్సాహంబున్ గల్పించికొని, శ్రద్ధమైఁ బాఠంబు సదువు చుండె; నక్కడ నట్లు గురుపుత్రునితోఁ బన్నిదంబు జఱచిన బాలుండును బాఠంబునందు దీక్షవట్టె; నిట్లు వా రిరువురును జదివి చదివి బహుజనసమక్షమ్మున నగ్గురుసత్తముని పరీక్షకువచ్చి; రందు

గురుపుత్త్రుం డోడెఁ ; దత్సహపాఠి గెలిచెఁ ; బదంపడి యగ్గురు
వర్యుం డట్లోడిన కొడుకు నుద్దేశించి, యిట్లనియె. ౨౩౦౮

తే॥ పన్నిదంబు ననుసరించి, పరమనీతి
సేయు ! మీ నీ సహాధ్యాయు సేవఁ ; దప్పు
నెట్లుఁ గాదుసుమీ ! తప్పితేని నీ ము
గంబు వీక్షించువాఁడ నేఁగాను ; నిజము. ౨౩౦౯

వ॥ అని కొడుకుతోఁ జెప్పి, పిదపఁ దత్సహాధ్యాయునితో నిట్లనియె.

క॥ వీఁడు మదాత్మజుఁడని మో
మోడక సేవఁగొను ! నా కయుక్తంబది నాఁ
గూడదు సూ ! పన్నిద మా
నాఁ డమ్మెయి నయ్యెఁ ; గా దనఁగ నిపు డగునే ? ౨౩౧౦

వ॥ అనుటయు నబ్బాలుండు వినయంబుదోఁప నతని కిట్లనియె. ౨౩౧౧

క॥ నీ కొడుకు చేతఁ బనిఁగొన
నా కగునే ? నన్నుఁ గాదనరె యట్లైనన్
లోకులు ? విడిచితి నీతని
నా కం దధికారముంట నా యిష్టమ్మై. ౨౩౧౨

వ॥ దాని కచటఁ గూడియున్నవారందఱు మేల్మేలనిరి ; పదంపడి
యయ్యుపాధ్యాయుండు వారినెల్లఁ గనుంగొని యిట్లనియె. ౨౩౧౩

తే॥ పన్నిదం బేరికిని గానిపని, వినింద్య ;
మిచ్చమై దానికిన్ దిగు నెవ్వఁ ? డతఁడు
వ్యసనముల కన్నిఁటికి దాసుఁడగుఁ గ్రమక్ర
మంబుగన్ ; దప్పి మఱి ధర్మమార్గమునకు. ౨౩౧౪

వ॥ పన్నిదంబు పెక్కురూపులుఁగైకొని, సకలప్రపంచంబును జెఱచు
చున్నయది, దానిక వగచుచుందు ; మఱి నా శిష్యులయం దీరీతి
నది ప్రవేశించుటన్ గూర్చి యేమనను, యెట్లు వగవను జాల ; నని
పలికి యతం డవ్విద్యార్థి గణంబునెల్ల గర్హించుచు, మఱియు
నిట్లనియె. ౨౩౧౫

తే॥ పన్నిదములందు నిచ్చలున్ బారువారుఁ
గలరె మీలోనఁ ? గలరేని గాధఁ బెనుప,
కీడ్ప లేచిచనుండు ! మీకేఁటి విద్య ?
నాకు, లోకంబున కది లజ్జాకరంబు. ౨౩౧౬

తే॥ నాకొడుకుఁ, దత్సహాధ్యాయు నాపలుకున
నిడ్ప తఱుముఁడు ! వాండ్రు కా రెట్లువిద్య ;
కేఁటివిద్య దుర్వృత్తికి నెడ్పుఁ బాలు
వడెడివాండ్రకుఁ ? గీడగువాండ్రవలన. ౨౩౧౭

తే॥ విద్య దుర్మతికిఁ గాదు ; విద్యకలద
యేనిఁ దోడ్పడు రెండింత లెడ్పువాని
కాని వర్తనమునకది ; హాసివుట్టు
వానివలనన జగతికి ; వాఁడును జెడు. ౨౩౧౮

వ॥ అనిచెప్పి పన్నిదంబు సఱచిన యయ్యిరువురు విద్యార్థులను దక్కన
విద్యార్థులచేతఁ బాఠశాల వెడలనడిపించి, యయ్యుపాధ్యాయుండు
తన యార్జవంబుఁ బ్రకటించికొనియె ; మీరును నట్టి తెఱంగుఁ
గోనుం! డని యయ్యుపాధ్యాయుల హెచ్చరించి, యప్పరమాత్ముండు
మఱియు నిట్లనియె. ౨౩౧౯

తే॥ దీక్షమై జీవితంబెల్ల దినము లోక
సేవకొఱక చెల్లించు విశిష్టుఁడరయ

సద్గురుఁడు ; తప్పఁ డతఁడు ప్రశాంతిఁ ; గలఁగఁ
డాపదలఁ ; దాల్మినూఁది యొప్పారుచుండు. ౧౩౨౦

వ॥ దీనికి నిదర్శనంబుఁగా నొకయితిహాసంబు నుపన్యసింతు ; నని
యమ్మహోపజ్ఞానిధి వారి కిట్లనియె. ౧౩౨౧

## శ్రీకృష్ణస్వామి సహనశీలుండగు నొకయుపాధ్యాయుని యితిహాసముఁ జెప్పుట.

క॥ ఒకయూరఁ గలఁడు భవ్యుం
డొక సద్గురుఁ, డమలబుద్ధి, యువకుఁడు, మహనీ
య కళానిధియుఁ, గుటుంబియు,
సకలజగన్నుత వివేకశాలియు, ఘనుఁడున్. ౧౩౨౨

తే॥ అతని యిల్లాలు సాధ్వి, గుణాఢ్య, యతని
కెల్ల విధముల ననురూప, యిద్ధబుద్ధి
శాలిని, యువతి, పరమప్రశస్తశీల,
మహితవిద్యావతియు, లోకమాన్యవృత్త. ౧౩౨౩

క॥ పతిధర్మము సర్వం బా
సతియం దాతండు సూపు ; సక్కనెఱవు సం
తతము సతీధర్మం బా
పతివ్రతయు నతనియెడ నభంగుర నిష్ఠన్. ౧౩౨౪

తే॥ కావునను వేయితెఱఁగుల గణుతికెక్కె
వారి దాంపత్యధర్మము ; వారి కారు
నెలలు నిండని యొక మగ నిసువు గలఁడు ;
కలదు సద్వర్తనముఁ బ్రజాగౌరవమును. ౧౩౨౫

వ॥ ఇట్లగ్గురువరుం డనురాగవతియగు సహధర్మిణియుఁ, బ్రేమా
నిధానంబగు చిన్నినిసుఁగును మనంబున నుత్తేజంబు గలిగింపఁ,

ప్రజాగౌరవంబు దానికిఁ బెక్కు మహిమంగులు వన్నియఁ గూర్పఁ, బాఠశాలయ యేకాంతమందిరంబు గను, లోకహితంబ పరమ మంత్రంబుఁగను, భావింపుచు వర్తింపుచు నుండు నంత. ౨౩౨౬

క॥ ఒకనాఁ డాతనిసతి గుం
డెకాయలో నొప్పిగదుర డీలువడియె, మా
టికిఁ బడుచు, నింట లేచుచు,
నొకతెయు పతి పాఠశాల నుండు తఱిఁ గదుర్. ౨౩౨౭

వ॥ అతండు విద్యార్థులకుఁ బాఠంబులు సెప్పుచుండుటను, వేళ కామిం జేసియు, నింటికి రాక, సహధర్మిణికి నాకస్మికంబుగ సంభవించిన హృదయ రోగోపద్రవంబునందు, నోపుకొలఁది నుపచారంబుసేయు భాగ్యంబునకు నోఁచికొనండయ్యె, నంత. ౨౩౨౮

క॥ ఒరు లెఱుఁగని సావున కా
పరమసతి మహాగుణాఢ్య పాలాయెన్ బొం
పిరి వోని హృదయరోగ మె
దిరి మృత్యువ యగుచు నాచి, దిగ మ్రింగికొనన్. ౨౩౨౯

వ॥ అంత వేళ యగుడుఁ బాఠశాలనుండి యప్పరమోపాధ్యాయుం డింటికి వచ్చి, విగత ప్రాణమై, మంచంబు పయిన్ బడియున్న కులసతిన్ గాంచి, సంభ్రమంబునఁ జేయిఁ బఱపి, తడవి, సూచి, మృత యగుట యెఱింగి, ప్రక్క యింటి యిల్లాలిన్ బిలిచి, యిది యేఁటి యాపద? యని యడుగుటయు, నాయమ వెఱచుచు, నుమ్మలిక దోఁపఁ, గంపితకంఠయై యి ట్లనియె. ౨౩౩౦

క॥ ఏ నేమియు నెఱుఁగన్, దం
డ్రీ! నాచెలి, పేరుఁగొన్న యిల్లా, లదియే
మో? నేఁడు నన్నుఁ బిలువక,
తా నేఁగెన్ దివికి మాయదైవము సేఁతన్. ౨౩౩౧

తే॥ సుగుణముల కుప్ప, నా చెలి, సుందరాంగి,
యన్నియుఁ దెలిసికొన్న మహాత్మురాలు,
నీకు, నీ చిట్టిపట్టికి, నాకు లోక .
మునకుఁ, గా కేఁగెఁ బరలోకమునకు నొంటి. ౨౩౩౨

ఉ॥ అక్కట ! యూరికెల్లఁ దోడవై మనినట్టి సతీలలామ, తా
నెక్కడి దేవలోకమని యిమ్మెయి నిందఱ వీడిపోయె ? నా
చక్కని చుక్క, యా పరమసాధ్వి తలంపదె నిన్ను, వెండి మ ?
మ్మెక్కడి మాయబుద్ధి జని యించెనొ యాయము ? కింక నేమనన్ ?

చ॥ అలుక నెఱుంగ దించుకయు ; నాప్తికిఁ, దాల్మికిఁ, దప్పదెన్నఁడున్ ;
దొలఁగదు ప్రేమకున్, జనవుఁ దోఁపఁగఁ బల్కఁగ నిచ్చు నెల్లరన్,
బలుకుఁ బ్రియంబుమైఁ జెవులు పండువుఁగా నమృతంబుఁ జిల్కుచున్
గులసతి కింతవుట్టె నఁటె గోరము ? దైవము సేత కేమనన్ ?

తే॥ మాలదైవము చూడ్కికి మా ప్రియసఖి
యింత వ్రేగాయెనే ? ధర్మ మెందుఁ బోయె ?
యేఁటి బ్రదుకన ? యీగోర మెందుఁ గలదు ?
కటకటా ! యింక మా చెలి కానఁబడదు ! ౨౩౩౫

క॥ నా కన్నతండ్రి ! బ్రదుకుదె
లోకంబున నింక నీవు ? లోకమనంగా
నీ కేడఁ ? బోయెఁ గాదే
యా కులసతి తోన సర్వ మకటా ! యిమ్మె ? ౨౩౩౬

ఆ॥ ఈ యకాలమరణ మీ గాధ నేమందు ?
నేమి సేయవచ్చు ? నెయ్యది గతి ?
కలదె పేరనంగ, గౌరవ మనఁగ నీ
యూరి కింక ? నెంత గోర మాయె ? ౨౩౩౭

క॥ చిన్ని నిసువు, నిన్నున్, మఱి
నన్నును, మన యూరఁ గల జనమును దలఁచుచున్
గన్నీ రొలుకఁగ నేడువ
కున్నే నా ప్రియ సఖి కొన యూర్పున? నకటా! ౨౩౩౮

క॥ ఈ యాకస్మికకపున్ సా
వా యిల్లాలికి, గుణాఢ్య కగునే? ధర్మం
బే యడవిపాలన్ బోయె నొ
కో? యెరికి నేని యింత గోరము ననునే? ౨౩౩౯

క॥ నా మనస యింతకలిగిన
నీ మనసున్ గూర్చి యేమనినఁ జాలున్? దం
డ్రీ! మగ దొర! వార్తిన్ బడ
కేమయి నేనియును బట్టు! మెద ధైర్యంబున్. ౨౩౪౦

క॥ నిను సూచికొనుచు నేనియు
మనసు కుదుటఁ బడగ, నడలు మఱపునకున్ రా,
మన యూరి ప్రజలు, మఱి నే
నును బ్రదుకుదు, మీావు ధృతిఁగొనుము! విడువు! వగన్!

క॥ కొనవే తండ్రీ! నావ
ల్కు? నీకు బోధింప నా కగునె? లోకము నె
ల్లను బోధింపన్ జాలుదు
వనయము నీవ, యిది వుట్టె నకటా! యిమ్మై. ౨౩౪౨

క॥ ఈచిన్ని నిసుఁగు నీకున్
బ్రోచికొనఁగ విడిచి, సక్కఁ బోయెన్ దివికిన్
నా చెలి, సుశీల; యకట! స
దాచారసమేత, ధర్మమరయద యిమ్మై? ౨౩౪౩

వ॥ అని యతనితోఁ నేడ్చుచుఁ బెక్కులాడి, యంతకంతకుఁ బొంగి,
పొరలి వచ్చు శోకంబున్ దిగమ్రింగికొనఁ జాలక, మనంబు పట్టు
సెడి, యయ్యింతి యావురని యేడ్పుటయు. ౨౩౪౪

క॥ ఊరఁ గల వారందఱుఁ
జేరికొనిరి గుంపులుఁగొని చెచ్చెర, నా శో
కారావము విని, యట కా
గోరం బది యేమొకో ? యనుకొనుచు బిలబిలన్. ౨౩౪౫

వ॥ ఇట్లువచ్చి, వారాపొరుగింటి యిల్లాలివలన నంతయువిని, యేమియు
ననకయు, మొగంబు వాడకయు, నిర్వికారస్థితినున్న యయ్యుపా
ధ్యాయు నవలోకింపుచు. ౨౩౪౬

తే॥ కంటఁ దడివుట్ట, నట్టె మొగములు వాడ,
గద్గదిక దోఁప, మనసులుఁ గలఁగ నేడ్చి
రొక్క పట్టున ; వారిలో నొక్కఁడేని
లేఁడ యని చెప్ప నగు వంత లేనివాఁడు. ౨౩౪౭

వ॥ ఇట్లు వగచుచున్న వారినెల్ల నయ్యొజ్జ తెఱంగులు సూపి, చెప్పి, శోకం
బునకుఁ దప్పించి, యప్పరమ ధృతిమంతుండు వారు తోడ్పడ, నిజ
సహధర్మిణి దహనసంస్కారాదివిధులు సత్వరముగ దీర్చికొని, తన
చిన్నినిసుఁగు నొక్క పుణ్యాత్మురాలికిన్ బెనుప నిచ్చి, యేమి
యుఁ గందక, కుందక, యుత్సాహం బలవరించికొని, పాఠశాలన్
బ్రవేశించి, తొంటియట్ల శాంతిమెయి విద్యార్థులకుఁ జదువుఁ
జెప్పుచుండె ; నివ్వార్తవిని యొక్క నృపాలుం డాతని నిర్వికారస్థితి
కిని, లోకాభ్యుదయ దీక్షకును, దృఢవివేకంబునకును నచ్చెరువును,
సంతసంబును, మనంబునఁ బెనంగొన, మంత్రులును, సామాన్యులును
రాఁ, బెక్కురథంబులతో వచ్చి, యొక్కెడ విడిసి, మంత్రులన్

బంచి, యాతనిన్ బిలిపించికొని, యుచితసత్కారంబులఁ దనిపి,
సగౌరవంబుగ నిట్లనియె. ౨౩౪౮

ఒకరాజు పరమోధ్యాయుని సత్కరించి పల్కుట.

తే॥ అనఘ ! మా మంత్రులకును మాన్యజనములకు,
నిన్నుఁ బెద్దగ నెప్పుడు నిల్పికొనఁ, ద
లంచి వచ్చితి ; నా యభిలాష సెల్ల
నిమ్మ !, నినుఁ బోలు ప్రాజ్ఞుల కేల సెప్ప ? ౨౩౪౯

క॥ మా రాజ్యమందుఁ బెక్కులు
కోరికలఁ దగంగ నిత్తుఁ, గూర్తుఁ బ్రియము, స
ద్గౌరవ భావము సూపుదు,
మాఱాడక యిష్ట రమ్ము ! మాతో నెమ్మిన్. ౨౩౫౦

క॥ కా దీయూరి బ్రదుకు నీ ;
కాదరణీయుండవు వసుధాది పతులకున్ ;
నీ దృఢధైర్యజ్ఞానమ
హోదయముల కూరి బ్రదుక యోగ్యము కాదే ? ౨౩౫౧

ఆ॥ విసిగికొనక, తాల్మి విద్యార్థులకుఁ గూర్చి,
యవియు నివియు నిప్పు డప్పు డనక,
చెప్పికొనుట యంద సెల్లింతువయ్య య
పారమైన బుద్ధి బలము సెల్ల ? ౨౩౫౨

తే॥ నీకు, నీవారికిన్, మఱి లోకమునకు,
నేఁటిమేలు దీని వలన ? నెఱుగ వెట్లు ?
నీకుఁ జెప్పవలయునే వినిర్మలమహా
నీయబుద్ధివి ! నామాట నిల్పి, రమ్ము ! ౨౩౫౩

క॥ అనుడు నతం డాతని కి
ట్లను మీాదయకై తి, సాలు నంతియ ; నా మే
లున కింతలు మీా రంటిర
యని యెఱుఁగుదుఁ ; గాదు కూడదనరా దెల్లన్. ౨3౫౪

వ॥ అయినను సాలనరసి యరసి, వృత్తికిఁ జొచ్చినవాఁ డది విడిచికొన
వలయునంతలు పుట్టినప్పుడు తన యోపుకొలందిఁ జర్చకు దిగు
టయు మేలు కాదే ? కావున బుద్ధి కొలఁదిఁ జర్చించి, మఱి విన్న
వించు నా పలుకులవధరింపుము. ౨3౫౫

తే॥ చదివితి నొకింతఁ ; బడసితి శ్రద్ధఁజేసి
కొన్ని కళలు ; వివేకంబుఁ గూర్చికొంటి ;
నుడుతభక్తి సూపింపఁగా నుద్యమించి
తివ్విధమున లోకంబున కించుకంత. ౨3౫౬

క॥ ఇది నాకు మార్చికొనఁ బో
లదు ; పెద్దలు కావు నాకొలందులకున్ ; నా
యది యూరి బ్రదుక ; నిక్కం ;
బిది కాదని చుల్కనాడ నేరికి నగునే ? ౨3౫౭

తే॥ గాథలన్ బెంచికొన నాకుఁ గాదు ; కాని
యూరి బ్రదుకుఁ గాదని రోయు టొప్పద యని
విన్నవింతు నీమాత్రము ; వేయునేల ?
నలుక వలదు నాపయి దీని కనఘచరిత ! ౨3౫౮

తే॥ శాంతి, కారోగ్యమునకు, విశ్వాసమునకు,
నార్జవమున, కన్యోన్యసాహాయ్యగౌర
వానుబంధంబునకుఁ, బ్రేమ, కరయఁ బేరుఁ
గొన్న దూరి బ్రదుక కాదె యెన్నఁగను. ౨3౫౯

తే॥ ఊళ్ల వలనన కరముఁ బెంపొందుచుండఁ
బట్టణములు, రాజ్యము, లను పలుకువినవె?
కావున గరంబులని పల్కఁగాదు; కాని
కలదు భేదంబు సాల; నగ్గాథయేల? ౨౩౬౦

వ॥ ఇది యిట్లుండనిండు. ౨౩౬౧

తే॥ కవియు, గురుఁడును, రాజును, గర్షకుండు;
నల్వురగుదురు లోకంబునకు సతంబు
నెల్లప్రజలందు నంద్రు; మీ రెఱుఁగరెట్లు?
కాదు పెద్దయుఁ ద్రవ్వ నగ్గాథనిపుడు. ౨౩౬౨

వ॥ ఇంచుక విన్నవింతు నవధరింపుము. ౨౩౬౩

తే॥ ఈశ్వర ప్రతినిధియ మహీశ్వరుండు
ప్రజల; కాతని సద్ధర్మపాలనమున
వారు గాంతు రభ్యుదయము; వారి వలన
నతఁడుఁ బడయు మహాఫల మందు, నిందు. ౨౩౬౪

క॥ అనయమును బ్రజాదేవుం
డను కీర్తివహించుఁ, బ్రజల కందఱ కభిరం
జనముఁగ రాజ్యముఁ గావిం
చుఁ, నధిపుఁడు భవాదృశుండు సూ ప్రభువర్యా! ౨౩౬౫

వ॥ రాజులేని ప్రజలు కాపరిలేని గొఱియలుఁ బోలె నభివృద్ధికిఁ రామి
తెల్లంబు, వెండియు. ౨౩౬౬

తే॥ విద్యతోన సౌశీల్యముఁ, వెరవుఁగూర్చు
గురుఁడు ప్రజలకు, వారు బాగునకు నగుదు;
రమ్మెయిన్ వారు బాగునకగుట మేలు
ప్రభువునకును; సద్గురుండును బడయుఁగీర్తి. ౨౩౬౭

వ॥ కావున నన్నుంబోలు గురువుల వలన నిబ్బంగి మేలగుటన్ జేసి,
మిమ్ముఁబోలు పరమభూపాలురు తమతమ రాజ్యంబులందుఁ
దమకుఁ బోలినట్లు గురుకులాశ్రమంబులు నెలకొల్పుచుందు; రిది
యిట్లుండ నియ్యుర్వర నోపుకొలందిఁ బ్రజాశ్రేయంబునకై పాటు
పడు నన్ను మంత్రిన్ జేసికొనుట మీకేఁటిమే; లదియునుంగాక.

క॥ ఏనెట్లు మంత్రిపదవికిఁ
గా; నంతటి ప్రజ్ఞ నాకుఁ గలదే? తగునే
కానిపనికి దిగ నేమియు
నానఁ దలంపక, మఱియును, నా కోలఁదులకున్? ౨౩౬౯

క॥ వలవనివానికి నొసఁగినఁ
గలదే యధికారపదవి గౌరవమన? మీ
యలుకకుఁ జాల, ననున్ గృపఁ
దలఁచి విడువుఁ! డేను మీకు దాసుఁడ నెట్లున్. ౨౩౭౦

తే॥ అనుడు నతని శీలంబున కలరి, యమ్మ
హీశ్వరుఁడు బల్మిసూపఁగ నియ్యకొనక,
యెద్దియేనియు నొకకొంత యీయఁ దలఁచి
యనియె నాతనితో నిట్టు లాదరమున. ౨౩౭౧

తే॥ కోరికొను మెద్దియేనియుఁ; గూర్తు, రిత్త
బోనగునె నాకు? ననవుడుఁ బోవ దెట్లు
ననుచు వినయంబు దోఁప నిట్లనియె నాతఁ
డానృపాలునితోఁ బెక్కులాడ నోడి. ౨౩౭౨

క॥ కులకాంత నచ్చె; నొసఁగితిఁ
గలిగిన నినువు నొకపుణ్యకాంతకు బెనుపన్;
గల రూరివార యంతకు
నెలమి; నెఱుఁగ నెట్టిలోప; మే నొక్కరుఁడన్. ౨౩౭౩

తే॥ కాన నా కెవ్వియును గోరఁగావు; రిత్త
కోరికలు మేలె దాతలు కూర్తుర యని;
యే నపాత్రతముఁడ నెట్లు దానమున; క
పాత్రదానము మీ కేలఁ బార్థివేంద్ర! ౧౩౭౪

తే॥ ఈయఁదలఁచినఁ గల రెందఱేని దాన
పాత్రతము; లీవికి వలదె ఫలము? నన్ను
రిత్త గారింపకుఁడని ప్రార్థింతుఁ; బెక్కు
లాడనయ్యె నాకిబ్బంగి; ననఘ! కావు! ౧౩౭౫

వ॥ నావుడు నమ్మహారాజాతనిధర్మనిష్ఠకుఁ బెద్దయు నలరుచుఁ, గొన్ని
హేమనిష్కంబులను, నమూల్యకౌశేయపట్టంబులకట్టలను దెప్పించి,
యాతని నతిగౌరవంబుమై వీక్షింపుచు నిట్లనియె. ౧౩౭౬

ఆ॥ ఇంద! కొనుము! వీని, నీవు దానముఁగొనఁ
గావె? దానికేమి? కాంక్షలేదు
నాఁకు దానఫలమునన్; నీకొసఁగుటయ
యభిమతంబు; తీర్పుమయ్య! దాని. ౧౩౭౭

వ॥ దీనికింక నీ వేమేనియుఁ బలికెదవేని, నది నన్నవమానించుటయ
సుమీ! యనిపల్కి తన పల్కునకు నిరుత్తరుండై, సమ్మతంబు
సూచించు నగ్గురూత్తముని కవియన్నియు నిప్పించి యమ్మహారాజు
మంత్రులుమొదలుఁగాఁగల వారితోఁ దన రాజధానికరిగె; నతం
డట్లు చన్నపిదప నప్పరమోపాధ్యాయుండు వానినెల్ల సంగ్రహించి,
తగినవారి నరసి, తన కేమియు మిగులనీకయిచ్చి వుచ్చె; వింటిరే
యమ్మహాత్ముని త్యాగం? బనిచెప్పి, యాలోకోత్తరపూరుషుండు
మఱియు నయ్యుపాధ్యాయులతో నిట్లనియె. ౧౩౭౮

తే॥ యిట్టి యితిహాసములు కల వెన్నియేని;
వాని నెల్లఁ దడవు టిప్డు మాని, చెప్పి
తింతకున్ గొన్నిఁటిని మాత్ర; మీరు ఘనుల;
రేల గాథఁ బెనుప? దానికేమి? వినుఁడు! ౨౩౭౯

శ్రీకృష్ణస్వామి విద్యార్థులకు సౌశీల్య మలవఱుపుఁడని
యుపాధ్యాయులతోఁ జెప్పుట.

తే॥ ఎన్ని తెఱఁగుల బోధించియేని, మంచి
శీల మలవడఁ జేయుఁడు! సేమ మరసి,
యెల్ల విద్యార్థులకు మీర యెప్పుడున్ ని
దర్శనంబున కగుచు వాత్సల్య మడర. ౨౩౮౦

తే॥ మానుషంబు మీవలనన మహిమఁ గాంచ
నుండుఁ; గవియును, నరపాలకుండుఁ, గీర్తిఁ
బొందుదురు మీపరిశ్రమంబునన; కుదురు
ధర్మదేవతకున్ మీ హృదయము; నిజము. ౨౩౮౧

వ॥ ఉపాధ్యాయత్వంబు బహు బాధ్యతాయుతం బనియు, మానుష వికాసంబునకును, దన్నాశంబునకును నుపాధ్యాయుల పరిశ్రమయ నిదానం బనియును, బలుమాఱులు నుడివితిఁ, గానఁ బెద్దగాథన్ ద్రవ్వుట యవసరంబు గాదు, వినుండు! ౨౩౮౨

క॥ మీ విద్యార్థిగణంబు స్వ
భావవివేకాదిశక్తిపరిణామ విధం
బేవేళ నరయుచుండం
గావలయున్ జుండు! శ్రద్ధ కార్యం బచటన్. ౨౩౮౩

వ॥ పూర్వజన్మ వాసనా విశేషంబునను, బరిసర ప్రభావంబు ననుసరించియు, విద్యార్థుల స్వభావాదులు పెక్కు తెఱంగులై యుండు;

వాని నరయుట యందును, నరసి మంచికిఁ దెచ్చుట యందును మీ ప్రజ్ఞాశక్తి నూపింపనై యుండు; మీరు దానికిన్ బాలువడ రేని, మీవలన లోకంబున కెట్టిమేలును గాకుండు, వెండియు.

తే॥ బోధనోజ్జ్వలమును, గళా భూషితము, వి
శాలమున్, జ్ఞానవిజ్ఞాన సంభృతమునౌ
గావలయు మీ సుధీశక్తి; కాద యేని
మీ గురుత్వంబున నొకింత మేలు లేదు. ౨౩౮౫

తే॥ నృపతికిన్ గర్షకుని కన్న, నృపతికన్నఁ
గవికి, నాతని కన్నను గలదు మీకు
సాల బాధ్యత, దానికి సక్కనగుఁడు!
మీరు లోకంబునకు, నది మీకుఁ గాఁగ. ౨౩౮౬

వ॥ విద్యార్థుల నందఱిని బెక్కువర్గములుగ విభజించుటయు, నొక వర్గంబువా రింకొక వర్గంబువారి కాదర్శప్రాయులై యుండు నట్లు నూచికొనుటయు, మీ కత్యావశ్యక కర్మంబులు, వెండియు.

తే॥ కాదు మాత్సర్య; మది యీర్ష్య గలుగఁజేయు;
సకల దుర్గుణముల కీసు జన్మభూమి;
కాన నెప్డు విద్యార్థివర్గముల మత్స
రంబు వుట్టకయుండ నారయుట లెస్స. ౨౩౮౭

తే॥ అనుభవంబును, బరమబోధనము రెండు
నొకటి కొక్కండుఁ దోడ్పడుచుండు చొప్పు
వలయు; వానికిఁ దప్పినవాఁడు శ్రద్ధ
కలిగియును బాఠములు సెప్పఁ గాఁడు; నిజము. ౨౩౮౮

వ॥ విద్యార్థివర్గ కోమల మస్తిష్క యంత్రముద్రణసౌకర్యార్థ మొ క్కొక్క విషయంబునకుఁ బెక్కు లుదాహరణంబు లిచ్చియు,

గ్రహణ సౌలభ్యంబు సూపియు, వారు గ్రహించుట్టయు, గ్రహింపఁజాలకపోవుటయుఁ దెలిసికొని, విసుఁగునకుఁ జొరక మరల మరల బోధించుటయు, నుత్తమ బోధకుని లక్షణంబులు; కొన్ని గ్రంథంబు లందుఁ దత్తద్గ్రంథకర్తల భ్రమప్రమాదజనిత దోషంబు లుండు; మఱికొన్ని యసంపూర్ణ విషయగ్రంథితంబు లగుటయ్యున్ గలదు; వానిని బోధించు నప్పుడు బోధకుం డెక్కువ విమర్శకున్ జొచ్చి, ప్రజ్ఞ సూపింపనై యుండు; మఱియుఁ గ్రొత్త విషయంబులు గ్రహించుటకును, గ్రహించినవానిని విస్మరింపకుండుటకును, విద్యార్థుల కత్యుత్తమ శిక్ష నొసంగుట యుక్తంబు, వెండియు. ౨౩౯౦

తే॥ అన్నమును వస్త్రమును గృషియంద కలుగుఁ;
గాన విద్యార్థులకు నిచ్చఁ గలుగ సేఁత
మేలు కడు దానియందుఁ బేర్మిమెయి వృక్ష
శాస్త్రముఁ గఱపు నెపమున సక్కఁ దెలిపి. ౨౩౯౧

వ॥ పాఠశాలకున్ జుట్టును గొంత ప్రదేశంబు సంపాదించి, యందయ్యై కాలంబులకుఁ దగ నొక్కఁ డొకఁడుఁగ నానావిధఫలపుష్పపత్త్ర త్వక్సారరసప్రదంబులును, బీజకాండకందమూల జాయమానంబులు నగు వివిధతృణలతా సస్యగుల్మవృక్షజాతులను విద్యార్థుల చేతన నాటింపుచు, వారి చేతన వాని దోహద కర్మంబులఁ జేయించుచు, నయ్యైకాలంబుల నవి యిచ్చు ఫలాదుల గ్రహించి భద్రపఱుప నియమించుచు, వాని వలన లోకంబునకగు మేల్లన్ గూర్చి వారికి బాగుగ బోధపడునట్లు బోధించుచు, వృక్షశాస్త్రం బనుభవ గోచరంబుసేయు టత్యావశ్యకంబు, మఱియును. ౨౩౯౨

తే॥ కృషిన కా కెల్లకళలు బోధింపవలసి
యుండు విద్యార్థులకు నొక్కఁ డొకఁడు, వారి

వారి వృత్తులకుఁ దగ; వారు వాని
వలన జీవింప నగుదు రావల సుఖముగ. ౨౩౯౩

తే॥ ఇట్లు సకలశాస్త్రంబుల నేర్చి, యేర్చి,
యొక్కఁడొకఁడు బోధించుట యొప్పు వారి
ప్రజ్ఞకున్ దగ; బోధింపఁ బడినవాని
నప్పుడప్పు డడిగి తెలియు టదియు లెస్స. ౨౩౯౪

శ్రీకృష్ణస్వామి మానుషశాస్త్రావశ్యకత నెఱింగించుట.

క॥ మానుషశాస్త్రమునందు దృ
ఢానుభవముఁ గల్గనేఁత యదియెంతయు మే;
లే నెప్పుడు శ్రద్ధమెయిన్
దానిన కొనియాడుచుందుఁ, దర్కింతు నెదన్. ౨౩౯౫

వ॥ పరిణామక్రమంబు ననుసరించి, లోహవృక్షమృగజాతులనుండి, యసంఖ్యేయంబులగు నెన్నియేని జన్మంబులకుఁ బిమ్మట మానవత్వం బెమ్మెయినగు? నదియు, నింక నది యెన్నియేని యవస్థలకుఁ బిదప నెట్లు పరిపూర్ణతఁగాంచు? నదియు, విద్యార్థుల మస్తిష్కంబు నాటి కొన ననేకోదాహరణంబులిచ్చి, బోధించుట యన్నిఁటికన్న మిక్కుటావశ్యకంబు; వెండియు. ౨౩౯౬

క॥ మానుషపరిణామపరి
జ్ఞానం బదియొకఁడె చాలు; సౌశీల్యము వి
జ్ఞానము సుజ్ఞానంబును
దానివలనన నగు, వెలయుఁ, దద్దయు వెలుఁగున్. ౨౩౯౭

తే॥ జ్ఞానభక్తిక్రియాయోగశాస్త్రచర్చ
దానియందు యిమిడియుండుఁ; దత్వవేది

యతఁడ యే ధీఘనుఁడు దాని నధిగమించు ?
నతఁడ గురువులకుఁ గురుం, డనఘమూర్తి. ౨౩౯౮

వ॥ కర్మయోగ భక్తియోగ జ్ఞానయోగంబులను మూఁడును మానుష
శాస్త్రంబునందలి భాగంబులకదా ! యని యుపేక్షింపక, వాని
నొక్కఁ డొకఁడుఁగఁ బ్రత్యేకంబు సోదాహరణపూర్వకంబుగ
బోధింపవలసియుండు, నిమ్మాట ననుభవంబు సాలనివాని కమ్మా
నుషశాస్త్రం బవిజ్ఞేయంబ వెండియు. ౨౩౯౯

తే॥ మానుషోజ్జీవనాంచిత మహిమకెల్ల
వారి నగు నట్లుసేత యవార్యకార్య
మెల్లభంగుల మీకని యింతకేను
జెప్పి ; తా చొప్పుఁగొనుఁడు ! మా మెప్పుఁగనుఁడు ! ౨౪౦౦

తే॥ కొన్ని గ్రంథంబులఁ గలవు కొన్నిగాథ ?
లేఁటికిన్ గావు ; వాన విహీనచేష్ట
లన్ విషాగాళి పోలచు విద్యార్థికోటి
కోమల మనశ్శుభ క్షేత్ర సీమలందు. ౨౪౦౧

వ॥ కావున విద్యార్థులు వాని నంటఁ జూడనేనియుఁ గాకుండ నాజ్ఞవె
ట్టుఁడు మఱియును. ౨౪౦౨

తే॥ బ్రహ్మచర్యమహిమ బుద్ధిఁబట్ట, సాల
నెఱుఁగబోధింపుఁ ! డది గొను నెవ్వఁ ? డాతఁ
డొకఁడ మానుషశాస్త్రమం దుజ్జ్వలమగు
ప్రజ్ఞఁ బడయు ; వెలయు నిరపాయశాంతి. ౨౪౦౩

తే॥ మానుషమున సంభోగంబు మహితపరమ
కర్మ ; మది భోగమన్న భ్రాంతి కాదు ; వలయు

నియమ మెల్లవిధముల దాని ; కడి మాని
యిచ్చలకు పాత్తురేనియు నెట్లుఁగీడ. ౨౪౦౪

తే॥ వినుతసంతాన సౌభాగ్యమునకె గాక
యింద్రియసుఖంబునకుఁ జొచ్చు నెవ్వఁడు రతి ?
కతఁడు పశువ ; బలముఁ, దేజ, మాయువును, వి
వేకమును, గోలుపడువాఁడు ; వెండియుఁ జెడు. ౨౪౦౫

క॥ తాను జెడుఁ, జెఱచు మఱి సం
తానముఁ బశువృత్తికెపుడుఁ దవిలిన జడుఁ ; డా
హీనునివలనన్ మిక్కిలి
హానియగున్ మానుషమున కంతకు సతమున్. ౨౪౦౬

తే॥ ఇంద్రియోత్సర్జనంబువం దించుకంత
యేని బాధ్యతలే ; దింక నేడ నియమ
మనఁగ నాదుర్మతికిఁ ? బంది యట్ల కాంచుఁ
బలువురు నిసువులను రెండుపదులు దనుక. ౨౪౦౭

క॥ మితమైథునంబు వలనన్
మితసంతానమగు ; దాన మేలకడున్ దం
తతుల ; కది బ్రహ్మచర్య
వ్రతహానికరంబు కా ; దవశ్యము వలయున్. ౨౪౦౮

తే॥ ఇంద్రియసుఖార్థులై రతి నిచ్చసేయు
దంపతులకు నకృత్రిమోదారసౌహృ
దంబు దుర్లభము, పెరుగుఁ, దఱుగు, లేక
పోవునది కొన్నినాళ్ళకుఁ ; బోరుపుట్టు. ౨౪౦౯

వ. వెండియు.

క॥ రతి భోగంబను భ్రాంతిన్
సతీపతులు బడుదు రేని సనరు తనివి ; జా
రత కగుదు ; రవిశ్వాసం
బితరేతరమున్ గలంచు ; నీసున్ బుట్టున్. ౨౮౧౦

వ॥ సకలమానవకుటుంబంబును బ్రపంచయాత్రయందు సిద్ధిన్ బడయ
వచ్చిన దనియు, నందుఁ బరస్పరసౌదర్యంబు మెఱయ, నకృత్రిమ
ప్రేమకై, సత్సంతానసిద్ధిఁ బడయుట తమకు విధియనియుఁదలంచి
దానికొఱకె బ్రహ్మచర్యంబు చెడనిభంగి, సురతికిన్ నియమంబు మై
సొచ్చి దంపతుల నడుమ జారతావిశ్వాసంబులు పుట్టకుండ,
మఱియు వా రుభయలోకసౌఖ్యసిద్ధిన్ బడయుదురు, వెండియు.

తే॥ సురతి భోగంబునా భ్రాంతిఁ జుండు ! పుట్టె
దంపతులయందు సారసౌందర్యవాంఛ ;
యది యనేకవిధంబుల హానికరము
నిర్మలప్రేమకున్, ధర్మనిరతికి మఱి. ౨౮౧౨

తే॥ బ్రహ్మచర్యంబు సకలధర్మముల కెల్ల
మూలము ; మఱియు నంద యుమ్మాగ నెసంగి
మానుషము సిద్ధిఁ గాంచుఁ ; దన్మహిమ చెప్పఁ
గొలఁది గాదు ; గతి మనుజకోటి కెల్ల. ౨౮౧౩

వ॥ బ్రహ్మచర్యంబున్ గూర్చియు, దాంపత్యధర్మంబున్ గూర్చియు,
నెంత యేనియుఁ జెప్పవలసియుండు, నైనను మన కిప్పుడు వేళ
సాలదు ; విద్యార్థులు బ్రాయంబగుడు గార్హపత్యంబు వహింతురు
కావున నిమ్మాత్రము సెప్పి విడిచితి, వెండియు. ౨౮౧౪

శ్రీకృష్ణస్వామి పాఠశాలా సామీచీన్యంబున్ గూర్చి
యుపన్యసించుట.

తే॥ ఉత్తమంబు తోఁటనడుమ నుంట, మధ్య
మంబు పొలము నడుమ, నధమంబు గ్రామ
మధ్యమునఁ బాఠశాల; గ్రామంబు నంటి
యేనిఁ గా; దొంటినుంట మే లెంతయు నది. ౨౪౧౫

క॥ గాలియు వెలుఁగును రా నను
కూలతమై బాఠశాల క్రొమ్మ రొప్పుట మేల్
జాల; మఱియు సుదృఢంబు, వి
శాలము నగు చొప్పు వలయు సమతలము పయిన్. ౨౪౧౬

తే॥ ద్వారములును గవాక్షులు వలయు నాలు
గేసి యేని, మఱియు నెక్కు వేని దాని;
కున్న తాసనముల నుండు టొప్పు గురువు
లందుఁ గేవలమును బుషు లట్లు పొలచి. ౨౪౧౭

గీ॥ పాఠశాల లుటజముల పగిది నొప్పు
టెంతయును మేలు తోఁటల శాంతి కగుచు;
నందు ఋషిపుత్రులట్ల విద్యార్థు లుండు
చంద మెల్లవిధంబుల సాలలెన్స. ౨౪౧౮

వ॥ విద్యార్థుల కోమలమానసంబులకు నుల్లాసంబును, గాత్రంబులకు వ్యాయామంబును, నావశ్యకంబులు; కావునఁ బ్రాతస్సాయం కాలంబులందు నర్ధయామ ప్రమాణకాలంబు నాటలకుఁ బాటలకు వారిని విడిచి, యుపాధ్యాయులును నందుఁ, బాల్గొనుట యెంత యున్ మేలుః; కొన్ని సమయంబులందు నాటలకుఁ బాటలకు

మాఱుఁగఁ బాఠశాలావరణంబు నందలి కృష్యారామ కర్మంబు
లందు వారిని నియోగించుట యు లెస్స; వెండియు. ౨౨౯

తే॥ అడిగికొనియేని, గుత్తకు నైన నొక్క
పుట్టి డేని, నెక్కువయేనిఁ బొలముఁ బడసి,
చెప్పి, సేయింపుఁ డందుఁ గృషిన్ నొఱంత
కానివిధమున విద్యార్థిగణము చేత. ౨౩౦

క॥ స్వాతంత్ర్యారోగ్యాయు
స్స్థిత శ్రద్ధా ప్రశాంతిజీవనమర్యా
దాతిశయభవ్యగుణ సం
ఘాతము నకుఁ గృషియ పేరుఁ గన్నది కుదురై. ౨౩౧

తే॥ కావున నవశ్యమున్ గృషి కర్మములకుఁ
జొనుపుఁ! డప్పు డప్పుడు మీరుఁ జొచ్చి, వెరవు
సూపి, విద్యార్థులఁ ; గాదు కోప పడుట
యా పనుల నేర్పునకుఁ గార యనుచు వారి. ౨౩౨

తే॥ వాన కాలంబు కూడదు, కాని, యార
బయట నునుగాలి సొంపునఁ బరగు తోఁట
నీడ విద్యార్థులన్ గూర్చి, నిల్పి, సదువు
సెప్పు టెంతయు మే; లట్ల సేయుఁ! డీరు. ౨౩౩

సీ॥ ఆరోగ్యపరమసుఖానుకూల విశేషవిస్ఫూర్తి నునుగాలి వీచుఁ బేర్చి,
గుంపులుగుంపులుఁగూడి, తనివి దేలి, పక్షులెలుఁగుసూపి, పాడునాడు
బరమశాంతికళావిభవముఁ జూపించుచుఁ బ్రకృతిదేవి నిరంతరమును
గ్రాలు, । భ్రమరాదిక వివిధ ప్రాణికోట్లు తమ విచిత్ర లీలలు పోలఁ
జెలఁగు చుండు,

బహువిధ తృణ లతా గుల్మపాదపాభి
రామమగు తోఁట; నందు నుద్దామ కౌతు
కమునఁ గూర్చుండి, విద్యలు గఱచి, ధన్యు
లగుదు, రగుదురు ఘనులు విద్యార్థులెల్ల. ౨౪౨౪

క॥ అవకాశం బగునపు డె
ల్ల వలయు నిమ్మలగు తోఁట లన గురువులు పే
ర్మి వెలయు విద్యార్థులకుఁ జ
దువు సెప్పుట; శాంతికి నగుదురు వారచటన్. ౨౪౨౫

క॥ కేవలమున్ శాంతికిఁ గాఁ
డే విద్యార్థి? చదువునకు నెట్లును గాఁ డం
ప్రా వెడగు; శాంతి తెలివికిఁ
దా వని యెఱుఁగుండు! కావు తక్కిన వెల్లన్. ౨౪౨౬

తే॥ ప్రకటదీక్ష విద్యార్థి కారంభమంద
పుట్ట బోధించి, యది బుద్ధిఁ బట్టఁ, బిదప
నక్షరంబులు వ్రాయింపుఁ డక్కుమారు
చేయిఁ జే వట్టి కొని, సాలఁ జెప్పి, నెమ్మి. ౨౪౨౭

తే॥ ఉచ్చరించుట, వ్రాయుటయును గఱపుఁడు!
బాగుగాఁ జెప్పి యక్షరాభ్యాస కాల
మంద, ప్రత్యక్షరము సహజాకృతిన్ ద
దీయ ధీయంత్రమున రూపుఁదేఱ, వ్రాల. ౨౪౨౮

తే॥ ఎట్టు లే యక్షరము నుచ్చరింపనుండు?
నెట్లు వ్రాయుటయో? యివి యెల్లఁ దెలియ
బాగుగాఁ గఱపుఁడు! బాల బాలికలకు;
నది దృఢంబేని సులభసాధ్యంబ విద్య. ౨౪౨౯

క॥ అడిగిన తోడన యించుక
తడవి కొనక, పలుక, వ్రాయఁ దగు ప్రజ్ఞఁ గూ
ర్పుఁడు ! బాలబాలికల ; క
వ్వడువు సు దుర్లభము పెద్దవారికి నేనిన్. ౨౬౩౦

తే॥ ఆపయి గఱపుఁడు ! గుణింత, మందు సాల
నేర్పుఁజూపుఁడు ! వినుఁడు ! గుణింతమందు
లెస్స తేఱిన బాలబాలికలు చిన్న
పదములను వ్రాయఁ బల్కఁ గలుగుదురు తార. ౨౬౩౧

తే॥ పదములన్ వ్రాయనున్ బల్కఁ బరిణతిఁగను
బాలబాలికలకుఁ జిన్నపద్యములును,
గద్యములను జదువ వ్రాయఁ గఱపుఁడు ! మఱి
చెప్పుఁడు ! తదర్థమున్ విశేషించి, పేర్చి. ౨౬౩౨

తే॥ పద్యములు గద్యములు వ్రాయఁ, బల్క, సెప్పఁ
జాలు ప్రజ్ఞకునగు బాలబాలికలకుఁ
బాఠముల్ గూర్చి సెప్పుఁ ! డాపయి ననేక
విషయవివరణములతోడ వెరవుఁబుట్ట. ౨౬౩౩

తే॥ కావు నీతిబాహ్యములగు గ్రంథములుఁ, గు
యుక్తివాదంబులును ; వలయున్ బ్రయోజ
నంబునకు నగునన్నియు నాఁటినేఁటి
చరితములుఁ, జిన్నకథలును, సామెతలును. ౨౬౩౪

తే॥ నీతిబాహ్యంబులైనవానిన బహిష్క
రించి, సకలసద్గ్రంథప్రపంచమెల్ల
నొసఁగుఁ ! డెల్లవిద్యార్థుల కొక్కఁ డొక్కఁ
డర్హతకుఁ దగ, మీనేర్పు నతిశయిల్ల. ౨౬౩౫

తే॥ గణితశాస్త్ర మత్యావశ్యకంబ యరయ
నెల్లవిద్యార్థులకుఁ ; దన్మహిమసమంచి
తాఖిలవ్యవహారంబులందుఁ గాంతు
మింతకున్, మఱి యీపయి, నెప్డుఁ, జాల. ౨౪౩౬

తే॥ అక్షరావళి తనరూపమై యొసంగ
భారతీదేవి సకలప్రపంచమందుఁ
గ్రాలుఁ ; గావున లేఖనకౌశలంబు
నలయు విద్యార్థులకు ; దానవచ్చు ఘనత. ౨౪౩౭

క॥ ఏయక్షర మే తెఱఁగున
వ్రాయగనగునో ? యత్తెఱఁగు నవశ్యము సుశ్ర
ద్ధాయుక్తిఁ గఱపుట యుపా
ధ్యాయునకు విశేషవిధియు, ధర్మము సుండీ ! ౨౪౩౮

క॥ కలదే యశమన ముక్తా
ఫలములఁబలె నక్షరములు భాసురనవరే
ఖలఁ గన్పట్టన్ వ్రాయుకు
శలతకుఁ గాఁడేని రిత్తశాస్త్రము వలనన్ ? ౨౪౩౯

తే॥ వ్రాత రూపంబు, చదువు కేవలము భాష,
భారతికి ; నవిభజ్యసంబంధగరిమ
నవి యొసఁగు ; వానియం దొండ నాశ్రయించు
వాఁడు పూర్ణతకున్ గానివాఁడు ; నిజము. ౨౪౪౦

వ॥ అనిపల్కి యప్పురమవ్యక్త మఱియు నయ్యుపాధ్యాయులతో నిట్లనియె

ఆ॥ మిమ్ముఁగూర్చి, మఱియు మీధర్మమున్ గూర్చి,
విస్తరించి సెప్ప వేళసాల
దింత ; కీరు ఘనుల ; రీప్రజలును దెల్పఁ
గన్నవార ; యేల గాథఁ బెనుప ? ౨౪౪౧

తే॥ మీవలనఁ బ్రభువుల్, ప్రజల్, మీరు వారి
వలన బాగునకగుట యావశ్యకంబు ;
వినుఁడు ! మీపుట్టువులు లోకమునకె కాఁ ద
లంపుఁ ! డది మీకు మేల్గూర్చు లక్షణంబు. ౨౭౭౩

తే॥ ప్రజలుఁ బ్రభువులు దుర్నీతిపాలుగాక,
మానుషంబు సహజసిద్ధమహిమఁ గోలు
పడక, శాంతికి నెప్పుడు వచ్చునట్లు
పాటుపడుఁ ! డది మీపని, పరమవిధియు. ౨౭౭౪

వ॥ అనిచెప్పి యజ్జగద్గురుండుపన్యాసంబుముగించె, ననంతరంబ యయ్యు
పాధ్యాయులును, దక్కిన ప్రజలును దెలివిమైఁ గలకలమను మొగం
బులతో నమ్మహాపూరుషునకుఁ గృతజ్ఞత తేటపడఁ బ్రణామంబు
లర్పించికొని ఇట్లు. ౨౭౭౫

సీ॥ సకల శాస్త్రప్రపంచము నిజబుద్ధిసాగరమున నణువుఁగాఁ గ్రాలు
ఘనుఁడు, । పరమర్షిలోకసంభావ్యయోగాచార్యపదమున నలరారు
పరమయోగి, । ధర్మసంస్థాపనతామహావాసారఖనియై యెసంగు
జగద్గురుండు, । మహనీయశశ్వదమానుషవిమలప్రభానిధియైపొల్చు
భద్రమూర్తి,
నక్క నయ్యార్యప్రజలఁ దానొక్కఁడై, య
ఖండకరుణాకటాక్షవీక్షణము లొప్ప,
నాప్రజల, కా గురువులకు నట్లు బుద్ధిఁ
బట్ట, క్రమకోర్చి, పేర్చి యుపన్యసించె. ౨౭౭౬

వ॥ అంత నక్కడ సరళాగృహంబునను, మిత్రశర్మ మందిరంబునను,
నెల్ల వంటలును సిద్ధంబులయ్యె ; నవ్వార్త నివేదించికొనుటకు సరళా
భర్తయు, మిత్రశర్మయు వచ్చి, సమయంబునకు వేచియుండుట

యుఁ జూచి, యా సర్వజ్ఞుం డాయిర్వురన్ బల్కరించి, యామిత్ర
శర్మతో నవ్వుచు నిట్లనియె. ౨౪౪౭

క॥ ఏ మొక్కగాఁ దలఁచఁబడి
యీ మెయిఁ ద్రవ్వికొనుచుంటి మింతకు; నిది మీ
కేమో? తప్పెన్; మేల క
దా? మాకుంగాక మీకుఁ దగునె శ్రమపడన్? ౨౪౪౮

శ్రీకృష్ణస్వామి మిత్రశర్మతో సల్లాపంబు సేయుట.

తే॥ పప్పులును, గూరలు, వివిధభక్ష్యములును,
బాకశుద్ధికినై, మేటిపంట కాపు
వారినె ట్లట్ల యెదఁగొను వలపులీన
మీరు సిక్కితి రింతకు; మేలుగాదె? ౨౪౪౯

తే॥ భోజనప్రియు లండ్రు విప్రు; లది యెఱిఁగి
యేల నిట్లుంటి? నను బుద్ధి యిప్పు డొకటి
పుట్టె డిని; దాని కేమి? యీ పూట మా కొ
కింత పెట్టింతురే? వేళ యింకఁ గాదె? ౨౪౫౦

క॥ ఘనుల రగు మీగృహంబున
వినుఁ! డేఁటికి దాపఁ? బొట్ట వెడలనీ దిను వా
రనఘా! యీ ప్రజ; లాపయిఁ
దిన నగునో మీకుఁ? గాదో? దేవుఁ డ యెఱుఁగుఁ గా. ౨౪౫౧

వ॥ అని మహోల్లాసంబున సల్లాపంబునకు దిగిన యమ్మహాత్మునితోఁ
బలుకఁ టకుఁ దఱి యగుటను, నలరు మొగంబుతో వినయంబు దోఁపఁ,
బ్రాంజలియై యప్పరమవిప్రుం డిట్లనియె. ౨౪౫౨

తే॥ నన్ను బహుకార్యమగ్నమానసునిఁ జేసి,
యీ ప్రజల కిమ్మెయి నను గ్రహించితిరి మ
హోపదేశము ; నాకు నయుక్తమొక్కొ-
యది ? యెఱుఁగ, నా కొలందుల కంత లేల ? ౨౫౩

తే॥ బ్రాహ్మణుల నేల ? నెల్లవారలును భోజ
నప్రియుల ; యెవ్వఁడేనిఁ దినక బ్రదుకఁ గ
లండె ? వంటకముల తావులకు మనంబు
నిచ్చి తంటిరి ; తినువార లెవ్వ రీరు ? ౨౫౪

తే॥ ఏను నాయింటఁ దిన్నను, మాను కొన్న
నేమి యగు ? నిందఱకుఁ బెట్ట నిప్పు డయ్యె,
సాలుఁ మీకృప నది ; దాని కేలఁ బేర్చి
నన్ను వెఱపింపనంటి ? రే మన్న మేల. ౨౫౫

వ॥ దేవర వారి దివ్యపాదారవిందలేశంబునకున్ బోలని నన్నున్ బల్క-
రించి, యిమ్మెయి సల్లాపంబు సేయుట మహాభాగ్యంబ కాక యెం
డగునే ? యని సంతసింతు ; యుష్మదీయ దివ్యోపదేశంబునకు నోచి
కొననైతినే యను నా డెందంబు కుందు వాప లౌక్యంబుఁ దలంచి,
యిట్లానతిచ్చి రనియు గ్రహించితి ; నెల్ల భంగుల జగంబు
నుద్ధరింపఁ గంకణముఁ గట్టికొన్న మీ యనుగ్రహం బీయూరి
ప్రజలయం దిట్లగుట నుతింపఁ జాలము, వెండియు. ౨౫౬

ఆ॥ మిమ్ముఁ జూడఁ, బలుక, నెమ్మిఁ దిరుగ, విన,
నోచికొంటి మియ్యనుగ్రహంబు,
సాల దెట్లు మాకు ? సాలు ; మీ రాడ మే
మాడు వారమే మహాను భావ. ౨౫౭

తే॥ చాలఁ ప్రొద్దెక్కె, భోజన సమయమయ్యె ;
నెలమి విచ్చేయుదురు గాక ! యిప్పు ; డెంత

యేనియున్ మాఱఁ బనికల దింద్ల ; సరళ
నోముఁ జెల్లింపరే సదనుగ్రహమున ? ౨౫౫౮

ఆ॥ అనుడు నమ్మహాత్ముఁ డాదరం బెసఁగ ని
ట్లనియె నతని తోడ నంతవట్టు
నెఱుఁగు ; దదియ చాలు ; నింతకు వేళ త
ప్పాటయు లేదు ; లెండు ! పోద మిపుడ. ౨౫౫౯

వ॥ అని యాతనితోఁ బల్కి--, పిమ్మట నెల్లవారు విన నమ్మహారసిక
శిఖామణి యిట్లనియె. ౨౫౬౦

క॥ ౘం ! డందఱుఁ బోవుద మె
క్కండును బ్రాల్మాలి తప్పఁ గాదు సుఁడీ ! యీా
తం డందఱఁ దని యింపన్
నిండుమనంబునఁ దలంచె నేఁ డిబ్భంగిన్. ౨౫౬౧

ఉ॥ పెట్టెడు దాత మాన్యుఁడు లభించుట భాగ్యము కాదె ? లోకమం
దిట్టి వదాన్యవర్యులు జనింతురె పల్వురు ? మీార లెల్ల ని
ట్టట్టన కిమ్మనస్వి హృదయంబున కెక్కఁగ నారగింపుఁ డా !
పొట్టలనిండ సాలు ననఁ బోలదు సుండు ! సగంబు సామునున్. 

క॥ సమయంబునకున్ దర్పణ
మమోఘ దీక్షమెయి సేయు నార్యుల యీా లో
కమున కగు వారు ; మఱి లో
కము వారికి నగు నఖండగౌరవము తగన్. ౨౫౬౩

ఆ॥ ఓపు కొలఁది జగతి కుచితంబుమై నగు
వాఁడె మనుజుఁ ; డెల్లవారు కారు ;
సేయనయిన దనుక సేయుండు ! మే లింత
యేనిఁ, గాక యంతయేనిఁ దివిరి. ౨౫౬౪

వ॥ అని యెల్లవారికిన్ జెప్పి, పదంపడి యప్పరమ కార్యవాది యప్పరమ
విప్రుని కిట్లనియె. ౨౪౬౫

ఆ॥ సరళ ముద్దరాలు సాధ్వి; యెఱుంగుదు
కాదె? యీయమ మొద కందకుండ
నూచికొనుట మంచి చొప్పు మనకుఁ; బల్కి
తట్లు విందుఁ గొందుమనవి తగంగ. ౨౪౬౬

క॥ ఆయమ యింతకు నాకై
సేయుఁగ వంటకము; లీవుఁ జెప్పితి వది గా
దే? యెవ్వరేని బనులఁగ
సాయ పడిరో? లేదో? యెంత శ్రమ కయ్యె నొకో? ౨౪౬౭

వ॥ కావున నార్యవర్గంబు వారును, గొందఱు పెద్దలును, నేనును
నా యమ యింట యింత తినఁ గోరుదుఁ; దక్కిన ప్రజ లందఱు
మీయింటఁ దినువా; రనుటయు విని యా బ్రాహ్మణోత్తము
డిట్లనియె. ౨౪౬౮

తే॥ అట్ల సేయింపుఁ? డాయమ యంత కగుట
మేల కాదె? కాదన నెట్లు బోలు? మీ య
నుగ్రహంబునఁజేసి ధన్యుల మయితిమి;
వీరు నేను మఱియు నెల్ల యూరివారు. ౨౪౬౯

వ॥ అని విన్నవించి, యతం డార్యవర్గంబుతో మఱి కొందఱు పెద్దల
నేర్చి, కూర్చి, యమ్మహాత్మునితో మఱియు నిట్లనియె. ౨౪౭౦

తే॥ మీయనుగ్రహమునకుఁ బేమ్మనగువారు
వీర; వీరలఁగొనుఁ! డెల్లవారిఁ గొందు
నేను; విచ్చేయుఁ! డనుడు నద్దీనబాంధ
వుండు కౌతూహలం బెదనిండ, లేచి. ౨౪౭౧

తే॥ అనుపమానతేజోగౌరవాభిరామ
మందగమనవిలాసభూమతరరేఖ
వెలయ, నా ప్రజలందఱు వెంటరా, మ
హాత్ముఁడు కదలి, యతఁ డూరి కరుగుదెంచె. ౧౮౭౧

వ॥ అంత నక్కడ.

శ్రీకృష్ణస్వామి రాకన్గౌరి సర్వమంగళాసరళాది సతులు
భాషించికొనుట.

తే॥ సర్వమంగళ మొదలగు సతులు సరళ
యింట నా కృష్ణదేవుని నెదలఁ దలఁచి
కొనుచు, భయమును భక్తియుఁ, గుతుకమును నె
సంగ వంటకముల నెల్ల సక్క వండి. ౧౮౭౩

తే॥ పెక్కుకడవలకొలఁదిగఁ బేర్చి, యమ్మ
హాత్ముఁడు జలంబులాడుట యరసి, కాచి,
వేచికొని, యన్నియును గూడవెట్టి, యంద
ఱొకటఁజేరి యిట్లనుకొని రోర్తు నోర్తు. ౧౮౭౪

తే॥ అమ్మహాత్ముల మనసున కగుదుమొకొ ?
కామొకో ? యెట్లొకొ మన భాగ్యంబు ? దైవ
మెట్టిమేలున కగునో ? యూహింపనేర
మింతకును వారికృపయ ; యొండేమి కలదు ? ౧౮౭౫

క॥ మన సరళభాగ్యమేమని
కొనియాడుట ? " నాకు విందుఁగూర్పుము, శ్రమవె
ట్టనయితినే యిమ్మెయి నీ "
కనిరఁట ! దయఁదలఁచి యమ్మహాప్రభు-లమ్మా. ౧౮౭౬

తే॥ అంతదయసూపి, యమ్మొయి నట్టులన్న
వారు కృపఁ దప్పుదురె? మన వంటకములు
చిత్తమునకు రాకున్నను సేఁగిఁ దలఁప;
రెట్లును నను గ్రహముసేతు; రింతనిజము. ౨౪౭౭

వ॥ అనుడు వారినందఱు వారించి సర్వమంగళ యిట్లనియె. ౨౪౭౮

క॥ మనయూ రేఁటినగరమా?
మనమన దొరకొలము వాండ్రమా? యేమొా? యూ
యన చిత్తమునకు నైతిమి
మన సరళకతంబునన్; సమస్తముఁగూడెన్. ౨౪౭౯

తే॥ మాసినయొడళ్ళుఁ, దలలును, బోసికొంప,
లేవఁబుట్టించుపల్కులు, లైయొసఁగు మాటె
తలక యమ్మొయిఁగూర్చిన తండ్రి, జగము
వేల్పు మనలకుఁ గూర్పఁడే? వేయునేల? ౨౪౮౦

క॥ అనుమానింపకుఁ! డింతకుఁ
జనుదెంచుచునుండు, లెందు! సక్కనగుఁడు! భో
జనసమయమునయ్యె; మఱి వ
చ్చినపిమ్మట నగునె పనులు నేసికొనంగన్. ౨౪౮౧

క॥ మనయొడల దైవమింతకు
ననుకూలతనుండు; సందియము లేదు; జగం
బున మనమ తత్ప్రసాదం
బునకైతిమి; నిక్క; మా ప్రభువ యంతకగున్. ౨౪౮౨

క॥ అని యిట్లాసతులందఱు
ననేకభంగులు తలంచి, యనుకొనుచుండన్
జనుదెంచె యాదవప్రభుఁ
డనుపమతేజో విభూతి నార్యులతోడన్. ౨౪౮౩

క॥ సకలభువనపరమాశ్చ
ర్యకరకనత్కాంతిరాశియగు నగ్గోపా
లకదేవుని యాగమనము
నకు సంతోషించి రింపెనయ నెల్లప్రజల్. ౨౮౮౮

వ॥ ఇట్లార్యజనంబులతో నల్లనల్లనవచ్చు నప్పరమపూరుషు నల్లంత దూరంబున వీక్షించి. ౨౮౮౫

శ్రీకృష్ణస్వామి సరళయింటి కరుదెంచుట.

ఆ॥ సర్వమంగళయును సరళయు మొదలగు
చానలెల్ల నధికసంభ్రమమును
భయము, విస్మయంబు, భక్తియు నానంద
మొకటఁ బొడమఁ గలఁగి రొయ్యనొయ్య. ౨౮౮౬

క॥ వారలచందం బజ్జగ
దారాధ్యుం డెఱింగి, చిత్త మనుకంపాసం
పూరము కా నిట్టులనియె
వారందఱు వినఁగ, నార్యవర్గము మెచ్చన్. ౨౮౮౭

క॥ ఈయమ్మ లేఁటితలఁపున
నై, యిమ్మెయిఁ గలఁగువారలై ? రివ్విధముల్
నాయెడ వహింపఁగా ; దే
మీయందఱు నొకఁడఁగాని ? మీర లెఱుఁగరే ? ౨౮౮౮

ఉ॥ అంతియకాక లోకమున కంతకుఁ దారయిపోల్చి, ధన్యలౌ
నింతులు నాకుఁ బ్రాణము ; లనేకవిధంబుల వారినేమమం
దెంతయు శ్రద్ధఁబూనుదు, వహింపుదు గౌరవ ; మిట్టులెప్పునా
స్వాంతము వారియందు ననిశంబుఁ బ్రసన్నము, సానుకంపమున్.

తే॥ ఏను గాపుఁగోలమునక మొలమిసగుదు ;
నెంతయేనియు సరళకు నెప్డుఁగూర్తుఁ
గాదె విమలతర ప్రేమగౌరవములఁ ?
గాపులన్న నుప్పొంగుదుఁ, గాంతుఁ బ్రియము. ౨౪౯౦

తే॥ ఎదుటసాల జగమునెల్ల నెపుడుఁ బ్రోచు
గోగణము శాంతిమైఁ గ్రాల బాగుమెఱయు
కర్షకగృహంబు లోకమంగళపవిత్ర
పరమశాంతాశ్రమము కాదె బహువిధముల ? ౨౪౯౧

వ॥ అని సాదరంబుగఁ బల్కి యగ్గోపాలదేవుం డెల్లవారేము ధన్యుల
మైతిమని మురియుచుండ, నా సరళాగృహంబు కట్టెదుటనున్న
పసులసాలన్ నిలిచి, తన రాకకు నలరి, కృతజ్ఞతన్ సూచించుసట్లు
లేచి, నెమరిడుచు, మెడసాచి, నెమ్మదిమై నాక నుంకించు నావున్
దట్టి, మేనెల్లఁ దడివి, మెడ నిమురుచుఁ, దనతోవచ్చిన యార్య
వర్గాదులతో నిట్లనియె. ౨౪౯౨

క॥ గోవులు నాకున్ బ్రాణము ;
లేవియు సరికావు వాని ; కే బాల్యమునం
దేవేళన్ గోపాలన
తావేశము పేర్మిఁ దరిగి తడవుల, గిరులన్. ౨౪౯౩

క॥ బలదేవుఁడు నా యగ్రజుఁ,
డలఘుభుజుఁడు, శౌర్యఖని, హలాయుధుఁడు ; మహా
బలతేజశ్శాలులు మా
కులంబువారెల్ల గర్షకులు, గోపకులున్. ౨౪౯౪

క॥ గోవులు, సస్యములుఁ, బ్రకృతి
దేవియు, శాంతి నొడఁగూర్చ దీపించుచు ను

జ్జీవనము సేయు వాఁడు కృ
షీవలుఁ డొక్కఁడె భువి విశృంఖలవృత్తిన్. ౨౮౯౫

తే॥ కాపువారి యిల్లాండ్ర జగంబునందు
నిజముగా గృహలక్ష్ము ; లన్నింటను దమ
భర్తలకు వార ప్రాపులై, పనులు సేయు
చుందు రింటఁ, బొలంబున నోపుకొలఁది. ౨౮౯౬

తే॥ సరళఁ బోలిన యాండ్రు విజ్ఞానవతులు
కలరు నేఁటి కరుదుగా జగంబు నందు ;
నిమ్మహాసాధ్వి గృహంబున నిప్డు మనకుఁ
దినఁగనయ్యెఁ, బవిత్రతఁ గనఁగనయ్యె. ౨౮౯౭

వ॥ మనకుఁ దృప్తి నొందఁగూర్పన్ గోరి, యింతకు నీ యిల్లాండ్రందఱును జాల శ్రమకుఁ బాలగుట నిజంబు ; కావున నా స్నానాది విధులు మీర నడుపన్ గోరెద ; ననవుడు మహాప్రసాదంబని యయ్యార్య వర్గంబువారును, దక్కినవారును నతి సత్వరంబుగ నెల్ల పనులకున్ జాలి, యొక్క పెద్దపీఠంబుపై నప్పరమ గోపాలదేవునిఁ గూర్చుండఁ బ్రార్థించి, యతం డట్లు సేయఁ, గొందఱు తలంటియుఁ, గొందఱు శరీరసమ్మర్దనంబు గావించియుఁ, గొందఱు నీళ్లుఁ బోసియుఁ, గొందఱు తడి నొత్తియుఁ, గొందఱు పరిధానాదు లందిచ్చియుఁ, గృతకృత్యు లైరి ; వారిన్ జూచుచు, సరళ యింటఁ బనులు సేయుచుండు నాండ్రందఱుఁ నుల్ల సిల్లుచు, నా వచ్చిన వారందఱకుఁ బీటలును జాపలును సాలు కొలఁది నిడి, యనఁటియాకులు తళియలుఁగాఁ గల్పించి, యెల్ల వంటకంబులును వడ్డించి, యమర్చి, నిరీక్షించు చుండి, రంత. ౨౮౯౮

తే॥ క్షౌమ వస్త్రంబుఁ గట్టి, విశాల కాంతి
రేఖ చెల్వువార విబుధవరేణ్యు వేద్యుఁ,

దమ్మహాత్ముండు వేంచేసె నార్యగణము
వెంటరా నిచ్చలు సరళ యింటి కెలమి. ౨౪౯౯

క॥ సకల జగదుద్ధరణ శ
క్తికలితుఁ, డనవద్య దివ్యతేజోనిధి రా
నకలంకపరమ పావన
త కయ్యె నా యిల్లు దేవతాగృహముఁ బలెన్. ౨౫౦౦

వ॥ ఇట్లు వచ్చుటయు సమ్మహాను భావునిన్ జూచి, యత్యంత వినయ సంభ్రమ భయభక్తులొప్ప నమస్కరించి, యా య్యింతు లొక్కెడ నిలిచి, చూచుచుండిరి; సర్వమంగళయు సరళయు నా జగద్గురుని యెడ నించుక చనవు సేసికొని, సాస్తరణంబగు నొక్క పెద్దపీట చూపి, సమర్పించుటయు నతండు కూరు చుండెఁ; దక్కినవారం దఱుఁ దమకు నిమ్ములగు నాసనంబులపై, గూర్చుండి; రంత.

ఆ॥ సరళ వీవఁ దొడఁగె సద్భక్తి మైఁ దాళ
వృంతముఁగొని లోకవేది; కతని
ప్రక్క నొదిగి నిలిచి పలుక నుంకింపుచు
నుండె మిత్రశర్మ యువిద వేచి. ౨౫౦౨

వ॥ అంత నగ్గోపాలదేవుం డప్పరమకర్షకకుటుంబినీరత్నంబును దనకు వీవవలదని నివారించి, గారవంబుమైఁ బలికి, సర్వమంగళ యేమేనిఁ బలుక నుంకించుట యెఱింగి, సరళ వలన నాయమ నెఱింగి, సాదరమున నా బ్రాహ్మణితో నిట్లనియె. ౨౫౦౩

తే॥ "బ్రాహ్మణుం" డను పదము సార్థకతఁ గాంచె
మిత్రశర్మ యెడల; జగన్మిత్రుఁ; డమ్మ
హాత్మునిన్ బోలు సద్విప్రు లరిది నేఁటి
కాలమున; లే రనినఁ దప్పుకాదు; నిజము. ౨౫౦౪

క॥ తగ నతని కెల్లవిధములఁ
దగు సహధర్మిణివి నీవు ; ధర్మము నన పెం
పుఁ గను సతీపతులరు, మీ
రగణ్యపుణ్యాకృతులరు నఖిలజగమునన్. ౨౫౦౫

తే॥ ఇట్టి నీవును సరళకు నిట్లు కూర్తు ;
వెంత మంచితనమున కై ? తెలుఁగ నాయె
నీ చరిత్రము ; మన్ననీయ సతుల
యందు నీ వొక్కతెవ ; సందియంబు లేదు. ౨౫౦౬

క॥ ననుఁ గూర్చి యెద్దియేనియు
ననఁ దలఁచెడి చొప్పుఁదోఁచె, నమ్మ ! ప్రియము మై,
ననుమానింపక, కలఁగక,
యను ! మేఁటి భయంబు ? ప్రాజ్ఞ వందిత కన్నన్. ౨౫౦౭

చ॥ అనవుడుఁ బొంగి, యా ద్విజవరాంగన యించుక సాహసించి, యి
ట్లను హృదయంబు భానవకు, నయ్యది నాల్కకు నందరాక, యె
ట్లును దడవాటు పుట్ట, నతిలోకు జగద్గురు నమ్మహాత్మునిన్
గనుఁగొనఁ, బల్క, నోటకు మొగంబున నూతనకాంతి తోఁచఁగన్.

ఉ॥ ఎక్కడి యూరియాంధ్ర ? మొక యిక్కుమ నేరని కొయ్యగాంధ్రయ
మ్మక్కల మేము ; సర్వభువనార్చితమూర్తులరై రహించు మీ
రెక్కడ ? మా కొలందులకు నింతటిభాగ్యము నిట్లు కూర్తురే ?
మ్రొక్కుదు మింతకై తిమని మోములు సక్కగ నెల్లవాంధ్రమున్.

క॥ మా సరళ నెపంబుగ మా
చేసినసుకృతంబు పండి, చెలువెనఁగన్, వి
చ్చేసితి రీ ; రే మెవ్వర ?
మీ సౌమ్యగుణంబు కలదె యెవ్వరియందున్ ? ౨౫౧౦

క॥ నేరిచి, నేరక వండితి
మోరెమ్ములుఁ బిండివంట లొక్కటఁ దోకందున్
గూరలుఁ బచ్చళ్లును ; మా
నేరమికిన్ సైతు రీ రనెడి చనవు మెయిన్. ౨౫౧౧

క॥ మాపుణ్యంబెట్లొక్కొ ?
కోపమునకు సాల ; మింతకున్ బ్రేమ మెయిన్
మా పాలిఁటి వేలుపువై
కాపాడవె తండ్రి ! సారకరుణఁ దలఁచుచున్. ౨౫౧౨

వ॥ అని ప్రార్థించి యప్పరమబ్రాహ్మణి యాభోక్తల కింకను వలయు పదార్థంబులు వడ్డింపఁ బళ్ళెరంబుఁగొని, యెల్లరన్ జూచుచుండ నయ్యాదవసార్వభౌముం డాయమకుఁ బ్రియంబుపుట్టన్ బల్కి, తోడిభోక్తలతో లెం ! డారగింపుం ! డని యాదరంబుమై నాడి, పదంపడి తనకువడ్డించిన యొక్కొక్కపదార్థంబును రుచిఁజూచుచు నెల్లవారి కుల్లాసంబుపుట్టఁ, దన సంతసంబుఁ దేటపడ నిట్లనియె.

### శ్రీకృష్ణస్వామి తనతోడి భోక్తలతోఁ గాపువారి విందున్ బ్రశంసించుచు సంభాషించుట.

ఆ॥ కాపువారివిందుకన్న రాజులవిందు
మేలుకాదు ; రిత్తఁ బాలుపోని
కాయగూర లింటికడన కూర్తురు కాపు ;
లట్లు కూర్పనేర రవనిపతులు. ౨౫౧౪

తే॥ శ్రమకుఁ బాలయి, పొలమున సక్కనెల్ల
వారుఁ జెమటార్చికొని, పాటుపడుచుఁ, గాపు
వారు పుట్టించుదురు కాయగూర, లెల్ల
ధాన్యములు వస్తువులుఁ ; గా వితరులకట్లు. ౨౫౧౫

వ॥ అట్లు గావున.

తే॥ కాపువారల నింద లోకంబునందు
మేల్మివిందని పల్కితిఁ ; గల్మికేమి ?
రుచులకేమి ? మనకు నిప్పరుసున నెన్ని
కూర్పవడియెనో ? మీరెఱుంగుండు ! లెండు. ౨౫౧౭

ఆ॥ సర్వమంగళయును సరళయుఁ బ్రాజ్ఞులు ;
వీరుకూర్చి, వండి, వేళవేళ
యిడిన కూడుఁగూర లింపుఁగూర్పకపోవు
నెట్లు మనకు ? నింత లెందుకలవు ? ౨౫౧౮

తే॥ అనఁటిదవ్వయుఁ, బుప్పఁ, గాయయును, బండు
మూలమును, గూరలై దునై, చాలుగ రుచు
లీనుచున్నవి ; చవిఁగొంటిరే యొకంతు
నొకఁడు వేజ్వేఱ ? లెండు ! నోరూరఁ దినుఁడు. ౨౫౧౯

ఉ॥ నేయికి, నాకునున్ గలదు నేస్తరికం బిల నెల్లభంగులన్,
మాయనుబంధ మెవ్వరును మానుపఁజాలరు ; పెక్కుకూరలై
యీ యఖిల ప్రపంచము రహింపఁగఁ జేయుదు నేనయంచు, వం
కాయ చెలంగెడిన్ బహుముఖంబులఁ గూరలలోన మేటియై.

తే॥ బీరయు, పొరయుఁ, బుచ్చయు, బెండ, దొండ,
గుమ్మడులుఁ, గాకరయును, జిక్కుడును, బొట్ల,
దోసబుడమలు, మునగయు, దొడ్డకూర ;
లారగింపుఁడూ ! సాల రుచ్యంబు లివియు. ౨౫౨౦

ఉ॥ ఇచ్చలు నారగింపఁ బనయేమియు లేదని దీని నెవ్వరున్
మెచ్చరు, పైరువెట్టుటకు మేకొన ; రెంతయుఁ బాకశుద్ధియై
హెచ్చుగఁ గూరవస్తువుల నెల్లనుగూర్ప రహింపుచున్న యీ
బచ్చలికూర కెంతరుచి పట్టెనదో ? చవిఁజూడుఁ ! డందఱున్.

కం॥ కారపుఁబొడితో నుల్లియుఁ
గూరపదార్థములు నెల్లఁగూర్పంగాఁ, గోం
గూర చవు లీనుచున్, నో
రూరఁ జేసెడిని బొట్ట యుబ్బఁ దినన్నై. ౧౫-౧౩

తే॥ తోఁటకూరయుఁ, గాఱుసందుగులుఁ, గ్రొత్త
మిరియు, నావయు, వైటయు, మేల్మితోఁ క
చిల్కకూరయుఁ, గ్రొంజవుల్ జిల్కుచున్న;
వారగింపుఁ! డిన్నియుఁ దిననాయె నిచట. ౧౫-౧౪

కం॥ పలుతెఱఁగుల కందలుఁ, బెం
డలములు, దుంపలును, మిక్కుటంబుగఁ గూర్పం
గలవానిఁగూర్చి వండఁ
జెలువు నెసంగెడిని దినుఁడు! చెందినవేడ్కన్. ౧౫-౧౫

కం॥ మినుగులును, బెసలుఁ, గందులు,
ననుములు, మొదలైన పప్పులన్నియు నాజ్యం
బునఁ గూరిచి వడ్డించిరి;
తినుఁ డొక్కటి నొకటి వేడ్క దీపింపంగన్. ౧౫-౧౬

తే॥ జున్ను, మీఁగడయును, గ్రాఁగి చెన్నసంగు
పాలుఁ, బెరుగు, మజ్జిగయును, బాత్రముల న
మర్చి పెట్టిరి వేఱ్వేఱ; మనసున కగు
నట్లు తినుఁడు! జుఱ్ఱుఁడు! త్రావుఁ! డార్యులార! ౧౫-౧౭

తే॥ పెక్కు తెఱఁగుల భక్ష్యముల్, బేర్మికిఁ దగు
నూరగాయలుఁ, బచ్చళ్లు, నొక్కఁ డొకఁడుఁ
గూర్చి వడ్డించి; రివియెల్లఁ గొనుఁడు! తినుఁడు!
చవులకుఁ గొఱంత ఫుట్టదు, సక్క నఱుగు. ౧౫-౧౮

క॥ అనఁటులయు, దబ్బలయు, సె
ప్పనయి యెసఁగున్ జామల యును, పండుల ప్రోవుల్
మనకున్ బెట్టిరి ; కడు వా
సన లీనెడు వీనిఁ దినుఁడు సమ్మద మెసఁగన్. ౨౫౨౯

క॥ ఎంత శ్రమకుఁ బాల్పై యీ
యింతులు కూర్చిరొకో ? మనకు నివి యన్నియు ను
స్వాంతంబులతో ; వీరల
కెంతయును గృతజ్ఞులము సుఁడీ ! మనమెల్లన్. ౨౫౩౦

క॥ ఇక్కాలము నంద దొరకు
నిక్కారలుఁ, బండ్లుఁ, గాక యింకన్ దఱుచై
పెక్కులుఁ గల వెల్లెడలన్ ;
జక్కఁగ నివియెల్ల కాపు జన్మస్వమ్ముల్. ౨౫౩౧

తే॥ ఇవియ కాక మఱియు నెన్నియేనిఁ గాపు
చెమటఁ బుట్టి లోకముఁ బెంపుసేయు ; వీని
నెల్లఁ బుట్టించు కాపున కెవ్వరీడు ?
వాఁడె పో సర్వభువనాభివర్ధనుండు. ౨౫౩౨

క॥ అని పలికి యజ్జగద్గురుఁ
డనఘాత్ముఁడు సరళఁ జూచి, యాదరమున ని
ట్లను సమ్మా ! యివి నీ పొల
మునఁ బెట్టిన యవియ కావె మూల కొఱటిగన్. ౨౫౩౩

ఆ॥ ఇవియ కాక కలవె యింక నెన్నియు నేని
నీ పొలమున ? మాననీయ దీక్ష
వానినెల్ల గారవంబునఁ బ్రోదిసే
యుదు వె తఱికిఁ దప్ప కొకటి నొకటి ? ౨౫౩౪

తే॥ ఇన్ని కూరలు వంటలు నేల కూర్చి?
తెంత శ్రమ కగ్గ మైతో? యీ యింతు లెల్ల
సాయ పడిరి ; ట్లిదియు సంతసంబ ; కాని
యిన్ని కూర్చుట కాపుల కెట్లుఁ గాదు. ౨౫౩౫

తే॥ రాజుఁ బ్రజలును మంచివారలయి, కర్ష
కులకుఁ దమ యోపునంతలుఁ గూర్తురేని
నతని కొక్కింత తినఁ గట్ట నగుఁ ; గృతఘ్ను
లగుదు రేని వారలు కిట్ట దతనికిఁ గృషి. ౨౫౩౬

క॥ ప్రకృతికిఁ బ్రభువులకున్ బ్రజ
లకుఁ గాపగు బహు విధంబులన్ ; వారలు వా
నికి నగు చందంబును దగు ;
సకలజగము దానఁ బడయు సౌభాగ్యంబున్. ౨౫౩౭

ఉ॥ ఎక్కడి వృత్తినా జగతి కెల్లరకున్ దలమానికంబ మై,
నక్క నెనంగఁ జేని ననిశంబును గర్షకుఁ? డేఁటి మానుషం?
బెక్కడి చంద మా ప్రకృతి? కింతలు నారసి, కాపువారలన్
మిక్కిలి యాదరింతు, మఱి మెచ్చుదుఁ; గాపులె యస్మదీయులున్.

క॥ ఒక కూర యుత్తమము ; రెం
డు కావు మధ్యమము లవి ; కడున్ నింద్యము, లేఁ
టికిఁ బెక్కు కూర? లధమము
లోక భుక్తిన్ ; బెక్కులు దిన నొల్లరు పెద్దల్. ౨౫౩౮

శ్రీకృష్ణస్వామి సర్వమంగళాదులతో సంభాషించుట.

క॥ నోరి చవికిఁ బెక్కులుఁ దిను
వారలు బహు రోగములకు వశుల యగుదు ; ర

ప్పౌరుషులె భోగులఁట ? జగ
మిూ రీతిన్ గ్రుడ్డి దాయె ; నేమన వచ్చున్ ? ౨౫౪౦

కం॥ ఆరయ బహుభక్షణ మద
దారిద్ర్యాజ్ఞానరోగ తతులకు మూలం ;
బేరీతి నేని యుక్తా
హారి యగుట మేలు ; కూర్చు నది సౌఖ్యంబున్. ౨౫౪౧

కం॥ తిను వానికిఁ గీడున్, బె
ట్టినవానికి శ్రమయు సంఘటింప దుచితమై
యెవ్వరు మితభోజనం బిల ;
నన దమితాహార మెంత చవి కది య య్యున్. ౨౫౪౨

తే॥ అమ్మ ! యిది యాదిగా శ్రమ కగ్గమగుచు,
నిన్ని కూర్పకు మెవ్వరి కేనిఁ ; గాపు
వారి కింతలు నంతలు వ్యయము లెట్లు
పోలుఁ ? దుది నవి త్రోయు నప్పులను నురుల. ౨౫౪౩

కం॥ ఉరిఁ బడ్డ బాలహరిణము
తెఱఁగునఁ జిక్కువడు, దుర్గతికిఁ బాలగు, నె
వ్వరుసును గా ; దప్పులకున్
గుఱి యగు కా ; పేమి సెప్పఁ గూడున్ బిదపన్ ? ౨౫౪౪

వ॥ వెండియు.

కం॥ అప్పుల పాలగు కృషికుఁడు
తప్పున్ శాంతికి, నుదారతకుఁ ; గృషి మేల్గా
ద ప్పాటున కగు వానికి ;
ముప్పులుఁ దిప్పలును బెలుచ ముట్టి కలంచున్. ౨౫౪౫

వ॥ అనిపలికి, యాలోకోత్తరపూరుషుండు సాదరంబున సర్వమంగళతో నిట్లనియె. ౨౫౪౬

తే॥ అమ్మ ! నీవుఁ, దక్కినయింతులంద ఱిట్లు
శ్రమకుఁ బాలైతి ; రింతలు సక్కఁగూర్చి,
వండిపెట్టిన యిగ్గౌరవంబునకుఁ గృ
తజ్ఞులము ; మేలు మఱచుచందంబు కాదు. ౨౫౪౭

తే॥ ఎంతపనివట్టితిరో యింతలింతలుఁ జవు
లూర వండంగఁ ? దప్పూట యొకఁడు లేదు ;
మఱపునకురాని పాకసామర్థ్య మిట్లు
సూపితిరి మీర ; లెందు నీ చొప్పుకలదె ? ౨౫౪౮

క॥ మీ కందఱకున్ శుభమగుఁ
గా ; కీయూరఁగల ప్రజలగౌరవ మిమ్మెఁ
గైకొంటి ; రేపు పోవుదు ;
నా కిచ్చట మసలుటది సనదు బహుదినముల్. ౨౫౪౯

క॥ ఈయూరిలోని యిల్లాం
డ్రాయతభక్తియు, నయముఁ, బ్రియము, నిల్లెపుడున్
సేయుదురు కాదె నీకున్ ?
నీయోగ్యత నెఱుఁగరెల్లు నెలఁతలుఁ బురుషుల్ ? ౨౫౫౦

క॥ ఇల్లాండ్రధర్మపద్ధతి
తెల్లము నీకని తలంతు ; దీక్షఁగొని నీ
వెల్లరకున్ బోధింపుము
తల్లీ ! యది నీకుఁ బరమధర్మము సుమ్మా ! ౨౫౫౧

క॥ పౌరోహిత్యపరమధ
ర్మారూఢికి నగుదు రీవు, నా సారసదా

చారఘునుఁడు నీభర్తయు ;
నారయ మీయట్టివార లవనిన్ గలరే ? ౨౪౪౨

క॥ నీ విల్లాండ్రకుఁ, బురుషుల
కా విద్వాంసుఁడును నగుదు రమలాచార
శ్రీవిలసితులరు సారశు
భావహాధర్మోపదేశమం దతిదీక్షన్. ౨౪౪౩

ఉ॥ ఒక్కతెఁజూచి, నూచి మఱియొక్కతె నేర్చికొనన్ గడంగుఁ బెం
పెక్కఁగ ధర్మమేని, మఱి యెద్దియు నేనియు ; లోకధర్మమై
చొక్కపులీల నీ ప్రకృతిసూత్రము వర్తిలుచుండు ; దీనికిన్
దక్కెడివారు కల్గ ; రుచితంబుగ నీ వది పోలఁ జూడుమీ !

తే॥ మానుషసహజసిద్ధధర్మంబ నూడ
ననుకరణ ; మది కాదన, నగు ననంగఁ
బోల దెవ్వరికినిఁ ; బనిఁబూని దాని
నుచితగతిఁ గూరిచికొని, మేలొందుటొప్పు. ౨౪౪౪

తే॥ నీవు ప్రాజ్ఞ, వెలుంగు దన్నియునుఁ ; బెక్కు
లేలసెప్పంగఁ బనివడి బేలకట్ల,
నావచనమూఁది, మేటిపుణ్యముఁ దలంచి
యేని బోధింపు మిల్లాండ్రకెల్ల నీవ. ౨౪౪౬

వ॥ అనిచెప్పి యప్పరమబోధకస్వామి సముల్లాసంబున నెల్లరు నలరన్ బల్కుచు, సక్కనారగించి, పంక్తివారితో లేచి, ముఖకరచరణ ప్రక్షాళనంబుఁ గావించికొని, యరుగుమీఁదఁ దాటిచాపపయిన్ గూర్చుండె ; నార్యవర్గంబువారును దక్కినవారును దను కిమ్మగు నెడలఁ గూర్చుండి ; రనంతరంబ సర్వమంగళ తనకూఁతుఁ బింగళ యను కన్య నలంకరించి, నానాజాతి ఫలపుష్పతాంబూలమండితం

బైన పళ్ళెరము నాయమచేతఁ బట్టించి, తోడికొనివచ్చి, యప్ప
రమ గోపాలస్వామికి మ్రొక్కించుటయు. ౨౫౫౭

సీ॥ దరహాసచంద్రికాధవళరుచిశ్రీకిఁ గర్ణకుండలములు కాన్కవెట్ట,
రమణీయరత్నహారముమంజులోష్ఠప్రవాళద్యుతిన్ బ్రుంగి కేలుమోడ్ప
బ్రకటనాసాగ్రమౌక్తికము కపోలదర్పణతళతళలకు భక్తిసేయఁ,
గస్తూరికాతిలకము లోచనేందీవరప్రభఁదోఁగి గౌరవముసూప,
సహజసౌందర్యరేఖాప్రశస్తి నిట్లు
కల్పిత పరిష్క్రియాతిరస్కారగరిమఁ
బొలచి, యొప్పారు నవ్వివ్రపుత్రి గార
వించి యాలోకవేది దీవించె, నంత. ౨౫౫౮

వ॥ అక్కన్యకారత్నంబు తాఁ దెచ్చిన ఫలపుష్పతాంబూలమండితం
బగు పళ్లెరంబు సమర్పించి, నమస్కరించి, వినయంబును, భయం
బును భక్తియున్ గదురఁ దల్లి మఱుఁగున నొదిగి, నిలుచుటయుం
జూచి, యజ్జగద్గురుండు సర్వమంగళ కిట్లనియె. ౨౫౫౯

శ్రీకృష్ణస్వామి సర్వమంగళతో సంభాషించుట.

తే॥ అమ్మ! యీకన్య నీపుత్రి యనుటకుఁ దగి
యున్నయది యెల్లభంగుల మిన్న; యెఱిఁగి;
తుచితరీతి స్త్రీధర్మము లొకఁడుఁ దప్ప
కెఱుఁగ బోధింపు మీ యమ కిత్త దీక్ష. ౨౫౬౦

తే॥ ఈడు వచ్చె మా బొట్టెకు నింతకనుచుఁ,
బరిణయంబునకై వేగపడుట కాదు;
విద్యయున్ బుద్ధియుఁ గఱపి, వెదకి వెదకి,
యుగ్గి ననురూపుఁడగుభర్త నరసి యుండు! ౨౫౬౧

తే॥ కూతు నిష్టంబుమైఁ గాక కూర్పఁ జనదు
వరుని ; బల్మిమెయిన్ గూర్చు వడుపు ధర్మ
హానికిన్ మూల ; "మది యెల్ల నన్న నేమి
పోవు ?" నను మౌర్ఖ్యమది కీడుఁ బుట్టఁ జేయు. ౨౫౬౨

తే॥ ఈడు సాలని కన్నియ లెందఱేని
ఋతుమతు లగుట కలదు ; యువతు లై వార
లట్టి వారలకున్ వివాహంబు కొన్ని
యేండ్లకుఁ బిడపఁగాని కా ; దేమిటి కది ? ౨౫౬౩

తే॥ ఈడు వచ్చియు బుద్ధికి నింకఁ గాని
కన్యకు వరునిఁ గూర్చుట కాదు ; నేర్పు
వలయుఁ బనులందు, మఱి గౌరవము గృహస్థ
ధర్మమునఁ జూపుచొప్పు నెంతయును లెస్స. ౨౫౬౪

తే॥ వినుము విద్యయు, బుద్ధియు, నను నమూల్య
వస్తువులు రెండ కడు గౌరవమ్ము మెఱయ,
నరణముగ నిచ్చి కూతురు ననుపు చొప్పు
వలయుఁ దల్లికి ; నన్నియుఁ గలవు పిదప. ౨౫౬౫

తే॥ ఆఁడు వారిద యీజగం బండ్రు పెద్ద
లది నిజం ; బింతు లేయిండ్ల నంతకు నగు
చుందు ? రాగేహములె మానుషోన్నతి కగు
పరమ సంస్థానములు, శాంతి భాసురములు. ౨౫౬౬

క॥ తన సంతానము ధర్మం
బునకు నగు వడుపు ఘటించు పుణ్యసతిన్ బో
లిన భవ్య మానుషవ్య
క్తి నెందుఁ జూడన్ బడయమి తెల్లము తల్లీ ! ౨౫౬౭

తే॥ తల్లి చిహ్నాలె తోఁచు సంతానమందు
నను పలుకు మిథ్యయనఁ జాల; మట్లు గాన
మానుషోన్నతిఁ గూర్చి, ధర్మంబు నూఁది,
యింతులెల్ల ప్రవర్తించు టిద్ధ మతము. ౨౫౬౮

క॥ ఇంతులకు నెల్ల భంగుల
సంతానము లోకమాన్య సత్కర్మం; బొ
క్కింతయు గా దందుఁ గలుష;
మెంతేనియుఁ గీడువుట్టు నెట్లున్ దానన్. ౨౫౬౯

వ॥ ఇంక నెన్నియేనియుఁ జెప్పవలసి యుండు, నీవు ప్రాజ్ఞురాలవు; కావున నింత కిదియ సాలు నని విడిచెద; నని చెప్పి, యమ్మహాపూరుషుం డూరకుండు టయు, నప్పరమ సతియు నతనికి నమస్కరించి, కూతున్ దోడికొని, యలరు మొగంబుతోఁ దొలంగి చనియె; నంత నిక్కడ. ౨౫౭౦

తే॥ సంతస మెలర్పఁగా మిత్రశర్మ యింట
నిష్ట మృష్టాన్నములు దిని, యెల్లవారు,
నతఁడు రా, నార్యకార్యాలయంబు నొద్ద
వేచికొని యుండి రయ్యెడ వీరు రాక. ౨౫౭౧

వ॥ అంత నక్కడ గోపాలదేవుండు సారథిన్ బంచి, పెక్కు హేమనిష్కంబులను, నమూల్యవస్త్రంబులును దెప్పించి, సరళయు సర్వమంగళయుఁ, దత్పుత్రికయు, మొదలగు నింతు లందఱకు నవి దయ జేసి, సరళన్ జూచి యత్యాదరంబుమై నిట్లనియె. ౨౫౭౨

తే॥ అమ్మ! నే రేపు పోవుదు; నట్లుఁ గాన
నిధి వివాద పరిష్కృతి నేఁడ సేయ
నయ్యె; నీవు నీయింతులు నందఱుఁ దిని,
యార్యకార్యాలయము నొద్ద కర్థి రండు. ౨౫౭౩

క॥ తినీ; కూర్చొని, మఱి రం ! డే
పనులుడుగుట కాదు ; వేగపడుటఁయు జన ; దె
ట్లును. నీవు రాక తప్పమి
విను మింతలు సెప్ప వలసె ; వెడలుదు నింకన్. ౧౫౭౪

వ॥ అని చెప్పి, యమ్మహానుభావుం డార్యవర్గంబు వారును దక్కినవారును రా, నచ్చటి నుండి, కదలి, మందగమనంబున నార్యకార్యాలయము నొద్దకు వచ్చి, తన రాకకు నిరీక్షింపుచు, నలరు మొగంబులతో లేచి, యెదురేగుదెంచి, భయ భక్తు లినుమడింప నమస్కరించు నా ప్రజల నమస్కారంబు లందికొనుచు, నయ్యార్యకార్యాలయంబు చేరువనున్న మఱ్ఱి క్రింద నాసనంబు వెట్టించి కొని, దానిపైఁ గూర్చుండెఁ, బదంపడి మిత్రశర్మయు నార్యవర్గ గ్రామాధికార కరణంబులు తమ కుచితంబులగు నెడలఁ గూర్చుండిరి, తక్కినవారందఱును జుట్టును గ్రిక్కిరిసి కూర్చుండి, రనంతరంబ. ౧౫౭౫

తే॥ గారవ మెలర్ప నమ్మహాపూరుషుండు
మిత్రశర్మఁ గనుంగొని మీరు శ్రమకు
నగ్గమైతిరి కాదె యొం డాడ కూరి
వారికెల్లఁ బెట్టఁగనైన కారణమున. ౧౫౭౬

తే॥ గ్రామధర్మంబు నగరధర్మమున కన్న
నెల్లభంగుల లెస్సయై యెసఁగు నండ్రు ;
దానిఁ బరిపాటిఁ బాటించు ధర్మవేదు
లెవ్వ ? రామాన్యుల నుతింతు నేనుసాల. ౧౫౭౭

శ్రీకృష్ణస్వామి గ్రామధర్మము నుపన్యసించుట.

ఉ॥ ఒక్కకుటుంబపున్ బ్రజల యొప్పున నీసును, వైర, మెన్నఁడున్
నెక్కొనకుండ, నొండొరులు నిర్మలహార్ద విశిష్టవృత్తి పెం

పెక్కుఁ జరించు టూరి ప్రజ కెంతయు మే; లది నైజమే కదా
యిక్కడి మీకు నెల్లఁ? జనదేమియుఁ గ్రార్య, మనాదరంబునున్.

తే॥ వావివరుసలతో గారవమ్ము చెలు వె
సంగ నితరేతరంబు భుజంబు భుజము
నంటఁ జరియింతురే? యొకకంటఁ బేద
వారు చూడనగుచు నున్నవారె యూర? ౨౫౮౯

క. చంచితనము లే, కెప్పుడు
నిండుమనంబులు ప్రశాంతినిలయంబులుఁ గా
నొండొరులు గలిసిమెలిసి, య
ఖండప్రేమన్ జెలంగి క్రాలుదురు కదా? ౨౫౯౦

తే॥ అందఱుఁ బాలుఁగొందురే యర్థిశుభము
నందు, నశుభంబునందు నెయ్యంబు మెఱయ?
నెప్డు నొంటెత్తుతనమున కెవ్వరేనిఁ
బాల్పడరు కాదె మీలోనఁ బాడిఁదప్పి? ౨౫౯౧

క॥ సోమరిపోతుఁ దనంబున
కేమిటుఁ జోటీయరు కద యెవ్వారును మీ
గ్రామంబున? మోసము నా
నేమియు మీ రెఱుఁగరు కద యెన్నండేనిన్? ౨౫౯౨

తే॥ చీమలన్ జూచియేని నేర్చికొనవలసి
యుండు, సాంఘికజీవనోద్యోగచాతు
రీ విశేషంబులను; మీ స్వభావములు వి
నిర్మములై యొసంగుటన్నిఁటికి మేలు. ౨౫౯౩

తే॥ గ్రామవాసులకివి సుకరములు, నగర
వాసులకు దుష్కరంబులు; వారు పెక్కు

వేషభాషలవలన జీవించువారు
కాన; మేలు నగరికన్న గ్రామమెపుడు. ౨౫౮౪

క॥ పలుగృహములుఁ, బలువృత్తులుఁ
బలుభాషలుఁ, బలు తెరువులుఁ, బలువురు ప్రజలున్
గల నగరి కెన్నఁడేనియుఁ
గలవే యారోగ్యసంఘగౌరవ ఘనతల్. ౨౫౮౫

తే॥ గ్రామజీవనమునకు నంగడులు కావు;
వానికల్మిఁ బ్రజలయందు వరుసఁబుట్టుఁ
దిండిపోతుఁదనంబు; వర్ధిల్లు సాల
మోసమును, మాంద్యమును; మఱి మూడుఁ గీల్లు. ౨౫౮౬

తే॥ మంచిగాలియు, శాంతి క్రమంబు, మంచి
నీరు, మంచితనంబు నిన్నిఁటికిఁ గుదురు
గ్రామ; మది యవ్విధమునకుఁ గాదయేని
నరకమగు; నిందు నందు గణ్యతకురాదు. ౨౫౮౭

క॥ చెడుదారిన్ వట్టుట మె
న్నఁడు నూరికిఁగాదు; గోధనము, శాంతిధనం,
బుడుగనియారోగ్యధనముఁ,
దొడవులు దానికని చెప్పుదురు లోకవిదుల్. ౨౫౮౮

తే॥ ఇరుగుఁ బొరుగూళ్లకును, మఱి యెల్లపొలము
లకును, బీడులకున్, దోఁటలకును వలయు
మార్గసౌకర్య; మొక్క-ధర్మముగ దానిఁ
బరిగణించిరి పెద్ద; లబ్బంగి లెన్న. ౨౫౮౯

క॥ పాటిమెయి నూరుచుట్టున్
దోఁటలు, దోఁటలకు నడుమఁ దోరపుఁబాటల్,

బాటలకుఁ గడుఁజేరువ
మేటి పొలంబులును, బీళ్లు, మెఱయన్ వలయున్. ౨౫౯౦

తే॥ ఆఁడువారికిఁ బ్రత్యేక మసతిదూర
మందు నొకకొంతిచోటు మర్యాదనరసి
విడుచునది ; చెట్టుఁజేమలు వృద్ధిఁబొందు
టెంతయును లెస్స యందు ; లే దెగ్గుదాన. ౨౫౯౧

తే॥ పలుతెఱఁగుల కూరగాయలకుఁ, జెట్టుఁ
జేమలకును, గుదుళ్లుఁగాఁ జేసికొనుట
సాలమేలు పెరళ్ల ; విశాలములయి
కంటి కింపుగ నవియొప్పుఁ గ్రాలుటొప్పు. ౨౫౯౨

తే॥ ఇంటి కొక్కఁటియేని, నై దేసికేని
వలయు నొకనూయి ; యొప్పు నావశ్యక మది ;
యిష్టకష్టంబులనుబట్టి యెల్ల వీథి
కొకటి, కాక రెండేనియు నుండవలయు. ౨౫౯౩

తే॥ అంతయును భూమిదేవి యీయనయి యున్న ;
దాయమునఁ గూర్చి చెమటూర్చి, యప్పు డిప్పు
డనక పండించికొనుట మే ; లదియ గ్రామ
జీవనమునకు సాలవాసి నొడఁగూర్చు. ౨౫౯౪

క॥ పొరుగూరు నాశ్రయించుట
పరగ దొకటికేనిఁ ; బాటువడనొల్లని సో
మరుఁ జెడఁదిట్టి, పనులకున్
మఱలించుట మంచిది ప్రతిమాలియు నేనిక్. ౨౫౯౫

క॥ కల వెన్నియేని ధ్రానీ
ణులకున్ బను లొకగడియయునుఁ మసలుట నా

వలవదు ; విశ్రాంతిఁ బనులఁ
గలిగించికొనెడి తెఱంగు కడు మేలరయన్. ౨౫౯౬

క॥ ఆరోగ్యమునకు, మంచికి,
గౌరవమునకున్ జెడని ప్రకారమునన్ మే
లారసి కొనుచున్ బ్రదుకుట
సారతరమతంబు ; వలయు సౌజన్యంబుల్. ౨౫౯౭

తే॥ పనుల యంద ప్రశాంతి సౌభాగ్య, మంద
విద్యయును, దాని యంద సద్వృత్తి, దాని
యంద ధర్మంబు, మఱి దా యంద సిద్ధిఁ
బడయు నది ; గ్రామ జీవన భాగ్య మిదియ. ౨౫౯౮

తే॥ పనుల యంద ధర్మంబును, బనులు ధర్మ
మంద యై, యుండు తెఱఁగు మే ; లందె మాను
షంబు సిద్ధి వడయు ; సర్వశాస్త్రములకు
నిదియ పరమ ప్రమాణమై యొసఁగు మతము. ౨౫౯౯

తే॥ రాజు శాసనమునకుఁ గార్యంబు లేని
కరణి, మీ రెన్నఁ డెట్టి తగవులు బెట్టి
కొనక, సుఖజీవనము జేసి కొనుఁడు ! తగవు
లందుఁ బగ వుట్టు, సర్వంబు నదియ చెఱచు. ౨౬౦౦

తే॥ వ్యసనములకు మనసు నిచ్చువాఁడు తాను
జెడుఁ, జెఱచు నూరినెల్ల ; నచ్చోనటిఁ దిట్టి
యేని, బోధించి యేని, బాధించి యేనిఁ
మంచికిన్ దెచ్చికొనుఁ ! డది మంచిమతము. ౨౬౦౧

తే॥ తగవు బుట్టినఁ బెద్ద లందఱును గూడి,
యది పరిష్కృతి నొనరించి, యట్టి దొకటి

యింకఁ బుట్టక యుండ, నేర్పెసఁగఁ జూచి
కొనుట కడు లెస్స గ్రామ జీవనము నందు. ౨౬౦౨

తే॥ రాజు శాసనమున, కి ధర్మ్మంబునకును,
గుదురగుట గ్రామమునకుఁ బోలదు; ప్రశాంతి
యన, సుఖంబన, సౌభాగ్యమనఁ, బ్రసిద్ధి
యనఁగ నూరికి నెక్కుడి వట్టులయిన? ౨౬౦౩

తే॥ ఆర్యవర్గంబు వార లిహాముఁ, బురోహి
తులు, గురువులును బరము, నేర్పలరఁ గూర్చు
వార లూరి ప్రజకుఁ; జేటు వచ్చు రాజ
దృష్టి తవిలినయూరి; కా తీరు సనదు. ౨౬౦౪

తే॥ రాజునకు సెల్లనైన కరంబులు తఱి
తోన సెల్లించికొనుచు, నెందునను దగవు
బుట్ట కుండని భంగి నెప్పుడును సంచ
రించుకొను చొప్పు వలయు మీకెల్ల నర్థి. ౨౬౦౫

తే॥ ఊరఁ గల రాజకార్యంబు లొకఁడుఁ దప్ప,
కోపిక నొనర్చికొనుచు, నయ్యూరి ప్రజల
కవసరము లగు వాని రాజాజ్ఞఁ గూర్చు
చుండునది కరణము, నాయకుం, డిరువురు. ౨౬౦౬

వ॥ మఱియును.

తే॥ ఆర్యవర్గంబువారు, గ్రామాధికారి
యున్, గరణమును, బ్రభుచర్య లొకఁడుఁ దప్ప
కన్నియు నెఱింగికొనుచు, నయ్యై తెఱఁగుల
కుచితభంగి నడుపు టొప్పు నూరి ప్రజల. ౨౬౦౭

తే॥ ప్రభువు నెడ నెంతయేనియు బాధ్యత కల
దెల్ల ప్రజలకుఁ, బ్రజయెడ నెప్డు నట్టి
బాధ్యతయు కల దారయఁ బ్రభువునకు; ను
దంచిత ప్రేమ యీ బాధ్యతలకు ఫలము. ౨౬౦౮

తే॥ ప్రజలు సూపెడు ప్రేమయన్ బరమశక్తి
నూఁదియు ప్రభావమున్ గాంచు చుండుఁ బ్రభువు;
ప్రభువు ప్రేమామృతమునకుఁ బాత్రములయి
ప్రజ లుభయలోకసౌఖ్యంబు బడయువారు. ౨౬౦౯

తే॥ ప్రజల కిష్టముకాని యేపనియు సేయఁ
గాదు; వారలమతము సక్కఁగ నెఱింగి
మెలఁగు నది రాజు; వారల మెప్పు యతని
గొప్ప తనమున కెల్లను గుదురు; నిజము. ౨౬౧౦

క॥ ధనముల యనఁ గాదు, ప్రజల
మనములుఁ గొను రాజు లోకమాన్యతముం; డా
తనిఁ బడసిన యా ప్రజలును
వినుఁ డిహపరసౌఖ్యములకు వెలి కా రరయన్. ౨౬౧౧

ఉ॥ మంజుల వాక్యముల్, విమలమానసమున్, దగ నెప్పుడున్ బ్రజా
రంజన వృత్తిఁ బేర్మిఁ గని, రాజ్యము సేయు నృపాలకుండు మృ
త్యుం జయుఁ; డమ్మహామహునితో సరి కా రిల నెవ్వరున్; జగ
ద్రంజనమై యెసంగు సతతంబును నాతని కీర్తి యెల్లెడన్. ౨౬౧౨

తే॥ ప్రజల చిత్తంబుఁ బడయంగఁ బరమపుణ్యుఁ
డైన నరపతి విడుచు రాజ్యమును, గులము,
ధనము; లివి యవి యననేలఁ? దనువు నేని;
నట్టి ప్రభువులు బ్రజలకు నబ్బు టరిది. ౨౬౧౩

## శ్రీకృష్ణస్వామి శ్రీరామచంద్రుని చరిత్రము సంగ్రహముగ నుపన్యసించుట.

క॥ శ్రీరామచంద్రు చరితము
మీర లెఱుంగుదురు కాదె? మేటి ప్రభువు ధా
త్రీరమణులం దతఁడు, జగ
దారాధ్యుఁడుఁ; బరమపురుషుఁ డక్కాలమునన్. ౩౬౧౪

తే॥ తండ్రి సత్యంబునకు నడి దాఁకకుండఁ,
సవతి తల్లి కొడుకునకు నక్క నతఁడు,
రాజ్యమంతయు విడిచి, యరణ్యమునకుఁ
జనియెఁ బదునాలుగేండ్లందు నరవినుండ. ౩౬౧౫

వ॥ అంత సహధర్మిణియు జగత్పవిత్ర చరిత్రయు నగు సీతామహాదేవిని లంకేశ్వరుండు చౌర్యంబుమైఁ గొనిపోవ, వాని వధింప బలంబులన్ గూర్చికొని, నూఱు యోజనంబుల పొడవును జాల విరివియును గల సేతువు సముద్రంబునఁ గట్టించి, లంకాపురంబునకుఁ బయనంబు చేసి, యొక్కెడ విడిచి, నిజామానుషప్రభావంబు నెఱింగి, యన్నతోఁ గలహించికొనివచ్చిన విరోధి తమ్ముండగు విభీషణునిన్ గూర్చికొని, యతని కాలంకారాజ్య మిప్పింప బాసయిచ్చి, యవ్విరోధి నగరంబున్ ముట్టి, పోరొనర్చుచు జయంబుఁ గొనుచుండ, నొక్క దినంబున. ౩౬౧౬

తే॥ ఇంద్రజిన్నామకుం, డసురేంద్రు పెద్ద
కొడుకు, మాయావి, సంగరకోవిదుండు,
బ్రహ్మవరమునఁ జేసి నభమునఁ గాన
రాక, తనసేనఁ ద్రుంచుచుఁ గ్రాలుచుండ. ౩౬౧౭

వ॥ ఆరామదేవుని తమ్ముండగు లక్ష్మణుం డన్నకు నమస్కరించి, యిట్లనియె. ౩౬౧౮

చ॥ వరమునజేసి, మింట బలవంతుఁడు రాక్షసరాజనందనుం
డొరులకుఁ గానరాక, చటులోద్ధతి సేనలఁ ద్రుంచుచున్నవాఁ;
డురు బలశాలులయ్యు మనయోధులు సేయఁగ నేరకున్నవా;
రరిబల మోలి ముట్టికొని, యంతకుఁ దానయి పేర్చె నుగ్రతన్.

ఉ॥ ఈసమయంబునన్ మన ముపేక్షవహించిన నెల్లసైన్యమున్
ద్రాసము పాలగున్, బహువిధంబులఁ జిక్కువడున్, నశించు, ను
ల్లాసముఁ దప్పు; శాత్రవబలంబు సెలంగుఁ దిరంబుమై, ననా
యాసముగా జయంబుఁ గొను; నంతయుఁ దీరు ననర్గళంబుగన్.

వ॥ కావున బ్రహ్మాస్త్రంబున్ బ్రయోగించి, సెలంగుచున్న యయ్యసురబలంబుతోఁ గూడ, మింటనుండి యనర్గళగతి భుజాసారంబు సూపుచున్న యయ్యింద్రజిత్తు నీరుఁగావింతు, నాజ్ఞ నీవే యనవుడు నా లోకోత్తర ధర్మవేది యిట్లనియె. ౨౬-౨౧

క॥ ఎఱుఁగుదు నీ వంతకు నగు;
నెఱుఁగుదు నీ చెప్పినట్ల యీరిపుసేనల్
నుఱుమగుటయు, నయ్యుక్కువుఁ
దుఱుకకు సెడి, భూమిఁ బడుటయున్ మడియుటయున్. ౨౬-౨౨

వ॥ అయినను నాచెప్పునది వినుము. ౨౬-౨౩

తే॥ ఒక్కనిన్ గూర్చి, యిందఱనోలి నొక్క
వ్రేల్మిడిన్ నీరుఁగావించు విధముతోడ,
మాన్యుఁడై పొల్చు నాబ్రహ్మమాటఁ ద్రోసి
పుచ్చుటది కాదు; సైరణ పోలు నిపుడు. ౨౬-౨౪

వ॥ అని చెప్పి, తమ్ముని నొద్దన్ బిలిచి, యోధులకున్ జెప్పి, యమ్మహానుభావుండు వారందఱతోడ, నయ్యసురరాజనందను వ్రేటుపోటులకుఁ బాలై, మూర్ఛన్ వడి, యరికి జయలక్ష్మి నొసంగె, వెండియు.

తే॥ ఒక్కనాఁ డమ్మహాత్మ్ముని యోధులకును,
నసురయోధులకును మహాహవము సెల్లు
చుండె, నిరువాగులన్ బడుచుండె మృతక
ళేబరంబులు లెక్కింపలేని భంగి. ౨౬౨౬

వ॥ ఆ సంకులసమరంబునఁ దమ్ముండగు విభీషణుఁ బడనేయ నుంకించి, దురాత్ముండగు నసురేశ్వరుండు బ్రహ్మదత్తంబగు శక్తి బాణంబుఁ బ్రయోగించుటయుఁ జూచి, యది యమోఘంబగుట యెఱింగి, తమ శరణాగతుండు పడుట కొప్పక లక్ష్మణుండతని కడ్డపడి, దానికిలోనై బిట్టు మూర్ఛన్ బడియె; దాని నవలోకించి యప్పరమ ధర్మావతారమూర్తియగు రామదేవుండు కోపంబున సకలజగత్కంటకుండును, మహాపరాధియు, వధ్యుండు నగు నా లంకేశ్వరునిపైఁ గదిసి, యనర్గళాస్త్రశస్త్ర ప్రయోగనైపుణ్యంబుమై, సైన్యంబుతోఁగూడ వానిన్ దైన్యంబునొందించి ప్రాణాపాయస్థితిఁ జేర్పుటనవలోకించి, కరుణఁదలంచియిట్లనియె.

ఉ॥ నానతిఁ బుణ్యశీల విపినంబునఁ జోరుఁడవై హరించి, సం
త్రాసముపుట్టి, సొచ్చితి పురంబు; విరోధముఁ దెచ్చికొంటి; వృ
గ్రాసురవృత్తి మాన; వదయాకృతి లోకమునెల్ల నేచుచున్
గాసిలఁజేయు, దెంతయును గ్రాలు దధర్మమునంద యిచ్చలుఁ.

ఉ॥ సేనల నుబ్బుమైఁ గలఁచి, చెక్కితి; వంతనబోక సద్గుణ
శ్రీనిధి మత్సహోదరునిఁ జెండితి; నన్నెదిరించి యిమ్మెయిన్
దీనతకైతి; వించుకయుఁ దేరవు, సావునకైతి; వింక నే
మేనియు సేయఁగాదు, కరుణించితిఁ, బొమ్ము! తొలంగి, వీటికిన్.

క॥ అని పలికి, యస్త్రము చేఁ జి
క్కిన వైరిన్ విడిచె, నాఁటికిన్ గరుణఁ దలం

చి, నుత జగత్ప్రథిత యశో
ఘనుఁ డగు నా ప్రభువు సుగుణఖని, పెంపెసఁగన్. ౨౬౩౦

వ॥ అనంతరం బమ్మహాపురుషుండు కతిపయదిన సమరంబుల నయ్యా
సుర కులంబు నిశ్శేషంబుగ సమయించి, సకలదేవగణ సమక్షమ్మున
నగ్నిన్ బ్రవేశించి, కందక, పావనమైన తన దేవిన్ బరిగ్రహించి
కొని, విభీషణుని కా లంకా రాజ్యంబు నొసంగి, యతండును
సుగ్రీవజాంబవదాంజనేయాంగదాది యోధవరులు రా నిజపురంబుఁ
బ్రవేశించి, రాజ్య భారంబుఁ గైకొని, పూజ్యంబుగ నిర్వహించు
చుండె, నా రాజదేవుని రాజ్యపాలనంబున. ౨౬౩౧

తే॥ ఇద్ధ మహిమ యెసంగఁ గా నినియ నవియు
ననక యెల్లకుఁ దానయ్యె, యదనుఁ దప్ప,
కిచ్చుచుండె వసుంధర ; యెల్లప్రజలుఁ
దృప్తి జీవింపనైరి శాంతి యొడఁగూడ. ౨౬౩౨

తే॥ ధర్మమనఁ, బ్రాణమన, నిష్ట దైవ మనఁగఁ,
బ్రజల కొండులు గావు, ధర్మంబ తనకుఁ
బ్రాణమై యొప్పు. నమ్మహారాజు తప్ప ;
నతని చిత్తంబు వారి భాగ్యము ఫలంబు. ౨౬౩౩

తే॥ అమ్మహాత్ముని యెడల భయం బెఱుంగ
రా ప్రజ లొకింతయుఁ ; గరంబు లనుట కప్పు
డర్థ మెందును లేదు ; సర్వార్థములును
బ్రభువు పరముల కా సుఖపడిరి వారు. ౨౬౩౪

తే॥ ప్రజలు తమజీవితములు ధర్మంబు కొఱక
యను తలంపున నుంట, నన్యాయమునకుఁ
దావులే దప్పుడు ; ప్రకృతి దేవి నోచి
కొనియె శాంతి సుఖమునకుఁ గుతుక మెసఁగ. ౨౬౩౫

తే॥ లేవకాలమరణభయక్లేశ దుర్ద
శాదు లప్పుడు ప్రజలకు; నంతకంత
కెక్కు డగుచుండె ధర్మము దెల్లవారి
కత్యధికదీక్ష; లేదు మోహప్రవృత్తి. ౨౬౩౬

వ॥ ఇట్లు ఇలసుఖంబులకును, బరమార్థంబునకును, దమ ప్రభవ మూలంబను విశ్వాసంబుమైఁ, బరమ శాంతి సుఖంబున నోలలాడు నా ప్రజలయం, దఙ్గులు కొందఱు, చిరకాలము పరుని యింటఁ జిక్కి వచ్చిన తమ ప్రభ్వీణి శీలంబున సంశయించుచు, నాడ నాడ నడిసేయు చుంట యెఱింగి, సర్వార్థవేది యగు నా ప్రజాదేవుం, డుత్సాహంబుఁ దక్కి, యొక్కనాఁడు తమ్ములను గురువున్ గూర్చుకొని, యేకాంత గోష్ఠియందు వారితో నిట్లనియె. ౨౬౩౭

శ్రీరామస్వామి యేకాంతంబున గురువు తోడను దమ్ముల తోడను భాషించుట.

తే॥ సకలలోక పవిత్ర ప్రశస్త శీల
యైన మత్సహధర్మిణి యకట! ప్రజలు
సంశయింపంగ నయ్యె; నీ నడి సహించు
నట్టిదే కులకాంత? యేమందు నేఁడు? ౨౬౩౮

క॥ ఎఱుఁగుదు నేనున్, మీరలు
నెఱుఁ గుదు; రఖిల ప్రపంచ మెఱుఁగున్; వేల్పుల్
మఱి యెఱుఁగుదు రాయమ స
చ్చరితంబు; నెఱుంగ రెఱుకసాలని వారల్. ౨౬౩౯

క॥ అడవులఁ బరు నింటన్, బె
క్కిడుముల బడి, వచ్చి, తుదకు నిమ్మోయి నకటా!

సడి కగ్గమాయె నాయము;
కడ వన్ జను నెట్లు విధి జగతి నెవ్వరికిన్? ౨౬౪౦

చ॥ ఎఱిఁగి యెఱింగి యాయము సహింపఁగ నేర్చునె కాని యీసడిన్?
బురపురఁ బొక్కుకున్న తలపోయఁగ రాని దురంత చింత? నె
వ్వరుసున దీనిఁ బాపికొను భంగికి సాలు నొకో కదా కరం?
బెఱుఁగఁగ రాదు నాకు నొకయింతయు; మీ రరయుండు నేర్పుమై.

క॥ ఒకతల సంసారముఁ, బ్రజ
లొక తల ప్రభువులకు; వీని నోర్పుమెయి నొకం
డొకటన్ జెడకుండన్ జూ
చికొనవలసియుండు నేర్పు చెలువారంగన్. ౬౩౪౨

తే॥ పోల సంసారమునకెల్ల మూలము సహ
ధర్మిణి యనేకవిధముల; దానికి నొక
కీడు పుట్టిన సంసారమే డ నింక?
నట్టి గొడవకు నే నగ్గమైతి నేఁడు. ౨౬౪౩

తే॥ ప్రజలు నా కెల్లవిధములఁ బ్రాణములు; కు
లాంగనయుఁ బ్రాణ; మివి యిట్టివై యెసంగ,
నడుమ నీ సడి యుదయించె నాకుఁ బ్రాణ
గొడ్డమై, యెుత్తి మాటు వల్కుటకుఁ గాక. ౨౬౪౪

తే॥ సకల లోక ప్రశస్త విశాల సుగుణ
రాశి, సహధర్మిణి, యశోఽనురక్త, సాధ్వి
దీని విడచుటయో? నెమ్మదికి నెసంగు
ప్రజల విడచుటయో? యెుక్క పనియు వుట్టె. ౨౬౪౫

తే॥ ఎద్ది యున్ దోఁప, కిట్లు మి మ్మిచటఁ గూర్చి
కొంటి, వచ్చితి, రంతయు వింటి, రోపు

కొలఁది సాల విచారించి, కూర్చి సెప్పు !
డెద్ది సదుపాయమో దీని కెల్లను ? నది. ౨౬౪౬

తే॥ నాకు నేన విచారింపఁగాక యుండు
నిట్టి సంకటపాటున; హితులబుద్ధి
వలయు సాలదనుక ; గాన వచ్చి, పోవ,
కీర యొకభంగి నిది నిర్ణయింపుఁ డరసి. ౨౬౪౭

క॥ అనుటయు వారును గలఁగిన
మనములతో, మనసుకానిమానసున నట్లా
డిన యమ్మహానుభావు వ
చనపద్ధతి నూఁది, చాలఁ జర్చించి, తగన్. ౨౬౪౮

వ॥ ఇట్టట్టని తమతమ నిర్ణయంబు లాలోచించికొనఁజొచ్చి, రందు గురుం
డగు వశిష్టుం డిట్లనియె. ౨౬౪౯

వశిష్టుండును లక్ష్మణాదులును దమతమ నిర్ణయంబులు
శ్రీరామునికి నివేదించుట.

క॥ ఎఱుఁగని ప్రజ లేమేనియు
నఱుతురు కాఱు ; లవి గొండ్రె యార్యులు ; లోకం
బెఱుఁగదె యూయమ పావన
చరితము ? మనకేలఁ గాని చర్చలకుఁ దిగన్ ? ౨౬౫౦

వ॥ అనంతరంబ తక్కిన మువ్వురు సోదరులలో లక్ష్మణుం డిట్లనియె.

సీ॥ ప్రజలలోనన్ ప్రధానులై పరిధవిల్లు
వారలకుఁజెప్పి, వారలవలనఁ గాఱు
లఱచు మూర్ఖులఁ దిట్టించి, యట్టెగిట్టె
నోళ్లు మూయింత మొ ప్పట్లు నుడువకుండ. ౨౬౫౧

వ॥ పదంపడి భరతశత్రుఘ్ను లిరువురు నేకనిర్ణయంబునకు వచ్చి
యిట్లనిరి. ౨౬౫౩

తే॥ సకలలోకపవిత్ర నా సాధ్విఁగూర్చి,
కాఱులఱచెడు నా కొయ్యగాండ్ర నేర్చి,
పట్టి, చెఱనిడి, స్రుక్కింత ; మట్టు లెన్నఁ
డొరులు పెనుగాధలన్ ద్రవ్వకుండునట్లు. ౨౬౫౪

వ॥ నావుడు నవియెల్లవిని యారాజర్షిశిఖామణి వారికిట్లనియె. ౨౬౫౫

తే॥ నామనంబున కివియెల్ల నచ్చ ; వెట్లు
సూచినను గీడునక యగు చొప్పు కాన
నయ్యెడిని ; రెంట నొకఁ డూఁదునట్టివనికిఁ
దిగక తప్పదు మనము ; సందియములేదు. ౨౬౫౬

వ॥ అది యెట్లందురేని వినుండని యతండు మఱియు నిట్లనియె. ౨౬౫౭

తే॥ గురువరేణ్యులు చెప్పినకరణి నజ్ఞ
లేమిపల్కిన మనకేమి ? యెఱుఁగులోక,
మని పులిమి బుచ్చితిమయేని, నా సడికొక
యడ్డుపుట్టమి, నదిలోక మాక్రమించు. ౨౬౫౮

తే॥ లక్ష్మణుఁడు పల్కినట్లు మేలంబునన్ బ్ర
జాప్రముఖులన్ బిలిచి, పల్కి, సక్కఁజెప్పఁ
బంచితిమ యేనిఁ బ్రజలలోఁ బ్రజలు వాద
ములకు సొత్తురు, దిగుదురు కలహాములకు. ౨౬౫౯

తే॥ భరతశత్రుఘ్నులమతంబుఁ బట్టి, కాఱు
లఱచు నజ్ఞుల బాధింప నగుదుమేని,
వారివారు మఱియు వారివారు నున్న
రందు ; రిఁకెల్లవారు భయంబుఁ గొంద్రు. ౨౬౬౦

తే॥ ప్రజల వెఱపించి, పీడించి, పాలనంబు
సేయ దొరకొను. ఏఁటి మంచిపని? వెఱపు
నందు భక్తికి రక్తికి నరయఁ దావు
కలదె? భయమున ధర్మంబుఁ గాంచనగునె? ౨౬౬౧

వ॥ అదియుఁ గాక. ౨౬౬౨

ఆ॥ కాఱులేనిఁ, బెద్దగాథలేనియు నిచ్చ
లఱచుచుండు రజ్ఞు లచట నచటఁ;
బ్రాజ్ఞులొల్ల; రేఁటిపల్కులం; ద్రెళ్లనిఁ
బ్రజల నోళ్ళుమూయ బ్రహ్మవశమె? ౨౬౬౩

వ॥ ఇక్కానిసడి యన్యులవిషయంబునం దగునేని మీరుచెప్పినచొప్పు
లన్నియేనిఁ, గాక కొన్నియేనియుఁ బ్రయోజనంబునకగుట నిజంబ;
కాని యది మనయంద వర్తించుటన్ జేసి, మనకవిగ్గె కొనఁగావయ్యె;
వెండియు. ౨౬౬౪

తే॥ రాజులకునెల్ల మార్గదర్శకుఁడనైన
నేన యీపనులకు నెట్లు పూనికొందుఁ?
ద్యాగమువహించి, యొక యుపాయమునఁ బాపి
కొందు నీసడి; దానఁ జేకూరుశాంతి. ౨౬౬౫

తే॥ ధర్మవేదిని నా సహధర్మిణి, యను
రక్త యానీత నాకు గారవ మెలర్పఁ
ద్యాగమువహించి, తోడ్పడ నయ్యెనేని
నొనరు నా కార్యమునకుఁ బ్రయోజనంబు. ౨౬౬౬

వ॥ అది యెట్లనిన వినుండు. ౨౬౬౭

తే॥ తన ప్రజలయట్ల ప్రజలనందఱఁ దలంచి,
యెఱుకసాలనివార లేమేని సడి నొ

నర్చుటకుఁ గిల్బిషంబు మనంబునందు.
నంటనీయక, తాల్మి పెంపడరఁ బొల్చి. ౨౬౬౮

తే॥ ఆసతీమణి లోకంబు నంటనియది
వోలె, ఋష్యాశ్రమములకుఁ బోయి, కొంత
కాల మచ్చోట శాంతిమైఁ గడుపనైనఁ,
బ్రజల ననుతాపము కలంచు బహువిధముల. ౨౬౬౯

వ॥ అప్పుడు.

తే॥ ఎఱుకసాలక పడిఁజేసి రింత లెవ్వ?
రా ప్రజలఁ బ్రాజ్ఞులగు ప్రజ లాఁగి బ్రువ్వఁ
దిట్టుదురు కన్నులెఱ్ఱనై; తెల్విఁ దెచ్చి
కొందు రావయి నయ్యజ్ఞు లంద ఱోకట. ౨౬౭౦

వ॥ ఇదియ దీనికిఁ దగిన యుపాయంబని తలంతు; నైనను.

తే॥ ప్రజలఁ గూర్చి యింతటిబాధఁ బడఁగనయ్యె
నప్పురమ సాధ్వి, యెంతయన్యాయ? మెంత
గోర మీ పడి? దీనిఁ గ్రక్కునఁ దొలంగఁ
జేసికొనరాదు, సైరణ సేఁత లెన్న. ౨౬౭౧

తే॥ అకట! రాజత్వ మింతబాధ్యతకు, నింత
కఠినచర్యకు నగునె? యుగ్రముగఁ బ్రజల
నేచరాదు, విడుపు సన దిచ్చవచ్చి
నట్లు; వెఱపించుటయు, మాను టవియుఁ గావు. ౨౬౭౨

చ॥ అడవులఁ జాల కాల, మసురాధము ప్రోలునఁ గొన్నినాళ్లుఁ, బె
క్కిడుముల కగ్గమాయె సతి యింతకు మున్; మఱి యట్టి పాట్లక
య్యెడినని తోఁచుచున్నయది యిప్పుడు; నేమన? శాంతిసౌఖ్యమున్
బడయఁగఁ గానిదాయె బహుభంగుల నాయమ; కింక నెట్లొకో?

క॥ ఏమియు దోసము నెఱుఁగని
యా మహితగుణాఢ్య "నరుగు మడవుల" కని యే
నేమని పల్కుదు ? నది మే
లే ? మతమే ధర్మహాని యెవ్వరి కేనిన్ ? ౨౬౪

తే॥ ధర్మమున కేనియున్ సహధర్మిణి యెడ
బలిమి, సూపుట కాదా ; నిర్బంధమునకుఁ
బాలుసేయుదు రే ధర్మపత్నిఁ బ్రాజ్ఞు ?
లది యధర్మంబు, నసురకృత్యమును గాదె ? ౨౬౫

తే॥ అరయ సహధర్మిణిఁగఁ బడయంగ నయ్యో
నమ్మన స్విని పూర్వపుణ్యమున నాకు ;
నా చరిత్రంబునకుఁ బావనత్వ మమ్మ
హాసతి కతంబునన యగు ననుట యొప్పు. ౨౬౬

వ॥ ఇప్పుడు లోకంబున నగుచున్న సడియును, దానిన్ బాపికొన నా చేసిన యాలోచనయు, లెస్సగా నెఱింగించి, యె ట్లేని నరణ్యాభిగమనంబునకు నాయమ నొడబఱచుటయ యిప్పటికైన కార్యంబు ; దీనికి మాన్యులగు గురువరేణ్యులె పూనికొన నైన వా రనుటయు, విని వసిష్ఠుం డమ్మహాపురుషుని కిట్లనియె. ౨౬౭

తే॥ అనఘ ! నీధర్మ నిష్ఠ కియ్యదియ పోలు
నట్టి సదుపాయ ; మిది యిట్టులయ్యు, నెట్టి
పాపము నెఱుఁగని గుణాఢ్యఁ, బరమ సాధ్వి
నెట్టు లప్పని కొప్పింతు నేమి సెప్పి ? ౨౬౮

వ॥ అయినను నీమతంబు సెప్పి, యాయమ మతంబు తెలుంగు నారసి వత్తు నని పల్కి, యప్పరమర్షి యప్పరమసాధ్వి యున్న యెడకుఁ

బోయి, యీయమ చేతఁ బూజితుండై, యంతయు వినిపింప, విని యక్షులపాలికారత్నంబు కందక, కుందక, మొగంబు సక్కనై ఘుతనితో నిట్లనియె. ౨౬౯

సీతాదేవి వసిష్ఠునితో నిజాభిప్రాయంబు నెఱింగించుట.

తే॥ ఋషులు దేవతలును, సిద్ధు, లెల్ల జగము
నెఱుఁగు నాచరితంబు ; మీ రెఱుఁగ రెట్లు ?
కాని నడి వుట్టె, నేమనఁ గలదు ? పూర్వ
కర్మఫల మిది ; నా కెట్లు గడువ వచ్చు ? ౨౭౦

తే॥ అమ్మహానుభావుఁ డక్కట ! నా నిమి
త్తమున సాలఁ గష్ట దశల కగ్గ
మయ్యె ; దానిఁ గూర్చి యడలుదు ; నాకుఁ జే
టిట్టు లగుటకున్ జలింప నెట్లు. ౨౭౧

తే॥ భోగములఁ గూర్చి నా కొకప్పుడును మనసు
వుట్టదు, ప్రశాంతిమై జగంబునకు మేలు
కలుగ నొక భంగి జీవింపఁ గలుగు టొండ
తలఁతుఁ ; దినఁ గట్ట నింత లింతలును సాలుఁ. ౨౭౨

క॥ అమిత ప్రశాంతిసౌభా
గ్యమునకు నిలయంబు లివియ యనఁ దగు ఋష్యా
శ్రమముల నాకుఁ బరమసుఖ
దము ; లీ నగళులకు నవ్విధము రా దెట్లుఁ. ౨౭౩

తే॥ ప్రజలకున్ గాని చరితంబుఁ బట్టి, యేల
లోకమున నిద్దనై యుండ నాకుఁ ? బరమ
పూజ్యులగు నమ్మహర్షు లెప్పుడును గూర్చు
నుండు నడవుల ; నవియ నా యొప్పు చోట్లు. ౨౭౪

ఆ॥ ఇంతమేలుఁ గూర్చునే నాకు దైవమే
నెప్డుఁ గోరు దాని నిట్టు లొసఁగి?
యార్యగణ్యమైన సూర్యవంశమున కే
హాని పుట్టకుండు టదియ చాలు. ౨౬౮౫

తే॥ సకలలోకైకవంద్య విశాలధర్మ
మూర్తి యై పొల్చు నమ్మహాత్మునికి నట్టు
లైతి సహధర్మిణి; నుదారుఁ డైన యతని
మతము గీటునఁ బుత్తునే మాఱు పల్కి? ౨౬౮౬

తే॥ బ్రహ్మసదృశుల రీరు, దిక్పాలకసము
లనఘు లా ముప్వురు మఱందు; లా నృపాల
వరుఁడు విష్ణుసదృశుఁడు, డీశ్వరుఁడు; నాకు
మీ పనుపుఁ గైకొనుట చాల మేల కాదె? ౨౬౮౭

వ॥ మీమతం బెల్లభంగుల లెస్సయైయున్నది; నా కోరికొన్నదియు
నదియ; కావున నిప్పని కాలస్యంబుసేయక నన్ననుపుండు, మీ
యాజ్ఞ యగునప్పుడ మఱలివత్తు; ననుటయు విని, యమ్మహర్షి
యా జగత్పవిత్రసచ్చరిత్ర నిచ్చయంబునకు వెఱగొందుచు, నా
యమకుఁ బ్రియంబువల్కి, యచ్చోటువాసి, తమ్ములతో నేమే
నియుఁ బల్కుచుఁ, దనరాకకు నిరీక్షించుచుండు నారాజర్షిసత్తముం
డున్నయెడకువచ్చి, కూర్చుండి, యతని కిట్లనియె. ౨౬౮౮

క॥ ఆసతికిన్ నీవును, నీ
కానతియున్ బోలుదురు మహావ్రతులరు, దీ
జ్ఞానసహితుల, రఖిలజగ
ద్భాసుర సుచరిత్రులరుఁ, బ్రపంచజ్ఞులరున్. ౨౬౮౯

క॥ ఒండాడ కియ్యకొనియెన్
నిండుమనముతోడ నీపనికిఁ బరమసతీ

మండనమగు నాయమ ముఖ
మండల మలరంగ లోకమాన్య చరిత్రమై. ౨౯౦

వ॥ అనుటయు దానికి నమ్మహాత్ముండు సంతోషించె ; నాతనితమ్ములు హర్షవిషాదంబులు గ్రందుకొన నూరకుండి ; రవ్వశిష్టుండును మేల నియె ; ననంతరంబ కొండొకదినంబున నిండుచూలాలియగు నప్పరమ సతీరత్నంబును లక్ష్మణుండు రథంబుపై నిడికొని చని, యరణ్యంబుసొచ్చి, పరమశాంతతపః ప్రభావఘనుండగు వాల్మీకి మహర్షితో నంతయున్ జెప్పి, యాయమనప్పగించి చనియె ; నవ్వలికథ మీకెఱుంగనైయుండు ; వింటిరే యప్పరమ రాజర్షిదంపతుల ప్రజానురాగత్యాగసహనశీలప్రభావాదులని చెప్పి, యాజగదుద్ధారకుండు వారలతో మఱియు నిట్లనియె. ౨౯౧

క॥ ఆరామదేవుఁ బోలిన
పూరుషు, లాసీతఁబోలు పొలఁతులు, నెందున్
లేరప్డు, నిప్డుఁ, బుట్టరు
ధారుణి నెప్డేని మఱియుఁ ; దథ్యమునుండీ ! ౨౯౨

తే॥ రామునిచరిత్ర మొక నిదర్శనము రాజ
కోటికిన్ రాజ్యపాలనాత్మప్రకర్మ
కాండమున ; నేఁటిరాజు లక్కరణినుండ ;
రిచ్చవచ్చిన యట్ల వర్తింతు రెపుడు. ౨౯౩

వ॥ దానన్ జేసి లోకంబునకు హానియగుచున్నది ; నేను నాయోచినట్లు జగద్ధితంబునకు పాటువడుచుండు ; నది యట్లుండనిండు. ౨౯౪

క॥ ఊరిప్రజలు తమధర్మము
మేర యరసికొంచుఁ, గలిసి మెలిసి బ్రదుకు చో
ప్పారయఁ బరమశుభోదయ
కారణ ; మది తప్పిరేనిఁ గాంతురు కీడుల్. ౨౯౫

ఉ॥ ఇంతలు సాలఁగూర్చి ప్రవచించితి నిప్పుడు గ్రామజీవనం
బెంతయు మేలు, శాంతిమెయి నెల్లరు నుండఁగనంచు ; మీరల
త్యంతముదంబుతోడ వినసైతిరి ; మేలది ; విన్కికిన్ దగన్
శాంతత నెల్లకార్యములు సక్కనొనర్చికొనుండు ! నిత్యమున్. ౨౧౯౭

తే॥ సిధివివాద పరిష్కృతి నేఁడసేయ
వలసియున్నది ; సరళకు వార్తనంపుఁ
డనుటయు మహాప్రసాదమం చార్యవర్గ
మట్లు కావించెఁ ; దగవచ్చె నాయమయును. ౨౧౯౮

వ॥ ఆయమతో సర్వమంగళయు, మఱికొంద ఱాంధ్రునవచ్చి ; రిట్లు
వచ్చినవారి నిమ్మగుచోటఁ గూర్చుండవెట్టి, యయ్యార్యవర్గంబు
వారది నివేదించుటయు, నప్పరమధర్మవేది యెల్లవారి నువలక్షించి
యిట్లనియె. ౨౧౯౯

తే॥ మిత్రశర్మయు, సరళయు మెచ్చనైన
వార లిక్కాలమున ; నిట్టివార లరిది,
మీరక కాక్లేఁజగతికి మేలకల్గు
నిట్టివారలు కల్గుట ; నింతినిజము. ౨౨౦౦

తే॥ ఒప్పుగా నెన్నియేనియుఁ జెప్పవచ్చుఁ
గాక, సెప్పినయట్లు సక్కగ నొనర్పఁ
బోల దందఱి ; కేమిసెప్పుటయు లేక
వీర లబ్బంగి నుతికెక్కిరి ; వేయునేల ? ౨౨౦౦

తే॥ వీరలన్ జూచి మీయూరివార కాక,
యెల్లవారును సద్వృత్తి నెసఁగఁ గనుట
యెంతయేనియు, మేలు సుం ! డిజ్జగమున
కేమిటి ధ్రువత్వ ? మవినీతి కేఁటివేరు ? ౨౨౦౧

వ॥ మీరెల్లరు నాబుద్ధినినట్టి, నిధివివాదపరిష్కారభారంబు నాయందు వెట్టితిరి ; కానం బోయినరాత్రి నా మోపినట్లు విచారించి, దాని యున్నరూపుం గాంచితి, నది యిప్పుడు చెప్పెదు, ననిపల్కి మిత్రశర్మను సరళను సాదరభావంబుమై వీక్షించి, యప్పురుషోత్తముం డొప్పుమెఱయ నిట్లనియె. ౨౭౦౨

క॥ ఒనర న్నాచెప్పినయది
విని, "యౌవుఁగా" దనరుగద ! వివేకముమై మీ
రును నేను నలర నది "మే"
లని పల్కుదురు కద ! సంశయము లేదుకదా ! ౨౭౦౩

క॥ నా రెండు కన్నులున్ బలె
మీరిరువురు నా కగుదురు ; మీ మేలున కే
నారయుదు నను విషయంబును
దూరము చర్చించి కొనుఁడు ! తొలఁగకుఁ ! డా ప్తిన్. ౨౭౦౪

వ॥ నావుడు వార లిరువురున్ లేచి, చేతులుమోడ్చి, వినయంబెసంగ నిట్లనిరి. ౨౭౦౫

క॥ ఏ మెక్కడ ? మీ రెక్కడ ?
మీ మత "మవుఁ గా" దనంగ మే మెవ్వర ? మో
స్వామీ ! వేదము కాదే
మీ మాట ? యిదేల మమ్ము మీ రిట్లడుగన్ ? ౨౭౦౬

శ్రీకృష్ణస్వామి నిధి వివాద పరిష్కారంబు సేయుట.

క॥ అనయమును ధర్మ సంస్థా
పనమున సకల ప్రపంచ భావ్యుల రగు మీ
పను పొనరించుట భాగ్యం
బనఁ గాదే మాకు ? దాని కై తిమ యిమ్మై. ౨౭౦౭

క॥ మా యూరు, నేము, నీ ప్రజ,
లీ యఖిలజగంబు మీ సుహితపాదరజ
శ్శ్రీ యోగంబున సకల
శ్రేయః ప్రాప్తికి నయితిమి చిర కాలంబున్. ౨౭౦౮

వ॥ అనిన విని యా జగద్గురుండు వారల నత్యాదరంబుమెయిఁ గూర్చుండ
పలికి, పదంపడి యెల్లవారును విన నిట్లనియె. ౨౭౦౯

తే॥ చాలకాలంబునకు మున్ను జగతిఁ బేరుఁ
గొన్న యొకరాజు శక్తిమెయిఁ గూర్చెఁ బెక్కు
విత్తరాశులు; వాని కీవి యనఁ గాదు;
కొడుకులును గూతులును లేరు; కోర్కె కలదు. ౨౭౧౦

వ॥ శత్రురాజుల భయంబునన్ జేసి, యతం డీనిధిన్ గూర్చి, యొరు
లెఱుఁగకుండ నిజగృహారామంబున భూమి ద్రొప్పి, నిక్షేపంబు
సేసి, దానిపై నొక్క దేవాలయంబుఁ గట్టించి, పదంపడి కొంత
కాలంబు సనఁ గాలధర్మంబు నొందె; వాని యఖిలరాజ్యంబును
ధనంబులును శత్రు రాజు లాక్రమించి కొని; రొరు లెఱుంగమిన్
జేసి, యి మ్మహానిధి వారికి లభింప దాయె; నీ గాథ పదునొకండు
వేల యేండ్ల నాఁటి, దీ పెద్దకాలమున నాస్థలంబు పెక్కు మార్పుల
కయ్యె; వినుండు. ౨౭౧౧

తే॥ ఇప్పు డానిధి వీరల కిట్లు దొరికె
దైవయోగంబునన్ జేసి; తగవు వెట్టి
కొనిరి వీ; రమ్మహిమయుఁ దగవగుటయు నెల్ల
రెఱుఁగ నై; రొక చాడ్పున నిదియు లెస్స. ౨౭౧౨

వ॥ మిత్రశర్మ తనపొలంబు సరళ కిచ్చు నప్పుడు పొలంబు పంటలందు
మాత్రమ పాళులు నిర్ణయించె; సరళయు నందుల కొడఁ బడియె;

నిధ్యాదులన్ గూర్చి యప్పు డెట్టి ప్రశంసయు రాదయ్యెఁ; గావునన
దైవ యోగంబున లభించిన మహానిధిన్ గూర్చి, మాకుఁగాదు మా
కుఁగాదని తమ తమ మతంబులు చొప్పున వీ రుభయులును వివా
దంబునకు దిగి; రింతియ; యిందు నుభయుల భావంబులును
నిష్కళంకంబులు, నుదారంబు ల; సందేహము లే; దిట్లు వీ
రుభయులుఁ నొల్లరేని మఱి యీ నిధి యెవ్వరి కగు? నది పోలదు;
క్షేత్ర ప్రదానాదానకాలంబున నిధి ప్రశంస రామిన్ జేసి, క్షేత్ర
స్వామి యగు మిత్రశర్మయు, హాల కర్మ లబ్ధ నిధి సౌభాగ్యయగు
సరళయు, నే తన్మహానిధి యందు, సమభాగంబులు గొన నిట్టు
లర్హు లైరి; దీనికిఁ బెద్దగాధన్ ద్రవ్యకొని, యూరక వివాదంబుఁ
బెంచి కొనుట ప్రయోజనలక్షణంబు కా దనుడు విని, యెల్లవా
రును, నత్యుల్లాసంబుమై లేచి, యొక్క పట్టున. ౨౬౧౩

తే॥ ఎంత దూరంబు జర్చించి, యిట్లు తేల్చి
చెప్పి రీ ప్రభు వర్యులు? సెప్ప నేర
రెవ్వ రేనియు నిట్లు; బలే కృతార్థు
లైరి వీ రిర్వు; రింకఁ గాదన వశంబె? ౨౬౧౪

వ॥ అని యెల్ల వా రొక్కమాటగాఁ దన నిర్ణయంబుఁ బాటింప,
నలరి, వారలఁ గూర్చుండఁ బలికి, యప్పురము పురుషుండు సరళా
మిత్రశర్మలన్ జూచి, మీ రేమందు? రనుం! డనుటయు వా
రిట్లనిరి. ౨౬౧౫

క॥ ఒం డన నగునే మా కీ
నిండు సభన్? మిమ్ముఁ గా దనిన మేలం ద్రే
సండుల యన కీ ప్రజ లొ
క్కండు నొక్కఁడు మన్నుమ? బ్రదుకుఁ గలదే మాకుఁకా. ౨౬౧౬

క॥ ఏ మెవ్వరి మని యమ్మోయి
మా మతమున్ దెలియనాడి మన్నించుట ? యో
స్వామీ ! మీ సేవకులము ;
యే మేనియుఁ జేయు ! మమ్ము నింక మహాత్మా ! ౨౭౧౭

వ॥ అనవుడు నమ్మహాపురుషుండు వారల కిట్లనియె. ౨౭౧౮

## శ్రీకృష్ణస్వామి మిత్రశర్మ సరళలకు హిత ముపదేశించుట.

క॥ మీ రిరువు రాస లుడిగిన
వార యని యెఱుంగుదు, నిధి వలనన్ మే లె
ట్లా రయ రనియు నెఱుంగుదు ;
సార విచారంబుఁ గొనుఁడు ! సక్కఁ దెలుపుదున్. ౨౭౧౯

తే॥ పెక్కులక్షలకున్ వెలఁబెట్టు నిమ్మ
హానిధిన్ బెట్టికొననొల్ల మనుట కూడ ;
దొరులసొమ్మది కాదు ; మీయుభయులధన
మై దొరికె మీక ; దైవమ యట్లుకూర్చె. ౨౭౨౦

క॥ ధనము సకలంబునకు నగు ;
వినుఁ డధనుఁడు లోకమునకు వెలియై, కీడుల్
గను "ధనమూల మిదమ్ జగ"
దనిరార్యులు ; నిజము సాటి రం దాప్రాజ్ఞుల్. ౨౭౨౧

తే॥ ధనములే కెవ్వఁడేని సేవనికి నగునె ?
కర్మసన్యాసికొకనిక కాదు గాక ;
న్యాయముగ సొమ్ముఁబడసి ; దానన్ జగమున
కెప్పు డగుచుఁ, దానున్ దిను టెంతలెస్స. ౨౭౨౨

క॥ తినఁ గట్టవలయు వానికి
వినుఁ డత్యావశ్యకంబ విత్తము ; మాఁకే
లని దానినొల్లని నరుం
డనయము బహుదుర్దశలకు నగ్గంబ యగున్. ౨౭౨౩

తే॥ సోమరుల్ల కాదు కా దంద్రు సొమ్ము, వార
లొరులకల్మి జీవింపుచు నుంద్రు గాన ;
నొక్కయడు, నొక్కపల్కును, నక్కగాపు
కాసులేక ; పేదకు నేడఁగలదు జగము ? ౨౭౨౪

వ॥ కొంద ఱెన్నిపాట్లు పడియును దినఁగట్టలేక వందురుచుండుటకును, కొంద ఱొడళ్లు బరువుగ వేలు లక్షలుఁ గోటులున్ బడయుచు సుఖంబునై నుండుటకును, బెక్కుకారణంబులు గల, వన్నియు దైవంబుపై బెట్టుట యన్యాయం ; బిప్పుడగ్గాథన్ దవ్వుటకాదు; ధనంబు ప్రయోజనంబుగాఁ గూర్చియ యించుక వక్కాణించితిని, మఱియు వినుండని యాలోకవేది యిట్లనియె. ౨౭౨౫

క॥ న్యాయముగ ధనార్జనమును
సేయుటయును, దాని రక్షసేసికొనుటయుఁ,
వేయేల ? మఱియు వెచ్చము
సేయుటయును గష్టములని సెప్పనవలయున్. ౨౭౨౬

వ॥ ప్రకృతిసిద్ధముగ మానవుండు సాంఘికజీవియని చెప్పనై యుండు, వృత్తిపౌకర్యంబు ననుసరించి బహువర్గంబులును, వానిననుసరించి బహుకుటుంబవ్యావహారికధర్మంబులును మానవకోటియం దేర్పడియె ; వీని కన్నిఁటికి బాధ్యుండగుటయ వానిధర్మంబు ; తద్ధర్మంబునంద వాఁడు సిద్ధిన్ బడయువాఁడు ; వెండియు. ౨౭౨౭

ఆ॥ తనకుఁ దాన యగుచుఁ ()ని, కట్టి, నచ్చు జె
వ్వనికిఁ గాదు, వాని వార్తలేదు

మానుషమునఁ; దోడివానిఁ గూర్చికొనని
వాఁడు మానవుఁడనఁ గాఁడు; నిజము. ౧౨౨౮

## శ్రీకృష్ణస్వామి సాంఘికతత్వముంగూర్చి చెప్పుట.

ఆ॥ ఒకఁడపుట్టు, బ్రదుకు నొక్కఁడ, సచ్చు నొ
క్కండ యనెడిచొప్పు కాదు మాను
షమున; నొక్కఁ డెట్లు జన్మించు? నెట్లు జీ
వించు? నెట్లు సచ్చు? నేఁటిమాట? ౧౨౨౯

వ॥ సృష్ట్యాదిమానవునిఁగూర్చి చెప్పవలనుగాదు, కాని నాఁడుమొదలు నేఁటిదనుకఁ బ్రవర్తించుచుండు మానవకోటిలో నొకండుపుట్టుటయు? బ్రదుకుటయు, సచ్చుటయుఁ బలువురకుఁ జెందియుండు; సర్వకర్మముక్తుండగువాని శరీరపతనంబుమాత్ర, మిందునకు వ్యతిరేకంబై యుండు; వెండియు నేఁడకాక కల్పాంతంబుదనుకఁ బెక్కుమార్పులకయ్యు నీ సాంఘికావస్థ మానవకోటికిఁ దవిలియయుండు; నీయర్థంబు పలువురకు సులభగ్రాహ్యంబు గామిన్ జేసియుఁ, గొంద ఱెఱింగియు మోహంబునకు వశులగుటన్ జేసియు, ననేకదుర్దశలు మానవకోటికిఁ బ్రాప్తించుచున్నవి; మఱియును. ౧౨౩౦

క॥ పలువుర తోడ్పాటును, మఱి
పలువురయంశములు కూడఁబడకయు నెప్డేఁ
గలదే విత్తార్జన మనఁ?
దెలియరు సామాన్యులెట్లు దీని నిజంబుల్. ౧౨౩౧

వ॥ కావున నేనొక్కండన యింతధనంబుఁ గూర్చితిననియుఁ దీని నేనొక్కండన యనుభవింతుననియుఁ దలంచుట కేవల మవివేకంబును జగద్ద్రోహకరంబు; నింతియగాక. ౧౨౩౨

తే॥ ఒకఁడు దుర్దశఁబడి, కుందుచుంటఁ జూచి
మనసుకందనివాఁ డేఁటిమానవుండు ?
వానిగుండె మానుషమునకైన నట్లు
వాఁడు నాకేఁటికని యుండువాఁ డుకాఁడు. ౨౭౩౩

క॥ తనయోపుకొలఁది నొరులకు
ననయంబును దోడుసూపు నాతఁడ ధర్మం
బునకైనవాఁడు ? "నాకే"
మను మానిసి లోకవంచకాధముఁ డరయన్. ౨౭౩౪

క॥ ధనబల విద్యావంతులె
వినుఁ డవిలేని జనములకు వెరవుమెయిన్ మే
లొనరింపనైనవా ; ర
ట్లొనరింపరయేని వారి కొదవు నఘంబుల్. ౨౭౩౫

వ॥ సాంఘిక జీవియగు మానవుండు తనజాతికిని, స్వేతరజాతులకును, దన యోపునంతకు మేలొనరించుటయ ధర్మం ; బదియ త్యాగం బును దానంబు నాఁబడు ; దానియందుఁ బాత్రాపాత్రవిచక్షణత యత్యావశ్యకంబు ; మఱియును. ౨౭౩౬

తే॥ అవసరం బారసి యొసంగు నదియ దాన
మొడ్లు ; కమ్మొయిఁ గాక మెప్పొందఁగోరి
యిచ్చు నది దాన మనఁ బడ ; దెల్లవారు
దాన మొనరింపఁ, గొనఁ, బాత్రతముల తఱికి. ౨౭౩౭

క॥ ఏ కార్యంబుల మేలగు
లోకమునకు ? నవి తగన్ బలువురు కలిసి యేన్
గా కొక్కఁడేని, దీక్షన్
గైకొని కావించువార ఘను లన్నింటన్. ౨౭౩౮

క॥ తన విధిఁ దాఁ జేసి కొనుట
యనయము ధర్మ మనఁ బడు; మహాత్ములు దానిన్
గొని యాడుదు; రి య్యర్థం
బునకున్ గాఁ డెవ్వఁ? డతఁడ పో పశు వరయన్. ౨౭౯

వ॥ ధర్మం బొక్కండ యయ్యు దేశకాలపాత్రభేదంబుల నది యనేక రూపంబులఁ బ్రవర్తించుచుండు; నిందు లకుఁ జిన్న నిదర్శనంబుఁ జూపింతు; వినుం! డింతకు మున్ను మానవతి యగు నీ సరళ పుట్టెడు భూమికిని, జత యెద్దులకును, విత్తులకును, బెక్కేలఁ గూటికిని గుడ్డకును నోఁచికొనక, మాన్యుండగు నీ మిత్రశర్మ నాశ్రయించి, యెట్లని జీవించి కొనుట మీర లె ఱుంగుదు; రప్పు డీ యమ తన యవసరంబుల కగువాని నెల్లఁ గొనఁ బాత్రమై యుండె; నిధి లభించుటన్ జేసి యిప్పు డట్టి యవసరంబులకుఁ గా; దింతయు కాక తా నొరులకుఁ బెట్టఁ జాలెఁ; గావున దానంబుఁ గొనఁ గా; దిట్లొక్కతె యంద యవస్థా రూపం బగు కాలంబును, దాని ననుసరించి, దాన పాత్రతయు మాఱె; నిట్ల వ్యక్తికిన్ బోలె దేశంబునకును నవస్థాపరిణామంబు ననుసరించి పాత్రతా పాత్రత్వంబులు సంభవించుచుండు; మఱియును. ౨౮౦

తే॥ వ్యసన సక్తుల కైన యవసరము లకు
నీయ రా; దనాథులు, నంగ హీనులును, న
శక్తులును బాత్రములు; విచక్షణత వారి
యెడల నావశ్యకంబు కా, దెన్నఁ జేని. ౨౮౧

తే॥ నియమము విచక్షణతయు వలయు సతంబుఁ
ద్యాగమునఁ; గీడు పుట్టు చందంబు ననదు;
కాని వలయు నొకప్డు లోకమున కెల్ల
మేల యగు దానఁ దాఁ గీడు పాలుఁ గొనుట. ౨౮౨

వ॥ త్యాగంబున్ గూర్చి, యింక నేంతేనియుఁ జెప్పనై యుండు;
నైన నిప్పటి కిమాత్రన సాలించి, మఱి యొక్కటి చెప్పెదు,
వినుం! డని సరళా మిత్రశర్మలన్ జూచి, యప్పరమాత్ముం
డిట్లనియె. ౨౭౪౩

తే॥ ఈ నిధిన్ బంచి కొనియేని, నేకభాగ
మునకు నై, యొక్కచో నిడికొనియు నేని,
మీ రనుభవింపుఁ డు! జగంబు మేలుఁ దలఁచి
యుండు! సత్కార్యములు నొనరింపుఁ! డర్థి. ౨౭౪౪

క॥ మీ రిరువురు బుద్ధినిధుల;
రారయ నోపుదురు ధర్మ; మది కావున నే
వారక బెక్కులు సెప్పన్
గోరను; మీరల యెఱింగికొనుఁ డెల్ల విధుల్. ౨౭౪౫

వ॥ అనిపల్కి వారల నందుల కియ్యకొలిపి, పదంపడి యెల్లవారిన్
గలయ నవలోకించి, యత్యాదరంబు నెఱపి, యా లోకప్రియుం
డిట్లనియె. ౨౭౪౬

శ్రీకృష్ణస్వామి గ్రామీణులతోఁ దన పోకన్ గూర్చి చెప్పుట.

క॥ వచ్చితి మీ యూరికి, మీ
మచ్చికకై యొకటి రెండు మాపులు నిచ్చోఁ
బుచ్చఁ గలిగితిన్, గౌరవ
మిచ్చలుఁ బొందితిని; నాకు నింతియ సాలున్. ౨౭౪౭

ఉ॥ ఏ మఱు నట్టివే తలఁప నెన్నఁడు నేనియు నాకు నిట్లు మీ
గ్రామము వారు సూపిన నిరంతర గౌరవభక్తి బంధుర
ప్రేమవిశేషముల్? మఱియుఁ బ్రీతికినైతి; సుఖంబుఁగంటి; మీ
కేమియు మాఱుమేలు నొనరింపఁగఁ బోలమి కాత్మఁ గుందుదున్.

తే॥ ఎల్లి పెండ్లికడన యే నేగుదుఁ, బని
కలదు సాల; తడయు నగుఁ గార్యహాని;
యాజ్ఞ నిండు ప్రియంబుమై నంద; రీని
శీధనిన్ బుత్తు నింద నా చెప్పినట్లు. ౨౬౪౯

తే॥ ఎన్నియేనియు ధర్మంబు లేర్చి కూర్చి
సెప్పితి దినమెల్ల; నా చెప్పినట్లు
మీరు వర్తింతు రనియు పేర్మిమెయిఁ దలఁతు;
నదియ మీరలు నా కిచ్చునట్టి కానుక. ౨౬౫౦

వ॥ అనుడు వారందఱు సమ్మోహానుభావుండు సనుటకు వగచుచు,
నింకను మఱికొన్ని దినంబు లుండుఁ డని ప్రార్థింప వెఱచి నిరాశ
కగుచు, మనసుకాని మనసులతో నిట్లనిరి. ౨౬౫౧

తే॥ ఇప్పుడో? కాక పూర్వమో? యెద్దొ? యెట్టి
తపము సేసితిమో మే ముదార భక్తి?
సకల జగదుద్ధరణశక్తిశాలుల రగు
మీ కృపకు నైతి మిట్టు లీ లోకమందు. ౨౬౫౨

తే॥ ఏమ మాభాగ్యమును నుతియించికొనఁగఁ
జాల; మంతియకా కది మేలుఁగాదు;
మేమనఁగ నెవ్వరము? మమ్ము మీర లిట్లు
తేర్చుటది యేల? నెంత యదృష్టమరయ? ౨౬౫౩

తే॥ నిర్మలప్రేమయును మహనీయసార
కృపయు, వెదఁజల్లి మమ్ము మీ రిట్లు రక్తి
భుక్తిముక్తులకున్ గూర్చి, ప్రోదిసేఁతు
రే? కృతజ్ఞులమెప్డు మీయెడల ననఘ. ౨౬౫౪

క॥ మీపలుక పరమవేదము;
మీపాదస్మృతియె మా కమితశుభదము, స

ర్వాపద్విమోక్ష మంత్రము
పాపహరముఁ, బావనంబుఁ, బ్రాపు, మహాత్మా. ౨౭౫౫

తే॥ పల్లెటూరి ప్రజలము ; మా బ్రదుకుఁజంద
మింత యున్నతికగుట, మేమెల్లజన్మ
ములను మీకుఁ గృతజ్ఞులమున్, విధేయు
లమునుఁ నని విన్నవించికొందుము మఱియును. ౨౭౫౬

వ॥ మిత్రశర్మయు, నుపాధ్యాయులును, నార్యవర్గంబువారును గ్రామ నాయక కరణములును దమ తమ యాశయంబులకుఁ దగ ననంతరంబ యమ్మహాపూరుషునికి వందనము లర్పించికొని, కృతజ్ఞత నెఱింగించికొని సమ్మదమ్మునఁ దేలిరి ; పదంపడి ప్రాద్దుగ్రుంకి రాత్రియయ్యె ; నప్పు డజ్జగద్గురుం డెల్లప్రజలతో నిట్లనియె.

తే॥ చనుఁడు ! మీరెల్లనిండ్లకు, సక్క రాత్రి
పుచ్చి, వేఁగుటయును మఱి నచ్చి, నన్ను
ననుపు సేయుఁడు ! సాలఁ బ్రయాసమునకు
నగ్గమైతి ; రీ దినమెల్ల నాగెఁ బనులు. ౨౭౫౭

వ॥ అనుడు వారు దేవరయానతి నిండ్లకుసని, పనులు నూచికొని, తిని, మఱివచ్చి, భవదీయ శ్రీపాదసన్నిధిన యీరాత్రిఁబుచ్చి, వేఁగుటయు ననుపుసేసికొందు, మిట్లు మా కనుగ్రహింపరే ? యని వేడికొనుటయు, నతండు మీ కిష్టంబగునేని నట్ల సేయుండనియె ; దానికిఁ బొంగి వారెల్లనిండ్లకుఁజని, తిని, పనులరసికొని, వేగవచ్చి సేరికొని ; రారాత్రి నార్యవర్గంబువార యజ్జగత్కల్యాణసంధాన దీక్షాపరాయణునకు, ఫలాహారంబు సమర్పికొని, కృతార్థులైరి ; పదంపడి యమ్మహాత్ముండు వారల కిట్లనియె. ౨౭౫౮

తే॥ అమరగతరాత్రి జాగరణమునఁ బుచ్చి
సోలితిరి, చాలు; నింక నా చొప్పు కాదు;
నెమ్మి నీ రాత్రి యంతయు నిద్రవోయి,
వేఁగుటయు వచ్చి, నన్నున్పు వెట్టుఁడు! మఱి. ౨౬౦

వ॥ నావుడు వారలు మహాప్రసాదంబని, యయ్యార్యకార్యాలయంబు
చుట్టును, మఱి మఱ్ఱి క్రిందను జాపలును గుడ్డలును బఱచుకొని,
యమ్మహానుభావుని ప్రయాణంబున్ గూర్చి, యేమేనిఁబలికికొనుచు
నిద్రకున్ జొచ్చి; రప్పరమపురుషుండును నార్యకార్యాలయంబునఁ
దనకై యమర్చిన సెజ్జపై మేనుఁ జేర్చి, యోగనిద్ర నవలంబించె,
నిట్లు. ౨౬౧

సీ॥ అఖిలజగద్విస్మయావహదివ్యప్రభావగంభీరుఁడై, పరగువేల్పు,
సకలరాజన్యదౌర్జన్యనివారణోపాయజ్ఞుఁడై పొల్చుప్రభువరేణ్యుఁ,
డురుధర్మసంస్థాపనోద్యమోజ్జృంభితశక్తిసాగరుఁడై యెసంగుఘనుఁడు
నిఖిలమహర్షిమానితపరతత్త్వవిద్యాసారసర్వవేత్త యగు ప్రాజ్ఞుఁ,
డట్టు లయ్యారివారలయందుఁ దాను
నొక్కఁడై, యెల్లధర్మంబు లొకఁడు నొకఁడు
నేర్చి, చర్చించి, బోధించి, యింపువుట్టఁ
బలికి, వదపడి సెజ్జపైఁ బవ్వళించె. ౨౬౨

వ॥ ఇట్లెల్లవారు నిద్రింప రాత్రి సాలదనుక గడచె; ననంతరంబ.

ఉ॥ ఈయనఘుండు లోకగురుఁ; డిచ్చట రాత్రులు రెండుబుచ్చె; రే
పేయదియేని నొక్కపని కేఁగెడు; వేఁగుటతోఁచె; మేల్కనుం!
డాయతభంగి వీడ్కొలుపుఁ! డందఱులెం! డని కోళ్లు "కొక్కొరో
కో" యని హెచ్చరించు గతిఁగూసెఁ ద్రిభంగుల నూగనెల్లెడన్.

వ॥ అనంతరంబ యెల్లవారును మేల్కని, యప్పరమాత్ముని యాగమ
నంబునకు వేచికొనియుండి; రంతకుమున్న మేల్కని సారథి వెంటరా

జని, బహిష్కర్మంబులన్ దీర్చికొని, యయ్యాదు వీరపుంగవుండు
శౌచం బలవరించికొని, ప్రయాణోచితవేషం బవధరించి, రథం
బాయితంబుసేసికొని రానయ్యంతన్ బంచె; నతండూరివారు
తోడ్పడ నరదంబున్ బన్ని, వాహనంబులన్ బూన్చి, వచ్చి, విన్న
వించుటయు. ౨౭౬౫

తే॥ ఒకని నొక్కఁడు ద్రోసికొం, చూరివార
లెల్ల మ్రొక్కుచు, వెంట రా నెక్క నమ్మ
హానుభావుఁడు దివ్యతేజోఽనుపమ వి
శేషవిస్ఫూర్తిఁ గ్రాలుచుఁ జిత్తమలర. ౨౭౬౬

వ॥ అనంతరంబ. ౨౭౬౭

తే॥ అమ్మహాస్యందనము మార్గ మట్టె వట్టె
మందగతిఁ బోవుచుండె, నానందమును, వి
షాదమును గ్రందుకొన, నా ప్రజలు కరంబు
లెత్తి, డింపక, మ్రొక్కుచు నేగు దేర. ౨౭౬౮

వ॥ ఇట్లు నడువనోపనివారు తప్ప, నూరివారందఱును వీడ్కొలుపఁ
గొంత దూరంబు సని, యా లోకోత్తరపురుషుండు వారల వారించి,
యిట్లనియె. ౨౭౬౯

తే॥ చాల దూరం బనుపువెట్టి, శ్రమకు నగ్గ
మైతి, రిది సాలు, నిఁక నిల్వుఁ! డంద, ఆజ్ఞ
యిండు! పోవుదు నన, వార లెదురు నల్క
నోడి, నిల్చిరి మ్రొక్కుచు నొక్కచోట. ౨౭౭౦

ఆ॥ వార లట్లు నిలువ, వడిఁ బోవుచుండె న
ప్పరమపురుషురథము పవన జవ వి
శృంఖలముగ; ధూళి రేఁగి, యంబరమున
కెగసి, మేఘరేఖ నెసఁగి పర్వ. ౨౭౭౧

క॥ కను సూపు మేర నా ప్రజ
లనిమేషతఁ జూచి రమ్మహాత్మ్ముని రథ ; మ
ల్లన మఱలిరి నిధిఁ గోలు వ
డినవారున్ బోలెఁ గలఁగు డెందంబులతోన్. ౨౭౭౧

వ॥ ఇట్లు.

తే॥ మనసుకాని మనసులతో, మఱలి వచ్చి,
యూరు సొచ్చి, మొగంబులఁ యొప్పుఁ దప్పి,
యా ప్రజలు సెప్పికొనుచుండి రమ్మహాను
భావు నౌదార్యమును, బ్రియ భాషణములు. ౨౭౭౩

క॥ సకల జగదుద్ధరణశ
క్తి కలితు నప్పరమపురుషు తేరు కలుష నా
శక మమ్మొయి సత్త్రటి న
త్యకలంక ప్రభ వెలుఁగుచు నరుగుచునుండెన్. ౨౭౭౪

క॥ నిరుపమ నిరంత రావ్యయ
పరిశుద్ధాఖండ విబుధ భావ్యలోల
స్ఫుర దురు శక్త్యన్మహిమా
గరిమా మహనీయ సారకాంతిసముద్రా ! ౨౭౭౫

ఆశయము.

సీ॥ కృషియమొల్లరకును వృత్తికా, భూదేవి పరమసంపన్నయైపరగుభంగి,
కర్షకుం డఖిలలోకమున నెల్లరచేత గౌరవింపనగుచుఁ, గ్రాలుచొప్పుఁ,
బ్రజలకెల్లరకును పాధ్యాయవర్గంబునెడ పూజ్యభావంబమొసఁగు తెఱగు
జ్ఞానంబు విద్యయు జన్మధనంబులై, యెల్లరియందు రహించువడువు,

సకల చేతనకోట్లున్ బ్రశాంతి బ్రదుకు
చందము, నవార్యములయి యొసంగుఁ గాక !
ధర్మ పథ వర్తనమునందఁ దైవబలముఁ
బడయుదురు గాక ! ప్రజలును బ్రభువులెల్ల. ౧౭౭౬

## కృతజ్ఞత.

ఉ॥ నాయెడ కింపుపుట్టమును నన్నయ భట్టు వకున్ ఘనుండు నా
రాయణభట్టునున్ బలె, నిరంత మిూకృతి కెల్లభంగులన్
సాయము సేయుచుండెఁ దనశక్తికిఁ బోలిన భంగిఁ బెంట నా
రాయణమూర్తినాయుఁ డఖిలార్థ విదుండగు నయుం బెలర్పఁగన్.

## గద్యము.

ఇది శ్రీమదఖిల జగత్సేవాపవిత్ర మహాపురుషపాదపరాగలవ
మాత్ర, ద్వారపురెడ్డి పాపినాయకపుత్ర, బుధజన
విధేయ, యప్పలనాయుఁడు నామధేయ ప్రణీ
తంబైన శ్రీకృష్ణధర్మవిజయ మహా
గ్రంథంబునందలి ప్రథమఖం
డము ద్వితీయభాగము ;
సంపూర్ణము.

---

శ్రీకృష్ణార్పణమస్తు

శ్రీధాతృనామసంవత్సర పుష్య శుక్లదశమి.

---

శ్రీసత్యానందప్రెస్, ఇన్నీసుపేట, రాజమహేంద్రవరము—1939.

# తప్పొప్పుల పట్టిక.



| పుట | పద్యసంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౫ | ౧౩౨ | గ్రాచులుండ | గ్రాలుచుండ |
| ౪౨ | ౨౪౬ | నమ్మహానురోత్తముని | నమ్మహీసురోత్తముని |
| ౫౦ | ౨౬౫ | నప్రవాహమెపుడు | వప్రవాహమెపుడు |
| ౫౬ | ౨౯౫ | జేసియేనికి | జేసియేని |
| ౬౦ | ౩౨౨ | దానున్ | దానన్ |
| ౭౧ | ౩౭౯ | కనేకగతుల | ననేకగతుల |
| ౭౮ | ౪౨౨ | లొండొరులకుం న | లొండొరులకు న |
| ౭౯ | ౪౨౭ | మోసమునకుం దిగఁడు | మోసమునకు దిగఁడు |
| ౮౦ | ౪౩౦ | సారవర్తనముం | సారవర్తనము |
| ౮౪ | ౪౫౩ | వేలు బలంబు | వేరుబలంబు |
| ౮౪ | ౪౫౪ | బెక్కుల్ | బెక్కుల్ |
| ౮౭ | ౪౭౨ | నెనయ | ఎనయ |
| ౮౮ | ౪౭౯ | బెంపొందవ | బెంపొదవ |
| ౮౯ | ౪౮౫ | కాపున్ బిడిచి | కాపున్ విడిచి |
| ౯౬ | ౫౨౮ | విమలజ్ఞానాదు | విమలజ్ఞానొజ |
| ౯౭ | ౫౨౯ | బెంపొందవ | బెంపొదవ |
| ౧౦౬ | ౫౮౧ | సారకములు | సారకరములు |
| ౧౧౦ | ౬౧౧ | పటోవికాది | పటోలికాది |
| ౧౧౯ | ౬౫౩ | గుణముఃల్ | గుణముల్ |
| ౧౨౭ | ౭౦౩ | దేనిల్ | దీనిన్ |
| ౧౩౮ | ౭౬౩ | గృశ్యావశ్యకతయు | గృహ్యావశ్యకతయు |
| ౧౩౮ | ౭౬౪ | నాకు నగునె | నగునె నాకు |
| ౧౩౯ | ౨ శ్లో॥ | బాంగవాః | బాంధవాః |
| ౧౩౯ | ౩ శ్లో॥ | పార్థినాహాః | పార్థివాః |
| ౧౩౯ | ౬ శ్లో॥ | కృషికర్మ సా | కృషికర్మ తత్ |
| ౧౫౦ | ౮౩౦ | రంతగన్న | రంతకన్న |
| ౧౫౩ | ౮౪౫ | వేమంగు | నెమ్మందు |

| పుట | పద్యసంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౫౫ | ౭౬౨ | గృభి | గృషి |
| ౧౫౬ | ౭౬౬ | నా పురమను | నాపురమను |
| ౧౬౩ | ౯౦౪ | నగుమ | నగుదు |
| ౧౬౩ | ౯౦౮ | గాంచి కాదె | గాంచి కాదే |
| — | — | లగుట యొల్ల | నగుట యొల్ల |
| ౧౬౬ | ౯౨౧ | పరిశ్రమముని | పరిశ్రమమున |
| ౧౬౯ | ౯౩౯ | గ్రొత్త మనున్న | గ్రొత్త మన్నును |
| ౧౮౨ | ౯౫౬ | జుమ్యా | జుమ్మా |
| ౧౮౬ | ౭౮౬ | యుడిగెద | రయుడిగెద |
| — | — | పనులకును | పనులకును |
| ౧౮౮ | ౯౭౦ | దుర్మతుల వీర | దుర్మతుల లీర |
| ౧౭౭ | ౧౦౪౪ | జలంబు లురివి, | జలంబులురిలి |
| ౧౯౦ | ౧౦౫౩ | జడని | జెడని |
| ౨౦౪ | ౧౧౧౧ | నచ్చోటుఁ జేరి | నచ్చోటుఁ జేరి, |
| ౨౦౪ | ౧౧౧౩ | నిత్తెఱఁగు | నత్తెఱఁగు |
| ౨౦౭ | ౧౧౨౬ | కృషించి | కృశించి |
| ౨౧౧ | ౧౧౪౪ | విని | వివి |
| ౨౧౩ | ౧౧౫౪ | లధర్మ రతులు | రధర్మపరులు |
| ౨౨౦ | ౧౧౭౮ | బహు సృష్టికి | బాహు సృష్టికి, |
| ౨౨౨ | దండకము తుది | సుశీలయు | సుశీలాయ |
| | ౧౧౯౫ | శ్రమమున నాతెఁ డష్టా | శ్రమమున నాతం డష్టా |
| ౨౨౪ | ౧౨౦౪ | వస్తువునకును | వస్తువునకు |
| ౨౨౫ | ౧౨౦౬ | నొక సూత్రమిది | నొక్క సూత్రమిది |
| — | — | అంగెలుంగుట | అంగెలుంగుట |
| — | ౧౨౦౮ | నాస్తి నెనఁగు | సాస్తినెనఁగు |
| ౨౩౮ | ౧౨౫౨ | సమన్వితములు నైన | సమన్వితములును నైన |
| ౨౩౬ | ౧౨౮౫ | వేమలు | వేమలు |
| ౨౩౯ | ౧౨౭౭ | బెక్కు పేరికలు | బెక్కు పేలికలు |
| ౨౪౩ | ౧౩౧౦ | వ్వారికేరి | వ్వారికేని |
| ౨౪౬ | ౧౩౨౯ | మది యరసితగన్ | మిది యరసి తగన్ |

| పుట | పద్యసంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౪౭ | ౧౩౩౬ | దవుటయూన్ | దవ్వులుటయూజా |
| ౨౪౯ | ౧౩౪౬ | పినుతకార్యదుర్య | వినుతకార్యధుర్య |
| ౨౫౦ | ౧౩౫౫ | నిరంతరగంబును | నిరతంబును |
| ౨౯౭ | ౧౫౧౬ | వినువుపుట్టి, పుట్టి | వినువుపుట్టి, |
| ౨౮౫ | ౧౫౪౦ | మనలకెల్ల | మనలనెల్ల |
| ౨౯౧ | ౧౫౬౭ | ప్రజలకోటి | ప్రజలకోడి |
| ౨౯౬ | ౧౫౯౭ | యున్నరనక యొట్టి | యున్నరనక యట్టె |
| ౩౧౪ | ౧౬౩౧ | భాషితముల | భాసితముల |
| — | ౧౬౩౨ | పెక్కుపేళ్ల | పెక్కుగతుల |
| ౩౦౫ | ౧౬౩౪ | వెడలందు | వెడలండు |
| — | ౧౬౩౮ | సనమున నెలంగు | పనమునన నెలంగు |
| ౩౦౬ | ౧౬౪౦ | బెంపలరు | చెంపలరు |
| ౩౧౮ | ౧౬౫౬ | నాఁదని | నాఁదగి |
| ౩౧౧ | ౧౬౬౫ | యత్యాదరంబు | యత్యాదరంబుపై |
| ౩౧౫ | ౧౬౮౩ | గొప్పదే | గొల్పదే |
| ౩౧౭ | ౧౭౦౦ | యది యనేకశదల | యిది యనేక దళల |
| ౩౨౧ | ౧౭౨౪ | యమ్మహావాగ్ని | యమ్మహావాగ్మి |
| ౩౨౩ | ౧౭౨౬ | బతేఁ దంతకు | బతేఁ డంతకు |
| ౩౨౪ | ౧౭౩౧ | స్వేతవర్ణ | శ్వేతవర్ణ |
| ౩౨౬ | ౧౭౪౪ | డొక్కపురీ | ఢొక్కపురి |
| ౩౨౭ | ౧౭౪౮ | మహామనసి | మహామనస్వి |
| ౩౨౮ | ౧౭౫౯ | ననూకూలగ తి | ననుకూలగతి |
| ౩౩౩ | ౧౭౮౧ | మృష్టాంబును | మృష్టాన్నంబును, |
| ౩౩౭ | ౧౮౦౨ | వినిగ్రశక్తి | వినిగ్రహశక్తి |
| | ౧౮౦౪ | నిగ్రహశక్తికవిత | నిగ్రహశక్తికలిత |
| | ౧౮౧౫ | నదియుటఁ జేసి | నదియుంటఁ జేసి |
| ౩౩౯ | ౧౯౧౧ | నబ్భావహాలోకమందు | నబ్భవనాలోకమందు |
| ౩౪౧ | ౧౯౨౫ | జానపుంజబు | జ్ఞానపుంజంబు |
| — | — | భాటకుందు | బాధకుండు |
| ౩౪౨ | ౧౯౩౧ | నానా జేశంబుల వాగలకు | నానాదేశంబులవారలు |

| పుట | పద్యసంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౩౪౫ | ౧౮౫౦ | జీకాకు పడదు | జీకాకు పడుదు |
| ౩౪౮ | ౧౮౬౫ | బరమశక్తిరూపమై | పరమశక్తిస్వరూపమై |
| ౩౫౬ | ౧౯౧౩ | గూర్పఁడీరు | గూర్పఁడీరు |
| ౩౫౮ | ౧౯౨౫ | మును సదివించున్ | మాను సదివింతురు |
| ౩౭౬ | ౨౦౨౭ | మీరు మీశిక్షకున్ గాక | వారు మీ శిక్షకున్ గాక |
| ౩౭౭ | ౨౦౩౫ | మానవకోటికి నేను | మానవకోటికిం నేను |
| ౩౮౬ | ౨౦౮౮ | మా భాంబు | మా భాషంబు |
| ౩౯౬ | ౨౧౪౨ | యా దురాత్మ్ముని | యా దురాత్ముండు |
| ౩౯౯ | ౨౧౬౦ | దగవుతట్టి | తగవు వట్టి, |
| ౪౦౧ | ౨౧౬౮ | సేనికొనుండని | సేసి కొనుండని |
| ౪౦౬ | ౨౧౯౭ | పరుమాలు | మలుమాలు |
| ౪౨౧ | ౨౨౮౮ | మున్నెవఁడు | మున్నెవ్వఁడు |
| ౪౩౦ | ౨౩౩౮ | ఈ యాకస్మికకపున్ | ఈ గూకస్మికపున్ |
| — | ౨౩౪౦ | యింతకలిగిన | యింత కలఁగిన |
| ౪౩౮ | ౨౩౭౦ | విషయగ్రంథితంబు | విషయగ్రథితంబు |
| ౪౪౨ | ౨౪౦౮ | దంతతుల | దంపతుల |
| ౪౫౮ | ౨౪౯౭ | గృహంబున | గృహమున |
| — | ౨౪౯౯ | క్షామవస్త్రంబు | క్షౌమవస్త్రంబు |
| ౪౬౨ | ౨౫౧౮ | బ్రాహ్మణులు | బ్రాహ్మణులు |
| ౪౬౪ | ౨౫౫౯ | యొసఁగున్ | యొసఁగు |
| ౪౭౬ | ౨౫౯౮ | మఱి దా యంద | మఱి దానియంద |
| ౪౭౯ | ౨౬౧౬ | యొక్కెడ విడిచి, | యొక్కెడ విడిసి |
| ౪౯౩ | ౨౬౯౯ | నింతినిజము | నింతనిజము |
| ౪౯౪ | ౨౭౦౪ | నను విషయుంబును | నను విషయమును |
| ౫౦౭ | ౨౭౭౫ | భావ్యలోల | భావ్యాలోల |